# ద్రావిడ భాషా పరిశీలనము

## మొదటి సంపుటము

గ్రంథకర్త

కళా ప్రపూర్ణ వజ్ఝల చిన సీతారామస్వామి శాస్త్రి

ఆంధ్ర విశ్వకళా పరిషత్

ప్రచురితము




డయోసీజను (చెన్నపురి వేపెరి) ముద్రణాలయ ముద్రితము

1955

 [వెల రూ. 16-0-0

AAA 3/1358/54 (500 copies)

# కృతిపతి చ్ఛాయా పటము



DR. V. S. KRISHNA, B.A. (Oxen), Ph.D. (Vienna)

—

# కృతికర్త చ్ఛాయా పటము



కళాప్రపూర్ణ ఝ్ఝల చిన సీతారామస్వామి శాస్త్రి

# ద్రావిడ భాషా పరిశీలన

## కృతి సమర్పణము

శ్లో॥ శ్రీ రస్తు తేజో జయసిద్ధి రస్తు ।
దీర్ఘాయు రారోగ్య సమృద్ధి రస్తు ।
దిగన్త విశ్రాన్త యశోఽస్త్వజస్రం ।
శ్రీ కృష్ణ విద్వత్ప్రభు శేఖరస్య ॥ ౧

రసాలగ వృత్తమ్ } ఆంధ్ర విశ్వకళా పరిషత్ప్రభు ।
ర్వాసిరెడ్డి కులాంబుధి శీతగుః ।
శాశ్వత శ్రియ మేతు మహీతలే ।
కృష్ణ విద్వ దధీశ్వర శేఖరః ॥ ౨

చ॥ వివిధకులోత్థ గీర్విభవభేదలస త్తమిళాంధ్ర కన్నడ ।
ద్రవిడకుటుంబ వాగమృతధానికి మంథనగంబు మత్కృతిన్ ।
దివిజపవైభవా, కృతిపతిత్వ సమాదృతిఁ గారవించి స ।
త్కవిబుధులెల్ల మెచ్చ ననుఁ గాంక్షితసిద్ధిఁ గృతార్థుఁ జేయవే ॥ 3

గీ॥ సర్వసన్మంగళంబులు సంతరించు ।
శాశ్వతంబగు సత్కీర్తి సంఘటించు ।
సప్తసంతానములను బ్రశస్తిఁ గాంచుఁ ।
గృతి, పతికి నంచు వేద సమ్మతిని జూపె ॥ ౪

శా॥ లేరే రాజమహేంద్రుఁ డాదిగ ధరిత్రీపుల్ మహాగ్రంథముల్ ।
వా రానన్నయముఖ్య సత్కవులచే వ్రాయించి పాలింపరే ।
మేరైనం దమిళాంధ్ర కేరళములం దెన్నంగఁ గర్ణాట మం
దీ రీతిం బరిశీలనం బడరు వ్యాకృత్యుక్తి మన్నించిరే ॥ ౫

శా॥ తారేశాభ యశోవిశాలుఁడగు రాధాకృష్ణ విద్వత్ప్రభుం
డారాద్ధాంధ్ర సరస్వతీ విభవుఁడై యాంగ్లాధ్యుఁడౌ రామలిం
గారెడ్డి ప్రభుఁడున్ మహామహిమ లీఁగా నశ్వవాలోపమం
బై రాజిల్ల నితం డతోధికత విద్యాసంస్థ నేలుం బలే. ౬

శా॥ ఆంధ్రవ్యాకృతి సంహితాహ్వాయ మతివ్యాసంబు శాస్త్రార్థ నీ
రంధ్రంబున్ వెలయించినం దెనుఁగు భారత్యాకృతిన్ శబ్దత
త్త్వాంధ్ర వ్యాకృతి లేమి నా కొఱఁత పాయన్ రాకయుండంగ నీ
యాంధ్రీ పుత్త్రుఁడు కృష్ణ ముఖ్యుఁ డది మాయం దీర్చె నేతత్కృతిన్. ౭

క॥ ద్వీపాంతరాధిగత వి। ద్యాపీఠ సదర్థశాస్త్రి తాగ్రసరునకున్,
శ్రీపూరితాంధ్ర విశ్వక। లాపరిష దుపాధినాథ లబ్ధయశునకున్. ౮

క॥ ధర నాంధ్రీ దేవి కపూ। ర్వ రత్న కనకమయ భూష ద్రావిడ భాషా
పరిశీలన కృతి; దీని। న్విరచింపఁగఁ బ్రోత్సహించు విద్యానిధికిన్. ౯

క॥ మేరు ధరాధర ధీరున। కారాద్ధ సరస్వతికిని నాంధ్రాభ్యుదయా
ధారునకుం బుధజనమం। దారునకుం గవిచకోర తారేశునకున్. ౧౦

క॥ పూరిత ఫలానుమేయ। ప్రారంభున కాత్మనుతిపరాఙ్ముఖ మతికిన్
దూరీకృత దురితునకున్। మారారి రమేశ భక్తి మాన్యాత్మునకున్. ౧౧

వ॥ అభ్యుదయ పరంపరాభివృద్ధిగా, నా రచించిన 'ద్రా
విడ భాషా పరిశీలన' మహాగ్రంథంబు సమర్పితంబయ్యె. ౧౨

విజయనగరము,
5-5-1955.

ఇట్లు విన్నవించు విధేయుఁడు,
వజ్ఝల చిన సీతారామస్వామి శాస్త్రి,
గ్రంథకర్త.

—

# శ్రీ విద్వాన్ వే. వేంకటరాజులురెడ్డి మహాశయుల యుపోద్ఘాతము

కళాప్రపూర్ణ వఝ్ఝల చిన సీతారామస్వామి శాస్త్రులవారి నెఱుంగని యాంధ్రభాషాభిజ్ఞులు లేరనుటకు సందియము లేదు.

శాస్త్రులవారు తాము రచించిన "ద్రావిడభాషా పరిశీలనము" అను గ్రంథమునకొక పీఠిక వ్రాయవలయునని నా కాన తిచ్చిరి. వారికి మొదట నే నేకలవ్యునివంటి శిష్యుఁడను. తన యాచార్యుని గ్రంథమునకుఁ దా నుపోద్ఘాతము వ్రాయవచ్చునను నఱవములోనున్న యొక సూత్రము చొప్పున నేను వారి కోరిక ప్రకార ముపోద్ఘాతమును వ్రాయఁగడఁగితిని.

మన దక్షిణదేశమునం దఱవలు కాక యితర ద్రావిడ శాఖలవారిలోఁ గొందఱు తమ భాష లార్య భాషాజన్యములని తలంచుట గలదు. ఈ యభిప్రాయము డా. కాల్డువెల్లుగారి గ్రంథము వలన మాఱినది. డా. కాల్డువెల్లుగారు విదేశీయులైనను మన దేశమున వసించి చిరకాలము పరిశ్రమించి "The Comparative Grammar of the Dravidian Languages" అను గొప్ప గ్రంథమును రచించి ద్రావిడభాష లార్యభాషా కుటుంబములోనివి కావని స్థిర పఱిచిరి. ద్రావిడ విద్యార్థులు వారి యెడల సదా కృతజ్ఞులై యుండవలయును.

డా. కాల్డువెల్లుగా రఱవ దేశములో నొక చిన్న గ్రామమున నివసించి యఱవభాష నభ్యసించిరి. అందలి 'నన్నూల్' టీకను మాత్రమె చదివిరి. 'వృత్తి' యను గొప్ప వ్యాఖ్యను జదివినవారు కారు. అది చదివియే యున్న యెడల వారు 'తొల్కాప్పియము' అను ప్రాచీన వ్యాకరణము నెఱిఁగియుందురు. అట్లైయైనచో వారు 'నాన్-యూన్' అను వానిలో 'నేది ప్రాచీనము' అనెడి విషయమున నంతగా విచారించి యుండరు. వారినాఁటి కఱవ సంఘ వాఙ్మయము ముద్రితము కాలేదు. వారు 'తొల్కాప్పియము—సంఘువాఙ్మయము' మున్నగు వాని నెఱిఁగియున్నచోఁ దమ గ్రంథము నెంతయుఁ బ్రామాణికముగ రచించియుందురు.

డా. కాల్డువెల్లుగారి తర్వాత ద్రావిడ భాషలను విపులముగా విమర్శించుట కెవ్వరు నుద్యమింపలేదు. మహామహోపాధ్యాయ R. నరసింహాచార్యులుగారును, శ్రీ రఘునాథరావు గారును గన్నడభాషలోఁ జిన్నయుపన్యాస గ్రంథములను రచించిరి "కీ॥ శే॥ L. V. రామ స్వామి యియ్యరుగారు" కొన్ని వ్యాసములను వ్రాసిరి. ఆంధ్రమందు శ్రీ కోరాడరామకృష్ణయ్య యమ్మేగారు పెక్కు సంవత్సరములుగా ననేకవ్యాసములను గొన్ని గ్రంథములను వ్రాసిరి. కీ॥ శే॥ డాక్టరు చిలుకూరి నారాయణరావుగా రాంధ్రభాషాచరిత్రము వ్రాసిరి. విద్వాన్ ప్రొఫెసరు, గంటి జోగిసోమయాజులుగా రాంధ్రభాషావికాసమనెడి యాంధ్రభాషా చరిత్ర విషయక గ్రంథమును రచించిరి. అఱవమున డా. P. S. సుబ్రహ్మణ్య శాస్త్రిగారు కొంచెముగా విమర్శించిరి. ఎవ్వరును గాల్డువెల్లుగారి గ్రంథమువంటి విశాల గ్రంథము వ్రాయలేదు.

డా. కాల్డువెల్లుగారి గ్రంథ మాంగ్లభాషలో నుండుటచేతఁ గేవల ద్రావిడభాషల పండితు లకు సుజ్ఞేయము కాకున్నది. అక్కారణమున నాంధ్రవిద్యార్థిజనోపయోగముగ నీ 'ద్రావిడ

భాషా పరిశీలనము' అను మహాగ్రంథమును శాస్త్రులవారు రచించిరి. వీరు డా. కాల్డువెల్లుగారి గ్రంథమును విమర్శించుట కత్యావశ్యకములగు నఱవ కర్ణాటక భాషల ప్రాచీన ప్రామాణిక వ్యాకరణముల నభ్యసించిరి. శాస్త్రులవారికిఁగల సంస్కృత ప్రాకృతాంధ్రభాషల పరిపూర్ణ జ్ఞానముతో నీ యఱవ కర్ణాటక లక్షణజ్ఞాన మేకీభవించుటచేత వీరీ విమర్శన గ్రంథమును రచించుట కధిక యోగ్యత గలవారైరి.

ఉచ్చారణమునఁ బదమధ్యమున నూరకే యనునాసికాగమము వచ్చుననుట, స్వతస్సిద్ధముగనే ప్రాచీన ద్రావిడ భాషలో సరళములుండెడి వనుట మున్నగు కాల్డువెల్లుగారి యాశయములు సరికావు. అఱవమునందలి 'అఙ్గు - ఇఙ్గు' అను శబ్దముల ప్రాచీన రూపములు 'అఙ్కు - ఈఙ్కు' అనునవి. తమిళమున 'అఙ్=(అక్కడ) ఈఙ్=(ఇక్కడ)' అను శబ్దములు గలవు. వానిపైని 'కు' ప్రత్యయము నిల్చుటచేత 'అఙ్కు-ఈఙ్కు' శబ్దము లేర్పడినవి. వానిలోని యనునాసికము శబ్దావయవ సిద్ధము. ఉచ్చారణార్థము చేరినది కాదు. తమిళ నామముల ధాతువులను దెలిసి కొనుటకై పెక్కు సంవత్సరములనుండియు నేను జేయుచున్న విమర్శమువలన శబ్దములందలి యను నాసికము లవయవసిద్ధములె యని విశదమగును. "పొఙ్గు-పఞ్జు-నణ్డు-మెన్దై-కామ్బు-ఎన్ణు" అను వానిలోని యనునాసికములు వరుసగా "ల్-న్-ళ్-ళ్-ల్-ల్" అనువాని వికృతిరూపములె యని గ్రహింపవలయును.

'వరువ' అనుచోటి తుది 'వ' కారమువలెనె 'వరున' అనుదానిలోని 'న' కారమును, 'ఓడియ' అనుదానిలోని యకారమువలె 'ఓడిన' అనుదానిలోని 'న' కారమును నాగమములె యనురీతిని వ్రాయు డా. కాల్డువెల్లుగారి యాశయములు సత్యవిదూరములు.

ఎల్లయెడలను శాస్త్రులవారి విమర్శనములు మిక్కిలి సమంజసములు.

శ్రీ శాస్త్రులవారి రీతినె తమిళాది భాషలందును బ్రాజ్ఞు లిట్టి గ్రంథములను రచించినచో నాయా భాషల విద్యార్థులకు మిక్కిలి యుపయోగకారులగును.

శాస్త్రులుగారు చిరంజీవులై తెల్గు తల్లి నిట్టి యమూల్యాభరణములతో నలంకరించుచుందురు గాక!

మద్రాసు,
20-8-55.

ఇట్లు సుజనవిధేయుఁడు,
వే. వేంకటరాజులు.

# విజ్ఞప్తి

ప్రాపంచిక వాఙ్మయాలంకృత భాషల స్వరూప స్వభావములను విశద పఱుచు విశాల వ్యాకరణము లుండవలయును. కాలక్రమమున విస్తరించిన వ్యావహారిక భాషలలో నుచ్చారణ త్వరాది కారణములచేత ననేక విధములగు వర్ణలోపాది వికారములు గల్గుచుండును. కావునఁ దత్సంబంధి ప్రాచీన గ్రాంథిక భాషా స్వరూప స్వభావములను దెలుపు శబ్దశాస్త్ర మత్యావశ్యకము. అట్లె కేవల ప్రాచీనతమ మూలభాషనుండి యేర్పడిన మాండలిక భాషలందుఁ గల్గిన వర్ణలోప వర్ణాగమాదులగు మార్పులను దెల్పు శబ్దతత్వశాస్త్రమును నత్యావశ్యకమె.

అతి విశాల సంస్కృత ప్రబంధములను నతిప్రౌఢ గీర్వాణవాణీ వైభవ రూప వ్యాకరణములను బూర్ణముగా సేవించిన నన్నయాథర్వణులు గంభీర వాగ్గుంఫిత కారికలతో నాంధ్ర వ్యాకరణమును రచించిరి. వారి గభీరాశయములను విశదీకరింపఁ జాలు విశాలాంధ్ర వ్యాఖ్యలు లేమింజేసి యాంధ్ర వ్యాకరణము లలంతులును బ్రమాద ప్రచురములు నయి యుండెను. అట్టి కొఱంతను దీర్పఁదలఁచి "I. చింతామణి విషయ పరిశోధనము. II. ఆంధ్ర వైయాకరణ పారిజాతము. III. ఆంధ్ర వ్యాకరణ సంహితా సర్వస్వము" అను విశాల వ్యాఖ్యారూపములగు నాభరణములను నాంధ్ర వాగ్దేవతకు సమర్పించి యుంటిని. కాని ద్రావిడ భాషా పరస్పర సంబంధ విశదీకరణ దక్ష శబ్ద తత్వశాస్త్రపు లేమి యాంధ్ర సరస్వతీ వైభవమున కొక కొఱంత యయ్యెను. తమిళాదీతర ద్రావిడ భాషలం దాంధ్ర లాక్షణికులకుఁ బ్రవేశము లేమింజేసి యట్టి సహోదరీ భాషలకును దత్త ద్వ్యాకరణములకును నాంధ్రభాషా వ్యాకరణములతోఁ గల పరస్పర సంబంధములను జూపు శబ్దతత్వశాస్త్ర రచనమునకు వారు గడంగరైరి. అట్టి ద్రావిడ శబ్దతత్వశాస్త్ర రచనకు డా. కాల్డువెల్లుగారే మార్గదర్శకు లనుటకు సందియము లేదు. కాని వారి ద్రావిడ వ్యాకరణ (Dravidian Comparative Grammar) మాంగ్ల భాషా మయమగుటచే ద్రావిడ భాషలం దాఱితేఱిన కేవల ప్రాచ్య పండితుల కయ్యది పరోక్ష మయ్యెను.

నేను విజయనగర మహారాజావారి సంస్కృత కళాశాలలో నాంధ్ర ప్రధానోపాధ్యాయుఁడనై యున్నకాలమున కళాప్రపూర్ణ డా. కిళాంబి రామానుజాచార్యులవారు, భాషాశాస్త్రవిషయక ప్రసంగములలో దీనివిషయమును బ్రస్తావించి దాని నభ్యసింప నన్నుఁ బ్రోత్సహించుచుండెడివారు. అపుడు నాకు డా. కాల్డువెల్లుగారి ద్రావిడ వ్యాకరణ విషయములను సవిమర్శముగఁ దెల్గున వెలయించు కుతూహల మంకురించెను.

నాఁటినుండియు నాంగ్లభాషాజ్ఞానముగల యాంధ్రభాషా విజ్ఞులు కొందఱితోఁ గలసి డా. కాల్డువెల్లుగారి ద్రావిడ వ్యాకరణ విషయములను దెల్గున సంగ్రహించుచు వచ్చితిని. నేను వాడుకొనిన డా. కాల్డువెల్లుగారి ద్రావిడ వ్యాకరణపు 'ఎడిషనులు' 'ఒకటవది మూఁడవది' యునై యున్నవి. మూఁడవది 1913 (క్రీ. శ.) సంవత్సరమున ముద్రితము. మొదటిది 1856?

నేను మద్రాసు విశ్వవిద్యాలయమువారి ప్రాచ్యభాషా పరిశోధక సభ్యమండలిలో నాంధ్రోపన్యాసకుఁడ నయియున్న కాలమున (క్రీ. శ. 1930 మొ॥ 1933 సం॥) నా కత్యంత మిత్రులును నట్టి విద్యాసంస్థలోఁ దమిళోపన్యాసకులును మలయాళాంధ్ర కర్ణాటక భాషా విశారదులును నగు విద్వాన్ వే. (వేంకటాచల) వేంకటరాజులు రెడ్డి మహాశయులయొద్దఁ దమిళ మలయాళ భాషా ప్రాచీన వ్యాకరణముల నభ్యసించితిని. అట్లె యచటి కర్ణాటక భాషోపన్యాసకులగు శ్రీమాన్ హెచ్=(హొన్నహళ్ళి=పొన్నపళ్ళి) శేషయ్యంగారు ఆచార్యులుగారివలన గీర్వాణవాణీమయ పళగన్నడ=(ప్రాచీన కర్ణాటక) భాషా వ్యాకరణ విషయములను దెలిసికొంటిని.

పైరీతిగ నేను "ద్రావిడ భాషా పరిశీలన" గ్రంథరచనమునకు వలసిన సామగ్రిని చిరకాల పరిశ్రమమున సంపాదించికొంటిని.

ద్రావిడ కుటుంబ భాషలలోఁ బ్రాచీన విశాల వాఙ్మయమును బ్రాచీన వ్యాకరణములును గలవి తమిళ కర్ణాటకాంధ్రములె. మలయాళము తమిళ భాషా పుత్త్రియె. హొసగన్నడము = (నవీన కన్నడము) పళగన్నడము (ప్రాచీన కర్ణాటకము) నుండి యేర్పడినదె. దీని కర్వాచీనముగా (క్రీ. శ. ౧౮ శతాబ్దమునుండి) వాఙ్మయ మేర్పడ సాగెను. తక్కిన ద్రావిడ భాషలలో 'తుళు-కూర్గు' భాషలు మాత్రమె నవీన వ్యాకరణములు (పాశ్చాత్య పండిత విరచితాంగ్ల భాషామయములు) నల్ప వాఙ్మయముగల యలంతిభాషలు. ఇవి కన్నడ శాఖలోనివె యని పెక్కుర యాశయము. కొఱవడిన ద్రావిడ భాషలు తమిళాంధ్ర కన్నడములలో దేనినేని సంబంధించిన యాటవిక భాషలు. (చూడు ౧౫ X విష). తమిళ కర్ణాటాంధ్ర మలయాళేతర భాషల విషయమున డా. కాల్డువెల్లుగారి వాక్యములె నాకును నాధారములు.

డా. కాల్డువెల్లుగారు ద్రావిడ కుటుంబ భాషలన్నిటియందును గొప్ప పరిశ్రమ గావించిరి. ద్రావిడ కుటుంబ భాషలన్నిటి స్వరూప స్వభావములను దెలిసికొనుటలో వీరుచేసిన యత్న మింతింత యని వచింప శక్యము కాదు. ఇండియన్ ఏంటిక్వైరి (Indian Antiquary) మున్నగు నాకాలపు పత్త్రికలలోఁ బ్రచురితములగు ద్రావిడ భాషా విషయక వ్యాసముల నెల్లఁ బరిశీలించి తమ

విజ్ఞాన సంపదను బెంపొందించుకొనిరి. వీరు ద్రావిడ భాషల కొనర్చిన సేవకు ద్రావిడ పండితులెల్ల వీరియెడలఁ గృతజ్ఞులు కావలయును.

కాని పాశ్చాత్య పండితులు వ్రాసిన గ్రంథములెల్ల నాంగ్లభాషామయ ములై యుండుటచేత ద్రావిడ ప్రాచ్యపండితుల కవి సాధారణముగా సుజ్ఞేయములుగాక గుణదోష విమర్శనమున కవకాశ మిచ్చునవి కావయ్యెను.

డా. కాల్డువెల్లుగారు వైదేశికులగుటచేతను వారి వ్యాకరణము ప్రథమ ప్రయత్న సిద్ధమగుటచేతను నయ్యది బహూపయోగయోగ్యమయ్యును నందు సహింపరాని దోషములు నపసిద్ధాంతములును గలవు. అట్టివానినెల్ల నీ గ్రంథ మున నాయా సందర్భములలో విపుల విమర్శన పూర్వకముగ విశదపఱిచి యున్నాను. మచ్చున కొకటి రెండు చూపెదను.

తెల్గునందలి స్త్రీవాచకములకును నమహద్రూపమె యనఁగా 'ము' వర్ణకాంత ప్రథమైక వచనమె యుండును. (చూడు ౩౫౯ పుట).

'అయమ్' అను సంస్కృత శబ్దమును 'ఆయన' అను తెలుఁగు శబ్దమును నభిన్నములె. (చూడు ౭౫౦ పుట). తెల్గున 'రమ్ము' అనునది బహువచనరూపము. 'వా' = (రమ్ము) అనియుఁ దెల్గునఁ గలదు. (చూడు ౩౮౮ పుట). ఊరకవి=(ఊరియొక్క కవి). (చూడు ౨౦౭ పుట).

డా. కాల్డువెల్లుగారి గ్రంథమం దంతటను సాధారణముగాఁ దమిటో దాహరణములె వెలయుచున్నవి. వారికిఁ దమిటమునందె యధికజ్ఞాన ముండుట చేత నట్లుదాహరించుట సంభవించెనని వారు వ్రాసిరి. వారు తమిటదేశమున ముప్పదైదేండ్లు నివసించి యుండుటచేతఁ దమిటమున వారు గొప్ప పరిశ్రమ చేయుట కవకాశము గల్గెననియు వ్రాసిరి. (చూడు ౯ పుట) కాని డా. కాల్డు వెల్లుగారు తమిట గ్రాంథిక భాషలో మిక్కిలి ప్రధానమును నత్యంత ప్రాచీన మును (క్రీస్తునకు ముందటిదో? వెనకటిదో?) దమిటమునకెల్ల నత్యంత ప్రామాణికమును నతివిశాలమును నగు తొలాకప్పియమును జూచి యున్నట్లగపడదు. పంద్రెండవ శతాబ్దపు నన్నూలును గొంత తడవిన ట్లగ పడును. వారి విమర్శనములెల్ల వ్యావహారికపు తమిటవాసనలతో నిండి యున్నవి.

ఇంకఁ బటగన్నడమును (ప్రాచీన కర్ణాటకము) వారు సాధారణముగా స్పృశింపరు. ఎచట నుదాహరించినను సాధారణముగా హొసగన్నడ (నవీన కర్ణాటక) శబ్దములె. డా. కాల్డువెల్లుగారి వ్రాఁతలనుబట్టి చూచునపుడు కర్ణాటక భాషయనఁగా హొసగన్నడమె యని తోఁచక మానదు.

అట్లే తెల్గునందును వారి వ్రాతలు నుదాహృతులును వ్యావహారికాంధ్రమునే తఱచుగా సంబంధించి యుండును. నన్నయాథర్వణ కారికలు మున్నగు నాంధ్ర ప్రాచీన లక్షణ గ్రంథములను వారు చూచినట్లె యగపడదు.

చరిత్ర కందనికాలమునాఁటి ద్రావిడభాషల పరస్పర సంబంధమును బరిశీలించు నీ శాస్త్రమున నేఁటి వ్యావహారిక భాషలనుబట్టి విమర్శించుట యర్థమా? ఈ విషయ మీ గ్రంథమునం దనేకస్థలములందుఁ బ్రదర్శించి యున్నాను. లభించినంతవఱకైనఁ బ్రాచీన ద్రావిడభాషల స్థితిగతులనుబట్టి విమర్శించుట కర్తవ్యము కాదా? క్షణక్షణమును మాఱుచుండెడి వ్యావహారిక భాషలస్థితి యట్టి ప్రాచీనతమ సంబంధములను దెల్పఁగల్గునా?

పయిని వివరించిన రీతిగల పాశ్చాత్య పండిత విరచితములగు నాంగ్ల భాషామయ ద్రావిడ భాషావిషయక గ్రంథములను జదివిన నేఁటి యాంగ్ల భాషా జ్ఞానముగల ద్రావిడదేశీయులగు ద్రావిడ భాషా విజ్ఞులకుఁ దమతమ మాతృభాషలలో సాధారణముగా వలసినంత పాండిత్యము లేమింజేసియు నితర ద్రావిడభాషల వ్యాకరణములందు బొత్తిగాఁ బరిచయము లేమింజేసియు డా. కాల్డువెల్లుగారు వ్రాసిన వ్రాఁతలె వారికిఁ బరమప్రమాణము లగుచున్నవి. అందలంతి సంఖ్యవా రాపాశ్చాత్య గ్రంథములందే కొంత పరిశ్రమము గావించి యాంధ్రభాషా చరిత్రమునే వ్రాయుచు, నితర ద్రావిడ భాషావిషయములను గొంత తడవుచు వచ్చిరి. కొందఱు ద్రావిడ భాషావిషయక ప్రసంగములను సంక్షిప్తముగా నాంగ్లమునను నాంధ్రమునను వ్రాయఁగడంగిరి.

కాని వీరెల్లరును సాధారణముగా డా. కాల్డువెల్లుగారి యపసిద్ధాంతములనే యనుసరించుచుఁ గొన్నియెడల వారి గ్రంథ విషయములనె యెక్కిఁంచుచు వచ్చిరి. డా. కాల్డువెల్లుగా రపరిశీలితముగాఁ జేసిన యపసిద్ధాంతములు— I. ధాతుజ విశేషణములె సంబంధార్థమును దెల్పును గాన (రాముఁడు వాలిని జంపిన కోల) ద్రావిడ భాషలందు యత్తచ్ఛబ్దాన్వయమే (రాముఁ డే కోలతో వాలిని జంపెనో యది) లేదు (చూడు ౧౧౮ IV విష. ౭౪౩ పుట). II. కర్త్రార్థక క్రియాప్రయోగమె ద్రావిడ భాషలయందు సమ్మతముకాదు (౧౨౭ I విష. ౭౯౦ పుట). III. పరుషములను వ్రాసి సరళములుగాఁ బల్కుట తమిళ భాషాస్వభావము. అట్టి సరళము ద్విత్వము గల్గునపుడు పరుషమె యగుట సంప్రదాయము. (౧౧౭ XXII-XXIII-విష.) ఉదా:—'అడఙ్కు' వ్రాఁత. 'అడఙ్గు' పల్కుబడి. సకర్మకత్వమున 'అడక్కు'. ఇట్టియపసిద్ధాంతములనె వీరెల్లరును బ్రతిధ్వనించుచుందురు. ఏదో యగతికస్థలములందు గతియగు సామ్యసిద్ధాంతము (Analogy) ను వీ రతిప్రచురముగ నుపయోగించుకొనఁ జొచ్చిరి. ఒకరు

'వెలయాలు' శబ్దములోని యకార మావయవికమనియు 'మేనయత్త' మున్నగు చోటులందలి యకారము సామ్యసిద్ధాంత (Analogy) మూలమున వచ్చినదనియు వ్రాయఁగా (చూడు ౨౯ III విప. ౨౩౨, ౨౩౩ పుటలు) వేఱొకరు ద్రావిడ భాషలను బ్రాకృతములె యనఁగా సంస్కృత మూలకములెయని సిద్ధాంతము చేయఁగడఁగి "భిన్ద్+కృ=పీఁకు. కృత్+కృ=గీఁకు. సాధు+కృ=సాఁకు" మున్నగు రీతిని వింతవింతలగు సంస్కృత సంబంధములను జూపసాగిరి. 'తొలు కాప్పియనారు' అనరాదనియు "తొల్కాప్పియనారు" అనవలెననియుఁ గొందఱు గ్రహించిన ట్లగపడదు. తమిళభాషలో 'సున్న' లేనేలేదనిమైన వీరిలో ననేకు లెఱింగినట్లు కన్పట్టదు.

ద్రావిడభాషా పండితులకు సంస్కృత వాఙ్మయ తద్వ్యాకరణముల జ్ఞాన మెంతటి యావశ్యకమో తమిళ కర్ణాటకాంధ్రాది భాషలయు వ్యాకరణ ములయు జ్ఞానమును నంతగను నతోఽధికముగను నావశ్యకము. మూలద్రావిడ భాషనుండి యేర్పడిన యీ మాండలికభాషల పరస్పర సంబంధమును దదీయ వ్యాకరణాదుల సంబంధములును దెలిసికొనుట ద్రావిడభాషల పండితులకుఁ బ్రధాన కర్తవ్యము. సంస్కృత సమేతరాంధ్రశబ్ద ప్రపంచమనెడి విశాలభాగ మితర ద్రావిడభాషల శబ్దములతో నత్యధిక సంబంధము గల్గియుండును. (చూడు ౧౨ II, III, IV విప.) (చూడు ౩౯ మొ. ౪౨ పుట). కొన్ని శబ్దము లభిన్నములె నై యుండును. అట్టి జ్ఞానము గలవారి కాయా శబ్దముల వ్యుత్పత్తుల నరయుట యనేక స్థలములందు మిక్కిలి సుకరమైయుండును. కావున నాంధ్ర పండితులకెల్ల ద్రావిడ శబ్దతత్త్వశాస్త్రజ్ఞాన మత్యావశ్యకము. అక్కారణమున నాంధ్ర లోకోపకారార్థముగఁ జిరకాలాంధ్రవాగ్దేవతాసేవా సిద్ధమగు "ద్రావిడ భాషా పరిశీలనము" అను శబ్దతత్త్వశాస్త్ర గ్రంథము నాంధ్ర విశ్వకళాపరిషత్తు వారి ప్రోత్సాహమున వెలయించి కృతార్థుఁడ నయినందుల కెంతయు సంత సించుచున్నాను.

చెన్నపురీ విశ్వవిద్యాలయ ప్రాచ్య భాషాపరిశోధక సభ్యులయియుండి విశ్రాంతిఁ గొన్నట్టియు నాకుఁ దమిళ మలయాళ వ్యాకరణముల నుపదేశించి నట్టియు నేతద్ గ్రంథపు గాలీ ప్రూఫులను జిత్తగించి సద్భావముల నొసంగి నట్టియు దీనికొక యుపోద్ఘాతమును వ్రాసి పంపినట్టియు శ్రీ విద్వాన్ వే. వేంకట రాజులు రెడ్డిగారియెడలను నాకుఁ గర్ణాట వ్యాకరణముల నుపదేశించిన శ్రీ H. శేషయ్యంగారు పండితాగ్రసరులయెడలను నేనెంతయుఁ గృతజ్ఞుఁడ నగు చున్నాను.

ఈ మహా గ్రంథముయొక్కయు వెనుక ముద్రితములయిన 'ఆంధ్ర వ్యాకరణ సంహితా సర్వస్వా'దులయొక్కయు "ప్రూఫు"లను సవరించుటలో సాయపడిన నా కొమార్తె చి. 'కాంకరపర్తి వేంకటసీతమ్మ' నాంధ్ర వాగ్దేవత ప్రసాదించుం గాక.

కోడుగంటివారి వీథి,
విజయనగరము,
5-5-1955.

ఇట్లు విన్నవించు సుజనవిధేయుఁడు,
వజ్ఝల చిన సీతారామస్వామి శాస్త్రి.

# అకారాది క్రమమున నుదాహృత గ్రంథ సంకేతముల పట్టిక

| సంకేతములు. | గ్రంథముల పేరులు. | భాష. |
|---|---|---|
| అధర్వ. | అధర్వణ కారికావళి=(వికృతి వివేకము) తెల్గు వ్యాకరణము. | సంస్కృత |
| అప్పక. | అప్పకవీయము. తెల్గు లక్షణ గ్రంథము. | తెలుఁగు |
| అహో. | అహోబలపండితీయము (కవి శిరోభూషణము. ఆంధ్ర వ్యాకరణము) | సంస్కృత |
| ఆం. భా. అ. | ఆంధ్ర భాషానుశాసనము. (తె. వ్యా.) | తెల్గు |
| ఆం. చిం. | ఆంధ్ర శబ్ద చింతామణి. (తె. వ్యా.) | సంస్కృత |
| ఆం. భా. చ. | ఆంధ్ర భాషా చరిత్రము. | తెల్గు |
| ఆం. భా. వి. | ఆంధ్ర భాషా వికాసము. | తెల్గు |
| ఋగ్వే. ప్రా. | ఋగ్వేద ప్రాతిశాఖ్యము. | సంస్కృత |
| కన్న | కన్నడ భాష=కర్ణాట భాష. | |
| కర్ణా. భూ. | కర్ణాట భాషా భూషణము. (కర్ణాట వ్యాకరణము) | సంస్కృత |
| కర్ణా. శబ్దా. | కర్ణాటక శబ్దాను శాసనము. (కర్ణాట వ్యాకరణము) | సంస్కృత |
| కవికల్ప. | కవికల్ప ద్రుమము-సంస్కృత ధాతు పాఠము. | సంస్కృత |
| కవిశిరో. | కవిశిరో భూషణము. (అహోబలపండితీయము) (తె. వ్యా.) | సంస్కృత |
| కాల్డు. | డా. కాల్డువెల్లుగారి కంపారిటీవు ద్రావిడ వ్యాకరణము. | ఇంగ్లీషు |
| కావ్యాద. | కావ్యాదర్శము. ఆచార్య దండి యలంకార శాస్త్రము. | సంస్కృత |
| కావ్యాలం. | కావ్యాలంకార చూడామణి-తెల్గు లక్షణ గ్రంథము. | తెల్గు |
| కేర. పీఠి. | కేరళ పాణినీయ పీఠిక-మలయాళ వ్యాకరణము. | సంస్కృత |
| చండ. | చండ ప్రాకృత లక్షణము. | సంస్కృత |
| చిం. వి. ప. | చింతామణి విషయ పరిశోధనము | తెల్గు |
| తమిఞ. | తమిఞ భాష. | |
| తెల్గు. | తెల్గు భాష. | |
| తొల్కా. | తొల్కాప్పియము. తమిఞ వ్యాకరణము. | తమిఞ |
| తైత్తి. ప్రా. | తైత్తిరీయ ప్రాతి శాఖ్యము (వేద. వ్యా.) | సంస్కృత |
| త్రివిక్ర. | త్రివిక్రమ శబ్దాను శాసనము-ప్రాకృత వ్యాకరణము. | సంస్కృత |
| త్రిలింగ. | త్రిలింగ లక్షణ శేషము- (ప్రౌఢ వ్యాకరణము. (తె. వ్యా). | తెల్గు |
| దుర్గా. | దుర్గాదాస కృతసుబోధాఖ్య ముగ్ధబోధ వ్యాఖ్య. (సంస్కృ. వ్యా.) | సంస్కృత |
| నన్నూ. | నన్నూలు. తమిఞ వ్యాకరణము. | తమిఞ |
| పాణి. శి. | పాణిని శిక్ష. వేద వ్యాకరణము. | సంస్కృత |
| ప్రా. ప్ర. | ప్రాకృత ప్రకాశము, (ప్రాకృ. వ్యా.) | సంస్కృత |
| ప్రౌఢ. | ప్రౌఢ వ్యాకరణము (త్రిలింగ లక్షణ శేషము) | తెల్గు |
| బాల వ్యా. | బాల వ్యాకరణము. (తె. వ్యా.) | తెల్గు |
| బాల మ. | బాల మనోరమాఖ్య సిద్ధాంత కౌముదీ వ్యాఖ్య. (సంస్కృ. వ్యా.) | సంస్కృత |
| భాషా మం. | భాషా మంజరీ వృత్తి (కర్ణా. వ్యా.) | సంస్కృత |

# అకారాది క్రమమున నుదాహృత గ్రంథ సంకేతముల పట్టిక

| సంకేతములు. | గ్రంథముల పేరులు. | భాష. |
|---|---|---|
| మంజ. మక. | మంజరీ మకరంద వ్యాఖ్య. కర్ణాటక శబ్దాను శాసన వ్యాఖ్య. (కర్ణా. వ్యా.) | సంస్కృత |
| ముగ్ధ. | ముగ్ధ బోధ వ్యాకరణము (సంస్కృ. వ్యా.) | సంస్కృత |
| లీలా. | లీలా తిలకము. మలయాళ వ్యాకరణము. | సంస్కృత |
| వికృ. | వికృతి వివేకము. (అథర్వణకారికావళి) | సంస్కృత |
| వేణీ. | వేణీ సంహారము. (సంస్కృ. నాటక). | సంస్కృత |
| వే. పంచ. | వేదాంత పంచదశి (అద్వైత) | సంస్కృత |
| వై. పా. | ఆంధ్ర వైయాకరణ పారిజాతము—తెల్గు వ్యాకరణము. | తెల్గు |
| వ్యా. సం. | ఆంధ్ర వ్యాకరణ సంహితా సర్వస్వము. తెల్గు వ్యాకరణము. | తెల్గు |
| శబ్దమ. | శబ్దమణి దర్పణము (కర్ణా. వ్యా.) | కర్ణా |
| శ. ర. | శబ్దరత్నాకర కోశము. (తెల్గు. ని.) | తెల్గు |
| శబ్దస్తో. | శబ్దస్తోమ మహానిధి. (సంస్కృ. ని.) | సంస్కృత |
| శబ్దాద. | శబ్దాదర్శము. హళగన్నడ వ్యాకరణము. | హళగన్నడ |
| శబ్దా. చిం. | శబ్దార్థ చింతామణి. (సంస్కృ. నిఘం.) | సంస్కృత |
| శాసనప. | శాసన పద్యమంజరి. (ఆంధ్ర ప్రాచీన శాసనములు) | తెల్గు |
| షడ్భా. | షడ్భాషా చంద్రిక (ప్రా. వ్యా.) | సంస్కృత |
| సంధి గ్రం. | సంధి గ్రంథము. (భాషా శాస్త్రము) | తెల్గు |
| సి. కౌ. | సిద్ధాంత కౌముది. (సంస్కృ. వ్యా.) | సంస్కృత |
| సూ. రా. ని. | శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు. | తెల్గు |
| స్టడీ. ద్రవి. | స్టడీస్-ఇన్-ద్రవిడియన్ ఫిలాలజీ. | ఇంగ్లీషు |
| హిం. స్వ. | హిందీస్వబోధిని (హిందీ వ్యా.) | తెల్గు |

# విషయసూచిక

## ద్రావిడభాషా పరిశీలన

### (మొదటి సంపుటము)

### పీఠికా విషయసూచిక

## I ద్రావిడ ధ్వనిప్రకరణము

విషయ సంఖ్య. పుట.

## II ధాతువుల విషయసూచిక

## III నామప్రకరణము

## విశేషణములు

**మొదటి సంపుటము విషయసూచిక సమాప్తము.**

గురుదేవతాస్తుతి

శ్లో. సుధియౌ పరిపూతమానసౌ ।
కలయేఽహం జగతః ప్రియఙ్కరౌ ।
పితరౌ మమ వేఙ్కటామ్బికా ।
ముఖలిఙ్గేశ్వర జమ్పతీ హృది ॥ ౧

(పార్వతీపరమేశ్వర పరముగను మాతాపితృ పరముగను సర్థద్వయ మెన్నఁదగును).

శ్లో. పితామహభ్రాతృ సుతం స్వవిద్యా ।
గురుం చ చిన్తామణి సత్సమాఖ్యమ్ ।
శ్రీవత్స గోత్రోద్ధరణ ప్రశస్తిం
నమామి నారాయణ సత్కవీన్ద్రమ్ ॥ ౨

(విష్ణుపరముగను నారాయణపండిత గురుపరముగను నర్థద్వయము నెన్నఁదగును. భ్రాతృజాయామ్మను కాళిదాసు ప్రయోగము చొప్పున భ్రాతృసుత శబ్దము సప్రమాణ మగుచున్నది).

# ముఖ్యమగు తప్పొప్పుల పట్టిక

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 2 | 9 | రెండు వాక్యాంత చిహ్నములు. | తీసివేయునది |
| 18 | 18 | శబ్ద | శతాబ్ది |
| 24 | 17 | సిద్ధాంత | సిద్ధాంతి |
| 32 | 28 | తమిలు | తమిళ |
| 40 | 19 | ఎదుకట్టై | ఎనట్టి |
| 41 | 24 | అత్తనై | అన్ననైత్తు |
| 42 | 1 | వివః— | వివః—ద్రావిడ భాషలను |
| 57 | 20 | తపఃకరోతి | కరోతి తాపసః |
| ,, | 21 | మారాగిలు | రాగోనిత్యేలు |
| ,, | 24 | మారాగిలుం | రాగోనిత్యేలుమ్ |
| ,, | 25 | తపః | తాపసః |
| ,, | 27 | చేయుండు | చేయుండు.(ఏడు గ్రహముల కక్ష్యలలో సూర్యునిది మధ్య కక్ష్య.) |
| 64 | 11 | తత్పుత్త్రులాంధ్ర | తత్పుత్త్రులంధ్ర |
| 65 | 12 | ధయాంధ్రజాతి | యంధ్రజాతి |
| ,, | 15 | నగును | నగును. ఆర్యులంధ్రులు. ద్రావిడులాంధ్రులు. ఆంధ్రశబ్దమే సంస్కృతకోశములలో లేదు. |
| 66 | 14 | గోండువాన | గోండువానా |
| 74 | 31 | సందర్బ | సందర్భ |
| 74 | 32 | ౪౭ | ౩౭ |
| 76 | 5 | ‘న’ | ‘న’ |
| 77 | (1) 5–21 | ఆయిదము | ఆయ్దము |
| 78 | 1 | ఆయిదము | ఆయ్దము |
| 128 | 22 | ఎ | ’ |
| 238 | (1) | మలయాళమును | మలయాళము |

శ్రీరస్తు

# ద్రావిడభాషా పరిశీలనము

## పీఠిక

### శబ్దశాస్త్రము

౧. విష:—ఏ భాషయైనను మొదట వ్యావహారికభాషయై యుండఁగాఁ గాలక్రమమున దానినుండి గ్రాంథికభాష యవతరించును. వ్యావహారికభాష వ్యవహార ప్రవాహావశమున సదా మాఱుచుండును. అట్టి మార్పు మూలము ననే ప్రపంచమున ననంతములగుభాష లేర్పడుచున్నవి. ఆయా భాషలను వ్యవహరించు జనులు నాగరకులగునపుడు వారికి గ్రంథరచనా కుతూహలము గల్గుటచేత నట్టివారి వ్యావహారికభాషనుండి గ్రాంథికభాష యావిర్భవించును. అట్టి నాగరకజనులలో భాషాంతరవిద్వత్త గల రసికులు తమకు వైదుష్యము నొసంగిన పరిమార్జితవిశాలభాష ననుసరించుచుఁ దద్వాసనలతోఁ దమ వ్యావహారిక భాషను సంస్కరించుకొనుచు గ్రంథరచనము నారంభింతురు. కాలక్రమమున మహాకావ్యములును నవతరించును.

శ్లో॥ "స్వస్థానవేషభాషా । భిమతా స్సన్తో రసప్రలుబ్ధధియః ।
లోకే బహుమన్యన్తే । వైకృతకావ్యాని చాన్య దపహాయ ॥"

(ఆం. చిం). (చూడు. వ్యా. సం. 1. II విష).

అట్టి మహాకవులు వ్యావహారికభాషను సంస్కరించి కావ్యములందు వాడిన భాషయొక్క స్వరూప స్వభావములను దెల్పునదియె శబ్దశాస్త్రము. అయ్యది మహాకవి ప్రయోగైకప్రమాణ మగుటచేత నద్దానివిధులు ప్రభుసమ్మితములవలె నాజ్ఞాపించుచున్నట్లు భాసిల్లును. (అనుబంధము I, II).

అనుబంధము. I ౧ విష:—పయివిషయమును దెలిసికొనక కొందఱు శబ్ద చరిత్ర శాస్త్రజ్ఞులీ క్రింది రీతిని వ్రాయుట శబ్దశాస్త్ర స్వభావానభిజ్ఞతామూలక మనఁదగును. "చెవికి సంబంధించిన శబ్దశాస్త్రముకంటె కంటికి సంబంధించిన శబ్దశాస్త్రము ప్రాముఖ్యమును బొందుచున్నది. .........వ్యాకరణమనిన శబ్దముల ప్రకృతి ప్రత్యయముల విభజనమును చెప్పు శాస్త్రము కాదు. ........శబ్దములను వల్లెవేయుట సూత్రములను రుక్కువేయుట వానిప్రకారము వ్రాయను మాట్లాడను నేర్చికొనుట—ఇవే వ్యాకరణముయొక్క యుపయోగములు......... ఇందుమూలమున వ్యాకరణ మాజ్ఞాపించు శాస్త్రమైనది." (ఆం. భా. చ. పీఠిక VII పుట)

అనుబంధము. II ౧ విష:—పయిని వ్రాసిన రీతిని వ్యావహారిక భాషను సంస్కరించుటచేత నేర్పడు గ్రాంథిక భాషయె పరిమార్జిత భాషయనియు సంస్కృతమనియు నట్టిది యెన్నఁడును

౨. విష:—అట్టి పూర్వపూర్వ మహాకవుల కావ్యభాష ననుసరించుచు నుత్తరోత్తర మహాకవులు కావ్యరచనమును గావించుచుందురు. ఉత్తరోత్తర మహాకవులు పూర్వపూర్వకావ్యభాషను యుపయోగించుచుఁ దమతమ కాలములలోని వ్యావహారిక భాషలోని నూతన శబ్దములను వాక్యరచనా విశేషములను దమ కలవాటయియున్న గ్రాంథిక భాషా పద్ధతుల ననుసరించి సంస్కరించికొనుచు గ్రాంథికభాషలోఁ జొనుపుచుందురు. ఈ రీతిని గ్రాంథికభాషయు మందముగాఁ బెరుఁగుచుండును. అట్టి పెరకువ ప్రత్యేకతను ఘటింపనేరదు. కావునను గ్రాంథికభాష నిత్యమనియు నేకవిధస్థితి గలదనియు ("అనన్యాదృశశ్చ నిత్యశ్చ". (అం. చిం.) (వ్యా. సం. ౧ III విష). వైయాకరణులు వచింతురు. పయిరీతిని గ్రాంథికభాష స్థిరపడినదగుటంజేసి దానికి మూలమగు వ్యావహారిక భాషయు ఝరీవేగమున మార్పునందక కొంత మందముగనే మార్పుల నందుచుండును. కావున బహుజనవ్యాప్తమగుచు విస్తరిల్లిన వాఙ్మయముగల భాషలకు మూలమగు వ్యావహారిక భాషలందు మార్పు లలంతిగ జరుగుచుండుటయు నట్టి వాఙ్మయావస్థనందని యనాగరకభాషలు ఝరీవేగమున మార్పుల నందుచుండుటయు ననుభవసిద్ధమై యున్నది.

3. విష:—పయిరీతిని వ్యావహారిక భాషలందలి యాయా శబ్దములను కారకాదులను మహాకవు లెట్లు ప్రయోగించిరో యా విషయములను దెల్పుట

---

వ్యావహారికభాషయై యుండనేరదనియు డా. కాల్డువెల్లుగారు వ్రాసిరి. "సంస్కృతమన్ననో యెన్నఁడును వ్యావహారిక భాషకాదు. గ్రంథరచనకై సంస్కరించికొన్నదే సంస్కృత భాష. అట్టి పరిమార్జిత భాష యెన్నఁడును వ్యావహారికమై యుండలేదు". (కాల్డు. పీఠిక ౭౯ పుట) "గ్రాంథిక భాష యెన్నఁడును సదేస్థితిగ వ్యావహారిక భాషయై యుండనేరదు" (కాల్డు. పీఠిక ౮౦ పుట).

ప్రకృతి జన వ్యవహార సిద్ధ భాష ప్రాకృతమనఁబడును గాన వ్యావహారిక భాషలెల్ల ప్రాకృతములు నపరిమార్జితములు ననఁదగును. వానిని గావ్యములలో నుపయోగించుటలో మహాకవులు సంస్కరించికొని వాడిడి భాషలు గ్రాంథికములు. కావున నట్టి గ్రాంథిక భాషలెల్ల సంస్కృతములె. పరిమార్జిత భాషలె. ఒక్క గీర్వాణము విషయమునకే యనఁగేల? భాషా శాస్త్ర పరిశోధకులు ఋగ్వేదార్య భాష సైతమొకప్పు, డపరిమార్జితమగు ప్రాకృత భాషగనుండెననియు నట్టి ప్రాకృతభాష ప్రాథమిక ప్రాకృతమనియు నద్దానిని సంస్కరించుటచే నేర్పడినదే సంస్కృతభాష యనియు నట్టి ప్రాథమికప్రాకృత పరిణామములగు ద్వితీయాకా (రెండవ) వస్థలోని ప్రాకృతములను సంస్కరింపఁగా నేర్పడినవి మహారాష్ట్రీ ప్రభృతిప్రాకృత వ్యాకరణసాధ్య ప్రాకృత భాషలనియుఁ బాళీభాషయు నీద్వితీయాకావస్థలోనిదే యనియు నట్టి రెండవ యవస్థలోని ప్రాకృతములు వ్యవహార వశమునఁ బరిణామ మందుటచేతనే నేఁటి యుత్తర హిందూస్థాన భాష లేర్పడెననియు నట్టి మరాటీ ప్రభృతులు తార్తీయీక (మూఁడవ) ప్రాకృతావస్థలోనివనియుఁ జెప్పుదురు.

మాత్రమె గ్రాంథికభాషా వ్యాకరణముల (శబ్దశాస్త్రపు) విధియైయుండును. కావున నట్టి భాషయందుఁ బాండిత్యము సంపాదించికొనుట కట్టి వ్యాకరణములను "వల్లె" వేసికొనుట యత్యావశ్యకమయి యున్నది. దానిని "ఆం. భా. చ." కర్తగారు ధిక్కరించుట పొరపాటు. (ఆం. భా. చ. పీఠిక VII పుట).

ఇంక భాషలలోని యాయా శబ్దములయు వాక్యరచనా పద్ధతులయు స్థితి యెట్లు సంభవించెనో? ఎట్టి పరిణామములనందెనో? తద్విషయమున నే యే భాషలకు సాజాత్యము గలదో? యాయా భాషల ప్రాచీనస్థితిగతు లెట్టివో? మున్నగు విషయములను బరిశీలించు స్వభావముగలది శబ్దచరిత్రశాస్త్రము = భాషాచరిత్రశాస్త్రము. ఇట్టి విషయములను దెలుపుటకు శబ్దశాస్త్రము = గ్రాంథికభాషా వ్యాకరణశాస్త్రము యత్నింపదు. అట్లె భాషలోని యెట్టియెట్టి శబ్దములును నేయే రీతిగల వాక్యరచనాదులును రసికులగు మహాకవులచే నాదరింపఁబడి సాధుత్వరూపమగు నుత్కృష్టపదవి నధిరోహించెనో యను విషయమును దెలుపుటగాని సాధుభాషా వాఙ్మయ జిజ్ఞాసువులకు నిస్సందిగ్ధమగు జ్ఞానమును సులభముగా నొసంగుటగాని ("రక్షోహాగమ లఘ్వసందేహాః ప్రయోజనమ్" మహాభాష్యము) శబ్దచరిత్రశాస్త్రము గావింపనేరదు. ఇంక భాషాపండితులకు భాషాచరిత్రమును బ్రదర్శించుటయును వినోదమును జూపుట మాత్రమే భాషాచరిత్రశాస్త్రమునకుఁ బరమప్రయోజనము. ఇంకొక విశేషము! వేలకొలఁది సంవత్సరముల క్రిందటిచరిత్రమును బ్రదర్శించుటకుఁ దగిన యాధారములు లేక యిది పెక్కువిషయములందు సంశయాత్మకమగుచు నిద మిత్థమని నిరూపింప నసమర్థమును నై యుండును.

౪. విష:—భాషాచరిత్ర శాస్త్రవిచారము చేయువానికిఁ బెక్కు ప్రాపంచిక భాషల జ్ఞానమావశ్యకము. ప్రస్తుతమగు ద్రావిడభాషా పరిశీలనము చేయువానికి ద్రావిడభాషలందేకాక వానిని సంబంధించిన సంస్కృత ప్రాకృతాదులందును దత్తచ్చరిత్రశాస్త్రములందును బ్రాకృతాప భ్రంశములగు పాళీ—హిందీ—మరాటీ ప్రభృతులందును బయివాని విషయములెల్ల నాంగ్లభాషలో వ్రాయఁబడియుండుటచేత నాంగ్లభాషయందును విశాలజ్ఞానము కావలసి యుండును. ఇట్టి జ్ఞానసంపద మనుష్యమాత్రునకు సుసంభవము కాదు. అట్లయినను శక్తివంచనలేకుండ నాంధ్రపండితులు యత్నించి యాంధ్రభాషోత్తేజకముగా భాషాచరిత్రశాస్త్రమును దెల్గున వ్రాయుటకు యత్నించుచుండవలసినదే.

డా. కాల్డువెల్లు దొరగారు ద్రావిడభాషా పరిశీలనమును "Comparative Grammar of the Dravidian languages" అను పేర రచించి క్రీ. శ.

౧౮౫౬ సంవత్సరమునఁ బ్రచురించిరి. డా. పోపుదొరగారు తమిళభాషా విషయమునందును, డా. గుండర్టు దొరగారు మలయాళభాషా విషయము నందును డా. రైసుదొరగారును డా. కిట్టెలు దొరగారును గన్నాటభాషా విష యమునందును డా. బ్రౌనుదొరగా రాంధ్రభాషా విషయమునందును నిట్లు పెక్కురు దొరలు పెక్కువిషయములం దాంగ్లభాషలో భాషాచరిత్ర గ్రంథము లను వ్యాకరణాదులను వ్రాసియున్నారు. తత్తద్భాషలలో వ్యాకరణాది విస్తృతవాఙ్మయముగల తమిళ మలయాళ కన్నడాంధ్రములు తప్పఁ దక్కిన ద్రావిడభాషల విషయమున నీ దొరగార్లు వ్రాసిన వ్రాఁతలే యాధారము లయి యున్నవి.

పయిని వివరించిన దొరలు వ్రాసిన గ్రంథములు నేటికిని తెలుఁగునకుఁ బరివర్తింపఁబడలేదు. ఇవి యాంగ్లభాషలో నుండుటచేత నాంగ్లపండితులకు వీని తెలుఁగుసేఁత యనావశ్యకము. నేఁడు భాషాచరిత్ర శాస్త్రపండితులనఁ బడుచున్న యాంగ్లభాషాభిజ్ఞులగు నాంధ్రమహాశయు లొక యిద్ద ఱాంధ్రభాషా చరిత్ర గ్రంథములను వ్రాసిరి. కీ. శే. డా. చిలుకూరి నారాయణరావు యమ్మిగా రాంధ్ర భాషాచరిత్రమును, ప్రొఫెసరు. విద్వాన్. గంటి జోగి సోమయాజులు యమ్మిగా రాంధ్రభాషా వికాసమును నాంధ్రభాషతో వ్రాసిరి. శ్రీ కోరాడ రామకృష్ణయ్య పంతులు యమ్మిగారు 'సంధి' యను తెల్గు సంధుల గ్రంథ మును దెల్గున వ్రాసిరి. 'స్టడీస్ ఇన్ ద్రవిడియన్ ఫిలాలజీ' అను ద్రావిడభాషా ప్రసంగములను గ్రంథమును దిక్ప్రదర్శనమువంటిదాని నాంగ్లభాషలో శ్రీ కోరాడ రామకృష్ణయ్య పంతులుగారు వ్రాసిరి. ద్రావిడభాషలనెడి రొండు చిన్ని పొత్తమును ప్రొఫెసరు సోమయాజులుగారు చిరకాలము క్రిందట నాంధ్ర భాషలో వ్రాసిరి. ఇంతియకాని నేఁటివఱకును "డా. కాల్డువెల్లుగారి ద్రావిడ భాషా వ్యాకరణము నాకలించు నాంధ్రభాషామయవిమర్శన గ్రంథముగాని ప్రత్యేక ద్రావిడభాషా పరిశీలనవిషయక విశాల గ్రంథముగాని తెల్గున వ్రాయఁబడలేదు.

నేను జిరకాలము క్రిందటి నుండియు డా. కాల్డువెల్లుగారి ద్రావిడ వ్యాకరణమును శ్రీ కోరాడ రామకృష్ణయ్య పంతులు యమ్మిగారి ద్రావిడ ప్రసంగములను గ్రంథము మున్నగువానిని గొంద ఱాంగ్లభాషాభిజ్ఞుల (అనుబంధ) సాహాయ్యమున నాంధ్రీకరించికొని యున్నాను. నేను మద్రాసు

అనుబంధము ౪ విష:—(౧) శ్రీమాన్ శ్రీమత్పరవస్తు వెంకటరామానుజస్వామి ఆచార్యులు యమ్మిగారు కాల్డువెల్లు ద్రావిడ ధ్వనులు, ధాతువులు మొదలగు భాగములు.

(౨) శ్రీ కోరాడ రామకృష్ణయ్యపంతులు యమ్మిగారు పిమ్మటియలంతిభాగము.

యూనివర్సిటీ ప్రాచ్యవిద్యా పరిశోధక కక్ష్యలో నాంధ్రోపన్యాసక సభ్యుఁడుగాఁ గొంతకాలము పనిచేసితిని. ఆ కాలమున నాతోపాటుగఁ దమిళ భాషాశాఖా సభ్యులుగానున్నట్టియుఁ దమిళాంధ్ర కర్ణాట మలయాళభాషా పండితులైనట్టియు విద్వాన్. శ్రీ. వే. వేంకటరాజులు రెడ్డిగారియొద్దఁ దమిళ వ్యాకరణములు—తొల్‌కాప్పియము—నన్నూలు—మలయాళ వ్యాకరణమగు లీలాతిలకము—మున్నగువాని నభ్యసించుటయేకాక వానికిఁ దెల్గు టీకయు వ్రాసికొంటిని. శ్రీ రెడ్డిగారితోఁ గలసి 'కాల్డువెల్లు' గారి ద్రావిడ వ్యాకరణాంధ్ర పరివర్తనములోని చాల భాగములను విమర్శించునట్టి విమర్శములను దెల్గున వ్రాసికొంటిని. నాకుఁ దమిళభాషోపదేశకులగు శ్రీ రెడ్డిగారు నేఁటికిని నా వ్రాసిన సందేహములను దీర్చుచునే యున్నారు. ఆకాలమందే మాతోపాటుగఁ గర్ణాటభాషా శాఖాసభ్యులయి యున్న శ్రీమాన్ H. శేషయ్యంగారు నాకుఁ గర్ణాట వ్యాకరణోపదేశకులయిరి. సంస్కృత భాషామయములయియున్న కర్ణాటభాషా భూషణము—కర్ణాట శబ్దానుశాసనము, దీని భాషామంజరీ వృత్తి, మంజరీ మకరందవ్యాఖ్య మున్నగు కర్ణాట భాషా వ్యాకరణముల పరిశ్రమము వీరియొద్దఁ గావించితిని. పై యిర్వురతోఁ గలసి నే నా కాలమునఁ దమిళాంధ్ర కర్ణాట భాషా శబ్దసామ్యవిషయక కోశము రచింప నారంభించితినిగాని యందజాదిశబ్దములు మాత్రమె వ్రాయుట సంభవించెను.

పయిసామగ్రితో నాంధ్రపండితోపయోగార్థముగను ద్రావిడభాషా పరిశీలన లాలసోపయోగార్థముగను నే నీ గ్రంథమును వ్రాయఁ గడంగితిని. నే నిందలి 'ద్రావిడ ధ్వనులు-పీఠిక' అను భాగములను బూర్తిచేసిన పిమ్మట నాంధ్ర విశ్వకళా పరిషత్తువారు నా ప్రార్థనమును మన్నించి నాకు ధనసాహాయ్యముగ "ఆనరేరియమ్" (Honorarium) నెలకు నూఱురూప్యముల నొసంగుచున్నారు. ఆ విషయమున వారియెడల నే నెంతయుఁ గృతజ్ఞుఁడ నగుచున్నాను.

౫. విష:—పయిని వివరించిన నాకుఁగల సామగ్రి ద్రావిడభాషా పరిశీలన విషయమున పర్యాప్తమని నేను దలంపలేదు—ఈ విషయమున సంపూర్ణ

(౩) ప్రొఫెసర్-విద్వాన్ గంటి జోగి సోమయాజులుపంతులు యమ్మెగారు నామముల భాగము - సర్వ నామములలోని చాల భాగము.

(౪) కీ. శే. శ్రీ. ఓరుగంటి వేంకటేశ్వర్లు 'యమ్. ఓ. యల్' గారు కొంతవడిన కాల్డువెల్లు ద్రావిడ వ్యాకరణపు విశాలభాగము తెల్గింప సాయపడిరి.

శ్రీ కోరాడ రామకృష్ణయ్యపంతులు యమ్మెగారి "Studies in Dravidian Philology" అను ద్రావిడ భాషా విషయక గ్రంథము నాంధ్రీకరించుటలో శ్రీ విజయనగర మహారాజావారి సంస్కృత కళాశాలా ప్రిన్సిపలువారగు శ్రీమత్తిరుమల నరసింహాచార్యులు యమ్మెగారు సాహాయ్యమొనరించిరి. పయిని వ్రాసిన యెల్లరయెడలను నే నెంతయుఁ గృతజ్ఞుఁడ నగుచున్నాను.

సామగ్రి గల్గుట దుర్లభమని నేను బైని వ్రాసియే యున్నాను. ద్రావిడభాషా వ్యాకరణమును వ్రాసిన డా. కాల్డువెల్లు దొరగారు సయితం మీా విషయమున నీ క్రిందిరీతిని వ్రాసిరి.

"ఇతర భాషల విషయమున నాకుఁ దెలిసినంతవఱకు విమర్శించితిని. నేను దమిళమున ౩౫ సంవత్సరములకుఁ బైఁగాఁ బరిశ్రమము చేయుచున్నాను. కాన దానినిగూర్చి నే నధికముగా వ్రాయుచుందును." (కాల్డు. పీఠిక ౨ పుట) (తమిళమునఁ బరమ ప్రమాణమగు తొల్కాప్పియమున వీరు పరిశ్రమము చేసి నట్లగపడదు. ఆంధ్ర కన్నడములందుఁ బ్రామాణికములగు వ్యాకరణముల యందును వీరు పరిశ్రమము చేసినట్లగపడదు. వీరు తమిళ కన్నడ వ్యావహారిక భాషలను దఱచుగా నాధారము చేసికొని యుదాహరించుచుందురు. పయి విషయము లాయా సందర్భములలో విశదపడుచుండును.)

"నా కుత్తర హిందూస్థాన భాషలంతగాఁ దెలియవు" (కాల్డు. పీఠిక ౫౩ పుట).

"ప్రిచర్డుదొరగారు ద్రావిడ భాషలకును సిథియను భాషలకును గల సంబంధములను జూపిరి. కాని వీనికిఁగల సంబంధమును బూర్ణముగఁ జూపలేక పోయిరి. నే నీ విషయమునఁ జాల పరిశ్రమము చేసితిని. కాని నాదియుఁ బూర్ణముకాదు. సిథియను భాషలతత్త్వమును బూర్తిగాఁ దెలిసినంగాని ద్రావిడ భాషలకు వానితోఁగల సంబంధమును బూర్తిగ విశదీకరింప శక్యముకాదు. నాకును సిథియను భాషల విషయమున నితరుల ద్వారమునఁ దెలిసిన పరోక్ష జ్ఞానమే కాని పూర్ణజ్ఞానము లేదు."
(కాల్డు. పీఠిక ౬౨-౬౩ పుటలు).

ఇట్లగుట చేతనే సిథియను భాషావిషయకములగు బెహిస్తను ఫలకముల విషయము తమకు నోరిస్ దొరగారు చెప్పినట్లు డా. కాల్డువెల్లుగారు వ్రాసిరి. "ఆఫ్ఘనిస్థాన ప్రాంతమందలి పశ్చిమపు మెదియాలోని 'బెహిస్తను' అనుచోట 'Darius Hystaspes' అనెడివాని చరిత్రము రూపమున నున్న శాసనములు 'ప్రాచీనపు పర్షియను—బాబిలోనియను, సిథియను' అను భాషలతో వేర్వేఱ నున్నవి. అందలి సిథియను భాషల యనువాదమువలన సిథియను ద్రావిడ భాషల సంబంధమునుగూర్చి క్రొత్తవిషయములు బయల్పడుచున్నవి. ఆ బెహిస్తను ఫలకములలోని రెండవ కత్యఫలకములలో స్పష్టముగా సిథియను భాషలు కనఁబడుచున్నవి" అని నోరిస్ దొరగారు చెప్పిరి. ఇది సిథియను భాషలోని తురేనియను భాషయని "ఓపర్టు"గారనిరి. బెహిస్తను ఫలకములు క్రీ. పూ. ౫ శతాబ్దము నాఁటివి" (కాల్డు. పీఠిక ౬౫ పుట).

౬. విష:—కీర్తిశేషులగు డా. చిలుకూరి నారాయణరావుగారు డా. కాల్డువెల్లుగారి, సిథియను సిద్ధాంతమునుగూర్చి, డా. (సర్-జార్జి) గ్రియర్‌సన్‌గారు చేసిన విమర్శము నుదాహరించి సిథియను జాతియు సిథియను భాషాకుటుంబ మును లేవనుచు నీ క్రింది రీతిని వ్రాసిరి.

"ఈ విషయమై గ్రియర్‌సన్ పండితుఁ డిట్లు వ్రాయుచున్నాఁడు. సిథియను పదమంత సమంజసముగ లేదు. గ్రీకు గ్రంథకర్తల గ్రంథములలోఁ గనఁబడు సిథియను పదములు స్పష్టముగ ఐరేనియను (పరిషియను) భాషల లోనివి. అనఁగా నవి ఇండో యూరపియను కుటుంబమునకుఁ జెందినవి. అయినను నా పద మాసియా యూరోపు ఖండములలోని 'ఇండో యూరపి యను' సెమిటికు-కుటుంబములకుఁ జెందని భాషల కన్నిటికిని సామాన్యమగు పదముగను నుపయోగింపఁబడినది......ఆ భాషలయందుఁ గాన్పించు సామాన్య లక్షణములకంటె వీనియందుఁగల మహత్తరములగు మూల లక్షణము లందలి భేదములె యెక్కువగా నున్నవి. ద్రావిడ భాషల నిండియాదేశమునకు వెలుపలనున్న భాషా కుటుంబములతోఁ గలుపుటకుఁ జేసిన ప్రయత్నములు విఫలములయ్యెనని సాధారణముగఁ దలంపఁ బడుచున్నవి......" (ఆం. భా. చ. ౫౫ పుట).

"ఇటీవల జరిగిన పరిశోధనల ఫలితముల మూలమున గ్రియర్‌సన్ పండితుఁడు కాల్డువెల్ చేసిన సిథియను సిద్ధాంతము నెట్లు నిరాకరించెనో యింతకుముందు (౫౫ పుటలో) తెలుపఁబడి యున్నది. సిథియను జాతిగాని సిథియను భాషాకుటుంబము గాని లేనప్పుడు సిథియను సిద్ధాంతము నిలుచుట కవకాశము లేదు కదా" ('ఆం. భా. చ.' ౬౨ పుట).

డా. నారాయణరావుగారు సిథియనులే లేరని వచింతురే కాని కాల్డు వెల్లుగారి వాదమును నిరసించు నిదర్శనములు చూపఁజాలరు. పయిని వ్రాసిన గ్రియర్‌సన్‌గారి వ్రాఁతలచేఁ గాల్డువెల్లుగారి సిథియను సిద్ధాంతమెట్లు నిరాక రింపఁబడెనో తెలియకున్నది. బెహిస్తను ఫలకములె లేవని కాని యా ఫలకములు సిథియను భాషతో—ఓపర్టు దొరగారు చెప్పినట్లు 'తురేనియను' అనెడి సిథియను భాషతో—వ్రాయఁబడలేదని కాని గ్రియర్‌సనుగారు వ్రాసినట్లు చూపఁబడలేదు. ఆ ఫలకములందలి భాషల సామ్యము—కాల్డువెల్లుగారిచేఁ జూపఁబడినది—డా. గ్రియర్‌సనుగారు విమర్శించినట్లయిన వ్రాయఁబడలేదు. 'సిథియను' అను పేరికై వివాదమేల? కాల్డువెల్లుగారు సిథియను భాషలనుచున్న తురేనియను మన్నగు భాషలతో ద్రావిడభాషల కధిక సంబంధములేదని

వీరు చూపలేదు గదా! (చూడు. ౮ విష. కాల్డు. పీఠిక ౬౧-౬౨-౬౫ పుటలు) (చూడు. ౮ II విష. జెపిస్తను ఫలకములు).

౭. I విష:—భాషాకుటుంబ విభాగ విషయమున ద్రావిడభాషలకుఁ బ్రత్యేక తగలదా? యను విషయమును బరిశీలించునపుడు "ఈ ద్రావిడ భాషలకు మూలభాష యేది? ఈ భాషలను మాటలాడు వారెచ్చటివారు? వారి చరిత్ర మెట్టిది?" అను విషయములు ముందుగఁ బరిశీలింపవలసి యుండును. అందులకు బలమైన యాధారములు లేమింజేసి పలువురు పలువిధములుగ నూహించుట సంభవించుచున్నది.

ఆర్యులు హిందూదేశమునకుఁ గ్రీస్తుశకమునకు ముందెంత కాలము క్రిందట వచ్చిరో యెవ్వరికిని సరిగఁ దెలియదు. క్రీ. పూ. (౨౫౧౧) ఇరువది యైదువందల సంవత్సరములకు ముందె వచ్చియుందురని 'ఆం. భా. పి' కాన మున వ్రాయఁబడెను. (చూ. ౬౦ పుట). "క్రీస్తునకుఁ బూర్వము (౧౬౦౦) పదునాఱువందల యేండ్ల కిటీవల వచ్చినవారు కారు" అని డా. కాల్డువెల్లుగారు వ్రాసిరి. (చూ. 'కాల్డు'. పీఠిక ౧౦౬ పుట) ఇంతయేల! క్రీస్తునకుఁ బూర్వము ౫ లేక ౬ శతాబ్దములకు ముందటి (బౌద్ధమత ప్రచారము. చంద్రగుప్తుఁడు) హిందూదేశచరిత్రము గాఢాంధకారమగ్నమై యున్నది. కావునని యది యజ్ఞాత యుగమని పేర్కొనఁబడుచున్నది. అట్లగుటంజేసి యప్పటి చరిత్ర మెవ్వరికిఁ దోఁచినరీతిని వారూహించుచున్నారు.

వేదము లనాదులనియు నపౌరుషేయములనియు నట్టి వేదము నర్థమును వివరించునవే స్మృతి పురాణేతిహాసములనియుఁ బ్రాచీనుల సిద్ధాంతము. కలి యుగ ప్రమాణము ౪౩౨౦౦౦ సంవత్సరములనియు దానికి రెండు రెట్లు ద్వాపర యుగ ప్రమాణమనియు మూఁడు రెట్లు త్రేతాయుగ ప్రమాణమనియు నాలుగు రెట్లు కృతయుగ ప్రమాణమనియు సూర్యసిద్ధాంతాదులు సైతము వచించుచున్నవి. త్రేతాయుగములోని శ్రీరాముని చరిత్రము రామాయణము వచించుచున్నది. అట్టి రామాయణ మా శ్రీరాముని కాలమందే వాల్మీకిచే రచింపఁబడెనని ప్రాచీనులు తలంతురు. అట్లే ద్వాపరము తుదినున్న పాండవుల చరిత్రము నా కాలమందేయున్న వ్యాసునిచే రచింపఁబడిన భారతము వచించు చున్నదని ప్రాచ్యుల తలంపు. వ్యాసుఁడే యష్టాదశ పురాణములను రచించె ననియుఁ బ్రాచీనుల సిద్ధాంతము. కాని యట్టి పురాణేతిహాసాదులలో నాంధ్ర ద్రావిడ కర్ణాటాది దేశముల పేరులున్నవనియు క్రీ. పూ. ౨౩౮ సంవత్సరల క్రిందటి శాతకర్ణిరాజుల పేరులందు వెలయుచున్నవనియుఁ జెప్పుచు నేఁటి విమర్శకు లట్టి ప్రాచీనుల యాశయములు సరికావని నిశ్చయించుచున్నారు.

కొందఱట్టి పురాణేతిహాసాదులలోఁ బ్రక్షిప్తము లున్నవనియు నాయా కాలము లందలి రాజులు తమతమ ఘనతకై తమతమ వంశముల నందుఁ బ్రక్షిప్తము చేయించిరనియుఁ జెప్పుదురు. అట్లని యిపుడట్టి పురాణేతిహాసాదులలో నేవి ప్రక్షిప్తములో నిర్ణయించుట కాధారములు లేవుగదా!

"వేదమంత్రములన్నియు నొక్కటే ప్రదేశమున రచింపఁ బడినవి కావు. ఆఫ్ఘనిస్థానమునుండి యమునానదీ తీరమువఱకును గల ప్రదేశములం దవి రచింపఁబడుచు వచ్చినవని పరిశోధకుల యభిప్రాయము." ("ఆం. భా. చ." ౪౮ పుట). ఇంక నుపనిషత్తులు బ్రాహ్మణములు నారణ్యకములు గృహ్యసూత్రములు ధర్మసూత్రములు మనుధర్మశాస్త్రాదులు వ్యాకరణశాస్త్రాదులు పురాణేతిహాసాదులు మున్నగు ప్రాచీన సంస్కృత గ్రంథములెల్ల వేదరచనమునకుఁ దర్వాత రచింపఁబడినవే యనవలయునుగదా. ఇవెల్ల క్రీ. పూ. ౨౫౦౦ సంవత్సరముల లోపలివేయని కదా "ఆం. భా. వి." గ్రంథమునుబట్టి తలంపవలయును (ఆం. భా. వి. ౬౦ పుట. చూడుడు).

౭. II విష:—క్రీస్తు మతప్రచారమునకయి యూరపియనులు హిందూదేశమునకు వచ్చినపిదప నట్టి దొరలు సంస్కృత ప్రాకృతాదులను నేఁటి హిందూ దేశభాషలను నభ్యసించి విమర్శింపసాగిరి. వారికిని దగిన యాధారములు లేకున్నను నేవేవో విషయము లెవరికిఁదోఁచినవి వారు వ్రాయసాగిరి.

ద్రావిడభాషా విషయకములగు కాల్డువెల్లుగారి యాశయములు:—"ఐతిహాసిక యుగమునకుఁ బూర్వపు టజ్ఞాతయుగమునుండియు ద్రావిడులు హిందూదేశములోనున్నను నంతకుముందటి యేదోకాలమున ద్రావిడులు మధ్యాసియాలో (సెంట్రల్ ఏషియా)నుండి యుండవలెనని చెప్పకతీరదు. ఎల్లజాతుల వారును నచటినుండి వ్యాపించినవారే కదా! ద్రావిడులు మధ్యాసియాలోని యార్యులతోడను, 'ఉగ్రో' తురేనియనులతోడను (సిథియనులతోడను) వీడి వచ్చుచు దారిలో బెలూచిస్థానమున నొకచో నుపనివేశనము నేర్పఱుచుకొనిరి. (కోలనీ) అచటఁ గొందఱు నిలువఁగా గొంద ఱిండియాకు వచ్చిరి. మొదట నందఱును మధ్యాసియాలో నుండిరి." (కాల్డు. పీఠిక ౬౭ పుట).

"ద్రావిడభాషలకును సిథియన్ భాషలకును గల సంబంధము మూఁడు విధములు. I. ఏదో యొక సిథియను భాష ద్రావిడభాషలకు మూలమగుట. II. కొన్ని సిథియను భాషలకు ద్రావిడభాషలు సోదరభాషలగుట. III. అంతకంటె విశాలమైన సాదర్శ్య మనఁగా ద్రావిడభాషలకును సిథియను భాషలకును మూల మొక్క భాషయే యగుట" (కాల్డు. పీఠిక ౬౯ పుట).

“ద్రావిడభాషలకును నిండో యూరపియను భాషలకును......... ...................కేవల ప్రాచీనశబ్దముల సామ్యమునే నేను బరిశీలించితిని. అట్టి సామ్య మీ రెండిటికినిగల యేదో యొక విదూరసంబంధమును దెలుపును. ఇట్టి సంబంధములు సంస్కృతముతోనే కాక గ్రీకు లాటిను మున్నగు నిండో యూరపియనుభాష లన్నిటితోను గనఁబడుచున్నవి. కొన్ని యెడల సంస్కృత మున లేని సామ్యములు సైతము గ్రీకు ప్రభృతులతో నగపడుచున్నవి...... .........కేవల ప్రాచీనతమములగు మొట్టమొదటి యపరిమార్జిత రూపము లందలి సామ్యములను బట్టియే నా యీ యభిప్రాయములను సిద్ధాంతీకరించు చున్నాను.” (కాల్డు. పీఠిక ౨౩ పుట).


I. ప్రాపంచిక భాషా కుటుంబ విభాగము (కాల్డువెల్లుగారి పద్ధతిది)
ఆదిభాష
ఇండో యూరపి యను కుటుంబము (ఇండియా యిరోపా)
సిథియను భాషలు (ఆసియా)
సెమెటికు భాషలు (ఈజిప్టు, అరేబియా, సిరియా)
కాకస్ భాషలు (ఆటవిక) (బూల్డియను మింగ్రేనియన్)
చీనా భాషలు
ముండా భాషలు మధ్యపరగణాలు (కోలవ—సవర)
ఆస్ట్రేలియా భాషలు
జపాను భాషలు
ప్రాచ్య భాషలు
పాశ్చాత్య భాషలు (II పటము చూడు)
మూల ద్రావిడభాష (III పటము చూడు)
ఇతర సిథియను భాషలు (III పటము చూడు)
అవెస్థ జెండు ప్రాచీన పెరిషియా
పెరిషియన్ భాష ఇరేనియన్ భాషలు
ప్రథమ ప్రాకృతము
ద్వితీయ ప్రాకృతము (II పటము చూడు)
తృతీయ ప్రాకృతము (II పటము చూడు)
వైదిక సంస్కృతము
లౌకిక సంస్కృతము

II. ఒకటవ పటమందలి ప్రాచ్య భాషలలోని ద్వితీయ తృతీయ ప్రాకృతములు—
పాశ్చాత్యములగు నిండో యూరపియను భాషలును.



# III. పటము—మూల ద్రావిడ భాషలయు నితర సిథియను భాషలయుఁ గుటుంబములు.

మూల ద్రావిడభాష

- తమిళు
- మలయాళ
- కర్ణాట భాష
- తెల్గు భాష
- తుళు
- కూర్గు
- తుద
- కోత భాష
- గోండు భాష
- కు భాష
- మాలెరు భాష
- ఒరాఒన్ భాష

(మాలెరు, ఒరాఒన్:) రాజమహాల్ కొండల లోనివి

ఇతర సిథియను భాషలు

- హంగేరియను భాష
- ఉగ్రియను భాషలు ఓస్తియాకు మొ.
- ఫిన్నిషు భాషలు
- తుర్కిషు భాషలు
- టార్టారిక భాషలు
- మంగోలియా
- మంచు (మంచూరియా)
- తుంగేరియా
- తురేనియను భాషలు

(ఇంకను గలవు—౧౧౧ II విషయము చొప్పున చీనా భాషలును గొన్ని సిథియను కుటుంబములోనివె.)

పయి నుదాహరించిన కాల్డువెల్లుగారి వ్రాఁతలనుబట్టి యాదికాలపు భాషనుండి చీలిన (చూడుఁ. ౧౧౧—I విష. జాఫెటికు భాషలు. చూడు. ౧౦౯—III విష. తుదిభాగము) కొన్ని భాషల కిండో యూరపియను భాషలనెడి (ఇండో జర్మానికు భాషలనియు వాడుదురు) సంజ్ఞ గల్గెననియు నట్లు చీలినవి పోఁగా మిగిలిన యా యాదిమ భాషకె సిథియనుభాషయని పేరనియు నద్దానినుండియే మూలద్రావిడభాష చీలినదనియుఁ దక్కినవి సిథియను భాషలనఁబడుననియుఁ గాల్డువెల్లుగారు తలంచినట్లు విశదమగుచున్నది. (సిథియను భాష లనాగరకభాషలని కాల్డువెల్లుగా రొకచో (చూ. ౧౦౩ I విష.) (చూడు. ౧౮౧ V విష.) (౧౮౨ విష.) ననిరి.

కాలక్రమమున నిండో యూరపియను భాషలు "ప్రాచ్యములు—పాశ్చాత్యములు" అని భేదిల్లినవి. ఆ పిదపటికాలమె యైతిహాసిక యుగము. అట్టి ప్రాచ్యములగు నిండో యూరపియను భాషలె "జందు = (అవెస్థ)—వైదికసంస్కృతము — లౌకిక సంస్కృతము" మున్నగు భేదముల నందినది. ఇంకఁ బాశ్చాత్యములగు నిండోయూరపియను భాషలె "లాటిను — గ్రీకు" మున్నగు భేదముల నందినవి.

"ఉత్తర హిందూస్థానమున కార్యులు రాకముందే యాదిమ నివాసులందుండెడివారు. వీరి నార్యులు 'దస్యులు—నిషాదులు—మ్లేచ్ఛులు—' అని వ్యవహరించెడివారు. వీరే సిథియను జాతులవారని పెక్కురు పెద్ద లంగీకరింతురు. వీరార్యేతరులనుట నిర్వివాదాంశము" (కాల్డు. పీఠిక ౫౩ పుట).

"ఆర్యులు రాక ముందు హిందూదేశములో నుండిన యాదిమ నివాసులకు లేక దస్యులకు ద్రావిడు లభిన్నులా? కారా? అను విషయములను నిర్ణయింప శక్యము కాకున్నది. ఆర్యులను మొదటిసారి యెదిరించి లొంగిపోయిన దస్యులు ద్రావిడులా? లేక వేఱు జాతివారా? అను విషయములును నిర్ణయింప శక్యముకాకున్నది." (కాల్డు. పీఠిక ౧౦౭ పుట).

కాల్డువెల్లు గారి నిశ్చయము:—"మొదట నిండియాలోనికి ఖైబరు కనుమల ద్వారమున ద్రావిడులు వచ్చియుండఁగా ఆసాం ప్రాంతమునుండి దస్యులు వచ్చి (సిథియనులు చూడు. కాల్డు. ౫౩ పుట) యుత్తర హిందూస్థానమునుండి ద్రావిడులను దఱిమిరి. అట్లు జితులగు ద్రావిడులు దారిలోనున్న ప్రాచీన తమ సిథియనులను (వేఱొక కొందఱను) దఱుమఁగా వారు భిల్లాదు లయిరి. ద్రావిడులు దక్షిణదేశము నాక్రమించి నాగరకులయిరి. ఇంక నుత్తరమున విజేతలగు దస్యులు (కొందఱు సిథియనులు చూడు. కాల్డు. ౫౩ పుట) తర్వాత వచ్చిన యార్యులచేత విజితులయి శూద్రరూపమున నార్యులలోఁ గలిసిపోయిరి. పిదప నార్యులును గొందఱు దక్షిణమునకువచ్చి ద్రావిడులతోఁ జేరి నివసింప

సాగిరి. ఉభయులును గాలక్రమమున మిశ్రితులయిరి.'' (కాల్డు. పీఠిక ౧౦౮ పుట).

౭. III విష:—డా. కాల్డు వెల్లుగారు ద్రావిడ భాషలును నిండోయూరపియను భాషలలోని యార్య భాషలును బృథక్కుటుంబములలోనివని చెప్పఁదలంచియున్న వారగుటంజేసి మధ్యాసియా (సెంట్రల్ ఏషియా)లోనె యిండోయూరపియను భాషలును సిథియను భాషలును వానిలోని ద్రావిడభాషలును వేర్వేఱుగాఁ జీలియుండెననియు నట్లు చీలిన వేర్వేఱు భాషలవారు వేర్వేఱుగా యూరపు—పెరిషియా—హిందూదేశము మున్నగు ప్రదేశములకు 'వలస' వచ్చిరనియుఁ బయిని వ్రాసినరీతి నూహించిరి. డా. చిలుకూరి నారాయణరావుగారు ద్రావిడ భాషలును, నిండో యూరపియను భాషల కుటుంబములోనివేయనియు నేఁటి యుత్తర హిందూస్థాన భాషలవలెనె ప్రాకృతాపభ్రంశములె (పైశాచీప్రాకృతాపభ్రంశములె) యనియుఁజెప్పఁ దలంచిన వారగుటచేత ద్రావిడులును నిండో యూరపియనులలోని యైరేని యనులును (పెరిషియాకు నిండియాకును వచ్చిన యార్యులు) నొక్క తెగవారే యనియు మధ్యాసియాలోనున్నపుడు వారి భాషలు చీలిపోలేదనియు వారెల్ల నొక్క భాషనే యచట మాటలాడువారై యుండిరనియుఁ దర్వాత వారు గుంపులు గుంపులుగా వీడివచ్చి పెరిషియా యిండియా మున్నగు చోటులకుఁ జెదరి రనియు నీ క్రింది రీతి నూహించిన వారయిరి.

''పైశాచీభాషలను గూర్చి యెక్కువగా డాక్టరు గ్రియర్సన్‌గారు పరిశోధనములు గావించిరి. వారి యభిప్రాయములు "The Pisaca Languages of North-Western India'' అను గ్రంథమున (ఇండియా కీశాన్యపు మూలనున్న పిశాచ భాషలు) వివరింపఁబడియున్నవి. వాని సారాంశము మాత్ర మీక్రింద నీయఁబడినది.'' (ఆం. భా. చ. ౭౬ పుట).

''రషియా దేశమునకు దక్షిణమున నున్న మైదానములలో నిండోయూరపియను భాషలను మాటలాడువారి పూర్వీకు లార్యులనుండి విడఁబడిన ప్రదేశము 'ఖివ' యను వచ్చిక బయలని పరిశోధకులు విశ్వసించుచున్నారు. ఇచ్చట ''ఐరేనియ''నులకును (పెరిషియావారు) ''ఇండో ఆర్యులకును'' (ఇండియాకువచ్చిన యార్యులు) బూర్వికులగు జాతివా రార్య భాషయను నొక భాషను జరిత్రకాలమునకుఁ బూర్వము మాటలాడుచుండిరి. వా రక్కడ నుండి బయలు వెడలి.........ఖోఖందు, బదక్షను పీఠభూములను జేరిరి. అచ్చటినుండి వారిలోఁ గొందఱు తక్కిన వారినుండి విడఁబడి దక్షిణ మార్గమునుబట్టి హిందూకుష్ పర్వతముల పడుమటి కనుమల మీఁదుగాఁ గాబూలు

నదీప్రదేశమును జొచ్చిరి. అచ్చటనుండి వారు ఇండియాదేశపు మైదానముల లోనికి వ్యాపించిరి. వీరే నేఁటి ఇండో ఆర్యుల పూర్వికులు,......హిందూ కుష్ పర్వతముల కుత్తరమున నిల్చిపోయి కాబూలు నదీప్రాంతములకు 'గలస' పోవని యార్యులు తూర్పునకును పడుమటికిని వ్యాపించిరి.......నేఁడు వారి సంతతివారు ఘల్చహ్ భాషలతో సంబంధించిన ఐరేనియను భాషలను మాటలాడుచున్నారు. వీరు (ఆర్యులు) విడిపోవుచు ఇండియా వంకకు బయలుదేరునప్పు డార్యులందఱు నొకటేభాషను మాట్లాడుచుండిరి.........దర్దికు లేక పిశాచ భాషలకుఁ జాలప్రత్యేక లక్షణము లున్నవి. ......... తొల్లిటి ఆర్యభాషనుండి ఇండో ఆర్యభాషలు తొలుత విడఁబడినవి. మఱికొంతకాలమునకు దర్దికు (పిశాచ) భాషలు ప్రత్యేకమైనవి. తొల్లిటి యార్య భాషయే తిన్నగఁ బరిణామము నొందుచు నైరేనియన్ భాషయైనది.........ఇండో ఆర్యులు హిందూకుష్ పర్వతములను పడుమటి కనుమలద్వారా దాఁటిరి. కాబూలు నదీమార్గమున వా రిండియాలోనికిఁ బ్రవేశించునప్పుడు......దర్దిక్ స్థానము వారి కెడమప్రక్క నుండి పోయెను......కావున దర్దిక్ జాతులవారి పూర్వికులు 'దోర' మొదలగు కనుమలద్వారా నేఁటి తమ వాసస్థానముఁ జేరినట్లూహింపవలసియున్నది." (ఆం. భా. చ. ౭౫-౭౭ పుటలు).

డా. గ్రియర్సన్‌గారి వ్రాఁతలలో దర్దికు భాషలు లేక పిశాచ జనుల భాష లిండియాకుఁ బశ్చిమోత్తరభాగములలో నున్నట్లు మాత్రమె తోఁచును గాని యా భాషలె ద్రావిడ భాషలని గ్రియర్సన్‌గారు వచించినట్లెంత మాత్రము లేదు. ఇంక మఱికొన్ని దుర్బలములగు నాధారములను జూపుచు డా. నారాయణరావుగారు పైశాచీప్రాకృతములనుండియే ద్రావిడ భాష లేర్పడెనను నొక సిద్ధాంతము నవలంబించిరి. దర్దికు, లేక పిశాచ భాషలు గలవని మాత్రము వచించునట్టి గ్రియర్సన్‌గారి వ్రాఁతలు తమ వాదమున కేమి బలము నొసంగునని డా. నారాయణరావుగా రుదాహరించిరో తెలియకున్నది.

కాల్డు వెల్లుగారును నిండో యూరపియను భాషలతోను మఱికొన్ని యాస్ట్రేలియాది భాషలతోను వలెనె సిథియను భాషలతో సైతము ద్రావిడ భాషలకుఁ గొన్ని సామ్యములు మధ్యాసియా వాసకాలమందె సంభవించెనని చెప్పి యూరకుండక ద్రావిడ భాషలు సిథియను కుటుంబములోని వనుచు నొక సిద్ధాంతము నవలంబించిరి. అట్లవలంబించుటవలనఁ గెల్టికు భాషలతోను యూరపులోని గ్రీకు మున్నగు భాషలతోను ద్రావిడ భాషలకుఁగల సామ్యములెల్ల సిథియను భాషల మూలమునఁ గల్గెనని వచించుట కనుపడునని డా. కాల్డు వెల్లుగారు తలంచియుందురని తోఁచెడిని.

ఁ. I విష:—వెనుక నుదాహరించిన (చూడు. ౭ II విష.) కాల్డువెల్లు ౬.౭—౨౩ పుటలలోని వ్రాతలనుబట్టి ద్రావిడుల కిండోయూరపియను భాషలతోఁ జరిత్ర కందని కాలమందుఁ గల్గు సంబంధము విశదమగుచున్నది. అట్లే ముందుదాహరింపఁబోవు (చూడు. ఁ IV విష.) కాల్డువెల్లు ౨౩ మొ. ౭౭ పుటలలోని వ్రాతలనుబట్టియు స్పష్టపడుచున్నది. అట్లె వెనుక నుదాహరించిన (చూడు. ౭ III విష.) కాల్డు. ౧౦ఁ పుటలోని వ్రాతలను బట్టి ద్రావిడ భాషలకు మరల సర్వాచీనముగా నార్య భాషలతోఁ గల సంబంధము విశదమగుచున్నది. తర్వాత ద్రావిడులు దక్షిణ హిందూస్థానముచేరి స్థిరపడిన పిదప నుత్తరమునుండి యార్యులు దక్షిణ హిందూస్థానమునకుఁ గొందఱుపోయి ద్రావిడులతోఁ జేరి యైక్యమందిరి. ఇట్లు ద్రావిడభాషల కార్యులతోఁ బ్రాచీన తమ సంబంధమే కాక యర్వాచీనకాల సంబంధమును సంభవించెను (చూ. కాల్డు. ౧౦ఁ పుట). అక్కారణమున ద్రావిడ శబ్దములు కొన్ని సంస్కృత ప్రాకృతములలోను సంస్కృత ప్రాకృత శబ్దములు పెక్కు ద్రావిడభాషలందును బ్రవేశించినవి. కాన నీ నూతనప్రవిష్ట సంస్కృత ప్రాకృత రూపములనుబట్టి ద్రావిడభాషలు సంస్కృత ప్రాకృత జన్యము లనరాదు. ప్రాచ్య పాశ్చాత్య భేదముల నందని ప్రాచీన తమ కాలపు "ఇండో యూరపియను" భాషల స్వభావములతో నున్నట్టియు "సిథియను-ఇండో యూరపియను" భాషలకు మూలమైనట్టియు "ఆదిమభాషయె" మూల ద్రావిడభాషకుఁ దల్లి. అదియె సిథియను భాషలకును దల్లియై యున్నది, (చూడు. VII ప్రక. సంస్కృత శబ్దసామ్యము).

"కెల్టికు భాషలతో సిథియను భాషల కధిక సంబంధముండుటచేత ద్రావిడభాషలతోడి సామ్యము కెల్టికు భాషలకుండుట వింతకాదు—అట్లె యూరపులో "కెల్టిక్కు"లకు ముందు సిథియనులు ఫిన్నులు నుండుటచేత వీరి భాషల సామ్యములు కెల్టిక్కుల భాషలో నుండుటయు వింతకాదు. ద్రావిడభాషలకుఁ గెల్టికు భాషలతోఁ గల సామ్యములు సిథియను భాషల ద్వారమునఁ గల్గి యుండవచ్చును." (కాల్డు. పీఠిక ౭౧ పుట).

""సిథియన్" శబ్దమును "మంగోలియను-తుర్కిషు-ఫిన్నిషు-తుంగేరియను" అను కుటుంబములకు సామాన్యముగా రాస్కుదొరగారు వాడిరి..... సిథియను భాషలనే కొందఱు తురేనియను భాషలనియు, మఱికొందఱు మంగోలియను భాషలనియు నింకొక కొంద ఱాల్టయిగ్భాషలనియు వేఱొక కొందఱు ఫిన్నిషు భాషలనియు నింకను గొందఱు తార్తారు భాషలనియు వాడుదురు. కాని యిట్లు వాడుట సరికాదు. పై కుటుంబముల పేరులలోఁ గొన్ని

ప్రత్యేక భాషల పేరులును నగుటచేత లేనిపోని సందేహములు గల్గును గాన వానిని సిథియను భాషలనుటయె యుక్తము. ఏషియా యూరపు ఖండముల లోని యుత్తర భాగములందలి జాతిచరిత్ర తెలియని యనాగరకులను సిథియను లని వాడుట సంప్రదాయము. వీరెల్లఁ బైని వ్రాసిన తురేనియను ప్రభృతుల లోని యేదే నొక భాషను మాటాడువారై యున్నారు." (కాల్డు. పీఠిక ౬౧—౬౨ పుటలు).

"సంబంధార్థక సర్వనామములచే నిర్వహింపనగు సర్థవిశేషముగల ధాతుజ విశేషణముల స్థితి మంగోలియా మంచు భాషలకును ద్రావిడ భాషల కును గల సంబంధమునకుఁ బ్రబలనిదర్శనము". (కాల్డు. పీఠిక ౬౫ పుట).

౧. II విష:—"ఆఫ్ఘనిస్థానము ప్రాంతమునందలి పశ్చిమపు మెదియా లోని "బెహిస్తను" అనుచోట "దెరయస్-ఇస్టస్‌పెస్" అను వాని స్వీయచరిత్ర రూపమున నున్న శాసనములు ప్రాచీనపు "పర్షియను—బాబిలోనియను—సిథి యను" అను భాషలతో వేర్వేఱుగ నున్నవి. అందలి సిథియను భాషల యను వాదమువలన సిథియను ద్రావిడ భాషల సంబంధమునుగూర్చి క్రొత్త విషయ ములు బయల్పడుచున్నవి. ఆ బెహిస్తను ఫలకములలోని రెండవ కత్య్య ఫలకము లలో స్పష్టముగా సిథియను భాషలు కనఁబడుచున్నవి" అని నోరిస్ దొరగారు చెప్పిరి. ఇది సిథియను భాషలలోని తురేనియను భాషయని "ఓపర్టు"గారనిరి. బెహిస్తను ఫలకములు—క్రీ. పూ. ౫ శబ్దమునాఁటివి.........బెహిస్తను ఫలకములలోని భాష సిథియను భాషాకుటుంబములోని "ఉగ్రో ఫిన్నిషు" భాషను జాల సంబంధించియున్నది." (కాల్డు. పీఠిక ౬౫ పుట).

పయి పంక్తులు ౫ విషయమున సందర్భాంతరమునఁ జూపఁబడినవి.

పయిని వ్రాసిన ఫలకముల భాషతోడి ద్రావిడ భాషల సంబంధము లిటఁ బ్రదర్శింపఁ బడుచున్నవి.

"౧. ఫలకముల భాషలో ద్రావిడభాషలందువలెనె మూర్ధన్యములగు "ట-డ-ణ" అనునవి గలవు. ఈ యక్షరము లిండోయూరపియను భాషలం దెందును లేవు. ఒకట సంస్కృతములోనికి ద్రావిడ భాషల మూలమున వచ్చినవి.

౨. ఫలకముల భాషలోఁ దమిళమునందువలెనె యొక్క వ్యంజనమె పదాదియందు శ్వాసముగను (పరుషముగను) బదమధ్యమున నాదముగను (సరళముగను) బలుకఁబడుటయు నట్టి వ్యంజన మొంటరిగఁ బల్కఁబడినపుడు (అసంయుక్తతయందు) నాదముగనె (సరళముగనె) పల్కఁబడుటయు ద్విరుక్తముగ

నున్నపుడు శ్వాసముగఁ (పరుషముగ) బల్కఁబడుటయు ననుపద్ధతులు వెలయు చున్నవి. (అనుబంధము I).

3. ఫలకభాషలోని శబ్దముల తుదిని "న-నిన-ఇన్న" అనునవి చేర్చుట చేత శేష షష్ఠి యేర్పడును. తెల్గున 'ని' అనునదియు గోండు బ్రహుయి భాషలలో 'న' లేదా 'అ' అనునదియుఁ దమిళమున "ఇన్" అనునదియు (అనుబంధము II). శేష షష్ఠి ప్రత్యయములై యున్నవి.

౪. ఫలకముల భాషలోఁ జతుర్థీ విభక్తియందు "ఇక్కి-ఇకు" కలవు. ఇట్టివే "తార్తారు-తుర్కిష" భాషలలోను గలవు. ఉగ్రియన్ కుటుంబమున వీనిని బోలినవి కనఁబడుచున్నవి. ద్రావిడభాషలలో నింతకన్న నధికముగఁ బైవాని పోలికలు గలవు. 'కి-కు' అనునవి షష్ఠీ ప్రత్యయములు. తమిళ మలయాళములలో శ్రుతి సుభగతకై 'ఇ-ఉ' అను స్వరములు ముందు నిల్చుట, కకారద్విరుక్తియుఁ గల్గును. ఉదా:—ఫలకభాష:—నిన్ + ఇకు =

---

అనుబంధము I ౧-II విష:—ఈ వ్రాఁత విశ్వసనీయముగ లేదు—ఫలకమందలి వ్రాఁతను బట్టి యుచ్చారణ భేద మెట్లు విశదము కాఁగలదు. ఇఁక నిట్టి కాల్డువెల్దుగారి వ్రాఁత యసంగతము కాకుండ సరిపెట్టుకొనుటకై తమిళమందువలెఁ గాక ఫలకముల భాషలో సరళలిపియుఁ గల దనియు నట్లగుటచేత విరోధము లేదనియు నంగీకరింపవలయును. మఱియుఁ దొల్కాప్పియము నాఁటికి సయితము తమిళమున సయితము సరళోచ్చారణము లేదుగదా. క్రీ. పూ. ౫ శతాబ్దము నాఁటి ఫలకములలో సరళోచ్చారణముండుటయు నది తమిళ స్వభావానుకారమనియుఁ జెప్పుట యెట్లు పొసఁగును? ఇంతియకాక సిథియను భాషలలో సరళోచ్చారణము సరళలిపియు నుండునపుడు తత్కుటుంబభాష లనఁబడుచున్న ద్రావిడ భాషలలో నెట్లు చాలకాలమువఱకును సరళములు లేవయ్యెను?

అనుబంధము II ౧-II విష:—తమిళమున 'ఇన్' అనునది శేషషష్ఠీప్రత్యయమనుట పొర పాటు. అది తమిళమునఁ బంచమీ ప్రత్యయము, "ఐ. ఒడు......" (తొల్కా ౧౧౮ సూ.) —ఐ—ద్వితీయావిభక్తి. ఒడు—తృతీయావిభక్తి. కు—చతుర్థీవిభక్తి. ఇన్—పంచమీవిభక్తి—అదు షష్ఠీ విభక్తి. కణ్—సప్తమీవిభక్తి.

తెల్గునందును 'ని' అనునది శేషషష్ఠీప్రత్యయమనుట భ్రాంతిమూలకమె. "రామునిని—రామునిచేతన్—రామునికై—రామునివలనన్—రామునియందున్" అనువాని రీతినే "రాముని యొక్క" అను శేషషష్ఠీ రూప ముండునుగదా. 'ని' అనునది శేషషష్ఠీప్రత్యయ మెట్లగును? "రామునియొక్క+గుణములు = రామునిగుణములు" అనుచోటి 'ని' అనునది "షష్ఠీ భవే ద్వితీయా తుల్యా......" అను చింతామణి చొప్పున వచ్చిన షష్ఠ్యర్థకద్వితీయాప్రత్యయము. (చూ. వ్యా. సం. ౨౭౦ విష.) తుదికి బాల వ్యాకరణము చొప్పున "రామునియొక్క+గుణములు" అనుచో యొక్క విభక్తికి సామాసికలోపము గల్గినదనియైన గ్రహింపకుండుట వింత!

(నీకు) కన్న:—(అ+గె) నినగె=(నీకు). మలయాళ:—నిన్+అక్కు=నినక్కు=(నీకు). (అనుబంధము III).

౫. ఫలకభాషలో "న్=ఉన్=ఇన్" అను ప్రత్యయములు చేర్చుటచేత ద్వితీయావిభక్తి యేర్పడును. తెల్గున 'ను-ని' అనునవి ద్వితీయా ప్రత్యయములు. కన్నడమున 'అమ్=అన్న్+ఉ' ద్వితీయా ప్రత్యయము. (అనుబంధము IV).

౬. ఫలకభాషలో సంఖ్యావాచకమొక్కటే యున్నది. "కిర్=(ఒకటి)" అనునది. ఆ ఫలకములలో నున్న సంఖ్యావాచక విశేషణము—"ర-ఋ"-అనువాని నియ్యది సంబంధించుచున్నది. తెల్గు—"ఒక - తమి - ఒర్" 'కు' భాషలో సంఖ్యావాచక విశేషణము 'ర' అనునది. ఇది ఫలకములలోని "ర-ఋ" అనువానిని బోలుచున్నది.

ఫలకభాషలోని పూరణార్థక సంఖ్యావాచకములు 'ఇమ్' శబ్దాంతములై యున్నవి. తమిళమున 'అమ్' శబ్దాంతములై యున్నవి. 'శమాయిది' భాషలో 'ఇమ్' శబ్దాంతములై యుండును.

౭. మధ్యమపురుష సర్వనామము ఫలకభాషలోను ద్రావిడభాషల లోను 'నీ' అనునదై యున్నది. ద్వితీయావిభక్తి మున్నగువానిలో 'నిన్' అనునదై యున్నది.

౮. ఫలకముల భాషలో ద్రావిడభాషలందువలె సంబంధ సర్వనామార్థ ప్రతిపాదకధాతుజ విశేషణములు గలవు. సంబంధార్థక సర్వనామములును (యత్తచ్ఛబ్దాన్వయబోధకములు) గలవు. ఫలకముల విషయము మొదటఁ బరిషీయను భాషలో (ఇండో యూరపియను కుటుంబములోనిది) వ్రాయఁ బడినను నందలి విషయముల యొక్క సిథియను కుటుంబ భాషానువాదమునఁ బై సామ్యములు గలవని తెలియునది.

ఫలకముల భాషలోని ధాతుజ విశేషణ ప్రత్యయములును ద్రావిడ ధాతుజ విశేషణ ప్రత్యయములును బరస్పర విభిన్నములె యైనను నవి చేరెడి స్థానమును వాని యర్థశక్తియుఁ దద్విశిష్టపద ప్రయోగరీతియుఁ దుల్యములయి

అనుబంధము III ౮. II విష:—'కు' పెక్కు భాషలలోఁ జతుర్థిగా నున్నది. "ఆధునికార్య భాషలలోఁ బశ్చిమ హిందీభాషయందు 'కో' బంగాళీ భాషయందు 'కే' ఒరియా భాషయందు 'కు' అను ప్రత్యయములు......" (చూ. 'ఆం. భా. చ.' ౫౮ పుట).

అనుబంధము IV ౮. II విష:—"అన్ను" అనునది హళగన్నడ ద్వితీయావిభక్తి. క్రీ. పూ. ౫ శతాబ్దపు భాషతో సామ్యము చూపెడి యీ సందర్భమున నత్యంతాధునికమగు హళగన్నడ రూపమును జూపుట సరికాదు.

యున్నవి. ధాతుజ విశేషణముల యిట్టి ప్రయోగపద్ధతి మార్పుచెందని సిథియను భాష లన్నిటియందును (చూ. కాల్డు. పీఠిక ౬౫ పుట. మంగోలియా-మంచు.) ముఖ్యమైన వ్యాకరణ విషయసామ్యమై యున్నది.

౯. ఫలకముల భాషలోని వ్యతిరేక విధ్యర్థక ప్రత్యయము 'ఇన్ని' అనియు గోండుభాషలో (ద్రావిడభాషలలోనిది) 'మిన్ని' అనియు నున్నవి.

ఫలకముల భాషలోని 'తిజ్' ప్రత్యయములకును ద్రావిడభాషలలోని 'తిజ్' ప్రత్యయ ప్రక్రియకును జాలభేదము గలదు. (అనుబంధము V). అయినను నితర ముఖ్యవిషయముల (పైని వ్రాసిన వానిని) సామ్యమునుబట్టి యీ రెండు తెగల భాషలకును సంబంధముగలదని తోఁచక మానదు." (కాల్డు. పీఠిక ౬౫ మొ. ౬౮ పుటలు).

౮. III విష:—భాషలకు జీవకళ నాపాదించు పైనంటిన ముఖ్య వ్యవహారావశ్యక శబ్దముల సామ్యము గల్గునపుడే భాషలకుఁ బ్రత్యేక కుటుంబిత నంగీకరింపనగునని సిద్ధాంతము చేసిన (చూడు. కాల్డు. పీఠిక ౪౧ మొ. ౪౩ పు.) డా. కాల్డువెల్లుగారు పయిరీతిగల సామాన్యపు సంబంధములకై (సంస్కృతముతోడి సంబంధములవంటివె) సిథియను భాషా కుటుంబ సిద్ధాంతము నంగీకరించుట యావశ్యకమని తోఁచదు. తాను సిద్ధాంతము చేసిన యేక కుటుంబితాపాదక సామ్యములను సిథియను ద్రావిడ భాషలకుఁ జూపలేదే! రెండు తెగల తిజంత ప్రక్రియకును జాల భేదమున్నదని తానే వచించెనే! సంఖ్యావాచక శబ్దమొక్కటే ఫలకభాషలో నున్నదని తానే వ్రాసెనే! మఱియు సిథియను లనాగరకులనియుఁ దానే వ్రాసి యుండెనే. (చూడు. ౧౦౩ I విష.) వారిని ద్రావిడులతో జోడింపనేల? అందును బ్రధాన ద్రావిడభాషలగు తమిళాంధ్ర కర్ణాటముల సామ్యము తృప్తికరమైనది చూపఁబడనేలేదు. హిందూదేశేతరస్థలస్థ భాషాంతరములతోడి యేక కుటుంబితను, నిర్వహింపఁ గడంగనేల? అట్టి సామ్యముగలవెల్ల సిథియను భాషలె యననేల? ఇట్టి బలహీన సిథియను సిద్ధాంతము నవలంబింపనేల?

ఎల్లజాతులవారును మధ్యాసియా (సెంట్రల్ ఏషియా) లో సాక్షాత్సంబంధమునో? పరంపరా సంబంధమునో? కల్గియుండెడి వారనెడి సర్వసమ్మత

అనుబంధము V ౮ II విష:—ద్రావిడులు హిందూదేశమును జేరువఱకును ద్రావిడక్రియల తుదిని సర్వనామ ఖండరూప సమాపక క్రియాప్రత్యయములు చేరలేదని తానే వచించెను. (చూ. కాల్డు. పీఠిక ౭౨వ పుట). సిథియను భాషల "తిజ్జుల" ప్రక్రియ యెట్టిదో యిటఁ బ్రదర్శింపఁబడదయ్యె. కావున నెట్టి భేదముగలదో యిట నిరూపింపరాదయ్యెను.

సిద్ధాంతము నాశ్రయించి వారు కాలక్రమమున గుంపులు గుంపులుగ వేర్వే ఱుగ నితరదేశములకుఁ జెదరిరనియు నక్కారణమునఁ బ్రాపంచిక భాషలలోఁ బెక్కిటికిఁ బరస్పర సామ్యములు వెలయుచున్నవనియు నందును నార్యులతోడి సంబంధ మధికమగుటచే వారిభాషతో సంబంధ మధికముగ ద్రావిడ భాషలకుఁ గల్గెననియు డా. కాల్డువెల్లుగారేల నిర్బాధముగా రాద్ధాంతము చేయరయ్యెనో తెలియకున్నది. సృష్ట్యాదినుండియు భాషలచరిత్రము నూహింప నమకట్టనేల? అది సాధ్యమగునా? తెలియనిదానిని దెలియదనుటలో లోపమేమున్నది?

శ్లో॥ నిరూపయితు మారబ్ధే, నిఖిలైరపి పణ్డితైః।
అజ్ఞానం పురత స్తేషాం। భాతి కక్ష్యాసు కాసుచిత్ ॥
(వేదాంత పంచదశి, చిత్రదీపము)

ఇంతయేల? దొరగారే తమ సిథియను కుటుంబ సిద్ధాంతమునందలి దౌర్బల్యము పొడకట్టుటచేతనేకదా "ద్రావిడభాషలు కేవలము సిథియను భాషల లోనివే యని చెప్పుటకు వీలులేనిచో వాని కిండోయూరపియను భాషలకంటె సిథియను భాషలతోడి సంబంధ మధికమనియైనఁ జెప్పుటకు సందేహములేదు" (కాల్డు. పీఠిక ౭ర పుట) అని వ్రాయవలసినవారైరి.

సిథియను భాషలతో వలెనె యింకను బెక్కు కుటుంబముల భాష లతో ద్రావిడ భాషలకు సామ్యములు గలవని కాల్డువెల్లుగారీ క్రింది రీతిని వివరింపలేదా?

ా. IV విష:— "ఇతరములగు నేఁటి యిండోయూరపియను భాషలందును లేని సామ్యములు 'హెబ్రు' భాషయందును (సెమెటిక కుటుంబములోనిది) ద్రావిడ భాషలందును నగపడుచున్నవి. సెమెటిగ్భాషల సామ్యముల కన్నను నిండోయూరపియను భాషల సామ్యములె యధికముగను ముఖ్యముగను ద్రావిడ భాషలలో నగపడుచున్నవి.........ఇండోయూరపియను భాషల సంబంధ ములు ద్రావిడ భాషలకు మిక్కిలి యాంతరంగికములై యాయువుపట్టు సంబంధము వంటివై యున్నవి. (చూడు. VII ప్రకర. సంస్కృత శబ్దసామ్యము) ఇట్టి సంబంధ ములనుబట్టి వీనికేదో యత్యంత నికటసంబంధము విదూరకాలమున నుండియుండె నని యొప్పుకొనక తీరదు. సెమెటిక భాషలతోఁగూడ ద్రావిడభాషలకు సామ్యములున్నవి.........హిందూదేశమునకు రాకముందు ప్రాచీన కాలపు ద్రావిడులు సెమెటిగ్భాషలను మాటాడు వారితో నెప్పుడైనఁగలిసి నివసించి యుండిన నుండవచ్చును. ఆస్ట్రేలియా ఖండములోని పశ్చిమదక్షిణపు ప్రకటల నివసించు నడవిజాతుల భాషలలోని సర్వనామములకును ద్రావిడభాషల సర్వనామములకును విచిత్రమగు సామ్యము కనఁబడుచున్నది. అట్టి యాస్ట్రే

లియా భాషలోని యుత్తమపురుష సర్వనామములు ద్రావిడ భాషలకంటె నెక్కుడుగ "టిబెటన్" భాషలను బోలుచున్నవి.

| | ద్రావిడ భాషలు. | ఆస్ట్రేలియాభాష. | టిబెటన్‌భాష. | చీనాభాష. |
|---|---|---|---|---|
| ఉత్తమపురుష సర్వనామము | నాన్-ఞాన్-నా- ఎన్. | ఙ-ఙై-ఙత్స. ఙన్య. | ఙ-ఙై- ఙైద్ | ఙో. |

.................. ఇంక నామముల బహు వచనరూప కల్పనమున ద్రావిడ భాషలతో—అందును దెనుఁగు భాషతో—నధిక సంబంధ మాస్ట్రేలియా భాష కగపడుచున్నది. 'లు' వర్ణకము తెలుఁగు బహువచనము. ఆస్ట్రేలియా భాషలలో "లు—లి—దు—ది" మున్నగునవి బహువచన ప్రత్యయములు. ఈ విషయమున ముఖ్యముగా హిందూదేశములోని యీశాన్యమూల భాషలతోఁ దెలుఁగుభాష కధిక సామ్యము కన్పట్టుచున్నది. ఉదా:—దీమల్ భాష—నా= (నీవు). దీనిని "న్యా" అను దానితోఁ బోల్చి చూచునది. ఆస్ట్రేలియన్ భాషల లోని యుత్తమపురుష రూపములతోడి సామ్యము తెల్గునఁ జూపట్టుచున్నది. ఉదా:—"ఆస్ట్రేలియన్—ఙలు—ఙద్లు—ఙద్లి—ఙలత =(మేము) (మనము). తెల్గు—వాండు—వాండ్లు—తమి—నాన్—నాఙ్గళ్—" అంతటను 'లు' వర్ణసామ్యము గలదు. మధ్యమపురుష మందును సామ్యము గలదు.

| | తమిఁఱ | తమిఁఱ భాష | ఆస్ట్రేలియా | |
|---|---|---|---|---|
| మధ్యమపురుష సర్వనామము | (ఏ)<br>ప్ర. నీన్—నిన్ = (నీవు) | (బ)<br>నీమ్—నిమ్—నీర్—నుమ్ = (మీరు) నీవు | (ఏ)<br>నిన్న-ఙిన్‌తో అ-ఙిన్నె నిన్ఙతె | (బ)<br>నిమెదూ—నివ—నుర—ఙుర్లె |
| ద్వితీ | ఎనైన్న | —— | ఎమ్మొ | —— |

విభక్తులను బ్రకృతికిఁ బరమందుఁ జేర్చుట—ఉత్తమపురుష బహుత్వము న నుభయార్థక (మనము) శబ్దముండుట—ప్రేరణార్థకములు, నాత్మనే పదార్థకము లును, గొన్ని 'ఇన్సెప్టీవులు (Inceptive) ను బ్రత్యయములు చేర్చుటవలన నేర్పడుట — వాక్యములోని పదముల యానుపూర్వియు — నర్థవంతములగు విభక్త్యాదులు కల్గియుండుట—మున్నగు విషయములలో నాస్ట్రేలియా భాషలు ద్రావిడభాషలనేకాక "టర్కి—మంగోలియా" మున్నగు సిథియను భాషలను

సైతము పోలుచున్నవి.................మధ్యాసియాలోని బోర్ను దేశమండలి ‘‘కనురి’’ భాషలో ద్రావిడభాషల పోలికలు చాలఁ గన్పట్టుచున్నవి.

౧. కనురి భాషలోని విభక్తులును నర్థవంతములు.

౨. ఇందును బ్రకృతికిఁ బరమందె విభక్తులు నిల్చును.

౩. ఇందును వ్యతిరేకార్థక రూపములు గలవు.

౪. అవధారణాద్యర్థ విశేష బోధమున నామాదుల తుదిని స్వర విశేషములు నిల్చును.

౫. ద్రావిడభాషలలోని ‘నీ’ అను మధ్యమపురుష సర్వనామము ‘నీ’ అను రూపముతోనె ‘కనురి’ భాషయందును నున్నది. ఈ ‘నీ’ శబ్దసామ్యమీా రెండిటియందేకాక బ్రహుయి—చీనాభాషలందును రెండవ బెహిస్తన్ ఫలకభాషయందును నాస్ట్రేలియా మున్నగు భాషలందును గలదు.

కనురిభాషకు ‘కోయల్లె’ అను నతఁడు “బోర్ను” అను వ్యాకరణమును వ్రాసెను.” (కాల్డు. పీఠిక ౭౪ మొ. ౭౭ పుటలు).

‘‘కొన్నియెడల సంస్కృతమున లేని సామ్యములు సైతము గ్రీకు ప్రభృతులతో ద్రావిడభాషల కగపడుచున్నవి...............ప్రాచీనతమములగు మొట్టమొదటి యపరిమార్జితరూపములందలి సామ్యములనుబట్టియే నా యీా యభిప్రాయములను సిద్ధాంతకరించుచున్నాను.

౧. గ్రీకుభాషలోవలె ద్రావిడభాషలలో స్వరసంహిత నెడఁబెట్టుటకయి ‘న’ కారమును జొనుపుట (అనుబంధము).

౨. ప్రథమపురుష సర్వనామములలోను బ్రథమపురుష క్రియలలోను మహదమహద్వివక్ష కాన్పించుట. ముఖ్యముగా నమహద్రూపముండుట.

౩. ప్రథమపురుష నిర్దేశక సర్వనామ రూపములలో దకార తకారములను జిహ్నములుగా నుపయోగించుట. (అది చేయదు మొ).

౪. లాటినులోవలె హ్రస్వాకారములో నమహదర్థక బహువచన రూపము లుండుట.

౫. దూరనిర్దేశక సర్వనామములు ‘అ’ శబ్దముతోను సమీాప నిర్దేశక సర్వనామములు ‘ఇ’ శబ్దముతోను నుండుట.

---

అనుబంధము ౧. IV విష:—తమిళ కన్నడములందలి స్వరసంహితలలో యవలె నిల్చునుగాని ‘న’కారము నిలువదు. ఇంకఁ దెల్గున నిలుచుచున్న ‘న’ కారము (వచ్చెన్+అతఁడు=వచ్చెనతఁడు) శబ్దావయవము. అర్థవంతము. దానిని సంహితావ్యవధాయకమని కాల్డువెల్లుగారు భ్రమించి యిట్లు వ్రాయుచున్నారు, అది సంహితావ్యవధాయకవర్ణము కాదు (చూడు, ౨౯ – ౨౯ I విషయములు)

౬. పరిషియన్ భాషలోవలెఁ బెక్కు-భూతకాలరూపములు 'ద' కారముతో నేర్పడుట. (తకారము. దకార మర్వాచీనము).

౭. కొన్ని భూత కాలికరూపములు ధాత్వంతముయొక్క యభ్యాసము చేత (ద్విరుక్తిచేత ౧౩౧ I విష.) నేర్పడుట.

౮. పెక్కు క్రియా నామవాచకములు ధాతువులోని స్వరమును దీర్ఘము చేయుటచేత నేర్పడుట. (చూడు. ౧౩౯ I విష.)

నేను గ్రంథము తుదిని జూపఁబోవు (గ్లసోరియల్) శబ్ద సామ్యముల లోనివి చూడుఁడు. ఆ (గ్లసోరియల్) సామ్యములచేత............ ద్రావిడ భాషలు ప్రాచ్యములగు నిండో యూరపియను భాషలను (సంస్కృతాదులను) బోలుటకంటెఁ బాశ్చాత్యములగు నిండో యూరపియను భాషలను (గ్రీకు మొ.) నెక్కుడుగాఁ బోలుచున్నవని నిరూపింపఁబడును..............." (కాల్డు—పీఠిక. ౭౩ పుట). (చూడు. ౧౮౧ V విష. ౧౮౨ విష.) (౫౮౭. మొ. ౬౦౫ వ. కాల్డు. పు).

౮. V విష:—ఇట్లగుటచేతను నితర కుటుంబభాషలు పెక్కిటితో (ఆస్ట్రేలియా — కనురీ. మొ.) సామ్యములు గన్పట్టుచుండుటచేతను ద్రావిడులు చరిత్రకందని పురాతనకాలమున మధ్యాసియాలో నితరభాషా కుటుంబముల వారితోఁ గలసియుండెడివారని నిశ్చయింపనగును. ఎల్లభాషలవారును లేదా పెక్కుభాషలవారు మధ్యాసియానుండి వివిధదేశములకుఁ జెదరిరనుట సర్వ సమ్మతముకదా. (చూడు. కాల్డు. పీఠిక ౬౭ పు.) అట్లె బెలూచిస్థానములోని బ్రహూయి భాషతోడను నాఫ్ఘనిస్థానమందలి బెహిస్తను ఫలకముల భాష తోడను బెంగాలులోని రాజమహాలు భాషలతోను ద్రావిడభాషలకుఁ గల సామ్యములనుబట్టి ద్రావిడులు హిందూదేశమునకు హిందూదేశపు వాయవ్యపు మూలనుండి బెంగాలుమీఁదుగా వచ్చిరనుటయు నిర్ణీతమగుచున్నది.

౯. I విష:—వెనుక నుదాహరించిన కాల్డువెల్లుగారి సిథియను సిద్ధాంతమును నిరసించుచు వెనుక వివరించిన గ్రియరుసనుగారి (చూడు. ౬ విష.) పరిశోధనల చొప్పున హిందూదేశపు వాయవ్యపు మూలనున్న హిందూకుషు పర్వతప్రాంతములగు పిశాచ = దర్దికుదేశములందుఁ బిశాచజనులుండెడివారను ("పిశాచ—పు. పిశిత మశ్నాతి.........దేవయోనిభేదే—ప్రేతేచ" శబ్దస్తో.) దాని నూఁతగొని గోరు వ్రాసినఁ బటము వ్రాసె నను నానుడి చొప్పున నట్టి పిశాచ జనుల భాషయగు పైశాచీ ప్రాకృతపుజన్యములె ద్రావిడభాషలనుచు నీ క్రిందిరీతి నొక యపూర్వ సిద్ధాంతమును నాంధ్రభాషా చరిత్రకారులు నెలకొల్ప సాగిరి. అట్టి వారి సిద్ధాంతమున కించుకేని చరిత్ర[illegible]చించిన వని

స్పష్టపడుచున్న యీ క్రింద విమర్శింపఁబోవు "బాహ్లీక సహ్యే" త్యాది వచనము లవలంబనంబు లయ్యెను.

ఆంధ్రభాషా చరిత్రకర్తగారగు డా. చిలుకూరి నారాయణరావుగారు "ఆ పిశాచ జనులే—పైశాచీ ప్రాకృత వ్యవహర్తలే—మధ్యాసియా నుండి వచ్చిన యార్యుల తెగలోనివారే—" యార్యులు హిందూదేశమునకు రాకముందు హిందూదేశమునకు వచ్చి నెలవుకొని ద్రావిడులని పేర్కొనఁ బడుచున్నా రను నీ యపూర్వ సిద్ధాంతమును స్థాపింపఁగడంగిరి. ఉత్తర హిందూస్థానములోని ప్రాకృతాపభ్రంశములగు హిందీ, మరాటీ, బెంగాలీ ప్రభృతులవంటివే యీ పైశాచీ ప్రాకృతాపభ్రంశములగు ద్రావిడ భాషలును నై యున్నవనియు నక్కారణమున నీ ద్రావిడ భాషలును హిందీ ప్రభృతులవలెనె యార్యభాషా కుటుంబములోనివే యనియు వారి సిద్ధాంతము. అట్లు పిశాచజనులనఁగా ద్రావిడులు హిందూదేశమున నెలకొనిన పిమ్మట నార్యులు హిందూదేశమునకు రాఁగా నా రెండు తెగలవారికిని యుద్ధములు జరిగెననియు నార్యులట్టి పిశాచజనులనే దస్యులు మున్నగు పేరులతో వ్యవహరించిరనియు నట్టి యుద్ధములలోఁ బిశాచజను లోడిపోయి కొందఱు శూద్రరూపమున నార్యులతోఁ గలసిరనియుఁ గొందఱు పిశాచజనులు దక్షిణ హిందూస్థానమునకుఁ బోయి యచట నెలవుకొని ద్రావిడులుగా నేర్పడిరనియు డా. నారాయణరావుగారు వచింతురు. వైదిక లౌకిక సంస్కృతములకు మూలమగు ప్రాథమిక ప్రాకృతమునుండి యేర్పడిన ద్వైతీయీకావస్థలోని ప్రాకృతములె పాళీ ప్రభృతులనియు వానిని సంస్కరించిన భాషలె మహారాష్ట్రి శౌరసేనీ ప్రభృతి వ్యాకరణ సమ్మత ప్రాకృతములనియు నట్టి ద్వైతీయీక ప్రాకృతమునుండి వ్యవహారవశమున నేర్పడిన తార్తీయీక ప్రాకృత రూపా పభ్రంశ భాషలె హిందీ మరాటీ ప్రభృతులగు నేఁటి యుత్తర హిందూస్థాన భాషలనియు గ్రహించుచున్నట్లె ద్వైతీయీ కాపరిమార్జిత పైశాచీ ప్రాకృత ద్వయమునుండి యేర్పడిన తార్తీయీ కాపభ్రంశ ప్రాకృతములె దాక్షిణాత్య ప్రాకృతములనియు నవియె తమిళ కర్ణాటాంధ్రాది ద్రావిడ భాషలుగఁ బరిగణింపఁ బడుచున్నవనియు, డా. నారాయణరావుగారి యాశయము. (చూడు. 2 III విష). డా. నారాయణరావుగారి వాక్యములు:—

"ద్రావిడ భాషలుగూడఁ బ్రాకృత భాషలె యనియుఁ దక్షిణ ప్రాకృత భాష లెట్లు గలిగినవో ద్రావిడ భాషలును నట్లే గల్గినవనియుఁ, బ్రాకృత భాషలపై ద్రావిడ ప్రాకృతమున కెంతటి ప్రాబల్యము గల్గెనో ద్రావిడ భాషలపైఁ గూడఁ దక్షిణ ప్రాకృత భాషలవలన నంతటి ప్రాబల్యము

గల్గెననియుఁ బ్రాచీనార్యభాషలనుండి తక్కిన ప్రాకృతములవలె ద్రావిడ భాషలును వికాసము నందినవనియుఁ దలంచుచు నా దృష్టితోఁ బరిశోధనము సాగించినచో ద్రావిడ భాషాతత్త్వము తేలఁగలదని చెప్పుట సాహసము కానేరదు". (ఆం. భా. చ. ౬౬ పుట).

౯. II విమ:—"ప్రాకృత వైయాకరణులు పైశాచీ భాష కాంచీ—పాండ్య-పాంచాల—గౌడ—మాగధ—వ్రాచడ—దాక్షిణాత్య—శౌరసేన—కేకయ—శాబర—ద్రావిడ—బాహ్లీక—సహ్య—నేపాళ—కుంతల—గాంధార—సుధేష్ణ—ఘోట-హైవ-కన్నోజన-దేశములందుండునదని వివరించిరి" (ఆం. భా. చ. ౩౭ పు).

"పైశాచీ భాషల యీ యాదిమ ప్రదేశము ప్రాకృత లాక్షణికుల యభిప్రాయమున, కనుగుణముగనే యున్నది. మార్కండేయుఁడు (౧౭ శతాబ్దము వాఁడు) కాంచీ దేశీయ పాండ్య—పాంచాల—గౌడ—మగధ—వ్రాచడ—దాక్షిణాత్య—శౌరసేన—కేకయ—శబర—ద్రావిడ దేశములందు బైశాచీ భాషలు మాట్లాడఁబడుచుండెనని తెలుపుచు...రామతర్క వాగీశుఁడు (౧౭ శతాబ్దము వాఁడు) పైశాచీ భాష-కైకయ, ఛస్క-(?) భేదములచే రెండు విధములుగ నున్నదనియు మాగధ్యాది ప్రధాన ప్రాకృతముల యుచ్చారణము మాఱుట వలన అశుద్ధ పైశాచిక భాష లేర్పడెననియుఁ దెలిపియున్నాఁడు. లక్ష్మీధరుఁ డీ పైశాచీ భాషలకు పాండ్య—కేకయ—బాహ్లీక—సింహ(ళ?) నేపాళ—కుంతల—సుధేష్ణ—ఛోట—గాంధార—హైవ—కన్నోజన దేశములు స్థానములుగఁ జెప్పియున్నాఁడు." (ఆం. భా. చ. ౫౫౧ పుట). ఈ వాక్యమున కీ క్రింది షడ్భాషా చంద్రికలోని శ్లోకములు మూలమై యున్నవి. "పిశాచ దేశాస్తు వృద్ధై రుక్తాః—పాండ్య—కేకయ—బాహ్లీక। సింహ—నేపాళ—కున్తలాః। సుధేష్ణ ఛోట—గాన్ధార।—హైవ కన్నోజనా స్తథా। ఏ తే పిశాచ దేశాః స్యుః। పైశాచీ ద్వయ ముచ్యతే" (షడ్భా. 3 పుట). "వివరణేచాప్యుక్తమ్:—బాహ్లీక—సహ్య—నేపాళ। పాండ్య—కేకయ—కున్తలాః। చోళ—లాటక—గాన్ధార। సుధేష్ణ—ద్రవిడాదయః। పిశాచదేశా స్తద్దేశ్యం। పైశాచీ ద్వితయం భవేత్॥" (కవిశిరోభూషణము ౧౩౦ పుట).

"మార్కండేయుఁడు తన ప్రాకృత సర్వస్వమందుఁ బ్రాకృత చంద్రిక లోని వచనము నుద్ధరించి పైశాచీ భాష ౧౧ విధములని వచించినదానిని ఖండించి పైశాచీ భాష త్రివిధమనియు...ప్రాకృత చంద్రికా కారుఁడు చెప్పిన వాక్యములోని దేశము లొకదాని కొకటి దూరముగా నుండుటచేతను నందలి ప్రాకృతమునకును బిశాచ భాషకుఁ జెప్పిన లక్షణములకును జాలభేదముండుట వలనను నాతని యభిప్రాయము సరికాదని చెప్పక తప్పదు" (ఆం. భా. వి. ౭౯—౮౦ పుటలు).

దేశవిభాగ జ్ఞానశూన్యులగు పై వివరణకారాదులు శౌరసేనీ మాగధీ మహారాష్ట్రీ ప్రభృతులకువలెనె పైశాచీ భాషకు వాడెడి దేశములను జెప్ప వలదా యనుచు నవిమర్శముగా వచించిరేకాని పురాణములోని దేశముల విభాగమునైనఁ బాటింపరైరి. పాండ్య చోళ సహ్యాదులను జెప్పి కుంతల ద్రవిడాదులను మరలఁ జెప్పుట పునరుక్తముకాదా? వారు ప్రాకృత శబ్దశాస్త్రజ్ఞులె కాని దేశవిభాగరూప భూగోళశాస్త్రజ్ఞులు కారు గదా! ఏయే దేశములందే యే భాషలు పురాతనకాలమున వ్యావహారిక భాషలై యుండెడివో? యను విషయమును దెలిసినవారు కారు. వారి వాక్యములకుఁ బ్రామాణికత యెట్లు? వారు వచించిన దేశముల వైఖరి నరయఁగా హిందూదేశమెల్ల నించు మించుగాఁ బిశాచదేశమె యగుచున్నది. దేశములతోఁ భాషలపేరులకు సరిగాఁ జిరకాలమునుండి ప్రసిద్ధములయి యుండుటచేత నత్యంత ప్రామాణికము లనఁదగినట్టియుఁ గేవల ప్రాచీనులచేత—తత్తత్కాలస్థిత ప్రాచీనులచేత—వచింపఁబడినట్టియు నీ క్రింది దండ్యాచార్యాది వచనములలోని "మగధ—మాగధీ, శూరసేన — శౌరసేనీ"-ఇత్యాదులును మార్కండేయాదులచేఁ బిశాచ దేశములుగఁ జెప్పఁబడినవి. "శూరసేనోద్భవా భాషా। శౌరసేనీతి గీయతే। ప్రచక్షతే మాగధీం తాం। యా భాషా మగధోద్భవా।" (దండికావ్యాదర్శము). ఆంధ్రభాషా చరిత్ర కర్తగారు వ్రాసిన రామతర్కవాగీశుని వ్రాఁతను గొని మాగధ్యాదుల యపభ్రంశములు పైశాచీభాష లందురా? "పిశాచదేశ సంభూతం। పైశాచీ ద్వితయం భవే"త్తను ప్రాచీన దండ్యాచార్య వచనమున కేమిగతి! మఱియు ద్రావిడభాషలె పిశాచభాషలనెడి మనోరథమును భగ్నమగును. ప్రాచీనుఁడగు దండి "పిశాచదేశ సంభూత"మ్మని మాత్రమే వచించెను గాని పై "బాహ్లీకేత్యా ద్యప్రామాణిక వచనోక్త దేశములను వచింపలేదు. ఆంధ్రభాషా చరిత్రకర్తగా రీ యప్రామాణిక వచనములనె యాధారముగాఁ గొని గ్రియరుసన్‌గారి పిశాచదేశముల నారంభించి హిందూ దేశపు పటమును (మ్యాపు) జేతఁగొని సేతువు మొదలు హిమాచలమువఱకుఁ గల దేశములనెల్ల యథేష్టముగఁ బై శ్లోకములకుఁ బంచిపెట్టి యొక పటమును జూపిరి (చూడు. ఆం. భా. చ. ౫౫౨ పుట) ప్రాచీన పురాణాదులలోఁ బ్రసిద్ధ ములగు దేశముల క్రమమును సయితము పాటింపరైరి. ఆంధ్ర కర్ణాటదేశము లందుఁ జేర్కొనఁబడనే లేదు. వీరి పటము చొప్పున హిందూదేశమెల్ల సింహళ సహితముగఁ బిశాచదేశములగుచున్నది.

ప్రాకృతలక్షణ గ్రంథములు ప్రాచ్యములు ప్రతీచ్యములు ననిద్వివిధము లనియు నందు వరరుచికృత ప్రాకృత ప్రకాశము ప్రాచ్యమనియు వాల్మీకి సూత్ర మూలక షడ్భాషాచంద్రిక ప్రతీచ్యమనియు రామశర్మాదులు

ప్రాచ్యమార్గానుయాయులనియుఁ ద్రివిక్రమ హేమచంద్రాదులు ప్రతీచ్య మార్గానుయాయులనియుఁ (ఆం. భా. చ. ౫౮౭ పు) ప్రాచ్యుల వ్యాకరణ లెక్కుడు ప్రమాణములుగా నున్నవనియు (ఆం. భా. చ. ౫౮౯ పు) డా. నారాయణరావుగారు స్వవాద ప్రాబల్యమునకై వ్రాసికొనిరి. ఈ వ్రాఁత కేమి ప్రమాణము? ప్రాకృత ప్రకాశ మల్పవిషయకము. వాల్మీకి సూత్రము లధికవిషయ విస్తృతి గలవి. స్వవాద విరుద్ధమగుటచే వాని నిట్లు గ నప్రమాణమనుట యసంగతము.

“వాల్మీకి యొక్క దకారము మాత్రము పైశాచిలో ‘త’ కారమగు ననెను. వరరుచి సంప్రదాయమువారు వర్గతృతీయ చతుర్థాక్షరములన్నియు వర్గ ప్రథమ ద్వితీయాక్షరములగు ననిరి.......చూళికా పైశాచి యని పేరిడి వాల్మీకి సంప్ర దాయమువారు మూఁడు సూత్రములను మాత్రము చెప్పి దానిని పైశాచి లోని యొక చిన్న యవాంతర భేదముగా గణించిరి. వరరుచి సంప్ర దాయమువారు పైశాచియం దేడు భేదములను నిరూపించిరి. వీనిలో నేదియు ప్రతీచీ సంప్రదాయమువారి పైశాచితో సరిపోదు” (ఆం. భా. చ. ౫౮౯ పుట) అనియు వ్రాసిరి.

తమవాదమునకుఁ గేవల విరుద్ధము లగుటచేత వాల్మీకి సూత్రము ల ప్రమాణములని నిరాధారముగా వచించుట పొరపాటు. ప్రాచీనములగు వాల్మీకి సూత్రములును వరరుచి సూత్రములును భామహ వృత్తియు నప్రమా ణము లనుట సరికాదు. నవ్యులగు రామశర్మాదులకుఁ బ్రామాణ్యమిచ్చి వారిని బట్టి ప్రాచీనుల కప్రామాణ్యమును గల్పించుట కేవలము పొరపాటు, మఱియుఁ బైశాచీ భాషా విషయమున వాల్మీకి సూత్రములందు డా. నారాయణ రావుగారు చూపిన లోపములు సత్యవిదూరములు. వర్గతృతీయ చతుర్థ ములకు వర్గప్రథమ ద్వితీయము లాదేశములగునని వాల్మీకి సూత్రములలో లేదనుట సాహసము! వరరుచి చెప్పిన పైశాచీ లక్షణములను వాల్మీకి పైశాచీ చూళికా పైశాచీ భాషలనుగా విభజించి వచించెను.

“గ—జ—డ—ద—బ—ఘ—ఝ—ఢ—ధ—భాం—క—చ—ట—త—ప ఖ ఛ-ఠ-థ-ఫాల్ (౩—౨—౬) (వృత్తి.) చూళికా పైశాచ్యాం గాదీనాం యథా సంఖ్యం కాదయో భవన్తి. లిత్త్వా న్నిత్యమ్. ఉదా:—మార్గణః=మక్కనో. నగః=నకో...” (షడ్భా—౧౯౨ పుట).

వాల్మీకి సూత్రములకన్న వరరుచి సూత్రము లెక్కుడు ప్రామాణి కములని నిరసించి రేకాని “సయ్యాటము” అనునది కుదురుటకై వాల్మీకిమార్గము

ననుసరించియే వీరీ క్రిందిరీతి నుదాహరించిరి. 'జ్ఞ' కారము 'ఞ్జ' కారమగునని వరరుచి చెప్పెనుగాని 'ఞ్ఞ' కారమగునని చెప్పలేదు "జ్ఞస్య ఞ్జః" (వృత్తి) 'జ్ఞ' ఇత్యస్యస్థానే 'ఞ్జ' ఇత్యయ మాదేశో భవతి. ఉదా:—విజ్ఞాతః=విఞ్జాతో. సర్వజ్ఞః = సవ్వఞ్జో (వరరుచి ప్రాకృత ప్రకాశము ౧౦ ప్రక. ౯ సూ.). ఈ పద్ధతిని సంజ్ఞాశబ్దమునుండి 'సంయాట=సయ్యాట' అనెడి వీరు ముందుదాహరింపఁబోవునది సిద్ధింపదు గదా.

౯. III విష:—ద్రావిడభాషలందుఁ బైశాచీ లక్షణములు గలవనుచు విమర్శసహములు కాని కొన్ని యుదాహృతులను డా. నారాయణరావుగా రొసంగిరి. "సంస్కృ—జ్ఞ = పైశా—ఞ్ఞ. ప్రజ్ఞా=పఞ్ఞా. తెల్గున పైశాచి లోని 'ఞ్ఞ' అనునది "ంయ=య్య" లుగా మాఱినది. సం—సంజ్ఞా=పైశా—సంఞ్ఞా. తెల్గు—సంయా (ట)=సయ్యాట" (ఆం. భా. చ. ౫౬౦ పుట) ఇది సరికాదు. 'సయ్యాట' శబ్దార్థమున సంజ్ఞా శబ్దార్థ ప్రసక్తియే లేదు.

"సయ్యాట—ద్వా—వి. (సయి+ఆట) ౧, సహక్రీడ. సీ—ఆమని తోడి సయ్యాటకై యచ్చోటి కరుగుదెంచిన కాన సిరియనంగ (య యా—౩ ఆ)... క. శయ్యకుఁ దార్చి యనంగుని । సయ్యాటపుఁ జిట్టకంపుఁ జదురుల కపుడా । యయ్య దొరకొని (రామాభ్యు ౪ ఆ)......" (శ—ర), "విజ్ఞానము=విన్నాణము. విజ్ఞప్తి=విన్నపము. సంజ్ఞ=సన్న" అను రీతిని ప్రాచీనాంధ్రమున 'జ్ఞ' అనునది 'న్న' అని మాఱుట సంప్రదాయముగాని 'సంజ్ఞ=సఞ్ఞ=సయ్య' అని మాఱుట యాంధ్రభాషా సంప్రదాయముకాదు. తుది కర్వాచీనతద్భవము "సంజ్ఞ=సయిగ=సైగ" అగుట దెలుఁగునఁ గలదుగాని 'జ్ఞ' అనునది 'ఞ్ఞ' =య్య' అని యగుట తెలుఁగు సంప్రదాయముకాదు. మఱియు జ్ఞాకు 'ఞ్ఞ' అని వచ్చుట పైశాచీ లక్షణముగాని 'య్య' వచ్చుట పైశాచీ స్వభావము గాదు. తెలుఁగున 'ఞ' కారమే లేదు. ఇతర ద్రావిడభాషలందుఁ బైశాచీ లక్షణముల లేశమేని వీరిచేఁ జూపఁబడలేదు. పైశాచియం దెల్లెడలను 'జ్ఞ' అనునది 'ఞ్ఞ' అని కాని వరరుచి చెప్పినట్లు 'ఞ్జ' అని కాని మాఱుట సంప్రదాయము. తెల్గున ప్రాచీనాంధ్రమున—'జ్ఞ' అనునది 'న్న = న' అని మాఱుట సంప్రదాయము. ఉదా:—సంజ్ఞ=సన్న, ఆజ్ఞ=ఆన. విజ్ఞానము=విన్నాణము.

"సంస్కృ—న్య—ణ్య=పైశా—ఞ్ఞ. సంస్కృ—కన్యకా=పైశా—కఞ్ఞకా ......" (ఆం. భా. చ. ౫౬౧ పు.) "న్య—ణ్య—జ్ఞా—ఞ్ఞః (౩—౨—౪౪) పైశాచ్యా మిత్యనువర్తతే. (వృత్తి) న్య—ణ్య—జ్ఞ ఇత్యేతేషాం పైశాచ్యాం

ఇకారో రిద్భవతి—రిత్త్వా ద్విత్వమ్. ఉదా:—ధన్యః=ధఞ్ఞో—కణ్యాః=కఞ్ఞో. ప్రాజ్ఞః=పఞ్ఞో" (షడ్భా—౧౮౮) ఈ విధి పైశాచిలో సార్వత్రికము. తెల్గునం దిట్టి మార్పులేదు. 'కన్యకా' అనుసది "కన్నియ=కన్నె" అని తెల్గున నగును గాని "కఞ్ఞకా—(లేదా) కయ్యకా" అని కానేరదు గదా. ఇతర ద్రావిడభాష లందును నిట్టి మార్పులేదు.

"సంస్కృ. ణ=పైశా-న. సంస్కృ—గుణగణ యుక్తః=పైశా-గునగ నయుత్తో....... తెనుఁగున నీ లక్షణము సంపూర్ణముగ నున్నది. మహారాష్ట్రీ ప్రాకృతమునందును తమిళ కన్నడములందును 'ణ' కారముండెడి యనేక పదములు తెలుఁగున 'న' కారముతోఁ గాన్పించుచున్నవి....సంస్కృ-గుణ= తెల్గు-గొనము.........కన్న—కణ్ణు—మణ్ణు=తెల్గు—కన్ను—మన్ను." (ఆం. భా. చ. ౫౬౧ పుట). తమిళ కన్నడాదులలో నిట్టిమార్పు లేనపుడొక్క తెల్గున నున్నంత మాత్రమున నిది పైశాచీ లక్షణములు ద్రావిడ భాషలందుఁ గలవను సిద్ధాంతము నెట్లు నిర్వహింపఁ గల్గును. మీఁదుమిక్కిలిగఁ దమిళ కన్నడములలోని ణకార బాహుళ్యమునఁబట్టి పైశాచీ స్వభావము ద్రావిడ భాష లందు లేదనియుఁ జెప్పుట కవకాశము గల్గుచున్నది.

"నో ణనోః పైశాచ్యామ్" (3-౨-౭3) (వృత్తి) పైశాచ్యాం భాషాయాం ణకార నకారయోః స్థానే నకారో భవతి. సంస్కృ-రామేణ=పైశా. రామేన." (షడ్భా-౧౮౮ పుట). ఇట్లీవిధి పైశాచిలో సార్వత్రికము-ద్రావిడ భాషలలోని తమిళ కన్నడాదులలో లేనేలేదు. తెల్గునఁ గలదు గాని తెల్గునందును ణకార ఘటిత శబ్దములు—జాణ—గాణ—కాణాచి—లెక్కకు మీఱియున్నవి. విజ్ఞాన శబ్దములోని 'న' కారము విరుద్ధముగ 'ణ' కారమగుచున్నది. (విన్నాణము) ఇట్టి స్థితి నరసినపుడు తెల్గులోని కొన్నియెడల 'ణ' కారము 'న' కారముగా మాఱుట యాదృచ్ఛికమనియుఁ గారణాంతర జన్యమనియుఁ జెప్పవచ్చునే కాని యది పైశాచీ స్వభావమని యెట్లు విశ్వసింపనగును?

ఈ సందర్భమున వీరెన్నో యకించిత్కరములగు మార్పులను జూపిరి. కాని యేదియు పైశాచీ స్వభావము ద్రావిడ భాషలందుఁ గలదని విశ్వసింపఁ జేయునది కాదు.

"పైశాచ్యాం రణయో ర్లనౌ (చండ-3 విధా ౭౨ సూ) పైశాచ్యాం రేఫస్య లకారో భవతి-ణకారస్య నకారః...రాక్షసాః=లక్షసాః".

"రో లస్తు చూళికా పైశాచ్యామ్ (3-౨-౬౭). చూళికా పైశాచ్యాం రేఫస్య లో వా స్యాల్-రామో=లామో" (షడ్భా-౧౯౨ పు) ఇట్టి పైశాచీ సార్వత్రిక స్వభావ మొక్కటేని ద్రావిడ భాషలలోఁ జూపట్టదు.

“ప్రాయోలుక్కాది ఘల్ పట్ ఘమ్యన్త సూత్రోక్తమ్. (3-౨-౬3)= (వృత్తి)=ప్రాయోలుక్కేతి సూత్ర మారభ్య ఘల్ పట్ ఘమ్యన్త సూత్ర పర్యన్తం యేవిధయః ప్రాకృతే తే పైశాచ్యాం న భవన్తి, ఇతి కాదిలోపాద్య పవాదః, వకో—భాగో—కుచో—గజో—ఇత్యాది.” (షడ్భా ౧౯౦ పు.) ౧-3-౮ సూత్రము మొదలు ౧-3-౯౦ సూత్రము వఱకుఁ గల విధులు పైశాచియందు వర్తింపవని భావము.

అవి యెవ్వియనఁగా:—“ప్రాయోలుక్ గ చ జ త ద ప య వా మ్ “(౧-3-౮) అసంయుక్తానా మనాదౌ వర్తమానానా మచః పరేషాం కాదీనాం సర్వేషాం ప్రాయోలుక్స్యాత్......” “యశ్రుతి రః (౧-3-౧౦)=ప్రాయోలు గిత్యాదినా కాదీనాం లోపే సతి యోఽవశిష్యతే అవర్ణ స్సః అవర్ణాత్పరో లఘు ప్రయత్నతర యకార శ్రుతి ర్భవతి...ఆతపః = ఆ అపో=ఆయపో.”

“పో వః-(౧-3-౫౫)=అసంయుక్త స్యానాదౌ వర్తమానస్య అచః పరస్య పస్య వ స్స్యాత్...ఆయవో” (“ఆతపః” అను చోటి పకారము-“నాత్పః (౧-3-౯)=అవర్ణా త్పరస్య పకారస్య లో పో న భవతి” అను చొప్పున “ప్రాయోలుగి” త్యాది. సూత్రముచే లోపింపదని యెఱుంగునది).

పయి ప్రక్రియ చొప్పున “క గ చ జ త ద ప య వ ల లోపము, స్వరసంహితా యకారము, పకారము వకార మగుట, మున్నగు ప్రాకృత విధులెవ్వియుఁ బైశాచీ ప్రాకృతమునఁ గల్గనేరవని పై నుదాహరించిన “ప్రాయోలుక్కాదీత్యాది సూత్రమునకుఁ దాత్పర్యము. ఈ విధులెల్ల ద్రావిడ భాషలలో సహజముగా వర్తిల్లును. స్వరసంహితా యకారము తమిళ మలయాళ కర్ణాటాంధ్రములందుఁ సుప్రసిద్ధము. (చూడుఁడు. ౨౯ ౨౯ IV ౨౯ VII ౨౯ VIII విష) పకారము వకారమగుట ద్రావిడభాషలందుఁ బ్రసిద్ధమే. ఉదా:—తమిళు-ప్=వ్-భవిష్యదర్థక. తెల్గు-గ స డ ద వా దేశము—తెల్లవాఱు-మొ. కన్న-స్వర య-వ లేభ్యో బహుళం వః పవర్గస్య. (కర్ణా. భూ. 3౧ సూ.) పొసతు=పొస+పెసర్=పొసవెసర్. మొ.

ఇఁకఁ దెల్పిన “క” కారాదిలోపమును సచట యకారాగమమును గల పెక్కు రూపములు పైశాచీ విరుద్ధములు వెలయుచున్నవి. ఉదా:—ఘటిక=గడియ. దీపిక=దీవియ. దీర్ఘిక=డిగ్గియ. మల్లిక=మల్లియ. పేటిక=పేటియ=పెట్టియ=పెట్టె. మౌక్తికము=ముత్తియము. ఛురిక=చురియ. వీటిక=విడియము. వర్ణిక=వన్నియ. మాలిక=మాలియ. . వీణిక=వీణియ భూమిక=బూమియ. పుత్రిక=బొట్టియ. మృత్తిక=మట్టియ. కన్యక=కన్నియ. కటక=కడియము. కుంచిక=కుంచియ, కంఠిక=కంటియ. కోకిల=కోయిల, ఘటీకార=గడియారము. మరీచ=మిరియము. ఛింఛిక=పించియము. దైవము=దయ్యము.

ఇంతయేల! ద్రావిడభాషలందు శషలకు సా దేశము సుప్రసిద్ధము. అట్టి యా దేశము సైతము పైశాచీ స్వభావ విరుద్ధము. ఇతర ప్రాకృత సమ్మతము.

"శో స్సల్. (౧-౩-౮౭) శో శ్శషసానాం సకారో లిత్ స్యాత్—" ఈ సూత్రము సయితము ౧-౩-౯౦ సూత్రము వలనఁగల పైశాచియం దుండరాని విధులలోనిదే కదా. ఇట్లే ద్రావిడభాషలలోఁ బ్రసిద్ధములగు నీ క్రింది ప్రాకృత విధులు సైతము పైశాచీ విరుద్ధములె.

టో డః (౧-౩-౩౧)=అస్తో రఖో రచః పరస్య టస్య డ స్స్యాత్—(ఘటిక=గడియ). ఆదే ర్జః. (౧-౩-౨౪) య ఇత్యనువర్తతే. ఆదే ర్యస్య జః స్యాత్—(యమ=జెముఁడు). ఇట్టివి పెక్కు. విస్తర భీతిని విరమించుచున్నాను.

౯. IV విష:—"గుణాఢ్యుఁడు బృహత్కథను బైశాచీ భాషయందు వ్రాసియుండె నను ప్రతీతియందు సత్యమున్నచో నాంధ్రభాష పైశాచీ భాషావిశేషమై యుండవచ్చును" (ఆం. భా. చ. ౩౨ పు).

డా. నారాయణరావుగారి తాత్పర్యము:—ఆంధ్రరాజగు శాతకర్ణిపాలనమున నున్న ప్రతిష్ఠాన నగరమున వసించు గుణాఢ్యుఁడు బృహత్కథను బైశాచీ భాషతో రచించె ననుటచేత నట్టి పైశాచీభాష యాంధ్రభాషయె యగునని వీరి యాశయము. ఈ విషయమున నాంధ్రభాషావికాసమున నీ క్రింది రీతిని వ్రాయఁబడెను.

"ఆంధ్రరాజగు శాతకర్ణి పాలించిన ప్రతిష్ఠాన నగరమున గుణాఢ్యుఁడు జనించుటవలనను నేఁటి తెనుఁగు భాష కాంధ్రమని పేరుండుటవలనను పైశాచీ భాషకును దెనుఁగు భాషకును సంబంధము గలదని భ్రాంతి గలుగుట కవకాశముండును" (ఆం. భా. వి. ౮౦ పుట) గుణాఢ్యుఁడు బృహత్కథను రచించిన విషయ మాంధ్రభాషా వికాసమున ౭౫ మొ. ౮౦ పుటలలో విపులముగా వ్రాయఁబడెను. గుణాఢ్యుఁ డాంధ్రరాజగు శాతకర్ణిపాలనములో నున్న మహారాష్ట్రదేశములోని ప్రతిష్ఠాననగరమున వసించువాఁడు. అతఁడు బృహత్కథను వ్రాసిన భాష కాశ్మీరాది దేశములం దపుడు వ్యవహృతమగుచున్న పైశాచీ ప్రాకృతభాష. అట్టి భాషకుఁ దావలమైనది దరదదేశము. కానఁ బైశాచీ భాషాభేద మాంధ్రమనుకొనుట భ్రాంతి మూలకము.

౧౦. I విష:—నేఁటి పరిశోధకులెల్లఁ దమ యభిప్రాయమునకు విరుద్ధముగనే వ్రాసియు వ్రాయుచును నుండుటచేత డా. నారాయణరావుగా రీ క్రింది రీతిని వ్రాయుచువచ్చిరి.

"నా గురువుగారగు మహారాజశ్రీ రావుసాహెబు గిడుగు రామమూర్తి పంతులుగారు......ఆంధ్రభాషను గూర్చి వారికంటె నెక్కుడు కృషి

చేసినవారు లేరు. వారే యీ యాంధ్రభాషాచరిత్రమును వ్రాయుటకు నర్హులు ......రామమూర్తి పంతులుగారికిని నాకును బ్రధాన విషయమగు ద్రావిడ భాషలకును నార్యభాషలకునుగల సంబంధమును గూర్చి యభిప్రాయభేదము గలదు. నా వాదమును వా రంగీకరింపరని నాకుఁ దెలియును......అనేకులు నా యభిప్రాయముతో నేకీభవింపరని నాకుఁ దెలియును" (ఆం. భా. చ. పీఠిక XXI పుట).

"నేఁటి పరిశోధకులు రెండవ కారణమును దెలుపుచు ద్రావిడభాషల నార్యభాషలనుండి ప్రత్యేకించుచున్నారు. వారట్లు చెప్పుటకుఁ బ్రాచీన ప్రాకృత భాషలు ప్రచారమునందున్న కాలమునకే ద్రావిడభాషలు నేఁటి రూపమునఁగాని తత్తుల్యరూపమునఁగాని యుండెనని నిరూపింపవలసియున్నది. ప్రాచీన ప్రాకృత భాషల కాలమునకు నేఁటి రూపమున ద్రావిడ భాష లుండెనని చూపుట కెట్టి నిదర్శనములును లేవు." (ఆం. భా. చ. ౬౫ పుట).

ఇట్టి వ్రాఁతలనుబట్టి ప్రాకృతభాషలు ప్రచారములోనున్న కాలమున నుత్తర హిందూదేశమునందువలెనె దక్షిణ హిందూదేశమందును బైశాచీ ప్రాకృతభేదములగు ద్రావిడీ ప్రాకృతములనెడి దాక్షిణాత్య ప్రాకృతభేదములె వ్యావహారికభాషలై యుండెడివనియుఁ దర్వాత నుత్తర హిందూస్థానస్థిత ప్రాకృతములనుండి నేఁటి హిందీ మరాటీ ప్రభృతులేర్పడినట్లే ద్రావిడదేశ వ్యవహారస్థిత ప్రాకృతములనుండి తమిళ కర్ణాటాంధ్రాది ద్రావిడభాషలును నేర్పడినవనియు డా. నారాయణరావుగారి యభిప్రాయము విశదమగుచున్నది. కాని నేఁటి యుత్తర హిందూస్థానభాషలతో ద్రావిడభాషలకు సామ్యము చూపుట కేవలము ననుపపన్నము, ఉత్తర హిందూస్థానగతములగు మాగధీ ప్రభృతిప్రాకృతము లపభ్రష్టములయి నేఁటి హిందీ ప్రభృతులుగ నేర్పడిన చరిత్రము దెలియుట కాధారములు లేవు. క్రీ. శ. పండ్రెండవ శతాబ్దము వఱకును నుత్తర హిందూస్థానభాషల చరిత్ర మెవ్వరికిని దెలియదు. ద్రావిడ భాషలన్ననో! దక్షిణ హిందూస్థానమున క్రీ. పూ. నాలుగయిదు శతాబ్దముల నుండియు వెలసియున్నట్లు నిదర్శనములు గలవు. డా. నారాయణరావుగారే యీ విషయముల నంగీకరించియున్నారు.

"క్రీ. పూ. 3-వ శతాబ్దమునుండి క్రీస్తుశకము ౫-వ శతాబ్దమువఱకును భారతదేశమంతటను బ్రాకృతభాషలు ప్రచారమందుండినట్లు మనకుఁ దెలియును. నాటనుండి ౬—౭ శతాబ్దములవఱకు దక్షిణ హిందూదేశమందును ౧౨-వ శతాబ్దమువఱకును తక్కిన భారతవర్షమునందును ప్రచారమునందుండిన భాషలస్వరూప మెట్లుండెనో తెలిసికొనుట కాధారములు లేవు. అట్టి సందర్భ

మున ద్రావిడభాషల మూలమునఁ బ్రాకృతభాషలును నేఁటి యార్యభాషలుఁ
గలిగినవని యూహించుట సమంజసముకాదని తోఁచుచున్నది." (ఆం. భా. చ
౬౬ పుట).

ద్రావిడభాషలనుండి ప్రాకృతభాషలును నేఁటి యార్యభాషలును గ
గినవని యెవ్వరును నూహింపలేదు. అన్యోన్య సంపర్కమున నొక తె
స్వభావములు మఱొక తెగయందు సంక్రమించినవని మాత్రమె నేఁటి పరిశో
కుల యాశయము.

౧౦. II విష:—"ఇండియా దేశపు భాషలలో లిఖితరూపమున నున
వానిలో సంస్కృతము తఱు (రు?) వాత ప్రాకృతములు మొదటివి.
తఱువాత లిఖితములయిన భాషలు ద్రావిడభాషలు. తమిళములో ౫ లేక
శతాబ్దమునుండియు గ్రంథములు కాన్పించుచున్నవి. అంతకుఁ బూర్వమే య
భాషయందు గ్రంథములున్నవని కొందఱందురు. కాని తగిన నిదర్శనము
లేక పోవుటచే నా యూహ నేఁడు విడనాడఁబడుచున్నది. తమిళవ
తఱువాత లిఖితమైనభాష కన్నడము (౭-వ శతాబ్దము) తఱువాత లిఖితమైన
తెనుఁగు. (౯-వ శతాబ్దము) తక్కిన భారత వర్షీయభాషలన్నియుఁ బదునొకండ
శతాబ్దమున కీవల గ్రంథస్థములైనవె. వానిలోఁ బశ్చిమ హిందీభాషా భేదవ
లగు 'బందేలీ' (౧౨-వ శతాబ్దము) మళయాళము (౧౩, ౧౪-వ శతాబ్దము
బంగాళీ (౧౪-వ శతాబ్దము) కాశ్మీరి (౧౪-వ శతాబ్దము). పంజాబీ (౧౫-వ శత
బ్దము). గుజరాతి (౧౫-వ శతాబ్దము) మైథిలీ (౧౫-వ శతాబ్దము) అస్సామి
అవధీ లేక కోసలీ (౧౬-వ శతాబ్దము) బఘేలీ (౧౫౬౩. క్రీ.) ఒఱియా (౧౭-
శతాబ్దము) ఖస్కుర (లేక) నేపాలీ (౧౭-వ శతాబ్దము) కనౌజీ (౧౭-వ శతాబ్దమ
సింధీ (౧౮-వ శతాబ్దము) కుమానీ (౧౭౯౦. క్రీ.) గాఢ్వాలీ (౧౮౭౬). ఆయ
భాషలలో నాయా కాలములందు ప్రథమ గ్రంథములు వెలువడినట్లు తెలిం
వచ్చుచున్నది. అంతకుఁ బూర్వము వాని స్వరూప మెట్లుండెనో తెలిసికొను
కాధారములు లేవు." (ఆం. భా. చ. ౬౫ పుట).

౧౦. III విష:—తెలుఁగు ౯ శతాబ్దమున లిఖితావస్థనందె ననుట స
కాదు. ఆంధ్రభాషాచరిత్రమందె, క్రీ. శ. ౬౩౩ సంవత్సరపు జయసింహవల్లభు
శాసనము, క్రీ. శ. ౬౭౫ (సుమారు). లక్ష్మీపురశాసనము మున్నగు తెలుఁగ
శాసనము (ఆం. భా. చ. ౧౩౦౭ మొ. ౧౩౧౨ పుటలలో) లుదాహరింపఁబ
యున్నవి. ఆంధ్రభాషా చరిత్ర ౬౫ పుట వ్రాయునాఁటి కవి గ్రంథకర్తగా
లభింపలేదేమో?

ద్రావిడభాషలు దక్షిణ హిందూస్థానమున వెలసిన ప్రాచీనతను గూ
కాల్డువెల్లుగారు వ్రాసిన విషయములు ముందుదాహరింపఁబడును. వా

మాట యట్లుండఁగా డా. నారాయణరావుగారే స్వవాదమును ద్రోసిపుచ్చు విషయములను బైరీతిని వ్రాసిరే! "ప్రాకృతభాషలు ప్రచారముననున్న కాలముననే ద్రావిడభాషలు నేఁటి రూపమునఁగాని తత్తుల్య రూపమునఁగాని యుండెనని నిరూపింపవలసియున్నది" (ఆం. భా. చ. ౬౮ పుట). అని కదా వారు కోరిరి. ప్రాకృతములు ౫ శతాబ్దము వఱకుఁ బ్రచారములో నున్నవనియుఁ దమిళ వాఙ్మయము ౫ లేక ౬ శతాబ్దమునుండి యారంభించి వెలసి యున్నదనియు వారే పయిరీతిని వ్రాసిరి (ఆం. భా. చ. ౬౫ పుట). వారన్నట్లు తమిళ గ్రంథములు—(వానిలో మొదటి తొల్‌కాప్పియము) తుదికి ౬ శతాబ్దము నుండియు వెలసియున్నపు డంతకుముందెన్నో శతాబ్దముల క్రిందట ద్రావిడ భాషలు పరస్పరము చీలి ప్రత్యేక స్వరూపముతో వ్యవహారమున నుండి యుండె ననుటలో సందియ ముండదుగదా. పండ్రెండవ శతాబ్దము వఱకును వాని స్థితికి నిదర్శనములులేని యుత్తర హిందూస్థాన భాషలతో ద్రావిడ భాషలకు సామ్యము చూపుట యర్థమా?

పైరీతి నిచట (ఆం. భా. చ. ౬౫ పుట) ౫ లేక ౬ శతాబ్దమునుండి తమిళ మున గ్రంథములు కాన్పించుచున్నవని వ్రాసిన డా. నారాయణరావుగారే స్థలాంతరమున—'ఆం. భా. చ.' ౫౫౯ పుటలో నాఱవ శతాబ్దమునుండి తమి ళాదులుప్రత్యేక రూపమును దాల్చినట్లే క్రిందిరీతిని వ్రాయుట కేవలము నయుక్తము.

"సంస్కృతమునకుఁ బూర్వమే యీ దేశమున నెలకొన్న పైశాచీ భాషలు (ప్రాకృతములు) వ్యవహారమున ననేకములుగ నుండినవి. వీనికిని దత్తత్ప్రాంతములందుండిన యితర ప్రాకృతములకును గలిగిన సంపర్కమువలన నాధునిక యుగమున ననఁగా క్రీ. శ. ౬ శతాబ్దము నుండియుఁ గ్రొత్త దేశ భాష లుదయింపఁజొచ్చినవి." (ఆం. భా. చ. ౫౫౯ పుట).

మఱియు నాంధ్రాక్షర వికాసపు పటమున (ఆం. భా. చ. ౧౮౮ పుట). నాల్గవ శతాబ్దముననే వేంగీ లిపియనెడి యాంధ్రలిపి యేర్పడినట్లు వ్రాసిరి. నాల్గవ శతాబ్దముననే యాంధ్రముననే లిపి యేర్పడినపు డింక ద్రావిడభాషల ప్రత్యేకత యెన్నిశతాబ్దములకుఁ బూర్వకాలమున నేర్పడియుండును? నన్నయకుఁ బూర్వకాలపు తెనుఁగు స్థితిని వివరించు సందర్భమున వీరు ౬౩౩ (క్రీ. శ.) సంవత్సరమునందలి తెలుఁగు శాసనము నుదాహరించియున్నారు గదా.

మఱియుఁ దొల్కాప్పియమువంటి విశాల తమిళ వ్యాకరణము ౬ శతాబ్దము నాఁటిదని యంగీకరించినను నంతకు ముందటి సంఘ వాఙ్మయ

మెప్పటిది? ఇట్టి, వాఙ్మయావస్థకుఁ బూర్వము భాష యెంతకాలము కేవల వ్యావహారికావస్థలో నుండియుండును? నిరూపింపశక్యము కాదనఁదగునుగదా!

౧౧. విష:-కాల్డువెల్లుగారు చెప్పిన ద్రావిడభాషల ప్రాచీనత:—"తమిళ నాగరకతయు వారిభాషయొక్క గ్రాంథికతావస్థాంకూరములును క్రీ. పూ. ౬-౭ శతాబ్దములనుండి యారంభించియుండునని యూహింపనగును. ప్రాచీన ద్రావిడ భాషనుండి యాంధ్రాది మాండలిక భాషలెప్పుడు చీలినవో చెప్పశక్యముకాదు. క్రీ. పూ. ౬-౭. శతాబ్దములకుముందే చీలియుండవచ్చును."—(కాల్డు. పీఠిక ౧౦౫ పుట).

"ద్రావిడభాషలు దేనికదే ప్రాచీనమని తోఁపించు నిదర్శనములు గలవు." (కాల్డు. పీఠిక ౭౮ పుట).

"క్రీ. శ. ౪౫౯ మొ. ౪౭౭ ప్రాంతములోనిదగు మహావంశమనెడి సింహాళ గ్రంథమునుబట్టి (సింఘాలీభాష) విజయుఁడను తేని యాధిపత్యమునఁ గొందఱు మాగధులు బౌద్ధమత స్థాపనమునకై సింహాళమునకు క్రీ. పూ. ౫౫౦ సంవత్సరము ప్రాంతమున వచ్చిరనియు నట్లు వచ్చునపుడు దక్షిణ హిందూ స్థానమునఁ గొందఱు నిల్చిరనియుఁ, బాండ్య చోళాదులు సింహాళముపై దండెత్తుచు వచ్చిరనియు విశదమగుచున్నది." (కాల్డు. పీఠిక ౧౧౯-౧౧౫-౧౧౬ పుటలు).

"గ్రీకు మున్నగు యూరపు భాషలలో "అరిసి"=(తమిళ శబ్దము)= "ఒరుజ" (గ్రీకుశబ్దము) అను రీతిని ననేక శబ్దములకు సామ్యమున్నదనియు నయ్యది 'క్రీ. పూ.' వేయియేండ్ల క్రిందటి యరేబియనులు యూరపున కెగుమతి చేసిన వర్తకము సందర్భమున సంభవించి యుండుననియు నక్కారణమున నప్పటికే తమిళము వెలసియుండె ననఁదగుననియు వ్రాసిరి" (కాల్డు. పీఠిక ౯౦ పుట).

కాల్డు. పీఠిక ౭౪ పుటలో మధ్యాసియాలోనె ద్రావిడభాష లనుపేరితో నున్న కొన్ని భాషలు సిథియను భాషాకుటుంబమునుండి చీలినవని వ్రాయఁబడెను. ౮ IV. విషయమునఁ జూపఁబడిన పాశ్చాత్యములగు నిండోయోరపియను భాష లోని గ్రీకుప్రభృతులతోడి సంబంధమునుబట్టియు ద్రావిడులు మధ్యాసియానుండి రాకముందే ద్రావిడ భాషలు ప్రత్యేకముగ నేర్పడి యుండెనని విశదమగును.

౧౨. I:—డా. నారాయణరావుగారి వాదముయొక్కయు డా. కాల్డు వెల్లు గారి వాదముయొక్కయు వైఖరులు విశదపడుటకయి యింతగా వ్రాయఁ బడెనుగాని ద్రావిడభాష లిండోయూరపియను కుటుంబములోనివి కావనియు నార్యభాషలకు భిన్నకుటుంబములోనివనియు నిర్ణయించుట కింతగా వ్రాయనేల? ఏవోకొన్ని సామ్యములును శబ్దజాలము నెరవు దీసికొనుటయు మున్నగునవి యేక కుటుంబితను నిర్ణయింపఁ జాలవు. దైనందిన వ్యవహారములం దత్యావశ్యకము

లగునట్టి—ఒకటి - రెండు - మూఁడు - నాలుగు- మున్నగు సంఖ్యా వాచకము లందును, 'వాఁడు వీఁడు-అది-ఇది-ఆ-ఈ-ఊ-ఏ-నీ-నా-తా-మన'-మున్నగుసర్వ నామము లందును, ముక్కు-కన్ను - చెవి - కాలు-చేయి - నోరు - తల్లి- తండ్రి- మున్నగు వ్యవహారోపయోగి దేశ్యములందును-వచ్చు-పోవు-కను-తిను-విను- మొదలగు నత్యావశ్యక వ్యవహారోపయోగి దేశ్యక్రియలందును గారకములు, విభక్తి ప్రత్యయములు, వాక్యరచనా పద్ధతులు మున్నగు ముఖ్యవ్యాకరణ కార్యము లందును నింకను నిట్టి యత్యావశ్యకవ్యవహారోపయోగి శబ్దాదులందును వేనికిఁ బరస్పర సామ్యములుండునో యట్టివానికే యేకకుటుంబిత యంగీకార్య మనునది సకలభాషాచరిత్ర శాస్త్రజ్ఞుల సిద్ధాంతము. అట్టి వానియందు ద్రావిడ భాషలకును నార్యభాషలకును సామ్యము లేకుండుటంజేసి ద్రావిడభాష లార్య భాషా కుటుంబములోనివి కానేరవు. (చూడు. ౧౦౫ విష. V సంఖ్యావాచక ప్రకరణము.)

"సంస్కృత పండితులును వారి మాటలను విశ్వసించు మొదటి పాశ్చాత్య పండితులును (అనుబంధము) నుత్తర హిందూస్థాన భాషలకును దక్షిణ హిందూస్థాన భాషలకును నెంతటి భేదమున్నను నీ రెండు తెగలును దుల్య ముగ సంస్కృత జన్యములె యని యంగీకరించిరి. . . పోపు-కోల్‌బ్రూకు-కారీ- విల్కి-ను-మున్నగువారు ద్రావిడభాషలకు సంస్కృతజన్యత్వము నంగీకరించినను నది కేవలము నిరాధారము. వీరు ద్రావిడభాషావేదులు కారు. తులనాత్మక భాషాశాస్త్ర పద్ధతుల నేమేని యెఱింగినవారు ద్రావిడశబ్ద కోశములను వ్యాకరణ

---

అనుబంధము ౧౨ I విష:—కాల్డువెల్లుగారు మున్నగు పాశ్చాత్యులకును దదనుయాయు లగు నాంగ్ల భాషాభిజ్ఞులగు కొందఱు తెల్గువారికిని నిట్టి యపరిశీలన కృతాభిప్రాయము విస్తరిల్లి యున్నది. "ఆద్యా ప్రకృతిః ప్రకృతి శ్చాద్యే। ఏషా తయో ర్భవే ద్వికృతిః" (చూ. ఆం. చిం.) (వ్యా. సం. ౧ VI విష) అనుకారిక వీరి నిట్లు భ్రమపెట్టుచున్నది. ఇందలి వికృతిశబ్దము జన్య జనకభావరూప ప్రకృతి వికృతిభావపరము కాదు. అయ్యది "ప్రకృతివ ద్వికృతిః" అను మీ మాంసాన్యాయప్రసిద్ధ వికృతి పరము. (చూ. వ్యాసం. ౧ VI విష. వై—పా—౩౮—౪౪ విష.)

"ప్రకృతివ ద్వికృతి రితిన్యాయే నానుక్తస్య కార్య స్యాత్ర తాభ్యాం ప్రాప్తి రిత్యాచార్యా శయః" (ఆహా ౧౨౦ పుట).

"ప్రకృతిద్వయజా తజ్జా। తుల్యాతు సమా ప్రవాహినీ దేశ్యా" (ఆం. చిం.) (వ్యా. సం. ౫౯- విష) అని యిట్లు తత్సమ తద్భవములు మాత్రమె సంస్కృత ప్రాకృత సంబంధులనియు దేశ్యము లోక వ్యవహార ప్రవాహసిద్ధమనియుఁ గంఠోక్తముగ నుపదేశించిన నన్నయభట్టారకుఁడు తెల్గు సాక ల్యముగ సంస్కృత ప్రాకృతజన్యమని చెప్పెననుచుఁ దిరస్కరించుట యర్హమా?

హేమచంద్రుఁడను పండితుఁడు సైతము దేశ్యము స్వతంత్రమని యిట్లు కంఠోక్తముగ వచించెను "దేశ్య మార్షంచ రూఢత్వాత్ । స్వతన్త్రత్వాచ్చ భూయసా । లక్ష్మ నాపేక్షతే తస్య సంప్రదాయో హి బోధకః ॥ దేశ్య మవ్యుత్పత్తిమత్త్వాత్ । ప్రాకృతత్వేన కథ్యతే ॥" (ఆహా ౧౨౭-పుట).

సంప్రదాయములను సంస్కృత శబ్దకోశములతోను వ్యాకరణ సంప్రదాయముల తోను బోల్చి చూచినవారు వానికి జన్యజనక భావము నంగీకరింపఁజాలరు. ......ఏదేని భాషయందు జీవకళ నాపాదించు "సంఖ్యావాచకములు సర్వనామములు వాక్యరచనా పద్ధతులు" అను విషయములలో ద్రావిడభాషలు ప్రత్యేకతను గల్గియున్నవి. కోశములందుఁ దత్సమ తద్భవరూప సంస్కృత శబ్దబాహుళ్యమున్నను స్వతంత్రములగు దేశ్యశబ్దముల తెగ వేఱుగ వీని కధికమై యున్నది." (కాల్డు. పీఠిక ౮౧-౮౨-౮౩ పుటలు). (చూడు. ౧౦౫ I విష.)

౧౨. II విష:—ఆర్యద్రావిడ భాషలందలి సంఖ్యావాచక సామ్యాభావము

| సంస్కృతము | హిందీ | తమిళము | హళగన్నడము | తెలుఁగు |
|---|---|---|---|---|
| ఏక | ఏక | ఒన్ఱు—ఒరు | ఒర్ | ఒరుఁడు—ఒక |
| ద్వి—ద్వయ | దో | ఇరణ్డు | ఎరడు | రెండు |
| త్రి | తీన | మూన్ఱు | మూఱు | మూఁడు |
| చతుర్—చత్వార | చార | నా—నాన్కు—నాల్వరు | నాల్కు | నాలుగు |
| పఞ్చ | పాంచ—పాఁచ | ఐన్దు = అఞ్జు | అయ్దు | ఏను—అయిదు—ఐదు |
| షట్ (ప్రాకృత. ఛట్) | ఛః | ఆఱు | ఆఱు | ఆఱు |
| సప్త | సాత | ఏఱు | ఏఱు | ఏడు |
| అష్ట | ఆఠ | ఎట్టు | ఎణ్టు | ఎనిమిది |
| నవ | నౌ | ఒన్బదు | ఒంభత్తు | తొమ్మిది |
| దశ | దస | పదు—పత్తు | పత్తు—పది | పది |
| | | | | (అనుబంధము) |

అనుబంధము ౧౨ II విష:—'అఞ్జు' శబ్దము 'పఞ్చ' శబ్దభవమని భ్రమింపరాదు. అది 'ఐన్దు' శబ్దమున కభిన్నము. సంస్కృతాకారసామ్యము ఘుణాక్షర న్యాయసిద్ధము. అట్లే 'ఎట్టు' శబ్దము 'అష్ట' శబ్దభవమని భ్రమింపరాదు. అది 'ఎణ్టు' శబ్దమున కభిన్నము. 'షట్' అను సంస్కృత శబ్ద 'ష' కారము ప్రాకృతమున 'ఛ' కారమైనది. "ఛల్—షట్ ఛమీ సుధా శాబ సప్తపర్ణే. (౧-౩-౯౦) శో రిత్యనువర్తతే. ఏషు శో శ్ఛత్వం లిత్. ఛణ్ముఖః = ఛమ్మూహో ......" (షడ్భా—౫౮-పుట) (శః = శషస).

తమిళ కన్నడములలోని 'ఒన్బదు—ఒంభత్తు' అనువానిలోని 'ఒన్' అనునది 'పదికొకటి తక్కువ' అను నర్థము నొసంగును. తెల్గునందలి 'తొమ్మిది' శబ్దములోని "తొ" అనెడి 'తొల' శబ్దభాగముచే 'పదికిఁ దొలుతటిది' అనఁగా బదికిఁ బూర్వపు సంఖ్య యనునర్థము లభించును. ఇట్లే 'ఎనిమిది' శబ్దము చోటను బదికి "ఎను = ఇను" రెండు తక్కువ సంఖ్యయని యర్థము నెన్నునది. (చూడు. ౯౭ II. ౧౦౦ I. ౧౦౨ II విష.).

## ౧౨ II విష:—ప్రశ్నార్థక 'కిం' శబ్దరూప పరంపరలో ద్రావిడ భాషలందు మచ్చునకేని సామ్యములేదు

| సంస్కృత | హిందీ | తెలుగు | తమిళము | హళగన్నడ |
|---|---|---|---|---|
| కిమ్ | క్యా | ఏమి | ఎవన్-ఎన్న-ఎన్ | ఏన్-ఏను |
| కిమ్—కః | కౌన | ఎవఁడు—ఏది | ఎవన్-యాదు | ఆవం |
| కదా | కబ | ఎపుడు | ఎప్పోలుదు | ఏగళ్ |
| కుత్ర | కహాఁ | ఎక్కడ | ఎఙ్గు | ఎల్లి |
| కిమ్—ధరా | కిధర | ఏవైపు | ఎవ్విడమ్ | ఆవెడె |
| కియత్—కియన్తి —కియన్తః | కితనా | ఎన్ని—ఎందఱు | ఎత్తనై-ఎనైవర్ | ఎనిత్తు-ఎనిబర్ |
| కతి | కఇ | ఎన్ని | ఎత్తనై | ...... |
| కుతః—కథమ్ | కౌసే | ఎట్లు | ఎఙ్ఙు-ఎప్పడి | ఎంతు |
| కిఞ్చిత్ | కుఛ | కొంచెము | కొఞ్చమ్ | కొంచ, ఇనిసు |
| కస్మిన్ | కిసమేం | దేనిమీఁద | ఎదన్ మేల్ | ఆవుదఱ మేలె |
| కేషు | కిసపర | దేనియందు | ఎవట్రిల్ | ఆవువఱల్లి |
| కస్మాత్ | కిససే | దేనికి వెనుక<br>దేనివలన | ఎదన్ పిన్<br>ఎదనాల్ | ఏతఱపింతె<br>ఆవుదఱత్తణిం |
| కేభ్యః | కిససే | ఎవరివలన | యావరాల్ | ఆవరిం |
| కస్మై | కాహేఁకో—<br>కాహేతియా | దేనికొఱకు | ఎదఱ్కు | ఆవుదర్కె |
| కాన్—కాని | కిసకో—కిన్హే | వేనిని | ఎదుకళై | ఆవువం |

## ౧౨ III విష:—ముఖ్య వ్యవహార శబ్ద సామ్యాభావము

| సంస్కృత | హిందీ | తెలుగు | తమిళము | హళగన్నడ |
|---|---|---|---|---|
| నాసిక | నాక | ముక్కు | మూక్కు | మూగు |
| కర్ణము | కాన | చెవి | చెవి-కాదు | కివి |
| హస్త | హాథ | చేయి | కై | కెయ్ |
| అక్షిన్ | ఆఖీ | కన్ను | కణ్ | కణ్ |
| అశ్రు | ఆసూఁ | కన్నీరు | కణ్ణీర్ | కణ్ణీర్ |
| నఖ | నఖ—నాఖూ | గోరు | ఉగిర్ | ఉగఱు |
| శిరస్ | సిర—సర | తల | తలై | తలె |
| పుచ్ఛ | పూఁఛ | తోఁక | తోకై | సోగ |
| జిహ్వా | జీంభ | నాలుక | నా-నాక్కు | నాలకె |
| ముఖ | మూహ | వాయి | వాయ్ | బాయ్ |
| దన్త | దాంత | పల్లు | పల్-పనె | పల్లు |
| ఓష్ఠ | హోఁఠ | ఔడు | ఉదడు-ఇదల్ | ఔండు |
| పృష్ఠ | పీఠ | వీఁపు | వెన్-ముదుకు | వెన్ |
| అఙ్గులీ | అంగులీ—ఉంగలీ | వ్రేలు | విరల్ | బెరల్ |

## ౧౨ III విష:—ముఖ్య వ్యవహారావశ్యక శబ్ద సామ్యాభావము

| సంస్కృతము | హిందీ | తెలుఁగు | తమిళము | హళగన్నడము |
|---|---|---|---|---|
| పితా | పితా | తండ్రి | తన్దై | తందె |
| మాతా | మాతా—మా | తల్లి | తాయ్-(తళ్ళై) | తాయ్. తంగెవిర్ |
| భగినీ | వహీన | చెలియలు | తఙ్గైమార్ | తంగెవిర్ |
| జామాతృ | దామాద | అల్లుఁడు | మరుమగన్ | అళియమ్ |
| పా—పిబ | పీ | కుడుచు | కుడి | కుడి |
| ఉత్తిష్ఠ | ఉఠ | లేచు | ఎఱు | ఏళ్ |
| పఠ | పఢ | చదువు | ఓదు | ఓదు |
| దృశ్ | దేఖ | కను | కాణ్ | కాణ్-నోడు |
| గచ్ఛ—గమ్ —జగామ | జా | పొమ్ము | పో | పోగు |
| ఆగత | ఆ | వచ్చు | వా | బర్ |
| కృ—కురు | కర | చేయు | చెయ్ | గెయ్ |
| దా—దదాతి | దే | ఇచ్చు (ఈ) | ఈ | ఈ |
| రా—లా | లా | తెచ్చు | తామ్-తా | తర్ |
| ఖాద | ఖా | తిను | తిన్ | తిన్ |
| మా | మత | వద్దు. (వేఁడము) | వేణ్డా | బేడ |
| శీఙ్—శయ్ | సో | ఒఱగు-(నిద్రించు) | ఉఱఙ్గు | ఒఱగు |
| శ్రు—శృణోతి | సున | విను | కేళ్ | కేళ్ |
| జ్ఞా—జానాతి | జాన | ఎఱుఁగు | అఱి | అఱి |
| కర్మ | కామ | పని | పణి | ...... |
| ఘర్మ | గరమ | వేఁడి | వెప్పమ్ | బేగె. బెంకి |
| సర్వ | సబ | అన్ని | అత్తనై | అనితు |
| మేళన | మిల | కలియు | కల | ...... |
| భణ—భాషణ | బోలో | మాటాడు | మాట్టమ్=(మాట) | మాతాడు |
| అభిఘార—ఘృత | ఘీ | నేయి | నెయ్ | నెయ్ |
| తైల | తేల | నూనె | ఎణ్ణెయ్ | ఎణ్ణెయ్ |
| దుగ్ధ | దూధ | పాలు | పాల్ | పాల్ |
| | | (అనుబంధము) | | |

అనుబంధము. ౧౨ III విష:—నిత్య ముఖ్య వ్యవహారమున కత్యావశ్యకములగు నిట్టి శబ్దములను బరిశీలించునపుడు ద్రావిడభాష నార్యభాషలలోఁ జేర్చు నభినివేశముగలవారికిఁదక్కఁ దక్కిన యెవ్వరికేని హిందీ ప్రభృతు లార్య భాషాకుటుంబములోని వనియుఁ దమిళ కర్ణాటాంధ్రాదు లార్యభాషా కుటుంబములోఁ జేరని ప్రత్యేక కుటుంబమనియుఁ దోఁచకమానదు గదా!

## ౧-౨. IV విష:—సంస్కృత గౌడభాషల సర్వనామ సామ్యాభావము

| సంస్కృత | హిందీ | తెలుఁగు | తమిళము | పఱగన్నడ |
|---|---|---|---|---|
| త్వమ్ | తూ | నీవు | నీ | నీం-(నీన్) |
| త్వయా | తుఝసే | నీచేత | నిన్నాల్ | నిన్నిం |
| యూయమ్— | తుమ | మీరు | నీయిర్—నీవిర్ | నీం (నీమ్) |
| యుష్మాభిః | తుమసే | మీచేత | నుమ్మాల్ | నిమ్మిం |
| అహమ్ | మైం | నేను | యాన్-(నాన్) | ఆం (అన్) |
| మయా | ముఝసే | నాచేత | ఎన్నాల్ | ఎన్నిం |
| వయమ్ | హమ | మేము | యామ్ | ఆం (ఆమ్) |
| అస్మాభిః | హమసే | మాచేత | ఎమ్మాల్ | ఎమ్మిం |
| | (అనుబంధము I) | | | |
| కః | కౌన | ఎవఁడు | యావన్-ఎవన్ | ఆవం |
| కిమ్ | క్యా | ఏది | యాదు-ఎదు | ఆవుదు |
| ఇదమ్—ఏతద్ | యహ | ఇది | ఇదు | ఇదు |
| ఆత్మ | ఆప | తాను—తారు | తాన్—తామ్ | తాం |
| తద్ | వహ—వే | వాఁడు—వారు ఆతఁడు | అవన్-అవర్ | అవం-ఆతం-అవర్ |

ఈ సర్వనామములందు:—'తు — తుమ్ — తుమ — తుఝ, హమ— ముఝ—' అనురీతివి ప్రాకృత వికృతులవలనఁ గల్గిన వనుట యుక్తము. హిందీ ప్రభృతులలోని 'మ' కారము బహుత్వ బోధకమగుటయుఁ బ్రాకృత స్వభావమె. (అనుబంధము II). (మిప్—వస్—మస్).

అనుబంధము I ౧-౨ IV విష:—విభక్త్యంత పరిణామము లిట్లు సర్వనామములందుఁ బొడపట్టుచున్నవి. ఇవి ప్రాకృత వ్యవహారమునను గల్గియుండును. హిందీలో "ఏమ్ = మ్" అనునవి బహువచన బోధకములు. కాన—"తుమ = మీరు; హమ = మేము" అను రూపము లేర్పడియుండును. ('మైం' అనుదానినుండియే 'ముఝసే' మున్నగు నేకవచన రూపములు గల్గియుండును). 'అహమ్' అనుదానిలోని "హ" కారము పయిని బహువచన మకారము నిల్చియుండును.

దీని సామ్యమునసె 'త్వమ్ - త్వద్' అనువాని పయిని బహువచన 'మ' కారము చేరుటచేత "తుమ - తుమసే" మున్నగునవి యేర్పడును.

అనుబంధము II ౧-౨ IV విష:—హిందీభాషలో – 'పుస్తకేం' = (పుస్తకములు) తిథియాం (తిథులు). మాతాయేం=(తల్లులు) పెం. "మో - మ - ము - మస్ - మహిఙ్ (౨ - ర - ౬)=ఉత్తమ పురుషస్య బహుత్వే వర్తమానయోః 'మస్ - మహిఙ్' ఏతయోః 'మో - మ - ము' ఇతి త్రయ ఆదేశా భవన్తి' (షడ్భాషాచంద్రిక ౧౬౦-పుట). (సంస్కృ) - భవామః = (అగుచున్నాము). భవేమ = (అగుదుము). అభూమ = (అయితిమి). బభూవిమ = (అయితిమి). అభవిష్యామ = (కాఁగలము).

ఆత్మశబ్దము 'అప' అను రూపమున హిందీలో వెలయు చుండుటయుఁ బ్రాకృత స్వభావమె. "వాత్మభస్మనిపః. (వృత్తి) 'ఆత్మ—భస్మ' అనయోః స్తోః (సంయోగస్య) పో వా స్యాత్ ఉదా:—అప్పా—పప్పో—అత్తా..." (షడ్భా. ౮౬ పు.).

ప్రసంగవశమున నిటఁ గొన్ని యార్యభాషల సామ్యము లుత్తర హిందూస్థాన భాషలలో నున్నవి ప్రదర్శింపఁబడుచున్నవి. 'భవతి' మున్నగు క్రియాసిద్ధరూపములు ప్రాకృతద్వారమున నపభ్రష్టములై యుత్తర హిందూస్థాన భాషలలోఁ జేరియున్నవి.

"హో—హువ — హావా — భువేస్తు. (౩—౧—౧) భవతే ర్ధాతోః హో-హువ-హావ-ఇతిత్రయ ఆదేశా భవన్తి". "న శపామ్. (వృత్తి)=అత్ర శబాదీనాం ప్రయోగో నభవతి. హోఇ=(భవతి)" (షడ్భా. ౧౩౨ పు.).

హిందీ:—తూ, హై = (నీ వున్నావు.) వహ హై = (వాఁడున్నాఁడు.) మైం హూ=(నేనున్నాను). హామ హైం=(మేమున్నాము). తుమ హో=(మీరున్నారు). ఆప హైం=(తామున్నారు). మైం గయా హూ=(నేను వెళ్ళినవాఁడనయితిని) హామ గయే హైం=(మేము వెళ్ళినవారమైతిమి). కోఈకారణ హోగా=ఏదోకారణ ముండును. మొ.

ఇట్లు ధాతువుల విభక్త్యంత సిద్ధరూపము లుండుటయే హిందీ ప్రభృతులార్యాభాషాపభ్రంశము లనుటకుఁ బ్రబల నిదర్శన మనఁజనును. ఇట్టిస్థితి ద్రావిడభాషలందు మచ్చునకేని లేదుగదా!

"విష్ణుః జగతాం కర్తా భవతి"=(విష్ణువు జగములకుఁ గర్త యగును) అను రీతిగల 'తృన్' ప్రత్యయాంత ప్రథమైక వచన సిద్ధరూపము హిందీధాతువు తుదిని నిల్చుటచే విధేయ విశేషణమై తద్ధర్మార్థక క్రియ=వర్తమానార్థక క్రియారూప మగుచున్నది. అందు భూధా త్వపభ్రంశములగు 'హై' ప్రభృతులు యథోచితముగఁ జేరియుండును. స్త్రీత్వమున 'తృ'న్నంతములకు జీప్పు వచ్చి

"యుష్మత్సునా తువం - తుం - తుమం - తుహ" (౨-౩-౧) = యుష్మచ్ఛబ్దః సునాసహ 'తువం - తుం' ఇత్యాద్యాదేశా నాపద్యతే" (షడ్భా—౯౮-పుట).

'తురుసే - మురుసే' మున్నగు చోటులలోని 'ఝ' కారమును బ్రాకృత సంబంధియే యనఁదగును.

"వాబ్భో - ష్మ - జ్ఝా. (౨-౩-౧౮) యుష్మదాదేశేషు ద్విరుక్త భకారస్య 'ష్మ - జ్ఝ' ఇత్యాదేశౌ వా భవతః......జసి - తుజ్ఝ" (షడ్భా - ౯౮ మొ. ౧౦౦ పు.)

"మఝ - మను - మహ - మజ్ఝ - జసా" (౨-౩-౨౩). "అమ్హం - మజ్ఝం - మజ్ఝ - మఇ - మహ - మహం - మేచ - జసా." (౨-౩-౨౫ షడ్భా ౧౦౨ - ౧౦౩ పు.)

'త్రి' అగును గాన దాని యపభ్రంశమగు 'తీ' అనునది హిందీలో నిల్చును ఉదా:—రామ ఆతా హై = (రాముఁడు వచ్చువాఁడు = వచ్చుచున్నవాఁడగుచున్నాఁడు.) (ఆ=వచ్చు. తా—తృన్నంతరూపము—హిందీ.)

రామ ఆతే (ఆ+తా+ఏ) హైం = (రాములు వచ్చుచున్నవారగుచున్నారు=రాములు వత్తురు.) (ఇందలి 'ఏ—మ్' బహుత్వార్థకములు). సీతా ఆతీ హై=సీత వచ్చుచున్నదగుచున్నది=సీత వచ్చును.). తుమ క్యా లిఖతే హో =(మీరేమి వ్రాయుచున్నారు) (లిఖతా+ఏ=లిఖతే). ఆప ఘర జాతే హైం= (తా మింటికి వెళ్ళుచున్నారా=వెళ్ళుదురా?)

మైం గయా థా = (నేను వెళ్ళియుంటిని.) 'థా' అనునది 'స్థా' ధాత్వపభ్రంశము—'గయా' అనునది 'గమ్' ధాత్వపభ్రంశరూపము. సీతా గయీ థీ=(సీత వెళ్ళియుండెను.)

మహారాష్ట్రీ ప్రభృతి ద్వైతీయీక ప్రాకృతావస్థలోవలె సంస్కృత విభక్త్యపభ్రంశము లీ తార్తీయీకప్రాకృతా పభ్రంశములలో లేకున్నను బూర్ణముగా నంతరింపక యయిరీతి నరుదుగా సంస్కృత ప్రాకృత కృత్ సుప్ తిఙ్విభక్త్యపభ్రంశము లుత్తర హిందూస్థాన భాషలందును గలవు. ఇట్టి విభక్త్యపభ్రంశ రూపము లుత్తర హిందూస్థానభాషల సంస్కృత ప్రాకృతాపభ్రంశతకుఁ బ్రబల నిదర్శనము లనుటలో నెవ్వరును విప్రతి పన్నులు కాఁజాలరుగదా!

మహారాష్ట్రీ ప్రభృతి ప్రాకృతములం దన్ననో యతిప్రచురముగ సంస్కృత సుప్ తి ఙ్విభక్తి సిద్ధరూపాపంభ్రంశములు వెలయుచుండును.

''సిధం రఞో వాసిఠీపుతస సామి సిరిపులుమావిస సవచ్ఛర పిణ్డ నుతరియానం కహూతర గహావతిస పురిగహ పతిస చ పుతస ఇసిలస సభాతుకస... ధమ్మచకం దేధమ్మం ఠాపిత=దీని సంస్కృత చ్ఛాయ:- సిద్ధం రాజ్ఞో వాసిష్ఠీపుత్రస్య స్వామి శ్రీపులుమావేః సంవత్సరే పిణ్డ నుతరియానాం కహూతర గృహావతేః పురి గృహావతేశ్చ పుత్రస్య ఋషీలస్య సభ్రాతృకస్య...ధర్మచక్రం దేయధర్మం స్థాపితమ్'' (ఆంధ్రరాజగు 'పులుమావి 'అమరావతి' శాసనము. 'ఆం. భా. వి. ౬౬ పు).'

పయిరీతిని నిస్సంశయముగ సంస్కృత జన్యము లనఁదగిన ప్రాకృతములు కాలక్రమమున వ్యవహార ప్రవాహ పతితములయి. యపభ్రష్టములగుచు ద్రావిడ భాషల సంపర్కమునఁ బెక్కు విషయములను వానినుండి గ్రహించినవి. అట్లు గ్రహించుటలో సంస్కృత ప్రాకృత సుప్ తిఙ్విభక్తుల పరిణామ రూపములు చాలవఱ కంతరించుటయు నట్టి విభక్తులచోటఁ దత్తద్విభక్త్యర్థబోధక శబ్దములు

శబ్దభాగములును నిల్చుటయు సంభవించెను. అట్లు నిల్చిన ప్రత్యయములు కొన్ని ద్రావిడ విభక్తులను బోలియుండుటయు సంభవించెను. ద్రావిడభాషల కును నార్యభాషలకును, నిండియా కార్యద్రావిడులు రాకముందటి కాలపు ప్రాచీన తమ సంబంధమునను . నిండియాకు వచ్చిన తర్వాతి యర్వాచీన సంబంధమునను ననంతములగు సామ్యము లుండుట సహజము.

ఇంతయేల?—ద్రావిడభాషలందును నుత్తర హిందూస్థాన భాషలందును వెలసియున్న 'కు' ప్రత్యయము సైతము సంస్కృత 'క' ప్రత్యయ సంబంధి యే మో యని యాలోచింప వలసినంతటి స్థితి యీ క్రింది రీతిని జూపట్టుచున్నది.

"అమహద్వాచకములకుఁ బరముగాఁ జతుర్థీ ద్వితీయా ప్రత్యయమగు నాధునిక 'ఇండో ఆర్య'భాషలలోని (బెంగాలి మొ.) 'కో-కే-కు' ప్రత్యయము లును ద్రావిడభాషలలోని 'కు' ప్రత్యయమును జేరుచుండుట రెండు కుటుంబ ముల యందును గాన్పించుచున్న" అని సునీత్ కుమార్ ఛాటర్జీగారు 'The Origin and Development of the Bengali Language' అను తమ గ్రంథమున వ్రాయఁగా, డా. నారాయణరావుగారీ క్రింది రీతిని విమర్శించిరి. "ఆధుని కార్యభాషలలోఁ బశ్చిమ హిందీ భాషయందు 'కో' బెంగాలీ భాషయందు 'కే' ఒఱియా భాషయందు 'కు' అను ప్రత్యయములు ప్రాకృత భాషావస్థయందును నాధుని కార్యభాషలందును 'కక్ష'. యను సంస్కృతపదమునుండి యేర్పడుట కును ద్రావిడభాషలలోని 'కు' ప్రత్యయమునకును నెట్టి సంబంధమును లేదు. ఈ ప్రత్యయములు రెండు కుటుంబములయందును బోలియుండుట కాక తాళీయ న్యాయమునఁ గలిగినదిగాని వేఱుగాదు" (ఆం. భా. చ. ౫౯ పుట), అని విమర్శించిరి. 'కక్ష' శబ్దమునుండి 'కో' ప్రభృతు లేర్పడెననుట విశ్వాస నీయముగాదు. "కక్ష—సం—వి—ఆ—స్త్రీ. ౧. కచ్ఛ. ౨. పోటీ. అ—పుం—ము. ౧. చంక. ౨. కశము. ౩. గడ్డి. ౪. పొద. ౫. ఎండిన యడవి." (శ—ర) అను నర్థములుగల 'కక్ష' శబ్దమునుండి సంప్రదానార్థకమగు లేదా యుద్దేశార్థక మగు 'కు' ప్రత్యయము గల్గెననుట కేవలము నసంగతమయి యున్నది. ఛాటర్జీగారు చెప్పినట్లె యివెల్ల నభిన్నములె యనుట యుక్తమని తోఁచుచున్నది.

ద్రావిడభాషలందు 'కు' ప్రత్యయమునకు సంప్రదానార్థకత్వ మనఁగా నుద్దేశార్థకత్వమును సంబంధార్థకత్వమును గన్పట్టుచున్నవి.

"సంప్రదానంబునకుం జతుర్థి యగు—౮.

త్యాగోద్దేశ్యంబు సంప్రదానంబు నాఁబడు. రామునికొఱకుఁ గన్య నిచ్చెను. కొన్నియెడల నుద్దేశ్యమాత్రంబున కగు. పురుషార్థంబుకొఱకు యత్నింప వలయు. చతుర్థికి మాఱుగ షష్ఠియె తఱుచుగాఁ బ్రయోగంబులం గానంబడి

మెడి. జనకుఁడు రామునకుం గన్య నిచ్చెను. పురుషార్థంబునకు యత్నింప వలయు." (బాలవ్యా. కారక. ౮ సూ.)

"శేషషష్ఠికి యొక్కయు నగు. (౧౫). ఇచట శేషంబనఁగా సంబంధంబు. రాముని యొక్క గుణములు......కు వర్ణకంబును గొన్ని యెడల సంబంధంబునం దగు. నాకుఁ దమ్ముఁడు. మీకు నెచ్చెలి" (బాలవ్యా. ౧౫ సూ.)

ఈ 'కు' ప్రత్యయమునకు "పటగన్నడము కూర్గు" అను ద్రావిడభాష లందుఁ బ్రసిద్ధమైయున్న "కెయ్=గెయ్" = (చేయు) అను ధాతువు మూల మనుట నిశ్చయము. (చూడు. ౮౫ II విభ.)

గౌడభాషలలోని 'కో-కే-కీ' ప్రత్యయములును నీ ద్రావిడ 'కు' ప్రత్యయ మున కభిన్నములె యని పెక్కురు విమర్శకులు వ్రాసిరి. కాని గౌడభాషల లోని "కో—కే—కీ" అనునవి సంస్కృత 'క' ప్రత్యయ సంబంధులేమో యని తోఁచుచున్నది.

"యుష్మ దస్మ త్త్వ న్మదాం యౌష్మా కాస్మాక తవక మమకాః ష్ణ ణీనే" ఉదా:—యౌష్మాకమ్—యౌష్మాకీణమ్. ఆస్మాకమ్—ఆస్మాకీనమ్. తావకమ్—తావకీనమ్. మామకమ్—మామకీనమ్." (ముగ్ధబో. ౭౩౬ సూ.). యౌష్మా కమ్=మీసంబంధమైన=మీయొక్క. మొ.

శ్లో॥ "అజ్ఞానే కుత్సితే చైవ । సంజ్ఞాయాం మనుకమ్పనే ।
తద్యుక్తనీతౌ వవ్యల్పే । వాచ్యే హ్రస్వేచ 'కః' స్మృతః ॥ "

(ముగ్ధబో. దుర్గాదాస వ్యాఖ్య. ౭౩౬ సూ.) వ్యాఖ్య:—"తద్యుక్తా న్నీతౌ—కృపాయుక్తాత్ లేః=(ప్రాతిపదికాత్) 'కః' స్యాత్ నీతౌ గమ్యమానా యామ్......కృపాయుక్తో దానే నాశ్వాసయతి. దానరూపా నీతి ర్గమ్యతే..." (ముగ్ధ. శ్రీరామతర్క వాగీశ వ్యాఖ్య) ఇట్లు క ప్రత్యయము దానార్థక మనఁగా సంప్రదానార్థకమును నగుట సంస్కృతమున నరుదుగఁ గన్పట్టుచున్నది.

హిందీభాషయం దీ ప్రత్యయపు వాడుక నరసినచో నిది సంస్కృత 'క' ప్రత్య యాభిన్నమని తోఁచును.

సీతాకో దేఖో=(సీతకుఁ జూడుము=సీతను జూడుము=సీతనుద్దేశించి చూడుము.)

బడే ఘోడేకో=(పెద్ద గుఱ్ఱమునకు).

ఇట్లు దీని కుద్దేశార్థకత్వమును సంప్రదానార్థకత్వమును హిందీలో వాడఁ బడుట సుప్రసిద్ధము. "కా—కే—కీ" అనునవి శేష షష్ఠ్యర్థకములయి హిందీలో వాడఁబడుచున్నవి. ఇట్లు సంబంధార్థమున వాడఁబడునపుడు—సంబంధిపద

మేకవచనాంతమైనచో సంబంధార్థక 'క' ప్రత్యయ మేకవచనమగు 'కా' అను రూపముతో నుండును. సంబంధిపదము బహువచనాంతమైనచో నీ 'క' ప్రత్యయము 'కా+ఏ'=''కే'' అను బహువచన రూపముతో నుండును. సంబంధిపదము స్త్రీలింగమయినచో నీ 'క' ప్రత్యయము ఙీ బంతరూపమగు 'కీ' అనురూపముతో నిల్చును. ఉదా:—రామకా ఘర=(రామునియొక్క యిల్లు) రామకే (కా+ఏ) ఘోడే. (ఘోడా + ఏ) = (రామునియొక్క గుఱ్ఱములు) రామకీ లడకీ=(రామునియొక్క కూతురు).

వయిరీతిగల వాడుకలనుబట్టి —''కా—కే—కీ'' అనునవి సంస్కృత 'క' ప్రత్యయా భిన్నములని నిశ్చయించుటకు సందేహములేదు. ఇంక ''కో—కే—కూ'' మున్నగు హిందీ బెంగాలీ ప్రభృతులలోని ప్రత్యయ మీా 'కా—కే—కీ' అనువాని కభిన్నమె కావచ్చును. ''కా—కే—కీ'' ప్రత్యయములు సంస్కృత 'క' ప్రత్యయమునకు భిన్నములు కావనుట నిశ్చితవిషయ మన వచ్చును.

ఇంకను హిందీలోని ''ఖా=(తిను). ఖానా=(తినుట). (అదనమ్=భక్షణమ్) పఢ=(చదువు)—పఢనా=(చదువుట) (పఠనమ్). కర=(చేయు)—కరనా=(చేయుట) (కరణమ్)'' మున్నగు 'నా' ప్రత్యయాంతములు సంస్కృతములోని 'ల్యుట్—యుచ్'=(అన) ప్రత్యయముల యపభ్రంశరూపములె యనుటకును సందేహములేదు.

(స్ఫురణా-స్ఫురణమ్-చూడు. 'వ్యా-సం' ౧౬౨ I వి. ౫౯౨ పుట).

ఇట్టివింకను నుత్తర హిందూస్థాన భాషలందు సంస్కృత ప్రాకృత సామ్యములు పెక్కుగలవు. విస్తరభీతి నుదాహరింపలేదు. తృన్నంతాదుల సంస్కృత ప్రాకృతసామ్య మీావఱకే వివరింపఁబడెను (చూడు. ౧౨ II, III, IV విష).

౧౩. I విష:—''కాల్డువెల్లు కాలమునకుఁ బ్రాకృతభాషలనుగూర్చి కాని యాధుని కార్యభాషలనుగూర్చి కాని పరిశోధనము లెక్కువగా జరిగియుండ లేదు. ఇటీవల జరిగిన పరిశోధనముల ఫలితములను సునీత్ కుమార్ ఛాటర్జీ పైని వివరించినట్లుగా నొక్కచోటఁ జేర్చి యున్నాఁడు'' (అం. భా. చ. ౬౮ పుట) అని యిట్లు డా. నారాయణరావుగారు ద్రావిడభాషలకును నుత్తర హిందూస్థానాధునిక భాషలకును గల సంబంధములను విపులముగాఁ జూపిన ఛాటర్జీగారి వ్రాఁతల నూఁతగాఁ గొనిరి. ఛాటర్జీగారు నయితము డా. నారాయణరావుగారి పుట్టఁబోవు వాదమును ఖండించిరేకాని డా. నారాయణరావుగారితో నేకీభవింపలేదు.

"I. ఉచ్చారణము. II. శబ్దనిర్మాణము. III. వాక్యనిర్మాణము. IV. శబ్దజాలము" అను నాల్గువిషయములందలి ద్రావిడభాషల పోలికలు బెంగాలీ ప్రభృతులగు నుత్తర హిందూస్థాన భాషలయందుఁ గలవని వారు విపులముగాఁ జూపిరి. కాని యట్టిపోలికలు ద్రావిడభాషల సంపర్కమున నుత్తర హిందూస్థాన భాషలందుఁ బ్రవేశించినవనియే యీ క్రిందిరీతిని వ్రాసిరి. "ఇండో ఆర్యభాషల కీ పోలిక లిండియాకు వెలుపల నున్న యిండో యూరపియను భాషలలో లేవు. కాన నీ విషయమున నార్యభాషలపై ద్రావిడభాషల ప్రోద్బలమున్నదని చెప్పక తప్పదు." "కాల్డ్వెల్—గండర్ట్—కిట్టెల్—మున్నగువారు ద్రావిడభాషలనుండి యార్యభాష లెరవుతీసికొన్నపదముల పట్టికల నిచ్చియున్నారు. (చూడు. ౧౪౧. II, III, IV, V విష. VII ప్రక) ఇండో యూరపియన్ భాషలలో సమానపదములులేని యార్యభాషలలోని దేశీయ పదములన్నియు (ద్రావిడదేశ సంపర్కమున వచ్చినపదములన్నియు) ద్రావిడ పదములె నై యుండును" అని ఛాటర్జిగారు వ్రాసిరి. (ఆం. భా. చ. ౬౩ పు). పయిరీతి నిండియాకు వెలుపల నున్న యిండో యూరపియను భాషలలో లేని నేఁటి యుత్తర హిందూస్థాన భాషలందలి విషయములెల్ల ద్రావిడభాషల సంపర్కమునఁ గల్గినవె యనెడి వినిగమక యుక్తితో ఛాటర్జీగారు వ్రాసిన సిద్ధాంతమును డా. నారాయణరావుగారు జాఱవిడిచిరి.

౧౩. II విష:—ద్రావిడభాషలును నార్యభాషలును నేకకుటుంబకములె యను వాదమునందలి యనుపపత్తులను బదుమూఁడిటిని గాల్డువెల్లుగారు చూపిరి. (కాల్డు. పీఠిక ౪౩ మొ. ౫౧ పుటలు) వానికెల్ల సమాధానము లనుచు డా. నారాయణరావుగారును వ్రాసిరి. (చూ. ఆం. భా. చ. ౬౬ మొ. ౭౫ పుటలు).

కాల్డువెల్లుగారి పదుమూఁడు యుక్తులలోను బ్రధానమైన రెండవ యుక్తికి—"సంఖ్యావాచకములు—దైనందిన వ్యవహారాత్యావశ్యక శబ్దములు—ముఖ్యములగు వ్యాకరణ సంబంధములు మున్నగునవి ద్రావిడభాషల ప్రత్యేకతను నిర్ణయించు" నను యుక్తికి సమాధానమును దేల్చివేసి—"వీనినిగూర్చిన ప్రశంస మఱియొకచోటఁ జేయఁబడును" అని జాఱవిడిచి—యీ క్రిందిరీతి నొక వింత యగు సమాధానము తక్కిన యుక్తులకుఁ జాలవఱకు వ్రాయుచు వచ్చిరి. "కాల్డువెల్లుగారు చెప్పిన యనుపపత్తులు నేఁటి యుత్తర హిందూస్థాన భాషలందును గలవు గాన వానినె ట్లార్యభాషా కుటుంబములోని వానినిగా నంగీకరించుచున్నామో యట్లె ద్రావిడభాషలును నార్యభాషా కుటుంబములోని వనుటకు వెనుదీయనేల?" అను నొక్కటే వీరికి బలమైన సమాధానము.

౭:—"ద్రావిడభాషలలోఁ గ్రియాజన్య విశేషణముల నెక్కువగ వాడుదురు..."

—సమాధానము—

"గౌడభాషలలోఁగూడ ముఖ్యముగఁ బశ్చిమ దక్షిణ గౌడభాషలలో నిట్లే యున్నది..."

"౮:—౧. ఉభయార్థకము ('మన' శబ్దము) ద్రావిడభాషలలోఁ గలదు. ఇండో యూరపియను భాషలలో లేదు."—సమాధానము:—"మూలద్రావిడ భాషలో నీ శబ్దములేదు. అర్వాచీనము."

ఈ వీరి సమాధానము నిరాధారము. తొల్కాప్పియమందును నీ మన శబ్దార్థకము గలదు.

"౯:—ద్రావిడభాషలలోఁ గర్మణి ప్రయోగములేదు. సంస్కృతమునఁ గలదు. (కర్మణి ప్రయోగమను వీరిచేఁ బ్రయుక్తమగు శబ్దము కేవలము పడ శబ్దము). ద్రావిడభాషలలోఁ బ్రత్యేక క్రియలను జేర్చుటచేత నిట్టిరూప మేర్పడును."

—సమాధానము—

"నేఁటి గౌడభాషలలో ద్రావిడలభాష యందువలె కర్మణిప్రయోగము (అపశబ్దము) మృగ్యముగా నున్నది."

"౧౦:—ద్రావిడభాషలలో సముచ్చయార్థమున శత్రర్థకములును త్వార్థకములును వాడఁబడును. సంస్కృతములో సముచ్చయ చిహ్నము ప్రత్యేకముగా నున్నది."

—సమాధానము—

"నేఁటి గౌడభాషలలో ద్రావిడభాషలందువలెనె యున్నది"

(ఆం. భా. చ. 23. 28 పుటలు)

వీరి కాయా యుక్తుల విమర్శించు భార మింతేనియు లేదు "నేఁటి గౌడ భాషలలో ననఁగా నేఁటి యుత్తరహిందూస్థాన భాషలందును నట్లెయున్నది. గదా వానినెట్లార్యభాషాకుటుంబములోనివని యంగీకరింతురు?" అనునదొక్కటే పెద్ద సమాధానము. కాని యీ వఱకుఁ జూపఁబడినరీతి (౧౦ మొ..౧౨ విషయములు) నుత్తర హిందూస్థానభాషల సాదృశ్యము ద్రావిడభాషలకు లేదనియు ద్రావిడభాషలకు సాధారణమగు ప్రత్యేక కుటుంబితా ధర్మములు గలవనియు నుత్తర హిందూస్థానభాషలందు ద్రావిడభాషలందు లేని బలమైన యార్యభాషా సమాన కుటుంబితా ధర్మములు గలవనియు వీరు తెలిసికొని యుండలేదు

వయిరీతిని నేఁటి యుత్తర హిందూస్థాన భాషలవలెనె ద్రావిడభాషలును ప్రాకృతాపభ్రంశములె యని యసంగతముగా సిద్ధాంతీకరించి వీరు సంస్కృత భవములనుగా ద్రావిడ శబ్దములను జూపు ప్రణాళి దిఙ్మాత్రముగా నిటఁ బ్రదర్శింపఁ బడుచున్నది.

"'కు' అనునది 'కృ' ధాతుజము. వికృతులగు తెల్గు ధాతువులు:— 'కృ+ను' (వికరణము)='ప్ర. కృణు'=వికృ-కొను (తెల్గు)."

'యమ్+కృ'=(వికృ)—ఈకు=(తెల్గు—ఇంకు?)
'కృంత్+కృ' (తె)=గీఁకు. 'భింద్+కృ'=(తెల్గు)—పీఁకు.
'కృశ్+కృ'=కెలఁకు. 'స్తృ+కృ'=తొరఁకు=తొలఁకు=తొనఁకు. 'తృట్+కు'=తొడఁకు=తొలఁకు=తొణఁకు. 'సాధు+కృ'=సాఁకు. 'ధూ+ను (వికరణ+కృ'=దూఁకు. సీత్ (అవ్య)+కృ=చీఁకు)...."

(ఆం. భా. చ. ౧౦౩ పుట. మొ. ౧౧౫ పుట వఱకు) వయిరీతిని తెలుఁగు ధాతువులకు వింత వింతలగు ప్రకృతులు చూపఁబడెను—

| సంస్కృత ప్రకృతి | ద్రావిడ వికృతి | సంస్కృత ప్రకృతి | ద్రావిడ వికృతి |
|---|---|---|---|
| వక్త్ర | వాయ్ | కృష్ణ | కఱు |
| కర | కెయ్ | శ్వేత | వెళ్ |
| రాత్రి | ఇరవు | పృథు | పెఱు |
| ప్రాణేసర్ | ఞాయిఱు | శ్రధ్ | చిఱు |
| గ్రావ | కల్ | ఇక్షు | ఇన్ |
| నిలయ | ఇల్ | నిష్ఠా | నిల్ |
| ఘోట | కుదిరెయ్ | క్రూర | కొల్ (చంపు) |
| శ్వాన | నాయి | తల (ప్రదేశము) | తల (శిరస్సు) |

౧౪. విష:—ద్రావిడులు హిందూదేశమునకు రాకముందే మూలద్రావిడ భాషనుండి తమిళ కర్ణాటాదులు చీలినవనియు ద్రావిడులు హిందూదేశమునకు వచ్చినపిమ్మటనే తమిళ కర్ణాటాంధ్రాదులలో సుప్తిఙ్ విభక్తుల విస్తృతి గల్గె ననియు గ్రహింపవలెను. మూలద్రావిడభాషలో సుప్తిఙ్ ప్రత్యయముల విస్తృతిగాని సర్వనామ ఖండములు క్రియల తుదిని జేరి తిఙ్విభక్తులుగా నేర్ప డుటగాని లేదు. అయ్యవి మూలద్రావిడభాషలోనె యుండియున్న యెడలఁ దజ్జన్యములగు తమిళాంధ్రాదులందలి సుప్తిఙ్విభక్త్యాదులకుఁ గొంత రూప సామ్యముండి యుండును. తమిళాదుల విభక్త్యాదులందట్టి రూపసామ్యము

లేదు. కొడుందమిఴునుండి యేర్పడిన మలయాళమునందుఁ దిఙ్విభక్తులు లేకుండుటయు నిందులకు నిదర్శము కాఁగలదు. కావునఁ దమిఴ కర్ణాటాంధ్ర జనులు హిందూదేశమున నెలకొన్న పిదప సంస్కృతాదుల ననుసరించి తమతమ భాషలలో నట్టి సుప్తిఙ్ ప్రత్యయములను గాలాది బోధకవర్ణకములను జేర్చి కొనిరని తలంపనగును. కావుననె భూతాద్యర్థబోధక రూపములందు ఇ-త-ద-దప-మున్నగు భిన్నభిన్నాకారములగు కాలబోధక ప్రత్యయము (సంస్కృత—క్త ప్రయాదుల ననుసరించి) లేర్పడుట వానికిఁ బరముగా సర్వ నామముల తుదివర్ణములు క్రియాప్రత్యయములుగఁ జేసుట తత్తద్విభక్త్యర్థ బోధకములగు సుబ్విభక్తులు తత్తద్భాషలలోని శబ్దముల రూపమునఁ గల్పితము లగుట మున్నగు స్థితిగతులు సంభవించెను. పైకారణములచేతనే క్రియా రూపాములందుఁ గొన్ని సంస్కృత సామ్యములు గన్పట్టుచుండును. సుప్తిఙ్విభక్త్యాది వివరణ సందర్భమున నాయావిషయములు సోదాహరణముగా నిరూపింపఁబడును.

# ద్రావిడభాషా పరిశీలనము

## I. ద్రావిడధ్వని ప్రకరణము

### (ద్రావిడ భాషలు)

౧౫. I విష:—తమిళ కన్నడాంధ్రాదులనుబట్టి యట్టి మాండలిక భేదములుగల యేకకుటుంబకములనఁదగు భాషలకు మూలమగు ప్రాచీన ద్రావిడ భాష యొకటి యుండి యుండవలయు ననెడి యూహచేఁ గల్పితమగు మూల ద్రావిడభాష యంగీకార్యమని యీవఱకు విశదీకరింపఁబడెను. అట్టి మూల ద్రావిడభాషనుండి యేర్పడిన తమిళాదిభాషలు పండ్రెండనుచు భాషాశాస్త్రజ్ఞులు తలంచుచున్నారు.

| సంస్కారము నందినవి. | సంస్కారము నందనివి. |
|---|---|
| ౧. తమిళము=(అఱవము). | ౧. తుద. తోద. |
| ౨. మలయాళము. | ౨. కోత. |
| ౩. తెనుఁగు=(ఆంధ్రము). | ౩. గోందు. |
| ౪. కన్నడము=(కర్ణాటము). | ౪. కు. (ఖోందు). |
| ౫. తుళు | ౫. మాలెరు } రాజమహాలు |
| ౬. కూర్గు=(కుడగు). | ౬. ఒరాఒన్ (oràons) } కొండలలోనివి. |

(కాల్డువెల్లుగా, రసంస్కృతములన్న వానిలోఁ గొన్నిటి కిప్పుడిప్పుడు లక్షణములు చూపఁబడుచున్నవి) శ్రీ భద్రిరాజు కృష్ణమూర్తి యమ్మెగారు 'సంస్కృతి' అను పత్రికలో (౧౯౫౩ సెప్టెంబరు—నవంబరు) ద్రావిడభాషలు '౧౫'అని వ్రాసిరి. "కువి—కోలామి—నాయకి—ఖురు(లేక ఖ్)" అనువానిని జేర్చిరి.

బెలూచి స్థానములోని బ్రహూయి భాష ద్రావిడభాషలలోనిది గాదని డాక్టరు కాల్డువెల్లుగారి యాశయము. (చూడు. ౧౫ XII విష.) కాని కాల్డువెల్లుగా రచ్చటచ్చట దీనిని ద్రావిడ భాషలలోఁ జేర్చితిననియు వ్రాసిరి. (చూడు. ౧౧౧ II విష. ౧౦౬ XIII విష. మొ).

౧౫. II విష:—పయి పండ్రెండిటిలోఁ బ్రాచీన విశాల వాఙ్మయముగల ముఖ్యములగు భాషలు ౧. తమిళము. ౨. మలయాళము. ౩. తెనుఁగు.

౪. కన్నడము. వీనిలో మలయాళము తమిళభా షాపభ్రంశమె యనఁ దగును. అద్దానికి వాఙ్మయావస్థ పండ్రెండవ శతాబ్దమువఱకును గల్గలేదు.

తమిళభాష రెండువిధములు. ౧. కొడు (_స్త) న్దమిళము = సంస్కారము నందని ప్రాచీన తమిళభాష. (కొడు=వక్రము). ౨. సెన్ద (చెన్త) మిళము=సంస్కారమునందిన శుద్ధతమిళభాష. (చెమ్=ఎఱ్ఱనిది. అందమైనదను నర్థము లాక్షణికము.) వీనిలోఁ గొడున్దమిళమె దేశభేదమున వేఱుభాషగ నేర్పడి మలయాళముగాఁ బరిణమించినది. (మల=కొండ) మలయాళమునకు గొప్ప యనుశాసనమును రచించిన రాజరాజవర్మగారీ త్రిందిరీతిని దమ "కేరళపాణినీయ"మున వ్రాసిరి. "పలువగ కొడున్దమిల్ గళ్ ఉణ్డాయిరున్న దిల్ ఒన్నాణుల నమ్ముడె మలయాళ మాయిత్తీర్ న్నదు" (పీఠిక ౫ పుట.) వివిధములగు నపభ్రష్ట తమిళభాషలలో (కొడున్దమిళ్) నొకటియై పరిణమించినదే మన మలయాళభాషయని పైదాని కర్థము.

మలయాళభాషకు మొట్టమొదటి లక్షణ గ్రంథమగు కేరళ కౌముది యందును నిట్లు చెప్పఁబడెను.

"శ్లో॥ సంస్కృత హిమగిరి గళితా। ద్రావిడవాణీ
కళిన్దజామిళితా। కేరళభాషాగఙ్గా। విహరతు మే
హృత్సరస్వ దాసఙ్గా॥"

సంస్కృతమనెడి హిమగిరినుండి దిగి తమిళమనెడి యమునతోఁ గూడినదయి మలయాళమనెడి గంగానది నా హృదయ సముద్రమున విహరించుఁగాక యని పై శ్లోకమున కర్థము. మలయాళమునకుఁగల సంస్కృత ప్రాధాన్యమిం దతిశయోక్తిగా వర్ణింపఁబడినది. మలయాళభాష తమిళ పుత్త్రియె యయ్యుఁ గాలక్రమమున వేఱుపడి సోదర్యము నందినదనుట యర్థము.

తమి ళాపభ్రంశ మనుటకు:— కేరళపాణినీయ పీఠిక:—

I. అనునాసి కాతిప్రసరమ్=తమిళమునందలి యనునాసికపరుషసంయోగము మలయాళమున ద్విరుక్తానునాసికమగును.

| తమి:— | మలయా:— | తమి:— | మలయాళము. |
|---|---|---|---|
| ఙ్క (ఙ్గ) | ఙ్ఙ | మ్ప | మ్మ |
| ఞ్చ (ఞ్జ) | ఞ్ఞ | ణ్ట | ణ్ణ (మూర్ధన్య) |
| _న్త (న్ద) | న్న (దంత్య) | | |

II. "తవర్గోపమర్దమ్"=తమిళ త వర్గము మలయాళమున 'చ' వర్గమగును. అఱవమునందలి 'ఐ' కారాంతములు మలయాళమున 'అ' కారాంతము లగును గాన 'అ' కారమును మలయాళమునఁ దాలవ్యముగా నెంచవలెను.

| తమి:— | మలయా:— |
|---|---|
| త | చ |
| ౘ్త | చ్చ |
| న (దంత్య) | ఞ |
| ౘ్త (దంత్య) | ఞ్చ |

III. (a) "స్వరసంవరణమ్"=తమిళ భూత చిహ్నమగు 'త్' అను దాని మీఁద 'ఉ' కారము మలయాళమున నిల్చును. "క్త్వాం"తమైనచో నర్థమాత్రికము. సమాపక క్రియయందయినచో నేకమాత్రికము. మలయాళమున సమాపక క్రియలకుఁ బురుషబోధక ప్రత్యయములు (తిజ్ఞలు) తమిళమందువలె చేరెడి సంప్రదాయము లేదు.

III. (b) ఐ=అ. తమిళమందలి పదాంతగతమగు 'ఐ' కారము మలయాళమున 'అ' కారమగును. ఉదా:—తమి—తలై—మల—తల,=తెనుఁగు. తల.

III. (c) "వర్ణవ్యత్యాసః" అక్షరముల మార్పులును గల్గును. 'అ' కారమును, 'ఎ' కారమును బరస్పరమును మాఱును. అట్లే 'ఇ' కారమును 'ఉ' కారమును బరస్పరము మాఱును, ఉదా:—తమి—పరి మాఱ్ఱ (ట్ట) మ్=మల—పెరుమాఱ్ఱం (ట్ట). (వఢ్ఢించుట). తమి—పిరాన్—మల—పురాన్=(నాయకుఁడు).

IV. "పురుషభేద నిరాసః" మలయాళమునఁ దమిళమునందువలెఁ బురుషవచన బోధక ప్రత్యయ యోగము లేదు. మల—చెయ్తు=తమి—చె(సె)య్‌దేన్ (చేసితిని). చె (సె) య్‌దేమ్=(చేసితిమి). మొ.

V. (a) "ఖిలోపసంగ్రహః"=తుమున్నర్థమునఁ దమిళమందు 'అ' ప్రత్యయ మగును (తెల్గున వలెనె). మలయాళమున 'అన్' ప్రత్యయమగును. ('అన్' అనునది ప్రాచీన కాలమునఁ దమిళమందును నుండెడిది. ఉదా:—తమి—కుళిక్క = (మునుఁగన్) మ—కుళిక్కాన్ = (మునుఁగన్).

V. (b) "నియోజక మధ్యమ బహువచనమ్"=తమిళమునఁ బ్రార్థనాద్యర్థక మధ్యమ బహువచనమునఁ బ్రాచీనకాలమున 'మిఁన్' నేఁడు "ఉమ్" అనునది ధాతువు తుదిని నిల్చును. మలయాళమునఁ 'ఇన్' అనునది చేరును. ఉదా:—తమి—చె (సె) య్మిఁన్, నేఁడు—చె (సె) య్యుమ్ (చేయుఁడు). మల—చెయ్యిన్, చెయ్విన్=చెయ్యువిన్ (చేయుఁడు).

VI. (a) "అజ్ఝభఙ్గమ్"=తమిళమున నెల్లెడలను షష్ఠీ (చతుర్థీ)విభక్తిలో "కు" ప్రత్యయము నిల్చును. మలయాళమున నకారాంతములకు 'ఉ' అనియుఁ

దక్కిన వానికి 'కు' అనియు నిల్చును. ఉదా:—తమి—రామనక్కు=రామున్కు. మల—రామన్+ఉ=రామన్ను. (రామనుకు—చూడు. ౧౪ II ౧ సూ.) నేఁటివారు 'రామను' అందురు.

శేషషష్ఠిలోఁ దమిళమున 'ఉడై (ౖౖ)యు' అని నిల్చును. మలయాళ మున నకారాంతములకు "టె" అనియుఁ దక్కినవానికి 'ఉడె' అనియు నిల్చును. ఉదా:—తమి—రామనుడై (టై) యు. (రామునియొక్క) మల—రామన్టె. (రామునియొక్క). తమి—అవళుడైయ=మల—అవళుడె (ఆమెయొక్క)

VI. (*b*) తమిళమునందలి 'వేణ్డుమ్' అనునది మలయాళమున "వేణం=వేణం=ఏణం=ఎణం=అణం" అను మార్పుల నందును. ఉదా:—తమి—చె (సె) య్య వేణ్డుమ్=మల. చెయ్యణం=(చెయ్యవలెను).

VI. (*c*) తమిళ మందలి "ఆగుమ్" అనునది మలయాళమున 'ఆం, అనునదిగా మాఱును. ఉదా:—తమి—చె (సె) య్య ఆగుమ్. మల—చెయ్యాం. (చేయనగును). 'చె (సె) య్యామ్' అను శబ్దమునకుఁ దమిళమున 'చేయుము' అని యర్థము.

VII. (*a*) "సంస్కృత పద్ధతిః"—సం-శ్రీపాదః. తమి—తిరుక్కాల్. మల-తృక్కాల్=తిరుక్కాల్. మల-అద్తిక్షి=సం-అతృప్తి. (ఉలికిపడుట).

VII. (*b*) మలయాళమునందును మూర్ధన్యనకారమున కుచ్చారణ భేద మున్నది. కాని తమిళ మందువలె లిపి భేదములేదు.

VII. (*c*) సంస్కృత శబ్దములలోని పరుషములు రేఫముతోఁగూడి నపు డారేఫము ఱ కారమగునని మలయాళ పండితుల యాశయము. మలయాళమున నట్లు ఱ కారమును నిల్పరాదనియు వీరి యాశయము ఉదా:— సం. ప్రకారః=మల-ప్రకారం.

VIII. పదాంత మ కారము మలయాళమున సున్నయగును. ఉదా:— తమి. మరమ్-మల-మరం. (చెట్టు).

IX. సంస్కృతములోని 'గ-జ-డ-ద-బ' ల మీఁదను 'య-ర-ల' ల మీఁదను బదాదిని 'అ' కారమున్నను నది 'ఎ' కారచ్ఛాయతోఁ బల్కఁ బడును. ఉదా:—సం-గన్ధః=మల-గెంధం. మొ.

X. నేఁటి తమిళములోవలె మలయాళమున నొక యక్షరమును వ్రాయుటయు వేఱొక యక్షరమునుగాఁ బల్కుటయు ననెడి సంప్రదాయము లేదు. మలయాళమునఁ బదాదిని 'చ' కారమునె వ్రాయుదురు. చకార మునె పల్కుదురు. మలయాళ దేశ్యపదాదిని 'స' కారము లేదు.

పయిరీతిని మలయాళమునఁ జాలభాగము తమి ళాపభ్రంశముగఁ జూప ట్టును. స్వతంత్రమగు మలయాళ దేశ్యభాషయుఁ గలదు.

౧౫. III విష:—"మలయాళ పండితులు తమ భాషను "మలయాట్మ=మలయాయ్మ" అని వ్యవహరింతురు. "మల+య్+ఆళ్" అని ఛేదము. "మల=కొండను-ఆళ్=కలిగియుండు=పాలించు" అని యర్థము. మలయాళ మనఁగాఁ బర్వతరాష్ట్రము. దీనిని "కేరళ" భాషయనియు వాడుదురు" (కాల్డు. పీఠిక ౧౬-౨౮ పుటలు).

ప్రాచీనకాలమున నీ కేరళ దేశమున 'మలయాళము' వాడుకభాషగను సె (చె) న్దమిఱము గ్రాంథిక భాషగను నుండెడివి. శాసనాదులును సె (చె) న్దమిఱముతోనె యుండెడివి. ౧౨ శతాబ్దమునుండియు మణిప్రవాళ రీతితోడి చంపూ గ్రంథములు మలయాళమున నారంభించెను. "రామేణ రావణుఁడు చంపఁబడెను" అను రీతిగ దేశభాషా పదములును సంస్కృత పదములును వాక్యమున మేళితములై వాడఁబడుటయె మణిప్రవాళరీతి.

"భాషాసంస్కృత యోగో మణిప్రవాళమ్" (లీలాతిలకము-ప్రథమ శిల్పము. ౧ సూ.)=వాక్యమునందలి కేరళ సంస్కృత పదముల మేళనము మణి ప్రవాళ మనఁబడును.

"తదుత్తమం భాషా రస ప్రాధాన్యే" (వృత్తి) "తన్మణి ప్రవాళం, భాషా రసయోః ప్రాధాన్యే ఉత్తమం భవతి. భాషాయాః ప్రాధాన్యం సంస్కృతా పేక్షం-తచ్చ సంఖ్యయా......" (లీలా. ౧ శిల్ప. ౨ సూ). ఉదా:—

శ్లో॥ "పుల్కి కొండా ళుఱక్కె ప్పునరపి మణివా నల్కినాళ్ మెల్లె మెల్లె।
కామక్కూత్తి న్నణిఞ్ఞాళ్ మదన పరవశా కాంత కై మెయ్మఱన్నాళ్।
వీర్త్తా ళొట్టె వియర్త్తాళ్ వివశ మరు తెడా యెన్నె నీ యెన్ని రన్నాళ్।
యె న్నాఠిల్ ప్పోన్ను నీ ణ్ణప్పరికుఱ లకమే మూట్కినా ళుణ్ణి నఙ్ఙ." ॥
(లీలా. ౧ శిల్ప. ౨ సూ).

అర్థము:—ఉణ్ణి=కన్నెయగు, నఙ్ఙ=ఆశ్రేష్ఠయగు స్త్రీ, (కర్తృపదము) ఉఱక్కె=గాఢముగా, పుల్కికొండాళ్=ఆలింగించినది. పునరపి=మరల, మణివా=అధరమును, నల్కినాళ్=ఇచ్చినది. మెల్లె మెల్లె=మెల్ల మెల్లగా, కామక్కూత్తిన్ను=మన్మథ నాట్యమున కనఁగా సంభోగమునకు, అణిఞ్ఞాళ్=ఉపసర్పించినది. కాంత=ఆ స్త్రీ, మదనపరవశా=మన్మథాధీనయగుచు, కై=చేతులను, మెయ్=శరీరమును, మఱన్నాళ్=మఱచినది. వీర్త్తాళ్=దీర్ఘముగా నిశ్వసించినది. ఒట్టె=పూర్తిగా, వియర్త్తాళ్=స్విన్న=చెమ్మట గలది యయినది. ఎడా=ఓరీనాథా, వివశం-అరుతు(దు)=నాకు శరీరము వశముగా లేదు. ఎన్నె=నన్ను, నీ=నీవనవిసరుము. ఎన్ను—అని, ఇరన్నాళ్=వేఁడుకొన్నది.

ఎన్=నా యొక్క, మాటిల్=ఱొమ్ముపైని, పోన్ను వీణ్ణు=వచ్చిపడి, అప్పురి కుటిల్ అకం+ఏ=ఆ నెఱికురుల లోపలనే, మాల్కినాళ్=మఱుఁగు పడెను.

శ్లో॥ "కణ్కొం డిందీవరాణాం కుటిలయ శిరసిజైః శైవలానాం ముఖంకొం।
డంభోజానా మళీనా మళకరచనయా కొంకయా కోరకాణాం।
ఏతేషాం కాంతి మృత్తై ర్గతి మపి భవతాం క ల్పితె న్నిన్నళిన్యాః।
మా యాంతీం నారణీతన్ దుహితర మర యన్నజ్ఞళే కండి తుండో" ॥

(లీలా. ద్వితీయశిల్పము. ౭ సూ. వివరణము).

అర్థము—ఇందీవరాణామ్=నల్లకలువల (యొక్క) వంటి, కణ్కొండు=(కన్నులుకొని) కన్నులచేత, శైవలానాం=నాచుతీఁగెల (యొక్క) వంటి, కుటిలయ శిరసిజైః=పొట్టివెండ్రుకలచేత, అంభోజానాం=పద్మముల (యొక్క) వంటి, ముఖంకొండు=(ముఖమునుగొని) ముఖముచేత, అళీనాం=తుమ్మెదల (యొక్క) వంటి, అళకరచనయా=కొప్పుచేత, కోరకాణాం=మొగ్గల (యొక్క) వంటి, కొంకయా=కుచములచేత, ఏతేషాం భవతాం=ఈ మీ యొక్క, కాంతిం-గతి మపి=శోభను, నడకను, కళ్ప=దొంగిలించుట, ఇతు—ఎన్ను=ఇదియని, ఆయాంతీం=వచ్చుచున్న, ఇన్నళిన్యాం=ఈ పద్మాకరమందు (ఈ సరస్సునందు) నారణీతన్=నారణియను స్త్రీ యొక్క, దుహితరం=కూఁతును, అర-అన్నజ్ఞళే=ఓ రాజ హంసలారా, కండితు+ఉండో=చూచుట కలదా=చూచితిరా?

శ్లో॥ "నట్టుచ్చ నేరత్తు దివాకరోయ।
మత్యన్త మా హన్త తపః కరోతి।
మధ్యస్థ మారాగిలు మున్నతానాం।
మట్టో (ట్టో) న్నుకాలం పిటియాదకోలం" ॥

అర్థము:— నట్టుచ్చనేరత్తు = మధ్యాహ్నసమయమందు, అయం దివాకరః=ఈ సూర్యుఁడు, ఉన్నతానాం=ఉన్నతులలో, మధ్యస్థమారాగిలుం=మధ్యస్థుఁడైనను, అత్యన్తం తపః కరోతి=మిక్కిలి తాపమును జేయును. ఆ! హన్త! మట్టో (ట్టో) న్నుకాలం = వేఱొకకాలమున, పిటియాదకోలం = అపరాధము చేయనిరూపము=అంత తాపము చేయఁడు.

౧. మణిప్రవాళకాలమున ననఁగా ౧౫ శతాబ్దమున లీలాతిలకమనెడి మణిప్రవాళలక్షణ గ్రంథ మొకటి సంస్కృతభాషను రచిత మయ్యెను. ౧౪ శతాబ్దము వఱకుఁ గొన్ని మలయాళ గ్రంథము లుండెడివి. ౧. రామచరితము—శ్రీరామకవి. బ్రాహ్మణేతరుఁడు. మూఁడు వేలపద్యములుగలవు.

౨. 'వడక్క-పాట్టగళ్' అను గ్రంథము—ఉత్తరదేశపు పాటలని యర్థము. వీనియందుఁ గొడుందమిళభాష విరివిగా నున్నది. వీనిలో మణిప్రవాళరీతి లేదు. సంస్కృత శబ్దముల వాడుక మిక్కిలి యల్పము. ౩. ౧౬ శతాబ్దపు కృష్ణగాథ. ఇందు సంస్కృతశబ్ద బాహుళ్య మున్నను మణిప్రవాళరీతిలేదు. ౧౭ శతాబ్దమున "ఎటు త్తచ్చన్"=(అక్షరములకుఁ దండ్రి=ఉపాధ్యాయుఁడు.) అను నాతఁడు మణిప్రవాళరీతిని గొంత శుద్ధపఱిచి యట్టిభాషతో రామాయణ భారతములను రచించెను. వీనియందు మణిప్రవాళరీతి మిక్కిలి తక్కువ. సంస్కృతశబ్ద బాహుళ్యము గలదు. నేఁటికిని నివియే మలయాళ గ్రాంథిక భాషకు మార్గదర్శకములు. తర్వాత డా. గుండర్టు దొరగారు ౧౮౬౮ సంవత్సరమున మలయాళభాషతో నొక మలయాళ వ్యాకరణమును, మలయాళకోశమును రచించిరి. పిదప ౧౯ శతాబ్దముననె "కోవుణ్ణి నెడుఙ్ఙాడి" అను నాతఁడు "కౌముది" యనెడి మలయాళ లక్షణ గ్రంథమును రచించెను. పిమ్మట ౨౦ శతాబ్దము నారంభమున "రాజరాజవర్మ కోయిల్ తంబురాన్" అను రాజకుటుంబము నాతఁడు "కేరళపాణినీయము" అనెడి గొప్ప వ్యాకరణమును మలయాళభాషతో రచించెను. ఇంక మఱి కొన్ని గ్రంథములను సైత మీతఁడు రచించెను. నవ్యముగా ననఁగా ౨౦ ఏండ్ల క్రిందట "శబ్దతారావళి" అనఁబడు మలయాళకోశము వెలసినది.

౧౫. IV విమ:—౨ తమిళ భాషా వాఙ్మయములు:—ద్రావిడభాషలన్నిటిలోను దమిళమునకు ముందుగ వాఙ్మయవత్త్వావస్థ గల్గినది. తమిళ పండిత సంఘములు మూఁడు, ముమ్మాఱు తమిళమును సంస్కరించిరనియు నందగస్త్యుఁడు మొదటి సంఘములోని ప్రధానుఁడనియు రెండవసంఘమునందలి ముఖ్యుఁడు "తొల్కాప్పియరు=తొల్కాప్పియనారు" అను నాతఁడనియు మూఁడవసంఘము వారు "నక్కీరు—పరణరు—కపిలరు" మున్నగువారనియుఁ దమిళ పండితులు చెప్పుదురు. తమిళవాఙ్మయములో మొదటి గ్రంథము "తొల్కాప్పియము" అనెడి తమిళ వ్యాకరణము. దీనిని దొల్కాప్పియనారు రచించిరనియు నీతఁ డైంద్రవ్యాకరణమును (సంస్కృత) జదివినవాఁడనియుఁ జెప్పుదురు. ఈతఁ డగస్త్య శిష్యుఁ డందురు. తొల్కాప్పియము తమిళమునకు విశాల ప్రామాణిక లక్షణ గ్రంథము. సంఘములచే సంస్కరింపఁబడినదానిని సె (చె) న్దమిళ మనియు నట్టి సంస్కారమందనిదానిని కొడు (టు) న్దమిళ మనియు వ్యవహరింతురు. తొల్కాప్పియము—క్రీ. పూ. నాఁటిదనియుఁ దృతీయసంఘపు తమిళ కావ్యములు 'తిరుక్కురళ్' మున్నగునవి క్రీ. శ. ౧—౨ శతాబ్దముల నాఁటివనియుఁ దమిళ పండితులు చెప్పుదురు. బర్నెలు దొరగారు తొల్కాప్పి

యము ౬ శతాబ్దమునాఁటిదని చెప్పిరి. "తిరుక్కురళు—తిరువాయిమొటి— (అఱవ వేదమందురు) చిలప్పదిగా (తికా) రము—మణిమేగ (క) లై—చిన్తామణి" మున్నగునవి తమిళ ప్రాచీన కావ్యములు. పరణరు చెప్పిన ౮౫ పద్యములు, కపిలరు చెప్పిన ౨౦౬ (౨౭౮ అని కొందఱు) పద్యములును (తొల్కాప్పియమునకుఁ దర్వాతివె) మిక్కిలి ప్రాచీనములు. తిరుక్కురళుకర్త తిరువళ్ళువరు. ఇతఁడు 'భగవన్' అను బ్రాహ్మణునకును 'ఆది' అను పంచమ స్త్రీకిని జనించెనని యొక కథ గలదు. పై గ్రంథములకుఁ దర్వాత బౌద్ధ జైనమత గ్రంథములును 'కంబరామాయణము' మున్నగు ననేక గ్రంథములును దమిళమున వెలసినవి.

తొల్కాప్పియరుగారి సతీర్థుఁడు 'పనమ్పారనారు' అను నాతఁడు తొల్కాప్పియమునకుఁ బీఠిక వ్రాసెననియు నందు తొల్కాప్పియ ఐంద్ర వ్యాకరణము చదివినట్లును 'నిలన్దరు తిరుపిలు పాణ్డియన్' అను రాజు సభలోని వేదవేత్తయగు నాచార్యుని యాక్షేపములకు సమాధానములు చెప్పి వాసి గాంచినట్లును వ్యావహారికాఱవమును బ్రాచీన వ్యాకరణములను గావ్యములను (చెయ్యుళ్) బాగుగఁ బరిశీలించి తొల్కాప్పియమును రచించినట్లును, జెప్పెననియుఁ దొల్కాప్పియ వ్యాఖ్యాతయగు 'ఇళంపూరణర్' అను పదవ శతాబ్దము నాఁటివాఁడు వ్రాసెను. యతి ప్రాస నియమములు తొల్కాప్పియమునఁ జెప్పఁబడినను మూఁడవసంఘపుఁ గావ్యములలో సైతమట్టి నియమములులేని పద్యము లగపడుచున్నవనియు, ౮—౯ శతాబ్దములనాఁడు యతి ప్రాస నియమము స్థిరపడెననియు ౯—౧౦ శతాబ్దములనాఁటి "యాప్పరుఙ్గలమ్" అనెడి తమిళ విశాలచ్ఛందో గ్రంథమున వ్రాయఁబడెను. నన్నూలు (నల్+నూలు= మంచి సూత్రములు గలది) అను తమిళ వ్యాకరణము పదుమూఁడవ శతాబ్దము నాఁటిది.

౧౫. V. 3 కర్ణాటభాషావాఙ్మయములు:— కర్ణాటభాషలో క్రీ. పూ. రెండవ శతాబ్దమందె వాఙ్మయ మారంభించె నందురు. ఒక డైలాగువంటి (Dialogue = ఇద్దఱ సంభాషణము) కన్నడ ప్రసంగము గ్రీకు లిపితో నీజిప్టునందు దొరకెనఁట. క్రీ. శ. ఆఱవ శతాబ్దములోని దుర్వినీతుని శాసన మొకటి కలదు. ఇందు సంస్కృత శ్లోకములును గన్నడభాషలోని కందములును, వృత్తములును గలవఁట. (చూ. కర్ణాట కవి చరిత్రము) ౮౧౮ మొ. ౮౭౭-వ. రాజ్యము పాలించిన రాష్ట్రకూట రాజగు నృపతుంగుని (అమోఘవర్షుఁడు) కవిరాజమార్గమున దుర్వినీతుఁడను కవి పేర్కొనఁబడెను. ఆఱవ శతాబ్దము నాఁడు రాజ్యపాలనముచేసిన దుర్వినీతుఁ డితఁడె కానోపును. కవిరాజమార్గ

మున దండిభామహుల గ్రంథముల విషయములె చాలవఱకుఁ జెప్పఁబడెను. మఱియు నిందు శ్రీ విజయ కవీశ్వర—జయబంధు—లోకపాల—ప్రభృతులగు నాలుగురు కవులు పేర్కొనఁబడిరి. దుర్వినీతుఁడు మున్నగు గద్యకవులు నల్గురు పేర్కొనఁబడిరి. కవిరాజమార్గమునఁ బ్రాసమునకు నియతత్వ మంగీకరింపఁ బడెను. పదచ్ఛేదరూపయతి యనావశ్యకమని నిరసింపఁబడెను. పదమధ్య పాదావసానదోష ముపేక్షింపఁబడెను. వైరిసమాసము నిరాకరింపఁబడెను.

క్రీ. శ. ౯౪౫ 'పంప' కవి, భారతము—ఆదిపురాణమును, క్రీ. శ. ౯౫౦ 'పొన్న' కవి శాంతిపురాణము, భువనైక రామాభ్యుదయమును, క్రీ. శ. ౯౯౦ 'రన్న' కవి గదాయుద్ధము — అజినాథపురాణమును (గదాయుద్ధము తప్పఁ దక్కిన వెల్ల జైనమత పోషక గ్రంథములు), క్రీ. శ. ౧౦౦౦ నాగవర్మ ఛందోంబుధి, కాదంబరియు, క్రీ. శ. ౧౧౪౫ వేఱొక నాగవర్మ, కావ్యావలోకనమును సంస్కృతభాషామయమగు 'కర్ణాట భాషాభూషణమును' (సంస్కృత భాషతో) మున్నగు ననేక గ్రంథములు కర్ణాటమున వెలసినవి. క్రీ. శ. ౧౨౪౫ కేశిరాజ (కేశవపండిత) రచిత శబ్దమణి దర్పణమనెడి కర్ణాట వ్యాకరణము కర్ణాటభాషా మయము వెలసియున్నది. భట్టాకలంక దేవకృతమగు కర్ణాట శబ్దానుశాసన మనెడి సంస్కృతభాషామయ కన్నడ వ్యాకరణము క్రీ. శ. ౧౬౦౪ సంవత్సరమున భట్టాకలంక దేవకృత భాషామంజరీ వృత్తితోడను భట్టాకలంక దేవకృత భాషా మంజరీ మకరంద వ్యాఖ్యతోడను వెలసియున్నది. కర్ణాట వ్యాకరణముల లోనికెల్ల నిది మిక్కిలి విస్తృతమైనది. కేశిరాజకృత శబ్దమణి దర్పణములోని విషయములను మఱికొన్ని ప్రమిత ప్రయోగసిద్ధ విషయములను నీ వ్యాకరణ కర్త విపులముగా వివరించెను. పయి గ్రంథములెల్ల పఴగన్నడ (పఴ= ప్రాచీన. పఴ = హళె.) విషయకములె. (పఴగన్నడము = ప్రాచీన కర్ణాటము). హొసగన్నడ మనఁగా నవీన కర్ణాటభాష. (పొస=క్రొత్త. పొస= హొస). కన్నడమున ౧౩ శతాబ్దము వఱకును బ్రాచీన కర్ణాట వాఙ్మయము "అక్కఱలు — రగడలు — వృత్తములు — కందములు — త్రిపదులు—గీతికలు—" అను పద్యములతో వెలసియున్నది, సీసములు లేవు. పిదప హొసగన్నడ వాఙ్మయము "షట్పదలు. చౌపదలు—ద్విపదలు" మున్నగు వానితో వెలసినది. ఈ పద్యములె హొసగన్నడారంభమునకు సూచకము లనఁదగును.

క్రీ. శ. ౧౯౧౦ సంవత్సరమున 'మల్లప' అను నూఱలుపండితుఁడు 'శబ్దాదర్శ' అను హొసగన్నడ వ్యాకరణమును రచించెను.

౧౫. VI విష:—ర. ఆంధ్ర భాషా వాఙ్మయములు:—తెల్గునకు గ్రాంధికతావస్థ తొమ్మిదవ శతాబ్దమువఱకును గల్గలేదు. పండరంగుని యద్దంకి శాసనము

(క్రీ. శ. ౮౪౮ ప్రాంతము) సీసపద్యరూపము. యుద్ధమల్లుని (క్రీ. శ. ౮౯౫ ప్రాంతము) బెజవాడ శాసనము మధ్యాక్కర పద్యరూపము.

క్రీ. శ. ౯౪౧ సంవత్సరమున జయసింహ వల్లభ మహారాజుల విప్పర్ల శాసము వెలసినది. అది మొదలుగ నట్టివె యగు తెల్గు వచన రూపములగు శాసనములు విస్తరించినవి. (చూ. ౧౮ VII విష) పదునొకండవ శతాబ్దము వఱకుఁ దెల్గున గ్రంథరచన మారంభింపఁ బడలేదు—క్రీ. శ. ౧౦౨౨ మొ. ౧౦౬౩ వఱకును వేంగీదేశమును పాలించిన రాజనరేంద్రుని కంకితముగా నన్నయభట్ట మహాకవి మహాభారతము నాంధ్రీకరింప నారంభించి రమారమి మూఁడు పర్వములు దెలిఁగించెను. పిదప ౧౨౫౦ (క్రీ. శ.) ప్రాంతము వాఁడగు తిక్కన సోమయాజి విరాటపర్వ మాదిగఁ బదేను పర్వములఁ దెల్గించెను. నన్నయభట్టు నాంధ్రీకృతికి శేషమగు నరణ్యపర్వ శేషమును క్రీ. శ. ౧౩౫౦ సంవత్సరము ప్రాంతము వాఁడగు నెఱ్ఱాప్రెగడ యాంధ్రీకరించెను. ఈ మువ్వురను గవిత్రయము వారని వాసిగాంచిరి. వీరి కవితామార్గమునె యనుసరించి పాల్కురికి సోమనారాధ్యుఁడు—నాచనసోముఁడు—భాస్కరుఁడు—శ్రీనాథుఁడు—(కవి సార్వభౌమ బిరుదాంకితుఁడు) పిల్లల మఱ్ఱి పినవీరభద్రుఁడు—కవి పితామహుఁడు (అల్లసాని పెద్దనామాత్యుఁడు) మున్నగు పెక్కురు మహాకవులు తెల్గున ననేకములగు మహా కావ్యములను రచించిరి. భారతాంధ్రీకరణము నారంభించిన వాఁడును దెల్గున గ్రంథరచనమునకే మొదటి వాఁడును నగు నన్నయ భట్టారకుఁడు సంస్కృత భాషను దెల్గునకుఁ దెచ్చికొను మార్గముల నుపదేశించుట ప్రధానముగాఁ జేసికొని యాంధ్రశబ్దచింతామణి యను చిన్న వ్యాకరణమును సంస్కృత భాషామయముగా రచించెను. దానిలోఁ జేరని యనేకములగు నాంధ్రభాషా లక్షణములను బూరించుచు నధర్వణాచార్యుఁడు వికృతి వివేక మను నాంధ్రశబ్దచింతామణి వివరణమును ౧౨౫౦ ప్రాంతమున రచించెను. మూలఘటిక కేతనయను తిక్కనశిష్యుఁ డాంధ్రభాషాభూషణమను చిన్న తెల్గు వ్యాకరణమును రచించెను. ఇట్లె మఱికొన్నియు వెలసెను. ఆంధ్రశబ్ద చింతామణికిఁ గవిశిరోభూషణమను పేరుగల యొకవిస్తృత వ్యాఖ్యాన మాహోబల పండితుఁడు సంస్కృత భాషామయముగ క్రీ. శ. ౧౭౦౦ ప్రాంతమున రచించెను. పైని వివరించిన వికృతి వివేకమనెడి యధర్వణ కారికలెల్ల నిందుదాహరింపఁబడి వ్యాఖ్యాతములయ్యెను. తర్వాత క్రీ. శ. ౧౮౫౮ సంవత్సరమున శ్రీ పరవస్తు చిన్నయసూరిగారు పూర్వగ్రంథముల నూఁతగాఁగొని బాల వ్యాకరణమును దెల్గున రచించిరి. అందుఁజేరని పెక్కు తెలుఁగు లక్షణ విశేషములను బూరించుచు శబ్దరత్నాకర కోశకారులగు 'శ్రీమాన్' బహుజన పల్లి సీతారామా చార్యులవారు త్రిలింగ లక్షణశేష మనెడి ప్రౌఢ వ్యాకరణ

మనుదానిని రచించిరి. పయిని వ్రాసిన నన్నయాథర్వణ కారికల నేక గ్రంథ ముగాఁ జోడించి కొన్ని వ్యాఖ్యలతోఁ ఆంధ్రవ్యాకరణ సంహితాసర్వస్వమను పేర నొక విశాలాంధ్ర వ్యాకరణము నీ నడుమనే నేను రచించి ప్రచురింపించి యున్నాను. ఇంకను గావ్యాలంకార చూడామణి యప్ప కవీయము మున్నగు ననేక ప్రాచీన లక్షణ గ్రంథములును గలవు.

ఇట్లు తమిళ మలయాళ కర్ణాటాంధ్రములు విశాల వాఙ్మయము గలవై ద్రావిడభాషలలో ముఖ్యములై యున్నవి.

౧౫. VII విష:—అందుఁ దమిళము దక్షిణ హిందూస్థానమునందలి చోళ—పాండ్యదేశములందును సింహళమునందును వ్యావహారిక భాషయై యున్నది. తమిళశబ్దము ద్రావిడశబ్దభవము. ఇది మధురార్థక మనియుఁ దమిళభాష మధురమైన దగుటంజేసి దాని కా పేరు సార్థకమనియుఁ దమిళులు చెప్పుదురు. "అఱవము. వై—వి. (అఱ+వాయి) ద్రావిడభాష" (శ—ర). "అఱి"=(ఎఱుఁగు) "అఱమ్"=(శీలమ్) అను తమిళ శబ్దములనుబట్టి 'అఱవమ్' అను పేరేర్పడెననియు, నట్లుగాన నఱవలు శీలవంతులనియు గొప్ప బుద్ధిశాలు లనియుఁ దమిళ పండితులు వచింతురు. (చూ. కాల్డు. పీఠిక ౮-౯-౧౫ పుటలు).

కర్ణాటభాష మైసూరు రాష్ట్రమందును, 'కనరా' 'బల్లారి' మున్నగు జిల్లాల యందును వ్యావహారిక భాషయై యున్నది. "కఱు+(నల్లని)+నాడు= కర్నాడు=(కన్నడము='కర్నాటము') అను రీతిని దీని పేరేర్పడెననియు నిది కన్నడదేశ్య శబ్దమనియుఁ (చూడు. కాల్డు. ౩౦ పు.) జెప్పుదురు. ఇట్టి వ్యుత్పత్తి చెప్పుచు డా. కాల్డువెల్లుగారు 'కర్ణాటకము' అని ణత్వఘటిత రూపము నుదాహరించుట పొరపాటు. "కర్ణ+అట=కర్ణాట" అను రీతి నిది ణత్వఘటిత సంస్కృత శబ్దమనియు నీ భాష శ్రుతిహితమగుటచేత దీని కీ పేరు సార్థకమనియుఁ గర్ణాట పండితులు కొందఱు వచింతురు.

౧౫. VIII విష:—తెల్గు—తెల్గుదేశము:—'నేఁడు—విశాఖపట్టణము—గోదావరి—కృష్ణ—నెల్లూరు—దత్తమండలములు' అను జిల్లాలయందును నిజాము రాష్ట్రమునఁ గొంతభాగమందును దెలుఁగు వ్యావహారిక భాషయై యున్నది. "తెలుఁగు=తెనుఁగు" అనునవి త్రిలింగ శబ్దభవము లందురు. (కాల్డు. పీఠిక ౨౯—౩౦ పుటలు) (చూ. వ్యా. సం. విస్తర I, II, III ౬౧ II విష). "శ్రీ శైలము, ద్రాక్షారామము—(దక్షారామము) కాళేశ్వరము" అను శివలింగ క్షేత్ర ములు సరిహద్దులుగాఁ గలదగుటచే నిది త్రిలింగదేశ మనఁబరగెను. ఇందలి కాళేశ్వర మనునది హైదరాబాదులోనిదని కొందఱందురు. కాళిదాస వర్ణిత

నర్మదాతీరస్థ మహాకాలనాథక్షేత్రమని ప్రామాణికుల యాశయము. "ఆంధ్ర రాజులనెడి శాతకర్ణిరాజులు......ఆంధ్రభృత్యులనియు 'ఆంధ్రు' లనియు భిన్న భిన్నముగా వ్యవహృతులయిన యీ రాజులు దక్కను రాజ్యమును పాలించిన కాలము దాదాపు క్రీ. పూ. 23 మొ. ౨౧౮ వ. మూఁడు శతాబ్దములుగా లెక్కింపఁబడినది...పూర్వ పశ్చిమ సముద్రములకు నడుమ నున్నట్టియు (బందరు నుండి పూనా—బొంబాయి వఱకును దక్షిణమున "కడప-కర్నూలు-నెల్లూరు" జిల్లాలను గలిపికొని ఉత్తరమున సాంచీవఱకున్నట్టియు విశాలప్రదేశమును శాతకర్ణి రాజులు పాలించిన ట్లూహింపఁబడియెను." (ఆం. భా. వి. ౮-౯ పుట).

ప్రాచీన కాలమున నాంధ్రదేశ ముత్తరమునఁ జాలవఱకు వ్యాపించి యుండెననుట నిశ్చయము. శాతకర్ణి రాజుల తొలుతటి రాజధానియగు ప్రతిష్ఠానపురము మహారాష్ట్ర దేశములోనిదగుటచేత నచటి మాతృభాష ప్రాచీనకాలమున మహారాష్ట్ర ప్రాకృతమై యుండనగును. కాని యంత మాత్రమున శాతకర్ణిరాజుల మాతృభాష ప్రాకృతమె యనుట సరికాదు. "వీరి శాసనములన్నియుఁ ప్రాకృతముననే యున్నవి......దీనినిబట్టి శాత వాహనుని మాతృభాష ప్రాకృతమె" (ఆం. భా. వి. ౧౩ పు.) అనరాదు. శాతకర్ణి రాజులు మహారాష్ట్రదేశమును సైత మేలిన వారగుటచేత వారికి సంస్కృత ప్రాకృ తములందుఁ బాండిత్యాదరము లుండిన నుండవచ్చు ననఁదగును. అంతమాత్ర మున వారి మాతృభాష ప్రాకృతమని యెట్లు నిర్ణీతమగును? ఆ ప్రాచీన కాలము నాఁటికింకను నాంధ్రమునకు గ్రాథింకతావస్థ కల్గియుండమింజేసి యా కాలమున సంస్కృతప్రాకృతములతో శాసనములు వ్రాయించుట సంప్రదా యమై యుండవచ్చును. ప్రాకృతాదులు వాడుక భాషలైయుండ సంస్కృత శాసనములు వ్రాయఁబడలేదా? మలయాళదేశమునఁ గొంతకాలము వ్యావ హారికభాష మలయాళమును శాసనభాష సెన్దమిఴము నై యుండలేదా? దక్షిణ హిందూస్థానము చేరకముందు తమిళాంధ్రాది భేదములనంది పీడిన ద్రావిడులు హిందూదేశములో నలువంకల నాక్రమించుకొని వ్యాపించిరి గాన వారిలోని యాంధ్రులను తెగలోనివారు శాతకర్ణిరాజులు కావచ్చు ననుటలోను వార లయు వారితోడి మఱికొందఱు జనులయు వాడుకభాష యాంధ్రము కావచ్చు ననుటలోను విరోధ మేమున్నది? ఆర్యులకన్న ముందే ద్రావిడులు హిందూ దేశమునకువచ్చి నలువంకల నాక్రమించుకొని యుండిరనియుఁ దర్వాత వేద రచయితలగు నార్యులువచ్చి వారిని దక్షిణమునకుఁ దఱిమిరనియుఁ జరిత్రకారు లెల్ల సమ్మతించి వచించుచున్నారుగదా. (చూ. ౧౫. XI విమ).

కాలక్రమమున నీ శాతకర్ణిరాజులు నేఁ డాంధ్రదేశ మనఁబడుచున్న ట్టియు (అప్పటికేయం దాంధ్రము దేశ వ్యవహారభాషగా విస్తరించి యుండెను.)

నాంధ్రజాతులవారి నివాసమై యున్నట్టియు త్రిలింగదేశమున నప్పటికిఁ బ్రసిద్ధమయి యున్నట్టి త్రిలింగదేశములోని గుంటూరి ప్రాంతముననున్న ధాన్యకటకమును రాజధానిగాఁ జేసికొని పాలించిరి. "గుంటూరునకు సుమా రిరువది మైళ్ల దూరమున "అమరావతి, ధాన్యకటకము" అను రెండు గ్రామములు గలవు......ప్రతిష్ఠానము. ఆ పురమునే ఆంధ్రరాజులలో ప్రాచీనులు రాజధానిగాఁ బాలించిరనియుఁ దరువాత వారు ధాన్యకటకమును రాజధానిగాఁ బాలించిరనియుఁ జరిత్రకారుల యూహా" (ఆం. భా. వి. ౮ పుట).

౧౫. IX విష:—"తస్య విశ్వామిత్ర స్యైకశతం పుత్త్రా ఆసుః.....త ఏతే న్ధ్రాః పుణ్డ్రాః శబరాః పుళిన్దాః ..." (ఐతరేయ బ్రాహ్మణము-౭ పంచిక-౩ అధ్యా. ౧౮-ఖండిక) ఇట్లు విశ్వామిత్ర శప్తులయి తత్పుత్త్రు లాంధ్ర పుళిందాదులైరని యైతరేయ బ్రాహ్మణమున నున్నది. దీనికి సరిగ "కారావర నిషాదాత్తు। చర్మకారః ప్రసూయతే। వైదేహకా దన్ధ్ర వేతౌ। బహిర్గ్రామ ప్రతిశ్రయా" అని మనుస్మృతియు నంధ్రులను హీనజాతుల వారినిగా వచించుచున్నది. కాని యార్యపండిత రచితమయి యార్య జాతులవారి విషయమున వ్రాయఁబడిన మనుస్మృతిలో నార్యజాతుల విభాగము చెప్పఁబడెననుట యర్థము. అంతియ కాని యార్యులకన్న నెంతో కాలము ముందుగ వచ్చి వేఱు తెగలుగ నున్న ద్రావిడుల లోని యొక తెగ వారి విషయమున నట్టి వచనము (మనుస్మృతిని) నన్వయించుట కేవలము నసంగతముగదా. మనుస్మృతిలోని యా సందర్భము నందలి బ్రాహ్మణాది వర్ణములెల్ల నార్యజాతులలోనివే కదా. అవి యార్యేతరజాతి విషయకములని యెవ్వరును జెప్పఁజాలరు గదా. కావునఁ బయి నుదాహరించిన యైతరేయ బ్రాహ్మణ మనుస్మృతి వచనములు విశ్వామిత్రపుత్త్రా ర్యాంధ్రజాతి విషయకములే కాని ద్రావిడాంధ్రజాతి విషయకములు కానేరవనుట నిశ్చయము.

తమిళాంధ్రాది భేదములనంది యుత్తర హిందూస్థానమున నార్యుల కన్నఁ బూర్వమే వ్యాపించియున్న ద్రావిడ జాతులలోని యాంధ్రుల కాంధ్ర సంజ్ఞ వారికిఁగల పరాక్రమాతిశయమున సిద్ధించియున్నదనఁదగును. "అన్ధ్యతే అనేన శత్రుః"=వీనిచేత శత్రు వంధుఁడుగాఁ జేయఁబడు నను వ్యుత్పత్తి చొప్పున "అన్ధ+ర=అన్ధ్ర" అను రీతిని గరణార్థమున 'ర' ప్రత్యయము వచ్చుటచే "ఆంధ్ర" శబ్దమేర్పడె ననఁదగును. ప్లినీయను చరిత్రాభిజ్ఞుఁడు "అందర" అను జాతివారు పరాక్రమవంతులనియు వారికి లక్షపదాతులు రెండువేల యాశ్వికసేనయు వేయి యేనుంగులును నెనుబది దుర్గములు గల పురములును గలవనియుఁ జెప్పెను" (ఆం. భా. వి. ౭ పు. చూడు) కాన ద్రావిడులలో నొక

తెగ యాంధ్రులనియు వారు గొప్ప వీరులనియు నక్కారణమున వారికాంధ్ర సంజ్ఞ గల్గెననియు సిద్ధాంతిత మగుచున్నది.

కాలక్రమమున ద్రావిడాంధ్రులకును నార్యజాతులవారి ధర్మశాస్త్ర పురాణాదులై ప్రవృత్తి నివృత్తి మూలములై విస్తరించుటచేతను నార్యాంధ్రజాతి హీనజాతిగా నార్యగ్రంథములు వచించుచుండుటచేతను ద్రావిడాంధ్రరాజులగు శాతకర్ణి రాజులు తమ యాంధ్రత్వమహిమమును దెలిసియో తెలియకయో యాంధ్రభాషా వికాస కర్తగారు వ్రాసినట్లు (ఆం. భా. వి. ౧౨-౧౩-౧౪ పుటలు) వారాంధ్రులమని చెప్పికొనుటకు వెనుదీసియుండిన నుండవచ్చును. పయి సందర్భమునుబట్టి కొందఱాంధ్రభాషాచరిత్ర విమర్శకు లభిప్రాయపడు చున్న విషయము సత్యముకాదనియు మనుస్మృతిలో హీనజాతిగాఁ జెప్పఁబడిన యాంధ్రజాతి ద్రావిడాంధ్రజాతి కాదనియు నయ్యది యార్యాంధ్రజాతి కానోపు ననియు నిశ్చయింపనగును. వేర్వేఱు వ్యుత్పత్తులుగల యాంధ్రశబ్దములు రెండును గాకతాళన్యాయమున నిట్లు వర్తించి భ్రాంతిగొల్పెనని యెఱుంగ నగును.

౧౫. X విష.—౫. తుళుభాష:—"దీనికి బ్రిగ్గిలు దొరగారు వ్యాకరణమును రచించి ముద్రింపించిరి. ఇది కన్నడమున కెక్కువ సన్నిహితముగా నుండును. ఇది మలయాళ శాఖలోనిదని 'ఇల్లిసు' దొరగారు చెప్పినది సరికాదు. దీనికి లిపి లేదు—మంచి వాఙ్మయమును లేదు. దీనిని గన్నడ లిపితో వ్రాయు దురు. "తుళు=(నమ్ర)" అను శబ్దమునుబట్టి యీ జాతి యడఁకువ గలదని తేలుచున్నది. ఇది మాంగులూరు సమీపమున నున్న కనరా జిల్లాలో "చంద్ర గిరి-కల్యాణపురి" అను నదుల నడుమ-౫-లక్షల జనులకు వాడుక భాషయై యున్నది." (కాల్డు. పీఠిక ౩౧-౩౨ పుటలు).

౬. కూర్గు=కుడగుభాష:—ఇది పడమటి కనుమలలోని జనుల వాడుక భాష. ఈ జాతిలో నొక స్త్రీ కేక కాలమం దనేక భర్తలుండెడి ప్రాచీన ద్రావిడా చారము గలదు. కాన నిది యత్యంత ప్రాచీన మనఁదగును. దీని కొక వ్యాకరణము 'కోలు' దొరగారిచే రచింపఁబడెను. ఇదియుఁ గన్నడ శాఖా భేద మనఁదగును. దీనిలోఁ గొన్ని పాటలు నైతము ముద్రితములయినవి. దీనికిఁ దమిళ మలయాళములతో నున్న పాటి సంబంధము కన్నడముతో లేదని డా. మగ్లింగు దొరగా రనిరి (కాల్డు. పీఠిక ౩౩ పుట).

౭. తుద=(తోద భాష)—"ఇది నీలగిరి కొండలలోని "తుదవరులు లేక తుదలు" అనువారి వ్యావహారిక భాష. ఇప్పుడు వీరి సంఖ్య ౭౦౦ మాత్రమె. వీరికి నల్లమందు తినెడి యాచారము గలదు. వీరియందును

నేక కాలమున స్త్రీకి బహుభర్తృకత యుండు నాచారము గలదు. వీరిలో నాఁడు పిల్ల పుట్టఁగనే తటుచుగఁ జంపివేయు నలవాటు గలదు. కావుననె .వీరి జన సంఖ్య తగ్గిపోవుచున్నది. తమిటములోని 'తొాటి=గుంపు=సమూహము' అను శబ్దముతో నీ 'తుద' అనుదానికి సంబంధము గలదని డా. 'పోపు' దొరగారు చెప్పిరి. కాని దీనిలోని ద్వితీయ వర్ణము దంత్యము గాన నట్టి మార్పు గల్గ నేరదు." (కాల్డు. పీఠిక 33, 34 పుటలు).

౮. 'కోత' భాష:—"ఈ భాషను వాడెడువారు నీలగిరి కొండలలో ౧౨ వందలమంది గలరు. ఇది చాల ప్రాచీన భాష. ఇది కన్నడ శాఖ లోనిది. మోటుగానుండును. నీలగిరి కొండలలో మఱి రెండు భాషలు గలవు. I. బడగ భాష. ఇది కన్నడ శాఖలోనిది. ప్రాచీనమైనది. కొంత కట్టుపాటు గలది. II. ఈ రెండవ భాషను "ఇరుళరులు" (చీఁకటి జనులు) "కురుంబరులు" (మేకలు మేపువారు) వాడుదురు." (కాల్డు. పీఠిక 34 పుట).

౯. గోండు భాష:—"మధ్య భారతదేశములోని 'గోండువాన' అను నడవులలోనుండు (ఇది జబ్బలపూరు, నాగపూరు ప్రాంతము) జనుల వాడుకలో నున్నది. గోండుల సంఖ్య ౧౫ లక్షలు. 'డ్రిబర్గు' దొరగారు దీనికొక వ్యాకరణమును గోశమును వ్రాసి ౧౮౪౯ సంవత్సరమున ముద్రించిరి. 'డాసన్' దొరగారు బైబిలులోని "మ్యాత్యు మార్కు" అను రెండధ్యాయము లను గోండు భాషలోనికిఁ బరివర్తించి ౧౮౭౨ సంవత్సరమున నలహాబాదులో ముద్రింపించిరి." (కాల్డు. పీఠిక 34 పుట).

౧౦. ఖోందు = కు భాష:—"దీనిని 'కు' భాష యనుట లెస్స. ఒరిస్సాలో వీరిని 'కంధ్' అందురు. వీరు తమలోఁదమ్ము "కు—కోయిలోరు" అని పిలిచికొందురు. గోండువారు వీరికి సోదరులు. వీరు 'ఒరిస్సా' లోను 'గోండువానా' అడవులలోను గలరు. వీరు దుష్టులు. శిశువులను దొంగి లించి బలియిత్తురు. వీరికిఁ దర్వాతి దక్షిణపువారు 'శబర' భాషను వాడుదురు. ('సవర' కాఁబోలు?) 'గోండు—ఖోందు' శబ్దములు తమిటములోని 'కున్ద్ర' (కున్రు) అను శబ్దమునుండి వచ్చినవి. దీనినుండియే 'కొండ' అను తెనుఁగు శబ్ద మేర్పడెను. కాని తెల్గువారు వీరిని 'కోదులు—గోందులు' అనుట వింత. లక్ష్మాజీగారు (లింగం లక్ష్మాజీ పంతులుగారు?) వ్రాసిన 'కోదు' భాష వ్యాకరణ ముళో "కు=కున్ద్రు=కొండ" అనువాని సంబంధము సందేహాస్పద మనిరి. "కు—కోయి" అను శబ్దములకు సంబంధము గలదు. కావుననే వారు తమ్ము

"కోయిలోరు" అని పిల్చుకొందురు. వీరి జనసంఖ్య నైదులక్షలు." (కాల్డు. పీఠిక ౩౫ పుట).

౧౧. మాలెరు భాష:—"దీనికి 'రాజమహాలు' అనియుఁ బేరు గలదు. ఇది బెంగాలులోని రాజమహాలు కొండలలోనివారి భాష. దీని శబ్దముల చిన్న కోశము 'ఏషియాటిక్ రిసర్చ్' అనుదాని నైదవ సంపుటమునఁ గలదు. 'ఎత్నాలజీ బెంగాల్' అనుదానిలో 'దాల్‌తోన్' గారు మఱికొంత పెద్ద పట్టికను వ్రాసిరి. దీని స్వరూప స్వభావములు ద్రావిడభాషలను బోలి యున్నవి. దీనిని వాడెడివారి సంఖ్య ౬౮ వేలు. రాజమహాల్ కొండలలోని 'కోలులు' కుటుంబపు 'సంతాలు'ల భాష ద్రావిడభాష కాదు." (కాల్డు. పీఠిక ౩౫ పుట).

౧౨. ఒరాఒన్=(orâons):—"చోటా నాగపూరు దరిని 'ఒరానులు' గలరు. వీరి సంఖ్య యెనిమిది లక్షలు. 'దాల్‌తోన్' దొరగారు వ్రాసిన 'బెంగాల్ ఎత్నాలజీ' అను పుస్తకములో నీ భాష విషయమున నొక పెద్ద వ్యాసము గలదు. వీరి భాషయందు ద్రావిడభాషా ధర్మములు కన్పట్టుచున్నవి. వీరి వాడుకలనుబట్టి వీరు పూనా ప్రాంతమందలి 'కొంకణ' ప్రాంతమునుండి వచ్చినట్లు కనఁబడును. వీరు తమ్ము "ఖురంకులు" అని చెప్పికొందురు. వీరు తమ చరిత్రను జెప్పికొనునపుడు పాట్నా కొండలనుండి తఱుమఁబడి వచ్చినట్లు చెప్పికొందురు. 'మాలెరులు' 'ఒరానులు'ను నేకజాతియేమోయని వారి వాడుకలను నాచారములను బట్టి తోఁచును." (కాల్డు. పీఠిక ౩౬ పుట).

"ఈ రాజమహాలు—ఒరాఒన్ భాషలలో 'కోలేరియన్' భాషా కుటుంబపు చిహ్నములు పెక్కు గాన్పించుచున్నవి. కాని వీనిలోని ముఖ్య వ్యవహారస్థ ధాతువులు — సర్వనామములు — మొదటి నాలుగు సంఖ్యావాచకములును ద్రావిడభాషా సంబంధులై యుండుటచేత వీనిని ద్రావిడభాషా కుటుంబములోఁ జేర్చుటకు వెనుదీయ నక్కఱలేదు. "హడ్‌క్సన్" దొరగారు "ఒరాను" భాష 'కోలు—మాలెరు' భాషల సంధియనియు, మాలెరు భాష, "కోలు—తమిళ" భాషల సంధియనియుఁ జెప్పిరి." (కాల్డు. పీఠిక ౩౬ పుట).

౧౫. XI విష:—"పయిరీతిని రాజమహాల్ కొండలలో (బెంగాల్) నున్న 'మాలెరు—ఒరాఒన్' భాషలలో ద్రావిడభాషల ధర్మము లగపడు చుండుటం జేసి ద్రావిడులు మొదట గంగాతీరమం దనుటకు, జంకినను బెంగాలులో నుండి రనుటకు సందేహింప నక్కఱలేదు. దీనినిబట్టి హిందూదేశము లోని చాల భాగములు ద్రావిడులచేత నాక్రమింపఁబడి యుండెనని విశదమగు చున్నది. దాల్‌తోనుగా రింకను నెక్కువగా బెంగాలులో ద్రావిడుల

వ్యాప్తిగలదనియు "కూచులు—బుర్యాలు" అను నలువదిలక్షల జనులు (బెంగాలులో ౧/౧౦ వంతు) చోటా నాగపూరు ప్రాంతములలోఁ గలరనియుఁ జెప్పిరి. కాని శరీర విషయములందును, భాషా విషయములందును బెంగాలువారిలో ద్రావిడధర్మము లంతగా నగపడవు. ఇప్పటి ద్రావిడులలోనె శుద్ధ ద్రావిడరక్త మగపడదు. కాన 'దాల్‌తొను' గారి మాట సాహసికము." (కాల్డు. పీఠిక ౩౭ పుట).

"రమూసి మున్నగు త్రిమ్మరుల భాషలను ద్రావిడభాషలలో నేను జేర్ప లేదు. రమూసీ లోక విధముగు తెనుఁగును మాటాడుదురు. "హో-ముండా" (కోలుల) భాషలను జేర్పలేదు. సవరభాషలను జేర్పలేదు. (దీనికే కాఁబోలును 'కళాప్రపూర్ణ—గిడుగు వేంకటరామమూర్తి పంతులుగారు వ్యాకరణమును గోశమును వ్రాసిరి) ఇవెల్ల 'గోందు—కు' మున్నగు వానిని సంబంధించినవె యనఁదగును. వీనిలో నేవో కొన్ని ద్రావిడపదములున్నను వ్యాకరణ సంబంధమంతగాఁ గానరాదు" (కాల్డు. పీఠిక ౩౮ పుట).

౧౫. XII విష:—బ్రహూయి భాష:—"ఇది 'బెలూచి స్థానము' లోని 'కెలత్' రాష్ట్రమందలి యాటవికుల భాష. ఇందు ద్రావిడభాషల ధర్మములు—వ్యాకరణ చిహ్నములు—పెక్కుగలవు. కాని యిందు ద్రావిడేతర ధర్మము లెక్కువగా నుండుటచేత దీనిని ద్రావిడభాషా కుటుంబములోఁ జేర్పరాదు. ఈ భాషవారు 'ఎలప్పొ' నుండి వచ్చితి మందురు. కాన వీరు "ఇండో యూరపు" కుటుంబమువారనుట యుక్తము. ఇండో యూరపియను భాషల వారికంటె ముందె ద్రావిడులు (హిందూదేశమునకు) వచ్చియుండుటచేత వారి పదము లిందుఁ జేరియుండుట వింతకాదు. ఈ బ్రహూయీని బట్టి ద్రావిడులు మధ్యాసియానుండి వచ్చుటలో నచ్చటఁ గొందఱు (బెలూచి స్థానమువ) మిగిలి యుండి పోయిరని తేలుచున్నది. మఱియు ద్రావిడులు "కైబరు—బులాన్." కనుమల మార్గముననే హిందూదేశమునకు వచ్చిరని విశదమగుచున్నది." (కాల్డు. పీఠిక ౩౯—౪౦ పుటలు). (కాల్డువెల్లుగా రచ్చటచ్చట దీనిని ద్రావిడ భాషలలోఁ జేర్చితినని వ్రాసిరి. సర్వనామాది వివరణమునందును వాని పట్టిక లందును ద్రావిడపట్టికలలోఁ జేర్చిరి. చూడు. ౧౬ XIII విష. మొ).

౧౬. I విష:—ద్రావిడ లిపి:—"భారతీయ లిపులకెల్ల నశోకచక్రవర్తి శాసనముల లిపియే మూలమని తోఁచెడిని. అశోకుని శాసనములు క్రీ. పూ. ౨౫౦ సంవత్సరము ప్రాంతములోనివి. పెక్కురు దొర (బీమ్సు—ఎల్లిసు—తామసు — ఎగ్గిలింగు — మొ.) లీ విషయమునఁ బెక్కువిధముల వ్రాసిరి.

డా. కాల్డువెల్లు దొరగారు పై పద్ధతులనెల్ల విమర్శించి యిట్లు వ్రాసిరి. "అశోక శాసన లిపినుండి ప్రాచీన ద్రావిడ లిపి పుట్టెనో? ప్రాచీన ద్రావిడ లిపినుండి యశోకశాసన లిపి పుట్టెనో? యిప్పటికి నేను నిర్ణయింపఁజాలను." కాల్డు. ధ్వనులు. ౧౨౮ పుట) "బీమ్సు దొరగారు చెప్పినట్లు 'అశోకశాసన లిపియే ప్రాచీన ద్రావిడ లిపికి మూల' మనుట నాకు సమ్మతము" (కాల్డు. ధ్వనులు. ౧౨౮ పుట).

"౧౮౭౭ సంవత్సరపు 'ఇండియన్—ఏంటిక్వైరీలోని క్రీ. శ. ౭౭౪ సంవత్సరపు శాసనలిపి ప్రాచీన తమిఁటలిపి. అఱవలు దీనిని బదవ శతాబ్దమున విడిచిరని బర్నలు దొరగారు వ్రాసిరిగాని ౧౨ శతాబ్దపు తిరునల్వేలి శాసనము లందును నా ప్రాచీన తమిఁటలిపి కన్పట్టుచున్నది. మఱియు నట్టి తిరునెల్వేలి శాసనములు మఱికొన్నిటిలో నేఁటి తమిఁటలిపికి మూలమనఁదగు వేఱొక తమిఁటలిపి వెలయుచున్నది. ఈ రెండవలిపిని నేను 'చోళలిపి' అని వాడెదను" (కాల్డు. ౧౨౬ పుట).

"తెనుఁగు లిపికిని గన్నడ లిపికిని విశేష భేదములేదు" కాల్డు. ౧౨౩ పుట).

నేఁటి తెనుఁగు లిపికిని నేఁటి కర్ణాట లిపికిని విశేష భేదము లేదన్న మాట సరియె. ప్రాచీన లిపి విషయమున నట్లనరాదు. ప్రాచీన కర్ణాట శాసనములును బ్రాచీనాంధ్రశాసనములును నొక్క లిపితోనె (అభిన్న లిపితోనె) వెలయుచున్నవి. అట్టి ప్రాచీనాంధ్ర కర్ణాట సాధారణ లిపియే నేఁటి యీ షద్భేదము గల కర్ణాటాంధ్ర లిపులకు మూలమై యున్నది.

నేఁటి తమిఁట లిపిలోని పెక్కు వర్ణములు గ్రంథాక్షర లిపిలోనివె యనఁదగును. తమిఁటములో లేని సంస్కృతపద గతాక్షరములు వ్రాయవలసి వచ్చునపుడు తమిఁటులు వానిని గ్రంథాక్షరములతో వ్రాయుదురు. మలయాళు లీ గ్రంథాక్షరలిపిని సాకల్యముగ స్వీకరించిరి. ప్రాచీన కాలమున మలయాళ గ్రంథములు 'కోలెఴుత్తు' అను లిపితో వ్రాయఁబడెడివి. తర్వాతఁ దమిఁట గ్రంథాక్షరములతో వ్రాయసాగిరి. కాన నట్టి తమిఁట గ్రంథాక్షరముల పరిణామమే మలయాళ లిపిగ ౧౨ శతాబ్దము నుండియు నేర్పడెను.

౧౬. II విష:—అచ్చాంధ్రమందును నచ్చకర్ణాటమందును మహాప్రాణాది (వర్గద్వితీయ చతుర్థములు మొ.) వర్ణములు లేకున్నను సంస్కృత శబ్దములు యథా స్థితముగాఁ దత్సమరూపమున నీ రెండుభాషలందును బ్రవేశించుట సమ్మత మగుటచేత వీనియందు మహా ప్రాణాది ధ్వనులకును లిపు లేర్పడ వలసెను. తమిఁటము నందట్లుగాక సంస్కృత శబ్దములు వచ్చునపుడు వానిలోని

మహా ప్రాణాది వర్ణములు తమిళములో నున్న తత్సంబంధి వర్ణములుగా మాఱియే వచ్చుట సంప్రదాయమగుటం జేసి తమిళ లిపిలో మహా ప్రాణాది ధ్వనులకు లిపు లేర్పడవయ్యెను. ఉదా:—సం. భాషా. తెల్గు తత్సమ. భాష.- కన్నడ తత్సమ. భాషె. తమి. పాడై. ఇట్టివానికిఁ దమిళమునఁ దత్సమత్వమే లేదు. ఇంకఁ దమిళ మందుఁగల వర్ణములతో మాత్రమె యుండెడి సంస్కృత శబ్దము తమిళమునఁ దత్సమముగఁ బ్రవేశించును. ఉదా:—సం. కమలమ్. తమిళ తత్సమ ఏ. కమలమ్. బహు. కమలఙ్గళ్. మొ.

పైరీతిని యచ్ఛాంధ్రమున 'ఋ-ౠ-ఌ-ౡ-విసర్గము-జ-ఞ-శ-ష' అను వర్ణములు లేకున్నను సంస్కృత సమములకై యట్టి ధ్వనులకు లిపి తెలుఁగునఁ గలదు. ఇట్లే 'జ-ఞ'లు తప్ప దక్కినవి కర్ణాటమందును లేవు. అయినను వానికిని లిపి గలదు. సంస్కృతమున లేని, 'ఎ-ఒ-ఁ-ౘ-ౙ-ఱ-ఴ' అనునవి యాంధ్ర కర్ణాటములలోఁ గలవు గాన వానికెట్లును వానిలో లిపి గలదు. దంత్య 'చ జ'లు కర్ణాటమందును లేవు. తెల్గున మాత్రము గలవు. 'ఴ' అను వర్ణము తెల్గునఁ బ్రాచీన కాలమున నుండెడిది. ఇపుడు లేదు. "దంత్య 'చ జ'లు తెల్గున నున్నను వానికి లిపి లేదని కాల్డువెల్లుగారు వ్రాయుట పొరపాటు. (కాల్డు. ౧౨౯ పుట).

"దన్త్యచజౌ గురురలౌ చ బిన్దుయుతౌ" (ఆం. చిం. అప్పకవీయ పాఠము. సంజ్ఞ ౩౩ శ్లో. అహో ౧౭౯ పుట. వై-పా-౩౬౫ విప. 'వ్యా. సం'. ౭౯ II విప) అను చొప్పున 'చ-జ'ల మీఁద బొట్టును నిల్పినచో నవి దంత్య 'చ జ'ల కనుమాపకములగును. ఇట్లే నన్నయాధర్వణు లాంధ్ర కర్ణాట సాధారణ లిపిని దీసికొని కొన్ని మార్పులతోఁ దెలుఁగునకుఁ బ్రత్యేక లిపిని గల్పించిరి. కాని యట్టి నన్నయాధర్వణోక్త లిపి వాడుక కెక్కమింజేసి యర్వాచీనులు 'చ—జ'ల పయిని దంత్య తకారపు లిపిని నిల్పి దంత్యచజలను వ్రాయుచున్నారు—'ౘ'—ఇది దంత్యచకారము. 'ౙ'—ఇది దంత్య జకారము. శబ్దరత్నాకర కోశము బాలవ్యాకరణము మున్నగు వానిని జూచునది.

ఈ క్రింద నేఁటి ద్రావిడ లిపుల యాకారములు చూపఁబడుచున్నవి. అట్లు చూపుటలో హల్లులమీఁద నుచ్చారణార్థముగ నిల్చు 'అ' కారముతోఁ గూడిన లిపులె చూపఁబడుచున్నవి.

౧౬. III విష:—ద్రావిడ లిపులు.

| గ్రంథాక్షరములు | తమిళు. | కన్నడ. | తెల్గు. | గ్రంథ. | తమిళ. | కన్నడ. | తెల్గు. |
|---|---|---|---|---|---|---|---|
| 𑌅 | அ | ಅ | అ | ... | எ | ಎ | ఎ |
| 𑌆 | ஆ | ಆ | ఆ | 𑌏 | ஏ | ಏ | ఏ |
| 𑌇 | இ | ಇ | ఇ | 𑌐 | ஐ | ಐ | ఐ |
| 𑌈 | ஈ | ಈ | ఈ | ... | ஒ | ಒ | ఒ |
| 𑌉 | உ | ಉ | ఉ | 𑌓 | ஓ | ಓ | ఓ |
| 𑌊 | ஊ | ಊ | ఊ | 𑌔 | ஔ | ಔ | ఔ |
| 𑌋 | ... | ಋ | ఋ | 𑌅𑌂 | ... | ಅಂ | అం |
| 𑍠 | ... | ೠ | ౠ | 𑌅𑌃 | ... | ಅಃ | అః |
| 𑌌 | ... | ಌ | ఌ | 𑌕 | க | ಕ | క=క |
| 𑍡 | ... | ೡ | ౡ | 𑌖 | ... | ಖ | ఖ |
| ... | ... | ... | ... | 𑌗 | ... | ಗ | గ |

| గ్రంథ. | తమి. | కన్న. | తెల్గు. | గ్రంథ. | తమి. | కన్న. | తెల్గు. |
|---|---|---|---|---|---|---|---|
| 𑌘 | ... | ಘ | ఘ | 𑌤 | த | ತ | త |
| 𑌙 | ங | ಙ | ఙ | 𑌥 | ... | ಥ | థ |
| 𑌚 | ச | ಚ | చ | 𑌦 | ... | ದ | ద |
| ... | ... | ... | చ=చే | 𑌧 | ... | ಧ | ధ |
| 𑌛 | ... | ಛ | ఛ | 𑌨 | ந | ನ | న |
| 𑌜 | ... | ಜ | జ | 𑌪 | ப | ಪ | ప |
| ... | ... | ... | జ=జె | 𑌫 | ... | ಫ | ఫ |
| 𑌝 | ... | ಝ | ఝ | 𑌬 | ... | ಬ | బ |
| 𑌞 | ஞ | ಞ | ఞ | 𑌭 | ... | ಭ | భ |
| 𑌟 | ட | ಟ | ట | 𑌮 | ம | ಮ | మ |
| 𑌠 | ... | ಠ | ఠ | 𑌯 | ய | ಯ | య |
| 𑌡 | ... | ಡ | డ | 𑌰 | ர | ರ | ర |
| 𑌢 | ... | ಢ | ఢ | ... | ற | ಱ | ఱ=ఱ |
| 𑌣 | ண | ಣ | ణ | ... | ... | ... | ... |

| గ్రంథ. | తమి. | కన్న. | తెల్గు. | గ్రంథ. | తమి. | కన్న. | తెల్గు. |
|---|---|---|---|---|---|---|---|
| ള | ல | ಲ | ల | ஜ்ஞ | ... | ಜ್ಞ | జ్ఞ |
| ... | ள | ಳ | ళ=ళ | ... | ... | ್ | ్ |
| வ | வ | ವ | వ | ா | ா | ಾ | ా |
| ശ | ... | ಶ | శ | ... | ி | ಿ | ి |
| ஷ | ... | ಷ | ష | ீ | ீ | ೀ | ీ |
| ஸ | ... | ಸ | స | ு | ு | ು | ు |
| ஹ | ... | ಹ | హ | ூ | ூ | ೂ | ూ |
| ... | ழ | ೞ | ఴ | ృ | ... | ೃ | ృ |
| ... | ன (మూర్ధన్యే నకారము) | ... | ... | ... | ... | ೄ | ౄ |
| | | | | ... | ெ | ೆ | ె |
| | | | | ெ | ே | ೇ | ే |
| ... | ஃ ఆయ్దము | ... | ... | ெெ | ை | ೈ | ై |
| | | | | ... | ொ | ೊ | ొ |
| க்ஷ | ... | ಕ್ಷ | క్ష=క్ష | ொ | ோ | ೋ | ో |

| గ్రంథ. | తమి. | కన్న. | తెల్గు. | గ్రంథ. | తమి. | కన్న. | తెల్గు. |
|---|---|---|---|---|---|---|---|
| ௌ | ௌ | ௌ | ౌ | | ௧ | ೧ | ౧ |
| | పొల్లుల తలమీద బొట్టునిల్పినది పొల్లు | / | [illegible] / | | ௨ | ೨ | ౨ |
| | | | [illegible] | | ௩ | ೩ | ౩ |
| | | | [illegible] | | ௪ | ೪ | ౪ |
| ... | | | [illegible] | | ௫ | ೫ | ౫ |
| | | | [illegible] | | ௬ | ೬ | ౬ |
| | | | [illegible] | | ௭ | ೭ | ౭ |
| | | | క | | ௮ | ೮ | ౮ |
| | | | ) | | ௯ | ೯ | ౯ |
| | | | ౧ | | ௰ | ೧೦ | ౧౦ |
| | | | S | | ௱ | ೧೦೦ | ౧౦౦ |
| | | | (ఇవి తెల్గున పొల్లుల గుణితము) | | ௨௱ | ೨೦೦ | ౨౦౦ |
| | | | | | ௲ | ೧೦೦೦ | ౧౦౦౦ |
| | | | | | ௰௲ | ೧೦೦೦೦ | ౧౦౦౦౦ |

౧౬. IV విష:—పయి నుదాహరింపఁబడిన లిపులలో హల్లు లుచ్చార ణార్థకమగు 'అ' కారముతోఁ గూడియున్నవని యీవఱకుఁ వ్రాయఁబడెను. తమిళ లిపిలోని 'అ' కారవంతములగు హల్లులపై నొక బొట్టు నిల్పినచో (తలమీఁది బొట్టు 'అర్ధ' మాత్రకతానుమాపకమని తమిళ సంప్రదాయము) నవి యాయా హల్లుల పొల్లున కనుమాపకములగును, అట్టి బొట్టును దీసి వేసినచో నవి 'అ' కారవంతములగు హల్లులకు గుఱుతులగును. ఉదా:— క=క. క్=క్ మొ.

"మెయ్యిన్......" (తొల్కా. ౧౫ సూ.)=తమిళమున నర్థమాత్రా కవ్యంజనమాత్రమని హల్లుమీఁది బొట్టు తెలుపును. "పుళ్ళి......" (తొల్కా. ౧౭ సూ.) అట్టి తలమీఁది బొట్టును దీసివేసిన రూపమె 'అ' కార ముతోఁగూడిన హల్లునకుఁ దమిళమున గుఱుతగును.

నారచించిన వైయాకరణ పారిజాతమున ౨౭౧ విషయము మొదలుగా ౩౦౭ విషయము వఱకును లిపుల విషయమున విస్తృతముగ వ్రాయఁబడెను. అందశోకశాసన లిపి, బ్రాహ్మీ లిపి, నాగర లిపియు నాయా శతాబ్దములలోని ప్రాచీనాంధ్ర లిపులును నేఁటి తమిళ కర్ణాటాంధ్ర లిపులును జూపఁబడినవి. తెలుఁగునకుఁ బ్రత్యేక లిపిని గల్పించుటకయి నన్నయాథర్వణు లావఱకుఁ బ్రసిద్ధమైయున్న 'ఆంధ్ర కర్ణాట సాధారణ లిపి' యందుఁ జేసిన కొన్ని సవరణ ములు విపులముగాఁ జూపఁబడినవి. మఱియు నా రచించిన యాంధ్ర వ్యాకరణ సంహితా సర్వస్వమునందును నన్నయాథర్వణులు చేసిన యాంధ్ర కర్ణాట సాధారణ లిపిలోని సవరణములు ౨౯ II విషయము మొదలుగ ౨౯ V విషయము వఱకును బ్రదర్శింపఁబడెను. అట్టి నన్నయాథర్వణ కృతములగు సవరణములు చాలవఱకు వాడుక కెక్కలేదు. కొన్ని యలంతి సవరణములు మాత్రము తలకట్టు—ఒత్తు గుఱుతు—జ, ఞ ల యానునాసిక్యపు గుఱుతు— మున్నగునవి మాత్రము వాడుకలోనికి వచ్చెను. భాషాచరిత్ర శాస్త్రమున లిపి విషయమున కంత ప్రాముఖ్యము లేమింజేసియు నీవఱకు విపులముగాఁ బై గ్రంథములలో వ్రాసి ప్రకటించియుండుటంజేసియు నిట వానిని మరల విస్తరింప లేదు. ఆంధ్రభాషా చరిత్రమునందును బ్రాచీన భారతీయ లిపుల యాకార ములు విపులముగాఁ జూపఁబడెను. (ఆం. భా. చ. ౮౩ పు.) డా. బర్నెలు దొరగారి దక్షిణ హిందూదేశ లిపి శాస్త్రమను గ్రంథమునఁ (South Indian Paleography) బ్రాచీనాధునాతన ద్రావిడ లిపుల యాకారములు చూపఁ బడెను. ఆంధ్ర విజ్ఞాన సర్వస్వమున మొదటి వాల్యమందలి "అక్షరము" అను శబ్దమునొద్ద నీ విషయములు విస్తరింపఁబడెను. ఇందలి విషయములును నప్పకవీయములోని ద్వైతద్వివయక వివరణమును నారచించిన వైయాకరణ

పారిజాతమున విపులముగా విమర్శితములైనవి. (చూ. వై. పా. ౨౯౦ మొ. ౨౯౫ వ. విష).

౧౭. I విష:—కర్ణాటభాషా భూషణ సంజ్ఞా విధానమునఁ దత్సమ శబ్దములలో వచ్చు మహా ప్రాణాదులను గలిపి మిశ్రముగా వర్ణసమామ్నాయమును వివరించి యందచ్చ కర్ణాటమునందలి వర్ణములు వివరింపఁ బడెను.

౨. సూ. "అకారాదయః ప్రసిద్ధా వర్ణాః." అకారము మొదలుగ హాకారమువఱకుఁ గల వర్ణములు ప్రసిద్ధములు. అవి యేఁబది.

3. సూ. "తేష్వాదా చతుర్దశ స్వరాః." వానిలో మొదటి పదు నాల్గును నచ్చులు. ఉదా:—అ-ఆ-ఇ-ఈ-ఉ-ఊ-ఋ-ౠ-ఌ-ౡ-ఏ-ఐ-ఓ ఔ.

౫. సూ. "ఏదోతౌ హ్రస్వౌచ"=సంధ్యక్షరములు నియతముగా దీర్ఘములె యను సంస్కృత నియమము కన్నడమున లేదు. 'ఎ-ఒ' అను హ్రస్వములును నచ్చ కర్ణాటమునఁ గలవు. ఉదా:—ఎలె (సంబోధనవాచకము).

౬. సూ. "కాదయ స్త్రయస్త్రింశ ద్వ్యఞ్జనాని" = కకారాదులగు ముప్పదిమూఁడు వ్యంజనములు. ఉదా:—క-ఖ-గ-ఘ-ఙ=కవర్గము, చ-ఛ-జ-ఝ-ఞ=చవర్గము, ట-ఠ-డ-ఢ-ణ=టవర్గము, త-థ-ద-ధ-న=తవర్గము, ప-ఫ-బ-భ-మ=పవర్గము, య-ర-ల-వ=అంతస్థములు, శ-ష-స-హ=ఊష్మములు. వర్గపంచమము లనునాసికములు. య-వ-ల-లు వైకల్పికముగ ననునాసికములు.

౧౦. సూ. "ల-ర-డా ఏవ, ళ-ఱ-ఴాః ప్రయత్నాశ్రయాత్"=లకార-రేఫ-డకారములె ప్రయత్నభేదమున ళకార-ఱకార-ఴకారములై యచ్చ కర్ణాటమునఁ బ్రసిద్ధములగుచున్నవి. ఇవి యాదృచ్ఛికములె యైనను సంస్కృత సమతద్భవములలో వీని కైక్యముగలదు. ఉదా:—సలిలం=సళిలం; ఖడ్గం=ఖఴ్గం.

౧౧. సూ. "నాత్ర ప్రాయేణ వర్గాణాం ద్వితీయ చతుర్థాః" = అచ్చ కర్ణాటభాషలో సాధారణముగా వర్గద్వితీయ చతుర్థములు లేవు. సాధారణముగా వనుటచేత—("ఎణ్ఘాసిరం=ఎనిమిది సహస్రములు") (నూర్ఛాసిరం=నూఱుసహస్రములు) సంఖ్యానుకరణాదులందుఁ గన్పట్టును.

౧౨. సూ. "శ షౌ చ"=శ ష లు నచ్చ కర్ణాటమున లేవు.

౧౩. సూ. ఋకారాదయ శ్చత్వారః స్వరాః"='ఋ-ౠ-ఌ-ౡ' అను నాల్గుస్వరములును నచ్చ కర్ణాటమున లేవు.

పయి సందర్భమునుబట్టి యచ్చ కర్ణాటమున నచ్చులు ౧౩—హల్లులు ౨౮—సాధారణముగా నగపడుచున్నవి ౪౭ వర్ణములు. 'అ-ఆ-ఇ-ఈ-ఉ-

ఊ-ఎ-ఏ-ఐ-ఒ-ఓ-ఔ-పూర్ణానుస్వారము' అనునవి—౧౩ స్వరములు. 'క-గ-జ-చ-జ-ఞ-ట-డ-ణ-త-ద-న-ప-బ-మ-య-ర-ఱ-ల-ళ-వ-స-హ-ఌ' అనునవి ౨౪ హల్లులు చూపట్టును.

౧౭. II విమ:—తెల్గునందును దత్సమాదులందలి వర్ణములు గలిపి ౫౭. "అ-ఆ-ఇ-ఈ-ఉ-ఊ-ఋ-ౠ-ఌ-ౡ-ఎ-ఏ-ఐ-ఒ-ఓ-ఔ-ఁ-ం-ః" అనునవి ౧౯ అచ్చులు. "క-ఖ-గ-ఘ-ఙ-చ-చే-ఛ-జ-జే-ఝ-ఞ-ట-ఠ-డ-ఢ-ణ-త-థ-ద-ధ-న-ప-ఫ-బ-భ-మ-య-ర-ఱ-ల-ళ-వ-శ-ష-స-హ-ఌ" అను ౩౮ వర్ణములు హల్లులు. అచ్చాంధ్రమున—ఋ-ౠ-ఌ-ౡ-ః-వర్గ ద్వితీయ చతుర్థములు ఙ-ఞ లును శ-ష లును నుండవు గాన నీ ౧౯ పోఁగా ౩౮ వర్ణములచ్చ తెనుఁగునఁ గన్పట్టును.

నన్నయనాఁటికి 'ఌ' కారము 'డ-ళ' ల రూపమునంది నశించినది—శకటరేఫ మలఘురేఫమె యగుటచేఁ దానిని వర్ణమాలలో వేఱుగా లెక్కిం చుటకు నన్నయ సమ్మతింపలేదు. కాన నచ్చ తెలుఁగునకు ౩౬ వర్ణములని భట్టారకుఁడు వచించెను.

"ఆద్యాయాః పఞ్చాశ ద్వర్ణాః । ప్రకృతేస్తు తే దశోనాః స్యుః । షట్ త్రింశ దత్ర తేఽన్యే । చానుప్రవిశన్తి శబ్దయోగవశాత్ ॥ ద్వివిధాదిదు దేవోతోఽ । చో వక్రతమా వనుస్వారా । కగ చజయు గ టడణ తదన । పబమ యరలవ సహాళంతు హాల్వర్గః ॥" (ఆం. చిం.) (వ్యా. సం. ౫—౧౭—౨౦ విమ).

౧౭. III విమ:—తమిళ ధ్వనులు:—"ఎఱు త్తెన......" (తొల్కా. ౧ సూ.) అర్ధమాత్రికములగు "ఇ, ఉ, ఃః" (ఆయ్దము) అను మూఁడును గాక 'అ' కారాది నకార పర్యంత తమిళాక్షరములు ముప్పది.

"ఔకార......" (తొల్కా. ౮ సూ.) ఔకారము తుదిగాఁగల పండ్రెండు తమిళాక్షరములు నచ్చులు. (తమి. ఉయిర్ =(అచ్చు=ప్రాణము.) ఇది 'ఉసురు' అను తెల్గు శబ్దమున కభిన్నము. ఇవి—'అసు' = (ప్రాణము) అను సంస్కృత శబ్దమునుండి జన్యములు?)

"నకార......" (తొల్కా. ౯ సూ.) మూర్ధన్య నకారము తుదిగాఁగల పదునెనిమిది తమిళాక్షరములు హల్లులు. (తమి. మెయ్ = (హల్లు = ప్రాణి=శరీరము.) ఇది తెల్గు 'మెయి=శరీరము' అనుదాని కభిన్నము. "ప్రాణా స్వమాసతోౕ చో.........హాలః స్యు స్వమాసతః ప్రాణినః" (ఆం. చిం.) (వ్యా. సం. ౩౦ విమ. చూ.) "అ ఆ ఇ ఈ ఉ ఊ ఎ ఏ ఐ ఒ ఓ ఔ" ౧౨ అచ్చులు. "క ఙ చ ఞ ట ణ త న ప మ య ర ఱ ల ళ వ ఌ న" ౧౮ హల్లులు.

తమిళమున 'న' కారము దంత్యము, మూర్ధన్యము నని రెండు విధములు. దంత్య నకారము 'ந' అనియు మూర్ధన్య నకారమును 'ன' అనియుఁ (చూ. ౧౬ III విష.) దమిళులు లిఖింతురు. టవర్గాంత్యమగు మూర్ధన్య ణకారము 'ண' అని తమిళమున వ్రాయఁబడును. తెనుఁగున మూర్ధన్య నకారము లేమింజేసి యట్టి తమిళాక్షరమును దెల్గున వ్రాయునపుడు 'న' అని నేను వ్రాయుచుందును.

౧౭. IV విష:—పయి రీతిగల ముప్పది ధ్వనులే కాక యర్థమాత్రాకములగు "ఇ̆, ఉ̆, ః (ఆయ్‌ద (త) ము)" అనునవియుఁ దమిళమునఁ గలవని మొదటి సూత్రమె వచించుచున్నది. 'ఇ̆' అనునది కు (ఱ్ఱి) ట్టియల్ 'ఇ' కరమనియు (పొట్టి 'ఇ' కారము) 'ఉ̆' అనునది కు (ఱ్ఱి) ట్టియల్ 'ఉ' కర మనియుఁ (పొట్టి 'ఉ' కారము) దమిళమున వాడఁబడును. ఆయ్‌దమనఁగా సూక్ష్మమని యర్థమనియు "ఆయిద (త)" మను శబ్దము 'ఆశ్రిత' శబ్దభవమనియు నది వేదప్రసిద్ధమనియుఁ గాల్డువెల్లుగారు వ్రాసిరి (కాల్డు. ౧౩౦ పుట). (ఆయ్‌ద (త) శబ్దమునకు సూక్ష్మమను నర్థము లేదుగాని 'ఆయ్' ధాతువునకు "పూర్వ స్థితికన్నఁ గృశించు" అను నర్థము గలదు.)

"అవై తామ్......" (తొల్కా. ౨ సూ.)=ఆ మూఁడును నర్ధమాత్రాకములగు (కు (ఱ్ఱి) ట్టియల్=పొట్టి) 'ఇ̆, ఉ̆' అనునవియు 'ః' ఆయ్‌ద (త) మనునదియు నై యున్నవి. ఇట్టి పొట్టి ధ్వనులు కర్ణాటాంధ్రములలో లేవు. పరరూప సంధి దమిళమున నీ పొట్టి ఉకారమునకు నిత్యమైయున్నది.

"పుళ్ళి యీాట్టు (ఱ్ఱు) మున్......" (తొల్కా. ౧౩౯ సూ.)=బొట్టు తలమీఁదఁగల యక్షరములకు (పొట్టి 'ఇ̆, ఉ̆' లకు, పొల్లు హల్లులకును) నచ్చు పరమగునపుడా రెండును సంధించునే కాని వేర్వేఱుగా నిలువవు. ఉదా:— తమి. ఆలు+ఇలై=ఆలిలై (మఱ్ఱి యాకు). మాడు + ఇదు=మాడిదు= (ఇది పశువు). (చూ. 'లుక్ సంశ్లేషే నాసచి' (ఆం. చిం.) చూ. వ్యా. సం. ౫౩ విష).

"నెట్టెలుత్తు......" (తొల్కా. ౩౬ సూ.)=పదాది దీర్ఘముగల ద్వ్యక్షర శబ్దముల తుదిని, త్ర్యాద్యక్షరక శబ్దముల తుదిని, గల పరుషముల పైని (క చ ట త ప ఱ) నిల్చు 'ఉ̆'కార మర్ధమాత్రాకము. ఉదా:— మాడు (పశువు). ఇది యాఱు విధములు గలది.

"యకరం వరువళి.. ..." (తొల్కా. ౪౧౧ సూ.) = యకార పరకత్వమున నాఱువిధములగు పొట్టి 'ఉ̆' కారములును లోపించును. అచటఁ బొట్టి 'ఇ̆' కారము నిల్చును. ఉదా:—మాడు + యాదు = మాడీయాదు (పశు వెద్ది) మొ.

"కుట్టి (ట్రి) య ఉకరమ్......" (తొల్కా. ౬౭ సూ.) = 'నున్దై' = (నీ తంత్రి) అను చోటి పదాదినున్న 'ఉ' కారము సైతి మర్ధమాత్రాకమె. పాదమాత్రాక 'మ' కార విషయము ముందు వివరింపఁబడును. (చూడు. ౧౭ IV విష).

"కుఱియదన్......" (తొల్కా. ౩౮ సూ.)=ఆయి(త)దము (∴) పదాది హ్రస్వమునకుఁ బరముగను, బరుషములకుఁ (క-చ-ట-త-ప-ఱ) బూర్వముగను మాత్రమె నిల్చును. ఉదా:—అ∴తు=(అది) ప∴తు=(పది) ఇ∴తు=(ఇది).

"ఈఱియల్......" (తొల్కా. ౩౯ సూ.)=రెండు పదముల సంధియందు సయిత మాయ్ (తో) దో చ్చారణ ముండును. (ఆయ్ (త) దము నిప్పటి కొందఱవలె జిహ్వామూలీయము (ఃక) వంటి యుచ్చారణముతోఁ బల్కరాదు. పర పరుషమునె యొత్తి పలుకుట తమిళ పండిత సిద్ధాంతము. ఉదా:—కల్ + తీదు = (రాయి చెడ్డది) = క∴ఱీదు. (సంధిలో నిచటి తకారము ఱకారమయ్యెను) ఇచట ఱకారము నొత్తి "క (ఱీ)ట్ఱీ దు" అనురీతి నించుక తేల్చి పల్కవలెనుగాని నేఁటి కొందఱవలె "కహ్ఱీదు" అనియుఁ బల్కరాదు. ఇట్లె "ప∴తు" మున్నగు వానిని సైతము "పత్తు" అనురీతి నించుక తేల్చి పలుకుటయె ప్రాచీన సంప్రదాయము.

పయి సందర్భమును బట్టి యీ క్రింది కాల్డువెల్లుగారి వ్రాఁత సరికాదని విశదమగుచున్నది. "అచ్త్వమును హల్త్వమును గల్గినట్టియుఁ గొన్ని విషయములలో సంస్కృత విసర్గమును బోలునట్టియు వర్ణమొకటి యఱవమునఁ గలదు. దానికి 'ఆయిదమ్' అని పేరు......అది కంఠ్య హకారమువంటి యుచ్చారణము గలది." (కాల్డు......౧౩౦ పుట).

"విసర్గమునకుఁ బదులుగా హకార మఱవమునఁ గలదు......'ఎ-ఒ-హ' అను నచ్చులును 'ఱ-ళ-ఱ-న' అను హల్లులును ('న' అనుచో 'ళ' అని కాల్డువెల్లులోఁ బొరపాటుగఁ బడినది) సంస్కృతము కన్నఁ దమిఁళమున హెచ్చు గలవు" (కాల్డు ౧౩౦ పు.) (ఇది బొత్తిగ నసత్యమగుటచేఁ గాఁబోలును "రివైజ్డ్" ముద్రణమునఁ దీసివేయఁబడెను).

ఆయ్(త)దము హకారవంటి యుచ్చారణము గలదనుటయు నది హకారమే యనుటయుఁ గేవలము సంప్రదాయ విరుద్ధములు. దీనిని వ్యావహారికాఱవమున "జిహ్వా మూలీయమునువలెఁ (ఃక) బలుకుదురు. ఇదియుఁ బ్రాచీన ప్రామాణిక సంప్రదాయ విరుద్ధమె. "సా (చా) ర్ న్దువరిన్......" (తొల్కా. ౧౦౧ సూ.) "ఇతరాక్షరములతోఁ గలసియేకాని పలుకఁబడవని

చెప్పఁబడిన మూఁడక్షరములును (పొట్టి 'ఇ-ఉ' 'ః' ఆ (త)దము) దామే యక్షరమునకుఁ ముందు నిల్చునో దాని యుత్పత్తి స్థానముననె జనించెడి స్వభావము గలవి." అని స్పష్టముగా వచింపఁబడెను.

పయి ముప్పదిమూఁడు ధ్వనులె కాక పాదమాత్రాక 'మ' కారధ్వనియుఁ దమిళమునఁ గలదు. "అరైయళవు......" (తొల్కా. ౧౩ సూ.) మకార మరుదుగఁ గొన్నిమెడలఁ బాదమాత్రాకమును గలదు. "ఉట్పెఱు......" (తొల్కా. ౧౪ సూ.) అట్టి పాద మాత్రాకమునకు గుఱుతుగ 'మ' కారపు పొల్లున కుండవలసిన మీఁది బొట్టె కాక లోపల మఱొక బొట్టును నిల్పవలెను. ఉదా:—'ம், ఇట్లు పాదమాత్రాకమగు మకారపు పొల్లును లిఖింపవలెను. "చెయ్యుళ్......" (తొల్కా. ౫౧ సూ.) పద్యముల తుదినున్న 'పోలుమ్' (పోలును) అనుచో 'పోనమ్' అను రూపము నిల్చును. "న కారమ్..." (తొల్కా. ౫౨ సూ.)=పయి ౫౧ సూత్రమునకు లక్ష్యమగు మకారము పొల్లర్ధమాత్రాకము కన్నను దక్కువ పరిమాణము కలిగియుండును. போன்ம்= (పోనమ్) అని వ్రాయవలయుననియు నట్టి మకారము పాదమాత్రాక మనియుఁ దాత్పర్యము.

౧౭. V విష:—హ్రస్వములగు "ఎ-ఒ"లకు లిపి గలదు:—తమిళమున 'ఎ-ఏ' లను 'எ—ஏ' అనియు 'ఒ-ఓ'లను "ஒ—ஓ" అనియు నేఁటివారు వ్రాయుదురు. ఇది సరికాదు. బొట్టు తలపై నిల్పి హ్రస్వ వక్రములను వ్రాయవలెనని (எ=ఎ. ஒ=ఒ) తొల్కాప్పియరు సూత్రించియున్నారు.

"ఎకర......" (తొల్కా. ౧౬ సూ.) "ఎ" కారము "ఒ" కారము నను వాని హ్రస్వము సైతము బొట్టుచే గుఱుతింపఁబడును. ఇట్టి తొల్కాప్పియరు సూత్రమును జూచియుండమిచేఁ గాల్డువెల్లుగా రీ క్రింది రీతిని వ్రాసిరి. "హ్రస్వ వక్రముల లిపి బెస్కియమ్ దొరగారు గల్పించి రందురు. మొదట వీని హ్రస్వ దీర్ఘ లిపులకు భేదములేదు" కాల్డు. ౧౩౦ పుట).

౧౭. VI విష:—తమిళ పదాదిని బదాంతమున నుండెడి వర్ణముల నియమమును తమిళమున నెట్టి హల్లుల సంయోగము లుండునను విషయమును దొల్కాప్పియమున నీక్రింది రీతిని సూత్రింపఁబడెను.

"పన్నీర్ ఉయిరుమ్..." (తొల్కా. ౫౯ విష.)=పండ్రెండచ్చులును బదాదిని నిల్వవచ్చును.

"ఉయిర్ మెయి..." (తొల్కా. ౬౦ సూ.) కేవల వ్యంజనములు పదాదిని నిలువవు. అవఁగా స్వరయుక్తమగు హల్లే పదాదిని నిల్చును గాని హల్ సం-యోగము పదాదిని నిలువనేరదని తాత్పర్యము.

"క త ప న......" (తొల్కా. ౬౧ సూ.)=‘క-త-న-ప-మ’ అను నయిదు హల్లులును నెల్ల యచ్చులతోను గూడి పదాదిని నిల్వవచ్చును.

"చకరక్కిళవి......" (తొల్కా. ౬౨ సూ.)="అ-ఐ-ఔ" అనునవి తప్పఁ దక్కిన యచ్చులతోఁగూడి మాత్రమె ‘చ’ కారము పదాదిని నిల్చును. ఇట్టి పదాది చకార మర్వాచీనముగా ‘స-శ’ అనువాని యుచ్చారణము గలదగు చున్నది.

"ఉ-ఊ-ఒ-ఓ......" (తొల్కా. ౬౩ సూ.) వకారము "ఉ-ఊ-ఒ-ఓ" లతోఁ బదాదిని నిలువదు. ఈ సూత్రము "యకారమును వు-వూ-వొ-వో లును దెలుఁగు మాటలకు మొదట లేవు" అను బాలవ్యాకరణ సూత్రమును (సంజ్ఞా ౧౭ సూ.) స్మరింపఁజేయుచున్నది.

"ఆ-ఎ......" (తొల్కా. ౬౪ సూ.) ఞకారము ‘ఆ-ఎ-ఒ’ అను మూఁడచ్చులతో మాత్రమే పదాదిని నిల్చును.

"ఆ వో......" (తొల్కా. ౬౫ సూ.)=యకారము ‘ఆ’ కారముతో మాత్రమే పదాదిని నిల్చును.

ఇట్లే పదాంత్య వర్ణనియమమును, దొల్కాప్పియమున సూత్రిత మయ్యెను.

"ఉయిర్ ఔ......" (తొల్కా. ౬౯ సూ.) ఔకారేతరమగు నచ్చు లెల్లఁ బదాంతమున నిల్వవచ్చును.

"ఞ-ణ-న-మ......" (తొల్కా. ౭౮ సూ.) = "ఞ-ణ-న-మ-న-య-ర-ల-వ-ఴ-ళ" అను నీ పదునొకండు హల్లులు మాత్రమే పదాంతమున నిల్చును. తక్కినవి హల్లుగాఁ బదాంతమున నిలువనేరవని తాత్పర్యము. ఇట్లీ సందర్భ మున ననేక సూత్రములు గలవు. విస్తర భీతి నుదాహరింపలేదు.

సంయుక్త హల్లుల విషయమునను దొల్కాప్పియమున నియమము సూత్రింపఁబడెను.

"అమ్మా......" (తొల్కా. ౨౨ సూ.) = హల్లులు ద్విత్వముగ నిల్చుటయు, నితర హల్లుతో సంయోగించుటయు ననెడి రెండు స్వభావములు గల్గియుండును.

"ట ఱ ల......" (తొల్కా. ౨౩ సూ.)=‘ట ఱ ల ళ’ అను హల్లు లకుఁ బరముగ ‘క చ ప’ అను మూఁడు హల్లులు మాత్రమె సంయోగించును.

"ఙ ఞ ణ......" (తొల్కా. ౨౫ సూ.) "ఙ ఞ ణ న మ న" అను హల్లులకుఁ బరముగ "క చ ట త ప ఱ" అను వర్ణములు వరుసగా సంయో గించును. వర్గపంచమములకుఁ బరముగఁ దత్తద్వర్గీయ వర్ణములు సంయో

గించునని తాత్పర్యము. తొల్కాప్పియరునాఁటికి సరళోచ్చారణము లేదనుట కిది బలమైన ప్రమాణము.

ఇట్టి వీ సందర్భమున ననేక సూత్రములు గలవు. విస్తరభీతి నుదాహరింపలేదు.

౧౭. VII విష:—సాధారణముగ సంస్కృత ధ్వనులకువలెనే ద్రావిడ ధ్వనులకును లక్షణము నంగీకరింపవచ్చును. ఆంధ్ర కర్ణాటక పండితు లీ విషయమును వేఱుగ వివరింపలేదు. తొల్కాప్పియమునందలి యెలుత్తధికారమున "పిఱప్పియల్=(వర్ణోత్పత్తి స్వభావము)" అను నొక ప్రకరణ ముపదేశింపఁబడెను. నన్నూలునందును నీ విషయము గలదు. ఈ తమిళ పండితులు చెప్పిన లక్షణములు చాలవఱకు సంస్కృత వైయాకరణులు చెప్పిన వానినె యనుసరించి యున్నవి. కావున నిచట ముందుగ సంస్కృత వ్యాకరణోక్త వర్ణోత్పత్తి సంప్రదాయము దిఙ్మాత్రముగఁ జూపఁబడుచున్నది. ఈ విషయము నారచించిన వైయాకరణ పారిజాతమునందలి మూఁడవ ప్రకరణమునఁ బ్రాతిశాఖ్య సూత్రోదాహరణ పూర్వకముగ సువిస్తరముగ వివరింపఁబడెను. (చూడు. వై. పా. ౧౭౧ మొ. ౨౭౫ వ. విషయములు). ఇచట సంక్షేపార్థముగ నారచించిన యాంధ్రవ్యాకరణ సంహితా సర్వస్వమునుండి తీసి దిఙ్మాత్రముగ నీ విషయము వివరింపఁబడుచున్నది.

"కాదులు నైదైదు గూర్చ నగు వర్గంబుల్" అను చొప్పున 'క ఖ గ ఘ ఙ లు కవర్గము. ఇట్లయిదు వర్గముల నరయునది. అ ఆ కవర్గము హాకార విసర్గములు కంఠ్యములు. ("అ ఆ కవర్గము జిహ్వామూలీయము" (ౘక, ౘఖ) అనునవి జిహ్వామూలీయము లనుట యుక్తము). ఇ ఈ చవర్గము య శ లును దాలవ్యములు. ఋ ౠ టవర్గము ర ష లును మూర్ధన్యములు. (రకారము దంత్యమనుట యుక్తము. చూ. వై. పా. ౧౮౩, ౧౮౭, ౧౮౫ విష.) ఌ ౡ తవర్గము ల స లును దంత్యములు. ఉ ఊ పవర్గము ఉపధ్మానీయము (ౘప ౘఫ) 'ఓష్ఠ్యములు'. అనుస్వారము ఙ ఞ ణ న మ లును ననునాసికములు. 'ఏ ఐ' లు కంఠతాలవ్యములు. 'ఓ ఔ' లు కంఠోష్ఠ్యములు. వకారము దంతోష్ఠ్యము. (కంఠ్యతాలవ్యములు మున్నగు రీతి ననరాదు. చూడు. వాచస్పత్యకోశము ౧౬౦౦ పుట. వ్యంజనవర్ణ విభాగాది సందర్భము. 'వై. పా.' ౧౫౮ విష).

వర్గ ప్రథమ ద్వితీయములును జిహ్వామూలీ యోపధ్మానీయములును విసర్గమును శ ష స లును శ్వాసములు. తక్కిన యక్షరములు నాదములు. వర్గ ప్రథమ తృతీయ పంచమములును య ర ల వ లును నల్ప ప్రాణములు. తక్కినవి మహాప్రాణములు. య ర ల వ లీషత్ స్పృష్టములు. అంతస్థ

ములును. శ ష స హ లూష్మములు. ఏ ఐ ఓ ఔ లు సంధ్యచ్చులు. స్వరమె యక్షరము. వ్యంజన (హల్లు) మక్షరాంగము.

స్వరముల హ్రస్వ దీర్ఘ ప్లుత భేదములు, వాని యుచ్చారణ కాలము లోని మాత్రాభేదమున సంభవించును. మాత్ర యనఁగా నొక సెకెండులో నయిదవ భాగము కాలము. (చూ. 'వ్యా. సం.' విస్తర ౫ II విష.) హ్రస్వ మేకమాత్రాకాలమున నుచ్చరింపఁబడును. రెండు మాత్రల కాలమున దీర్ఘము పల్కఁబడును. మూఁడు మాత్రల కాలమందును నంతకంటె నెక్కుడు కాలమందును 'ప్లుతము'చ్చరింపఁబడును. హల్లు పలుకుట కర్ధమాత్రాకాలము పట్టును. "ఏకమాత్రో భవేద్ధ్రస్వో । ద్విమాత్రో దీర్ఘ ఉచ్యతే । త్రిమాత్రస్తు ప్లుతో జ్ఞేయో । వ్యఞ్జనం త్వర్ధ మాత్రికమ్." అని వైయాకరణులు చెప్పుదురు. అంగియగు స్వరముయొక్క యుచ్చారణ కాలములోనె దాని యంగములగు హల్లుల యుచ్చారణ కాల మిమిడియుండును. కాన 'క్ర' మున్నగునవి యేక మాత్రికములె యని గ్రహింపవలయును.

"శ్లో. అనుప్రదానా త్సంసర్గాత్ । స్థానా త్కరణ విభ్రమాత్ । జాయతే వర్ణవైశేష్యం । పరిమాణాచ్చ పఞ్చమాత్ ॥" అని యిట్లు వర్ణపార్థక్య లక్షణము వివరింపఁబడెను. అనుప్రదానమనెడి బాహ్యప్రయత్నభేదమువల్లను, వాయుసంసర్గాతిశయ రూపభేదమువలనను, తాల్వాది వర్ణోత్పత్తి స్థానభేదము వలనను, వర్ణోత్పత్తికరణమగు జిహ్వాప్రచారభేదమువల్లను, స్వరోచ్చారణము నందలి మాత్రాకాలభేదమువలనను వర్ణములకుఁ బ్రత్యేకత యంగీకరింపఁబడు నని పై శ్లోకమున కర్థము. అనుప్రదానమనునది బాహ్యప్రయత్నము. బాహ్య మనఁగా ముఖయంత్రమున కవ్వలిభాగము. అనఁగా "కంఠము." శ్వాస వర్ణము నుచ్చరించునపుడు కంఠబిలము తెఱవఁబడియుండును. (కంఠమందలి నిశ్వాసమార్గములోని రెండు చర్మములను "వోకల్ కార్డ్సు" లని పాశ్చాత్య పండితు లందురు. (Vocal chords) (నాదతంత్రులని యర్థము) కాన శ్వాసము నిర్నిరోధముగా వెడలి వచ్చును. నాదవర్ణోచ్చారణమునఁ గంఠబిలము మూయఁబడి యుండును. కాన వర్ణోత్పాదక నిశ్వాస మట్టి మూఁతను విడఁ గొట్టుకొని వెడలి వచ్చును. అట్లా మూఁతను విడఁగొట్టుటలో నాదిత యనఁగా నాదము గల్గును. ఈ రెండు విధములగు ప్రయత్నములచేతను వర్ణములకు శ్వాసములనియు నాదములనియు సంజ్ఞలు గల్గెను. ఖ-ఘ మున్నగు వర్గద్వితీయాదుల యుచ్చారణమున నిశ్వాసవాయు సంసర్గ మతిశయించి యుండును. కాన నవి మహాప్రాణములని చెప్పఁబడును. అట్టి వాయు సంసర్గాతిశయము లేనివి యల్పప్రాణము లనఁబడును. పైరీతిని గంఠబిలము

నుండి బయలువెడలిన నిశ్వాసము ముఖయంత్రమార్గమున మాత్రము వెలికి వచ్చునపుడు ధ్వనించు నక్షరములు నిరనునాసికము లనఁబడును. అట్టి నిశ్వాసము ముఖ నాసా మార్గములు రెండిటిద్వారమునను వచ్చుటచే జనించు వర్ణములు సానునాసికము లనఁబడును. 'జ-ఞ-ణ-న-మ' అనువాని యుచ్చారణమున నిశ్వాసము ముఖ నాసా మార్గములు రెండిటను వెలికి వచ్చును గాన నవి ద్విస్థానికములు ననునాసికములు ననఁబడును. అనుస్వార మనునాసికముమాత్రమె. అచ్చులు నిరనునాసికములుగను సానునాసికములు గను నుచ్చరింపఁబడును. యవలలును నిట్టివె.

ముఖయంత్రమున సంభవించు ప్రయత్న మాభ్యంతర ప్రయత్న మనఁ బడును. అయ్యది నాలుగు విధములు. ౧. స్పృష్టము. ౨. ఈషత్ స్పృష్టము. 3. వివృతము. ४. సంవృతము. స్పర్శముల యుచ్చారణమున స్పృష్ట ప్రయ త్నము సంభవించును. స్పృష్టమనఁగా స్పృశింపఁబడుట. తాఁకఁబడుట యని యర్థము. ఈ ప్రయత్నమున వర్ణోత్పత్తి స్థానమును గరణము గాఢ ముగాఁ దాఁకును. కకారాది మకారాంత వర్ణము లిట్లు స్పర్శసంజ్ఞ నందినవి. అంతస్థముల యుచ్చారణమున నీషత్ స్పృష్టప్రయత్నము గలుగును. అచ్చు లయు నూష్మములయుఁ బలుకుబడిలో వివృతప్రయత్నము (నోరు తెఱవఁబడి యుండుట) సంభవించును. హ్రస్వమగు 'అ' వర్ణము ప్రయోగమున సంవృత ప్రయత్నము గల్గును.

ముఖయంత్రములోని మీఁది భాగములు వర్ణోత్పత్తి స్థానములు, జిహ్వా భాగాదులు వర్ణోత్పత్తికరణములు, నిశ్వాసము కంఠబిలమునుండి ముఖయంత్ర మార్గమున వచ్చునపుడు జిహ్వాభాగములు తాల్వాదిస్థానములను దాఁకి యుండఁగా నా నిశ్వాసమట్టి తాఁకును విడఁగొట్టుకొని వెలికి వచ్చుటచేత వర్ణోత్పత్తి యగును. కానఁ దాల్వాదులు వర్ణోత్పత్తి స్థానములును జిహ్వా భాగాదులు వర్ణోత్పత్తికరణములు ననఁబడును. నాలుకకు మీఁదనుండు శిరో భాగమెల్లఁ దాలువె యనఁబడునుగాని దానిని నాల్గు భాగములుగ విభజించి యీ క్రింది రీతిని వరుసగా వ్యవహరింతురు. ౧. హనుమూలము. దీనిని జిహ్వామూలము-మృదుతాలువు ననియు వ్యవహరింతురు. ౨. మూర్ధము. 3. తాలువు. ४. దంతమూలము (ఊర్ధ్వదంతమూలము) క-ట-చ-త వర్గముల యుచ్చారణమునందట్టి తాలుభాగములయం దొక్కొకదానిని ౧. జిహ్వా మూలము. ౨. మణవఁబడిన జిహ్వాగ్రము. 3. జిహ్వామధ్యము. ४. జిహ్వాగ్ర మును వరుసఁగాఁ దాఁకుట సంభవించును. కానఁ దాలుభాగము లాయా వర్గ ముల వర్ణములకు స్థానములు, ఆయా జిహ్వాభాగములు కరణములు.

పాణినీయులు కవర్ణాదులు కంఠ్యములనుట యుక్తమని తోఁచదు, కంఠము ముఖయంత్రమున కవ్వలిభాగము, దానితోడి యాభ్యంతర ప్రయత్న మసంభవము, కాన కవర్ణాదులను జిహ్వామూలీయము లనుటయే యుక్తము, ఉచ్చారణమున ముఖయంత్ర సంబంధ ముండమింజేసి, (తెఱవఁబడిన నోటినుండి నిశ్వాసము వెడలుటచే నవి జనించును) హాకార విసర్గములను మాత్రము కంఠ్యము లనవచ్చును.

పవర్గోచ్చారణమునఁ గ్రింది పెదవి మీఁది పెదవిని దాఁకుట సంభవించును. కాన వానికిఁ గ్రింది పెదవి కరణము, మీఁది పెదవి స్థానము, ఇట్లు స్థానములను గరణములు స్పృశించుట సంభవించును గాన వర్గాక్షరములకు స్పర్శములను పేరు సార్థకమగుచున్నది. అంతస్థముల యుచ్చారణమున స్థానములను గరణము లించుక స్పృశించును గాన నవి యీషత్స్పృష్టములు దుఃస్పృష్టములు ననఁబడును. ఊష్మముల యుచ్చారణమున స్థానములను గరణములు తాఁకక సన్నిహితములై యుండఁగా నూష్మరూప నిశ్వాసము వెలికి వచ్చును. కావుననే యవి హాకారము తోపాటుగ నూష్మము లనఁబడుచున్నవి. "అ-హా విసర్గముల స్థానము కంఠము (జిహ్వామూలము) ఇ య-శ వర్ణముల స్థానము తాలువు. ఉవర్ణమునకును నుపధ్మానీయమునకును (ఃప-ఃఫ) స్థానము మీఁది పెదవి. 'ఋ-ర-ష' లకు స్థానము మూర్ధము. ౡ-ల-స లకు స్థానము దంతమూలము. 'ఎ-ఏ-ఐ' లకు స్థానములు కంఠతాలువులు, 'ఒ-ఓ-ఔ' లకు కంఠోష్ఠములు స్థానములు. వకారోచ్చారణమునఁ గ్రింది పెదవి మీఁది దంతములను దాఁకుట, సంభవించునుగాన నది దంతోష్ఠ్య మనఁబడును.

ఐకారోచ్చారణమున 'అ-ఇ' అనునవియు, ఔకారోచ్చారణమున 'అ-ఉ' అనునవియును విశ్లిష్టావయవములుగా వేర్వేఱుగా వినఁబడునట్లు సంధించియుండును. 'ఏ-ఓ' ల యుచ్చారణమున నవి ప్రశ్లిష్టావయవములుగా ననఁగా క్షీరనీరన్యాయమున మిశ్రితముగా సంధించియుండును. అట్లగుటంజేసి యా నాలుగచ్చులును, సంధ్యచ్చులని వ్యవహరింపఁబడును. (చూడు. 'వ్యా. సం' ౧౭—౧౫ విష. విస్తరము I, II ౧౭ విష).

౧౭. VIII విష:—తొల్కాప్పియరును జాలవఱకుఁ బలుసంస్కృత వ్యాకరణముల రీతిని వర్ణోత్పత్తి విషయములను వివరించెను.

"ఉన్ది......" (తొల్కా. ౮౩ సూ.) శ్వాసము నాభినుండి బయల్వెడలి "తల-కంఠము-హృదయము" అనువానిలో నిల్చి "పల్లు-పెదవి-నాలుక-ముక్కు-మూర్ధము" అను వానిని దాఁకి వివిధ ధ్వని రూపముల నందును.

"మెల్లెలుత్తు......" (తొల్కా. ౧౦౦ సూ.) "జ-ఞ-ణ-న-మ-న" అను నాఱును మృద్వక్షరములును ననునాసికములు ననఁబడును. ఇవియును బయిని వివరించిన స్థానములందె జనించునవైనను ముక్కునుండి వచ్చెడి శ్వాసముతోఁ గలసి తోఁచును.

"అవ్వాటి......" (తొల్కా. ౮౪ సూ.)=గొంతునుండి వచ్చిన శ్వాసము వలనఁ బైరీతిగా నచ్చులు పంౘ్రెండును ధ్వనించును.

"అవ (ఱ్ఱు) ట్టుల్......" (తొల్కా. ౮౫ సూ.)="అ-ఆ" అనునవి నోరు తెఱచి యుచ్చరించుటచేత జనించును.

"ఇ-ఈ-ఎ-ఏ-ఐ......" (తొల్కా. ౮౬ సూ.)='ఇ-ఈ-ఎ-ఏ-ఐ' అనునవి పలుకుటలోను నోరు తెఱవఁబడును. మఱియు నవి పై పంటియొక్క యడుగుభాగమును నాలుకయొక్క పార్శ్వములు తాఁకుటచే జనించును. (నృక్కు లిగిలించుటచే జనించుననుట యుక్తము).

"ఉ-ఊ-ఒ-ఓ-ఔ......" (తొల్కా. ౮౭ సూ.)="ఉ-ఊ-ఒ-ఓ-ఔ" అను నైదక్షరములును బెదవులు గుండ్రముగా నగు నట్లుచ్చరించుటచేత జనించును.

"తత్తమ్......" (తొల్కా. ౮౮ సూ.)=ఈ ప్రకరణములోఁ జెప్పఁబడిన స్థానాదులలో నించుక మార్పులు గల్గునని చెప్పుదురు.

"కకార......" (తొల్కా. ౮౯ సూ.) కకార జకారములు నాలుకయొక్క క్రింది (లోపలి) జిహ్వామూలభాగము మూర్ధముయొక్క యడుగు భాగమును గలియు నట్లుచ్చరించుటచేత జనించును.

"చకార ఞకారమ్......" (తొల్కా. ౯౦ సూ.)=చకార ఞకారములు నాలుకయొక్క మధ్యభాగమును మూర్ధముయొక్క మధ్యభాగమును గలియు నట్లుచ్చరించుటచేత జనించును.

"టకార ణకారమ్......" (తొల్కా. ౯౧ సూ.) టకార ణకారములు మూర్ధముయొక్కయు నాలుకయొక్కయు నగ్రములు కలియు నట్లుచ్చరించుట చేత జనించును.

"అణ్ణమ్......" (తొల్కా. ౯3 సూ.)=పై పంటియొక్క యడుగు భాగమును నాలుక యగ్రము వ్యాపించి బాగుగఁ దాఁకునట్లు నొక్కుటచేత "తకార నకారములు" జనించును.

"అణరి......" (తొల్కా. ౯౪ సూ.)=నాలుక యగ్రము పైకిఁబోయి మూర్ధమును గాఢముగా నొక్కి తాఁకుటచేత 'ఱ-న' అనునవి జనించును.

"నునినా......" (తొల్కా. ౯౫ సూ.)=నాలుక యగ్రము పయికిఁ బోయి మూర్ధమును నీషత్ స్పృష్టముగాఁ దాఁకుటచేత రకార ఴకారములు జనించును.

"నావిళింబు......" (తొల్కా.౯౬ సూ.)=నాలుకయొక్క పార్శ్వము లుబ్బి పయిపంటి యడుగుభాగమును నొక్కి తాఁకుటచేత లకారము పుట్టును. నాలుకయొక్క పార్శ్వము లుబ్బి మూర్ధమును దేలికగాఁ దాఁకుటచేత ళకారము జనించును.

"ఇదల్......" (తొల్కా. ౯౭ సూ.)=పెదవులు రెండును గలియు నట్లుచ్చరించుటచేత "పకార మకారములు" జనించును.

"పల్ ఇదల్......" (తొల్కా. ౯౮ సూ.)=పై పల్లును బెదవియుఁ గలియున ట్లుచ్చరించుటచేత వకారము జనించును.

"అణ్ణమ్......" (తొల్కా. ౯౯ సూ.)=కంఠమునుండి బయలుదేఱిన శ్వాసము మూర్ధమును జేరి యచట వ్యాపించుటచేత యకారము జనించును.

"చార్‌న్దువరిన్......" (తొల్కా. ౧౦౧ సూ.)=ఇతరాక్షరములను గూడియే కాని పల్కఁబడవని చెప్పఁబడిన మూఁడక్షరములును (ఖ్రి-ఉ. ∴ = పొట్టివగు "ఖ్రి-ఉ" లును, నాయ్ (త) దమును) దా మే యక్షరమునకుఁ బయిని నిల్చునో దాని యుత్పత్తిస్థానమున నే జనించెడి స్వభావము గలవి.

పయిని వివరించిన తొల్కాప్పియరు వివరణమునకును సంస్కృత ప్రాతి శాఖ్యల వర్ణోచ్చారణ వివరణములకును నంతగా భేదములేదు. ఈ క్రింద వివరింపఁబడు కొన్ని యలంతివర్ణముల విషయమును మాత్రము కొంత విస్తరించి చెప్పవలసి యున్నది. "ఴ-ళ-ఱ-న-చ-జ-ఁ" అను నక్షరముల విషయమునఁ గొంత విపులముగా వ్రాయఁబడుచున్నది.

౧౭. IX విష:—ఴకారము:—ఴకారధ్వని తమిళ మలయాళములలో నేఁటికిని బండితోచ్చారణమున వెలయుచున్నది. తమిళమున నది 'ழ' అను లిపిచే గుఱితింపఁబడును. నేఁటిసాధారణ తమిళ జనోచ్చారణమున నిది ళకారముగఁ బల్కఁబడ నారంభించినది. ఇది యాంగ్లభాషలో 'Pleasure' అను శబ్దమందలి 'Sure' (ష్ర్) అనుదాని వంటి ధ్వనితోఁ దమిళపండితులచే నుచ్చరింపఁబడుచున్నది. పటగన్నడమునందును (ప్రాచీనకన్నడమున=హళె గన్నడమున) నన్నయకు ముందటి తెల్గునందును నీ వర్ణముండెడిది. నన్నయ దీనితోడనె సంస్కృత వర్ణసమామ్నాయ పంచాశద్వర్ణపూర్తిని గావించెను. (చూ. 'వై. పా.' ౨౧౮—౨౮౫ విష. ౧౮౮ మొ. ౯౧-వ. విష). నన్నయ నాఁటి కచ్చాంధ్ర శబ్దములందలి దీని యుచ్చారణము మాఱి "డకార-ళకార"

రూపములఁ బరిణమించెను. అట్లగుటచేతనే నన్నయభట్టారకుఁడు దీని నచ్ఛాంధ్రవర్ణమాలలోఁ జేర్పకనలేదు. పలగన్నడమున నియ్యది విస్తృతముగా వ్యాపించి యున్నను హొసగన్నడమున (నవీనకన్నడమున) నశించి 'ళ' కార ముగఁ బరిణమించినది. సంస్కృతమున నిది యీషత్ స్పృష్ట (దుఃస్పృష్ట) డకారముగఁ జెప్పఁబడియున్నను గాలక్రమమునఁ గొన్ని వేదశాఖలలో 'ళ' కారముగా నుచ్చరింపఁబడుచున్నది.

"త్రిషష్టి శ్చతు షష్టి ర్వా। వర్ణా శ్శమ్భు మతే మతాః। ......అను స్వారో విసర్గశ్చ। ౘ క ౘ పౌచాపి పరాశ్రితౌ। దుఃస్పృష్ట శ్చేతి విజ్ఞేయః। ఌకారః ప్లుతఏవచ" (పాణిని శిక్ష).

"జిహ్వామూలం తాలు చాచార్య అహ స్థానం డ (ఱ) కారస్యతు వేద మిత్రః." (౯ సూ. ఋగ్వేద ప్రాతిశాఖ్య. ౧ పటలము ౩౮ పుట).

"అగ్నిమీ (ళే) డే పురోహితమ్" (ఋగ్వే. ౧ అధ్యా. ౧ వర్గ. ౧ ఋక్కు. ౭౭ పుట) దీని సాయన భాష్యము:—అగ్నినామకం దేవ మీడే (ళే) స్తౌమి. ఈడ స్తుతౌ. ఇతిధాతుః. డకారస్య డకారో (ళకారో) బహ్వృచా మధ్యేతృ సంప్రదాయః. తథాచ పఠ్యతే. అజ్మధ్యస్థ డకారస్య। డ (ళ) కారం బ హ్వృచా జగుః। అజ్మధ్యస్థ ఢకారస్య। ఢే (ళ హ) కారం వై యథాక్రమమ్".

"ఏకనీడ (ఱ) మ్" (తైత్తిరీయారణ్యకము ౧౦ ప్రశ్నము. ౧ పన్నము.) "దేవహేడ (ఱ) నమ్" (తైత్తిరీ యారణ్యకము. ౧౦ ప్రశ్నము. ౬౦ పన్నము) (చూ. "వై. పా." ౧౮౭ విష.) "డకారము స్పృష్టము. డకారమీషత్ స్పృష్టము" అనుభేదముతో 'డ-డ' లు వయిని లిఖింపఁబడెను. కొన్ని వేద శాఖల పాఠములం దిది డకారముగానె పఠింపఁబడుచున్నది. కొన్ని వేదశాఖ లలో 'ళ' కారముగాఁ బఠింపఁబడుచున్నది. ళకారమనఁగా ద్రావిడభాష లందలి తెల్గులోని గయ్యాళీత్యాది శబ్దములందలి 'ళ' కారమువంటిదిగ నుచ్చ రింపఁబడుచున్నది. ఉదా:—ఈళనమ్ = (స్తుతి). హేళనమ్ = (పరిహాసము). మొ.

పరిశీలింపఁగాఁ బ్రాచీనతమ కాలమున 'డ' కారమె ఱకారముగఁ బరిణమించి యుండుననియుఁ గాలక్రమమున నట్టి ఱకారము 'డ-ళ' పరిణామ మందు చున్నదనియుఁ దోఁచెడివి. క్రీ. శ. ౧౯౫౩ సెప్టెంబరు—నవంబరుల 'సంస్కృతి' అను పత్రికలో శ్రీ భద్రిరాజు కృష్ణమూర్తి యమ్మెగారు (వాల్తేరు - ఆంధ్రవిశ్వకళా పరిషత్తు - ఉపన్యాసకులు) నేఁటి పరిణామమును మాత్రము చూచి యీ క్రింది రీతిని వ్రాసిరి.

"అచ్చులమధ్య 'ఱ' కారము తెనుగులో డకార మగును" అని యొక ధ్వనిసూత్రమును జూపిరి" (౫ పు. సంస్కృతి. ౧౯౫౩ నవంబరు). (తమిఱము లోని 'ఱ' కారము తెల్గున 'డ' కారమగునని వీరి తాత్పర్యము.) తమిఱ మందువలెనె ప్రాచీన కర్ణాట ప్రాచీనాంధ్రములలో నీ వర్ణము వెలసి యుండెడిది. అది తెల్గున నన్నయనాఁటికిఁ గొన్నియెడల 'డ' కారముగాను గొన్నియెడల 'ళ' కారముగాను బరిణమించెను. హళాసగన్నడమున 'ళ' కారముగాఁ బరిణమించెను.

ప్రాచీనాంధ్ర శాసనములలో విపులముగా నీ ఱకారముతోడి యచ్చాంధ్ర శబ్దములు వెలసియున్నవి. కాలక్రమమున నట్టి శబ్దములందలి ఱకారోచ్చారణ మంతరించి నన్నయనాఁటికే డకార—ళాకారములుగా వెలసినది. ఉదా.—ఏఱు=ఏడు (సప్తసంఖ్య) నఱచు=నడచు. మొ. (చూ. ఆం. భా. వి. ౨౦౯—౨౧౦ పుటలు) యుద్ధమల్లుని బెజవాడ శాసనమున 'అఱిపుఱ' 'ఱస్సి' అనునవి ఱకార లిపితోఁ జూపట్టుచున్నవి. (చూడు. శాసనప్రతిబింబము. శాసన పద్యమంజరి. ౨ నెంబరు శాసనము. 'ఆం. భా. చ. ౨౩౬ మొ. ౨౮౮-వ. పుటలు.)' (చూడు. వై. పా. ౧౦౦ మొ. ౧౯౧ విష).

పఱగన్నడమం దీ ఱకారము విరివిగా వెలసియున్నది. "డ-ట-ఠ-త-ర-క్షళ" ముల చోట 'ఱ' కారమువచ్చి 'అ ఱ' మని వ్యవహరింపఁబడును.

"యస్తు డకారాదీనాం స్థానే ఆదిష్టః స ప్రాయేణ అఱః. క్వచిత్ క్షళశ్చ భవతి. (క్షళ మనఁగాఁ గర్ణాటాచ్ఛిక ళకారము) (అఱ మనఁగా ఱకారము) స్థానీచాత్ర ప్రాయేణ డకారః, ట-ఠ-త-ర-క్షళాశ్చ (క్షళ మనఁగా సంస్కృత లకారముచోట నాదిష్టమగు ళకారము. జలం=జళం మొ.) క్వచిత్ స్థానినోభవన్తి. తత్ర ట-ఠ-త రేఫా స్సంస్కృత శబ్దగతాఏవ. న భాషాశబ్దగతాః. క్షళస్తు కార్ణాటిక ఏవ. సంస్కృతే తదభావాత్. డకారస్తు యథాలక్ష్యం ఉభయగతోఽపి స్థానీ భవతి......డకారస్య తావత్ సంస్కృతే యథా:—నాడీ=నాఱి. గాడీ=గాఱి......ఖడ్గం=ఖఱ్గం...... భాషాయాం యథా:—కాఱ్కిచ్చు (కాడు+కిచ్చు)=(అడవిలోని దావాగ్ని)... ...టకారస్య యథా:—ఘటికా=గఱిగె......ధాటీ=దాఱి ......ఠకారస్య యథా:—పీఠికా=పీఱిగె......తకారస్య యథా:—ప్రతిహస్తం=పఱిహత్తం... ...రేఫస్య యథా:—ఝల్లరీ = జల్లఱి......కూరం = కూఱు......క్షళస్య యథా:—పులినమ్=(పుళినమ్)=పుఱిల్. అర్గలమ్=(అర్గళమ్)=అగుఱి...... భాషాయాం అవిహితస్తు నిసర్గసిద్ధో వ్యుత్పత్తి మనపేక్ష్య అనాదిశిష్ట వ్యవ

హారప్రసిద్ధ్యా ధాత్వవయవ్రా నామావయవ్రోవా, వర్ణః యోళకారః స ద్వేధా వ్యపదిష్టః, అటః—కుళశ్చేతి......తత్ర కుట్యాది ధాత్వవయవ్రా— అవగళియాది నామావయవో యో ళకారః స అటు ఉచ్యతే. అతిరిక్త స్సర్వః ......కుళఇతి." ('షోబహుళం' (౧౪౦ సూ.) అను సూత్రపు వ్యాఖ్య.)

"క॥ కృతిమార్గదోళుంటు టకా। ర తకార రకార రేఫ డెడగం బహుళ। స్థితియం క్షుళక మపభ్రం। శ తెరెయె ళ్ను కవీంద్రరిందె ఆటుదాదేశం॥ ౨౧. (కేశవపండితుని శబ్దమణి దర్పణము).

౧౭. X విష:—పయిని వ్రాసిన రీతిని క్షుళ మనఁగా సంస్కృత శబ్దగత లకారముచో వైకల్పికముగా సార్వత్రికముగా నాదేశింపఁబడిన జళాది శబ్దగత ళకారము.

"లోళః. (వృత్తి)=లకారస్య ళకారాదేశో వా భవతి. ప్రయోగః:— జల=జళ. తిల=తిళ. ఫల=ఫళ. కుల=కుళ. అలి=అళి. వ్యాఖ్య:—"...... అయమేవ క్షుళ వ్యపదేశ భాక్." (కర్ణాట శబ్దా-౧౩౯ సూ). లకారమును ళకారముగా నుచ్చరించుట ద్రావిడ వ్యావహారిక భాషలలోఁ జాలకాలము క్రిందటినుండియు విస్తరించియున్నను బ్రాచీన ప్రామాణికు లద్దాని నపభ్రంశో చ్చారణముగా నుపేక్షించిరే కాని యాదరింపలేదు. కావుననే యీ పాక్షిక ళకారవిధి నాగవర్మ కర్ణాటభాషా భూషణమునఁగాని కేశవ పండితుని శబ్దమణి దర్పణమునఁగాని సూత్రింపఁబడలేదు. మకరంద వ్యాఖ్యాతయు దీనిని సంస్కృత రూపముగా నంగీకరింపలేదు. "క్షుళస్తు కార్ణాటిక ఏవ-సంస్కృతే తదభావాత్" (కర్ణాట శబ్దా. ౧౪౦ సూత్రపు మకరంద వ్యాఖ్య) అని వచించి యున్నాఁడు. తెల్గునందును నప్పక వ్యహోబలపండితా ద్యర్వాచీనులే యట్టి ళకారోచ్చారణమును సంస్కృత శబ్దములం దంగీకరించిరి కాని ప్రాచీన సమ్మతముకాదు.

సీ॥ ఏకనీళము దేవహేళనంబు నటంచు యాజుషామ్నాయంబునందు లేదా।
కాళ నాళ వ్యాళ గోళ హింతాళంబు లనుచు సంస్కృతభాషయందు లేదా।
గయ్యాళి త్రుళ్ళు నంగళ్ళు వజ్రపుతళ్కు తాళి యటంచు నాంధ్రమున లేదా।
పాళం బెళుంగని కూళ విరాళి పిసాళించు ననుచు దేశ్యమున లేదా॥

......"(అప్పక. ౨ ఆ. ౫౦ ప). ప్రాచీనులగు నన్నయాథర్వణాదు లిట్లప్పక వ్యాదులవలెఁ గలగాయపులగముగను నసంగతముగను వచించి యుండలేదు. ఏకసీళ దేవహేళన శబ్దములలోని ళకార మర్వాచీన రూపము. అచటి ప్రాతిశాఖ్య సమ్మత ప్రాచీన రూపములు "డ=ఱ" అను దుఃస్పృష్ట డకారవంతములు. ఇది కన్నడములోని "ఱు"మున కభిన్నము. "గయ్యాళి కూళ" మున్నగు వానిలోని ళకారము ద్రావిడ మూర్ధన్య ళకారము. ఇది కర్ణాటములోని "కుళము"న కభిన్నము. కాళ నాళ వ్యాళ గోళ హింతాళాదులలోనిది మూర్ధన్య ళకారము కాదు. అది దంత్యమగు నలఘు లకారము. ఇది తలమీఁద బొట్టు నిల్చిన లకారముతో గుర్తింపఁబడినది. ఉదా:—కాలము-నాలము-మొ. ఇది కర్ణాటములోని క్షుళమున కభిన్నము. 'అంగళ్ళు' మున్నగు వానిలోని బహువచన లకారము సైత మలఘు లకారమె. (చూ.'వ్యా. సం.' ౧౯ విష.) ఈ విషయమునె "లఘువోలఘునశ్చేతి / ద్వేధాస్తస్థా న్వదన్తి శాస్త్రారః" అను కారికతో భట్టారకుఁడు వచించెను. దంత్య లకారముయొక్క యశిథిలోచ్చారణమె యలఘు లకార మగుటంజేసి యది వర్ణాంతరము కానేరదు. (చూ. వ్యా. సం. ౧౧ విష. ౧౪ విష.) ఇట్టి యలఘు లకారమునకు నన్నయభట్టు "దంత్య చజౌ గురు ర లౌచ బిన్దుయుతౌ" అని (చూ. వ్యా. సం. ౭౯ II విష.) లిపిని గల్పించినను నట్టి లిపి వాడుక కెక్కదయ్యెను. కావుననె యలఘు రేఫము 'ఱ' అను నాకారముతోఁ బ్రాచీనాంధ్ర కర్ణాట సాధారణ లిపితో వ్రాయఁబడుచున్నది. అలఘు లకారమునకు లిపి యాంధ్ర కర్ణాట సాధారణ లిపిలో లేమింజేసియు నుచ్చారణ సాన్నిధ్యముండుటంజేసియు నర్వాని నాంధ్ర కర్ణాట సాధారణ లిపిలోని మూర్ధన్య 'ళ' కారముతోనె వ్రాయుచున్నారు. ఇట్లగుటచే నయిత మట్టి యలఘు దంత్య లకారమునకు ద్రావిడ మూర్ధన్య ళకారోచ్చారణము బలపడినది. కాని దంత్యమగు నలఘు లకారమును మూర్ధన్య ళకారముగాఁ బలుకట గాని దాని లిపితో లిఖించుటగాని యది వర్ణాంతర మనుటగాని కేవలము పొరపాటు. (చూ. ౧౭ VII విష.) (వ్యా. సం. ౧౪ విష).

పయి నుదాహరించినరీతిని ద్రావిడభాషలలో-"ళ-డ-ఱ-ర-ఱు" అను వానికిఁ గల యుత్పత్తిస్థాన సాన్నిధ్యమునంజేసి వానికి విపర్యాసములు పెక్కు గల్గసాగెను. అట్టి విపర్యాసము లీ క్రింది పట్టికలో నరయునది.

౧౭. XI విష:—ఱ కారవ్యత్యాసములఁ దెల్పు పట్టిక - అనఁగా డ - ళలుగా మాఱిన కొన్ని స్థలములు.

| తెల్గు | తమిళ | కన్నడము | సంస్కృ | అర్థాదులు |
|---|---|---|---|---|
| ప్రాఁత | పఱమై | పఱ, హళె | ప్రాఙ్చ | ప్రాచీనము |
| తమిఱము<br>తమిళము | తమిల్ | ... | ద్రావిడ | అఱవము |
| క్రొవ్వు | కొఱుప్పు | ... | ... | ... |
| ప్రొద్దు | పొఱుదు | పొత్తు | బ్రధ్న | ... |
| క్రిందు | కీల్ | ... | ... | ... |
| ఏఁడు | యాణ్డు | ఏఱు | ... | వత్సరము |
| ఏడు | ఏల్ | ఎఱు | ... | సప్త సంఖ్య |
| కూడు | కూల్ | ... | ... | |
| పాడు | పాల్ | పాల్ | ... | చెడిపోవు |
| కోడి | కోటి | కోటి | కుక్కుటము | |
| ఊడిగము | ఊటియమ్ | ... | ... | |
| గడ | కళై | ... | ... | |
| కూఱ=కూర | ... | కూఱు | ... | |
| తాడు | ... | తాల్ | తాళ | |
| గడియ | ... | అగుల్ | అర్గళమ్ | ... |
| చోడులు | చోఱర్ | చోఱర్ | చోళః | ... |
| దాడి | ... | దాఱి | ధాటీ | దండయాత్ర |
| అవగళము | ... | అవగఱియం | ... | ... |
| ఆళువారు | ఆళ్వార్ | ఆళ్వార్ | ... | ... |
| ఉంబళి | ఉమ్బళమ్ | ఉంబఱి | ... | ఉంబాళా |
| ఎడ్లు – ఎద్దులు | ఎఱ్ఱుగళ్ | ఎరుదుగళ్ | ... | ... |
| తాళము | తాల్ | తాళ్ | ... | బీగము |
| తొళసి | తుళాల్ | తొణచి | తులశీ | ... |
| కూళ | కూళై (పొట్ట) | ఖూళ | క్రూరః | ... |
| గుళిగ | కుళిగై | గుటిగె | ఘుటికా | ... |
| తావళము | తాల్ వడము | ... | ... | ... |
| తాళిక | తాల్ (వహించు) | తాళ్ (ధరించు) | ... | ఓర్పు |
| పాళ | పాళై (గెల) | పాళె | ... | పూలగుత్తి |
| మళిగ | మళిక్కై | మఱిగె | మఠికా | ... |
| అక్కఱ | అక్కఱై | అల్ కఱు | ... | ... |
| కోఁడు | కూటి | ... | ... | బియ్యము చెఱుఁగు |
| చినుఁగు=చిఱుఁగు | కిఱి | ... | ... | ... |
| మోకాలు | ముఱణ్గాల్ | మోకాల్ | ... | ... |
| మ్రోఁగు | ముఱంగు | మొఱంగు | మృదంగః | ... |
| నలువది | నాఱ్పదు | ... | ... | ... |
| ఒళవరి | ఉళవఱి | ఉళవఱి | ... | మర్మజ్ఞుఁడు |

౧౭. XII విష:—ఱకారము:— తెలుగున సంతస్థములు లఘువులనియు నలఘువులనియు రెండు విధములు. సంస్కృతమందు యవలకు లఘ్వలఘు భేదమున్నను నట్టివాని లఘుతకుఁ బృథగ్గణనము లేదు. ప్రాతిశాఖ్యల పద్ధతిని బట్టి చూచినను లఘ్వలఘువులకు వర్ణోత్పత్తి స్థానకరణాది భేదములేమింజేసి పృథగ్గణనము సమ్మతముకాదు. కావుననే యచ్చాంధ్రమున నన్నయభట్టారకుఁడును నలఘు రేఫమును నలఘు ళకారమును వర్ణమాలలో వేఱుగ గణింపలేదు. తొల్కాప్పియరు నాఁటికి 'ఱ' కారోచ్చారణమున స్థానకరణ భేదము వెలయుచుండుటంజేసి యాతఁడద్దానిని వర్ణసమామ్నాయమున వేఱుగ గణించెను. తమిళమున ఱ ళలు మూర్ధన్యములే కాని వానికి దంత్యతలోని య లఘూచ్చారణము లేదు. లఘూచ్చారణ మనఁగా వర్ణోచ్చారణమున స్థానకరణ శైథిల్య మాత్రమె. "యస్యోచ్చారణే జిహ్వా గ్రోపాగ్ర మధ్య మూలానాం శైథిల్యం స లఘూచ్చారణః" (సి-కౌ). ఆంధ్రకర్ణాట సాధారణ లిపియందు 'ఱ' అను రీతిని ఱకారము వ్రాయఁబడును. తమిళమున 'ற' అనునది దాని లిపి. ఱకారమున కలఘు రేఫోచ్చారణము ద్రావిడ భాషలలో నర్వాచీనముగఁ గల్గినది. తొల్కాప్పియరు నాఁడు ఱకారము—'టత' లకు మధ్యస్థమగు నుచ్చారణము గల్గియుండెడిది. కావుననె ద్రావిడభాష లన్నిటియందును బ్రాచీన కాలమున 'ర ఱ' లకు యతిప్రాస మైత్రిలేదు. కాలక్రమమున ఱకారమునకు ద్విత్వము లేనపుడు ద్రావిడ భాషలన్నిటియందును నలఘురేఫోచ్చారణము గల్గినది. పరుషములకు సరళోచ్చారణము వలెనె యీ యలఘురేఫోచ్చారణ మర్వాచీనముగ ఱకారమునకుఁ గల్గెను. ద్విత్వమున్నపుడును నేఁటి తెలుగునందును కర్ణాటమందును ఱకారమున కలఘురేఫోచ్చారణమె వెలయుచున్నది. తమిళ మలయాళములందు ద్విత్వ ఱకారము 'ట్ర' అను రీతిగఁ బండితులచేఁ బల్కఁబడును. సాధారణులు ద్విరుక్త ఱకారమును తకార ద్విత్వమునువలె నేఁడు పలుకుచున్నారు. కర్ణాటమున—"గిఱ్ఱనె=గిఱ్ఱుమను ధ్వని. తిఱ్ఱనె=త్వరగా" అను రెండు శబ్దములు మాత్రమె ఱకార ద్విత్వము గలవి చూపట్టుచున్నవి. తక్కిన ఱకార ద్విత్వముండఁదగిన చోటులందెల్ల 'త' కార ద్విత్వమె ప్రాచీన కర్ణాటమున వెలసియున్నది. నవీన కర్ణాటమున ఱకారము చోట లఘురేఫోచ్చారణమె సంభవించియున్నది. 'ర-ఱ' ల విషయమున నాంధ్రులు చేసిన పరిశ్రమము నారచించినవై యాకరణ పారిజాతమునఁ గననగును. (చూడు. వై. పా. ౩౮౦ మొ. ౫-౨-౨-వ. విష).

౧౭. XIII విష:—నేఁటి తమిళ మలయాళములలో ఱకారము కర్ణాటాంధ్రములందువలెనె ద్విత్వము లేనపు డలఘురేఫముగా నుచ్చరింపఁబడుచున్నను నిది యర్వాచీన స్థితియనియుఁ బ్రాచీనకాలమున ద్విత్వావస్థయందే

కాక ద్విత్వము లేనపుడు సైతము అకారము 'టత' లకు మధ్యస్థమగు నుచ్చారణమె కల్గియుండెడి దనుట నిశ్చయము. కావుననె కకారాదులతో పాటుగ 'ఱ'కారము పరుషమనియు దానికిని 'క'కారాదులకు వలెనె యను నాసికము 'న' అను మూర్ధన్యము గలదనియుఁ జెప్పఁబడెను. "వల్లెలుత్తు..." (తొల్కా. ౧౯ సూ.)='కచటతపఱ' అనునవి పరుషములు. "మెల్లెలుత్తు..." (తొల్కా. ౨౦ సూ.)='ఙ-ఞ-ణ-న-మ-న' అనునవి వరుసగాఁ బై పరుషముల యనునాసికములు. ఇంత యేల! వెనుక నుదాహరింపఁబడిన తొల్కాప్పియ మందలి వర్ణోత్పత్తి సంప్రదాయమునందు, అకారమును దాని యను నాసికమగు 'న' అను మూర్ధన్య నకారమును స్పృష్ట ప్రయత్నము (గాఢముగా వర్ణోత్పత్తి స్థానమును గరణము తాఁకుట) గలవనియు 'ర-ఱ' లీషత్ స్పృష్ట ప్రయత్నము గలవనియు ౯౪—౯౫ సూత్రములలోఁ దొల్కాప్పియరుచే స్పష్టముగా సూత్రింపఁబడెను. ద్విత్వావస్థలో నొక రీతిగను ద్విత్వము లేనపుడొక రీతిగను అకారమును బల్కవలెనని యెచ్చటను నెంతమాత్రమును జెప్పఁబడలేదు. మఱొక వింత! నేఁడు ద్విరుక్త అకారము నుచ్చరించునపుడు "ట్ర" అను రీతిని "టకారద్వయ రేఫసంయుక్తముగాఁ గొందఱు పల్కెదరు. అందు రేఫోచ్చారణము తమిళ మలయాళ సంప్రదాయ విరుద్ధము. టకారద్వయోచ్చారణము సైతము తొల్కాప్పియ సమ్మతము కాదు. టకారోచ్చారణ సాన్నిధ్యమున నట్టి టద్విత్వమువంటి యుచ్చారణము నేఁడు వెలసినది. 'ఱ ఱ' అని యిట్లు అకార ద్వయమునె వ్రాయుచు నేఁటి తమిళ పండితులును 'ట్ట' అను రీతిగ దాని నుచ్చరింతురు. విద్వాన్ - వే. వేంకటరాజులు రెడ్డిగారు ౯-౨-౫౨ తేదీ జాబులో 'ట్ర' అను రేఫ ఘటితోచ్చారణము తమిళమందే కాక మలయాళ మందును లేదని వ్రాసిరి.

అకార ఘటిత శబ్దములలో 'ట' కారస్థితికిఁ బ్రాచీనములగు నిదర్శనములు గన్పట్టుచున్నవి. తమిళమున:—కూఱు=(చెప్పు). కూఱ్ఱు=(మాట). దీనిని బండితులు 'కూట్టు' అని పల్కెదరు. ఊఱు=(నీరూఱు). ఊఱ్ఱు=(ఊట). దీనిని "ఊట్టు" అని తమిళ పండితులు పల్కుదురు. ఆఱు=(నది). ఆఱ్ఱై=(నదిని). దీనిని దమిళ పండితులు "ఆట్టై" అని పల్కుదురు. ఆఱ్ఱు నీర్ (ఏటి నీరు). 'ఆట్టు నీర్' అని పండితుల పల్కబడి. పెఱు=(ప్రసవించు). పెఱ్ఱ=(ప్రసవించినది). 'పెట్ట' అని పల్కెదరు. కుఱ్ఱి=(పొట్టి మొఱడు). దీనిని "కుట్టి" అని పల్కెదరు. చిఱు+ఎలి=చిఱ్ఱెలి=(చిట్టెలుక). 'చిట్టెలి' అని పండితులు పల్కెదరు. కుఱు+ఉయిర్=కుఱ్ఱుయిర్=(హ్రస్వోచ్ఛ్వా). దీనిని "కుట్టుయిర్" అని పల్కుదురు.

ఆంధ్రకర్ణాటములందును ప్రాచీనకాలమున ఱకారము 'టత' మధ్యస్థోచ్చారణమె కల్గియుండెడిదని తోఁచెడిని. కావుననె ఱకార ఘటితశబ్దములు కొన్ని టకారవంతములయి తెల్గున వెలయుచున్నవి. తెల్గు:—ఊఱు = (నీరూఱు). దీనినుండి 'ఊట' అను కృదంతరూపము వెలయుచున్నది. "చిఱు+ఎలుక=చిట్టెలుక. కుఱు + ఉసురు = కుట్టుసురు" మున్నగు సంధి రూపములును బ్రసిద్ధములయి యున్నవి.

కర్ణాటమున ఱకార ద్విత్వ ముండవలసిన చోటులయందెల్ల "త" కారద్విత్వము వెలయు చున్నది. ఉదా:—గిఱు=(భావించు)+తమ్=(భూతార్థకము) =గెత్తం=(భావించెను). కిఱు = (వ్యవహితమగు) + తమ్=(భూతార్థకము)= కిత్తం=(వ్యవహితమయ్యెను). కిఱు+అడి=కిత్తడి = (వ్రతి). (ఇట "కిట్టడి= కిట్టడి" అని కాలేదు). కిఱు (కిఱిదు)+ఎసళ్=కుత్తెసళ్=(చిన్న పుష్పదళము). (ఇట—"కుట్టెసళ్=కుట్టెసళ్" అనికాలేదు).

పయి సందర్భమును బట్టియు వెనుక నుదాహరించిన తొల్కాప్పియము లోని వర్ణోత్పత్తి సంప్రదాయములోని 'ఱ-ట-త' అను వానిని సంబంధించిన విషయములను బట్టియు 'ఱ' కారము ప్రాచీనకాలమున 'టత' మధ్యస్థోచ్చారణము గల్గియుండెడిదనియు నాంధ్ర కర్ణాటములందు సయితము పురాతన కాలమున ఱకారము "ట-త" మధ్యస్థోచ్చారణమె కల్గి యుండెడిదనియుఁ గాల క్రమమున ద్రావిడభాషలందు సరళోచ్చారణ మర్వాచీనముగ విస్తరించినట్లె ఱకారమునకు రేఫోచ్చారణము గల్గినదనియుఁ దోఁచుచున్నది. వెనుక నుదాహరించిన తొల్కాప్పియ వర్ణోత్పత్తి సంప్రదాయములోని (౧౭ VIII విష. చూ.) "ట-త-ఱ" అనువాని సాన్నిధ్యమె పై మార్పులకు మూలమని యెఱుంగునది.

నాకుఁ దమిటోపదేశకులును మద్రాసు విశ్వవిద్యాలయమునఁ బ్రాచ్య భాషా పరిశోధన కక్ష్యలోఁ దమిళ పండితులై యుండి విశ్రాంతిఁ గొన్నవారును దమిళ మలయాళాంధ్ర విద్వాంసులు నగు విద్వాన్ వే. (వేంకటాచల) వేంకట రాజులు రెడ్డిగారీ విషయమున నీ క్రింది రీతిని వ్రాసియున్నారు.

"ఱకారమునకు నేఁటి యుచ్చారణమే (అఘురేఫోచ్చారణమే) యాది కాలమునందును నుండినయెడల దానిని పరుషములలో నెంచియుండరు. ఱకారము 'ట-త' లకు మధ్యస్థలమునఁ బుట్టుచున్నది......అఱవమున ఱకారద్విత్వముగల శబ్దములు తెలుఁగులో 'ట' కార ద్విత్వముతోను, గన్నడమున 'త' కారద్విత్వముతోను వెలయుచున్నవి. ఇప్పుడు అఱవమునందును 'త'కారద్విత్వముతోనె యవి వ్యావహారికభాషయం దుచ్చరింపఁబడుచున్నవి.

'క-చ-ట-త-ప' లకు సరళోచ్చారణము కాలక్రమమున వచ్చినట్లే ఱకారమున కును (ఆంగ్లమునందలి '$r$' అనుదాని యుచ్చారణము) సరళోచ్చారణము (అ లఘురేఫోచ్చారణము) పలుకఁబడిలో వచ్చినదని నా నమ్మకము......మల యాళమునందును......ద్విత్వ ఱకారమును నేఁడు 'ట్ట' అనుదానివలెనె యుచ్చరింతురు. ఏక ఱకారమును (ద్విత్వములేని ఱకారమును) మన ముచ్చ రించునట్లే (అలఘురేఫోచ్చారణముననే) యుచ్చరింతురు. (౧౪-౧౧-౧౯౫౧ తేది). "ట్ర" అనుదానిలో రేఫోచ్చారణము ("ట్ర" అనురీతిది) మలయాళము నందును లేదు" (౯-౨-౧౯౫౨ తేది). అని వ్రాసిరి.

పయి సందర్భమునుబట్టి యీ క్రింది కాల్డువెల్లుగారి వ్రాఁత సరికాదని విశదమగుచున్నది. "అఱవమున ఱకారవిషయమున సైత మొక నియమము గలదు. అద్విరుక్త ఱకార మలఘురేఫముగను, ద్విరుక్త ఱకారమును 'ట్ర' అనుదానినిగాను బలుకుదురు" (Which is pronounced as '$r$' when single and like "ttr" when doubled.) (కాల్డు. ౧౩౯ పుట). "కుట్టుసురు-చిక్కెలుక మొదలయిన పదములయందు "కుట్రుసుర్-చిత్రిలై" మొదలైన రూపములు తమిళమునఁ గనుపట్టుచుండుటచేతను......" (ఆం. భా. వి. ౩౨౪ పుట). ఈ వ్రాఁత యింకను భ్రామాదికము. ఇందనావశ్యకమగు రేఫసంయోగమేకాక టకారద్విత్వాభావమును గన్పట్టుచున్నది.

ఱకార విషయమునఁ బైరీతిగల యుచ్చారణ విశేష ముండుటచేతనే ప్రాచీన ద్రావిడభాషా పండితులు రఱలకు యతిప్రాసమైత్రి నంగీకరింపని వారైరి. (చూ. వై. పా. ౩౮౦ మొ. ౩౮౩-వ విష).

౧౭. XIV విష. 'ర ఱ' యతిప్రాస మైత్రీ నిషేధము. ఉభయరేఫ ఘటిత శబ్దాంగీకారము:—

కాలక్రమమున ద్రావిడభాషలందలి ఱకారమునకు 'టత' మధ్యస్థోచ్చా రణము నశించి యలఘురేఫోచ్చారణము విస్తరించుటయే కాక తెలుఁగున "ర ఱ" ల లఘ్వలఘుతాభేదము సైతము క్షీణింప నారంభించుటచేత నన్నయ తర్వాతి తిక్కనాదులు వాని యతిప్రాస మైత్రిని బ్రయోగింప నారంభించిరి. కాని "నాన్యేషాం వైధర్మ్యం। లఘ్వలఘూనాం రయోస్తు నిత్యం స్యాత్" అని భట్టారకుఁడును, "అనయో స్సంగతిం యస్తు। కరోతి కవితా కృతౌ। అస్యా అత్యన్త దుష్టత్వా। ద్దుష్కవి స్సహి కథ్యతే" అని ద్వితీయాచార్యుఁ డును (చూ. 'వ్యా. సం.' ౫౮ విష.) నిరసించియుండుటచేత నట్టి దోష మును దిక్కయజ్వాదులందు నిల్పుట కాంధ్రలాక్షణికులు సమ్మతింపక గొప్ప పరిశ్రమచేసి యట్టి "ర ఱ" మైత్రి స్థలములనెల్ల మహాకవి ప్రబంధములనుండి

వెదకి తీసి యట్టి శబ్దములం దుభయ రేఫస్థితి నంగీకరించి సమర్థించిరి. ఉచ్చారణ భేదమువలన నట్టి యుభయ రేఫస్థితి సంభవింపనచ్చునని ద్వితీయాచార్యుం డీ క్రింది రీతిని వచించెను "లఘు ర్భవే ద్గురుః క్వత్ర । చి ద్గురుశ్చ లఘు ర్భవేత్ । ఉచ్చారణ స్య కల్ప్యత్వా । న్నిదానం తత్ర సద్వచః" (వ్యా. సం. ౫౮ I విష). ఉదా:—

క॥ చేతఁగొని యుప్పు నమలుట । రాతి పయిని నుప్పు గొనుట రాత్రి దధిమధూ । పేతంబుగఁ గుడుచుట ధ । రేతరములు రేయి సక్తు వెగ్గ నరేంద్రా ॥ (అను. ౪ ఆ. ౧౧౦).

క॥ నాయుల్ల మరయ నినుమో । హాయో కా కిట్లు రూపఱిక విన నేర్చెన్ । ......(భీష్మ 3 ఆ. ౪౧౯ ప).

ఆ. వె......అధిక భక్తి । నెనఁగి ప్రియము పలికి తెరు విత్తు రిట్టిద । ......(ఆది. ౭ ఆ. ౧౧౨ ప).

క॥ ఎఱిఁగిన నప్పెను ప్రేఁగున । విఱుఁగుటయును శాఖ...... (అను. ౧ ఆ. ౨3౭).

ఆంధ్రమహాకవి ప్రబంధ వాఙ్మయ మహాసముద్రమును మథించి యందలి ప్రయోగములను బట్టి—(౧) కేవల రేఫఘటితాచ్ఛిక శబ్దముల పట్టికను—(౨) కేవల ఱకార ఘటితాచ్ఛిక శబ్దముల పట్టికను (3) నుభయ రేఫఘటిత శబ్దముల పట్టికను నాంధ్రలాక్షణికు లేర్పఱిచి యున్నారు. తమిళ కర్ణాటములం దిట్టి పరిశ్రమము జరిగియుండలేదు. ఆంధ్ర లాక్షణికులు చేసిన యట్టి పరిశ్రమము నారచించిన వైయాకరణ పారిజాతమున సవిమర్శముగా విస్తరించి ప్రదర్శింపఁబడెను. (చూ. 'వై. పా.' 3౦౮ మొ. ౫౦౨ వ. విషయములు).

౧౭. XV విష:—తమిళ మలయాళములందలి ద్విత్వేతర స్థలములలోని ఱకారములకును నాంధ్ర కర్ణాటములందలి ద్విత్వాద్విత్వ స్థలములలోని ఱకారములకును 'ట త' మధ్యస్థోచ్చారణము మాసిపోయి యలఘురేఫోచ్చారణమె నేఁటికి వెలసియుండుటచేతను, గొన్ని శబ్దములలోని ఱకారమున కట్టి యలఘు రేఫోచ్చారణము సయితము నన్నగిల్లి, వానియం దుభయరేఫోచ్చారణము విస్తరిల్లుటచేతను నాఁటికి—నేఁటికి—'ర ఱ' ల యుచ్చారణమునందలి లఘ్వలఘుతా భేదము సైతము క్షీణించుట మూలమున ద్రావిడ శబ్దములందు రేఫ ఱకార వ్యత్యాసము గన్పట్టసాగెను. నారచించిన వైయాకరణ పారిజాతము ౪౫౨ విషయమున ద్రావిడ భాషలలోఁ బరస్పర సంబంధముగల రేఫ ఱకార ఘటిత శబ్దముల పట్టిక చూపఁబడెను. అట్టి పట్టికనుండి కొన్ని శబ్దము లిటఁ బ్రదర్శింపఁబడుచున్నవి.

## ర ఱ ఘటిత పరస్పర సంబంధ యుత ద్రావిడ శబ్దములు

| తెలుఁగు | అర్థము | తమిళము | కన్నడము |
|---|---|---|---|
| అక్కఱ | అపేక్ష | అక్కఱై | అల్ కల్ |
| అర | సగము | అరై | అరె |
| అఱ్ఱ = అఱ | సగము. పెట్టెలో నగు వాని భాగము | అఱై (గది) | ...... |
| అఱగోఱ | న్యూనత | అఱైకుఱై | ...... |
| అఱచు | ధ్వనిచేయు | అఱై (కొట్టు) | అఱచు |
| అఱవము | తమిళము | అరువా—అరువర్ | ...... |
| అఱు | క్షయించు | అఱు. | అఱు |
| అఱుఁగు | జీర్ణించు | అరుగు (క్షయించు) | అఱు = (నశించు) |
| అఱువది | షష్టి సంఖ్య | అఱుపదు | అఱువత్తు |
| ఆఱు | ఉపశమిల్లు | ఆఱు = ఆఱ్ఱు (ఆట్టు) | ఆఱు (శోషణే) |
| ఆఱు | షట్ సంఖ్య | ఆఱు | ఆఱు |
| ఇరులు | చీఁకటి | ఇరుళ్ | ...... |
| ఇఱుకటము | ఇఱుకు చోటు | ఇఱుకు (గు) (ఘనీభవించు) | ఇడికిఱి (నిబిడము) |
| ఈడేఱు | సిద్ధించు | ఈడేఱు | ఈడేఱు |
| ఊఱు | లక్ష్యపెట్టు—తగు | ఊఱు (వర్ధిల్లు) | ఊఱు (వర్ధిల్లు) |
| ఊఱిది | దార్ఢ్యము | ఊఱుది | ...... |
| ఊఱియు | వర్షమున నిల్లుకాఱు | ఊఱై (వర్షబిందువు) | ఒఱె (వర్షబిందువు) |
| ఉఱుము | గర్జించు. గర్జనము | ఉఱుము (గర్జించు గర్జనము—పిడుగు. పంది యఱచు) | ...... |
| ఉసుఱు | ప్రాణము | ఉయిర్ | ఉసిర్ |
| ఊఱు | నీరూఱు | ఊఱు—ఊఱ్ఱు (ఊట్టు) = (ఊట) | ...... |
| ఎదురు | ఎదిరించు | ఎదిర్ | ఎదిర్ |
| ఎఱఁగు } ఎరఁగు } | దిగు—మ్రొక్కు | ఇఱఙ్కు (దిగు) | ...... |
| ఎఱక | పక్షి ఱెక్క | ఇఱకు | ఎఱంకె |
| ఎఱచి | మాంసము | ఇఱైచ్చి | ...... |
| ఎరవు | యాచితకము | ఇరవు | ...... |
| ఎఱుఁగు | తెలియు | అఱి | అఱి |
| ఏఱు | నది | యాఱు | ...... |
| ఒఱగు | వ్రాలు | ఉఱఙ్కు (నిద్రచేయు—దూఁగు) | ఒఱంగు = (వ్రాలు) |

| తెలుఁగు | అర్థము | తమిళము | కన్నడము |
|---|---|---|---|
| ఒఱటు | దుశ్శీలుఁడు | అరట్టన్ = అరట్టు (దుశ్శీలము) | ఒఱంట = ఒఱంటు (దుశ్శీలత) |
| ఒఱ | ఖడ్గ కోశము | ఉఱై | ఒఱె |
| ఒరయు | రాయు | ఉరాయ్ | ...... |
| ఒఱలు | మ్రోఁగు, విలపించు | అరట్టు (ట్టు) (రోదనము చేయు) | ఒఱలు (రోదన శబ్దము చేయు) |
| కఱ | నలుపు | కఱై | కఱె |
| కరఁగు-కఱఁగు (ద్విరేఫ వర్ణ దర్పణము) | ద్రవించు—కరఁగించు | కరై | కఱఁగు (ద్రవించు) |
| కఱచు | నేర్చికొను, కొఱుకు | కటి | ...... |
| కటి = కటియ | నలుపు | కరియ (నల్లని) కరిదు (నల్లనిది) | కటిదు = (నలుపు) |
| కాఱు | ప్రవించు—వర్షించు | కాల్ | కఱె |
| కారు | నలుపు—వర్షకాలము | కార్ (మేఘము - వర్ష కాలము) | ...... |
| క్రిక్కిటియు | మిక్కిలి యిఱుకుగా నుండు | ...... | కిక్కిటి=(సంకట స్థితి) |
| కుఱు | కుఱుచది—పొట్టిది | కుటిదు (పొట్టిది) | కిఱుదు = (అల్పము) సమాసమున "కుఱు" |
| కుఱఁగలి | సమీపము | కుఱుగల్ =సమీపించు) —పొట్టిదగు) | ...... |
| కురులు<br>కుఱులు—(అప్పకవి) } | ముంగురులు | కురల్ | ...... |
| కుఱువు | తొడ | కుఱుక్కు | ...... |
| కొఱప్రాణము | చిన్న ప్రాణము | కుఱై (కొఱఁత) | కొఱతె (కొఱఁత) |
| కొఱకు | కార్యమునకు, చతుర్థీ విభక్తి వర్ణకము | కుఱై (కార్యము) | ...... |
| కొఱఁత | తక్కువ | కుఱై | కొఱతె |
| కొఱవ | ఒక తక్కువ జాతి | కుఱవన్ | కొఱవ = (నీచ తస్కరుఁడు) |
| కొఱుకు | కఱచు | కటి | కుఱుకు |
| కోఱ | దంష్ట్ర | కోరై (పల్లు = వక్ర దంష్ట్రము) | కోఱె = (పల్లు) |
| గటి | పక్షి ఱెక్క—ఆకు | ...... | గటి |

| తెలుఁగు | అర్థము | తమిళము | కన్నడము |
|---|---|---|---|
| గఱిక | పచ్చగడ్డి | అఱుకు | కఱంకె |
| గీఱు | గోఁకు | కీఱు, కీఱ్ఱు (ట్టు) = (గీఁత) | ...... |
| గుఱుతు | గుర్తు, చిహ్నము | కుఱిప్పు | ...... |
| గుఱి | లక్ష్యము | కుఱి | ...... |
| గుఱిచి / గుఱించి | గుఱించి | కుఱిత్తు | కుఱితు |
| గుఱ్ఱు, గుఱు | గుఱుక | కుఱట్టై | ...... |
| గొఱ్ఱియ—గొఱ్ఱె | గొఱ్ఱె | కొఱి | కుఱి |
| గొఱుఁగు | క్షౌరము చేయు | చిఱై | ...... |
| చేఱి | కొండచేఱియ | చరివు | ...... |
| చిఱు | చిఱుత = చిన్న | చిఱు | కిఱిగు |
| చిఱుత | చిఱుత పులి | చిఱుత్తై (నవ్య శబ్దము) | ...... |
| చూఱ | కొల్ల | చూఱై | ...... |
| చెఱ | కారాగృహము | చిఱై | సెఱె |
| చెఱుచు | చెడఁజేయు | చెఱు = (అడ్డగించు —కోపగించు) | ...... |
| చెఱువు | సరస్సు = తటాకము | చిఱై | కెఱె |
| చెరువు | గ్రుచ్చు = ముణుచు (పువ్వులు మొ.) | చెరుకు | ...... |
| చేర | ప్రసృతి | చిఱాఙ్కై | ...... |
| చొఱ = చోఱ | మత్స్యము | చుఱ = చూఱా | ...... |
| జోఱు | వాన కురియుటలోని ధ్వని | ...... | సోఱు = (జలపతనము) |
| తఱుగు | ఖండించు | తఱి | తఱి |
| తాఱు | మఱుఁగుపడు | ...... | తాఱుంతట్టు = (సంచరించు) |
| తాఱుమాఱు | విపర్యాసము | తాఱుమాఱు | తాఱుంతట్టు = వికీర్ణ పతనము |
| తిరుగలి | ఘరట్టము | తిరికల్ (నవ్యపదము) | ...... |
| తిరుగు | సంచరించు | తిరి | ...... |
| తీఱు | నశించు | తీర్ = (విడుచు) | ...... |

| తెలుఁగు | అర్థము | తమిళము | కన్నడము |
|---|---|---|---|
| తీఱు | చక్కఁబడు—విధము | తిరుత్తు = (దిద్దు—చక్కఁజేయు, ముగించు) | ...... |
| తుఱుగు | క్రుక్కు | ...... | తుఱుగు = (దట్టముగా మిశ్రితమగు) |
| తుఱుము | క్రొప్పు | ...... | తుఱుంబు |
| తెఱపి | అవకాశము | ...... | తెఱపు |
| తెఱ (తెఱచు) | తెఱపి—వ్యవధానము | తిఱ (తెఱచు) | తిఱ = (తెఱచు) |
| తెర | యవనిక | తిరై | తెరె |
| తెఱఁగు | చక్కని. విధము. సంధి. | తిఱమ్ | తెఱ |
| తెఱవ | స్త్రీ | తెరివై (వింశతివత్సర స్త్రీ) | ...... |
| తేఱు | తేటపడు | తేఱు, తేఱ్ఱు (ట్రు) మ్ (తెలివి) | ...... |
| తేరు | రథము | తేర్ | ...... |
| తొఱఁగు | విడుచు | తుఱ | ...... |
| దూఱు | నిందించు. నింద, | తూఱు — తూఱ్ఱు (ట్రు) నిందించు | దూఱు |
| దొఱయు | పొందు | ...... | దొరె (ప్రాప్తించు) |
| నఱజు | అణువు | ...... | నొరజు = (అణువు — మశకము) |
| నాఱు | మొలక | నాఱు (మొలక) నాఱ్ఱై (ట్రై) (మొలకను) | ...... |
| నిగుఱు / నీఱు | భస్మము | నీఱు, నీఱ్ఱు | ...... |
| నుఱుము | పొడిచేయు | నుఱుక్కు | ...... |
| నూఱు | శతము | నూఱు—నూఱ్ఱై (నూటిని) | నూఱు |
| నెఱ | నిండు - పూర్ణము | నిఱై | నెఱె = (సమగ్రత) |
| నెఱవు | పూర్తి | నిఱైవు | ...... |
| నెఱను | జీవస్థానము / మర్మస్థానము | నిఱమ్ | నెఱం |
| నెఱవేఱు | సిద్ధించు | నిఱైవేఱు | ...... |
| నెఱి | న్యాయము | నెఱి | ...... |
| నెఱిక | వస్త్రపు కుచ్చు | ...... | నిఱి |
| నేఱు | అవక్రము, తిన్నన | నేర్ (తిన్నగా) | నేఱితు (అవక్రముగ) |
| పక్కెర=పక్కెఱ (అప్పకవి) | గుఱ్ఱముల యంగీ = చొక్కాయ | పక్కఱై | ...... |

| తెలుఁగు | అర్థము | తమిళము | కన్నడము |
|---|---|---|---|
| పఱ | అన్యము—గొప్పది | పిఱ (అన్యము) | పెఱతు |
| పరఁగు | ప్రసరించు | పరవు (వ్యాపించు) | పరె (ప్రసరించు) |
| పఱియ<br>పఱిగొను } | ఖండము<br>అపహరించు | పఱి = పఱిగొను<br>(అపహరించు) } | పఱి = త్రెంచు |
| పాఱ | ఖనన సాధనము | పాఱై | పాఱె |
| పాఱు | పరుగెత్తు | పాఱు (గ్రద్ద) | పాఱు (మీఁదికెగురు) |
| పెఱ | అన్యుఁడు | పిఱ (అన్యము) | సమాస — పెఱతు = (అన్యము) |
| పిఱుఁదు | నితంబము—వెనుక | పిఱ - అన్యము - వెనుక, పిఱకు = తర్వాత | పెఱగు = పృష్ఠభాగము |
| పెఱుకు | పెల్లగించు | పెఱుక్కు (సంగ్రహించు) | ...... |
| పెరుఁగు | వర్ధిల్లు—దధి | పెరుగు (వర్ధిల్లు) | పెఱు (ఘనీభావము) |
| పొఱడు | గూను | ...... | పొఱంబెన్ = (గూను నడ్డి) |
| బఱటు | గీఱు | ...... | బెఱంటు = (నఖచ్ఛేదనము) |
| బీఱ | ఒకానొక తీఁగ | పీర్ = పీర్కు | ...... |
| మఱక | మచ్చ | మఱు | ...... |
| మఱిక | మేక పడ్డ | మఱి (మేఁకపిల్ల) | ...... |
| మఱచు | విస్మృతిచెందు | మఱ | మఱె |
| మఱలు | మళ్ళు | ...... | మఱళ్ |
| మఱు=మఱుఁగు | ప్రచ్ఛన్నమగు—ఊడుకు | మఱై = (దాఁగు. మఱుకు = (తపించు—దుఃఖించు) | మఱె = (దాఁగు)<br>...... |
| మఱుస = మఱు | మఱునాఁడు | మఱునాళ్ | మఱు (తర్వాతిది = పరదినము) |
| మాఱు | ప్రతి, నశించు | మాఱు=(పగ—ప్రతి—విడుచు) | మాఱు = (ప్రతిఘటించు) |
| మీఱు | అతిశయించు—అతిక్రమించు | మీఱు | మీఱు |
| ముందఱ<br>ముందర } | మొదలు — మునుపు — ఎదురు | ముందుఱ (ముందు + ఉఱ) | ...... |
| మొరయు | ధ్వనించు | మురల్ (తుమ్మెదరొద) | మొరె (తుమ్మెదరొద) |
| మొఱ్ఱ = మొఱ | మొఱ్ఱ | ముఱై (న్యాయము, క్రమము) | ...... |
| రాచు=ఱాచు | రుద్దు = ఒరయు | అరై = అరక్కు | అరె (పేషణే) |
| ఱెక్క | పక్షి ఱెక్క | ఇఱకు | ఎఱంకె |

| తెలుఁగు | అర్థము | తమిళము | కన్నడము |
|---|---|---|---|
| రొమ్ము | వక్షః స్థలము | ఉరమ్ | ఊర |
| రోలు = ఱోలు | ఉలూఖలము | ఉరల్ | ఉరల్ |
| వఱ | మేర | వరై (సీమ) | వరం (సీమ) వరగం = (వఱకు) |
| వఱడు | నక్క | ...... | బళ్ళు |
| వరపు = వఱపు | అవగ్రహము | వఱప్పు | బఱం |
| వఱువట్లు (వట్టు+వట్టు) | మిక్కిలి శోషిల్లు | వఱ్ఱు | బఱ్ఱు — బత్తె (శుష్కీ-సతి) |
| వఱువాయి | ప్రాతఃకాలము | ...... | బఱువాయి (శోషణారంభము) |
| వాతెఱ=వాతెర | అధరోష్ఠము | ...... | బాయ్దెఱె |
| వాఱు | సన్నని తోలు | వార్ | వాఱు = చర్మ పట్టిక |
| విరివి (విస్తృతి) విరియు | వికసించు | విరివు | బిరి (వికసనే) |
| వీఱిఁడి (ఇఁడి = తదభావార్థకము) | మూర్ఖుఁడు | వీఱు = (గొప్పతనము) | ...... |
| వెఱ | భయము | వెరుళ్ = (భీతిల్లు) | ...... |
| వెఱఁగు | విస్మయము | ...... | బెఱగు |
| వేఱు—వేఱిమి | భేదము అన్యము | వేఱు | బేఱె |
| వేరు | వృక్షమూలము | వేర్ | బేర్ |

ఆంధ్ర కర్ణాటములలో, హలంతర సంయోగమున నలఘు రేఫము లఘువుగా మాఱును.

"అకారస్య రేఫః" (కర్ణా-భూష. ౧౨౧ సూ.)=వ్యంజనము పరమగు చుండఁగా సమాసమున అకారమునకు రేఫాదేశమగును. ఉదా:—నూఱు+మడి=నూర్మడి (నూఱు మార్లు). "అలఘు రేఫంబు లుప్త చక్రమగుచో లఘు రేఫం బగు" (ప్రౌఢ వ్యాకరణము-ముక్త లక్షణ వివేచనము ౨ సూ.) (చూ. వై. పా. ౪౧౯ మొ. ౪౨౨ వ. విభ.) (చూ. వ్యా. సం. ౫౮ III విభ). ఉదా:—వేఱు+వేఱు=వేర్వేఱు. మొ.

తమిళమునందట్టి మార్పు కలుగనేరదు. హలంతర సంయోగము లందును ధారాళముగా ఱకారమే నిల్చును.

"టఱల......" (తొల్కా., ౨౩ సూ.)='ట-ఱ-ల-ళ' అను హల్లులకుఁ బరముగా 'క-చ-ప' అను మూఁడు హల్లులలో నేదియైనను నిలువవచ్చును. ఉదా:—కల్ + ప = కల్ప (చదువుదురు). కల్ + కుడమ్ = కఱ్కుడమ్ (జాతికుండ).

"ఙ-ఞ-ణ......" (తొల్కా. ౨౫ సూ.)="ఙ-ఞ-ణ-న-మ-న" అను హల్లులగు ననునాసికములకుఁ బరముగా వాని వాని వర్గాక్షరములగు 'క-చ-ట-త-ప-ఱ' అనునవి వరుసగా నిల్వవచ్చును. ఉదా:—మూన్ఱు. (మూఁడు) మొ.

ఆంధ్ర కర్ణాటములలో ఱకారమున కలఘురేఫోచ్చారణము స్థిరపడిన పిమ్మట హాలంతర సంయోగము మూలమున దాని యలఘుత్వము పోయి లఘుత్వము నిల్చుట సహజమయ్యెను. తమిళభాషలోఁ దొల్కాప్పియము నాఁటికి ఱకారమునకు ద్విత్వాభావావస్థలో సయితము 'టత' మధ్యస్థోచ్చారణమె వెలయుచుండుటం జేసి ఱకారమున కలఘురేఫోచ్చారణమే లేమింజేసి యట్టిదానికి రేఫాదేశ ప్రసక్తియే లేదయ్యెను. అర్వాచీనముగాఁ దమిళము నందును ద్విత్వము లేనపుడు ఱకారమున కలఘురేఫోచ్చారణము వచ్చినను నది హాలంతర సంయోగమున దానిని రేఫముగా మార్చుటకు సమర్థము కాదయ్యెను. నేఁటి తమిళ పండితులు సయితము ద్విరుక్త ఱకారమును టద్విత్వముగాఁ బల్కునట్లు హాలంతర సంయుక్త ఱకారమును టకారముగా నైతము పల్కక యలఘు రేఫముగానే పల్కుచున్నారు. తొల్కాప్పియరు కాలమున నిట్టి హాలంతర సంయుక్త ఱకారమును 'టత' మధ్యస్థాన యోగ్యమగు రీతినె యుచ్చరించెడి వారనుటలో సందియము లేదు.

౧౭. XVI. విష:—఩కారము:—పదాంతమందును బద మధ్యమందును మాత్రము నిల్చునట్టియు 'ఱ' అను పరుషమున కనునాసిక మగునట్టియు '఩' అనునది మూర్ధన్య నకారము. దీనిని దంత్య నకారమునువలెఁ బలుకుట తప్పు. (చూ. ౧౭ VIII విష. తొల్కా. ౯౮ సూ.) ఇది పదాదిని నిల్వఁదగిన వర్ణములలోఁ దొల్కాప్పియరుచేఁ బేర్కొనఁబడలేదు. కావునఁ బదాదిని నిల్చునది దంత్యనకారము. తద్భిన్న స్థలములలో నిల్చునది యీ మూర్ధన్య ఩కారము (చూ. తొల్కా. ౬౧ సూ. మొ. ౬౫ సూ. వ.) సంయోగమునఁ దీనికిఁ బరమందు దీని పరుషమగు 'ఱ' కారమును "క-చ-ఞ-ప-మ-య-వ" అను హల్లులును నిలువవచ్చును.

"ఙ-ఞ-ణ......" (తొల్కా. ౨౫ సూ.)="ఙ-ఞ-ణ-న-మ-఩" అను హల్లులకుఁ బరముగ వానివాని వర్గాక్షరములగు 'క-చ-ట-త-ప-ఱ' అను నక్షరములు సంయోగింపవచ్చును.

"అవఱ్ఱు (ట్టు) ళ్......" (తొల్కా. ౨౬ సూ.)=పైవానిలో "ఙ-ఞ-న-మ" అనునవి తప్పఁ దక్కిన "ణ-న" అను మూర్ధన్యములు రెండిటికిని బరమందు "క-చ-ఞ-ప-మ-య-వ" అను నేడక్షరములును సంయోగింప వచ్చును.

ఇట్టి మూర్ధన్య నకార మాంధ్రకర్ణాటములలో లేదు. తమిళ మల యాళములందు మాత్రము కలదు. దీనికిఁ బరముగ 'ఱ' కారము నిల్చి నపుడు వాని నడుమ 'ద' కారము నిల్చుననియు నచటి ఱకారము రేఫమగు ననియుఁ గాల్డువెల్లుగారు వ్రాసిరి. (కాల్డు. ౧౭౫—౧౭౬ పు.) ఉదా:—"తమి-మూన్ఱు=మూన్ద్రు=కన్న-మూరు. (మూఁడు-తె.) తమి-ఒన్ఱు=ఒన్ద్రు. కన్న-ఒరు. (ఒకటి-తె.) వీనిలోని ఱకారము ప్రకృతిసిద్ధము. నకార ముచ్చా రణ సౌకర్యార్థము చేరినది. తమి-ఎన్ఱు=ఎన్ద్రు=(పలికి). ఇది న్యాయముగా 'ఎన్దు' అని కావలయును. తమి - చెన్ఱు = చెన్ద్రు = (వెళ్ళి)-న్యాయముగానిది, 'చెన్దు' అని యుండవలయును. ఈ యుదాహృతి ద్వయమునందును నకారము ప్రకృతిసిద్ధము. ఱకారము త (ద) కారమునకు మాఱుగా వచ్చినది. గ్రామ్య తమిళ మలయాళములలో నీ "న్ద్రు" అనుదానిచోట ద్విరుక్త మూర్ధన్య నకార మును గాని ద్విరుక్త ణకారమునుగాని పల్కుదురు. ఆంధ్రకన్నడములలో 'న్దు' అని పల్కుదురు." (కాల్డు. ౧౭౬ పుట).

విమర్శము:—'మూన్ఱు' మున్నగు వానిలోని నకార ముచ్చారణ సౌకర్యా ర్థము చేరినదికాదు. అదియుఁ బ్రకృతి సిద్ధమె. తెలుఁగున నట్టి యను నాసికముచోటఁ బూర్ణానుస్వారముగాని ఖండానుస్వారముగాని నిల్చును.

"ఙ-ఞ-ణ......" (తొల్కా. ౨౫ సూ.) = "ఙ-ఞ-ణ-న-మ-న" అనునాసికములకుఁ బరముగ వాని వర్గాక్షరములగు "క-చ-ట-త-ప-ఱ" అను పరుషములు వరుసగా నిల్వవచ్చును." అని యిట్లచటి సంయోగము సహజమని తొల్కాప్పియరు వచించిరి. తమిళములోని 'ఒన్ఱు' అను దాని కభిన్నమైనది కన్నడమున 'ఒరు' అనునది కాదు. 'ఒందు' అనునది దాని కభిన్నము. తెల్గున 'ఒండు' అని యేర్పడెను. ఱకారము ప్రాచీనకాలమున "ట-త" మధ్యస్థోచ్చారణముగలది గదా. 'ఒక' అను విశేషణార్థముగల కన్నడములోని 'ఒరు' శబ్దము వేఱు. ఆ (ఒరు) శబ్దము తమిళకన్నడములు రెంటను వేఱుగ నున్నది.

"ఎన్ఱు-చె (శె) న్ఱు" (పలికి-వెళ్ళి) అనుచోటులందు "న్యాయముగా 'ఎన్దు-చె (శె) న్దు' అను రూపములు నిల్వవలయు"నను కాల్డువెల్లుగారి వ్రాఁత

సరికాదు. అందలిది 'ద' కారము కాదు. భూతార్థక 'త' కారము. "ఎన్+తు—చెన్+తు" అనుచోటులం దీ క్రింది సంధిసూత్రముల చొప్పున నిత్యముగా 'త' కారము 'ఱ' కారముగా నేర్పడును.

"ల న ఎ న......" (తొల్కా. ౧౫౦ సూ.)="ల న లకుఁ బరముగా 'త-న' లలో నేది నిల్చినను నట్టి 'త-న' లకు వరుసఁగా "ఱ-న" అనునవి యాదేశములగును. అనఁగా లకారమునకును మూర్ధన్య నకారమునకును బరమగు 'త' కారమునకు 'ఱ' కార మాదేశమగును. దంత్య నకారము మూర్ధన్య నకారమగును. ఉదా:—......పొన్+తీదు=పొన్ఱీదు. (దీనిని నేఁ డపభ్రష్టముగా 'పొన్డ్రీదు' అని పల్కుదురు). (బంగారు చెడ్డది యని యర్థము). పొన్+నన్టు=పొన్నన్టు. (బంగారు మంచిది). (చూడు. ౧౮ IX విష. 'న్టు' అనునది 'న్డ్రు' అగుననుట సరికాదు).

౧౭. XVII విష:—దంత్య చజలు:—చజల దంత్యోచ్చారణము ద్రావిడ భాషలలోఁ దెలుఁగునందు మాత్రమె కలదు. "అద్దన్త్యౌ స్తాలవ్య శ్చ ర్వక్రః। స్యాన్మిథ స్సవర్ణశ్చ." (ఆం. చిం. సంజ్ఞా. ౧౧ కా.) "ప్రాకృతే తద్భవే చాపి। చజౌ దన్తభవౌ స్మృతౌ" (వికృ. సంజ్ఞా. ౮ కారి) (చూ. వ్యా. సం. ౩౧ విష.) అని యిట్లు ప్రథమ ద్వితీయాచార్యు లిరువురును వచించియున్నారు.

"అ-ఆ-ఉ-ఊ-ఒ-ఓ-ఔ లం గూడిన 'చ-జ' లు దంత్యంబులు" (బా. సంజ్ఞా. ౯ సూ.) "సంస్కృత సమంబులం దికారాంతములైన శబ్దంబుల యుపధా 'చ-జ' లు బహువచనంబు పరంబగునపుడు దంత్యములగును" (బాల. సంజ్ఞా. ౧౦ సూ.) దీని వివృతి:—"ఇవిదప్ప సంస్కృత సమంబులందు దంత్య 'చ-జ' లు లేవు......రాజు శబ్దంబొక్కటి దంత్య యుక్తంబు గానంబడియెడి ......" అని బాలవ్యాకర్త యర్వాచీనముగా నేర్పడిన సంస్కృత శబ్దంబులందలి దంత్యతను వివరించెనే కాని సంస్కృతమున దంత్య 'చజ' లు లేవు. సంస్కృతమందే కాక ప్రాకృతమందును దంత్య చజలు లేవు. పయి యథర్వణుని వచనములోని "ప్రాకృతే" అనుదాని కాంధ్రదేశ్యమందని యర్థము. ప్రాకృత శబ్దమునకు దేశ్యమనియు నర్థము గలదు. ప్రకృతు లనఁగా జనులు—వారివ్యవహారమున నున్నది ప్రాకృత మనిపించుకొనును. "ఆంధ్రదేశ్యము ప్రాకృతాహ్వాయము కాన" (కావ్యాలం. విన్నకోట పెద్దన. ౯ ఉల్లా. ౮ ప.) "దేశ్యమవ్యుత్పత్తి మత్త్వాత్। ప్రాకృతత్వేన కథ్యతే" (అహో. ౧౭౮ పు.) (చూ. వ్యా. సం. విస్తర ౧౮ విష).

దంత్యచజల యుచ్చారణమున దంత్యములగు తకారాదుల యుచ్చారణమందువలె జిహ్వాగ్రము దంతములను దాఁకుట సంభవింపదు. వీని యుచ్చారణమునందును దాలవ్య చజల నుచ్చరించు నప్పటివలెనె జిహ్వా మధ్యభాగము తాలువును (మూర్ధ భాగము) దాఁకుచుండఁగా నాలుకయొక్క కుడిపార్శ్వము దంతములను దాఁకుట సంభవించును. కేవల తాలవ్య చజల యుచ్చారణమున నట్లు జిహ్వా పార్శ్వభాగము దంతములను స్పృశింపదు. కావున 'ఇ-ఈ-ఎ-ఏ' లతోఁ గూడిన "చ-జ"లు కేవల తాలవ్యము లనియు "అ-ఆ-ఉ-ఊ-ఒ-ఓ-ఔ" లతోఁ గూడిన చజలు దంత తాలవ్యము లనియుఁ జెప్పనగును. అట్లయినను "కురుపాండవ న్యాయము"నఁ గేవల తాలవ్యములగు 'చ-జ'లు తాలవ్యము లనియు దంత తాలవ్యములగు 'చ-జ'లు దంత్యములనియు భేదస్ఫూర్తికయి వ్యవహరింపఁబడుచున్నవి. (చూడుు. వై. పా. ౧౯౮ విష.) పయిరీతిని దంత్య చజలకుఁగల వర్ణోత్పత్తి స్థాన కరణ భేదములనుబట్టి వర్ణ పార్థక్య సంపాదక సామగ్రి దంత్య చజలకుఁ బూర్ణముగా నున్నది. కావుననే యవి యచ్చాంధ్ర వర్ణ సమామ్నాయమున వేఱు వర్ణములుగఁ బరిగణింపఁబడుచున్నవి. (చూడుు. వ్యా. సం. విస్తర 3౨ విష.) వీని లిపి విషయమున నీవఱకె (౧౬ II విష. చూ.) వివరింపఁబడెను.

"మిథ స్సవర్ణశ్చ" (చూ. వ్యా. సం. 3౧ విష.) అను చింతామణి చొప్పున దంత్య తాలవ్య చజలకు యతిప్రాసమైత్రి మహాకవి సమ్మతమగుటచేత వాని నిర్ణయము యతిప్రాసములనుబట్టి చేయరాదు. ఇంకఁ దద్విషయమున నుచ్చారణమును బ్రథమ ద్వితీయాచార్య వచనములును బ్రాచీన స్థితికిఁ బ్రమాణము లగుచున్నవి. ఆంధ్ర తత్సమములలో నర్వాచీనముగాఁ గల్గిన "అర్చ్చెలు-వీచేలు-వాజేలు-రాజే-రాజేలకు" మున్నగు స్థలములందలి చజల దంత్యత బాల వ్యాకర్తచేఁ దెల్గున నంగీకరింపఁ బడెను. ఇది ప్రథమ ద్వితీయాచార్య సమ్మతము కామిచేఁ బ్రాచీన కాలమునఁ దెలుఁగున సంస్కృత సమములందలి పై "అర్చ్చెలు" మున్నగు చోటులందును దంతో్యచ్చారణము లేదని తలంచుటయె యుక్తము. నృపాలార్థకమగు "రాజే-రాజేలకు" మున్నగు స్థలములందు దంత్యత వినఁబడుచున్నను 'రాజే' అను తద్భవము కాలక్రమమునఁ బ్రసిద్ధమగుటచే దాని దంత్యత శంకాస్పదము కానేరదు. "దుః స్యా త్సదా రాజ్ఞః" (వ్యా. సం. ౧౭౮ విష.) అను చింతామణి చొప్పున సంస్కృత సమమగు 'రాజు' శబ్దములోని 'జ' కారము దంత్యము కాదనుట నిర్బాధము. స్వర పర్యాయమగు 'అచ్చులు' శబ్దములోని చకారము నేఁడు కొందఱచే దంత్యముగాఁ బల్కఁబడుచున్నది. "చేఁప=చాప. జేన=జాన. చేఁట=చాట" మున్నగు స్థలములందు 'చాప' మున్నగు వానిలోని 'చ-జ'లు తాలవ్యా

పభ్రంశ స్వరయుక్తము లగుటంజేసి 'ఆ' కారాది యుక్తములయ్యుఁ దాలవ్యములు గానే వ్యవహారమున వినఁబడుచున్నవి. ఇట్లే 'వచ్చినాను=వచ్చాను' మున్నగు వ్యావహారిక శబ్దములందును 'ఆ' కార విశిష్ట 'చ' కారము తాలవ్యముగానే వినఁబడుచున్నది.

"చ జ లకు సహజమగు తాలవ్యోచ్చారణము 'ఇ-ఈ-ఎ-ఏ-ఐ'లతోఁ గూడినప్పుడే నిల్చును. తక్కిన యచ్చులతో నుండునపు డవి దంత్యములుగాఁ దెలుఁగునందును (ఐదంతములగు చ జలు సంస్కృత సమేతరములందు లేవని దొరగారు గ్రహింపలేదు). మరాటీ భాషయందును నుచ్చరింపఁబడును. ఈ రెండు భాషలకును నీ విషయమున సంబంధము చూపట్టు చున్నది." (కాల్డు. ౧౪౧ పుట).

తమిళ కర్ణాటములలో "చ-జ" లకు దంత్యోచ్చారణము లేకున్నను 'చ' కారము దంత్యమగు సకారముగానే తమిళమునఁ బల్కఁబడుచున్నది. జకారము తమిళమున లేనేలేదు. ద్విత్వస్థలములను ననునాసికయుక్తస్థలములను దప్పఁ దక్కిన యంతటను నేఁటి తమిళమున 'అ-ఆ-ఉ-ఊ-ఒ-ఓ-ఔ' లతోఁ గూడిన చకారము దంత్య సకారముగను 'ఇ-ఈ-ఎ-ఏ' లతోఁ గూడిన చకారము తాలవ్య 'శ' వర్ణముగను నుచ్చరింపఁబడుచున్నది. తమిళమున 'శ-స' లు లేకున్నను నర్వాచీనముగా నిట్టి యుచ్చారణము 'చ' కారమునకుఁ గొంతకాలమునుండి స్థిరపడి యున్నది. తొల్కాప్పియగునాఁటికిఁ దమిళమున 'శస' లు లేనేలేవు. అప్పటికి 'చ' కారమున కిట్టి 'శ-స' ల యుచ్చారణము లేదనుటకు సందేహము లేదు. (చూడు. ౧౭ XXII, XXIII విష).

కర్ణాటమందును "అ-ఆ-ఉ-ఊ-ఒ-ఓ-ఔ" లతోడి చకారము పెక్కు స్థలములందు సకారమగును. తెల్గునందలి 'ఇంచు' అనునది కర్ణాటమున 'ఇసు' అను రూపముతో సంస్కృత ధాతువులన్నిటి తుదిని నిల్చును. తెల్గునందలి ప్రేరణార్థకమగు 'ఇంచు' అనునదియుఁ గర్ణాటమున 'ఇసు' అను రూపమునని నిల్చును. ఉదా:—తెల్గు-రక్షించు=కన్న-రక్షిసు. తెల్గు-రంజించు=కన్న-రంజిసు. ౹౹ మొ.

ఇట్లె పెక్కుస్థలములందలి 'అ-ఆ-ఉ-ఊ-ఒ-ఓ-ఔ' లతోఁ గూడిన చకారము దంత్య సకారమగుచుండును.

౧౭. XVIII విష:—అనుస్వారము:—ఇది తెలుఁగునందుమాత్రమె కలదు. ఉచ్చారణ సౌలభ్యాపేక్షచేత నిండుసున్నను దేల్చి పలుకుటవలన నర్ధానుస్వారోచ్చారణము వెలసినది. ఇయ్యది సంస్కృత ప్రాకృతములందుఁ బ్రసిద్ధమై

యున్న యనునాసికము పోలికగలది. దీనిని సంస్కృత ప్రాకృతములలో 'ం' అను లిపితో గుఱితింతురు.

సంస్కృతమునం దనుస్వారముచోటఁ బదమధ్యమున (సమాన పదమధ్యమున) వర్గాక్షర పరకత్వమునందుఁ దత్తద్వర్గీయానునాసికములు నిత్యముగా నిల్చును. పదాంతమునఁ బర్యాయముగా ననుస్వారముగాని తత్తద్వర్గీయానునాసికముగాని నిల్చును. ఉదా:—పదమధ్యమున:—అఙ్క - అఙ్గ - ఙఙ్ఘ - మొ. పదాంతమున:—సంకర=సఙ్కర. శంకర=శఙ్కర. సంతతి=సన్తతి. మొ. యవల పరకత్వమునం దనుస్వారముచోటఁ బాక్షికముగాఁ బరాక్షరద్విత్వమగును నది సానునాసికమగును. ఉదా:—సంయమి=సయ్యమి. సంవత్సరము=సవ్వత్సరము. పుంలిఙ్గము=పుల్లిఙ్గము. తక్కిన హల్లులు పరమగునపుడనుస్వారమె నిల్చును. ఉదా:—హంసము-నంశము-సింహము. మొ. అవసానమున సంస్కృతమున సున్నరాదు. ఉదా:—రామమ్=(రాముని) వనమ్=(వనము) రామాణామ్=(రాములయొక్క). మొ.

తమిళమున ననుస్వారమే లేదు. అంతటను ననునాసికములే నిల్చును. మలయాళమునఁ బదాంత మకారము సున్నయగును. ఉదా:—తమి—మరమ్=(మ్రాను)=మలయా-మరం. మొ.

కర్ణాటమున ననుస్వారము గలదుగాని యర్ధానుస్వారము లేదు. అవసానమందును హల్పరకత్వమందును 'మన'లకు నిత్యముగా బిందువగును. వర్గాక్షర పరకత్వమున నట్టి బిందువునకుఁ దత్తద్వర్గ పంచమ మాదేశమగును. ఇట్టి వర్గ పంచమాదేశము పదాంతమందలి సంధిస్థలములందే కర్ణాటభాషా భూషణమున నుదాహరింపఁబడెను. కర్ణాటభాషా భూషణమున నీ వర్గ పంచమాదేశము నిత్యమనియె చెప్పఁబడెను. ప్రయోగములు గలవనుచుఁ గర్ణాట శబ్దానుశాసనకర్త వర్గపంచమాదేశము వైకల్పికమని వివరించెను. మఱియుఁ బదాంతసంధులందేకాక పదమధ్యమందును బిందు వర్గపంచమాదేశములు పర్యాయముగ నగునని యంగీకరించెను.

"మనయో ర్బిన్దుః" (కర్ణా. భూ. ౧౧౨ సూ.) మకార నకారములకవసానమున బిందువగును. ఉదా:—కులం-జలం-నీం (నీవు) మొ.

"వర్గే తద్వర్గాన్త్యః" (కర్ణా. భూ. ౧౧౩ సూ.) వర్గాక్షర పరకత్వమునఁ దత్తద్వర్గపంచమాక్షర మాదేశమగును. ఉదా:—బిఙ్కం+కెట్టం = బిఙ్కఙ్గెట్టం=(బింకమువలనఁ జెడెను).

"న శ్చ బిన్దు రన్యత్ర" (కర్ణా. శబ్దా. ౭౯ సూ.)=(వృత్తి). "మకారస్య నకారస్య చ బిన్దు రాదేశో భవతి. స్వరా దన్యత్ర విషయే. అకృత్వా వ్యఞ్జన

గ్రహాణం=అన్యత్ర గ్రహాణం-విరామేఽపి యథాస్యాదితి." నకార మకారము లకు హలవసానపరకత్వమున బిందువు నిత్యముగా నగును. వర్గాక్షర పరకత్వమునఁ దద్వర్గాంత్యానునాసికముగాని యనుస్వారముగాని నిల్చునని చెప్పఁబడు చున్నది.

"తదన్త్యో వా వర్గస్య" (కర్ణాటశబ్దా. ౮౦ సూ.) (వృత్తి) "మకారస్య నకారస్యచ వర్గాక్షరేపరే తదన్త్యవర్ణాదేశో వా భవతి. "బింకం=బిఙ్కం. వంగడం=వఙ్గడం (వంశము)" ఇత్యాదయ శ్శబ్దాః అపదాన్తేపి సానునాసికాః సబిన్దుకా శ్చ శిష్టైః ప్రయుజ్యన్తే......" (మంజరీ మకరంద వ్యాఖ్య).

కేశవ పండితుని శబ్దమణిదర్పణమున "అవసానమందును హల్పరకత్వమందును 'మ న' లకు బిందువగును. వర్గాక్షర పరకత్వమున వర్గ పంచమాదేశము వైకల్పికముగా నగును" అని చెప్పఁబడెను.

క. "మ న కారద పరదొళ్ వ్యం। జన మిర్ద్దొడమిల్ల దొడ మనుస్వారం సం। జనియిపుదు వర్గ మిదిరిరె। తనగె వికల్పదె తదీయ పంచమ మక్కుం" (శబ్ద మణి. ౧౬౧ ప.)......ప్రయోగ—మకారక్కె:—నీమ్ + యోగ్యర్ = నీంయోగ్యర్ ......నకారక్కె:—అన్+వాది = అంవాది......పరవ్యంజన శూన్యక్కె:—నీన్-అన్-తాన్=నీం-అం-తాం. నీమ్-ఆమ్-తామ్=నీం-అం-తాం. వర్గ పంచమక్కె:—అవఙ్కడుగలి=అవంకడుగలి." పదమధ్యమున వర్గ పంచమాదేశమో? బిందువో! యను విషయము కేశిరాజుచే స్మరింపఁబడలేదు.

తెలుఁగున నరసున్నయు నిండుసున్నయుఁ గలవుగాని యవసానమున నవి నిల్వనేరవు. వర్గాక్షర పరకత్వమునఁ బదాంతమందును బదమధ్యమందును ననునాసికములచోట నరసున్నగాని నిండుసున్నగాని నిల్చును. అంతియకాని వానిచోట (ద్రుతసంధి స్థలము తప్ప) వర్గపంచమములు నిల్వనేరవు. మఱియుఁ దెలుఁగునఁ బరుష సరళపరకత్వమందు మాత్రమె పూర్ణార్ధబిందువులు నిల్చును గాని స్థిరపరకత్వమున నిల్వనేరవు. వర్గయుక్ పరకత్వమునఁ బూర్ణబిందువు మాత్రము ద్రుతసంధిలో భారతేతర గ్రంథములందుఁ బ్రయోగదృష్టమగు చున్నది. ఉదా:—వచ్చెం ధాత్రీపతి. మొ. తెల్గునకు వచ్చుటచేత సంస్కృత సమములందు సయితము వర్గాక్షరపరకత్వ మందును సున్నయే నిల్చునుగాని వానిచోటఁ బదమధ్యమందు సైతము వర్గ పంచమాదేశము రానేరదు. సున్నయే నిలుచును. ఉదా:—సం-అఙ్కః-సం-స-అంకము. సం-మాతఙ్గః-సం-స-మాతంగము. మొ.

క. పంగుల మూకాంధుల పిక । లాంగులను నబాంధవుల పయం బ్రోతె భయా । ర్తుం గడిఁది శత్రునైనను । సంగర రంగమునఁ గాతె శరణంబనినన్ (సభా. ౧ ఆ. ౪౫).

"తృతీయే ప్రథమే వర్ణే। పర ఏవహి దృశ్యతే। బిన్దు ర్వైకృత మధ్యేత్ర। నాన్యవర్ణే పరేతు సః" (వికృ.) ('వ్యా. సం.' ౫౦ విష. చూ.) అను చొప్పునఁ దెలుఁగున స్థిరపరకబిందువు భారత సమ్మతము కాదు. అట్లయినను నవ్యులు కొందఱు సంధిస్థలములలో నరుదుగ స్థిరపరకబిందువును బ్రయోగించిరి. "ఘాం ఘమిత భేరికాధ్వాన ముం ఘులీని। నాదమును (అథర్వణ విరాటపర్వము)" (అప్పక. ౫ ఆ. ౧౫౫ ప.) "తే॥ గీ॥ ......ఊఁది ప్రాస । బంధ మగుఁ గృష్ణుఁ డుదయించినం ధరిత్రి" (అప్పక. ౫ ఆ. ౧౫౬). "వర్గయు క్స్వరళములు పరము లగునపు డొకానొకచో ద్రుతమునకుఁ బూర్ణబిందువును గానంబడియెడి. వచ్చెను+ధాత్రీపతి=వచ్చెంధాత్రీపతి......" (బాల. సంధి. ౧౯ సూ.) ఇట్లు ప్పకవ్యాదులు చెప్పినను నిట్టివి నన్నయభట్ట సమ్మతములు కావు. కాని మకార పరకత్వమున ద్రుతమునకు బిందువు భట్టారక సమ్మతము. "లుగ్వా ద్రుత ప్రకృతికా । త్వరత స్వరళే స్థిరే చ నస్య స్యాత్ । అలుకి చ సంశ్లేషః స్యా । ద్బిన్దుం ప్రవదన్తి తం క్వచి త్కేచిత్." (అం-చిం.) (చూ. 'వ్యా. సం.' ౮౧ విష.) అను చొప్పున మకారపరక పూర్ణము నన్నయభట్టారక సమ్మత మనక తీరదు. (చూ. 'వ్యా. సం.' ౮౧ విష.) లయగ్రాహి. కమ్మని లతాంతములకుం మొనసి...... (ఆది. ౫ ఆ. ౧౩౮). (ఇందలి 'కుం మొనసి' అనునది యనునాసిక ప్రాసము).

"తే॥ గీ॥ తమకుఁ దామ ద్విత్వంబులై తనరు నవియుఁ । బూర్ణబిందులు డాఁపలఁ బొరయు నవియుఁ । గలసి యనునాసిక ప్రాసము లనుపేర । న మ లమరుఁ గావ్యములయందుఁ దమకుఁ దామ. (అప్పక. ౩ ఆ. ౩౪౧ ప).

ఇట్టి నన్నయ సిద్ధాంతమునకు విరుద్ధముగ నీ క్రింది రీతిని నవ్యులు సమర్థించుట సరికాదు.

"ప్రాసంబున మకారంబు పరంబగుచో ద్రుతంబునకు మకారాదేశంబగు. ఉదా:—లయగ్రాహి-కమ్మని లతాంతములకు మ్మొనసి-(భార. ఆది. ౫ ఆ). మత్త కోకిలము......వృష్టిఁ జే । సె మ్మహానది దీర్ఘికా సరసీ నదంబులు నిండఁగా- (ఆరణ్య. ౩ ఆ)" (ప్రౌఢ. సంధి. ౨౨ సూ.) ప్రాసములందే సమ్మతమగు నపుడింక "కలిగెన్+మోదము=కలిగె మ్మోదము" మున్నగు నపశబ్దములెల్ల సాధువులె యనవలసి వచ్చునుగదా. కాన నన్నయాశయమును గ్రహింపక పైరీతి నాతని ప్రయోగమును సమర్థించుట పొరపాటు. 'కంసాలి' మున్నగునవి వ్యావహారిక

శస్త్రములు-"కమసాలి" అను దాని యపభ్రంశ రూపము 'కంసాలి' శబ్దము. (చూ. 'వ్యా. సం.' ౨౦ విష).

తెల్గున హ్రస్వమునకుఁ దర్వాత ఖండపూర్ణములు రెంటిలో నేదైనను నిల్వవచ్చును గాని దీర్ఘమునకుఁ దరువాతఁ బూర్ణము నిల్వనేరదు. ఖండము మాత్రమె నిలుచును. "సిద్ధ స్సాధ్య శ్చానుస్వారః। పూర్ణార్ధ భేదతో ద్వివిధః। హ్రస్వా త్పూర్ణోపి భవే। ద్దీర్ఘాచ్చే త్ఖండ ఏవ స జ్ఞేయః" (అం-చిం) (చూ. 'వ్యా. సం.' ౪౮ విష).

అట్లు దీర్ఘము మీఁద నిండు సున్న నిలువక పోయినను సంయోగ పరకత్వమునఁ బ్రత్యేకశ్రమ మంతగా నుండనేరదు గాన నట్టియెడల దీర్ఘము మీఁద నిండు సున్న నిల్చుట గలదు. దీర్ఘమునకుఁ దర్వాత ఖండమున్నచో సంయోగ పరకత్వము సంభవించినచో నట్టి ఖండము నియతముగాఁ బూర్ణ మగును. ఉదా:—వాఁడు-వాండ్రు; వీఁడు—వీండ్రు. ఏఁడులు=ఏండ్లు (వత్సర ములు). తేఁటులు=తేంట్లు. మొ. వీని సామ్యమున వేండ్రము—తీండ్రము మున్నగునవియుఁ గవిప్రయోగ దృష్టములగుచున్నవి.

"తీండ్ర. దే-వి. తీక్ష్ణము. ప్రచండము. క. తీండ్రమగు రోషమున మీ। తండ్రి నిమిత్తమునఁ జక్రి దారుణ మూర్తిన్। వేండ్రము విడువఁడు మెల్లనఁ। దండ్రీ శీతలునిఁ జేసి దయసేయఁగదే॥ (భాగ. ౭ స్క-౦)." (శ-ర). "తీండ్రించు-దే-అ-క్రి. ......సీ. చంద్ర నిప్పులుఁ బోలెఁ దీండ్రించు కను మించు లెనఁగ... (స్వారో-౪ ఆ.)" (శ-ర) వీని సామ్యమున మఱికొన్ని స్థలములందును— ఈండ్రించు=పీడించు; గాండ్రించు-(ముఖము) ఉబ్బు; గాండ్ల=నూనెయమ్మి జీవించుజాతి; గౌండ్లవాఁడు=సారాయి యమ్మి జీవించువాఁడు; జీండ్రము=దురద; తాండ్ర=విభీతకవృక్షము; తీంట్రము=దురద; మేండ్రించు=భేదించు; సాంబ్రాణి=ఉత్తమాశ్వము. సుగంధద్రవ్య విశేషము. మొ——సంయోగపర కత్వమున దీర్ఘము మీఁది నిండు సున్నలు శబ్దరత్నాకరాది కోశములలోఁ జూపఁబడియున్నవి. ఇట్టి స్థలములలో హ్రస్వ పూర్వకబిందువులె యన్నను శ్రుతి కానరాదు. (చూ. వై. పా. ౩౧౭ విష.) కాని దీర్ఘపూర్వకముగనె వాడుక.

సంయోగ పరకత్వము లేని స్థలములలో దీర్ఘము మీఁది పూర్ణము భారతమున లేకున్నను గొన్ని మహా ప్రబంధములలోఁ గన్పట్టుచున్నది. ప్రాచీన తమ కాలమున దీర్ఘపూర్వక పూర్ణములు తెల్గున నున్నను నుచ్చారణ శ్రమా పాదకము లగుటచే నశించెను. కావుననె నన్నయ ప్రయోగింపలేదు. కొందఱు మహాకవు లట్టివానిని బ్రయోగించిరి. క. పోండిగ నగజ తపశ్శిఖి। మూండు

జగంబులను దీవ్రముగఁ బర్వెన బ్ర। హ్మాండము కాఁచిన కాఁచన। భాండము క్రియఁ దాల్చెఁ దత్ప్రభా భాసితమై॥ (నన్ని-కుమా).

శా. పీండె ఖలుండు......సర్వప। ధ్యుండు......" (నన్ని. కుమా. ౨ ఆ. ౨౧౭). ద్విపద. పాండురాంగంబైన పడఁతి గర్భమునఁ। బోండిగా వెలుఁగుచుఁ బుత్త్రుఁ డీ క్రియను॥ (బసవ) ప్రగీతి-మూఁడు నే సిన గణములు రెండు నలములు। మూం డిన గణములును మొగి సహంబు। పోఁడిగాఁగ నర్ధమున కగు మీఁద ని। ట్లుండఁ జెప్పవలయు నొగిఁ బ్రగీతి॥ (కవిజనాశ్ర. జాత్యధికారము).

పయి స్థలములందు నిండుసున్న తేలిపోయిన ఖండబిందు ఘటితరూపములె నన్నయ సమ్మతములు. ఉదా:—పోఁడి-పీఁడు-వాఁడు-మూఁడు (త్రిసంఖ్య) మొ.

మఱొక వింత! దీర్ఘ పూర్వకత్వమందును హ్రస్వ పూర్వకత్వమందును తెలుఁగు భాషలో నిండు సున్నలు తేలని స్థలములును గొన్ని ప్రయోగ దృష్టములు కోశోదాహృతములును గన్పట్టుచున్నవి.

"ఏకాండము, వై. విణ. అఖండము. గీ. మలిచి యేకాండముగ నొకట-మానికమున (నై. ౬ ఆ......") "మూఁదాళి. దే. వి. కృత్రిమ మరకతము. (మూఁదాళి పచ్చ) ౨ పచ్చ పట్టుచీర. సీ. జిలుఁగు పావడ మీఁదఁ జికురధిక్కృత మిళిందాళి యొక్కతివ మూఁదాళి గట్టె (పంచ. వే. ౪ ఆ.") (శ. ర.) (చూ. వై. పా. ౩౧౭ విష).

హ్రస్వము మీఁదఁ దేలని నిండు సున్నలు:—"అడ్డంకి=నిరోధము. అపరంజి = బంగారము. ఆటంకము = నిరోధము. ఆరంజోతి = అరుంధతి. కలగుండు=కలఁత. కోరింద=ఒక తీఁగ. గరుటామంతుఁడు=గరుత్మంతుఁడు. గురివెంద=గురిజ పూస. గోరంక=గోరువంక పక్షి. చిగిరింత=తృణ విశేషము. చేమంతి = పుష్ప విశేషము. దిసంతు = నింద. నారింజ = నారంగ వృక్షము. నిస్సంతు=వంశహీనము. సంతు=సంతానము. పటపంచ=అగోచరము. పావంచ=సోపానము. పిరంగి=తుపాకి. బగ్గుండి=రక్త చూర్ణము. బలవంతము=బలాత్కారము. బవంతి=గృహ విశేషము. బాలెంత=పురుటాలు. మిసిమింతుఁడు=శ్రాంతుఁడు. మొగరంబము=తుమ్మెద. వడ్రంగి=వర్ధకి. వావింట=ఒక దినుసు కూరాకు. వియ్యంకుఁడు=వీరకాఁడు. విళంగీలు=చీవాట్లు. సరంగు=నావికుఁడు. సొరంగము=గుహవంటి రంధ్రము. హురుమంజి=మౌక్తిక విశేషము" (శ. ర.) (చూడు. వై. పా. ౩౨౦ విష).

తెలుఁగునఁ బూర్ణానుస్వారము నుచ్చారణ సౌకర్యార్థముగఁ దేల్చి పల్కినదే యర్ధానుస్వారము. ఉదా:—వాండు=వాఁడు. తోంచు=తోఁచు. మొ. కేవల పురాతన కాలమున నిట్టి తేల్చిన పలుకుబడి లేకున్నను గాల క్రమమున సంభవించినది. ఇట్టి యెడలఁ గర్ణాట పండితులు బిందువు నశించినదే యని తలంచుచు నట్టి వానిని నిర్బిందుకములనుగనె భావించిరి. తెలుఁగున శాబ్దికాగ్రగణ్యుఁడగు నన్నయభట్టారకుఁ డట్టి తేలిన యర్ధబిందువు నుచ్చారణ మందలి యానునాసిక్యమునుబట్టి గ్రహించి దానిని నిరూపించెను. భట్టారకునికిఁ బూర్వపు శాసనాదులలో నర్ధానుస్వారస్థితి కానరాదు. సరళాదేశమును బాటించిన చోటులయం దద్దంకి శాసనమందును యుద్ధమల్లుని బెజవాడ శాసనమునందును నర్ధానుస్వార ముపేక్షింపఁబడెను.

"తరువోజ, పట్టంబుగట్టిన ప్రథమంబునేణ్డు । బలగర్వ౯ం బొప్పంగ బైలేచి సేన । పట్టంబుగట్టి ఇచ్చి ప్రభుబణ్డరంగు । బఇచ్చిన సమత్త పడువతో బోయ......" (పండరంగుని యద్దంకి శాసనము. శాసన పద్య మంజరి. ౧ శాసనము క్రీ. శ. ౮౪౮. సం॥). ఇందుఁ గ్రింద గీఁత గీసిన "బప్పంగ-బైలేచి. ప్రభుబణ్డరంగు బఇచ్చిన" మున్నగు చోటులం దాదేశ సరళములకుఁ బూర్వమున ఖండ బిందు వుండవలసి యున్నను లిఖింపఁ బడలేదు. ఇట్లె యుద్ధమల్లుని బెజవాడ శాసమందును నుపేక్షితమైనది.

"మధ్యాక్షరము.. పరగగ బెజవాడ గొమరస్వామికి...నెగిదీచ్చె...
...విడిసిన బ్రోలగల......చేబ్రోల......నిచ్చగని......చేబ్రోలు......
ఒడబడి........." (శాసన పద్య మంజరి. ౨ శాసనము) ఇందలి క్రిగీఁతలు గల తొమ్మిది చోటులందును సరళాదేశము చేయఁబడియు నట్టి యాదేశ సరళములకుఁ బూర్వ ముండవలసిన ఖండ బిందు వుపేక్షితమై లిఖింపఁ బడలేదు. (చూ. శాసన ప్రతిబింబము). ద్రావిడ లిపులలో లేని యీ ఖండ బిందు లిపిని గల్పించుకొని యెవ్వరును బైశాసన కాలముల నుచ్చారణమున నవతరించియున్నను (ఖండానుస్వారమును) వ్రాయలేరైరి. నన్నయ భట్టారకుఁ డద్దానికి ఖండ బిందువని నామకరణము చేసిన వాఁడయ్యెను. "ఖండ బిందువు-అరసున్న" మున్నగు పేరులతో దాని లిపి స్వరూపము వ్యక్తమగు చుండుటచేత భట్టారకుఁడు దాని లిపిని వేఱుగ వచింపఁడయ్యెను. అట్టి నన్నయాశయమునె యథర్వణుఁడు "పూర్ణేన్దు సదృశః పూర్ణ । స్త్వర్ధ స్త్వర్ధేన్దు సన్నిభః" అని వచించిన వాఁడయ్యెను.

ప్రాచీనకాలమున వర్గాక్షర పరక పూర్ణబిందువు తత్తద్వర్గీయానునాసిక ముగ వ్రాయఁబడెడిది. వర్గేతరాక్షర పరకత్వమున బొట్టులే వ్రాయఁబడెడివి.

(చూ. వై. పా. ౨౭౦ విష. ౨౫౩ పుట). అద్దంకి శాసనము నాఁటికి "చ-ట-త" వర్గపరకత్వమున మాత్రము నిండుసున్న తత్తద్వర్గీయానునాసిక రూపమున వ్రాయఁబడుటయు "క-ప" వర్గపరకపూర్ణము బొట్టుగనే వ్రాయఁబడుటయు నలవాటై యుండెను. యుద్ధమల్లుని బెజవాడ శాసనమునాఁటికి "ట-త" వర్గపరకత్వమున మాత్రమె సున్నచోటఁ దత్తద్వర్గీయానునాసికము వ్రాయఁబడుటయుఁ దక్కిన స్థలములందెల్ల నిండు సున్నచోట బొట్టులె లిఖింపఁబడుటయు సంప్రదాయమై యుండెను. (చూ. శాసన పద్య మంజరి ౧-౨ శాసనములు). (చూ. వై. పా. ౨౭౦ విష. ౨౫౩ పుట). నన్నయకుఁ బిమ్మటి శాసనములలో నిండుసున్నచోటఁ బూర్ణచంద్రాకార లిపి వ్రాయఁబడియున్నది. (చూ. శాసన పద్య మంజరి ౨౭ పుట. చేఁబ్రోలు శాసనములోని యొక భాగపు ప్రతిబింబము క్రీ. శ. ౧౧౮౫ ప్రాంతము) మఱియు నీ శాసనమున ఖండపూర్ణ లేఖన మీ క్రింది రీతిని వెలయుచున్నది. ఖండపూర్ణములు రెండిటను బూర్ణచంద్రాకారమగు నిండుసున్నయె వ్రాయఁబడుటయు నందు నిండుసున్నయుండ వలసినచోటులందుఁ బరస్థహల్లు నూరకయె ద్విరుక్తముగా వ్రాయుటయు నీ శాసనపుఁ బ్రతిబింబమున నియతముగఁ జూపట్టుచున్నది. పెక్కుశాసనములందును దాళపత్ర మాతృకలందును నీ ఖండపూర్ణలేఖన పద్ధతి గలదుగాని యనేక స్థలములం దీ పద్ధతి వ్యభిచరితమగుచుఁ గలుషితముగ నున్నది. ముద్రణము లారంభమైన నాఁటివఱకు నర్ధచంద్రాకార ఖండబిందు లేఖనము లేదు. మూలఘటిక కేతనయు నరసున్న తేలి పలుకఁబడునని వచించియున్నాఁడు. క. కుఱుచలపై నరబిందులు। నెఱయఁగ నూఁదినను జెల్లు నిడుపులమీఁదన్। (ఆంధ్రభాషా భూషణము ౫౭ పద్యము).

పయి సందర్భమునుబట్టి చిరకాలము క్రిందటనే బిందువును దేల్చి పలికెడి యలవాటు తెలుఁగున నారంభించినదనియు నట్టి ధ్వనికి లిపి కల్పనము నన్నయభట్టువఱకు లేదయ్యెననియు నట్లగుటనే నన్నయకుఁ బూర్వపు శాసనములలో నాదేశసరళములకు ముందటి ఖండము లిఖింపఁబడదయ్యెననియు (సరళాదేశము చేసియు) నన్నయభట్టారకుఁ డట్టి బిందువు తేలిన ధ్వనిని గ్రహించి దానికి నామకరణము చేసెననియు నన్నయకుఁ బిమ్మట ఖండపూర్ణ లేఖనము విస్తరించెననియు విశదమగుచున్నది. కర్ణాటపండితు లిట్టి బిందువు తేలిన పల్కుబడిని పరిశీలింపక యది లోపించెననియె తలంచి యట్టి శబ్దములను నిర్బిందుకములనుగాఁ దలంచిరని యెఱుఁగనగును. (చూ. ౧౭ XX విష. ౧౭ XXI విష).

ఖండపూర్ణములు (మాత్రా పరిమాణభేదమున) వేఱక్షరములగుటచేత వానికిఁ బరస్పర ప్రాసము సమ్మతము కాదు. నన్నయభట్టారకుఁడు నియమముగా ఖండబిందు ప్రాసమును వాడియున్నాఁడు.

ఉ. వాఁడిమయూఖముల్ గలుగు వాఁడపరాంబుధిఁ గ్రుంకె ధేనువుల్। నేఁడిట వచ్చె నేకతమ నిష్ఠమెయిన్ భవదగ్నిహోమతంత్రల్ । పోఁడిగ వేల్వఁగాఁ బడియెఁ బ్రొద్దును బోయెఁ గచుండు నేనియున్ । రాఁడు వనంబులోన మృగరాక్షస పన్నగబాధ నొందెనో (ఆది. 3 ఆ. ౧౧౨).

కాలక్రమమున నుచ్చారణ శ్రమాపాదక మగుటచేత నర్ధానుస్వారోచ్చారణమె నశింప నారంభించెను. అట్లు నఖండాఖండ స్థలములకు భేద ముచ్చారణమున వినఁబడకుండుటం జేసి నన్నయకుఁ దర్వాతి మహాకవులు ఖండాఖండ ప్రాసమును బ్రయోగింప నారంభించిరి. తుదికిఁ దిక్కయజ్వ నయిత మరుదుగా సఖండాఖండ ప్రాసమును బ్రయోగించి యున్నాఁడు. ఈ విషయము నారచించిన వైయాకరణ పారిజాతమునందు 3౨౫ మొ. 33౬ వ. విషయములలో విస్తృతముగా విమర్శింపఁబడెను. (చూ. వ్యా. సం. ౭౮ మొ. ౫౦ I వ. విష).

ఉ. కీచక కోటిచేత నొక కీడును బొందక వచ్చితమ్మ నిన్ । వేఁచిన దుర్దుండు జమునిం గొలువం జనె నమ్మ......(విరా 3 ఆ. ౭౫).

ఉ......ప్రీతిగ సిద్ధిఁ బొందినను భీతియుఁ గుత్సయుఁ బుట్టు భూజనుల్ । వేఁతురు......(సౌప్తి ౧ ఆ. 3౫). క. కేతన కపి భయదంబై । తోఁతేరఁగ ......(కర్ణ-3 ఆ. ౧౭౮). (తమి-తోన్దు. తెల్గు-తోంచు=తోఁచు).

వయిరీతి నర్ధానుస్వార ముచ్చారణ భ్రష్టమగుటచేతను నన్నయేతర కవులు ఖండా ఖండ ప్రాసమును బ్రయోగించినవారే యగుటచేతను నన్నయ భారత భాగములోని ప్రాసస్థలము లలంతులగుట చేతను నర్ధానుస్వార స్థలములందును దీర్ఘపూర్వకములు నిరూపించుట దుశ్శకమగుచున్నది. అట్లయినను దద్భవ శబ్దములకు మూలములగు సంస్కృత ప్రాకృత శబ్దములందలి యనునాసికాక్షర స్థితిని బట్టియు నితర ద్రావిడ భాషలలోని తత్తత్సంబంధి శబ్దములందలి యనునాసికముల స్థితినిబట్టియుఁ దిక్కనాదుల పద్యముల ప్రాసస్థలములను బట్టియు నర్ధబిందు నిరూపణము కొంతవఱకుఁ దెలుంగునఁ జేయఁబడుచున్నది. ఉదా:—సంస్కృత భవములు—లాఙ్గలము=నాఁగలి. సహించు=సైఁచు-

గ్రన్థి=కడఁతి. కాణ్డము=కాఁడ. తరజ్గము=తరఁగ. త్రిలిఙ్గము=తెలుఁగు= తెనుఁగు. ప్రాన్తము=పొంత. ప్రాఞ్చ=ప్రాఁత. (మన్దర=మందడి. బాన్ధవుఁడు=బందువు. మఞ్జూష=మందసము). మొ. తమిళ సంబంధము: మూన్ఱు=మూఁడు. తోన్ఱు తోఁచు. నీన్దల్=ఈఁత. చేన్దు=చేఁదు. మొ. కన్నడ సంబంధము:—ఈంటి=ఈఁటె. సాందు=చాఁదు (చందనాదికము మర్దించు) తోంట=తోఁట. దాంటు=దాఁటు. మొ.

౧౭. XIX విష:—ద్రావిడ శబ్దములలో ననునాసికపూర్వక వర్గాక్షరములు ప్రాచీన కాలమునఁ గొన్నియెడల ద్విరుక్తములయ్యెడివి. ఇది యుచ్చారణ సౌకర్యార్థము జరుగు సరళాదేశమునకు భిన్నమైన ప్రాచీనతమ మగు మార్పు. వక్తలుచ్చారణ సౌలభ్యాపేక్షచేత బద్దకముగాఁ బల్కునపు డిట్టి ద్విత్వ మనునాసికమునకు బదులుగా నవతరించును. జలుబుచేసి ముక్కు దిమ్ము పట్టినపుడు బద్దకము గల యిట్టి యుచ్చారణము గల్గును. ఉదా:— చేయంగా=చేయగ్గా. సానునాసిక వర్గీయోచ్చారణమున నిశ్వాసమును ద్విధావిభక్తముచేసి వక్త్రమార్గమునను నాసామార్గమునను వచ్చునట్లు వక్త యుచ్చరింపవలయును. వక్త యట్టి శ్రమాపాదకోచ్చారణమున బద్దకించి యానునాసిక్యము నుజ్జగించి యచట నభ్యస్తమై యుచ్చరింపఁబడుచున్న పూర్వాక్షర గౌరవమునకు భంగము గల్గకుండఁ బరస్థిత వర్గాక్షరమునకు ద్విత్వము నొదవించుట సహజము. అట్టి ద్విత్వములును నర్ధానుస్వారానుమాపకములు కావచ్చును.

ఉచ్చారణ సౌలభ్యాపేక్షచేత ననునాసికములను వక్తలు జాఱవిడుచుట సహజమగుటచేత ద్రావిడ శబ్దములలోని యనునాసిక స్థితి వ్యత్యస్తమగుచుండును. ఇతరద్రావిడ భాషలలోని సంబంధి శబ్దములందలి యనునాసిక స్థితియుఁ బై రీతినె యుండును గాన నదియు నర్ధానుస్వార నిరూపణ విషయమున నియత ప్రమాణము కానేరదు. ప్రసంగవశమున నిట ద్రావిడ శబ్దములందలి యానునాసిక్య స్థితి సామ్యమును వ్యత్యాసములును బ్రదర్శించు శబ్దముల పట్టిక చూపఁబడుచున్నది. అందుఁ దెల్గు శబ్దము లరసున్నలతో మాత్రమె చూపఁబడును. శబ్దరత్నాకరము తెల్గు విషయమున మూలముగాఁ జేయఁబడెను. (చూడు. వై. పా. ౩౫౫-౩౫౬-౩౬౪-౩౭౧-విష).

## ౧౮. XX విష:—ద్రావిడ శబ్దములలోని యనునాసికస్థితి సామ్యము. తద్ వ్యత్యాసము

| తెలుఁగు | తమిఁళము | కన్నడము | సంస్కృతము | అర్థాదికము |
|---|---|---|---|---|
| అడఁగు | అడఙ్కు (ఙ్గు) | అడంగు | ...... | నమ్రమగు |
| అనుఁగు | అణఙ్కు=(దేవతా స్త్రీ) | అణుగు | ...... | ప్రియమైన |
| అరఁగు | అరఙ్కు (చిన్నగది) | ...... | ...... | వేదిక |
| అలఁగు | అలఙ్కు (చలించు) | అలుగు (చలనే) | ...... | శోకించు, వెనుదీయు |
| అలుఁగు | అలకు | అలగు | ...... | కత్తి, బాణాగ్రము |
| ఈఁత | నీన్దల్ | ఈసు | ...... | ఈఁదుట |
| ఈఁటె | ఈట్టి | ఈంటి (రక్తము త్రాగు) | ...... | ఆయుధ విశేషము |
| ఊఁత | ఊన్ఱు | ఊఱు | ...... | అవలంబము |
| ఊఁదు | ఊదు | ఊదు | ...... | ఆధ్మానించు |
| ఎరఁగు } ఎఱఁగు } | ఇఱఙ్కు } (ఙ్గు) ఇఱైఞ్చు } (ఞ్జు) | ఎఱగు | ...... | దిగు—మ్రొక్కు |
| ఏఁడు | యాణ్డు (ణ్డు) | ...... | ...... | సంవత్సరము |
| ఏఁబది | ఐమ్ప (మ్బ) దు | ఐవత్తు | ...... | పంచాశత్సంఖ్య |
| ఒడఁగూడు | ఉడన్ కూడు | ఒడకూడు | ...... | సంభవించు |
| ఒడఁబడు | ఉడన్ పడు | ...... | ...... | లోఁగు—సమ్మతించు |
| ఒదుఁగు | ఒదుఙ్కు (ఙ్గు) | ...... | ...... | తొలఁగు |
| కడఁక | ...... | కడంక | ...... | ఉత్సాహము |
| కరఁగు | కరై | కరగు | ...... | ద్రవింపఁజేయు |
| కలఁగు | కలఙ్కు | కలంకు | ...... | కలఁతపడు |
| కలుఁజు | కలుఙ్కు (ఙ్గు) | ...... | ...... | చెర్వు జాతి వాలు గొమ్ము |
| కవుఁజు | ...... | కవింజు | కపిఞ్జల | పక్షి విశేషము |
| కాఁక | కాఙ్కై (ఙ్గై) | కాయ్ | ...... | తాపము |
| కీఁచు | కీచ్చు | కీచు | ...... | ధ్వని విశేషము |
| కుండ | కుడమ్ | ...... | కుణ్డ | మట్టి పాత్రము |
| కుఱఁగలి | కుఱు కల్ | ...... | ...... | సమీపము |
| కొఱఁత | ...... | కొఱతె | ...... | తక్కువ |
| కోఁట | కోట్టై | కోంటె | కోట్ట | ప్రాకారము |
| క్రోఁతి | కురఙ్కు (ఙ్గు) | ...... | ...... | మర్కటము |
| గూఁడు | కూడు | గూడు | ...... | కులాయము |
| గొజ్జఁగ | ...... | గొజ్జిగె | ...... | గులాబి? |
| గోఁగు | కోఙ్కు (ఙ్గు) | ...... | ...... | కొండగోఁగు |
| గోరఁట | ...... | గోరంటె | కురంటక | ...... |
| చాఁదు | చాన్దు (న్దు) | సాందు | ...... | మర్దించు |
| చీఁదు | చీన్దు (న్దు) | ...... | ...... | ముక్కుచీఁదు |

# ౧౭. XX విభ:—ద్రావిడ శబ్దములలోని యనునాసికస్థితి సామ్యము. తద్ వ్యత్యాసము

| తెలుఁగు | తమిళము | కన్నడము | సంస్కృతము | అర్థాదికము |
|---|---|---|---|---|
| చూఁడు | చుడు | సూడు | ...... | కాల్చు |
| చెన్నఁగి | తేఙ్కు (ఙ్గు) | తెంగు | ...... | నారికేళము |
| చెఱుఁగు | ...... | సెఱంగు | ...... | కొంగు |
| చెలఁది | చిల్లన్ది (న్ది) | ...... | ...... | సాలెపురుగు |
| చేఁదు | చేన్దు | సేదు | ...... | నీరుచేఁదు |
| జినుఁగు | చిణుఙ్కు (ఙ్గు) | జినుంగు (అవ్యక్త శబ్దము) | ...... | సూక్ష్మము |
| తాఁకు | తాక్కు | తాగు | ...... | తాఁకుట |
| తాఁడి | తాన్డి | ...... | ...... | తాండ్ర చెట్టు |
| తీఁట | తినవు | తీంటె | ...... | గజ్జి |
| తూఁగు | తూఙ్కు (ఙ్గు) | తూగు | ...... | ...... |
| తూఁట (తుంట) | తుణ్టు (ణ్డు) | తుండు | ...... | తునిసిన ముక్క |
| తేఁకు | తేక్కు | తేంగు | ...... | టేఁకు చెట్టు |
| తేఁటి | తేన్ (మధువు—తుమ్మెద) | జేన్ (తేనె) | ...... | తుమ్మెద |
| తొడఁగు | తొడఙ్కు (ఙ్గు) | తొడగు | ...... | ఆరంభించు |
| తొలఁకు | { తులఙ్కు (ఙ్గు) తులక్కు | తొళగు | ...... | ప్రకాశించు |
| తొలఁగు | ...... | తొళగు | ...... | ...... |
| తోఁక | తోకై (నెమిలిపురి) | సోగె | ...... | పుచ్ఛము |
| తోఁచు | తోన్దు | ...... | ...... | ఉదయించు స్ఫురించు |
| తోఁట | తోట్టమ్ | తోంట | ...... | ఉపవనము |
| తోఁడు | తోణ్డు | తోడు | ...... | పెల్లగించు |
| తోఁపు | తోప్పు | తోపు | ...... | ఉపవనము |
| త్రేఁచు | తేక్కు | తేగు | ...... | ఉద్గారించు |
| దాఁటు | తాణ్టు (ణ్డు) | దాంటు | తాణ్డవ? | లంఘించు |
| దూఁట | తణ్టు (ణ్డు) | దంటు | ...... | అనఁటిదూఁట |
| దూఁటు | తూణ్టు (ణ్డు) (ప్రేరించు) | దూంటు (అతిక్రమించు) | ...... | పొడుచు |
| దోఁటి | తోట్టి | దోంటి | ...... | { అందని పండ్లు మున్నగు వానికై కట్టిన సాధనము |
| నడుఁకు | నడుఙ్కు (ఙ్గు) | నడుంగు = నడుగు | ...... | కంపించు |
| నలఁగు | నలఙ్కు | నలుగు (కృశించు) | ...... | ...... |
| నాఁగలి | నాఞ్జిల్ | నేగిల్ | లాఙ్గల | దున్నెడి సాధనము |

## ౧౭. XX విష:—ద్రావిడ శబ్దములలోని యనునాసికస్థితి సామ్యము. తద్ వ్యత్యాసము

| తెలుఁగు | తమిళము | కన్నడము | సంస్కృతము | అర్థాదికము |
|---|---|---|---|---|
| నాఁడు | ఞాన్ఱు | నాళ్ | ...... | దినము |
| నీఁగు | నీక్కు = (విడుచు) } నీఙ్గు (ఙ్గు) (పోవు) } | నీగు (విడుచు) | ...... | నివర్తించు |
| నూఁకు | నూక్కు | నూంకు | ...... | త్రోచు |
| నేఁడు | ఇన్ఱు | ...... | ...... | ఈదినము |
| పలుఁగు | పళిఙ్గు (ఙ్గు) | పళికు | స్ఫటిక? | స్ఫటికము |
| పరఁగు | పిఱఙ్గు (ఙ్గు) | ...... | ...... | ప్రసిద్ధమగు |
| పాఁచి | పాచి | ...... | ...... | శైవలము |
| పాఁడి | పాడి (వ్రజము) | పాడి (వ్రజము) | ...... | పాలుగల్గుట |
| పీఁకు | పిడుఙ్గు (ఙ్గు) | ...... | ...... | ...... |
| పెనఁగు | పిణఙ్గు (ఙ్గు)(వివదించు) | పెణగు (పోరు) | ...... | పెనఁగులాడు |
| పొరఁటు | పురట్టు | పొరంటు (ఉద్గమించు) | ...... | పొరలించు |
| పునుఁగు | పునుగు | పుణుగు | ...... | ...... |
| బలఁగము | ...... | బళగ | ...... | ...... |
| బీఁట | విడర్ | బీడె | ...... | ...... |
| బెడఁగు | విడఙ్గు (విలాసము) | బెడంగు (విలాసము) | ...... | ఒప్పిదము |
| బోఁదె | పోత్తికై | బోదిగె | ...... | ...... |
| మండెఁగ | ...... | మండిగె | ...... | ...... |
| మడఁగు | మడఙ్గు | ...... | ...... | ...... |
| మడఁత | మడిప్పు | మడితె | ...... | ...... |
| మఱుఁగు | మఱైక్కు | మఱుగు | ...... | ...... |
| మలఁగు | మలఙ్గు (క్లేశపడు) | మలంగు (శయించు) | ...... | తిరుగు = మరలు |
| మలుఁగు | మలఙ్గు | ...... | ...... | మత్స్యవిశేషము |
| మసఁగు | మయఙ్గు | మసగు | ...... | విజృంభించు |
| మాఁగు | మాఙ్గు | మాగు | ...... | (పండినది) కుళ్ళు |
| మాఁడు | మాణ్డు (చచ్చు) | బాడు | ...... | మాఁడిపోవు |
| మావఁతి | మావుత్తన్ | మావంతి | ...... | హస్తిపకుఁడు |
| మీఁదు | మీదు | ...... | ...... | ...... |
| మునుఁగు | ముఴుగు | ముళుంగు | ...... | నిమగ్నమగు |
| ముసుఁగు | ముసుక్కు | ముసుంకు | ...... | ...... |
| మూఁగ | మూఙ్గై | మూగ | మూక | ...... |
| మూఁడు | మూన్ఱు | మూఱు | ...... | త్రిసంఖ్య |
| మెఱుఁగు | ...... | మిఱుగు | ...... | ...... |
| మోఁకాలు | ముఴఙ్కాల్ | మొణకాల్ | ...... | జానువు |

౧౭. XX విష:—ద్రావిడ శబ్దములలోని యనునాసికస్థితి సామ్యము. తద్ వ్యత్యాసము

| తెలుఁగు | తమిళము | కన్నడము | సంస్కృతము | అర్థాదికము |
|---|---|---|---|---|
| మోఁచేయి / ముంగై | ముళజ్కై | ముంగై | ...... | ...... |
| మోఁదు | మోదు | మోదు | ...... | ...... |
| మ్రోఁగు | ముళజ్కు | మొఱంగు | ...... | శబ్దించు |
| లాఁగు | ...... | లాగు | ...... | లంఘనము |
| వీఁగు | వీఙ్కు (అధికమగు) | బీగు (అధికమగు) | ...... | గర్వించు—అతిశయించు |
| వెఱఁగు | ...... | వెఱగు | ...... | ...... |
| వెలుఁగు | విళఙ్కు (ప్రకాశించు) | బెళగు (ప్రకాశించు) | ...... | ప్రకాశించు / ప్రకాశము |
| వేఁగి | వేఙ్కై | బగ్గ | వ్యాఘ్ర | పెద్దపులి |
| వేఁట | వేట్టై | బేంటె | ...... | మృగయ |
| వేఁడు | వేణ్డు | బేడు | ...... | ప్రార్థించు |
| వేఁప (చెట్టు) | వేమ్పు, వేప్పమరమ్ | బేవు | ...... | నింబ వృక్షము |
| వేసఁగి | ...... | బేసగె | విశాఖ—వైశాఖము | ...... |
| సంపఁగి / సంపెఁగ | సమ్పకమ్ | సంపగె | చంపక | ...... |
| సరిఁబడు | సరిప్పడు | సరిపడు | ...... | ...... |
| సాఁకు | కాఙ్కు (కాపాడు) | సాకు | ...... | రక్షించు, కాపాడు |
| సురుఁగు | సురుఙ్కు (శుష్కించు) | సొరగు (శుష్కించు) | ...... | అదృశ్యమగు |
| సోఁకు | ...... | సోంకు | ...... | తాఁకుట |

పయి పట్టికలోని శబ్దములలో "ఊఁదు-ఎఱగు-కీచు-నేదు-తాగు-తూగు-తొళగు-తేగు-తోపు-నీగు-పెణగు-బీగు-బెళగు-బేదు-సాకు-సొరగు" మున్నగు శబ్దములలోని యనుస్వార ముచ్చారణ వశమునఁ దేలఁగా నట్టి శబ్దములు నిర్బిందుకములె యని కర్ణాటులు తలంచిరే కాని యాంధ్రపండితుల వలె నట్టి తేలిన యనుస్వారస్థలమున నానునాసిక్యము స్వల్పముగ వినఁబడు చున్నదనియు నట్లు వినఁబడుచున్న యర్ధానునాసిక్యము నర్ధానుస్వార మనఁ దగుననియు సూక్ష్మదృష్టిని బరిశీలింపరైరి.

౧౭. XXI విష:—తెల్గుపదముల తుదిని మకారవు పొల్లు నిచ్చుటకే యవసరము లేదు. "వచ్చెన్-రామున్" మున్నగుచోటులందలి యవసాన ద్రుతము బిందువు కానేరదు. కన్నడమునఁ బదముల తుదినున్న—"మ-న" లకు బిందువు నిత్యముగా నాదేశమగును."

"మ న యో ర్బిన్దుః" (కర్ణా. భూ. ౧౧౨ సూ.) అవసానమందలి-మకార నకారములకు బింద్వాదేశ మగును. ఉదా:—తమి-అవన్. కన్న-అవం (వాఁడు). తమి-మరమ్. కన్న-మరం (చెట్టు).

అమహత్ప్రథమైకవచనము తెల్గున 'ము' ప్రత్యయము. కన్నడమున 'మ్' అనునది. కావున నమహ దకారాంతములు తెలుఁగున 'ము' ప్రత్యయాంతములును, గన్నడమున ననుస్వారాంతములును నయి యుండును. ఉదా:—సంస్కృ.-వన. తెల్గు-వనము. కన్న-వనం. ఇట్లె తెల్గున-ధనము-గృహము. కన్న-ధనం-గృహం. మొ.

సంస్కృత మకారాంత శబ్దము, లనుకరింపఁబడినపుడు సయితము తెల్గున నట్టి మకారము బిందువు కానేరదు. ఉదా:—రామాణా మ్మనె= 'రామాణామ్' అనియె. "రామలక్ష్మణౌ విజయేతామ్" అనియె. రామలక్ష్మణౌ విజయేతా మ్మనియె. మొ.

తెల్గున నర్వాచీనముగా నట్టి ముప్రత్యయాంత శబ్దము లనుస్వారాంతముగఁ బల్కఁబడుట విస్తరించినది.

ఉదా:—వనము=వనం; ధనము=ధనం; గృహము=గృహం. మొ. ఇట్టి యనుస్వారాంతరూపములు ప్రాచీనాంధ్ర మహాకవుల కావ్యములందే కాక ప్రాచీనాంధ్ర శాసనములందును లేవు. కాని 'చరిత్ర' మున్నగు కొన్ని శబ్దముల యం దట్టి 'ము' వర్ణకము లోపించుట ప్రాచీన కావ్యములందును గన్పట్టుచున్నది. (చూడు. వ్యా. సం. ౧౬౨ విమ.) చ......పాండవో! త్తముల చరిత్ర నాకు సతతంబు వినంగ నభీష్ట మెంతయున్ (ఆది. ౧ ఆ. ౧౮ ప.) శబ్దతత్త్వశాస్త్రపద్ధతుల ననుసరించి యాలోచించునపుడు "చరిత్రము=చరిత్రమ్=చరిత్రం=చరిత్రఁ=చరిత్ర" అనురీతిని వాని పరిణామ క్రమము నంగీకరింపక తప్పదు. అట్లయినను నన్నయాది ప్రాచీనాంధ్ర కావ్యములయందుఁ గాని ప్రాచీనాంధ్ర శాసనములయందుఁగాని "చరిత్రమ్=చరిత్రం=చరిత్రఁ" అనురూపముల స్థితి కానరాదు. "చరిత్రంబు=(చరిత్రబు—శాసనములలో) చరిత్రమ్ము=చరిత్రము=చరిత్ర" అనురీతినే రూపములు కన్పట్టుచున్నవి. కేవల ప్రాచీనాంధ్ర శాసనములయందు "చరిత్రము-చరిత్ర" అను రీతిగల ముపర్ణకాంతములును దల్లోపము గలవియుఁ గానరావు. నన్నయ కాలమునాఁటికి ముపర్ణకాంత రూపములు వాడుక కెక్కినవి. నన్నయ నాఁటికి సయితము "వనం-ధనం" మున్నగు నున్న తుదినిగలవి వెలసి యుండలేదు. అర్వాచీనముగఁ దెలుఁగు వాడుక భాషలో "వనం-ధనం-ముఖం-గృహం" మున్నగు శబ్దములతో

పాటుగా "చరిత్రం" మున్నగు నవియుఁ జూపట్టుచున్నవి. వసథనాది శబ్దములకుఁ 'వస-ధన-గృహ-ముఖ' మున్నగు 'ము' లోపరూపము లెంతమాత్రమును నేఁడును లేవు. ఇంక "చరిత్ర-హంస-దర్భ-వసస-మొదలగు కొన్ని శబ్దములందు మాత్రమె మువర్ణక లోపము చూపట్టుచున్నది. మహాద్వాచకములందును 'దూత-దూతుఁడు' మున్నగు రూపములు వెలసియున్నవి.

౧౭. XXII విష:—"పరుష సరళ వినిమయము......తమిఁళ మలయాళములలో నియతముగాను బూర్ణముగాను నున్నది. 'క-ట-త-ప' లు పదాదియందును (టకారము పదాదిని నిల్వదు) ద్విత్వావస్థయందును 'క-ట-త-ప' లుగానే పల్కఁబడును. తక్కిన స్థలములయందు వానికి నాదోచ్చారణము గల్గును. అనఁగా నవి 'గ-డ-ద-బ' లుగాఁ బల్కఁబడును. సరళోచ్చారణము పదాదియం దుండదు. పరుషోచ్చారణము ద్విత్వావస్థలోఁ దప్పఁ బదమధ్యమున నుండదు.......సమాసములలో నుత్తరపదాదినున్న పరుషము సమాసరూపపదమధ్యగత మగుటచేత సరళమగుచుండును......ఈ నియమము తెలుఁగులో నన్ని సమాసములందును గలదు......" (కాల్డు. ౧౩౮ పుట).

"చకార విషయమున నిట్టిదే మఱొక నియమము గలదు. ఎచ్చట నున్నను నద్విరుక్తమగు చకారము 'శ' వర్ణోచ్చారణము గలదిగాను (ఈ యుచ్చారణము 'శ-ష-చ' అనువానికి మధ్యస్థముగా నుండును) ద్విరుక్త చకారము "చ్చ" అను నుచ్చారణము గలదిగాను నుండును......" (కాల్డు. ౧౩౯ పుట).

విమర్శము:—తెల్గున—"పరుషాణాం గ సడదవాః స్యుః పదా ద్వన్ద్వే" అను చింతామణి సూత్రము చొప్పున ద్వంద్వసమాసమందు మాత్రమె పరుషములకు "గ-స-డ-ద-వా" దేశము నియతము. కాన "అన్ని సమాసములందును నీ సరళాదేశము నియమముగ గల్గును" అను కాల్డువెల్లుగారి వాక్యము సరికాదు. మఱియుఁ దమిళ మలయాళములందును 'క-ట-త-ప'లకు 'గ-డ-ద-బ' ల యుచ్చారణము సహజమనుటయుఁ బొసఁగ నేరదు. తొల్కాప్పియరు నాఁటికి సరళోచ్చారణమె తమిళమున లేదు. తొల్కాప్పియరు చెప్పిన తమిళ వర్ణ సమామ్నాయమున సరళ వర్ణములె లేవు. వానికి లిపి లేదని వేఱ చెప్పనేల? కాలక్రమమున నర్వాచీనముగా నుచ్చారణ సౌలభ్యాపేక్షచేత సరళోచ్చారణము తమిళమున నారంభించెను. పదాది వర్ణమందలి యూనికచేతను ద్విరుక్త వర్ణమందలి పూనికచేతను నట్టి స్థలద్వయమునందును దమిళమున సరళోచ్చారణము గల్ల దయ్యెను. తమిళ మందలి యీ సరళోచ్చార ణాపభ్రంశ మేనాఁ డారంభించెనో చెప్పుట కాధారములు గాన రావు. ఇట్లర్వాచీనముగా సరళోచ్చారణము గల్గినను నవి పరుష లిపులతోనె వ్రాయఁబడుచున్నవి. పరుషము

లనఁగా "క-చ-ట-ఱ-త-ప" అనునవె నైనను నిచటి సరళ శబ్దముచేత "గ-జ-డ-ర-ద-బ" అనునవే కాక 'శ-స-హా'లును నుద్దేశింపఁబడుచున్నవి.

నేఁడు పదాదీతర స్థలమున ద్విరుక్తేతర 'క' కారము 'హా' కారధ్వనికి సన్నిహితముగఁ బల్కఁబడుచున్నది. అట్టి ధ్వని 'క' కార లిపితోనె వ్రాయఁబడుచున్నది. ఉదా:—సం. నఖము. తమి. నకము. ఇది 'నహము' అని పల్కఁబడును. సంస్కృతములోని ఖ-గ-ఘ'లతోఁడి శబ్దము లఱవములోనికి వచ్చునపుడందలి 'ఖ-గ-ఘ'లను బదాదిని, ద్విరుక్తతలోను, 'క' కారముగను (సం. భాగ్యమ్-తమి. పాక్కియమ్) తదితర స్థలమున హాకారమునకు సన్నిహితముగను బలుకుచు దానిని 'క' కార లిపితోనె వ్రాయుదురు. ఇట్టి మార్పుచేతనే 'హా' కారముతోఁడి సంస్కృత శబ్దము తమిళమునఁ జేరునపుడట్టి హా కారమును 'క' కార లిపితో వ్రాయుచు 'గ' కారముగఁ బలుకుట నేఁటి సంప్రదాయమై యున్నది. ఉదా:—సం. మహాన్. తమి. మకన్. దీనిని 'మగన్' అని పల్కుదురు. దీనికిఁ బ్రాచీన కాలమున భర్త యనియుఁ దర్వాతఁ బుత్త్రుఁడనియుఁ దమిళమున నర్థము. మలయాళమున నిది 'మకన్' అనియే వ్రాయఁబడును. పుత్త్రుఁడని దీనికర్థము. చకారోచ్చారణము ద్విత్వావస్థలో మాత్రమె నేఁటి తమిళమున నిల్చియున్నది. పదాదిని బదమధ్యమందును శవర్ణముగను సకారముగను బల్కఁబడును. (చూ. ౧౭ XVII విష.) చకార లిపితోనె వ్రాయఁబడును. ఇట్టి యలవాటు చేతనే సంస్కృత శబ్దములను దమిళమున వాడునపుడు వానిలోని "ఛ-జ-ఝ"లు సైతము 'శ-స' లుగా మాఱుచుండును. (కొన్నియెడల జకారము యకారమగును. సం. గజ-తమి. కయమ్).

టకారము తమిళ పదాదిని నిల్వదు. కాన 'ట' కార ధ్వని ద్విరుక్తమగునపుడు మాత్రమె నిల్చియుండును. ద్విరుక్తేతర స్థలములందిది 'డ' కారముగ నేఁడు పల్కఁబడును. సంస్కృత శబ్దములోని "ఠ-డ-ఢ"లు సైతము తమిళములోనికి వచ్చునపుడు 'ట' కారపద్ధతులె వర్తించును.

ఱకారము ద్విరుక్తతలో 'ట్ట' అను దానివలెఁ బల్కఁబడును. (ఱకారమునకు 'ట-త' మధ్య స్థోచ్చారణము ప్రాచీన కాలమున సహజమై యుండెను). ద్విరుక్తత లేని కేవల స్థితిలో నిపుడు ఱకారము తమిళమునందును నాంధ్ర కర్ణాటములందువలెనె యలఘు రేఫముగనే పలుకఁబడుచున్నది. ఇదియే దీని కర్వాచీనముగా వచ్చిన సరళోచ్చారణము. (చూడు. ౧౭ XII ౧౭ XIII విష.) ప్రాచీన కాలమున ద్విరుక్తతలేని కేవల స్థితియందును దీని యుచ్చారణము 'ట-త' మధ్యస్థ రూపముననె యుండెడిదని తొల్కాప్పియము వలన విశదమగుచున్నది. (చూ. తొల్కా. ౯౪ సూ.) ఱకార ధ్వని మలయాళము

నందును బైరీతినె వెలయుచున్నది. 'ఱ్ఱ' అనునది మలయాళమున 'ట్ర' అని పల్కఁబడుననెడి మాట సరికాదు. అకారరూప పరుషమున కనునాసికమగు మూర్ధన్య నకారము తమిళమున నేఁడు దంత్య నకారమువలెనె యపభ్రష్టముగ నుచ్చరింపఁబడుచున్నది. ఇది స్వపరుష అకారముతో సంయుక్తమగునపుడు 'ణ్ట' అనురీతి యుచ్చారణము గలదయ్యు నేఁటి తమిళుల యుచ్చారణమున 'న్డ్ర' అను ధ్వనిగ వినఁబడును.

"తకారము నేఁడు పదాదీతరస్థలములందు నద్విరుక్తావస్థయందును దకారముగాఁ గాని 'తద' మధ్యస్థముగాఁ గాని పల్కఁబడుచున్నది. పదాదిని ద్విరుక్తతలోను 'త' కారముగనే పల్కఁబడును. సంస్కృతమందలి "థ-ద-ధ" లతోడి శబ్దములు వాడఁబడు నపుడును బై తకార పద్ధతులె వర్తిల్లును. ఉదా:— సం-దన్తమ్-తమి-తన్దమ్". డా. కాల్డువెల్లుగారు తకార విషయమున స్థలాంతరమం దీ క్రింది రీతిని వ్రాసియున్నారు. "తమిళమునందును మలయాళము నందును బదాదీతరస్థలమందలి యద్విరుక్త తకారము దకారముగఁ బల్కఁ బడక యీషత్స్పృష్ట దకారముగాఁ బల్కఁబడును. నకార సంయుక్తమగు నపుడు మాత్రమె దానికి సంస్కృత దకారమువంటి యుచ్చారణము వెలయు చున్నది." (కాల్డు. ౧౪౨ పుట).

విమర్శము:—తకారమున కీషత్స్పృష్ట దకారమువంటి యుచ్చారణము తమిళమున నప్రసిద్ధము. దానికి "త-ద"ల మధ్యస్థమగు నుచ్చారణమె యిపుడు వాడుకలో నున్నది. తదలు రెండును స్పృష్టములె కాని యీషత్ స్పృష్టములు కావు.

పకారము పదాదీతర స్థలములందును ద్విరుక్తతలేని కేవల స్థితిలోను "ప" కారముగాఁ గాని యాంగ్లమందలి 'f' అను దాని ధ్వనితోఁ (ఫ్) గాని పల్కఁబడుచున్నది. దానికి సరళోచ్చారణము (బ) కేవలము నప్రసిద్ధము. ద్విరుక్తతలోను బదాదియందును 'ప' కారముగానే పల్కఁబడును. "ఫ-బ-భ"ల తోడి సంస్కృత శబ్దములు తమిళమున వాడఁబడినపుడును బయి పకార పద్ధతులె వర్తిల్లును. ఉదా:—సం-భాషా=తమి-పాడై. (సంస్కృత షకారము తమిళమున 'డ' కారమగును). సం-భాగ్యమ్=తమి-పాక్కియమ్. మొ.

౧౭. XXIII విష:—'క-చ-ట-త-ప' లయిదును వాని యనునాసిక ములతో సంయోగించునపుడు నేఁడు వరుసగా "గ-జ-డ-ద-బ" అనువాని సరళోచ్చారణము నందుచున్నవి. పరుషముల పయి సరళోచ్చారణ మర్వాచీన మనియుఁ దొల్కాప్పియము నాఁటి కిట్టి యపభ్రష్టోచ్చారణము కల్గలేదనియుఁ

జెప్పుటకు సందేహములేదు. తొల్కాప్పియమున వర్ణమాలలో సరళములకు స్థితియే లేదు. మఱియు స్వకీయానునాసికముతోఁ గూడిన సంయోగావస్థలో సైతము పరుషములై నిల్చునని యీ క్రింది రీతిని దొల్కాప్పియరు వచించిరి. "ఙ-ఞ-ణ......" (తొల్కా. ౨౪ సూ.)="ఙ-ఞ-ణ-న-మ-న్" అనెడి హల్లులకుఁ బరముగ వానివాని వర్గాక్షరములగు "క-చ-ట-త-ప-ఱ" అను నక్షరములు నిల్చును. ఉదా:—అఙ్కు=(ఆ చోటు) అఞ్చు=(భయపడు) (దీనికిఁ బంచసంఖ్యార్థమును నర్వాచీనముగఁ గల్గెను). వణ్టు=(తుమ్మెద) పన్తు=(బంతి-చెండు చెక్క యాట). అమ్పు=(అస్త్రము-అమ్బిక శబ్దభవము కానోపును=బాణము.) ఇట్టివానిలోఁ బరుషోచ్చారణము ప్రాచీనము. సరళోచ్చారణ మర్వాచీనము నపభ్రష్టమును. (చూ. ౨౪ VII విష).—'పూ+కోడి=పూఙ్కోడి=పూఙ్కోడి' అనునది మొదలగు చోటులందలి పాక్షిక పరుష ద్విత్వమె యచటి పరుషోచ్చారణ స్థితికి నిదర్శన మగుచున్నది).

"మరప్పెయర్ కిళవి......" (తొల్కా. ౨౧౭ సూ.)=అకారాంత వృక్షవాచక శబ్దములకు "క-చ-త-ప"లు పరమగునపుడు వాని యనునాసికములు వాని నడుమ నిల్చును. ఉదా:—విళ+కోడు=విళ+ఙ్+కోడు=విళఙ్కోడు. (వెలగ కొమ్మ) ఇందుఁ దొల్కాప్పియరు కంఠోక్తముగాఁ బరుషము స్వానునాసిక పూర్వకమై నిల్చునని వచించెను.

"మెల్లెఴుత్తు మిగువఴి......" (తొల్కా. ౧౫౭ సూ.)=(వేట్టు (ట్టు) మై చ్చన్ది)=విభక్తి సమాస సంధిలోని=ద్వితీయా విభక్తి సమాస సంధిలో వచ్చెడి సంధి కార్యము లిచటఁ జెప్పఁబడుచున్నవి. ద్వితీయా సమాస విషయమున శాస్త్ర విధులెల్లఁ బహుళముగా నగునని తాత్పర్యము. సమాసములో వచ్చు ననునాసికాగమమునకు మాఱుగ ద్వితీయా సమాసమునఁ బరస్థ "క-చ-త-ప" లకు ద్విత్వము వైకల్పికముగా వచ్చును. ఉదా:—మర ఙ్కుఱైత్తాన్=మరక్కుఱైత్తాన్=(చెట్టును నఱకెను) ఇట్టివి విభక్తి సమాసములని తమిఱ కన్నడ సంప్రదాయము.

పయిరీతి ననేక స్థలములందుఁ దొల్కాప్పియరు స్పష్టముగా ననునాసిక పూర్వక పరుష సంయోగ స్థితిని వచించిరి. కావున నాయన కాలమునాఁటి కనునాసిక పూర్వక సంయోగమందును సరళస్థితి లేదనుటకు సందియము లేదు.

ఈ విషయమున విద్వాన్ వే. వేంకటరాజులురెడ్డిగారీ క్రిందిరీతిని వ్రాసియున్నారు. (14-11-1951 తేది జాబు).

"పూర్వమునందు సరళోచ్చారణమే లేదనియుఁ దర్వాతఁ గాలక్రమమున వచ్చినదనియు ద్రావిడభాషలను బాగుగఁ బరిశీలించిన విశదమగును,"

౧౭. XXIV విష:—పయిసందర్భమునుబట్టి యీ క్రింది కాల్డువెల్లుగారి వ్రాఁత సరికాదని చెప్పనగును.

"పరుషములను సరళములనుగా నుచ్చరించు పద్ధతి యఱవమునకు స్వభావ సిద్ధమైన ధర్మమే కాని వైయాకరణులును నితరులును గల్పించినది కాదు. అఱవ లిపి ప్రాచీన సంస్కృత లిపినుండి తీసికొనఁబడెననియుఁ గ్రీస్తు శకమున కనేక శతాబ్దములకు ముందార్యులు దక్షిణమునకు వచ్చిరనియు వారు వచ్చిన కొలఁది కాలముననే యఱవలు తమ భాషకు వ్రాఁత నేర్పఱచుకొని రనియు నా యభిప్రాయము. అట్లు సంస్కృతమునుండి లిపిని దీసికొనునపుడే యఱవలు తమ భాషయొక్క పద్ధతి కనుకూలముగాఁ బరుషములను మాత్రము గ్రహించి సరళ లిపులను విడిచిరి......" (కాల్డు. ౧౩౯ పుట).

విమర్శము:—ఈ కాల్డువెల్లుగారి ధోరణి సుసంగతముగా లేదు. ఒక యక్షరమును వ్రాయుట దాని నొకచోట నొకవిధముగాను మఱొకచోట వేఱు విధముగాను బలుకుటగదా తమిళభాషాపద్ధతి. లిపిలేని తమిళులభాష కీ పద్ధతి యుండెడిదని చెప్పుట కేవలము నసంభవముగదా! మఱియుఁ దన కెన్నో శతాబ్దముల పూర్వకాలము నుండియు సరళోచ్చారణము వెలసియున్నపు డట్టి ధ్వనులను దొల్కాప్పియరు వర్ణసమామ్నాయమున గణింపకుండుట యసంభవ మనఁదగును.

పయిరీతిని దమిళులు సంస్కృత లిపిని దీసికొనిరని చెప్పెడి దొరగా రీ క్రింది రీతిని వ్రాయుట కెట్లు సాహసించిరో తెలియకున్నది. "తమిళ వ్యాకరణము సంస్కృత సంబంధములేకయే కల్పింపఁబడుటచేతను, దమిళులకు సంస్కృతోచ్చారణము తెలియకే పోవుటచేతను దమిళభాషలో నుండెడి ధ్వనులనుబట్టి తమిళులు ప్రత్యేకముగా వర్ణసమామ్నాయము నేర్పఱచుకొని రని తెలియనగును" (కాల్డు. ౧౩౦ పుట).

౧౮. I విష:—" 'అ–ఆ' అనువాని యుచ్చారణము శ్రమాపాదకము గాన నయ్యది తమిళమునఁ దఱచుగా "ఎ" కారముగాఁ బరిణమించును. ఉదా:—సంస్కృ.—బల (న్) తమి–బెల (న్) (బలము). సం–జప–తమి–సెబమ్ (జపము) (చూ. నేనుశబ్దము). ఇతరభాషలలో నిట్టిమార్పు గల్గదు" (కాల్డు ౧౩౨ పుట).

విమర్శము:—డా. కాల్డువెల్లుగారు వ్రాసెడి వ్రాఁతలు తఱచుగాఁ గేవలాధునాతనస్థితిని మాత్రమె యనుసరించి యుండును. ఈ విషయమున శ్రీ విద్వాన్ వే. వేంకటరాజులు రెడ్డిగారి యాశయముల నుదాహరించుచున్నాను. "అఱవకవులు 'బెల' శబ్దమును వాడరు. అధునాతను

లనఁగా రమారమి రెండువందల యేండ్లనుండి వెలసిన యసంస్కారి కవులు 'శెల' అనువానివంటి 'ఎ' త్వ ఘటితరూపములను వాడుట గలదు. మల యాళమువారు 'అ' కారము 'ఎ' కారచ్ఛాయతోఁ బలుకుదురని మలయాళ వ్యాకరణములందుఁ గలదు." కన్నడమునఁ బెక్కుచోటులందు 'అ' కారము 'ఎ' కారముగాఁ బలుకఁబడును. ఉదా:—సం-జటా=కన్న-జెడె; సంస్కృ-పథ్యా- కన్న-పెజ్జె. (మార్గము) సం-సీతా-కన్న-సీతె. సం-గంగా-కన్న-గంగె. సం-అభిలాష-కన్న-అభిలాషె. సం-దర్భ-కన్న-దర్భె. సం-వధ-కన్న-వధె. సం-ఊహా-కన్న-ఊహె. మొ.

"తమిళమునఁ బదాంతమున నున్న 'ఆ' కారమునకుఁ దర్వాత 'ఉ' అను నది చేరును. అచటి స్వర సంహితలో 'వ' కార ముచ్చారణ సౌకర్యార్థముగఁ జేరును" (కాల్డు. ౧౩౩ పుట).

విమర్శము:—పయిరీతిని వ్రాసి రేకాని దొరగా రుదాహరింపలేదు. ఉదా:—నిలా=నిల+వ్+ఉ=నిలవు=(వెన్నెల) కనా=కన+వ్+ఉ= కనవు=(కల). దీర్ఘములేనపుడు 'వు' వర్ణాంతరూపము నిల్చును.

"అఱవమున నామము తుదినుండు 'ఆ' కారము నిత్యముగా లోపించి దానిచో 'ఉ' అనునదికాని "ఎయ్" అనునదికాని నిల్చును. ఇట్లు 'ఎయ్' అనునది నిలుచుచోటులందుఁ గన్నడమున 'ఎ' అనికాని 'ఎయు' అనికాని నిల్చును. ఆంధ్రమలయాళములలోని 'అ' వర్ణ మట్లు మాఱదు." (కాల్డు. ౧౩౩ పుట).

విమర్శము:—పయిరీతిని వ్రాసి రేకాని దొరగా రుదాహరింపలేదు. కాల్డు వెల్లుగారు 'ఐ' కారమును 'ఎయ్' అని వాడుదురు. అది సరికాదని ముందు విమర్శింపఁబడును. కాన నిట 'ఐ' కారముతోనె యుదాహరింపఁబడును. ఉదా:—తమి-తలై-కన్న-తలె-తెల్గు-మలయా-తల. తమి-తొడై-కన్న-తొడె- తె-మ-తొడ. కాల్డువెల్లుగారు 'ఎయ్' అనుదానికిఁ బర్యాయముగా 'ఉ' అని తమిళమునందు నిల్చునని వ్రాసిన దానికిని గన్నడమున 'ఎ' అనుదానికిఁ బర్యా యముగా 'ఎయు' అని నిల్చునని వ్రాసినదానికిని నుదాహృతులు గన్పట్టలేదు.

"మొదట ద్రావిడభాషలందుఁ బదముల తుదిని నిల్చునట్టియు, నేఁటికిని మలయాళమున నిల్చియున్నట్టియు నపుంసక నామ సర్వనామముల తుది 'అ' కారము వ్యావహారిక తమిళమునఁ దఱచుగ 'ఎయ్' అనియుఁ దెల్గున 'ఇ' అనియుఁ గన్నడమున 'ఉ' అనియు మాఱును." (కాల్డు. ౧౩౩ పుట).

విమర్శము:—పయి వ్రాతకును గాల్డువెల్లుగా రుదాహరింపలేదు. ఉదా:—తమి-అవై. (ఇది గ్రాంథికమె) తెల్గు-అవి. కన్న-అవు. ఇట్టి మార్పులు గల నపుంసకనామముల యుదాహృతులు గన్పట్టలేదు.

౧౮. II విష:—"'అ' కారజన్యమును (తల=తలై. సీత-సీతై) 'ఆ' కార జన్యమును నగు తమిళములోని మిశ్రాచ్చు 'ఐ' (ai) అని యుచ్చరించుటకంటె "ఎయ్" (ei) అని యుచ్చరించుటయె న్యాయ్యము. అఱవములోని యీ మిశ్రాచ్చు సంస్కృతాకార జన్యమగుటచేతను, (సం-సీతా-తమి-సీతై.) 'ఆయ్' అనుదానికి మూలమగుటచేతను (రై+ఔ=రాయా) 'ఐ' కారమును బోలియుండుటచేతను నది "అయ్" అని (ai) యుచ్చరింపఁదగినదని భ్రమించుట కవకాశము కల్గుచున్నది. అది 'అ' వర్ణమునుండి వచ్చినదేయైనను దానియం దించుకేని 'అ' వర్ణోచ్చారణములేదు. ఈ మిశ్రాచ్చును వ్రాయుటలో గ్రంథాక్షరములందును మలయాళమునందును రెండు 'ఎ' కారములు చూపట్టు చున్నవి. గ్రంథాక్షర:—"కె=క. ఒకె=కె. ఒఒకె=కై.". ఆంధ్రకర్ణాటము లందును "ఎ+ఇ" అను లిపుల యేకీభావమె 'ఐ' అను పృథగక్షరముగ వ్రాయఁ బడును. (ఇ=ం+ఎ=ఐ). మఱియు మలయాళములోని ద్వితీయావిభక్తి యగు 'ఎ' అనుదానికి సరిగఁ దమిళమున "ఎయ్" అనునది ద్వితీయావిభక్తి యనఁ దగునుగాని 'ఐ' అనునది సరియై యుండదు. (మలయాళ ద్వితీయ-రామనె. తమిళ ద్వితీయ-రామనెయ్) ఇంతియకాక కన్నడములోని ప్రాతిపదికములయు, ధాత్వర్థ ములయు ననఁగా భావార్థకములయుఁ దుదినుండెడి 'ఎ' అనుదాని కఱవమున 'ఎయ్' అని యుండుట సరిపడునుగాని 'ఐ' అని యుండుట సరిపడదుగదా. (కన్న-తలె. 'తమి-తలెయ్.' అనఁదగును. 'తలై' అనఁదగదని భావము) ఇంతియకాక కుమారిలభట్టు "నడెయ్=(నడత)" అనుదానిని సంస్కృత లిపిని వ్రాయుటలో "ణే" (నడే) అని వ్రాసెనేకాని "ణై" (నడై) అని వ్రాయలేదు. బీమ్సు దొరగా రుత్తర హిందూస్థాన భాషల వ్యాకరణము వ్రాయుచు నందు సంస్కృతాకారము 'ఎ' కారముగా మాఱుట ద్రావిడభాషా సంప్రదాయమని వ్రాసి సంస్కృతాకార మఱవమున "ఎయ్" అని మాఱుట సుప్రసిద్ధమని వ్రాసిరి." (కాల్డు. ౧౩౩-౧౩౪ పుటలు).

విమర్శము:—కాల్డువెల్లుగారు పైని జూపిన వెల్ల హేత్వాభాసములు, ఒకటియు సద్ధేతువుకాదు. 'ఐ' కారము సహజముగ 'ఎ' అను పరిణామ మందుటచే మలయాళ ద్వితీయావిభక్తి 'ఎ' అని కావచ్చును. అట్లె కర్ణాట ప్రాతిపదికముల తుదిని 'ఎ' అనునది నిల్వవచ్చును. 'ఐ' కారము 'ఎ' కారముగఁ బరిణమించుట ప్రాకృతములందును గలదు.

"ఐ చ ఏజ్" (౧-౨-౧౦౧) ఐచః=ఐకా రౌకారి యోః, ఏజ్=ఏకారౌకారౌ యథాసంఖ్యం భవతః. ఐ—శైలః=సేలో, త్రైలోక్యమ్=తేల్లోకం, ఐరావణః=ఏరావణో, కైలాసః=కేలాసో,......" (త్రివిక్రమ ప్రాకృత శబ్దానుశాసనము ౪౯ పుట). 'ఐ' అనుదాని యుచ్చారణము 'అయ్' అను దానికభిన్నమగుటచేత నందలి తొలి ఖండమున 'అ' కారోచ్చారణము స్పష్టముగా వినఁబడుచుండ నం దవర్ణోచ్చారణ మించుకేని లేదని దొరగారు వచించుట కేవలము సాహసము. ఇంక భాషాంతర లిపులలోని పోలికలనుబట్టి తమిళ ధ్వనిని నిర్ణయించుట మఱియు నసంగత విషయము. ఐకారముయొక్క గ్రంథాక్షర లిపిలో రెండు 'ఎ' కార చిహ్నములుండుటచేఁ దమిళము నందలి 'ఐ' కారమును "ఎయ్" అని పల్కవలయుననుట పృష్ఠతాడ నన్యాయమును స్మరింపఁ జేయుచున్నది. మఱియు "ఎయ్" అనునది 'ఎ' కారద్వయోచ్చారణము కలది కాదుగదా. దేవనాగర లిపిలోని 'ఐ' కారము రెండు 'ఏ' కారముల రూపమున నుండుటచేత (कै=కై) గ్రంథక్షర లిపిలో నయిత మట్టి లిపి యేర్పడియుండును. దీనినిబట్టి సంస్కృతమందలి 'ఐ' కారమును సైతము "ఎయ్" అని పల్కవలయునని వాదింతురు కాఁబోలును. పైరీతినే యాంధ్ర కర్ణాటముల "ఐ" కార లిపిలో "ఎ+ఇ" అను లిపుల మేళనమున్నది గానఁ దమిళమందలి 'ఐ' కారమును "ఎయ్" అని పల్కవలయు ననుటయుఁ బైరీతినె పృష్ఠతాడ నన్యాయమును స్మరింపఁ జేయుచున్నది. ఆంధ్ర కర్ణాటములలోని 'ఐ' కారమునకు "ఎయ్" అను నుచ్చారణము గలదని దొరగారు చెప్ప సాహసింపరుగదా. తెల్గునందలి 'ఐ' కారము "వాయి రవు ర్వక్రతమా" అను చింతామణి చొప్పున 'అయి' అనుదాని కభిన్నమనుటలో విప్రతిపత్తి లేదుగదా. కుమారిల భట్టుగారి వ్రాఁతలో 'నెై' అనుచో నొక 'ఎ' అనునది చేతిప్రమాదమునఁ బోయి యుండఁ గూడదా! ఆతఁడును 'నడెయ్' అని వ్రాయలేదు గదా. బీమ్సుదొరగారు మున్నగు వారిని బ్రమాణీకరించుటకన్నఁ దమిళ వ్యాకర్తయుఁ గేవల ప్రాచీనుఁడును బరమ ప్రామాణికుఁడును నగు తొల్కాప్పియరుగారిని బ్రమాణీకరించుట యుక్తము కాదా!

"అకర ఇకరమ్......" (తొల్కా. ౫౪ సూ.)=అకారమును 'ఇ' కారమునుగూడి 'ఐ' కారమగును.

"అకర ముకరమ్......" (తొల్కా. ౫౫ సూ.)=అకారమును 'ఉ' కారమును గలిసి "ఔ" కారమగును.

"అకర త్తిమ్బర్......" (తొల్కా. ౫౬ సూ.)=అకారమునకుఁ దర్వాత నిల్చిన యకారపు పొల్లును గలిపినది 'ఐ' కారమగును.

"ఇకర యకరమ్......" (తొల్కా. ౫౮ సూ.)=తమిళ శబ్దాంత మందలి యకారప్రపోల్లు 'ఇ' కారమున కభిన్నమై యుండును. ఉదా:— నాయ్=నాఇ=(కుక్క) మొ.

పయిరీతినున్న తొల్కాప్పియ సూత్రముల జిత్తగించియున్నచో దొరగార్లు పయిరీతిగల యపసిద్ధాంతములను జేయ సాహసింతురా?

మఱియు వెనుక నుదాహరించిన రీతిని "ఐ" కారమునకుఁ గల్గు "ఎ" కారరూప పరిణామము 'ఊనిక'గల తమిళ పదాదిని గల్గనేరకున్నను దమిళ పదాంతమున నద్దాని ఛాయగలదనియుఁ దొల్కాప్పియరు సూత్రించిరి.

"ఓరళవు......" (తొల్కా. ౫౭ సూ.)=శబ్దములలోని 'ఐ' కార మేక మాత్రాకముగా నుండు చోటులును గలవు. ఇట్లనుటచేత నిట్టిస్థితి క్వాచిత్క మని విశదమగుచున్నది. ఇట్టి స్థితి పదాదీతరస్థలములందే కల్గునని వ్యాఖ్యాతలు వ్రాసిరి. ఉదా:—"ఇడై (డై) యన్" అనుదానిని "ఇడె (డె) యన్" (గొల్లవాఁడు) అని యుచ్చరింపనగును. 'తవళై' అనుదానిని 'తవళె'=(కప్ప) అనురీతి నుచ్చరింపనగును. సూత్రమున నేక మాత్రగా వినఁబడు ననుట చేతఁ గన్నడమందలి 'ఎ' కారస్థితియెకాక యాంధ్ర మలయాళములందలి 'అ' కార స్థితియు దాని కభిన్నమెయని విశదమగుచున్నది. ఉదా:—తమి: తలై - మల- తెల్గు-తల-కన్న-తలె. మొ.

తుదికిఁ బండిత వ్యవహార భాషకును గాల్డువెల్లుగారి వ్రాఁత విరుద్ధముగనే యున్నది. చెన్నపురి విశ్వవిద్యాలయమునందలి ప్రాచ్యభాషా పరిశోధక సభ్యులలోఁ దమిళ భాషోపన్యాసకులయియుండి విశ్రాంతి గైకొన్న విద్వాన్. శ్రీ. వే. వేంకటరాజులు రెడ్డిగారీ క్రిందిరీతి నీ విషయమున వ్రాసిరి. "అఱివ పండితు లెవ్వరును 'ఐ' కారమును 'ఎ ఇ=ఎయ్' అను రీతిని బలుకరు. 'అ ఇ' అను రీతినే పలుకుదురు. ఇపుడు పదమధ్యమున 'అ' కారముగానే తఱుచుగాఁ బల్కుదురు. పదాంతమందు మాత్రమె 'ఎ' కారచ్ఛాయగ వినఁబడును." (శ్రీ. వే. వేంకటరాజులు రెడ్డిగారి జాబు ౧౮-౧౧-౧౯౫౧).

కాల్డువెల్లుగారు స్థలాంతరమునందును బై యపసిద్ధాంతమునె యీ క్రిందిరీతిని వ్రాసిరి.

"ఐ అనుచో 'ఎ ఇ' అను రీతిని బలుకవలెను. అంతియకాని 'అ ఇ' అను రీతిని బల్కరాదు. మూలభూత ప్రాచీన ద్రావిడభాషలోని 'అ' కారము 'ఎ' కారమై కాలక్రమమున "ఎ ఇ=ఎయ్" అనునదిగాఁ దమిళమునందు మాఱినది. ('ఎ' అనునది "ఎ ఇ=ఎయ్" అని పరిణమించెననుట స్వభావ విరుద్ధము). ఉదా:— తెల్గు-మల-తల. తమి-తలెఇ=తలెయ్. కన్న-తలె. మలయాళ

ములోని యిచటి 'అ' కారము శుద్ధమైనది కాదనియు "ఎఴు" అనుదాని మాఱురూపమనియు డా. గుండర్టు దొరగారు వ్రాసిరి. కావుననె మలయాళమునఁ జతుర్థీ విభక్తిలో 'ఎ' కారము వినఁబడును గాని 'అ' కారము వినఁబడదు" (కాల్డు. ౧౩౬ పుట).

పై విషయములెల్లఁ బయిని సయుక్తికముగ నిరసింపఁబడియె యున్నవి. ఇందలి క్రొత్త విషయము—"మలయాళమునఁ జతుర్థీ విభక్తి 'ఎ' కారము—" అనునది. తమిళ ద్వితీయా విభక్తి 'ఐ' అనునది. దాని పరిణామమగు 'ఎ' అనునది మలయాళద్వితీయా విభక్తి. ఇది చతుర్థీ విభక్తి యనుట తప్పు.

"ఐ ఒడు......" (తొల్కా. ౧౧౪ సూ.)=తమిళమున 'ఐ' అనునది ద్వితీయా విభక్తి. ఒటు (డు) తృతీయా విభక్తి. కు-చతుర్థీ విభక్తి. ఇన్-పంచమీ విభక్తి. అతు (దు) షష్ఠీ విభక్తి. కణ్-సప్తమీ విభక్తి. "పేర్-ఎ-ఓడ్-కు-నిన్ఱు-ఉడె-ఇల్-విళి ఇత్యష్టకమ్". (లీలాతిలకము మలయాళ వ్యాకరణము-ద్వితీయ శిల్పము. ౧౧ సూ.) పేర్=ప్రాతిపదికమె ప్రథమా విభక్తి. 'ఎ' అనునది ద్వితీయా విభక్తి. ఓడ్-తృతీయా విభక్తి. కు. చతుర్థీ విభక్తి. నిన్ఱు-పంచమీ విభక్తి. ఉడె-షష్ఠీ విభక్తి. ఇల్-సప్తమీ విభక్తి. 'విళి'-అనఁగా సంబోధనము.

౧౦. III విష:—"ద్రావిడ ప్రకృతులు:—తెలుఁగు ప్రకృతులు సాధారణముగా నజంతములయి యుండును. సంస్కృతమునుండి హలంతములు తెల్గులోనికి వచ్చునపు డా తుదిహల్లుమీఁద 'ఉ' కారము చేరును. ఆ హల్లు హ్రస్వ పూర్వకమగునేని ద్విత్వము నిత్యముగా నగును. ఉదా:—సం-మరుత్-తె-మరుత్తు. దీర్ఘపూర్వకత్వమున-సం-వాక్-తె-వాక్కు-వాకు. మొ. వనమ్-ధనమ్ మున్నగునవి సంస్కృత సమములుగాఁ దెల్గులోనికి వచ్చునపుడు ద్విత్వమురాకయె 'వనము-ధనము' మున్నగు రీతిని రూపము తేర్పడును. తమిళమున సంస్కృత భవములలో నీ ద్విత్వోత్వములు గలవు. ఉదా:—సం-పక్వమ్-తమి-పక్కువమ్. మొ. మూలద్రావిడ ప్రకృతులు హలంతములు తెల్గునకు వచ్చునపుడు వాని తుదిహల్లుపైని దఱచుగా నుచ్చారణ సౌకర్యార్థముగ 'ఉ' కారము చేరును. ఉదా:—అఱ్=అఱు. తిన్=తిను. వీల్=వీడు. మొ. ఇట్టియెడల హ్రస్వపూర్వకత్వమందును హల్లునకు ద్విత్వములేదు.

తమిళ కన్నడములలోని ప్రకృతులు పెక్కు హలంతములుగానె నిల్చి యున్నవి. ఉదా:—నిల్-(నిలుచు) చొల్=(చెప్పు) ఉణ్=(భుజించు.) తిన్=(తిను). మొ. కొన్నియెడల నిట్టి హలంత ప్రాచీనతమ ప్రకృతుల పయి నుచ్చారణ సౌకర్యార్థముగా 'ఉ' కారము తఱచుగాను 'అ' కారాదు లరుదుగాను నిలుచుటయుఁ గలదు. పరుషాంత ప్రకృతులపైని 'ఉ' కారమె నిల్చును.

అట్టియెడలఁ బ్రాచీన స్థితిలో ద్విత్వము కన్పట్టదు. ఉదా:—తమి-విట్=విటు=విడు=(విడుచు) ఆట్=ఆటు=(ఉపశమిల్లు) మట్=మటు=మడు=(సరస్సు-చిఱియూట) కాత్=కాతు=కాదు=(చెవి). కొన్నియెడలఁ దుదిహల్లు ద్విత్వమునందును. ఉదా:—పుట్=పుట్టు=పుట్టు (వల్మీకము=పుట్ట). అకారాంతములు:—కల=(చేరు) తెలి=(తెలచు). కఱి=(పాలు పిదుకు). పరుషాంతములపైని 'ఉ' కారమె నిల్చును:—కొక్కు=(కొంగ) నఞ్చు=(విషము) నణ్డు=(తుమ్మెద). అమ్పు=(బాణము) పుట్టు=పుట్టు=(పుట్ట) నాడు=(దేశము). వీడు=(ఇల్లు) చూడు=(వేడిమి) ఆఱు=(షట్సంఖ్య). యాఱు=(నది). ఇట్టియేకాచ్క- దీర్ఘ పూర్వక పరుషస్థలములు పొట్టి 'ఉ' కారము (కుఱ్ఱి (ట్రి) యలుకరము) లనఁబడును. అనేకాచ్కములలో సైతము స్వరపూర్వకములును 'ఆయ్‌త' (ద) పూర్వకములును బొట్టి 'ఉ' కారములె యనఁబడును. పొట్టి 'ఉ' కారమనఁగా నర్ధ మాత్రాకమగు 'ఉ' కారము. ఈ యర్ధ మాత్రికముల వివరణము తొల్కాప్పియమున ౪౦౭ సూత్రము మొదలుగ నొక ప్రకరణముగ నున్నది.

ప్రాచీన కర్ణాటమునందును బ్రకృతుల తుదిని 'ఉ' కారము చేరెడి తమిళపద్ధతి విస్తరిల్లి యున్నది. ఇంకొక విశేషము. అకారాంత శబ్దములకుఁ బరమందు 'ఉ' కారము నిల్చుటయు నచటి స్వరసంహితలో వకారము చేరుటయుఁ గలదు. ఉదా:—తమి-చిల=(స్వల్పము) కన్న-చిల+వ్+ఉ=చిలవు. తమి-పల=(అనేకము) కన్న-పల+వ్+ఉ=పలవు. మొ.

అర్వాచీన కన్నడములవారు శబ్దముల తుదినుండు పరుషములను ల కారమును 'ఉ' కార సహాయములేక పలుకలేరు. కాన నట్టియెడల 'ఉ' కారమును జేర్చియే పల్కుదురు. ఉచ్చారణార్థము వచ్చిన యీ 'ఉ' కారము హ్రస్వమగుటయే కాక యర్ధ మాత్రా కాలిక మనియు వైయాకరణులు చెప్పెదరు." (కాల్డు. ౧౩౪ పుట).

విమర్శము:—ఎల్లయెడలను ల కారముపై నుచ్చారణార్థముగ 'ఉ' కారము చేరు ననరాదు. ఉదా:—పాల్=(చెడు) మొ. ఉచ్చారణార్థము చేరిన 'ఉ' కారములెల్ల నర్ధ మాత్రాకాలికము లనుటయు సరికాదు. ల కారాదుల మీఁద నిల్చు నుచ్చారణార్థక మనుచున్న 'ఉ' కార మర్ధ మాత్రికమని చెప్పుట నిర్మూలము. సంప్రదాయ విరుద్ధము. ఉదా:—ఏఱు (సప్తసంఖ్య). ఇంకఁ బరుషములమీఁద నిల్చిన 'ఉ' కారములును ననేకము లర్ధ మాత్రికములు కావు. (చూ. తొల్కా. ౪౦౭ సూ. మొ. ౯ ప్రకరణము) "పడు" (పొందు) మున్నగువాని తుది 'ఉ' కారము పొట్టి 'ఉ' కారము కాదు. కర్ణాట భాషలోనర్ధ

మాత్రాకమగు పొట్టి 'ఉ' కారమే లేదు. అట్టిది తమిళమందు మాత్రమె కలదు.

తమిళమునఁ బొట్టి 'ఉ' కారముపైని గుర్తుగా నొక బొట్టు నిల్పుదురు. మలయాళమున నర్ధచంద్రాకారపు గుర్తును నిల్పుదురు. ఉత్తరమలయాళము వా రుచ్చారణార్థకముగఁ జేరునది 'ఉ' కారము కాదనియు నది 'అ' కారమనియుఁ జెప్పుదురు. దానిని 'అ' వర్ణముగానె యుచ్చరింతురు. అట్టి 'అ' కారము మీఁదనె యుచ్చారణార్థకతా చిహ్నమును (అర్ధచంద్రాకారపు గుఱుతు) నిల్పుదురు. ఉచ్చారణార్థముగ నిట్లు శబ్దము తుదిని 'ఉ' కారము లేదా 'అ' కారము చేరెడి స్వభావ మిండో యూరపియను భాషలకు లేదు.

౧౮. IV విష:—"ఎ-ఏ-ఒ-ఓ-లు:—ద్రావిడభాషలలో హ్రస్వ వక్రముల వాడుక యధికము. వీనికిఁ గొన్ని ద్రావిడభాషలలో లిపియుఁ గలదు. సంస్కృతభాషలో హ్రస్వ వక్రములు లేవు......కాన ద్రావిడభాషలకు సంస్కృతముతో నెట్టి సంబంధమును లేదని తేలుచున్నది." (కాల్డు. ౧౩౫ పుట).

విమర్శము:—ద్రావిడభాషలలోఁ గొన్నిటియందు మాత్రమె హ్రస్వ వక్రములకు (ఎ-ఒ) లిపి యున్నదన నేల? తమిళ మలయాళాంధ్ర కర్ణాటములు నాల్గిఁటియందును వీనికి లిపి గలదని యీవఱకుఁ జూపియె యున్నాను. (చూడు ౧౬ III విష. ౧౭ V విష).

ద్రావిడభాషలయందువలెఁ బ్రచురముగా లేకున్నను నార్యభాషలందును హ్రస్వ వక్రములు లేకపోలేదు. వైదిక సంస్కృతమున హ్రస్వ వక్రములు గలవనుటకుఁ బ్రమాణములు గలవు. (చూ. నారచించిన వైయాకరణ పారిజాతము ౨౧౦ విష).

"సపూర్వ స్యార్ధసమ మేకేషామ్" (తైత్తిరీయ ప్రాతిశాఖ్యము. ౧౧ అధ్యా. ౧౯ సూ.) దీని వైదికాభరణ వ్యాఖ్య:—"యోయ మకారః ఏకారౌకార పూర్వో న లుప్యతే సఖలు స్వస్మాత్ పూర్వస్య వర్ణస్యార్ధేన సదృశం రూప ముపగచ్ఛతి".

ఏ-ఓ లకుఁ బరమగు 'అ' కారములు లోపింపనపు డయ్యవి స్వపూర్వస్థములగు 'ఏ-ఓ' లలో సగమనఁగా మాత్రారూపము గలవి యనఁగా హ్రస్వరూపముగలవై నిల్చునని యర్థము. ఉదా:—"సుజాతే + అశ్వ సూనృతే= సుజాతే ఎశ్వ సూనృతే. అధ్వర్యో+అద్రిభి స్సుతమ్.=అధ్వర్యో ఒద్రిభి స్సుతమ్." ఈ యుదాహృతులు శ్రుతివాక్యములు. ఈ విషయమె మహాభాష్యోద్యోతములందు సైత ముదాహరింపఁబడెను.

హ్రస్వ వక్రములు ప్రాకృతభాషలందును గలవు. "అత్రశాస్త్రే ఏదోతోః క్వచిత్ స్వరూపేణైవ హ్రస్వ ఇతి త్రివిక్రమదేవే నోక్తత్వా దత్ర స్వరూప హ్రస్వాఙ్గీకారాత్. ఎక్కో-ఎకట్లో-ఇత్యుపపన్నః ప్రయోగః." (షడ్భాషా చంద్రిక. ౨౨ పుట).

"సంయోగే" (౧-౨-౪౦) "(వృత్తిః) సంయోగే పరే పూర్వస్య స్వరస్య హ్రస్వో భవతి......ఏదోతోః క్వచిత్ స్వరూపేణైవ హ్రస్వః. ఏకః=ఎక్కో. సేవా = సెవ్వా. నేడమ్ = నెడ్డం. గ్రాహ్యామ్ = గెజ్ఝం. శ్లోకమ్=ఖొక్కం. ఇత్యాది" (త్రివిక్రమప్రాకృత శబ్దానుశాసనము. ౧ అధ్యా. ౨ పాదము. ౪౦ సూ).

మఱియు నింతమాత్రము భాషాకుటుంబ నిర్ణయమును జేయఁగల్గునా? ద్రావిడభాషలలో నొకటలేని యక్షరము వేఱొకట వెలయుచుండలేదా?

"ఔకారము:—......అఱవములోనే కాక యే ద్రావిడభాషయందును దీని యుచ్చారణము లేదు. సంస్కృతములో నుండుటచేత దీని లిపిని ద్రావిడులు తీసికొనిరి. ఇది ద్రావిడభాషలలోనికి వచ్చిన సంస్కృతపదములందు మాత్రమె కన్పట్టుచున్నది. అట్టి పదములలోఁ దఱుచుగా దీనిని 'అవు' అనురీతినె పల్కుదురు. ఉదా:—సం-సౌఖ్యమ్-తమి-చవుక్కియమ్." (కాల్డు. ౧౩౬ పుట).

విమర్శము:—కాల్డువెల్లుగారు ద్రావిడభాషలన్నిటియందును "ఐ-ఔ" ల ధ్వనిలేదని వ్రాయుట సరికాదు. తెలుఁగున "ఐ-ఔ" ల ధ్వనులు స్పష్టముగా సంస్కృత ధ్వనులవంటివే విస్తరిల్లియున్నవి. అవి వైకల్పికముగా 'అయి-అవు' అనురూపమునందునని నన్నయభట్టు. "వాయి రవు ర్వక్రతమా" అని సూత్రించి యున్నాఁడు. (చూ. వ్యా. సం. ౩౪౩ విష.) మఱియు నీ క్రింది ప్రాసస్థలముల యందు వీని ధ్వనులను ప్రాచీనాంధ్ర మహాకవులు ప్రయోగించియున్నారు.

క. ఏయది హృద్య మపూర్వం। బే యది యెద్దాని వినిన నెఱుక సమగ్రం। <u>బై యుండు</u> నఘ నిబర్హణ। మే యది యక్కథయ వినఁగ నిష్టము మాకున్ (ఆది. ౧ ఆ. ౩౦ ప.) (నన్నయభట్టారకుని ప్రయోగము).

ఉ. క్రౌఁగిటి కాసఁ జేసి నొడికారితనంబున నిన్నుఁ దేల్చిరా। రాఁగొఱగాని వాఁడవయి......(ఉ. హరి. ౧ ఆ. ౬౪ ప).

౧ూ. V విష:—"తక్కిన ద్రావిడభాషలకన్న నఱవమున వింత మార్పు లగపడుచున్నవి. "అ-ఐ" అను నచ్చులతోఁ గూడిన హల్లు పరమగునపుడు పూర్వస్థితములగు "ఇ-ఈ-ఎ-ఏ-ఉ" అను నచ్చులు ద్వంద్వాచ్చులుగా (Diphthong) వినఁబడును."

I. 'ట్-ణ్-ర్-ఱ్-ఴ్-ల్-ళ్' అనునవి. 'అ-ఐ' అనువానిలో దేనితో నైనఁ గూడి పరమందుండఁగాఁ బూర్వస్థితమగు 'ఇ' అనునది 'ఎ' కారముగా వినఁబడును.

II. ఇట్టియెడలఁ బూర్వస్థితమగు 'ఈ' కారము 'ఉ' కారముతో మిశ్ర ణము గల్గి వినఁబడును.

III. ఇట్టియెడల 'ఎ' కారమునకు ద్విత్వపూర్వస్థితియందలి యొత్తిడి వంటి యొత్తిడి కల్గును. ఏకార మిట్టియెడల 'ఓ' కారమువంటి యుచ్చారణము నొందును.

IV. అసంయుక్త హల్లుపయిని 'అ-ఆ-ఐ-ఓ-ఔ' అనునవి నిల్చి యుండఁగాఁ బూర్వస్థితమగు 'ఉ' కారము 'ఒ' కారమువలె వినఁబడును.

V. ఏ కారము 'ఓ' కారమగుట తుళుభాషయందు విస్తరిల్లి యున్నది. ఉదా:—తమి-వేణ్డుమ్=(వేఁడుము) తుళు-బోడ్. తమి-వెళ్ళి-(వెండి)=తుళు-బొళ్ళి." (కాల్డు. ౧౩౬-౧౩౭ పుటలు).

"పయి మార్పులు పరస్థిత హల్లులవల్లనే కాక ద్రావిడభాషలకు సహజ మైన స్వరశక్తి (Vowel harmony) మూలముననుగల్గెననఁ దగును......" (కాల్డు. ౧౩౭ పుట).

<u>విమర్శము</u>:—పయి వానిలో మొదటి నాల్గు సూత్రములకును గాల్డువెల్లు గా రుదాహృతుల నీయలేదు. ఉదా:—I. ఇ:—తమి-ఇడమ్=ఎడమ్=(చోటు). ఇణై=ఎణై=(జంట). ఇరై=ఎరై=(పక్ష్యాదుల తిండి) ఇఱై=ఎఱై=(చల్లు). ఇழై=ఎழై=(నూలుపోగు). ఇలై=ఎలై=(ఆకు). ఇళనీర్=ఎళనీర్=(నారికేళజలము).

II. ఈ:—తమి-పీడమ్=పూడమ్=(దేవతా పీఠము). తిరునీఱు=తిరునూఱు=(శ్రీభస్మము=విభూతి).

III. ఎ-ఏ:—ఇట్టి లక్ష్యములు కన్పట్టలేదు.

IV. ఉ:—ఉఱఙ్గు=ఒఱఙ్గు. (నిద్రించు.). ఉడై=ఒడై=(పగులఁ గొట్టు). ఉడల్=ఒడల్=(శరీరము=ఒడలు). కులై=కొలై=(గెల=గొల) కుళమ్=కొళమ్=(సరస్సు=కొలను).

పయి మార్పులెల్ల శాస్త్రీయములుగా డా. కాల్డువెల్లుగా రుదాహ రించుట సరికాదు. ఇట్టి యపభ్రంశములొక్క తమిళమందే కాక యెల్ల భాషలందును నథముల యుచ్చారణమునఁ గల్గుచుండును. ఈ విషయమున విద్వాన్. శ్రీ. వే. వేంకటరాజులు రెడ్డిగారీ క్రింది రీతిని వచించిరి "ఇట్టి

మార్పులు గ్రాంథిక తమిళమున నెంతమాత్రమును లేవు. అరుదుగ నెచటనేని యున్నను నవి తప్పులుగాఁ దమిళులచే భావింపఁబడును. పండితజన వ్యవహారమున నయిత మీ మార్పు లనేకములు లేవు. "ఇకార మెకారమగుట-ఉకార మొకార మగుట" అరుదుగాఁ గలవు. ఇంక నీ మార్పు లధమజాతుల వాడుకలలో వినఁబడుచున్నవి. అధముల వాడుకలలో సైతము III మార్పు—ఎకారమున కొత్తిడి గల్గుటయు 'ఏ' కారము 'ఓ' కారమగుటయు నేనువినలేదు. ఇట్టి మార్పులనే శాస్త్రీయములుగాఁ జెప్పఁబూనినచో ననంతములున్నవి. ఈ మార్పులు నేడు వైరీతినున్నను బ్రాచీనకాలమం దివి యిట్లున్నవనుట విశ్వసనీయము కాదు గదా." (విద్వాన్. వే. వేంకటరాజులు రెడ్డిగారు).

" 'ఉర' (తుమ్ ప్రత్యయార్థకము) అనుదానిని 'ఒర' అని యుచ్చరింపవలయును. "ఉరు" అనుదానిని 'ఒరు' అని యుచ్చరింపరాదు. పదాంతమందుండు 'న్-ణ్-ర్-ఴ్-ల్-ళ్' అను వ్యంజనములకుఁ బూర్వస్థితమగు 'అ' కారమునకు 'ఎ' కారమువంటి యుచ్చారణము గల్గును. ఉదా:—"అవర్"=(వారు) అనునది 'అవెర్' అని యుచ్చరింపఁబడును. ఇట్టి మార్పు సంస్కృతాది భాషా కుటుంబమందును గనఁబడుచున్నది." (కాల్డు. ౧౩౭ పుట).

విమర్శము:—ఈ విషయమున శ్రీ. విద్వాన్. వే. వేంకటరాజులు రెడ్డిగారీ క్రిందిరీతిని వచించిరి. " 'ఉర' అను తుమర్థక ప్రత్యయము తమిళమున లేదు. 'ఉఱు' ధాతు తుమర్థకరూపము "ఉఱ"=(లభించుటకు=మిక్కిలి యగుటకు) అనుపదము ఱకార ఘటితము గలదు. " 'ఴ్' అనునది పదాంతమందుఁ గలదు" అను దొరగారి మాట యశాస్త్రీయము. ఱకార వ్యంజనము పదాంతమున నెంతమాత్రమును నుండదు (చూ. ౧౭ VI విమ.). 'అవెర్' అను 'ఎ' త్వఘటితోచ్చారణమును నేనెచ్చటను వినలేదు. ఇట్టి యుచ్చారణము గ్రాంథికభాషలోనే కాక నాగరక జనవ్యవహారమునందును నెంతమాత్రమును లేదు." (విద్వాన్. వే. వేంకటరాజులు రెడ్డిగారు).

అసంస్కారులగు ననాగరకుల భాషలోని యనంతములగు నిట్టి యపభ్రంశములను శబ్దతత్త్వ శాస్త్రసమ్మతములనుచుఁ బయిరీతిని వ్రాయుటయు నట్టి యపభ్రంశభాషయె ప్రాచీన తమకాలమునందును నట్లె యుండెడిదనుటయు నట్టి యపభ్రంశభాషలు ప్రాచీన తమ భాషాస్వరూపమును సంరక్షించి దాఁచి పెట్టుచున్నవనియుఁ (చూడుఁ. స్టడీ. ద్రవి. ౭౧ పుట) దలంచుట కేవలము పొరపాటు.

౧౮. VI విమ:—ప్రాచీన శాసనములు ప్రాచీనభాషా స్వరూపమును గ్రహించుటకుఁ బ్రమాణములని యంగీకరింపక తీరకున్నను నవియు యథాస్థిత

ముగఁ బ్రమాణీకరింపఁదగినవి కావు. శాసనలేఖకు లెల్లఁ బండితులు కామిం జేసి వానిలోఁ గొన్ని యపభ్రంశములు ప్రవేశించును. మఱియు శాసనములు చెక్కుటలోఁ గొన్ని తప్పులు గల్గును. అట్టి శాసనములను జదువుటలోఁ బ్రాచీన భాషాస్వరూపము ప్రాచీన లిపియుఁ దెలియమింజేసి కొన్ని తప్పులు గల్గును. శాసన రచయితయొక్క సంస్కార రాహిత్యమునఁ గొన్ని తప్పులు సంభవించును. కాఁబట్టి ప్రాచీనాంధ్ర శాసనములును యథాస్థితముగాఁ బ్రాచీన భాషా విషయమునఁ బ్రామాణికములు కాఁజాలవు. నన్నయ నాఁడు భాషా సంస్కారము జరిగినను నన్నయకుఁ దర్వాతి శాసనములు సయితము తప్పులతో నిండియుండుటయె పయి విషయములకుఁ బ్రబలనిదర్శన మనఁదగును.

నన్నయకుఁ బూర్వపుఁ దెనుఁగుభాషయొక్క స్వరూపమును నిరూపించుటకు నేఁటి విమర్శకులు కొందఱు ప్రాచీనాంధ్ర శాసనముల నుదాహరించి విమర్శించిరి. ఆ సందర్భ మిటఁ గొంత చూపఁబడుచున్నది.

(౨):—నవీనభాషలో 'న' కారమున్నయెడల 'ణ' కారమును 'ల' కారమున్నచోట 'ళ' కారమును మిక్కిలి ప్రచురముగాఁ (ప్రాచీన శాసనములలో) గనుపట్టును. ఈ పదములలో ననేకములు నేఁటికింకను ఇతర ద్రావిడభాషలగు తమిళ కర్ణాటములలో "ణ-ళ"లతోనె యున్నవి. తెనుఁగున మాత్ర మవి "న-ల" లుగా మారినవి......సంస్కృత పదములలో 'ణ' కారము ఉండవలసినచోట నియమితముగా నకారమే వ్రాసిన ప్రదేశము లనేకములు గలవు.......(౩):......నేఁడు లఘు రేఫములుగా వాడుకలోనున్న పదము లనేకములు శకటరేఫములున్నవిగానే కనుపట్టుచున్నవి. ఇంతియకాక నేఁడు శకట రేఫము సంయుక్తాక్షరములలో మీఁదనుగాని క్రిందనుగాని వ్రాయుట లేదు. కాని యీ కాలమున ననేకములయిన స్థలములలో నీ శకటరేఫమే సంయుక్తాక్షరములలో వాడఁబడుచున్నది.......

(౪):—నేఁడు మనము పూర్ణబిందువు వ్రాయుస్థలములందు సాధారణముగా వర్గపంచమాక్షరముతోఁ గూడిన సంయుక్తాక్షరములు వ్రాయఁబడుచుండినవి.......

(౫):—రేఫము క్రింద మనము వేఱొక జడ్డను వ్రాయుట కలదు. నాఁడారీతిగాక వలపలగిలక వ్రాయఁబడుచుండెను.......అట్టి వలపలగిలక యున్నచోట్లఁ బూర్వాక్షరమునకు ద్విత్వము వ్రాయుట కలదు.

(౬):—ఆ కాలమందలి రచనలలో ననేకములైన పొరపాట్లున్నట్టు లీకాలపు వారికిఁ గనుపట్టుచుండును. నేఁడు దీర్ఘములుండవలసిన చోట్ల హ్రస్వములును

పరుషములుండవలసిన చోట్ల సరళములును 'శ-ష-స' లొకదాని కొకటి మాఱు పాటును మిక్కిలి సాధారణముగాఁ గనుపట్టుచునే యుండును......పయి రూపములలోని తబ్బిబ్బులు తత్సమములయందును (నరాళోక-కళలెని-గొణి-మొ) దేశ్యములందును గూడఁ గన్పట్టుచున్నవి......భాష స్థిరపడలేదు. (భిన్న భిన్నమండలములలో) భిన్న భిన్నములుగా నుచ్చారణ యుండెడిది. ఉచ్చారణము వ్యక్తులను బట్టి కూడ మాఱుచుండు ననక తప్పదు. ఎవ్వరి యుచ్చారణ వారికే ప్రమాణమై యుండనోపు. ఇంకొక విశేష మేమనఁగా నుచ్చారణ మాత్రము ననుసరించి వ్రాయుటయుఁ బ్రాథమికావస్థలోఁ జాల కష్టమైన కార్యమనియే యెఱుంగునది. సాక్షి యను పదము సంస్కృతము. శాసనములలో 'సక్షి' అని వ్రాయఁబడుచున్నది......కోశవ్యాకరణములు సారస్వతమునందలి యుత్తమకవి ప్రయోగములు, దిద్దుబాటులకుఁ బ్రమాణము లగుచున్నపుడును నీ తప్పు నివారింపఁబడును. కాని లేకున్న 'సాక్షియో? సక్షియో? యెఱుంగ వీలులేదు. ఇట్లే తక్కిన వ్రాఁతలన్నియు వచ్చినవని యూహించుట సులభము......ఆ కాలమందలి స్థితి నూహించుకొనుటకు నేఁటి వ్యావహారిక భాషా వాదులమని చెప్పుకొనువారి వ్రాఁతలు మిక్కిలి సహకారులు. "వచ్చుతున్నది - వస్తుంది - వస్తూంది - వస్తోంది - ఒస్తోంది - ఒస్తూ ఉన్నది. ఒస్తూన్నది. ఒస్తూంది - వస్తాఉంది - వస్తావున్నది. వేయడము-వేయటము - వేయటం - వెయ్యటం - వయ్యటం - వెయ్యడము - వెయ్యటము - వయటము-వెట్టము" అనునట్లింకను భిన్నరూపములతోఁ గూడిన యుచ్చారణ ములు గనుపట్టుచునే యున్నవి......నేఁటి వలెనె నాఁడును నుచ్చారణమున నిట్టిరూప వైవిధ్యము కల్గియుండనోపును......" (ఆం-భా-వి. ౯౩ మొ. ౯౭-వ. పుటలు).

౧౫. VII. విష:—పయి విషయములకు మాదిరిగా నిచటఁగొన్ని ప్రాచీనత మాంధ్రశాసనములు చూపఁబడుచున్నవి. (చూడు. ఆంధ్రభాషా వికాసము ౧౦౦ పుట మొదలు).

౧:—శాసనము-నెం. ౫౮౪. దక్షిణ హిందూదేశ శాసనములు. సంపు టము VI. పుట ౨౦౫. కాలము సుమారు. క్రీ. శ. ౬౪౧.

స్వస్తి శ్రీమత్ సకల లోకాశ్రయ జయసింఘ మహారాజు లాకున్ ప్రవర్ధమాన విజయరాజ్య సంవత్సరంబుల్ ఎణుంబాది అన్నేణ్టి. అమ్మ పుణ్ణమనాణ్డుం ణ్లావిండి రాజుల ముట్ము కలిముడిరాజుల్ ణ్లావిండి సముద్ర రంబునాకు బణిసేసిన కల్చి వీఱురుట్ల మద్దికదు, మూటికి విత్స ట్రి ఉత్తరంబున పులొంబున చెఱువు పడుమారికోటన్ ఎణుంబాది పుట్ము అఱ్లిపట్టిసేను.

తూర్పుర్గాన కోటితాలుతోంటళాయపడు వారంబు ఇచ్చిరి. పాలపడు వారంబు ప్లావిండీశ్వరంబున కళాకణ్ణుగు మిచ్చి కుడుచువారు.

౨:— పయి శాసనముకంటెను బ్రాచీనమని శ్రీ. మ. సో. శర్మగారు (౧౯౪౧. ౧౯౪౨) వృష సంవత్సరాది సంచికలోఁ బ్రకటించినది.

(౧) స్వస్తిశ్రీ సోట మహారాజు ల్లొళన ఇన్ములోలి అణపోతులు రేవణ కాలు పుద్దణకాలు ఇచ్చిన పన్నస. పెన్పాటె ఇ శెజేనికిన్ తేనిటిచ్చిన వాన్తు పఞ్చ మహాపాత కున్దకున్.

(౨) మణయ శమ్మణ గణయ శమ్మణ వృద్ధశమ్మణ ఇముప్వుర ఒకాడు బోళచేత శవణగొణిరి.॥ ఇజ్జకావెలుగువారు సమతిబోళుము విసబోళుము పణ్డిముకున రట్టోల్లు పుణ్యాసాల్లు వన్నిబోళుము ఇన్ద్రొఱుదినికి సక్షి॥ అళుగరాల న్వారు విషయబోళకొణిరి.

౩:—[కృష్ణాజిల్లా దివి తాలూకా లక్ష్మీపురమను గ్రామమున నొక బ్రాహ్మణుని యింటిదొడ్డిలో నున్నది. మూఁడవ విష్ణువర్ధనుని తండ్రియగు మంగిదొగరాజు. క్రీ. శ. ౬౭౫ నుండి ౬౯౯ వఱకును రాజ్యమేలెను. ఇది యాతని కాలములోనిది]

ఇది వేటూరి ప్రభాకర శాస్త్రిగారిచేఁ బ్రాచీనాంధ్రశాసనము లను పేరను భారతిలోఁ బ్రచురింపఁబడినది.

స్వస్తిశ్రీ మగిదొగరజుల ముద్లు విట్టజుల ప్రతమ రాజ్యంబున కడువండ్లుల ఇచ్చిన రెన్డువటి—మిరియమ్ము బోళజకుతెంగరి పె—డశిన రెన్డువట్టి పదేన్దంబు అడ్లుప—ట్టు ద్రుగ్గాదేవి నేలయు ఉఱువుటరిబోళ—రెన్డుట్టియు తూఱ్ను ఈ రెన్డట్టి ఱచునరు—కళరేని బారనాసి వేగవిలాళు వేడ్లు—ము వేశెఱువుళు వేవురు పఱాను—చమ్పిన చన్నంగు.

౪:—ఇది నెల్లూరు జిల్లా శాసనములలో కందుకూరు. నెం. ౩౧—౩౨ గా ప్రచురింపఁబడినది. క్రిందిది శ్రీ. మ. (మల్లంపల్లి) సోమశేఖర శర్మగారి పాఠము. ఇది మూఁడవ విజయాదిత్యుని నాఁటిది. శ్రీనిరవద్యుణ్డు సిత్తజాత సముణ్డు శివపదవర సేవితు ణ్డ। ఖ లు ణ్డాతత రిపుబలు ణ్డాహవరాధర ణ్డయోధ్య సింఘూ। సను ణ్డగణితదానాననుణ్డు గజ......। లయుణ్డా......హాసనోన వణ్డ రంగువ్వి......ణియు। గాన్చి కొలది లేని కొట్టంబు ల్వొడిచి గొణకెనలాత। పక్షపాతి సలలిత......

౫:—సత్యాదిత్యుని మాలెపాడు శాసనము. కడప మండలము. ఎపి. ఇం. పుట ౩౪౫ (౮ శతాబ్ది).

"స్వస్తిశ్రీ చోటమహారాజాధిరాజ పరమేశ్వర విక్రమాదిత్య శక్తి కొమర విక్రమాదిత్యుల కొడుకుల్ కాశ్యపగోత్రుణ్డు సత్యాదిత్యుణ్డు సిద్ధివేయురేనాణ్డు ఏఱువేల ఏలుచున్డి కొమఱిపాఱ రేవశర్మణ కశ్యపగోత్రినికి ఇచ్చిన చిఱుమ్బూరి ఉత్త. శ తూర్పునదిశ. జుగ్గిపొలగరుసు. దక్షిణదిశ......పాఱమ, ఏను మాఱుత్రుగాను తాగిరి దేని సల్పినవానికి వేగుళవ్వు వేసెఱువ్వుళు వేవాన్రూణ్లు నిల్పినమ్ పుణ్యమ్బు. దీనికి వక్రమ్బు వచ్చు వాణ్డు పుత్రవద్య స్త్రీవద్య గోవద్య పఞ్చ మహాపాతకఞ్చేసిన వాని లోకమ్బు నణ్డువాణ్డు." (ఆం. భా. వి. ౧౦౦ పుట మొ. ౧౦౧ పుట).

౧౮. VIII విష:—పయి శాసనములను బరిశీలించునపు డివి కొంత ప్రాచీనాంధ్రభాషా స్వరూపమును దెలుపుచున్నను వీనియందుఁ బ్రమాదము లత్యధికములనియు నివి యాకాలపు భాషకు యథాస్థితముగాఁ బ్రమాణములని యంగీకరింపఁదగవనియుఁ దోఁచక మానదు.

పయి శాసనములకన్నను దప్పుల తిప్పయగు నహాదనకర శాసనము నందలి "సంవత్సరంబుల్-ఊరిస్వాముల్." మున్నగువానిలోని 'ళ' కారము తమిఱ ప్రథమా బహువచన 'కళ్' ప్రత్యయ సంబంధియనియు నింకను నిందలి 'కొన్థకళ్' అని నాలుగైదుసారులు వాడఁబడినచోట్ల 'కొండికలు' అనుదానికి మూలమగు 'కళ్' ప్రత్యయమె కలదనియు నిట్టి శాసనము తమిఱ కన్నడముల నుండి తెలుఁగు చీలిన సంధికాలములోనిదనియు శ్రీ కోరాడ రామకృష్ణయ్య పంతులుయమ్మెగారు నిస్సంకోచముగ వ్రాసిరి (చూడు. ఆంధ్రభారత కవితా విమర్శను. ౨౬ మొ. ౩౦ పుటలు). అట్లె 'కొలఁకులు' మున్నగు చోటులందలిది 'లు' ప్రత్యయము కాదనియు 'కళ్' ప్రత్యయమేయనియు వేఱొకచోట వ్రాసిరి. (సంధి గ్రంథము. భాషాలక్షణము. వ్యాకరణములు. ౧౦ మొ. ౧౩ వ. పుటలు. చూచునది) 'కొలఁకు' అనురూపమే ప్రాచీనాంధ్రమున లేదు. అది కేవల నవ్యశబ్దము. 'కొలను' అనునదే ప్రాచీన శబ్దము. ఈ వాదము సువిస్తరముగా నారచించిన యాంధ్రవ్యాకరణ సంహితా సర్వస్వమున ౨౦౫ I విషయమున వ్రాయఁబడెను. ఈ గ్రంథమందును ముందు ౨౧ XVII విషయమునఁ బైవాదము నిరాకరింపఁబడును. (చూడు. ౭౮ I విష.) అహాదనకర శాసనమునకుఁ జాలపూర్వ కాలమునాఁటివగు వెనుక నుదాహరించిన శాసనములలోఁ దెల్గు ప్రథమా బహు వచన 'లు' ప్రత్యయము వెలసియున్నదని వీరికిఁ దెలిసియున్నచో వీరు పయి రీతిని వ్రాయ సాహసించి యుండరు.

"జయసింఘమహారాజులాకున్-మ్లావిండిరాజుల-రాజుల్-సోట మహా రాజుల్" మున్నగు రీతి ననేక స్థలములందు వెనుక నుదాహరించిన ప్రాచీనత

మాంధ్ర శాసనములలో 'లు' ప్రత్యయము ప్రయుక్తమై యున్నది. పయి శాసనములలోని వాడుకలనుబట్టి తెల్గున నంతకుముందెన్నియో శతాబ్దముల నాఁటి నుండియుఁ బ్రథమా బహువచన 'లు' ప్రత్యయముండెడిదని విశదమగుచున్నది. ఈ 'లు' ప్రత్యయము ద్రావిడ 'రు' ప్రత్యయ మూలకము కానోపునని ముందు వ్రాయఁబడును (చూ. ౨౧. XVII విష.) ద్రావిడభాషలలో నతిప్రాచీన కాలమున 'ల' కారము చోట 'ళ' కారము పల్కఁబడెడిదని యీ వఱకె విశదీకరింపఁబడెను. (చూ. ౧౮ V విష.) "సంవత్సరంబుళ్-పుట్పు-కళరేని-నరాళోక" మున్నగు రీతిని ళ కారాపభ్రంశోచ్చారణము ప్రాచీనకాలమునఁ బ్రసిద్ధమె. కావున 'ఎలి-చిలి' మున్నగు ద్రావిడ శబ్దములకు "నెలఁత-పొలఁతి" మున్నగు వానికివలెనే స్వార్థిక 'క' ప్రత్యయము చేరఁగా (తిరి=తిరిక=పొలఁతుక, నెలఁతుక-మొ.) 'ఎలికలు-చిలికలు' మున్నగు రూపములేర్పడి యుండెననియు వానిని ద్రావిడ స్వభావమున 'ఎలికళ్-కిలికళ్' మున్నగురీతిని తమిఌకన్నడముల వారు పఱసాగిరనియు నందనుచిత విభాగమున 'కళ్' ప్రత్యయమేర్పడి యుండుననియు నేల యూహింపరాదో తెలియకున్నది. 'లు' ప్రత్యయము పెక్కుభాషలలో వ్యాపించిన యతిప్రాచీన ప్రత్యయము (చూడు. ౮ IV విష).

శ్రీ కోరాడ రామకృష్ణయ్య పంతులు యమ్మెగారు 'లు' ప్రత్యయమె 'కళ్' ప్రత్యయ మూలకమనియు నహదనకర శాసన కాలమె తెలుఁగు, తమిఌ కన్నడములనుండి చీలిన కాలమనియు వ్రాసిన వ్రాఁతయొక్క సత్యాసత్యములు విశదపడుటకయి యిట నట్టి యపభ్రంశ భూయిష్ఠమగు నహదనకర శాసనము చూపఁబడుచున్నది.

"౧౭......విదితమస్తు వోస్మాభిః స్వస్తి ప్రిధివి పలవ పట్టనబున ఊరి.

౧౮. వారు కరిగళ్ల వడచరికి ఊరిస్వాముళ్ ఇచ్చిన స్తితి రెండు వాడల పటనావురకు.

౧౯. అరియుడగు తెఱెయు సిద్ధాయబుదన్ను దనపరుధబును నవ్వక్ష బాదవ.

౨౦. రియూరువు ఊరు దాయసెసి ఇచ్చి దినికి వక్రబుంళెదు వచ్చిన వారు గళరెని ఊరిస్తితి.

౨౧. దప్పినవారు దినికి వక్రబుం వచ్చిన గచ్చురు రెండు వడల్పలెము వరులెముల వె.

౨౨. సినదియు చన్ను విరిపయి, నాదువరు. గళ్గిన ఎలెమున చెసిన సెయు సను—మూఁడవఱకు రెండవ ప్రక్క.

౨౩. మహాన బియుళ్ నరాళోక మహా సద్దవుళ్ విరావవ మహాన బియుళ్ గజ్నబుసె.

౨౪. అనదువుళ్ శమస్తభువన శ్రీయనదిరజు బద్రపెరెయ ఊరిని నవ్రసివర.

౨౫. వయ్యోతి మహానబిళ్ వయ్యోతి మహాభిళ్ వనికొళుచె నెర పఞ్చిన వ్రసి.

౨౬. వయ్యోతి మహాన బియుళ్ సకల కొన్థుకళ్ సవ్వలోక్శ్రయ మహా సద్దవళ్.

౨౭. పెద్దకాళ్ నెర వద్య మహా సద్ధకానళ్ వసిణ్డిముద్దు వెటన్దల చరు వయ్యా విష్ణు వర్ధకాన మ.

౨౮. హాసద్ధవళ్ వను త్కెవుల కొన్థుకళ్ అచ్చకుట్టవనియు కొన్థుకళ్ గజబుం పెధ్రల.

౨౯. నదువుళ్ ప్రిధిమి మహాద్ధవళ్ వెటందళ్ పొనికనధిఅము కొళన మవు విష్ణువర్ధకాన —నాలుగవ తేకు.

౩౦. మహా సద్ధవల కొంధుకలు నిరవధ్య ప్రిధివిక నదిరజుళ్ గునవన మహాన బియుళ్.

౩౧. ముద్దకఞ్చికొళ్ రవిస్వరా ప్రిధివి మహా సద్ధన వళల పయుజన వకాల కొన్థుకళ్ కొరిగింకొళ్.

౩౨. కరిగల ప్రిధివి మహా సద్ధవళ కొన్థుకళ్ సన్ది మహాస విలనదువు శ్రీమహా.

౩౩. సద్ధవళస కాలోక్శ్రయ్య ప్రిధివి మహా సద్ధకావళ దివ్కరయ్య వఞ్చ.

౩౪. కొళ్ శ్రీజష్టి పెన్దటట్టగధ్దాను "(బర్కెన్ దొరగారి తమిఒ సంస్కృత శాసనములు. ప్రతిబింబము ప్రకారము వ్రాయఁబడిన శాసనములోని తెలుఁగు భాగము. రాజరాజనరేంద్ర పట్టాభిషేక సంచిక. ౭౧-౭౨ పుటలు)."

"ప్రాచీనాంధ్రశాసనములలో బొత్తిగా నర్థము తెలియరాకుండునది యీ యొకఁ శాసనమే" అని యప్పటి తచ్ఛాసన పరిశోధకులు వ్రాసిరి. పిమ్మట నాంధ్రభాషాచరిత్ర గ్రంథమున ౧౩౧౦-౧౩౧౧ పుటలలో నేతచ్ఛాసన ప్రతి బింబమును నెక్కెటో దాని యర్థమును ముద్రితములయినవి. ప్రతిబింబమును బట్టి వ్రాయుటలో నిందుకొన్ని పాఠభేదములును గలవు. "కొన్థుకళ్" మున్నగుచోట్ల 'కొన్టుకళ్' మున్నగురీతి నిందు వ్రాయఁబడెను. శ్రీ. రామ

కృష్ణయ్య పంతులుగారును వేఱొకచో నీ క్రింది రీతిని వ్రాసిరి. "వాన్ఱు మున్నగుచోట్లఁ గొందఱు శకటమునకు బదులుగా థకారము నుచ్చరింతురు. వేటూరి ప్రభాకరశాస్త్రిగారు వారి 'అహాదనకర' శాసన విమర్శములో కొన్థకళ్-కొన్దుకళ్-కొణ్డుకళ్" అనురీతిని థకారముగాఁ జదివిరి. లేదా ఱకార థకార భిన్నమగు నేదో వర్ణమని వాని లిపినిబట్టి వచించిరి......(స్టడీస్-ద్రవి. ౯౭-౯౮ పుటలు) (౧౮ XIX విష. చూచునది).

౧౮. IX విష:—పయి ప్రాచీన శాసనములలోని "వాన్ఱు-సత్యాదిత్యున్ఱ కొన్ఱుకళ్" మున్నగు స్థలములందలి 'న్ఱు' అను నక్షరమును జదువుటలో నొక్కొక్క రొక్కొక్క విధముగాఁ దలంచిరి. ఱకారము ప్రాచీన తమ కాలమున ద్రావిడభాషలలో 'ట-త' మధ్యస్థోచ్చారణము గలదన్నమాట మఱచి వింతవింత పోకడలను బోవుచున్నారు. టకార సన్నిహితోచ్చారణముగల ఱకారమె 'డు' అను రూపము నందెనని వచింపక యది యేదో వర్ణమని యొకరును 'న్ఱు' అనువాని నడుమ 'డ' కార మవతరించెనని యొకరును నపోహాపడుచున్నారు.

"మహచ్ఛబ్ద నిర్మాణ సందర్భమున 'అన్' అనునది తుదిని జేరెడిది. మహతీ శబ్దములకు 'అళ్' అనునది చేరెడిది. 'అతు' అనునది యమహద్రూపము. ఉదా:—మగ+అన్=మగన్. మగ+అళ్=మగళ్. అవన్-అవళ్...... తమిళులు దంత్య నకారమును 'తన్నకరము' అనియు మూర్ధన్య నకారమును 'ఱన్నకరము' అనియు వ్యవహరింతురు. దీనిని 'అల్వెయోలర్' (Alveolar)=(మూర్ధన్య దంత్య మధ్యస్థితి) అని దొరలు వాడుదురు. అవను మున్నగువాని లోని 'ను' అనుదానిమీఁదికి యూనిక రాఁగా దాని నొత్తిపలుకవలసెను. అపుడు దానికిఁ బరముగా నొక యక్షర (Glide) మాగమముగా రావలసెను. అట్టి యాగమము సహజస్థితిచే 'త' కారమనికాని 'ఱ' కారమనికాని చెప్పవలయును. (దీనిని తమిళులు 'ట్ర' అని పల్కుదురు). అట్టి నకారమునకును (మూర్ధన్య) ఱకారమునకును నుత్పత్తిస్థాన మొక్కటియె......మూర్ధన్య నకారాంతములగు పెక్కు తమిళ శబ్దములు తమకుఁ బరముగా దకారమును బెంచుచున్నవి......ఉదా:—అవను—అవన్+తు=అవన్దు...... వాన్దు. కాలక్రమమున 'వాండు' అని యయ్యెను." (స్టడీస్-ద్రవి. ౯౪ మొ. ౯౬-౭. పుటలు). (ఇందలి 'ద' ఏదో వర్ణమందురు).

"కాలక్రమమున 'ద' కారము మూర్ధన్య డకారము కాఁగా దాని ముందటి 'న' కారము సైతము మూర్ధన్య ణకారమయ్యెను." (స్టడీస్-ద్రవి-౯౮ పుట).

“వాన్ఱు” మున్నగుచోట్లఁ గొండలు అకారమునకు బదులుగా థకారము నుచ్చరింతురు. శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారు వారి ‘అహదనకర’ శాసన విమర్శములో “కొన్థుకళ్-కొన్దుకళ్-కొణ్డుకళ్” అనురీతిని థకారముగాఁ జదివిరి. లేదా అకార థకార భిన్నమగు నేదో వర్ణమని దాని లిపినిబట్టి వచించిరి. ఇది తుది నకారమునకు (మూర్ధన్య) బదులుగా వచ్చునది గాన దీనిని మూర్థన్య దకార మనవచ్చును. అకారమునకును మూర్ధన్య డకారమునకును సన్నిహిత మగు నొక దకారమనెడి (మూర్థన్య) వర్ణవిశేష ముండెడిది.” (స్టడీస్-ద్రవి. ౯౭-౯౮ పుటలు).

పయిరీతిని ‘అవన్’ మున్నగువాని తుది నకారము మీఁది కూనిక రాఁగా నచట నూరకయె యేదో మూర్ధన్య వర్ణ మాగమముగఁ బెరిఁగి కాలక్రమమున నదియు దాని ముందటి మూర్ధన్య నకారమును ‘ణ్డు’ అను రూపము నంది ‘వాండు’ అను రూపము నొదవించెనని వీరి యాశయము.

ఆంధ్రభాషా వికాసకర్తగారు ప్రాచీనత మాంధ్ర శాసనములలోని ‘వాన్ఱు-సత్యాదిత్యన్ఱు’ మున్నగు చోటులందలి ‘న’ కార సంయుక్త వర్ణము ‘అ’ కారమె యని నిశ్చయించుకొని యట్టి ‘అ’ కార మూరకయె తుది నకారము మీఁది కూనిక రాఁగా నాగమమయ్యె (Glide) ననుట యసంభవము నసహజము నని తలంచి కావలయు నచటఁ బూజ్యార్థక బహువచన ‘రు’ ప్రత్యయము లేదా యట్టి ‘ఉ’ ప్రత్యయము నిల్చుననియు నట్టి మూర్ధన్య నకార రేఫసంయోగమున వాని నడుమ సహజముగ ‘డ’ కార మవతరించుననియు నట్టిదానినుండి ‘వాండు’ (వాన్ఱు=వాన్+డ్+ఉ=వాండ్రు-వాండు) అను రూపమేర్పడుననియు నూహించిరి.

“వాన్ఱు-మగన్ఱు” మొదలయిన యాచ్ఛికపదములందును, ‘నాయకున్ఱు-గోత్రున్ఱు’ మొదలయిన తత్సమపదములందును నొక్కరూపమే గనుపట్టుచున్నది. ఈ ‘న్ఱు’ వర్ణమే కాలక్రమమున ‘ణ్డు’ గా మాఱినది. రేఫ టకారములకు జన్మస్థాన మొక్కటియె యని ముందు నిరూపించితిని. ఈ నకారమునకు రేఫమునకును సంయోగము గల్గుటచే వాని నడుమ డకారము జనించినది. రేఫము నుచ్చరించునపుడు దంతమూలముతో నొరపిడి గల్గి యా యొరపిడి యొక్క ప్రథమభాగమునకు అనునాసికమగు నకారముతో సంయోగము గలుగుటవలన నా ప్రథమభాగమునందలి ‘ట’ కార సదృశోచ్చారణమునకు నాదత (నాదిత యనవలెను) గలిగి డకార మేర్పడినది. అప్పుడు ‘వాన్ఱు’ వాండ్రుగా మాఱుచున్నది. (కాణ్డువెల్లు ౧౬౪ పుటలోని వ్రాఁత (చూ. ౧౭ XVI. ౧౮ IX విష.) యీ కల్పనమునకు మూలము) డకారరేఫములు సమీ

కరణము నొంది, నకారము ణకారము కాఁగా 'వాణ్డు' అనురూపము గలుగు చున్నది. డకారము మూర్ధన్యమగుటఁ బూర్వ నకారము ణకారమగుటలో వింత లేదు. వైయాకరణులచేఁ బ్రత్యయాంతరముగా నంగీకరింపఁ బడకపోయినను తెనుఁగున మహద్బహువచన ప్రత్యయముగా 'రు' వర్ణమున్నట్లు స్పష్టము కాక పోదు. మీరు-వారు-తమరు-నెయ్యురు-మొదలయిన శబ్దము లనేకములు గలవు. వీనియం దెల్లెడలను 'రు' వర్ణమె ప్రత్యయము. ఇంతియగాక అరవ మునను గన్నడమునను 'అవర్-ఇవర్-(తమి). అవరు-ఇవరు-(కన్న)' అను రూపములవలెనె రేఫాంతములె మహద్బహువచనములు. ఈ 'రు' వర్ణమే 'వాన్డ్రు' మొదలయిన శబ్దముల తుదినున్న 'రు' వర్ణమని యూహించుట సుల భము. అట్లయినచో నేకవచనములపై బహువచన ప్రత్యయ మేల వచ్చెనని యడుగవచ్చును. బహువచన ప్రత్యయము గౌరవార్థకముగ పూజ్యతయందు గలుగుచుండును. కాలక్రమమున దాని యర్థము మఱుగుపడి ఏకవచనము అను భ్రాంతిని మఱియొక బహువచనార్థక ప్రత్యయము చేరుచుండును. ఇది యనాదిగ నుండిన సంప్రదాయము......పయి 'రు' వర్ణము శాసనముల యందు శకటరేఫముగా నున్నదిగదా యిది యెట్లు బహువచన ప్రత్యయ మైనదని శంకింపఁజనదు. వేఁటకాఱు-చెయ్వాఱు-అందఱు-చూపఱు-మొదలయిన శబ్దములయందు 'ఱు' వర్ణము గలదు......ప్రాచీనకాలములో శకటరేఫముయొక్క వాడుకయు రేఫములు తబ్బిబ్బుపడుటయు ముందు విపుల ముగా నిరూపించితిని. ఇట్లు బహువచనమయి 'వాన్డ్రు' శబ్దము 'వాండ్రు' అను కేవల బహువచనరూపముగాఁ గూడ మాఱి వాడుకలో నున్నదనుట స్పష్టము. ఇట్లు 'వాండ్రు' అను బహువచనరూపమునుండి బహువచన 'రు' ప్రత్యయమును మరల విడఁదీసి 'వాండు' అను నేకవచనరూపమును గూడఁ బుట్టించియుండవచ్చును." (ఆం. భా. వి. ౩౮౭-౩౮౮ పు.) ఱకారమున కర్వా చీనముగాఁ గల్గిన యలఘురేఫోచ్చారణ మెందఱో శాస్త్రజ్ఞుల నెన్నియో చిక్కులు పెట్టుచున్నది! పయిరీతి నూహములపై నూహములను జనింపఁజేసినది ఱకారమునకుఁ గల్గిన యర్వాచీనాలఘురేఫోచ్చారణమె కదా! ప్రాచీన తమకాల మందలి ద్రావిడ ఱకారము 'ట-త' మధ్యస్థోచ్చారణము గల్గియుండెడిదని యీవఱకుఁ దొల్కాప్పియ సూత్రోదాహరణ పూర్వకముగా విశదీకరింపఁ బడెను (చూడు. ౧౭ VIII విభ. తొల్కా. ౯౧ మొ. ౯౪ సూ.) అట్లగుటం జేసి ప్రాచీన ద్రావిడభాషలలోని 'ఱ' కారము 'ట-డ' లుగా నేర్పడుటలో వింతయేమియు లేదు. పైరీతిగల యూహాలకును వింతవింత కల్పనములకును బ్రసక్తి లేదు. ప్రాచీనతమ ద్రావిడ శాసనములలోని—(ప్రాచీనాంధ్రశాసనముల లోని)—వాన్ఱు మున్నగువానిని జదువునపు డందలి ఱకారము నలఘురేఫముగాఁ

బలింపరాదు. ఇంకదానిని 'ట-త' మధ్యస్థోచ్చారణము గలదిగనె చదువ వలయును కావుననే 'వాష్టు-సత్యాదిత్యుష్టు' మున్నగువానివంటి స్థలముల లోని 'ష్టు' అనుదానివంటి చోటులందుఁ గాలక్రమమున సరళోచ్చారణము గల్గి 'నిరవద్యుణ్డు' మున్నగురీతిని 'ణ్డు' అను మార్పుగల్గినది. (చూడు సత్యా దిత్యుని మాలెపాడు శాసనములోని 'ష్టు' కందుకూరి శాసనములోని 'ణ్డు'. ౧౮ VII విష.) పిమ్మటఁ గాలక్రమమున అకారమున కలఘురేఫోచ్చారణము గల్గినది. (చూ. ౧౭ XIII విష.) నేఁటి వ్యావహారిక ద్రావిడభాషలనుబట్టి ప్రాచీన ద్రావిడభాషల స్థితిగతుల నూహింతమనెడి నేఁటి ద్రావిడభాషోపన్యాసకులును వ్యావహారికభాషలు గ్రంథముల కెక్కనిభాషాలక్షణములను దాఁచిపెట్టుననెడి ద్రావిడభాషా విమర్శకులును (చూడు స్టడీస్-ద్రవి. ౬౧ పుట. ౧౮ I విష.) నీ సందర్భమును స్మరింతురుగాక! (చూడు ౧౦౬ I విష).

పయిరీతిని 'ష్టు' అనుదానిలోని 'ఱ' కారమె 'డ' కారమగుచు నందలి యనునాసికముతోఁ గలసి బిందుపూర్వక 'డు' వర్ణకమగుచుండఁగా నట్టి 'డు' వర్ణక సంపాదనమునకయి యూనిక నూనుకొని యొకరును నీ క్రింది కాల్డువెల్లు గారి మార్గము ననుసరించి యొకరును వివిధ కల్పనములను జేయుట వింత! వెనుక నుదాహరించిన ప్రాచీనాంధ్ర శాసనములనాఁటికి 'రు-ఱు' వర్ణకము లందలి పూజ్యార్థకత్వము విస్మృతమైనచో 'వాండ్రు' అనునది బహువచన మను స్మృతి యెట్లు గల్గెను? వాడుకలో నున్న 'ష్టు' వర్ణాంతము లెల్లఁ బూజ్యా ర్థకములేనా? ఎల్లవారివిషయమునను నిట్టి పూజ్యార్థమును వాడవలెనను నభిప్రాయ మాంధ్రప్రపంచ మందంతటను గల్గెననుట విశ్వసనీయమా? 'వాష్టు' మున్నగువానిచోటనెల్ల 'వాన్రు' అని యుండినంగాని వాని నడుమ 'డ' కార మావిర్భవించు సంప్రదాయము లేదుగదా. ద్రావిడభాషలలో మూర్ధన్య నకారమునకుఁ బరమందు రేఫము నిల్చు సంయోగ మశ్రుతచరము. కాన రేఫము తబ్బిబ్బులచే 'వాష్టు' అనురీతిని శాసనములలోఁ బడెననుట పొసఁగదు. ప్రాచీనాంధ్రశాసనములం దంతటను 'ష్టు' అనియె యున్నదిగాని యెచ్చటను 'ష్ట్రు' అనురీతి నుండలేదు. ఇంతియకాక బహువచన 'రు' ప్రత్య యము 'న' కారాంత ప్రథమైకవచనముపై నిల్చుననుట ద్రావిడ సంప్రదాయ విరుద్ధము. అంతటను "అవర్-ఇవర్-అవరు-ఇవరు" అనురీతి నుండుటయె తమిళ కర్ణాట సంప్రదాయము.

పయి కల్పనమునకెల్ల నీ క్రింది కాల్డువెల్లుగారి పద్ధతి మూలము కానోపును.

"ఇట్టి మూర్ధన్య నకార మాంధ్ర కర్ణాటములలో లేదు. తమిళ మల యాళములందుమాత్రము గలదు. దీనికిఁ బరముగ 'ఱ' కారము నిల్చునపుడు

వానినడుమ 'డ' కారము నిల్చును. అపుడు 'ఱ' కారము రేఫమగును. ఉదా:—"తమి-మూన్ఱు=మూన్డ్రు" అని వినఁబడును. కన్న-మూఱు-తెల్గు-మూఁడు." (చూడు. ౧౭ XVI విష.) (కాల్డు. ౧౭౫-౧౭౬ పుటలు).

'వాన్టు' మున్నగు వానిలోని 'న్టు' అనుదాని వ్యుత్పత్తి:—శ్రీ కోరాడ వారు వ్రాసినట్లు 'అవను' అనుదానిలోని 'ను' అనుదానిమీఁది కూనిక వచ్చుట చేత దానికిఁ బరమందేదో వర్ణ మాగమమయ్యె నను కల్పనము సరియని తోఁచదు. ముందెన్నఁడో పుట్టఁబోవు హ్రాసగన్నడపు 'అవను' శబ్దమును దీసికొని యత్యంత ప్రాచీనములగు 'అవన్టు=వాన్టు' మున్నగు రూపములను సాధింపఁబూనుట యసంభవము. ప్రాచీన తమిళ కర్ణాట శబ్దమగు 'అవన్' అనుదానిలోని నకారపు హల్లుమీఁది కూనిక కల్గనేరదు గదా. ౭౫ II విషయమున వివరింపఁబోవు రీతిని బ్రాచీనకాలపు ప్రథమైకవచనమగు (చూడు. ౬౦ X విష. కురుట్టు=అంధుఁడు) 'తు' అనునది 'వాన్' అనుదానితో సంధింపఁగా 'వాన్టు' అనురూప మేర్పడును. "అ+అ+న్+తు=అవన్టు=వాన్టు" అని దాని ప్రక్రియ నరయవలయును.

"లన్ఱన....." (తొల్కా. ౧౫౦ సూ.)=లకారమునకును మూర్ధన్య నకారమునకును బరమగు 'త' కారము ఱకారమగును. అట్టి దంత్య నకారము మూర్ధన్య నకారమగును. ఉదా:—......పొన్+తీదు=పొన్టీదు. దీనిని నేఁటి తమిళులు కొంద ఱపభ్రష్టముగా 'పొన్డ్రీదు' అని పలుకుదురు. ఇట్టి పలుకుబడియే వెనుక వ్రాసిన కాల్డువెల్లుగారి వ్రాఁతకు మూలము. ఇట్టి నేఁటి యపభ్రంశోచ్చారణములు ప్రాచీన ద్రావిడ కుటుంబభాషా సంబంధ పరిశీలన విషయమున నుపచరింపవు గదా!

౧౯. I విష:—సాధారణముగా 'అ' కారాదులయు 'క' కారాదులయు ధ్వనుల విషయమున ద్రావిడధ్వనులు సంస్కృతధ్వనులనె పోలియుండు నని (౧౭ VII విష.) యు ఱకారాదులగు కొన్నిటి విషయమునఁ (౧౭ IX విష.) గొన్ని విశేషములు గలవనియు నీవఱకు వ్రాయఁబడెను. ద్రావిడభాష లందలి సరళోచ్చారణ వివరణ సందర్భమున వర్గాక్షరముల విశేషములు మఱి కొన్ని చూపఁబడెను. (చూ. ౧౭ XXII విష. ౧౭ XXIII విష.) మఱికొన్ని ద్రావిడధ్వనుల విశేషము లిటఁ జూపఁబడును.

"గ్రామ్యాఱవమునఁ బదాదిని 'చ' కారోచ్చారణమె వెలయుచున్నది. ఉదా:—చెయ్ (ఇది గ్రామ్యాఱవోచ్చారణము). (గ్రాంథిక-సెయ్). అఱవలు వర్ణసమామ్నాయము నేర్పఱుచుకొన్నదగ్గఱనుండియు సంస్కృత శవర్ణము

చోట 'చ' కారమును వ్రాయుచు నట్టి చకారమును స్వతస్సిద్ధ చకారమును సంస్కృత చకారమువంటి యుచ్చారణముతో యూరపియను లిండియాకు వచ్చువఱకును (క్రీ. శ. ౧౫౫౦) బలుకుచుండెడివారని తోఁచుచున్నది. 'శోళ' మండలమను దానిని ఫోర్చుగీసువారు 'చోరమండల్' అని వ్రాసికొనిరి. 'శూద్ర' అనుపదము నొక మిషనరీ దొర 'చుద్దిర' అని వ్రాసెను." (కాల్డు. ౧౪౦-౧౪౧ పుట).

విమర్శ:—పయివ్రాఁత వెనుక వ్రాసిన ౧౭ XXII విషయపు వ్రాఁతకుఁ గేవలము విరుద్ధము. ఎవరెట్లు వ్రాసినను దమిళమునఁ దొల్కాప్పియము నాఁటికి 'చ' కారోచ్చారణమె యుండెడిదనుటలోను ననునాసిక పూర్వక సంయోగమందును 'చ' కారోచ్చారణమె యుండెడిదనుటలోను సరళోచ్చారణ మర్వాచీనముగా వచ్చెననుటలోను విప్రతిపత్తిలేదు.

"చకరక్కిళవి......" (తొల్కా. ౬౨ సూ.)='అ-ఐ-ఔ' అను నచ్చులు తప్పఁ దక్కిన యచ్చులతోఁ గూడిమాత్రమె 'చ' కారము పదాదిని నిల్చును.

"ఞ కారము:—తమిళములోని పదాది నకారము మలయాళమునఁ దఱుచుగా 'ఞ' కారమగును. ఉదా:—తమి. నాన్. మల-ఞాన్ = (నేను). అఱవములోని 'న' కారమును మలయాళములోని ఞకారమును బ్రాచీన ద్రావిడభాషలోని యకారముయొక్క పరిణామములని యీ క్రింది యుదాహృతులవలనఁ దోఁచుచున్నది. అఱ-నాన్. మల-ఞాన్. ప్రాచీన ద్రావిడము-యాన్. అఱ-నణ్డు (ఎండ్రి) మల-ఞండు. కన్న-యండ్రి." (కాల్డు. ౧౪౧ పుట).

విమర్శము:—తమిళ నకారము మలయాళమున ఞకారమగుట యరుదు. ఉదా:—తమి-నీఱు. మల-నీఱు. (భస్మము). తమి-నాళ్. మల-నాళ్ (దినము) తమి-నిన్నై. మల-నిన్నై (నిన్ను). తమి-నెయ్. మల-నెయ్ (ఘృతము) "నాన్=నేను" అనునది తొల్కాప్పియమునఁ జెప్పఁబడలేదు. "యాన్=(నేను)" అనునది మాత్రమె తొల్కాప్పియమునఁ జేర్కొనఁబడెను. నన్నూలులో "నాన్=నేను" అనునది చేర్కొనఁబడెను. కావుననే నేఁటికిని ద్వితీయాది విభక్తులలో 'య' కార పరిణామము లనఁదగు "ఎన్నై-ఎన్నాల్"=(నన్ను-నా చేత) మున్నగునవి మాత్రమె వెలసినవి. "నన్నై-నన్నాల్" మున్నగు రీతిగల రూపములు లేవు.

"చ జ లకు సహజమగు తాలవ్యోచ్చారణము తెల్గున "ఇ-ఈ-ఎ-ఏ-ఐ" లతో నుండునపుడే నిల్చును. తక్కిన యచ్చులతో నుండునపు డవి దంత్య

ములుగాఁ దెల్గునందును మరాఠీ యందును నుచ్చరింపఁబడును." (కాల్డు. ౧౪౧ పుట).

విమర్శము:—ఐకార యుక్త చ జలు తెల్గున లేవు. "ఐదంతము లయిన చ జలు సమేతర శబ్దంబులందు లేవు" (బాల-సంజ్ఞా-౯ సూ.) ఈవఱకీ చ జల విషయము విపులముగా వివరింపఁబడెను (చూ. ౧౭ XVII విష).

౧౯. II విష:—"పరుషమగు 'ట' కారము తమిళ పదాదిని లేదు. సంస్కృతమునుండి పదాది ట కార శబ్దము వచ్చునపుడు తమిఁటమున దానిముందు ఇ కారమును జేర్చి సహజమగు 'డ' కారముగాఁ బల్కుదురు......అఱవమున ననునాసిక పూర్వకములగునపుడు పరుషములు సరళములగును. ఇతర ద్రావిడ భాషలలో నట్టి నియమములేదు. ఉదా:—సం-మణ్టప-తమి-మణ్డబమ్....... ఇతర ద్రావిడభాషలకన్న నఱవమునకు సంస్కృత సంబంధము తక్కువగుట చేత నిట్టి భేదము ద్రావిడభాషలలోఁ గల్గెను." (కాల్డు. ౧౪౨ పుట).

విమర్శము:—తమిళ పదాదిని 'ట' కారమే కాక అకారమును నిల్వ నేరదు. తొల్కాప్పియమున ౬౧-౬౨ సూత్రములలోఁ బదాది స్థితి విషయమున "ట-అ" లు పృథక్కరింపఁబడినవి. సంస్కృత పదాది 'ట' కార శబ్దము తమిఁటములోనికి వచ్చునపుడు దాని మొదట 'ఇ' కారము చేరునని నన్నూలు నందైనఁ గంఠోక్తముగఁ జెప్పఁబడలేదుగాని తద్భవప్రకరణాంతమందలి 'పిఱ' అను శబ్దముచే నిది యుక్తప్రాయమె యందురు. ఉదా:—సం-టక్కమ్. తమి-ఇడక్కమ్. అఱవమున ననునాసిక పూర్వకత్వమునఁ బరుషము సరళముగా మాఱుట యర్వాచీనమనియుఁ దొల్కాప్పియమునాఁటి కట్టిస్థితి లేదనియు నీవఱకుఁ జెప్పఁబడెను (చూ. ౧౭ XXIII విష.). సంస్కృతమునను గొన్ని యెడల సరళాదేశముగలదు. ఉదా:—కృదన్త=(కృత్+అన్త) మొ. 'మణ్టప' అని సంస్కృతమునలేదు. 'మణ్డప' అనియే యుండును. ఇతర ద్రావిడభాషలలో సరళాదేశము లేదనుట సరికాదు. తెల్గున ద్రుతపూర్వకత్వమునఁ బరుషములు సరళములగుట గలదు. ఉదా:—వచ్చెన్+తండ్రి=వచ్చెన్దండ్రి. మొ. ఇట్లు తమిటేతర ద్రావిడభాషలందును సంస్కృత విలక్షణమగు సరళాదేశము వివిధ స్థలములందు విస్తరించి యున్నది. కన్నడ-పొన్గురిగె=(బంగరుకత్తి) మున్జూర్=(ముంజూరు). (కర్ణా. భూ. ౩౨ సూ.). "వర్గప్రథమానాం తృతీయా స్సమాసోత్తరపదాదా" (కర్ణా. భూ. ౨౮ సూ.) ఉదా:—పఴగన్నడం=(ప్రాచీన కర్ణాటము) కెందళిర్=(ఎఱ్ఱని చిగురు) బాందొఱె=(ఆకాశగంగ).

"అఱవమందును మలయాళమునందును బదమధ్యమందు వచ్చు న సంయుక్త తకారమును దకారముగాఁ బలుకక యామత్ స్పష్ట దకారముగాఁ బలుకుదురు" (కాల్డు. ౧౪౨ పుట).

విమర్శము:—తకారమునకువలెనె దకారమునకును నీషత్ స్పృష్టో చ్చారణ మప్రసిద్ధము. (చూడు. ౧౭ XXII విష.) పదమధ్య తకారమును మలయాళమువారు సంస్కృత తకారమును వలెనె యుచ్చరింతురు. నకార పూర్వక తకారము మలయాళమున ద్విత్వనకారమగును. (చూ. ౧౫ II విష). ఉదా:—తమి-వన్తు-(వన్దు) మల-వన్ను.

"కొన్నియెడలఁ దద్భవములందు మలయాళమున సంస్కృత తకారము లకారమగును. ఉదా:—సం-ఆత్మా-తమి-అత్తుమా-మల-అల్మావ్. సం-కేరళోత్పత్తిః మల-కేరళోల్పత్తి." (కాల్డు. ౧౪౩ పుట).

"తుదభాషలో దకార మీషత్ స్పృష్టముగాఁ బల్కఁబడును." (కాల్డు. ౧౪౩ పుట).

౧౯. III విష:—"తుదభాషలో పకారము 'f' అను నాంగ్లవర్ణము వంటి ధ్వనితో నుచ్చరింపఁబడును. ఉదా:—పూఫ్ (f)=(పురుగు). ద్రావిడ భాషలలో మకారము తత్తద్వర్గాక్షరములు పరమగునపుడు తత్తద్వర్గ పంచమ ముగా మాఱునుగాని యనుస్వారము కానేరదు. అంతస్థోష్మ పరకత్వమున సంస్కృతమందలి మకార మనుస్వారమగును. కాని ద్రావిడభాషలలో నట్టి నున్న లేదు. ఆంధ్రకర్ణాటములలో సంస్కృతానుస్వారమునకు విలక్షణమగు నొక యనుస్వారము గలదు. కాని సంధిలోను బదాంతమందును మకార రూపముగా నుండును. తెనుఁగులో సంస్కృ తానుస్వారమును బోలు నరసున్న యొకటి గలదు" (కాల్డు. ౧౪౩ పుట).

విమర్శము:—పయి మకారానుస్వార విషయములు ద్రావిడభాషలం దెల్ల నొక్క రీతినె యున్నవని కాల్డువెల్లుగారు తలంచుట సరికాదు. "చంక-పంచె-పంట-పంతము-కంబము" మున్నగు ననంతములగు బిందుపూర్వక వర్గాక్షర ఘటిత శబ్దములు తెల్గునఁ గలవు. తెల్గున వర్గాక్షరములకుఁ బూర్వమందున్న నున్న (మకారమువంటిది) కెన్నఁడును దత్తద్వర్గ పంచమాదేశము లేదు. అను స్వారమె నిల్చును. తమిటమున నెచ్చటను నున్నయే లేదు. సంస్కృతమున నంతస్థ పరకత్వమున నున్న పాక్షికము-"వా పదాన్తస్య-(౮-౪-౫౯) (సి.కౌ. ౧౨౫ సూ.) సయ్యమ=సంయమ. పుల్లిఙ్గ=పుంలిఙ్గ. సవ్వత్సర=సంవత్సర. మొ. కర్ణాటభాషలో సంస్కృతానుస్వారమునకు విలక్షణమగు ననుస్వారము గలదనుట సత్యము కాదు. పదము తుదిని గర్ణాటమున మకారమునకు నున్న నిత్యము. తెల్గునఁ బదాంతమున మకారపుపొల్లు శశవిషాణ ప్రాయము. తెనుఁగులోని యరసున్న సంస్కృతానుస్వారమును బోలునది కాదు. సంస్కృ తానునాసికమును గొంత పోలియుండును.

“మ నయో ర్బిన్దుః-(కర్ణా-భూ-౧౧౨ సూ.)=మకార నకారముల కవ సానమున బిందువు నిత్యము. ఉదా:—తమి-అవన్=కన్న-అవం=(వాఁడు) తమి-నిలమ్=కన్న-నిలం=(నేల) మొ.

ఈ యనుస్వార విషయ మీ వఱకు విపులముగా విమర్శింపఁబడినది. (చూ. ౧౭ XVIII విష).

౧౯. IV విష:—“అఱవమున రేఫ లకారములు పదాది నుండవు. తద్భవ ములలో రేఫమునకు ముం దికారముగాని ‘అ’ కారముగాని చేరును. ‘ల’ కార మునకు ముందు ‘ఉ’ కారము చేరును. ఉదా:—సంస్కృ-రాజా-తమి-ఇరాచన్= (శన్)=ఇరాయన్=అరచన్ (సన్)=అరయన్......సంస్కృ-రవ. తమి-అరవమ్. ఇది ‘ఇరవమ్’ అని కానేరదు. సంస్కృ-లోక. తమి-లోగమ్= ఉలగమ్=ఉలగు. ‘ఴ-ళ-ఱ’ అనువానికినిఁ బైరీతినె యెఱుంగునది” (కాల్డు. ౧౪౩-౧౪౪ పుటలు).

విమర్శము:—‘ఴ-ళ-ఱ’ అనువానికి బైరీతినె గ్రహింపవలెననుట సరి కాదు. సంస్కృతమున ఱకారము లేనేలేదు. ‘ఴ-ళ’ అనునవి సంస్కృత పదాది నెన్నఁడును నిల్వవు. తమిళ పదాదిని సైత మియ్యవి నిలువవు. “ర-ల” మున్నగు పదాది వర్ణములకుఁ బూర్వమున నిల్చు స్వరముల విష యము నన్నూలు తద్భవ ప్రకరణమున నుపదేశింపఁబడెను. (చూ. నన్నూలు ౧౪౭ సూ.) అందలి విషయము లిం దుపేక్షితము లగుటకుఁ గార ణము తెలియదు. (చూ. ౧౯ X విష). పదాది రేఫమునకు ముందు ‘ఉ’ కారము సైతము నిల్చును. ఉదా:—సం-రోమ. తమి-ఉరోమమ్. పదాది లకారమునకు ముందు ‘ఇ’ కారము సైతము నిల్చును. ఉదా:—సం-లక్ష్మీ. తమి-ఇలక్కుమి. పదాది యకారమునకు ముందు ‘ఇ’ కారము చేరును. ఉదా:— ‘సం-యమ. తమి-ఇయమన్.’ అని నన్నూలున నుదాహరింపఁబడియున్నవి.

౧౯. V విష:—“‘ఴ’ అను నక్షరము నేఁడు......అఱవ దేశములోని దక్షిణ భాగములందు ‘ళ’ కారమువలె నుచ్చరింపఁబడును. (సం-ఫలమ్-తమి. పళమ్). తంజావూరు-పుదుచ్చేరి ప్రాంతములందు ‘ఴ’ కారముగానే పల్కఁ బడును. (సం-ఫలమ్. తమి-పఴమ్). చెన్నపురి ప్రాంతమున గ్రామ్యాఱవ మున యకారముగా బల్కఁబడును. (సం-ఫలమ్. తమి-పయమ్). హాసన గన్నడమునఁ నిది ‘ళ’ కారముగానె పల్కఁబడును. తెనుఁగులో నీ యక్షరము పూర్తిగ నశించినది......దీనిచోటఁ దెలుఁగున ‘డ’ కారము వాడఁబడును.” (కాల్డు. ౧౪౪ పుట).

విమర్శము:—తెలుఁగున “ఴ” కారము ‘డ’ కారముగానే కాక ‘ళ’ కారముగా సయితము పరిణమించినది. ఉదా:—ఏఴు (సప్తసంఖ్య) (ప్రాచీన

కర్ణాటము)=ఏడు-(తెల్గు). తమి-ఆఴ్వార్=తెల్గు-ఆళువారు. ఴ కారము తెలుఁగున గ్రాంథిక భాషయందు 'డ-ళ' న్యతరముగఁ బరిణమించి పోయినది. నన్నయభట్టునాఁటికె యిది పయిరీతిని మాఱిపోవుటచేత నాతఁడు దీని నచ్చాంధ్రవర్ణ సమామ్నాయమునఁ బరిగణింపఁడయ్యె. ప్రాచీనాంధ్ర శాసనములలో నీ యక్షరము విస్తృతముగా వాడఁబడియున్నది. ఴకార విష మీవఱకు ౧౭ IX విషయమున విపులముగ వివరింపఁబడినది.

"ఴకారము గ్రాంథికాఱవమున సైతము కొన్నియెడల వర్ణాంతరముగఁ బరిణమించుట గలదు. ఉదా:—తమి-పొఴుదు=పొయుదు=పోదు=(ప్రొద్దు). ......తమి-కీఴ్న్ద=(తె-క్రింద)=మద్రాసు గ్రామ్యాఱవము—కీయె=(తె-క్రిందనే). కన్నడమున రేఫముగా మాఱుటయుఁ గలదు. తమి-అఴుదు=(ఏడ్చి). కన్న-అర్దు. కన్నడమున నిది పరస్థహల్లు రూపము నందుటయుఁ గలదు. ఉదా:—తమి-పొఴుదు. కన్న-పొత్తు. ఈ ఴకారము తుళుభాషలో రేఫమగుచుండును" (కాల్డు. ౧౪౪-౧౪౫ పుట).

విమర్శము:—"పొఴ్దు=సమయము" అను నర్థముగల దానిలోని 'ఴ' కారము లోపించుట గలదు. ఉదా:—పోదు=(సమయము). అప్పోదు=(అప్పుడు)-కాని "ప్రొద్దు" అను నర్థముగల "పొఴుదు" శబ్దములోని ఴ కారము లోపింపదు. తమిఴమున 'కీఴ్' అను శబ్దము గలదు గాని 'కీఴ్న్ద' అను శబ్దములేదు. పఴగన్నడమున 'అఴుదు' అనియు హొసగన్నడమున 'అద్దు' (ఏడ్చి) అనియుఁ గలవుగాని 'అర్దు' అనురూప మెందునులేదు. 'పొఴ్దు' అను ప్రాచీనకర్ణాట రూపమునకుఁ బరిణామమగు 'హొత్తు' అనునది హొసగన్నడరూపము. ఇది 'అద్దు' శబ్దమువలెనె పరిణామమందినది.

౧౯. VI విష:—" 'ళ' అనునది గురు 'ల' కారము. ఇది ద్రావిడ భాషలన్నిటియందును గలదు. ఇది మూర్ధన్యము. ఇది వైదిక సంస్కృత మందును నుత్తర హిందూదేశ భాషలందును గలదు." (కాల్డు. ౧౪౫ పుట).

విమర్శము:—కాల్డువెల్లుగారు దీనివిషయమున "*l* is a peculiar heavy *l* with a mixture of ఴ......" అని వ్రాసిరి. గురులఘు భేదము దంత్య లకారమును సంబంధించునది. మూర్ధన్య ళకారమునకు గురులఘు భేదమును జెప్పుట ప్రామాణిక సమ్మతముకాదు. ఈ విషయమున నీ వఱకు ౧౭ X విషయమున సువిస్తరముగ వివరింపఁబడెను. కాల్డువెల్లుగారివలెనె యప్పకవ్యాదులును భ్రాంతులయి యలఘు లకారమును ద్రావిడ మూర్ధన్య ళకారమును గలగాయపులగముచేసి కలుషితముగా వ్రాసియున్నారు. (చూ. వై. పా. ౧౯౦-౧౯౧ విష). అప్పకవివలెనె దొరగారును వేదమునందలి

"అగ్నిమీఱే-దేవహేఱనమ్" అనుచోటు లందలి ఱ కారమును నపభ్రష్టపాఠములలోని ళకారముగ విని పై వానితో నభిన్నమని తలంచిరి. "సీ. ఏక నీళము దేవహేళనంబు నటంచు యాజుషామ్నాయంబునందు లేదొ । కాళ నీళ వ్యాళ గోళ హింతాళంబులనుచు సంస్కృతభాషయందు లేదొ । గయ్యాళి త్రుళ్ళు నగళ్ళు వజ్రపుతళ్కుఁ దాళికి నంచు నాంధ్రమున లేదొ।..." (అప్పక. ౨ ఆ. ౬౭ ప.) ఉచ్చారణ సాన్నిధ్యమున నపభ్రష్టములయి యభిన్నరూపమునఁ గలుషితములయిన వీనిని—దంత్యమగు న లఘు లకారమును, ద్రావిడ మూర్ధన్య ళకారమును, ఱకారమును—నేకరీతినే పల్కుచు నొక్క లిపితోనె నపభ్రష్టముగ వ్రాయుచు నుండుటచేత నిట్టి భ్రాంతి సంభవించుచున్నది. కర్ణాట పండితులు వీనిభేదమును బరిశీలించి వీనిలోని దంత్యమగు న లఘు ల కారమును 'షుళ' మనియు, ద్రావిడ మూర్ధన్య ళకారమును "కుళ" మనియు 'ఱ' కారమును 'ఱఱ' మనియు విభజించి స్పష్టపఱిచిరి. (చూ. ౧౭ IX విష).

౧౯. VII విష:—"ఱకారము సకల ద్రావిడభాషలందును నుండెడిదనియుఁ గాలక్రమమున సంస్కృత సంబంధముచే నాంధ్రకర్ణాటములలో నశించి యఱవ మలయాళములలో మాత్రము నిల్చియున్నదనియు గ్రహింపనగును. ప్రాచీనాఱవలేఖనమున దీనిని రెండు రేఫములుగ వ్రాసెడివారు. ద్విరుక్త శకటము శకటద్వయముగా వ్రాయఁబడినను 'త్ర' కారముగాఁ బల్కఁబడును. ఈ త్రకారములోని తకారముయొక్క యుచ్చారణము దంత్య 'త' కారమునకును మూర్ధన్య 'ట' కారమునకును మధ్యస్థమై యుండును. ఈ 'త్ర' కారములోని 'త' కారమునకు ద్రావిడభాషలలో వేఱుగ లిపి లేదు." (కాల్డు. ౧౪౫ పుట).

విమర్శము:—ఱకారము విషయమున నీ వఱకు విపులముగా ౧౭ XII మొదలుగ ౧౭ XV విషయములలో వివరింపఁబడెను. ఱకార మాంధ్ర పఱగన్నడములలో సంస్కృత సంబంధమున నశించెననుట కల్ల. అద్విరుక్తమగు ఱకారము యొక్క యుచ్చారణమున 'ట-త' మధ్యస్థితి ద్రావిడభాషలన్నిటి యందును నశించినది. తక్కిన పరుషములకు సరళోచ్చారణ మర్వాచీనముగా వచ్చినట్లె ఱకారరూప పరుషమునకును ద్రావిడభాషలన్నిటియందును నలఘు రేఫోచ్చారణరూప సారళ్య మర్వాచీనముగఁ గల్గెను. ద్విరుక్త ఱకారము నయిత మాంధ్ర కర్ణాటములం దలఘు రేఫ ద్విత్వముగానే పల్కఁబడును. తమిఱ మలయాళములందు మాత్రము ద్విరుక్త 'టత' మధ్యస్థోచ్చారణము వెలయుచున్నది. "ట్ర-లేక త్ర" అను నుచ్చారణము ద్విరుక్త ఱకారమునకు తమిఱ మలయాళ పండితుల పలుకుబడిలో నెంతమాత్రమును లేదు. హొసగన్నడమున ఱకారమే లేదు. తమిఱ మలయాళ పండితులు ద్విత్వములేని ఱకారము

నలఘు రేఫముగాఁ గొంత యొత్తి పల్కుదురు. ఆంధ్రపండితుల నేఁటి యుచ్చారణమున ద్విత్వములేని ఱకారోచ్చారణమున న లఘుత్వము సైతము నశించినది కాని తెల్గువారి వ్రాఁతలలో ఱకార లేఖనము విస్తరించి యున్నది. తుదికి ఱకార మన్న నేమో తెలియనివారు సైతము ఱకార లేఖనమును సాధారణముగా నుజ్జగింపలేదు. కావునఁ దెల్గున ఱకారము నశించినదను దొరగారి యాశయము సరికాదు.

ద్విత్వ ఱకారమును 'త్ర-ట్ర' అనురీతిని దమిళ మలయాళ పండితులు రేఫముతోఁ బల్కుచున్నారనుట సత్యవిదూరము. 'ట్ట' అను దానివలె నేఁడు పల్కుచున్నారు. అద్విరుక్త ఱకార మలఘు రేఫముగఁ బలుకఁబడునపుడు ద్విత్వ ఱకారోచ్చారణమున రేఫోచ్చారణ మేళన ముండవలదా యను భ్రాంతితో దొరగారట్లు వ్రాసిరేకాని యందు రేఫోచ్చారణ మేళనము లేదు. (చూ. ౧౭ XIII విష).

౧౯. VIII విష:—"దంత్యేతరమగు పదాంతమందుండెడి యఱవ నకారము (ఇది తెల్గున లేదు) ఱకారమునకుఁ బూర్వముగ నుచ్చారణ సౌకర్యార్థముగ నిల్పఁబడుచుండును. అపుడా నకార ఱకారములను 'న్ఱ' అని పల్కుదురు. తుళు భాషలో దీనికి సరియగుచోట 'ఞ్జ' అని నిల్చును. ఉదా:—కన్ఱు=కన్ఱు=(దూడ)=తుళు—కఞ్జి." (కాల్డు. ౧౬౫ పుట).

విమర్శము:—ఈ మూర్ధన్య నకార వివరణము నీవఱకు ౧౭ XVI విషయమునందు విపులముగా వ్రాసితిని. 'మూన్ఱు' మున్నగు శబ్దములలోని న కారము శబ్దావయవమె కాని యుచ్చారణార్థము నిల్చిన వర్ణము కాదు. 'న్ఱు' అనుదానిని 'న్ఱు' అని పలుకుట కేవలము నపభ్రష్టము. ఇందు రేఫోచ్చారణము భ్రాంతిమూలకము. ఇందలి ఱకారము 'ట-త' ల యుచ్చారణమునకు సన్నిహితము. కాన నది యుచ్చారణవశమునఁ గల్గిన యాగమము కాదు. ఱకారము నలఘు రేఫముగాఁ బల్కుట యర్వాచీనముగా సంభవించిన భ్రాంతిచే 'న్ఱు' అనుదానిని 'న్ఱు' అనురీతిని రేఫకలితముగఁ బల్కుట సంభవించెను. ఇట్టి రేఫకలితోచ్చారణము తొల్కాప్పియ సమ్మతముగాదు.

౧౯. IX విష:—"అఱవమున 'శ-ష-స'లు లేవు. తక్కిన ద్రావిడ భాషలలోఁ దద్భవములందును దేశ్యములందును వ్రాఁతయందును నుచ్చారణమునందును నివి తఱుచుగఁ గలవు. అఱవమున సంస్కృత భవములందు శవర్ణముచోట 'చ' కారమును వ్రాయుదురు. కాని 'శ' అనియె పల్కుదురు.... నవీనాఱవగద్య గ్రంథములందును నవీనాఱవ పండితుల వాడుకలందును

సంస్కృతభవములలో 'ష-స'లు గలవు. వీనిని గ్రంథాక్షరములతో వ్రాయుదురు. గ్రామ్యాళవమున సంస్కృత భవములలోని షకారముచోట 'డ' కారమును గొన్నియెడల టకారమును మఱి కొన్నియెడల దంత్య దకారమును నిల్చును. సకారస్థలమున గ్రామ్యాళవములో దంత్య తదలను గొన్నియెడల 'చ' కారమును (వ్రాఁతలోనె 'చ' కారము. పలుకుబడిలో శ వర్ణమె) మఱి కొన్నియెడల లోపమును గల్గును. ఇంకొక కొన్నియెడల సకారమునకు ముందు 'ఇ' కారము నిల్చును," (కాల్డు. ౧౪౬-౧౪౭ పుటలు).

విమర్శము:—ప్రాచీన తమిళమున 'శ ష స'లు లేని మాట నిజమె. కాని తక్కిన ద్రావిడభాషలలో శ షలు గలవనుట కల్ల. ఆంధ్రకర్ణాటముల లోని తద్భవములందుఁగాని దేశ్యములందుఁగాని 'శష' లెంతమాత్రము లేవు.

'శ షయో స్సః-' (కర్ణా. భూష. ౧౧౬ సూ.)=ఉదా:—సం-శశీ-కన్న-ససి. సం-శేషా-(అక్షతలు)=కన్న-సేసె. సం-శిశు-కన్న-సిసు. సం-మషీ-కన్న-మసి. ఆంధ్రకర్ణాట తత్సమ శబ్దములందు, 'శ-ష-స'లు మూఁడును నుండును. ఉదా:—శేషము. మొ. ఇట్లె తెల్గునందు 'శ ష'లు సకారమగును. ఉదా:—సం-భాషా. తెల్గు-బాస-సం-ఆశా-తెల్గు-ఆస. మొ.

ఆంధ్రకర్ణాటములందువలెఁ దమిళమునఁ దత్సమ శబ్దములు విభక్తి మాత్ర వ్యత్యాసముతో యథాస్థితముగ సాధారణముగ నిలువవు. సంస్కృత శబ్దములు తమిళములోనికి వచ్చునపుడు తమిళ తద్భవపు మార్పులనందియె వచ్చును. అట్లగుటచేత మార్పులనందని తత్సమము లనఁదగు శబ్దములు మిక్కిలి యరుదుగ నుండును. ఉదా:—అమలమ్-కమలమ్ మొ. సాధారణముగా సంస్కృత శబ్దములు మార్పులనంది తద్భవములుగానె యళవములోనికి వచ్చును. ఉదా:—సం-శాఖ=తమి-చాగ. సం-దశ=తమి-తచ. సం-భాషా-తమి-పాడై. సం-స్త్రీ=తమి=_స్తిరి. సం-సహస్ర=తమి-ఆయిరమ్. మొ. సంస్కృతభవములలో శకారముచోట వచ్చు 'చ' కారమును నేఁటి తమిళులు 'శ' వర్ణముగానె పల్కుదురు. ఇట్టి పలుకుబడి యర్వాచీనము. నేఁటి తమిళపండితులచే గద్యపద్యములలో 'ష-స'లే కాక-జ-క్ష-హ' అనునవియు గ్రంథాక్షరములతో వ్రాయఁబడును. గ్రామ్యాళవమున 'ష' కారముచోట 'స-శ' లను బలుకుటయుఁ గలదు. ఉదా:—భాషై=బాసై. విశేష=విశేశమ్. మొ.

౧౯. X విష:—నన్నూలులోని తద్భవ ప్రక్రియ ప్రసంగవశమున నిట నుదాహరింపఁ బడుచున్నది.

"అవట్రుల్......" (నన్నూలు. ౧౪౭ సూ).

౧. ఋకారము 'ఇరు' అగును లేదా 'ఇ' అగును. ఉదా:—సం-ఋషి=తమి-ఇరుడి. సం-ఋషభ=తమి-ఇడపమ్-మొ.

౨. వర్గ ద్వితీయ తృతీయ చతుర్థములు వర్గాద్యక్షరము లగును సం-నఖ=తమి-నకమ్. మొ.

3. జకారము 'చ' లేదా 'య' అగును. ఉదా:—సం-గజ=తమి-కయమ్.

౪. శవర్ణము 'చ' లేదా 'య' అగును. ఉదా:—సం-శబ్ద=తమి-చత్తమ్. సం-దేశ=తమి-తేయమ్. మొ.

౫. షకారము-'చ-ట' అనువానిలో నొకటిగ మాఱును. పదాదిని 'చ' కారమగును-తక్కిన యెడల 'ట' కారమగును. ఉదా:—సం-షణ్ముఖ=తమి—చమ్ముకన్. సం-విషయ=తమి-విడ (ట) యమ్. సం-భాషా=తమి-పాడై (టై). తమిళ దేశ్యమగు "పాడై" శబ్దమునకుఁ శవమును వేసి కట్టెడి "నిచ్చెన" అని యర్థము.

౬. సకారము 'చ-త'లలో నొకటి యగును. ఉదా:—సం-సమయ=తమి-చమయమ్. సం-మాస=తమి-మాద (త) మ్-మొ.

౭. హకారము 'య-క'లలో నొకటిగ మాఱును-ఉదా:—సం-మహిష=మయిడమ్. సం-మోహ=తమి-మోకమ్. సం-ఆహార=తమి-ఆకారమ్. మొ.

౮. ఆకారము 'ఐ' అగును. ఉదా:—సం-సీతా=సీతై (తమి). ఈకారము 'ఇ' అగును. ఉదా:—సం-నదీ=తమి-నది.

౯. "రవ్వీఱుక్క......" (నన్నూ. ౧౪౮ సూ.)=రేఫాది శబ్దములకుఁ బూర్వమున 'అ-ఇ-ఉ' అనువానిలో నొకటియు, లకారాది శబ్దములకు ముందు 'ఇ-ఉ' లలో నొకటియు యకారాది శబ్దములకుఁ బూర్వమున 'ఇ' కారమును నిల్చును. ఉదా:—సం-రఙ్గ=తమి-అరఙ్గమ్. సం-రామ=తమి-ఇరామన్. సం-రోమ. తమి-ఉరోమమ్. సం-లక్ష్మీ=తమి-ఇలక్కుమ్మి. సం-లోభ=తమి-ఉలోపమ్. సం-యమ=తమి-ఇయమన్. మొ. (చూ. ౧౯ IV విష). ఒక్క స్త్రీ శబ్ద నకారమునకు ముందు 'ఇ' చేరును. సం-స్త్రీ=ఇస్త్రిరి. సంస్కృత టకారమునకు ముందును 'ఇ' కారము చేరును. ఉదా:—సం-టక్క=తమి-ఇడ (క్క) క్కమ్. ఇకారము చేరుట నన్నూలున లేదు. మొ. (చూ. ౧౯ II విష).

౧౦. "ఇకైన్ది......" (నన్నూ. ౧౪౯ సూ.)=సంయుక్తాక్షర శబ్దములలో సంయోగము నడుమ—'య-ర-ల' అనువానికి ముందు 'ఇ' కారము నిల్చును. 'మ-వ' లకు ముందు 'ఉ' కారము నిల్చును. 'న' కారమునకు ముందు 'అ' కారము నిల్చును. రేఫమునకుఁ దర్వాత 'ఉ' కారము వచ్చుటయుఁ గలదు. ఉదా:—సం-వాక్య=తమి-వాక్కియమ్. సం-శుక్ల=తమి-

చుక్కిలమ్. సం-వక్ర=తమి-వక్కిరమ్. సం-పద్మ=తమి-పదుమమ్. సం-పక్వ=తమి-పక్కువమ్. సం-రత్న=తమి-రతనమ్. సం-అర్థ=తమి-అరుత్తమ్.

"నన్నూలుకర్త తద్భవ ప్రకరణాంతమున 'పిఱ' అనెడి పదమును నిల్పి యున్నాఁడు. కావలసినవాని నా పదమువలన గ్రహించుచున్నారు." (విద్వాన్ వే. వెంకటరాజులు రెడ్డిగారి జాబు ౯-౨-౧౯౫౨ తేదీ).

"అఱవ మలయాళములలో 'హ' కారము లేదు. ద్రావిడభాష లన్నిటిలోను మొదట నీ యక్షరము లేదనియు సంస్కృత సంబంధమున నాంధ్రకన్నడములలోఁ బ్రవేశించెననియు గ్రహింపనగును. తమిళమున మహాప్రాణములగు వర్గీయవర్ణములును లేవు. దీనివలన నఱవమునకు సంస్కృత సంబంధము మిక్కిలి తక్కువ యని విశదమగుచున్నది. ప్రాకృతములలో వర్గీయ మహాప్రాణములు లేకుండుటయు ద్రావిడ సంబంధముననే సంభవించెనని డా. త్రంపుదొరగారు వ్రాసిరి. నవీన కన్నడమున 'ప' కారస్థానమున హ కారము వాడఁబడుచున్నది." (కాల్డు. ౧౪౭ పుట).

విమర్శము:—"ఆంధ్రకర్ణాటములలో మొదట హకారము లేదనుట నిరాధారము. హజ్జ=అజ్జ-హడపము=అడపము. హత్తు=అత్తు. రహి-హెచ్చు-హాళి-హావణ-బేహారము-మోహారము-మున్నగు పెక్కు శబ్దములు తెల్గున హకారముతోడివి గలవు.

ఎ-గీ అధిపకృపి నేయుటయును బేహారమాడు। టయును......(శాంతి. ౨ ఆ.) క-అరయుదముగాని యిమ్మో। హారమునకును డా పలించి యరదముఁ బోని। ము......(విరా ౪ ఆ.) క-మో హారము నడచుచుండఁగ। నీహారి......(ఉద్యో. ౧ ఆ. ౨౧౩).

పకారము హకారమగుట నవీన కన్నడమునఁ గలదననేల? "పో హో వా" (కర్ణా. భూ. ౧౧౫ సూ.) ఇట్లు ప్రాచీన కర్ణాట వైయాకరణులు హకా రాదేశమును సూత్రించిరి. "క. అవతరి సిర్కుం పత్వ। కెక్క పత్వ హత్వ వ్యవస్థె కెలకెల వెడెయొళ్।........." (కేశవుని శబ్ద మణిదర్పణము. ౨౫౮ ప.).

ప్రాకృతములలో మహాప్రాణములు లేవనుట వింత. "సస్య ఖఛహాః (వృత్తి) సకారస్య స్థానే ఖ-ఛ-హా భవన్తి. ఉదా:—సం-భిక్షా=ప్రా. భిఖా. సం-షణ్ముఖః=ప్రా. ఛమ్ముహో." (చండుని ప్రాకృత లక్షణము III వ్యంజన విధానము).

"గరహాణాం ఘణఝాః. (వృత్తి) గరహాణాం స్థానే ఘణఝా భవన్తి యథాసంఖ్యమ్. ఉదా:—సం-గృహ. ప్రా. ఘరమ్.........సం-వాహ్యః. ప్రా-వజ్ఝో." (చండ ప్రాకృతలక్షణ III వ్యంజన విధానము).

ఇట్లు ప్రాకృతమున సహజములగు మహాప్రాణములు వెలసియుండుటే కాక యల్పప్రాణములచోట సైతము కొన్నియెడల మహాప్రాణములు నిల్చి చున్నవి.

"ఘర్ = (ఇల్లు.) ఖడీ = (గణితము.) ఆఖ్ = (కన్ను.) ఉఠ = (లేచు.) పఢ = (చదువు.) దేఖ = (చూడు.) ముఝుకో = ముఝు = (నన్ను-నాకు)" మొదలగు ననేక శబ్దములు మహాప్రాణ ఘటితములు ప్రాకృతాపభ్రంశరూప హిందీ ప్రభృతులందును గలవు.

౨౦. విష:—"టవర్గము, హిందూదేశ భాషలలో మాత్ర మగపడు చున్నది. దీనినిబట్టి చూడఁగా ద్రావిడభాషలనుండి సంస్కృతములోనికిని దజ్జన్య ప్రాకృతములలోనికిని దదపభ్రంశములగు హిందీ మరాటీ ప్రభృతుల లోనికిని మూర్ధన్యములు ప్రవేశించెనని యూహింపనగును.

I. ద్రావిడభాషలలో మూర్ధన్యములు తఱుచుగాఁ బ్రకృతి సిద్ధములై యుండును. సంస్కృతమున సంధిజన్యములై యుండును.

II. సంస్కృతేతరములగు హిందూ జర్మానికు భాషలలో మూర్ధన్యములు లేవు.

III. అఱవముకన్నఁ దెలుఁగున మూర్ధన్య ఘటితశబ్దములు తక్కువగుటకుఁ గారణము తెల్గునకుఁగల సంస్కృత సంబంధాతిశయము.

IV. నారిస్ దొరగారు సయితము పయిరీతినె యభిప్రాయపడి యున్నారు.

V. దంత్యమూర్ధన్యభేదమున నర్థభేదముగల్గు స్థలములు పెక్కు గలవు.

| తమిళము | |
|---|---|
| ౧. కుది = గెంతు<br>కుడి = త్రాగు<br>౨. పుదై = పూడ్చు<br>పుడై = కొట్టు<br>౩. కత్తు = ధ్వనించు<br>కట్టు = బంధించు<br>౪. కొత్తు = గొప్పు త్రవ్వు. నఱకు<br>కొట్టు = వాయించు<br>౫. ఎన్ = అను = చెప్పు<br>ఎణ్ = లెక్కించు | ఇట్టి దొక పెద్ద పట్టిక ప్రదర్శింపఁబడెను. |

౬. మనై = ఇల్లు
మణై = పీట
౭. కొల్ = చంపు
కొళ్ = తీసికొను
౮. అరు = అరుదుగనుండు
అఱు = నఱకు

ఇట్టి దొక పెద్ద పట్టిక ప్రదర్శింపఁబడెను.

VI. సంస్కృతమున మూర్ధన్యములను విడిచినను క్షతి లేదు. అఱవమున నట్లు విడిచినచో వాడుకకె భంగము గల్గును.

VII. ఆర్యులు హిందూదేశమునఁ బ్రవేశించిన తర్వాతనే కాక యంతకు ముందును—హిందూ దేశమునకు వచ్చునపుడు బెలూచి స్థానమునందలి బ్రహూయి భాషవారితోడి సంబంధము గల్గియుండిరి. అక్కారణమున నార్యుల కప్పుడు ద్రావిడ సంబంధము గల్గెను." (కాల్డు. ౧౮౭ మొ. ౧౫౦-వ. పుటలు).

విమర్శము:—పై విషయములు సరికావనుచు-'కీ-శే' డా. చిలుకూరి నారాయణరావుగారీ క్రింది రీతిని వ్రాసిరి. డా. కాల్డువెల్ దొరగారు నారిస్ దొరగారిని సాయముచేసికొనఁగా డా. నారాయణరావుగారు "బీమ్సు—హానెర్నెల్" దొరగార్లను 'పోటీ' చేసిరి.

బీమ్సుదొరగారి యాశయములు:—"వేతస శబ్ద మార్యభాషలలోనిది. (చూడు. ల్యాటిన్ "vitex = విటెక్సు. vitis = విటిస్." ప్రాచీన జర్మానిక్కు—వీడా = wida. ఇంగ్లీషు villow = విల్లో).

౧. సంస్కృతమును సంబంధించిన భారతీయేతర భాషలందు మూర్ధన్యోచ్చారణము లేకపోలేదు. భారత వర్షమునందువలె నా మూర్ధన్యముల యుచ్చారణ మంత స్పష్టమైనది కాకపోయినను దంత్యోచ్చారణముకంటె నది మూర్ధన్యోచ్చారణమునకు సన్నిహితముగా నుండును. మూర్ధన్యోచ్చారణము లేకుండినచో సంస్కృతమందలి దకారము భారతీయేత రార్యభాషయందు లకారముగఁ గానఁబడుటకుఁ గారణము లేదు.

౨. సంస్కృతమందలి దంత్యములు ప్రాచీనమైన వనియుఁ బ్రాకృతాధునిక భారత వర్షీయ భాషలయందలి మూర్ధన్యము లర్వాచీనములనియు ననుకొనఁ గూడదు" అని యిట్లు బీమ్సుదొరగారి యాశయములను నారాయణరావుగారుపన్యసించిరి. (ఆం. భా. చ. ౨౩౧ మొ. ౨౩౩-వ. పుటలు).

హాయెర్నెల్ దొరగారి యాశయములు:—"హాయెర్నెల్ పండితుఁడు ద్రావిడభాషా సంపర్కమువలన సంస్కృతమునందు మూర్ధన్యములు చేరినవను వాదము నాదరింపక యార్యభాషలందే కొన్ని శబ్దములు తేలికయగు దంత్యోచ్చారణమును, గొన్ని శబ్దములు పరుషమగు మూర్ధన్యోచ్చారణమును గల్గి యున్నవని యనే కోదాహరణముల నిచ్చి సాధించియున్నాఁడు. ద్రావిడ భాషల ప్రోద్బలమే సంస్కృత మూర్ధన్య స్థితికిఁ గారణమైనచో సింధీ మొదలగు భాషలయందుఁ దమిళమందువలెనె యింక నెక్కువగానే మూర్ధన్యోచ్చారణ ముండుటకును ద్రావిడభాషలకు సమీపమందుండు 'ఒఱియా' మొదలగు వానియందంత యెక్కువగా లేకుండుటకును గారణము కానరాదు" అని యిట్లు హాయెర్నెల్ దొరగారి యాశయముల నుదాహరించుచు డా. నారాయణరావుగా రుపన్యసించిరి.

పై సందర్భమువలన డా. కాల్డువెల్లుగారు చూపిన ౨-౩-౪-యుక్తులు పూర్వపక్షము లైనవనియు వ్రాసిరి.............

"సంస్కృతమున సయితము దంత్యమునకుఁ బదులుగ మూర్ధన్యమును జేర్చినచోఁ జాల నర్థ భేదము గల్గును. దీనికి నూర్ల కొలఁదిగ నుదాహరణముల నీయవచ్చును. కొన్ని మాత్రమిచటఁ బొందుపఱుపఁబడినవి.

—సంస్కృత—

౧. అట్=తిరుగుట.
అత్=సంపాదించుట.
౨. అడ్=ప్రయత్నించుట.
అద్=తినుట.
౩. ఆట్=బెకబెకలాడుట.
ఆత్=తర్వాత.
౪. ఇట్=పోవుట.
ఇత్=ఒక యనుబంధము.
౫. కట=తుంగచాప.
కత=ఒక చెట్టు.
౬. కటక=కడియము.
కతక=చిల్లగింజ. (ఇండుగు)
౭. కటి=నడుము.
కతి=ఎన్ని.
౮. ఆడి=ఒక జలపక్షి.
ఆది=ఆరంభము.

౯. తట=తీరము. తత=వ్యాప్తము. నట=నటుఁడు. నత=నమ్రుఁడు మొదలగు నవెన్నియేని యుదాహరింపవచ్చును" అనుచు డా. నారాయణరావుగారొక పట్టికను జూపిరి (ఆం. భా. చ. ౨౩౩ మొ. ౨౩౫-వ. పుటలు).

ఆంధ్రభాషా వికాసకర్తగారీ విషయములను బరిశీలించు సందర్భమునఁ దొల్కాప్పియరుగారి కాలమున 'ట ణ'లు దంతమూలీయములై యుండెనని తలంచి యీ క్రింది రీతిని వ్రాసిరి. "ద్రావిడమునందలి 'ట ణ'లు దంతమూలీయములని తొలుకాప్పియము వచనమునుండి తెలియుచున్నది" (ఆం. భా. వి. ౩౫౫ పుట.) "టకార ణకారములు నాలుక కొనయును అంగిటి కొనయుఁ జేరుట వలనఁ గలుగును. అనఁగా నేఁటి సాంస్కృతిక టవర్గముచ్చరింపఁబడుచున్నట్లును, ద్రావిడభాషలలోని టవర్గముచ్చరింపఁబడుచున్నట్లును తొలుకాప్పియనారు కాలమున 'ట-ణ' లుచ్చరింపఁబడలేదనుట స్పష్టము. తరువాత వాని యుచ్చారణము కాలక్రమమున మాఱి సాంస్కృతిక వర్ణములతో సమమయినదని యంగీకరింపవచ్చును." (ఆం. భా. వి. ౩౫౩-౩౫౪ పుటలు).

వీరు తొల్కాప్పియ సూత్రమునకుఁ జేసికొన్న యర్థము సరికాదు. అంగిలి యనఁగా నంతర్గళము. అంగిటి కొనయును నాలుక కొనయుఁ జేరుట యసంభవము. "అంగిలి. వి—ఔ. (కన్న-అంగుళ) అంతర్గళము. లోకుత్తుక. కొండనాలుక యుండుచోటు." (సూ-రా-ని.) "అంగిలి-దే-వి. లోకుత్తుక. అంతర్గళము" (శ-ర).

"టకార ణకారమ్......" (తొల్కా-. ౯౧ సూ.)=టకారమ్=టకారమును, ణకారమ్=ణకారమును, నునినా=కొననాలుకయు, (నుని) అణ్ణమ్=మూర్ధము భాగమును జేరఁగాఁ బుట్టును. ఈ సూత్రపు వ్యాఖ్య:—"టకారముమ్ ణకారముమ్, నుని నావుమ్ నుని అణ్ణముమ్ ఉఱప్పిఱక్కుమ్." దీని ప్రతి పదార్థము:—టకారముమ్=టకారమును, ణకారముమ్=ణకారమును, నుని నావుమ్=కొననాలుకయు, నుని అణ్ణముమ్=మూర్ధము చివరభాగమును, ఉఱ=చేరఁగా, పిఱక్కుమ్=పుట్టును" (౯-౨-౧౯౫౨ తేదీ జాబు. శ్రీ. వే. వేంకటరాజులురెడ్డిగారు) ఇట్లు తొల్కాప్పియరును, దొల్కాప్పియ వ్యాఖ్యాతయు 'ట-ణ'లు మూర్ధన్యములని కంఠోక్తముగ వచించుచుండఁగా 'ట ణ'లు దంతమూలీయములని తొల్కాప్పియమునఁ జెప్పఁబడెనని వ్రాయుట సరికాదు. ఆంధ్రభాషా వికాస కర్తగారు టిప్పణములో నుదాహరించిన వ్యాఖ్యాన పంక్తులును బ్రమాదభూయిష్ఠములె. విస్తరభీతి నుదాహరింపలేదు.

పయిరీతిని వచించిన తొల్కాప్పియ వాక్యములనుబట్టి 'ట ణ'ల స్థాన కరణ వివరణము సంస్కృత ప్రాతిశాఖ్యము వివరణమున కంతగా విభిన్నమై యుండలేదనుట స్పష్టము.

"జిహ్వాగ్రేణ ప్రతివేష్ట్య మూర్ధని ట వర్గే. (తై. ప్రా. ౨ అధ్యా. 32 సూ.) నాలుక తుదిని మణచి మూర్ధమును దాఁకించుట టవర్గోత్పత్తియందు సంభవించునని యర్థము.

సంస్కృతమందలి మూర్ధన్యములు ప్రకృతిసిద్ధములు కావనియు సంధి జన్యములనియుఁ గాల్డువెల్లుగారు చెప్పుటయు సరికాదు. టాంతములు-ఠాంతములు-డాంతములు ణాంతములు నని కవి కల్పద్రుమమున ననేక ప్రకృతులు వివరింపఁబడినవి.

"అట్టక్ తౌచ్ఛ్యేఽనాదరేఽట్టాత్। టాద్-టాజ్ జతిక్రమే వధే। అట ఇట్ కట్ కటి కటీ। గత్యామే కట్ వృతౌన్యపి।......టాన్తా ఇత్యేకసప్తతిః।" "అఠిజ్జ ఠగతే......ఠాన్తా స్త్రివింశతిః॥". "అడ్డ అడ్డాభియోగేఽడ్రన్। ......డాన్తా ష్షట్సప్తతి ర్మతాః॥" "ఘుణ్ఢాన్వేషణ ఇత్యేకో। ఢకారాన్తః ప్రకీర్తితః" "అణ్ రవేఽణ్ యజ్ ప్రాణ......ణాన్తాః పఞ్చాశ దీరితాః" (కవి కల్పద్రుమము ౨౮ మొ. 30-వ పుటలు).

'ఋ-ర-ష' కారముల సంబంధము లేకయె 'ణ' కారాంతములు (ణోప దేశములు) పెక్కు ధాతువు లుండఁగా ణకారము సంస్కృతమున సంధి జన్య మనుట యెట్లు?

ఋగ్వేదమునందు ధారాళముగా 'ట' వర్గ ఘటితశబ్దము లనేకములు వెలయుచున్నవి. ఆర్యులు హిందూదేశమునకు వచ్చిన కొలఁది కాలములోనే వేదములను రచించికొనిరని కాల్డువెల్లుగారే వ్రాసిరి. ఇట్టి యల్పకాలములో ద్రావిడుల సంపర్కమున 'ట' వర్గము నార్యులు ద్రావిడులనుండి గ్రహించి రనుట విశ్వసనీయమా? ఇంక మధ్యాసియాలోనో? బెలూచిస్థానములోనో ద్రావిడులనుండి యార్యులు టవర్గను గ్రహించిరనవలయును. వేదరచయిత లగు నార్య్య లంతకాలము బెలూచి స్థానమున నివసించి బ్రహుయీ భాష వారితో—ద్రావిడ లక్షణములుగల బ్రహుయీ భాషవారితో—కలసి మెలఁగి రనుట కాధారమేమి? ఋగ్వేదకాలమునకు ముందటి చరిత్రము గాఢాంధ కారమగ్నముగదా! ఎట్లు నిర్ణయింపనగును? ఇట్టి యూహాము లభిత్తి చిత్రములు గదా?

౨౧. I విమ:—కాల్డువెల్లుగారు తఱచుగా నేఁటి తమిళ వ్యావహారిక శబ్దములను విమర్శించుచుందురు. అదియంత యావశ్యకముకాదు. వ్యవహార ప్రవాహమున క్షణక్షణమును మాఱుటచేత విలక్షణమగుచున్న నేఁటివాడుక భాష ప్రాచీన భాషాస్వరూపజ్ఞానమునకు సాధకము కానేరదు. ప్రాచీన వాఙ్మయమును బ్రాచీన వ్యాకరణములును బ్రాచీన భాషాస్వరూప ప్రదర్శనమునకు మంచియాధారములు. ప్రాచీన వ్యావహారిక భాషను జక్కఁజేసినవే ప్రాచీన వాఙ్మయస్థ భాషయుఁ బ్రాచీన వ్యాకరణ ప్రదర్శిత భాషయు. ఈ సందర్భమునఁ దఱచుగా శ్రీ విద్వాన్. వే. వేంకటరాజులు రెడ్డిగారినుండి సంగ్రహించినదే వ్రాయఁబడు చున్నది.

౨౧. II విమ:—"అఱవమునందలి 'గ' కారము తెల్గునఁ గొన్నియెడల 'వ' కారమగును. ఉదా:—అఱ-ఆగు. తెల్గు-అవు. 'కా' అను తెలుఁగు భావార్థకమందుఁ బ్రాచీనమగు తమిళమునందలి 'ఆగు' ధాతు 'గ' కారము కన్పట్టుచున్నది. అఱవమునఁ బదమధ్యమందే 'గ' కారోచ్చారణ ముండును. గకారము దెనుఁగునఁ బదమధ్యమున వకార మగుచున్నది. ఇట్టి మార్పు తమిళమందును దక్షిణదేశమునఁ గలదు. ఉదా:—తమి-నోగ. దక్షిణ తమి-నోవ. (నొచ్చు - నొచ్చఁగా) పదమధ్య గకారము లోపించుటయుఁ గలదు. ఉదా:—తమి-పగుది=(భాగము=పాలు) పాది. తమి-శగడు=శాడు. (బండి). తెనుఁగులోఁ దఱచుగా నిట్టి వకారము నుచ్చరించుటయే కాక వ్రాయుటయుఁ గలదు. ఉదా:—తె-పగడము. దీని గ్రామ్యరూపము (corrupted) పవడము. సంస్కృ. లఘు. లాటిన్-లెవిస్. తెల్గున వకారమునకు గకారమగుటయుఁ గలదు. మలయాళమందును గొన్నియెడల నిట్టి మార్పు గలదు. ఉదా:—చువన్న-(ఎఱ్ఱని)=చుగన్న. తమి-సివన్ద." (కాల్డు. ౧౫౧ పుట).

విమర్శము:—కాల్డువెల్లుగారి పైవ్రాఁత ప్రమాదభూయిష్ఠముగా నున్నది. తమిళమందు మాత్రము గకారముండి, తెల్గున గకార ఘటిత రూపము లేనపుడు గదా తమిళ గకారము తెల్గున వకార మగుచున్నదని చెప్పవలయును. తెల్గున 'అగు' అనురూపము ప్రాచీనకాలము నుండియు నుండఁగా దానికి 'అవు' అనురూపాంతరము కలిగెను. "క్వచి ద్గకారో వః" అని చింతామణియందును "ఆద్యగస్య గకారస్య। వకారస్తు నదృశ్యతే" అని వికృతి వివేకము (చింతామణి వివరణము) నందును (చూ. 'వ్యా. సం.' ౨౨౬ విమ.) జెప్పఁబడి యున్నది. ఇట్టిస్థితిలో తమిళమందలి గకారమునకుఁ దెలుఁగున వకారమగునని చెప్పుట కేవలము నసంగతము కాదా? అరయనరయఁ గాల్డువెల్లు గారి యాంధ్రభాషా పరిశీలన లోపమును "తెనుఁగులోఁ దఱచుగా నిట్టి

వకారము నుచ్చరించుటయే కాక వ్రాయుటయుఁ గలదు. ఉదా:—తెల్గు-పగడము-గ్రామ్యరూపము-పవడము" అను పంక్తులు దెలుపుచున్నవి. తెనుఁగులో "వ్రాఁతలో లేకుండుట యుచ్చారణమున నుండుట" అను తమిళపద్ధతి లేదే! మఱియు 'పగడము' అనుదానిలోని గకారమునకు వకారాదేశము రాలేదు. ప్రవాళశబ్దభవమగుటంజేసి "పవడమే" మూలపదము. దాని నుండియే 'పగడ' శబ్ద మేర్పడినది. మఱియు 'పవడము' అనునది గ్రామ్యరూప మనుట (corrupted) యింకను వింతగ నున్నది. అదియే 'పగడము' శబ్దమున కును మూలమగు సుశబ్దము. ప్రాచీన తమిళములోనిది 'అకు' ధాతువెకాని 'అగు' ధాతువుకాదు. ప్రాచీనతమమగు కాలములోని యట్టి కకారాంత మునకు నిదర్శనముగాఁ దెల్గున 'కాక్-కక్-కామి-కాని-కమ్ము మున్నగు కకార కలితరూపములు పెక్కు- కన్పట్టుచున్నవి. కాలక్రమమున నట్టి కకార మునకు నాదోచ్చారణము గల్గి (చూ. ౧౭ XXII విష.) తమిళకన్నడములలో 'ఆగు' అనియుఁ దెల్గున 'అగు' అనియు గకారఘటితరూపము లేర్పడినవి. అట్టి గకారము వకారమయ్యెననుట యుక్తము. గకారము వకారమగుట సర్వసమ్మతము. కకారము వకారమగుట యశ్రుతచరము.

"పాది=(భాగము) శాడు=(బండి)" అనునవి గకారలోపమునఁ గల్గిన వనుటకంటెఁ దమిళ ప్రాచీన రూపములగు 'పకుది-చకడు' అను కకార స్థితిలోనే కకారమునకు హకారోచ్చారణముగల్గి తల్లోపమున నేర్పడినవనుట యుక్తము. 'పకుది-చకడు' శబ్దములు "సంస్కృ-భక్త-(భాగ)-శకట" శబ్దభవములనియుఁ దోఁచుచున్నది.

కకారము 'గ' కారముగా మాఱినపిమ్మటనే యది వకారమగుట ద్రావిడభాషలందుఁ బ్రసిద్ధముగాని కకారముగానే యున్నపు డది వకారమగుట ప్రసిద్ధముకాదు. ఉదా:—తెల్గు-చిగురు-చివురు. పగలు-పవలు. కన్నడ:— తొగల్=తొవల్ (చర్మము) (త్వచ్). చిగుటు=చివుటు=(గిల్లు). తమిళమున "నోగ=నోవ" (నొచ్చు) అని కాల్డువెల్లుగారే యుదాహరించిరి.

గ కారము వ కారమగునను పద్ధతి ననుసరించి, "స్టడీ. ద్రవిడియన్ ఫిలాలజీ" లో నీ క్రిందిరీతి కల్పనము చేయఁబడెను. " 'గు' అనునదియు దీని పరిణామమగు 'వు' అనునదియు 'అగు' ధాతుభాగములు......ఈ వకారము పకారముగా మాఱి తమిళమున 'పాక్-వాక్' అనురూపముల నందెను. చెయ్‌వాన్=(చేయఁగలఁడు) ఉణ్ వాన్=(తినఁగలఁడు)......కన్నడమందును 'వ-వ' లు భావ్యర్థకములె." (స్టడీ. ద్రవిడియన్ ఫిలాలజీ ౬౮ పు.) ఈ కల్పనము సరికాదు. తొల్కాప్పియమునాఁటికి సరళోచ్చారణము లేదు. (చూ. ౧౭ XXII. ౧౭ XXIII విష.) ప్రాచీనతమకాలమునఁ దమిళమందు

'గ' కారమే లేనపు డది 'వ' కారమగుటెట్లు? 'వ' అనునది భావ్యర్థకమనియు నయ్యది 'వ' కారముగాఁ బరిణమించుననియుఁ దమిళపండిత సిద్ధాంతము. (చూడు. నన్నూలు. ౧౪౪ సూ.) తొల్కాప్పియమునఁ గాలిక చిహ్నములు చెప్పఁబడకున్నను నవి తొల్కాప్పియమున వాడఁబడియున్నవి. "తొల్కాప్పియరు స్వగ్రంథమున భూతభావికాలబోధక ప్రత్యయాంతములను బ్రయోగించి యున్నారు......'కిడేన్-కిడ్డేన్' అనెడి రూపములుగల క్రియలు ప్రయోగింపఁబడలేదు. భూత-అళపిఱన్దన-(తొల్కా. ౬౩౬ సూ.) కుఱిత్తన-(తొల్కా. ౬౩౯ సూ.) తద్దర్థ-ఆకుమ్-(తొల్కా. ౬౪౦ సూ.) భావి-(భూత) ఎన్వ-(తొల్కా. 3 సూ.)" (విద్వాన్. వే. వెంకటరాజులురెడ్డిగారి జాబు ౧౦-౧౨-౧౯౫౧ తేదీ జాబు). "భావి-"కొడువ్వ ఈయన్......" (తొల్కా. పొరుళధికారము ౧౪౦ సూ.) (విద్వా. వే. వేం. జాబు ౯-౨-౧౯౫౨ తేది) మఱియు "ఆగు" ధాతువు నుండి భావ్యర్థము లభించుటయు నసంభవమె.

౨౧. III విష:—"కకారము చకారముగాఁ దెల్గునందును 'శ' వర్ణముగాఁ దమిళమందును మాఱును......గ్రీకు - డెకా. లాటిను - డెకెన్. సంస్కృ-దశన్. ద్రావిడభాషలందలి 'క-చ' ల మార్పులోఁ గన్నడమున 'క' కారము నిల్చియున్నది.

| కన్న. | తెను. | తమి. | కన్న. | తమి. | తెలు. |
|---|---|---|---|---|---|
| కిన్న | చిన్న | శిన్న | కై | కై | కై-కేలు. |
| కివి | చెవి | శెవి | | | చేయి-చెయ్యి. చేతన్-చేన్. |
| గెయ్ | చేయ్ | శెయ్ | కెడు | కెడు | చెడు. |

సంస్కృతమందును నిట్టి మార్పుగలదు. ఉదా:—వాచః-వాక్.

గ్రాంధికాలవమునందును నుదీచ్య తమిళ వ్యవహారమందును 'క' అని యుండుచోటులందుఁ గొన్నియెడల దాక్షిణాత్య తమిళాధమ వ్యవహారమున "చ" అని యుండును. అట్టియెడలఁ దెనుఁగున 'చ' కారముండును. ఇట్టి మార్పు ధాతువులందుఁ దఱుచు. ఉదా:—

| వ్యాకరణసిద్ధ తమి. ఉదీచ్యవ్య. | తక్కువజాతి దాక్షిణాత్యతమి. | తెలుఁగు | అర్థము |
|---|---|---|---|
| కాయ్‌క్కు | కాయ్‌చ్చు | కాఁచు | మఱుఁగు=తపించు |
| పాయ్‌క్కు | పాయ్‌చ్చు | — | నీరుపాఱించు |
| వైక్క | వైచ్చ | వైచ | ఉంచఁగా ,, |
| | | | (కాల్డు. ౧౫౧-౧౫౨ పు. |

విమర్శము:—తమిళమున ద్విరుక్తేతరస్థలములందలి చకారముచోట శ వర్ణోచ్చారణ మర్వాచీనమై యుండఁగా 'క' కారము తమిళమున 'శ' వర్ణముగా మాఱునని వ్రాయుటయు మీఁదుమిక్కిలి 'గ్రీకు-డెకా. సంస్కృ-దశన్' అనువానితో సరిపోల్చుటయు సరికాదు గదా. ఇంతియకాక సంస్కృతములోని "వాక్-వాచౌ-వాచః" అను మార్పును సరిపోల్చుట మఱియు విరుద్ధము. సంస్కృతమున 'వాక్' అనుచో 'చ' కారము 'క' కారమగుచున్నది. కాల్డువెల్లుగా రిచట 'క' కారముచోట 'చ' కారము నిల్చునని వచించు చున్నారు. "చోః కుః (౮-౨-30) చవర్గస్య కవర్గః స్యాత్, ఝలి పదాన్తేచ- (సి. కౌ. 3౭౮ సూ.)" అనుచొప్పున 'చ' వర్గమునకు 'క' వర్గము సంస్కృతమున నాదేశమగును. ఉదా:—వాచ్-వాక్. "కుహోశ్చుః (౭-౪-౬౨) అభ్యాసే కవర్గ హకారయో శ్చ వర్గాదేశః" (సి. కౌ. ౨౨౪౫ సూ.) ఉదా:— కృ+కృ+తిప్=చకార. మొ. ఇట్లు సంస్కృతమునఁ గొన్నియెడల 'క' కారము 'చ' కారమగును. కొన్నియెడల 'చ' కారము 'క' కారమగును. దీనినిబట్టి పరిశీలించునపుడు "కన్నడ 'క' కారమే ప్రాచీనమని యెట్లు నిర్ణయింపనగును? 'చెవి' 'కివి' అనురూపములలో 'చెవి' అని తమిళమందును నుండుట చేత 'చ' కారమే ప్రాచీనతమమని చెప్పుట యుక్తము. ("కకారము చకారముగా మాఱెననుటకును న్యాయము కలదు. 'ఇ-ఈ-ఎ-ఏ'లతో నుండునపుడు కకారము చకారముగా మాఱును. "అ-ఆ-ఉ-ఊ-ఒ-ఓ" లతోఁ గూడిన 'క' కారము చకారముగా మాఱదు. కావునఁ దాలవ్యాచ్చుల యోగమున "క" కారము తాలవ్య 'చ' కారముగా మాఱు ననఁదగును." విద్వాన్. వే. వేంకటరాజులు రెడ్డిగారు. ౨౯-౮-౫౨ జాబు). ఇంక "కాయ్‌కు-పాయ్‌కు" అనునవి తమిళమున లేవు. 'కాయ్-పాయ్" అను ధాతువులే ప్రాచీనులచేత స్వార్థప్రేరణములందు వాడఁబడును. వాని భావలక్షణార్థక రూపములు 'కాయ్‌క (కాచఁగా) పాయ్‌క' (పాఱింపఁగా) అనునవి గలవు. 'పాయ్‌చ్చు' అని నేఁటి నాగరకులు వాడుదురు. ఇంకను 'కాయ్‌చ్చు-కాయ్‌త్తు-పాయ్‌త్తు' అనియు నేఁటి తమిళులు వాడుదురు. అట్లె 'వైత్త' అనుదానిచో 'వైచ్చ' (పెట్టిన) 'వచ్చ' అనియు నగును. 'వైక్క' అనునది భావలక్షణార్థకము= (పెట్టఁగా=ఉంచఁగా). 'వైక్క' అనుదానిచో 'వైచ్చ' అని పల్కరు. 'కాఁచి' అనుక్త్వార్థమున 'తు' వర్ణాంతములగును. కాయ్‌త్తు-మొ.

౨౧. IV విష:—"కకారము కొన్నియెడల 'త' కారమగునని తోఁచెడిని. ద్రావిడ భాషలలో నిందులకుఁ దగిన యుదాహృతులు దొరకలేదు. '(కొప్పూళ్ = తొప్పూళ్ (నాభి)' అనురీతివి దొరగాదికి స్ఫురింపవయ్యె!

'గోండు' అను ద్రావిడభాషలోని కొన్ని ప్రత్యయములందలి (పురుషబోధక సర్వనామ ప్రథమా బహువచన ప్రత్యయములు-మొ.) తకారము తమిళ 'క' కారమునుండి వచ్చెనని తోఁచుచున్నది. తెనుఁగు - వాకిలి, మలయా - వాతిల్-ఇట్లున్నను వ్యావహారికాఱవమున 'వాచల్' అనియు గ్రాంధికాఱవ మున 'వాయిల్' అనియు నుండుటచేతఁ బైయాంధ్ర మలయాళ శబ్దములనుబట్టి 'క-త' లకు మార్పు నంగీకరించుటకు సంకోచింపవలసి యున్నది. ఇతరభాషా కుటుంబములలో నిట్టిమార్పు తఱుచుగ నున్నది. ఉదా:—"గ్రీకు-'తానస్'= (వాఁడు) అనుదానికి మాఱుగ 'ఎ-కెనెస్' కలదు." (కాల్డు. ౧౫౨ పుట).

విమర్శను:—గ్రీకు మున్నగువానిలోని మార్పుల కిట నంతగాఁ బ్రసక్తిలేదు గదా. ద్రావిడభాషలలో నుదాహృతులు దొరకలేదని తానే వ్రాసెను గదా. 'వాకిలి=వాతిల్' అను నాంధ్రమలయాళ శబ్దోదాహరణములు చాల వనియుఁ దానె వచించెను. గోండు భాషలోని పురుషబోధక సర్వనామ ప్రథమా బహువచన ప్రత్యయములలో నీ మార్పు గలదనెనెకాని యొక్క-యుదాహృతినైనఁ జూపలేదు. తమిళ పురుషబోధక సర్వనామ ప్రథమా బహువచన ప్రత్యయములందు 'క' కారము లేదు.

"వాయ్+ఇల్=వాయిల్" అను వ్యుత్పత్తి యుక్తమె. దీనికిఁ దమిళ మున 'వాయ్తల్' అను రూపాంతరమును గలదు.

హళానగన్నడమున 'బాగిల్' గ్రాంధిక తమిళమున 'వాయిల్'. వ్యావ హారిక తమిళమున 'వాశల్'. (వాచల్) అనువానిలోని 'చ=స-య' ల మార్పు సహజమని యీ క్రింది యుదాహృతులు విశదీకరించును.

| కన్న | తమి | తెన్గు |
|---|---|---|
| పె (శ) సర్ | పెయర్ | పేరు |
| బిసిల్ | వెయిల్ | వేఁడి-ఎండ |
| బసిర్ | వయిఱు | కడుపు |
| సాసిరం | ఆయిరమ్ | వేయి (సంస్కృ. సాహ స్రమ్) |

ఇట్లు కన్నడ తమిళములలో 'స-య'ల మార్పు కన్పట్టుచున్నది. సకారము చకారమగుట వింతకాదు. గ్రాంథిక తమిళమున "కయమ్"= (లోతైన మడుగు) అను దానికి వ్యావహారిక తమిళమున 'కసమ్' అను రూపము చూపట్టుచున్నది.

౨౧. V విష:—"శ=చ=జ లు మాఱినచో యకారముగా నే మాఱును. తమిళమున సంస్కృతభవములలో శవర్ణముచోట యకారమె

కొన్నియెడల నిల్చును. సంస్కృ-రాజా-తమి-రాయన్. దాక్షిణాత్య గ్రామ్యాలవమున దేశ్యములందును యకారమె పల్కఁబడును. ఉదీచ్యతమి—అరిశి—(చి) దాక్షిణాత్యతమి-అరియి. (బియ్యము). మల-అరియి. డాక్టరు గుండర్టుగారు "తుళులోని 'పుదర్' (పేరు) అనుచోటఁ గన్నడమున 'పెశర్' అని యుండును గాన 'శ' వర్ణము ద్రావిడభాషలలోని దకారముగఁ గూడ మాఱు ననఁదగు" ననిరి. కన్నడమున 'శ' వర్ణమున్నచోటులందుఁ దమిళమున యకారము నిల్చుచుండును. ప్రాచీన కన్న-పెశర్-తమి-పెయర్. (పేరు). ఈ 'శ-య'లలో నేది ప్రాచీనమో నిర్ణయింపఁజాలము. కాని తమిళములోని 'పెయర్' అనునది కన్నడములో 'పెశర్' అనుదానినుండి వచ్చె ననఁదగును. తమిళమున 'పెయర్' అనునది 'పేర్' అని మాఱుట పయి యూహను బలపఱుచుచున్నది. కాని గ్రాంథికాలవమునందును మలయాళము నందును 'పేర్' అనునదియె వాడఁబడి యున్నది. కాన 'పేర్' అనునదియె ప్రాచీనమైయుండును. ఉదా:—తమి-మల-'పైమ్'=(పచ్చని) అనునదియె గ్రాంథికభాషలో 'పశు (చు) మ్' అనుదానికంటె నధికముగ వాడఁబడియున్నది. పయి సందర్భమునుబట్టి య-శ=(చ) లకుఁ బరస్పరము, మార్పు గలదని మాత్రమె చెప్పుట కవకాశము గల్గుచున్నది." (కాల్డు. ౧౫౩ పుట).

విమర్శము:—'రాయన్' అని తమిళమున నుండనేరదు. 'అరైయన్' అని కాని 'అరసన్' అనికాని యుండును. సమాసమున మాత్రము 'కాళిఙ్గరాయన్' అను రీతినుండును. దాక్షిణాత్యులలో నయిత మెవరో యధమ జాతులవారు 'అరియి' అని వాడుచున్నను దక్కినవారెల్ల 'అరిశి' (చి)=(బియ్యము) అనియె వాడుదురు. మలయాళమున 'అరి' అని యున్నదిగాని 'అరియి' అని లేదు. మలయాళమున 'పేర్' అని యున్నది. ప్రాచీన గ్రాంథిక తమిళమున 'పెయర్' అని మాత్రమె యున్నది గాని 'పేర్' అని యుండలేదు. 'పశు (చు) మై'=(పచ్చని) అని యుండును 'పశుమ్' అని యుండదు. అయ్యది సమాసములో "పశు (చు) మ్=పైమ్" అను రెండు రూపములతోను నుండును. 'పైమ్' అనునది తఱుచనుట నిజము. అయినను 'పశు (చు) మ్' అనునది ప్రాచీనము. దానినుండి 'పైమ్' అనునది యేర్పడెను. కాన 'స-శ' (చ) ఘటిత రూపము ప్రాచీనమని నిర్ణయించుటకు సంకోచింప నక్కఱలేదు. "పెశర్=పెయర్=పేర్" అని వాని యుత్పత్తిలోని వరుసను నిర్ణయించుటలో విరోధము లేదు.తమిళమున 'శ-ష-స'లు లేవు గాన నట్టి 'శ-స'ల యుచ్చారణ స్థలము లందెల్ల 'చ' వర్ణమె కలదని గ్రహింపవలెను.

౨౧. VI విష:—"పదమధ్య 'ట' కారము కొన్నియెడల 'ఱ' కారముగఁ దమిళమున మాఱును. ఉదా:—సంస్కృ. నాడి-తమి-నాఱి. గ్రామ్యతమి-

నాళి. ఇట్లే ప్రాచీన కన్నడమందును సంస్కృత డకారము 'ళ' కారమగును. 'ర ఱ'ల వలెను 'ల ళ'ల వలెను 'డ ట'లు పరస్పర సంబంధము గలవి. 'తుద' అను ద్రావిడభాషా భేదములో 'డ' కారము రేఫమగును. ఉదా.—తమి-నాడు=(దేశము) తుద—నార్. పయిదానికి విపరీతముగ 'ర' కారము డకార మగుటయు ద్రావిడభాషలలోఁ గలదు. ఉదా:—తమి-ఏఱు-తెల్గు-ఏడు (సప్తసంఖ్య) (చూడు. ఐ ౧౭ IX విష). తెలుఁగున డకారము శకట రేఫముగా మాఱుటయుఁ గలదు. ఉదా:—తెల్గు-చెడు-తమి-కన్న-కెడు. వీని ప్రేరణ రూపము తెల్గున 'చెఱుచు' అని యున్నది. అఱవమున 'కెడుక్కు' అని యుండును.'' (కాల్డ్వె. ౧౫౩-౧౫౪ పుటలు).

<u>విమర్శము</u>:—తమిళమున 'నాటి=నాళి' అనుదానికి "ఒకపడి" అని యర్థము. సంస్కృత నాడీశబ్దమున కట్టి యర్థము లేదు. కాన నీ యుదాహృతి సరికాదు. "సంస్కృ-నాడికా-తమి-నాటికై-గ్రామ్యతమి-నాళిగై" అని యుదాహరించుట యుక్తము. ఇంకొక విశేషము-సంస్కృతమందే 'డ' కారము "అజ్మధ్యస్థ డకారస్య। ళకారం బహ్వృచా జగుః" అను తైత్తిరీయారణ్యక వచనముచొప్పున (చూ. ౧౭ IX విష.) దుస్స్పృష్ట 'డ' కారము (ళకారము)గ నుచ్చరింపఁబడును. ళకారవిషయమున నీవఱకు (౧౭ IX.) విపులముగా వ్రాయఁబడెను. "కెడుక్కు" అను ప్రేరణ రూపము తమిళమున లేదు. కెడు ధాతు ప్రేరణ రూపము సయితము "కెడు" అనియేయుండును. 'కెడుక్కు' అని విధిరూపమున నుండును. కెడుక్కు అనియుండదు. మలయాళమున 'కెడుకు' అని యున్నది. "కెడుకు-ది"=(చెఱుపుము. చెఱుచుచున్నావు). "కెడుక్కుదిర్" (చెఱుపుఁడు-మీరు చెఱుచుచున్నారు) అని ప్రాచీన తమిళమున మధ్యమపురుషరూపములు మాత్రము గలవు. వీనియందలి "కెడుకు" అనునది ప్రేరణరూపము కాదు. "కెడు+కు+త్+ఇ=కెడుక్కుది" అను రీతిని ఛేదము నెన్నవలెను. ఇట్లే యర్వాచీన తమిళభాషలో "కెడుక్కిన్రాన్"= (చెఱుచుచున్నాఁడు) అనునది మొదలగు వర్తమాన రూపములు గలవు. వీని యందును 'కెడుకు' ధాతువుకాదు. "కెడు+కు+ఇన్ఱు+ఆన్" అని ఛేదము నెన్నవలయును. "కెడు+కిన్ఱు" అనియు విభాగించియున్నారు" (విద్వాన్. వే. వేంకటరాజులురెడ్డిగారు ౨౯-౧-౫౨. జాబు).

<u>౨౧. VII విష</u>:—"వ్యావహారిక తమిళమున నకారము సైతము 'ణ' కారమగును. తెల్గున మూర్ధన్యము లధికముగానున్నను దమిళాదులలో ణకారమున్నచోటఁ దెల్గున నకారముండును. ఉదా:—తమి-కణ్. తెల్గు-కన్ను. తమి-విణ్. తెల్గు-విన్ను. తమి-మణ్-తెల్గు-మన్ను. తెల్గు తద్భవములందును

నిల్లి. సంస్కృ-గుణము. తెల్గు-గొనము. మలయాళమునఁ గొన్నియెడల 'న' కారము ణకారమగును. ఉదా:—తమి-నినక్కు (నీకు) మల-నిణక్కు= నినక్కు. కొన్నియెడలఁ దెల్గునందువలెనె ణకారము నకారమగును. ఉదా:— తమి-తుణివు. మల-తునియు. (సాహసించు). తమి-ఎణ్బదు. మల-ఎన్బదు. తమిళమున 'ణ' కారమునకుఁ బరస్థిత వర్ణమునుబట్టి మార్పు గల్గదు. ఉదా:— తమి-'పెణ్' (ఆఁడుది) 'పెణ్డు' అయినది. కాని యీ 'ణ' కారమె 'పెట్టై' అను పదములో 'ట' కారమైనది. కన్నడమున 'ఎణ్టు' (ఎనిమిది). ఇది తమిళమునందును 'ఎణ్టు' అనియె యుండియుఁ గాలక్రమమున 'ఎట్టు' అయినది. 'పెట్టై' అనుదాని కళవమున 'పెడై' అను రూపాంతరమును గలదు. ఇందు 'ణ' కారము లోపించినది." (కాల్డు. ౧౫౪ పుట).

విమర్శము:—తమిళులలో ననక్షరు లెవ్వరేని గ్రాంథిక తమిళ 'న' కారమును గ్రామ్యముగ 'ణ' కారముగఁ బల్కుదురేమో కాని సాధారణముగా నెవ్వరును నట్లుపల్కరు. మలయాళమున 'నిణక్కు' అను శబ్దము లేదు. అట్లె మలయాళమున 'తునియు' అని నామశబ్దమున నుండదు. తమిళ మలయాళములు రెంటను వరుసగా "తుణివు" అనియు 'తునివు' అనియు నుండును. తమిళ మలయాళములలో 'ఎంబదు' అని వాడుకలోనున్నది గాని శబ్దతారావళి యను మలయాళ కోశమునందును, డా. గుండర్టుగారి మలయాళ నిఘంటువునందును 'ఎణ్బదు' అని తమిళమందువలెనె యున్నది. 'పెణ్డు' (ఆఁడుది) అనుదాని లోని పూర్వపదము 'పెళ్' (ప్రీతిగల్గు) అనునది కానోపునని 'పెళ్పు'=(పెఱ్పు) (ప్రీతి) అను శబ్దమునుబట్టి తలంపనగును. తమిళమందలి 'ళ' కారము 'త' కారపరకత్వమున 'ట' కారమగునుగాన 'పెట్టై' అనురూపము లభించుట సహజము. ళకారము డ (ట) కారపరకత్వమున 'ణ' కారముగ మార్పునందదు. కన్నడము నందలి 'ఎణ్టు' అను దానినిబట్టి కాల్డువెల్లుగారి యూహ సరికాదనఁ జాలము గాని తమిళమునఁ బ్రాచీన రూపము 'ఎణ్టు' అని యుండెడిదనుట కాధారము లేదు.

"ఆణుమ్ పెణ్ణుమ్......" (తొల్కా. ౩౦౪ సూ.)='ఆణ్-పెణ్' శబ్దముల 'ణ' కారము పరుషపరకత్వమున 'ట, కారము కానేరదు. ఉదా:—ఆణ్+కై=ఆణ్కై (మగవానిచేయి) పెణ్+కై=పెణ్కై (ఆడుదానిచేయి). ఈ సూత్రము చొప్పున 'పెణ్' శబ్ద 'ణ' కారము 'ట' కారము కానేరదుగదా.

"ణళవెన్......" (తొల్కా. ౧౫౧ సూ.) 'ణ-ళ' లకుఁ బరమగు 'త' కారము 'ట' కారమగును. దీనిచొప్పున పెణ్+తు=పెణ్టు (పెణ్డు) అని యేర్పడు ననఁదగును.

"అల్వాటి యెల్లామ్......" (తొల్కా. ౩౯౯ సూ.)=విభక్తి సమాసే తరసంధిలోఁ బరుషపరకత్వమున 'ళ' కారమునకుఁ బాక్షికముగ 'ట' కార మగును. దీనిచొప్పునను పై సూత్రముల చొప్పునను "పెళ్" శబ్దమునుండి "పెట్టై" శబ్ద మేర్పడినదనుట యుక్తము. 'పెళ్+తు+ఐ=పెట్టై' అని ఛేదము నెన్నవలెను.

౨౧. VIII విష:—"అసంయుక్తములగు 'త-ద' లు కొన్నియెడల రేఫ ముగా మాఱును. సంయుక్తములందు నొకప్పు డట్టి మార్పు గల్గును. రేఫము 'త-ద' లుగా మాఱదు. 'ద-ర' లు రెండును దంత్యములె కాన దకారము రేఫమగుట సహజమె. దాక్షిణాత్య వ్యావహారిక తమిళమున నిట్టి మార్పు మిక్కిలి యధికము. ఉదా:—వ్యావ-తమి-విరై (గింజ-లేదా బీజావాపము చేయు) గ్రాంథి-తమి-విదై. కన్నడమునఁ బ్రథమేతర విభక్తులలో నగపడు 'అద్' అనెడి యాగమము కొన్నియెడలఁ 'అర్' అని మాఱును. ఉదా:— 'ఇదు' శబ్ద షష్ఠ్యేకవచనము-ఇదర. (దీనియొక్క). మరశబ్ద షష్ఠ్యేకవచనము- మరద (చెట్టుయొక్క). 'ఇదద' అనికాని 'మరర' అనికాని పలుకుట శ్రమా పాదకమగుటచేత వీనియందిట్టి మార్పుగల్గుట సహజమనియుఁ జెప్పనగును. డా. గుండర్టుగారు 'ఇదర' లోని రేఫముఁ 'ఇదన్' అనెడి యఱవపదమునందలి 'న' కారమును సంబంధించినదని చెప్పిరి. కాని స్థలాంతరములందును—దాక్షి ణాత్య తమిళ వ్యవహారమున—'ద' కారము రేఫమగుట లేకపోలేదు. ఉత్తర హిందీ-బెంగాలీ మున్నగు గౌడభాషలందును బ్రాకృతములందును దకారము రేఫమగుట గలదు. గౌడభాషలలో నట్లు మాఱిన రేఫము తిరిగి లకార మగుటయుఁ గలదు. ఉదా:—సంస్కృ-ద్వాదశ-ప్రాకృ-వారహ-హిందుస్థాని- బారా. సంస్కృ-త్రయోదశ-ప్రాకృ-తేరహ-సంస్కృ-షోడశ-హిందీ-సోలా. ఇట్లు గౌడభాషలలో దకారము రేఫమగుట ద్రావిడభాషా సంబంధముననే కల్గియుండవచ్చును." (కాల్డు. ౧౫౪ పుట).

విమర్శము:—సంయుక్తస్థలములందలి 'త-ద' లు రేఫమగుట కుదాహృతి నొక్కటేనియు నియ్యలేదు. అట్టి యుదాహృతియుఁ గన్పట్టదు. ఇంక న సంయుక్తస్థలమందును గ్రాంథిక తమిళమున నట్టి మార్పున కొక్క ప్రయో గము మాత్రము—క్రీ. శ. ౧౨౦౦ 'అవ్వైయార్' అను కవిప్రయోగము మాత్రము—'విరై' అనునది కన్పట్టుచున్నది. ఇది వాడుకలో నరుదు. వాడు కలో రేఫము దకారమగుటయు లేకపోలేదు. ఉదా:—వ్యా-తమి-కుదవళై = గ్రాంథి-తమి-కురల్వళై (ధ్వనివచ్చెడి కంఠబిలము). "అదఱ-ఇదఱ-ఉదఱ." అనువానిలోనిది ఱకారమె కాని రేఫము కాదు. కాన నది యుదా

హ్మృతికానేరదు. పయిరీతిని మిక్కిలి యరుదుగ నుండు నీ మార్పు ద్రావిడభాషల సంపర్కమున గౌడభాషలందు వ్యాపించెననుట సరికాదు. "'ఇదద-మరర' అని పలుకుట శ్రమాపాదకమగుటచేత నిట్టి మార్పు గల్గె" అను వాక్యము కేవలము నసంగతము. 'ఇదద' అనురూపము వచ్చుటకుఁ బ్రసక్తి యున్నప్పుడు గదా ద కారద్వయోచ్చారణము శ్రమాపాదకమగుటచేత ద కార మునకు రేఫాదేశమువచ్చి "ఇదర" అనురూపము గల్గె ననవలెను. 'అదు-ఇదు-ఉదు' అనెడి 'ఉ' దంతములకు 'ద' అను నాగమము వచ్చుటకుఁ గన్నడ మునఁ బ్రసక్తియే లేదే! "నపుంసక లిఙ్గే దః" (కర్ణా. భూష. ౫౧ సూ.) అను చొప్పున 'అ' దంతములకు మాత్రమె కదా తృతీయాది విభక్తుల స్వరము పర మగునపుడు 'ద' అను నాగమము వచ్చుట కన్నడమునందలి సంప్రదాయము. ఉదంతములకు మఱెచ్చటనైన 'ద' అను నాగమము వచ్చుటను జూపునపుడు గదా యిచట 'ద' అనుదానికి రేఫాదేశమువచ్చు ననవలయును. మఱియు నీ శబ్దములో "ఇదఱ" అనురీతిని ఱకార ముండునేకాని రేఫ ముండదు. "అ ఱు కారస్య సంఖ్యా సర్వనామ గుణవచనేషు" (కర్ణా. భూష. ౫౫ సూ.) అను చొప్పున 'అఱ్' అను నాగమము వచ్చి "ఇదఱిం (తృ-వి) ఇదఱత్తణిం (పం-వి) ఇదఱ (ష-వి)" అను ఱకార ఘటితరూపములు మాత్రమె కన్నడమునఁ బ్రసిద్ధములై యున్నవి. "అదనదు-(దానియొక్క) ఇదనదు (దీనియొక్క)" అనురీతిరూపములు మాత్రమె తొల్కాప్పియము నాఁటికి వెలయుచున్నవి కాన "అదన్ (దానియొక్క) ఇదన్ (దీనియొక్క)" అను తమిళరూపములున్నను గన్నడములోని "అదఱ-ఇదఱ" అనురీతిరూపములకు మూలమనుట యంత విశ్వసనీయముగ నగపడదు. అట్లంగీకరించినను దమిళ మూర్ధన్య నకారము నుండి 'ఱ' కార మేర్పడును గాని రేఫమేర్పడనేరదు. కాన 'ఇదర' అను రేఫ కలితరూప ముండుట శశవిషాణ ప్రాయము.

౨౧. IX విమ:—"తకార దకారములు మలయాళమునఁ గొన్ని యెడల సంస్కృతభవములందు లకారమగును. ఉదా:—సంస్కృ-పద్మమ్. మల-పల్మమ్. సంస్కృ-పద్మనాభ. మల-పల్మనాభ. వ్యావహారిక మల-పల్పనాబ. సంస్కృ-తాత్పర్యమ్. మల-తాల్పర్యమ్. ప్రాచీన ద్రావిడములోని 'తన్' అనునది సంధివశమున మలయాళమునందు 'తఱ్' అగును. ఇది యొకప్పుడు 'తత్' అనియు నొకప్పుడు 'తల్' అనియుఁ బలుకఁబడును. ఇది 'తాన్' శబ్ద రూపము." (కాల్డు. ౧౫౫ పుట).

విమర్శము:—పద్మ శబ్దభవము 'పల్మ' అని మలయాళమున లేదు-'పల్మ' అని మలయాళులు పల్కుదురు కాని కోశములందు "పత్మ" అనియె యున్నది.

'తన్' శబ్ద సకారము దాని పరుమమగు అకారమగుట సహజమె. ఇట్లు తమిలమందును వైకల్పికముగ నగును.

"తమిలమునఁ బదమధ్యగత దకారము (తకారము) చోట శవర్ణము (చవర్ణము) నిల్చును. ఉదా:—పెరిశు-(చు) (పెద్ద)=పెరిదు. గ్రామ్యతమి-వయశు (చు) గ్రాంథి-తమి-వయదు. తెల్గునందును దకారము తఱుచుగా శవర్ణమగును. మలయాళ గ్రామ్యమున 'త' కారము తఱుచుగా 'శ' వర్ణమగును. ఉదా:—"దైవత్తె సేవిక్క" అనుదానిని మలయాళ గ్రామ్యులు "శైవత్తె తేవిక్క" అని పల్కుదురనుచు, డా. గుండర్టుగారు వ్రాసిరి. ఇట్లు 'ద' కారము 'శ' (చ) వర్ణమగుటయు 'శ' (చ) వర్ణము యకార మగుటయు నట్టి యకారము లోపించుటయు మున్నగు వికారములు 'పేరు' శబ్దపు ద్రావిడ రూపములందుఁ బరిశీలింపనగును. తుళు-పుదర్. ప్రాచీనకన్న-పెశర్. గ్రాంథిక తమి-పెయర్. గ్రామ్యతమి-పేర్. తుదభాషలో 'ద' కారము 'త్స' కార మగును. ఉదా:—కన్న-ఐదు. తుద-ఉత్స." (కాల్డు. ౧౫౫ పుట).

విమర్శము:—తకారము శ (చ) వర్ణమగుట వ్యావహారిక తమిలములో మాత్రమె కలదు. గ్రాంథి-తమి-పెరిదు. వ్యావ-తమి-పెరిశు (చు). తమిల మున నూష్మములులేమింజేసి సకారముచోట గ్రాంథిక తమిలమునఁ బదాదీతర స్థలములందు ద (త) కారము నిల్చును. ఉదా:—సంస్కృ-వయస్. తమి-వయదు. సంస్కృ-మాస. తమి-మాదం. సంస్కృ-ఆసనమ్. తమి-ఆదనమ్. (నన్నూలు. ౧౪౭ సూ. చూ.) (చూ. ౨౧ V విష). తెలుఁగున 'ద' కారము తఱుచుగా 'శ' వర్ణమగునని కాల్డువెల్లుగారు వ్రాసిరేకాని యట్టి యుదాహృతి నొక్కటినే నియ్యలేదు. తెల్గున నట్టి యుదాహృతులు కన్పట్టను లేదు. "దైవత్తె సేవిక్క=శైవత్తె తేవిక్క" అనునది వర్ణవ్యత్యయ వికృతికి (Metathesis) లక్ష్యమనఁదగును. పేరు శబ్దమును సంబంధించిన ద్రావిడ శబ్దము లలోఁ గన్నడమున 'పెసర్' అని యుండుటవలన 'స' కారము 'ద' కారము కాఁగాఁ దుళుభాషలోని 'పుదర్' శబ్దమేర్పడెనని గ్రహింపనగును. తమిలులు తమ 'పెయర్' శబ్దములోని యకారమునుండియే కన్నడ 'స' కారమేర్పడె (పెసర్-కన్న) నందురు. (పెశర్=పెసర్).

"'పెయర్' అనుదాని యకారమే 'పెసర్' అని సకారమై యున్నది. 'నాయిఱు' అనునది 'నేసఱు' అయి యున్నది=(నా+ఇల్+తు)=(నడుమ నుండెడిది)=(సూర్యుఁడు). 'నేసర్' అను దానికే యర్థమును లేదు. సంస్కృత పద మధ్యమున 'శ' అను చోట 'య' కారమే వచ్చును. ఉదా:—దేశ=తేయమ్.

సీసమ్ = ఈయమ్" (శ్రీ విద్వాన్. వేంకటరాజులు రెడ్డిగారి జవాబు ౧౭-౨-౧౯౫౩ తేది).

"'న్ద్' అనునది తమిళమున 'ఞ్జ్' అని మాఱును. ఈ మార్పు 'ద' కారము 'శ' (చ) వర్ణమగునను మార్పునకు (౨౧ IX విష.) భిన్నము కాదు. (న్ద్=న్త్=న్శ్=న్చ్=ఞ్జ్) ఇట్టిమార్పు తఱచుగా 'ఇ-ఐ' అను నచ్చులకుఁ దర్వాతనే సంభవించును. మఱియు నీ మార్పు వ్యావహారికాఱవ మునఁ దఱచు. గ్రాంథికాఱవమున నరుదు. ఉదా:—ఐన్దు=(తెల్గు-ఐదు.) (ఐఞ్జు)=అఞ్జు. ఈ మార్పు మలయాళమున గ్రాంథికమేనై యున్నది. (చూ. ఐదు శబ్దము)" కాల్డు. ౧౫౭ పుట).

విమర్శము:—ఈ మార్పు 'ఇ-ఐ' లకుఁ దర్వాతనే సంభవించు ననరాదు. తాలవ్యములగు యకారాదులకుఁ బరమందును గల్గవచ్చును. ఉదా:— తేయ్న్దు=(తేయ్ఞ్జు) తేఞ్జు-తేఞ్జ్. (కృశించి). ఇది యర్వాచీన సరళోచ్చారణ పద్ధతి ననుసరించి యేర్పడినది.

౨౧. X విష:—"తమిళములో "ఇ-ఐ" లకుఁ దర్వాత నున్న "త్త" అనునది 'చ్చ' గా మాఱును. కాన "ద్ద" అనునది "శ్శ" అని మాఱుననుచు సరళోచ్చారణ సంప్రదాయము చెప్పనఁ జెప్పనగును. ఈ మార్పు 'ర-ఱ' లకుఁ దర్వాతఁ దఱచుగా నుండును. ఉదా:—ఉణర్త్తి=ఉణర్చ్చి. (తెలివి). మలయాళమున నీ మార్పు భాషా సహజ ధర్మమై యున్నది. ఉదా:—తమి-శి (చి) రిత్త=మల-చిరిచ్చ. (నవ్విన) మొ." (కాల్డు. ౧౫౭ పుట).

విమర్శము:—'ఉణర్చ్చి' (తెలివి) అనునది నామము. "ఉణర్త్తి" (తెలిపి=తెలియఁజేసి) అనునది ప్రేరణక్త్వాంత రూపము. ఈ రెండును బర్యాయములు కామింజేసి పై విషయమున కిది లక్ష్యము కానేరదు. కాని యిట్టి మార్పు తమిళమున నున్నదనుట సత్యమె. ఉదా:—వైత్త=వైచ్చ. (పెట్టిన) (చూ. ౨౧ IV విష.) ఈ రెండును గ్రాంథిక రూపములె. కాని వీనిలోని 'త్త' కార ఘటితరూపము సహజము-ప్రాచీనమును. వీని వ్యావహారిక రూపము 'వచ్చ' అనునది. బ్రాహ్మణ స్త్రీలు "వెచ్చ" అందురు.

కాల్డువెల్లుగారు చూపినవానివలెనె "చ్చ" కారఘటిత రూపములు నామములును, 'త్త' కార ఘటితరూపములు ప్రేరణక్త్వాంతములును నగుచు వెలయుచున్నవి. ఉదా:—వీళ్చ్చి. (క్రిందఁబడి) వీళ్త్తి (క్రిందఁబడునట్లు చేసి).

౨౧. XI విష:—"ద్రావిడభాషలం దరుదుగ నకారము మకారముగ మాఱును. ఉదా:—తెల్గునందలి "మీరు" అనునది 'నీరు' అనుదానినుండి యేర్పడియుండును. ఈ 'నీరు' శబ్దము తమిళములోని 'నీర్' అనుదానికి సరియగు రూపము. (చూ. సర్వనామములు)" (కాల్డు. ౧౫౬ పుట).

విమర్శము:—'నీర్ =(మీరు)' అను తమిళ శబ్దమర్వాచీనము. ఇది తెల్గు 'మీరు' శబ్దమునకు మూలమనుట విశ్వసనీయము కాదు. తెల్గున నెన్నఁడును 'మీరు' అను నర్థముగల 'నీరు' శబ్దము లేదు. "ఏనై......" (తొల్కా-. ౬౭౮ సూ.)="నీయిర్ శబ్దము బహువచన రూపము. ఉదా:—నీయిర్ వన్దీర్=(మీరు వచ్చితిరి.)......" అను తొల్కాప్పియ సూత్రము చొప్పున "నీయిర్" శబ్దము ప్రాచీన తమిళ శబ్దము. ద్రావిడభాషలలోఁ బ్రాచీన బహుత్వవాచకము 'మ' కారము. శబ్దాది 'మ' కారము సైతము బహుత్వద్యోతకమె. కానఁ దెల్గులోని 'మీరు' శబ్దములోని 'మ' కారము 'నీ' శబ్ద 'న' కారజన్యము కాదు. తెల్గు-మీరు-మేము. మీచేత-మాచేత. తమిళము. నుమ్మై (మిమ్ము) నుమ్మొడు (మీ తోడ౯) యామ్=(మేము) నామ్ (మనము) తామ్ (తాము). కన్న-ఆమ్ (మేము) నామ్=(మనము-మేము) ఎమ్మమ్-నమ్మమ్ (మమ్మును మనలను) తమి-నిలన్=నిలమ్ (చూ. ౨౧ XIV వి).

౨౧. XII విష:—"కన్నడమున 'ప' కారము 'హ' కారమగును. ఈ ప్రసిద్ధమగు మార్పు తద్భవదేశ్యములు రెంటను నవీన కన్నడమునఁ బదాది యందుఁ గన్పట్టుచున్నది. ఉదా:—తమి-పత్తు-తెల్గు—పది. హొసగన్నడము-హత్తు. తమి-పణ-(తద్భ). నవీనకన్న-హణ (ధనము). ప్రాచీన కన్నడము నందును నీలగిరి ప్రాంతములలోని బడగ లనెడి తెగవారి యిప్పటి కన్నడ మందును, 'ప' కారము 'హ' కారముగా మాఱుటలేదు. ఇట్టి మార్పు భాషాంతరములందును గలదు. సంస్కృ-భూతః=మరాటీ-హోతో. సంస్కృ-భూతస్మి=ప్రాకృ-హోమి. ఆర్మీనియా-హెత్=సంస్కృ-పాత్. ఆర్మీనియా-హేయర్=సంస్కృ-పితా." (కాల్డు. ౧౫౬-౧౫౭ పుటలు). "ఇట్లే చీనా భాషలోని 'ప' కారముచోట జపాను భాషలో 'హ' కారము నిల్చును." (కాలు. ౧౫౭ పుట).

విమర్శము:—నవీన కన్నడమునందు 'ప' కారము 'హకారము' గా మాఱు ననెడి కాల్డువెల్లుగారిమాట సరికాదు. "పో హో వా" (కర్ణా. భాష. ౧౧౫ సూ.)='ప' కార స్థానమున వైకల్పికముగా 'హ' కారము నిల్చును పలగె=హలగె (పలకము). కాపు=కాహు (రక్షణము) ఇట్లు నాగనర్మ

సూత్రించుటచేత హాళ గన్నడమునందె 'ప' కారము 'హ' కారముగా మాఱ నారంభించె ననఁదగును కాల్డువెల్లు దొరగా రుదాహరించిన 'భూత్వస్మి' అను శబ్దము సంస్కృతమున నశ్రుతచరము. ప్రాకృతములోని "హోమి" అనునది 'భవామి' అను సంస్కృత శబ్దమునుండి యేర్పడినది. "మి ర్మి బిటొ (౨-౪-౩) లటః పరస్మైపదాత్మనే పదోత్తమపురు షైకవచనయోః 'మిప్-ఇట్' ఇత్యే తయోః ప్రత్యేకం 'మి' ఇతి భవతి. హోమి. (భవామి)" (షడ్భా. ౧౩౪ పుట).

౨౧. XIII విష:—"బకారము కొన్ని యెడల 'మ' కారమగును. ఉదా:—తెలుఁగు-'పది' అనునది 'తొమ్మిది' మొదలగువానిలో 'మిది' అని మాఱుచున్నది. "తొమ్మిది" అనునది "తొంబది" అనుదానినుండి పుట్టి యుండును. వ్యావహారిక తమి-ఎన్ బర్ = (అనుదురు = చెప్పుదురు). గ్రాంథి తమి-ఎన్ మర్. తమి-ఉణ్ బాన్-(తినన్). మల-ఉణ్ మాన్. గ్రామ్యాఱవ మున నుచ్చారణార్థముగ 'మ' కారమునకు 'బ' కారమును జేర్చి పలుకుట గలదు. ఉదా:—సంస్కృ-గోధూమ. తమి-కోదుమై. గ్రామ్యతమి-కోదుమ్బై" (కాల్డు. ౧౩౭ పుట).

విమర్శము:—"తొల్ + పది = తొంబది" అని కానేరదు గాన తొమ్మిదికిఁ బూర్వరూపము 'తొంబది' యనుట సరికాదు. తెల్పున నట్లు లకారము సున్న కానేరదు.

"లకార విఱుది......" (తొల్కా-. ౩౬౭ సూ.) = లకారాంత శబ్ద ములకుఁ బరుషపరకత్వమున సమాసములో లకారముచోట ఱకారము నిల్చును. ఉదా:—కల్ + కుడమ్ = కఱ్కుడమ్ = (ఱాతికుండ).

"అల్వఴి యెల్లామ్......" (తొల్కా-. ౩౬౮ సూ.) = వ్యస్తసంధి యందును లకారమునకుఁ బరుషపరకత్వమున ఱకారము వైకల్పికముగా నగును. ఉదా:—కల్ + కుఱిదు = కఱ్కుఱిదు = కల్కుఱిదు. (ఱాయి పొట్టిది).

పయి సందర్భమునుబట్టి తమిళసంధి పద్ధతిని 'తొల్' శబ్ద లకారము నకారద్వారమున మకారమయ్యె ననరాదు. 'తొల్ + పది = (పదికిఁ దొలుతటి సంఖ్య') అనునది ప్రత్యేకమార్గమున వర్ణాగమాదేశాది వికృతుల నంది 'తొమ్మిది' అనురూపము దాల్చె ననఁదగును. దీని సామ్యమునను "ఇరు = (రెండు) + పది (పదికి రెండు తక్కువ) = ఇను + పది = ఎను + పది = ఎన్మిది = ఎనిమిది" అనురూప మేర్పడి యుండును. "ఇనుమడి (రెండురెట్లు) ఇన్నూఱు" మున్నగు స్థలము

లలో "ఇరు=ఇర్=ఇన్" శబ్దము ద్విత్వమును బోధించుట ప్రసిద్ధమె. 'ఒన్‌బదు' =(ఒకటి తక్కువ) అను తమిళశబ్ద మీ రీతి నేర్పడినదే కదా!

తొమ్మిది శబ్దమునకుఁ దొంబది శబ్దము పూర్వరూపమనెడి కాల్డువెల్లు గారి యాశయమునకు "తొంబనూఱు" (తొమ్మిది వందలు) అను శబ్దరత్నాకరాది కోశస్థిత శబ్దము హస్తావలంబ మొసంగును. కాని 'తొంబనూఱు' అపశబ్దము 'తొమ్మనూఱు' అనునది సాధు శబ్దము. (చూ. నారచించిన "వ్యా-సం" ౨౨౨ విష. ౯౧౩ పు.) 'తొమ్మిది' శబ్దము 'నవ' సంఖ్యను బోధించును. 'తొంబది' శబ్దము 'నవతి' సంఖ్యను బోధించును. "తొమ్మిది+పది" అనువాని సంధిరూపము 'తొంబది'. ఇది తొమ్మిదికిఁ బూర్వరూపమనుట పొరపాటు. తొంబది శబ్దమునుండి తొమ్మిది శబ్దమేర్పడెననియు నక్కారణమున బకారము మకారమగుననియు దొరగారు వ్రాయుట సరికాదు.

"ఎనిమిదిలోని 'మిది' పదియొక్క వికారము. ముందటి 'ఎని' అనునది 'రెండు' అను నర్థముగల 'ఇరు' శబ్దము యొక్కగాని 'ఎణ్' "(గణించు-లేదా. జంట) అను శబ్దము యొక్కగాని రూపాంతరము...... తెనుఁగునందలి దీని విశేషణ రూపము 'ఎను-ఎనమ' అనియున్నది. "ఎనుబది-ఎనమండ్రు-ఎనమన్నూఱు" మొ. (ఆం. భా. వి. ౪౫౪ పు). 'ఎనుబది' శబ్దములోని 'ఎను' అనునది 'రెండు' అను నర్థము గలది కాదనియు, నయ్యది "ఎనిమిది" శబ్దపు సంక్షేప రూపమనియు, నట్లె "ఎనమండ్రు-ఎనమన్నూఱు" శబ్దములలోని "ఎనమ" శబ్దము సైతము రెండు శబ్దార్థకము కాదనియు, ఎనిమిది శబ్దార్థకమనియు గ్రహింపవలయును. కాల్డువెల్లుగారు చూపిన (చూడు. ౧౦౦ I విష.) "ఎణ్,=గణించు" అను నర్థముగల వ్యుత్పత్తి తెల్గున సుసంగతము కాదని యందలి పది శబ్దార్థకమగు 'మిది' శబ్దము నిర్ణయించుచున్నది. (చూడు. ౧౦౦ III విష).

కాల్డువెల్లుగారు ౧౫౭ పుటలో "ఎన్‌బర్"=(అందురు) అనునది వ్యావహారిక తమిళ శబ్దమనియు 'ఎన్మర్' అనునది గ్రాంథిక శబ్దమనియు వ్రాయుటయు సరికాదు. రెండును గ్రాంథిక రూపములె. వానినిబట్టి 'బ' కారము 'మ' కారమగునని వ్రాయుట సరికాదు. ఆ రెండును వేర్వేఱు ప్రక్రియగల భిన్న శబ్దములు. "ఎన్+మ్+అర్=ఎన్మర్" అనియు, 'ఎన్+ప్+అర్=ఎన్బర్" అనియుఁ బ్రక్రియాభేదము నెన్నునది. ఇట్టి భిన్నశబ్దముల కర్థము సరిపడినంత మాత్రమున నివి యభిన్నములనుకొని వీనినిబట్టి 'బ' కారము మకారమగునని దొరగారు వ్రాయుట సరికాదు.

"అఱవమున బకారము వకారమగును. (చూ. XVIII విష.) అఱవ సకర్మక భవిష్యద్రూపములలో 'ప (లేదా) 'ప్ప' అను ప్రత్యయములు

వచ్చును. అకర్మకముల కట్టి రూపములు బకారముతో నుండును. ధాతువు తుది ననునాసిక ముండునపుడు మాత్రమె బకారముండును. ధాతువు తుది నచ్చుండినపుడు 'వ' కారము వచ్చును. (చూ. ధాతు-ప్రకరణము) అఱవ కావ్యములలో నిట్టి బకారము వకారమగుటకు మాఱుగాఁ బై చొప్పున మకార మగుచుండును." (కాల్డు. ౧౫౭ పుట).

విమర్శము:—పై విషయములు సుసంగతములుగ లేవు. ఉదాహృతుల నీయమిచేతఁ బై విషయములు విమర్శార్హములుగ నుండలేదు. దొరగారు చెప్పినదానికి విరుద్ధముగా నకర్మక భవిష్యద్రూపములందును "నడ+ప్+అన్= నడప్పాన్ (నడవఁగలఁడు)" అనియు "కిడప్పాన్ (పరుండఁగలఁడు)" అనియు రూపములు గలవు. అట్లే సకర్మక భవిష్యద్రూపములందును "చెయ్‌వాన్ (చేయఁగలఁడు)" అను రీతిని వకార ఘటిత రూపములుండును. "తిన్‌బాన్= (తిన్‌పాన్)=(తినును), తిన్నువాన్=(తినును)" అను నిట్టిరూపములందు 'మ' కారము వచ్చుట కానము.

౨౧. XIV విష:—" 'మ' కారము 'న' కారమగును. ఈ మార్పు తమిళమున నపుంసకలింగ ప్రథమారూపములలోఁ దఱచుగ నగపడును. ఉదా:— సంస్కృ-ఫల. తమి-పలమ్=పలన్. తమి-కుళమ్=తెల్గు-కొలను." (కాల్డు. ౧౫౭ పుట).

విమర్శము:—అమహచ్ఛబ్దముల తుదిని 'న' కారము నిల్చుటే ప్రాచీన తరము. అట్టి నకారముచోట నర్వాచీనముగ 'మ' కారము నిల్చుట సంభవించెను.

"మకర త్తొడర్ మొటి......" (తొల్కా-. ౮౨ సూ.)=త్ర్యాది వర్ణ యుతములగు నమహచ్ఛబ్దముల తుదినున్న మూర్ధన్య నకారవ్యంజనముచోట మకారము నిలువని శబ్దములు తొమ్మిది మాత్రమె కలవు. "అవి ౧. ఎగిన్, ౨. సెగిన్, 3. విటన్, ౪. పయిన్, ౫. అటన్, ౬. పుటన్, ౭. కుయిన్, ౮. కడాన్, ౯. వయాన్." అనునవి. (వీనిని వ్యాఖ్యాతలు చెప్పిరి) దీనినిబట్టి యమహత్తుల తుదిని 'న' కారమె ప్రాచీనకాలమున నిల్చెడిదనియు దాని చోటఁ గాలక్రమమున మకారము నిల్చెననియు విశదమగుచున్నది. వయి విషయమున విద్వాన్. వే. వేంకటరాజులు రెడ్డిగారీ క్రిందిరీతిని వచించి యున్నారు:—"ప్రాచీనకాలమున నంతటను 'న' కార మేకవచన చిహ్నముగను 'మ' కారము బహువచన చిహ్నముగను నుండెడివి. తర్వాత రేఫము బహువచన చిహ్నముగ నేర్పడి యుండును. ప్రథమ సంఘమువా రట్టి 'న' కారమును

మహద్వాచకములలో మాత్ర మేకవచన చిహ్నముగ నిల్పి యమహత్తులకు 'మ' కారమును బ్రథమైకవచన చిహ్నముగ నిల్పిరి. ఈ విషయమునె తొల్కాప్పియరు ౮౨ సూత్రముతో వచించిరి. నేఁటి పండితులు కొంద ఱీ సూత్రమును సరిగఁ బరిశీలింపక నకార మకారములు రెండిటిని నమహత్తుల ప్రథమైక వచనమున నిల్పుదురు. ఉదా:—నిలన్=నిలమ్ (నేల). ఇట్లె నన్నూలు కర్తయుఁ బయి తొల్కాప్పియ సూత్రమును సరిగ గ్రహింపక 'మ' కారమె మొదటిదనియు దానిచోట 'న' కారము వచ్చుననియు సూత్రించెను" (విద్వాన్. వే. వేంకటరాజులు రెడ్డిగారు నాకుపదేశించిన టీక).

" 'మ' కారము 'వ' కారమగును. ఉదా:—తమి-మామన్-(మామ), మామి (అత్త); కూర్గు (లేక) కొడగు-మావు=మావి. పటగన్నడ-నామ్= (మేము) నీమ్ = (మీరు) = హొసగన్నడ - నావు = (మేము) నీవు=(మీరు)." (కాల్డు. ౧౫౭ పుట).

విమర్శము:—"నావు-నీవు" అనునవి హొసగన్నడ రూపములుగాన నీ మార్పు ప్రాచీనము కాదు. మఱియుఁ బ్రాచీన కర్ణాటమున 'నాం-నీం' అను ననుస్వార ఘటితరూపములె సమ్మతములు. "నీ నాన్ తానః (నీన్-ఆన్-తాన్) ప్రథమావిభక్తౌ ని నెన్ తనామ్" (కర్ణా. భూష. ౯౨ సూ.) యుష్మదస్మదాత్మార్థకములగు 'నిన్-ఎన్-తన్' అనువానికిఁ బ్రథమావిభక్తియందు 'నీన్-ఆన్-తాన్' అనురూపములు గల్గును. "ద్వి బహ్వో ర్నస్య మః." (కర్ణా. భూష. ౯౪ సూ.)= ద్విత్వ బహుత్వములందు వాని నకారమునకు మకారాదేశమగును. "మ నయో ర్బిన్దుః" (కర్ణా. భూష. ౧౧౨ సూ.)=అవసానమునందలి మకార నకారములకుఁ గన్నడమున బిందు వాదేశ మగును. ఉదా:—నీం=(నీన్)=(నీవు.). నీం=(నీమ్)=(మీరు) 'నమ' లు కర్ణాటమునఁ బ్రక్రియాదశలో నుండును గాని ప్రయోగదశలో బిందువే నిల్చును.

౨౧. XV విష:—యకారము 'ఞ' కారముగాఁ గాని 'న' కారముగాఁ గాని మాఱును. ఈ "య-న" లలో నేది ప్రాచీనతరమో తెలియదు. అస్మదేకవచనమున ద్రావిడభాషలలో 'నాన్-ఞాన్-యాన్-ఆన్' అనురూపములు గలవు. వీనిలో 'ఞ' కారరూపము 'న' కార 'య' కారరూపములకు మధ్యరూపమని యెన్నదగును......కొన్ని తద్భవశబ్దములనుబట్టి 'య' కార రూపమె మొదటిదని తెలియుచున్నది. ఉదా:—సంస్కృ-యుగమ్ (బండి పూఁజు) తమి-నుగమ్......అఱవములోని 'య' అను ప్రత్యయము సయితము 'న' కారముగా మాఱుట యిందులకు సరిదైయున్నది. ఉదా:—శొ (చొ) ల్లియ=శొల్లిన=శొన్న (చెప్పిన)" (కాల్డు. ౧౫౮ పుట).

విమర్శము:—సర్వనామ ప్రకరణమున నస్మచ్ఛబ్ద చరిత్రము సువిస్తరముగాఁ బరిశీలింపఁబడును. "తమి-యాన్=(నేను). యామ్=(మేము) నామ్=(మనము). మలయా-ఞాన్=(నేను) ఞజ్ఙళ్=(మేము). కన్న-ఆం (న్)=(నేను) ఆం (మ్)=(మేము). నాం (న్)=(నేను)—నాం (మ్) (మేము). తెల్గు-నేను=ఏను (ఏక). మేము=ఏము (బ)." అని యిట్లు రూపములు వెలయుచున్నవి. వీనినిబట్టి డా. కాల్డువెల్లుదొరగారు "యాన్-ఞాన్-నేను" అనువరుసగ నీ రూపము లొకదానినుండి యొకటి యేర్పడి యుండునని తలఁచి యకారము ఞకారముగను నది నకారముగను బరిణమించునని వ్రాసిరి. కాని 'యాన్-నాన్' అనునవి ప్రత్యేక ప్రకృతులనియు నొకదానినుండి యొకటి జనించియుండ లేదనియుఁ జెప్పుట యుక్తము. 'యాన్' శబ్దమును సంబంధించిన రూపములలో 'ఎన్-ఎమ్' అనునవె ద్వితీయాది విభక్తుల యంగము లగుచు నేకత్వ బహుత్వము లందు రూపసిద్ధిని గల్గించుచున్నవి. అట్లె 'నాన్' శబ్దమును సంబంధించిన రూపములలో-'నమ్' అనునదె ద్వితీయాది విభక్తుల యంగమగుచు బహుత్వము నందు రూపసిద్ధిని గల్గించుచున్నది. 'ఆం' అనునది ప్రథమలో నిల్చుచున్న కన్నడమందును 'ఎన్-ఎమ్' అనునవె—"ఎన్నం=(నన్ను). ఎమ్మం=(మమ్ము)" అను రీతిని ద్వితీయాది రూపములు వెలయుచున్నవి. కావునఁ దాలవ్యాది యగు 'యా' శబ్దమె కన్నడ ప్రకృతియయి యుండుననియు యకార లోపమున నందలి ప్రథమా విభక్తి యేర్పడెననియు గ్రహింపవలయును. పయిరీతిని 'యా-నా' శబ్దములు వేర్వేఱుగాను నియతముగాను ద్వితీయాదులందు నిల్చుచున్న స్థితిని బట్టియె యవి ప్రత్యేక ప్రకృతులనుటకుఁ బ్రబల నిదర్శన మనఁదగును. ద్రావిడభాషలలో నందును ముఖ్యముగ నీ సర్వనామములందు మకారము బహువచన ద్యోతకము. తెల్గున నట్టి బహుత్వబోధక మకార మాదేశముగ శబ్దాదిని నిల్చుట విశేషము. తమిట 'యాన్' శబ్దమునుండి మలయాళ 'ఞాన్' శబ్దమేర్పడిన నేర్పడవచ్చును గాని తమిట యాన్ శబ్దమునుండి 'నాన్' శబ్దమేర్పడుట లేదు గాన "యకారము నకార మగుటకు 'యామ్-నామ్' శబ్దములు లక్ష్యములు కానేరవు. 'ఞాన్' అనుదానినుండి 'నేను' అనునది యేర్పడెననుట కన్న వాని నడుమ 'నాను' అనుదానిని నిల్పుట యుక్తమని తలఁచి వికాసకర్తగా రీ క్రింది రీతిని వ్రాసిరి. "తెనుఁగున 'వచ్చినాను—వచ్చినాము' మొదలయిన క్రియారూపముల తుదిని 'ఆ'కారయుక్తరూప ముండుటవలనను...... తెనుఁగున నేఁటికిని "నాను-మాము" అను రూపములె విద్యావిహీనుల నోటిని ప్రథమా విభక్తిలోఁ గూడ వినఁబడుచుండుట వలనను 'ఆ' కారయుక్తరూపమె ప్రాచీనమని తోఁచుచున్నది.......ఆన్=యాన్=ఞాన్=నాన్=నాను=నేను అనునట్లు మాఱి యుండవచ్చునని యూహింపఁబడినది." (ఆం. భా. వి.

౭౮౦ పుట.) ఈ యూహా సరికాదు. తెల్గునందలి 'వచ్చినాను-వచ్చినాము. నాను-నాము' అనునవి కేవలము నర్వాచీనములు. "వచ్చిన వాఁడను" అనునది నన్నయ కాలమునాఁటిది. "వచ్చినాఁడను" అను 'వ' లోప రూప మథర్వణ తిక్కనల నాఁటిది. 'వచ్చినాను' అను 'డ' లోపరూపము పదునాఱవ శతాబ్దము వఱకు నవతరింపలేదు. ఇంక "నాను-మాము" అనునవి బొత్తిగా నర్వాచీన వ్యావహారిక శబ్దములు. వీనిని నన్నయ సాధించినట్టియు భారతమున ధారాళ ముగాఁ బ్రయోగింపఁబడియున్నట్టియు (చూ. సర్వనామ ప్రకరణము ౧౦౬ V విమ.) నేను శబ్దమునకుఁ బూర్వకాలికములనుగా నూహించుట మిక్కిలి యసంభవము. వీరు వీనిని బ్రాచీన శాసనములందుఁగాని ప్రాచీన వాఙ్మయ మందుఁగాని మచ్చున కొక్కటి నేని చూపఁజాలరుగదా.

ఇంకఁ 'య' ప్రత్యయము 'న' ప్రత్యయముగా మాఱెనను కాల్డువెల్లు గారి వచనము సత్యవిదూరము. "చొల్ (ధాతువు)+ఇన్+(భూతార్థక ప్రత్యయము) అ (విశేషణ ప్రత్యయము)=చొల్లిన." అనురూపమె ప్రాచీన తరము. అందలి నకారము కాలక్రమమున లోపింపఁగా నచటి స్వరసంహితలో యకారము చేరుటచేత "చొల్లియ" అను రూపమేర్పడెను. ఇట్టి యకారము ప్రాచీనతరమనియు దానినుండి 'న' కారమేర్పడెననియు విపరీతముగా నుదాహ రించుట కేవలము పొరపాటు.

"కన్నడమందును దుళుభాషయందును 'య' కారము కొన్నియెడల 'ద' కారముగ మాఱును. ఉదా:—కన్న-దావ=యావ (ఎవరు). దావదు= యావదు (ఏ వస్తువు). తుళు:—దాదవు (దావదు?) (ఏ వస్తువు)." (కాల్డు. ౧౫౮ పుట).

<u>విమర్శము</u>:—ప్రాచీన కన్నడమున 'యావదు'.—'దావదు' శబ్దములు లేవు. "ఆవుదు" మున్నగురీతివి హళగన్నడరూపములు. హొసగన్నడ మున 'యావదు' శబ్దము గలదని శబ్దాదర్శమునఁ గలదు. ప్రాచీన కన్నడ:— "క. ఆవుదె నిష్పీశబ్ద । క్కావం బహువచన దెడె యొళార్.........(శబ్దమ. ౧౫౧ ప.) ఆవుదో రార్. (వృత్తి) ఆవుదు శబ్దస్య ఆ రిత్యాదేశో భవతి పుంలింగే స్త్రీలింగేచ విషయే" (కర్ణా. శబ్దాను. ౧౭౮ సూ.) 'యావన్' మున్నగు నవి తమిళశబ్దములు. "అవ్వాటి......యావన్-యావళ్-యావర్ (ఎవఁడు- ఎవతె-ఎవరు)" (తొల్కా. ౬౮౭ సూ). హొసగన్నడమందును 'యావదు' అని యున్నదనుటకు మాత్రము ప్రమాణము కన్పట్టుచున్నది. "యావను- యారు. (పుంలింగ) యావళు-యారు (స్త్రీలింగ.) యావదు-యావవు (నపుంసక లింగ)" (శబ్దాదర్శమనెడి హొసగన్నడ వ్యాకరణము ౧౯ పుట) ఇట్లగుటచేత

'యావదు' అను హాసగన్నడరూపమందలి 'య' కారమునకుఁ దుళుభాషలో "దావదు" అనురీతిని 'దా' వచ్చినదని చెప్పవలెను.

"యకారము శవర్ణమగును. చ-జ-శ లు 'య' వర్ణముగా మాఱు నని యీవఱకు వ్రాయఁబడెను. (చూ. ౨౧ V విష). ఇది దానికి విపరీతము. ఇయ్యది గ్రామ్యతమిళమున నున్నది. గ్రామ్యవ్యవహారమున 'య' కారముచోట 'శ' వర్ణమును, శ వర్ణముచోట యకారమును బలుకఁ బడును. ఉదా:—పశి (చి) (ఆఁకలి)=పయి. వయఱు (కడుపు)=వశ (చ) ఱు. పయజ్గళ్=పశ (చ) జ్గళ్ (పిల్లవాండ్రు). అయల్ = అశ (చ) ల్ (దగ్గఱ). స్వరసంహితలో నుచ్చారణార్థము నిల్చెడి యకారముచోట శవర్ణ మెన్నఁడును నిల్వదు. ప్రాకృతములందును, హిందీ-పంజాబీ-మొదలగు భాషలందును 'య' కారము 'జ' కార మగును." (కాల్డు. ౧౫౮ పుట).

విమర్శము:—తమిళమున శవర్ణమే లేదు. చవర్ణమున కర్వాచీన ముగా వచ్చిన సరళోచ్చారణ మా శవర్ణమని యెన్నవగును. కావున 'య' వర్ణము 'చ' వర్ణ మగుననుట లెస్స. సంస్కృత భవములందు సైతము ద్రావిడ భాషలలోఁ బ్రాకృతద్వారమున 'య' కారము 'జ' కారమగుట గలదు. తెల్గున దంత్య జకారమగును. ఉదా:—(సంస్కృ) యజ్ఞః-(ప్రా)=జణ్ణో= (తెల్గు) జేన్నము. (సం) యమః=(ప్రా) జమో.=(తెల్గు) జముఁడు. కన్న:— "యో జః. (వృత్తి) బహుళ మితి వర్తతే. యకారస్య జకారాదేశో బహుళం భవతి. ప్రయోగ:—యోగ=జోగ. యోగీ=జోగి. యుద్ధ=జుద్ధ. యావక= జావక. దుర్యోధన=దుజ్జోధన. యలె=జలె. మఞ్జరీ మకరన్ద వ్యాఖ్యా:—నయ-జయ-భయ-న్యాయ ప్రాయ ఇత్యాదౌ బహుళ గ్రహణాత్ జకారో న భవతి." (కర్ణా. శబ్దాను. ౧౮౧ సూ).

౨౧. XVI విష:—"రేఫము తఱచుగా ఱకారమగును. ఉదా:— తమి—కరు (నల్లని)=కఱు. వీని కిపుడించుక యర్థభేద మున్నను నివి మొదటఁ బర్యాయములె యనుటకు సందియము లేదు" (కాల్డు. ౧౫౯ పుట).

విమర్శము:—ఱకారమునకు సరళోచ్చారణము (అలఘు రేఫ) గల్గిన పిమ్మట నీ మార్పు గల్గియుండును. తొల్కాప్పియమునాఁటికి ఱకారము 'ట-త' ల యుచ్చారణ మునకు మధ్యావస్థలో నుండెడిది. అపుడు "ర-ఱ" లకుఁ బరస్పరము మార్పు గల్గుట యసంభవము. ఱకారమునకుఁ గాలక్రమమున నలఘు రేఫోచ్చార ణము గల్గినపిమ్మట ర ఱలకుఁ బరస్పరమును మార్పుగల్గుట సంభవించెను. లఘ్వ లఘు రేఫములకు సయితము నన్నయపర్యాయస్థితి నంగీకరింపలేదు. నన్నయకుఁ

దర్వాతనే తెల్గున నుభయరేఫస్థితి విస్తరిల్లినది. అకారమున కలఘురేఫోచ్చారణము కల్గినపిమ్మటనే ద్రావిడభాషలలో నొకట రేఫోచ్చారణము వేఱొకట నలఘురేఫోచ్చారణమును నభిన్నశబ్దములందు విస్తరించెను. అట్టి వనేక స్థలములు గలవని యీావఱకు విపులముగాఁ జూపఁబడెను. (చూ. ౧౭ XII మొ. ౧౭ XV-వ. విష. అందు ముఖ్యముగ ౧౭ XV విష).

కాల్డువెల్లుగారు 'రఱ' ల మార్పు తమిళమున నత్యధికమని చెప్పి యించుక యర్థభేదముగలదని తామె చెప్పిన యొక్క యుదాహృతి నిచ్చిరి. అట్టిది వేఱొకటి తమిళమునఁ గానరాదు.

౨౧. XVII విష:—“రేఫము లకారమగును. రేఫ లకారముల మార్పు పెక్కు భాషాకుటుంబములలోఁ గలదు. కాని ద్రావిడభాషలలో మిక్కిలి తఱచు. కొన్నియెడల మాత్రము లకారమె రేఫముగా మాఱినను రేఫము లకారముగా మాఱుట తఱచు. ఈ మార్పు వ్యావహారిక తమిళమున నియతముగాను మలయాళమునఁ దఱచుగాను జరుగును. శకటరేఫము శకార ముగా మాఱును గాని 'ళ' కారము శకటముగా మాఱదు. రేఫము లకార మగుట తమిళమునఁ బదాదియందుఁ దఱచుగా నుండును. ఈ మార్పు సంస్కృత భవములందేకాక దేశ్యములందును గల్గును. ఉదా:—సంస్కృ-రక్ష్. తమి-రక్షై. దీనిని వ్యవహారమున 'లక్షి' అనియు 'లత్సి' అనియుఁ బల్కుదురు. పదమధ్యరేఫము సాధారణముగా 'ల' కారము కాదు. కాని యఱవమున రేఫమున్నచోట నాంధ్ర మలయాళములలోఁ గొన్నియెడల లకారముండును. ఉదా:—తమి-తెరి=(కనఁబడు) తెల్గు-తెలియు. ఇది తమిళ ములోని 'తెళి' అనుదానిని సైతము పోలియున్నది. ఇవి రెండును (తెరి—తెళి) నభిన్నములె యని నా యభిప్రాయము. ఉదా:—తమి-పరిశై (చై) (ఆయుధ విశేషము-డాలు) మల-పలిశ. “ఈ యర్థమున నీ శబ్ద మే కోశమునను లేదు.” (శ్రీ విద్వాన్. వే. వేంకటరాజులు రెడ్డిగారు (౨౯-౮-౧౯౫౨ తేది).

“పయి సందర్భమునుబట్టి వివిధభాషలలోని యేకార్థబోధకశబ్ద ద్వయ మున, రేఫ లకారము లున్నపుడు వానిలో రేఫఘటితరూపమె ప్రాచీనతర మనఁ దగును. ఉదా:—కర్=కార్ (నలుపు) సంస్కృ-కాల. వీనిలోని సంస్కృత రూపమునకన్న ద్రావిడరూపమె ప్రాచీనతరము. సిథియను భాషలలోని 'కర్' శబ్దమును, సంస్కృతమందలి కృష్ణశబ్దమును బై యభిప్రాయమును బలపఱుచుచున్నవి. ఇట్లగుటచేత ద్రావిడభాషలలో విభిన్న పదము లనుకొనఁ దగిన కొన్నిశబ్దము లభిన్నములని తేలుచున్నది. ఉదా:—తమి-శిఱ్ (చిఱ్) (చిన్న)=శిల్ (చిల్) (కొన్ని). పర్=('పేర్' అనుదాని రూపాంతరము)

(పెద్ద)=పల్ (అనేకములైనవి). ('సిఱ్' అనుదాని రూపాంతరము 'సిన్' అనియుఁ గలదు.)" (కాల్డు. ౧౫౯-౧౬౦ పుటలు).

విమర్శము:—తమిళపదాదిని రేఫ లకారములు నిలువనేరవు. వానికి ముం దుచితస్వరము నిల్చును. కాన 'రక్షి' అనునది తమిళరూప మనుట పొసఁగదు. కావుననే కావలయు నిందులకు వ్యావహారిక తమిళరూపము లగు 'లక్షి-లత్సి' అనువానిని దొరగా రుదాహరించిరి. వ్యావహారిక భాషలో నేది యెట్లున్నదని చెప్పుటకును వెనుదీయ నక్కఱలేదుగదా. ఏమో? దొరగా రెచట నట్లు వినిరో? కాదనుటెట్లు? ఱకారము ళకార మగునని రే కాని దాని కొక్క యుదాహృతినేని దొరగారు చూపరైరి. ఉదా:—తమి-తెళి=(నీరు నిర్మలమగు). (తమి) - తేఱు=(తెనుఁగు-తేఱు). రేఫము లకారమగుట పదాది యందుఁ దఱచననేల? తమి-పన్దర్=పన్దల్ (పందిరి). తమి-కుడర్=కుడల్ (పేగులు). తెరి (కనఁబడు) తెళివు=(తెలివి) (తెళి ధాతుకృదంతము). ఇట్లే 'తెరి-తెళి' ధాతువుల కర్థభేదమున్నది. కాన నివి యభిన్నములని దొరగా రభిప్రాయపడుట సరికాదు.

ఏకార్థ బోధకములగు నభిన్న శబ్దములలో 'ల-ర'ల మార్పున్నపుడు రేఫఘటితమె ప్రాచీనమని దొరగారు నిర్ణయించుట సరికాదు. కొన్నియెడల రేఫరూపము ప్రాచీనమగును. మఱికొన్నియెడల 'ల' కారరూపము ప్రాచీన మగును. కొన్నియెడల వాని పౌర్వాపర్యము దుర్జ్ఞేయమయి యుండును. కాల్డువెల్లుగారే ముందు "విల్=బిర్" అనువానిలో లకారఘటిత రూపమె ప్రాచీనతరమని వ్రాయుదురు. (చూ. ౨౧ XVII విష.) (కాల్డు-౧౬౦ పుట). కావున 'కఱ్-కార్' (నలుపు) అను రేఫకలిత ద్రావిడ శబ్దములు 'కాల' అను లకారఘటిత సంస్కృత శబ్దముకన్నఁ బ్రాచీనములని దొరగారు నిర్ణయించుట సరికాదు. 'శి (చి) ఱ్' (చిన్న) అను దొరగారి యుదాహృతి తమిళ సంప్రదాయ విరుద్ధము. పదాంతమునఁ బరుషమగు ఱకార వ్యంజన ముండనేరదు. కాన 'శి (చి) ఱు' అనవలెను. అట్లె 'పర్' (పెద్ద) అని యుదాహరించిరి. 'పెరు=స్థూలము' అని తమిళమున నుండును. దీని రూపాంతరము 'పేర్' అని వ్రాసిరి. 'పేర్' అనునది 'పెద్ద' అనునర్థమున సామాసిక రూపము. వ్యస్తమగు 'పేర్' శబ్దమునకు "నామధేయము—కీర్తి" అని యర్థములు. దీని మూలరూపము-'పెయర్' అనునది. 'పల్'=(అనేక) అనునది సామాసిక రూపము. వ్యస్తతలో నిది "పల" అని యుండును. "పలై-పనై" అనునవి దాని భావార్థకరూపములు. "పల్" అనుదానికి వ్యస్త తలో "పల్లు=దంతము" అని యర్థము. 'శిన్' అనునది 'శిఱ్' అనుదాని

రూపాంతరమని వ్రాసిరి. 'చిన్న' అను నర్థమున 'శిన్' అను శబ్దమే తమిఱమున లేదు. అర్వాచీన (౫౦౦ ఏండ్లనుండి) తమిఱులు 'శిన్న' (చిన్న) అనియే వాడుచున్నారు.

"లకారము రేఫమగును. ఈ మార్పు తుళుభాషలో నధికము. ఇతర ద్రావిడభాషలలోఁ బదాంతమున లకారముండు చోటులందుఁ దుళుభాషలో రేఫముండును. తమి-విల్-కన్న-బిల్లు. తెల్గు-విల్లు-తుళు-బిర్. సింధునది కావలి యొడ్డుననున్న బ్రహుయిభాషలో నయితము 'బిల్ల' అని యుండుటచేతఁ బయివానిలో 'ల' కార ఘటితరూపమె ప్రాచీనతమ మనక తీరదు. మధ్యాసియాలోని 'మంచు' భాషలో 'ల' అని యుండుచోట మంగోలియాభాషలో రేఫముండును. లకార మొకప్పుడు శకటముగ మాఱును. ఉదా:—తమి-నిల్ (నిలుచు)-నిఱుత్తు (నిలువఁబెట్టు). తెల్గులో బహువచన ప్రత్యయమగు 'లు' అనునది కొన్నియెడల 'రు' అని మాఱును. తమిఱమునఁ బరుషములకుఁ బూర్వముననుండు లకారము శకట రేఫమగును. ఉదా:—పల్పల (వివిధ)=పఱ్పల. దీనినిబట్టి 'ల' కారము రేఫముగా మాఱుట తమిఱమునకు సహజమె యననగును. 'కు' భాషలో లకారము డకారమగును. డకారము ళకారమగుట సామాన్యమె కాని లకారము డకారమగుట మాత్ర మీభాషలోనె యగపడుచున్నది. ఉదా:—తెల్గు-పాలు=కుభాష-పాడు. తెల్గు-ఇల్లు=కుభాష-ఇడ్డు. సంస్కృతమందలి 'ల' కారము గౌడ భాషలలో 'డ' కారమగుట గలదు. సంస్కృ. తాళీ (తాలీ=కల్లు). గౌడ భాష-తాడి. ఇంగ్లీ-తాడి. తెల్గు-తాడు. (తాటిచెట్టు). హిందుస్థాని-తాడ్ (లేక) తార్ (తాటిచెట్టు). ఇతర ద్రావిడభాషలలోని రేఫాదులు తుద భాషలో నీ క్రిందిరీతిని మార్పుల నందును. తుద-ర=ర్ష. ఱ=ర్ఝ (rzh). ల-ళ=ల్జ్ష (lzsh)." (కాల్డు. ౧౬౦ పుట).

విమర్శము:—లకారము ఱకారముగా మాఱు ననుదాని లక్ష్యము సరి కాదు. నిల్+తు=నిఱు. దీనిపైని ప్రేరణార్థమున 'తు' చేరఁగా "నిఱు+తు=నిఱుత్తు" అని యయ్యెను.

"తెల్గులోని 'లు' ప్రత్యయము కొన్నియెడల 'రు' అగుననుట వాని చరిత్రకు విరుద్ధము. 'బాలురు' మున్నగువానినిబట్టి కాల్డువెల్లుగా రట్లు వ్రాసి యుందురు. మఱియుఁ దెల్గు 'లు' ప్రత్యయము 'కళ్' ప్రత్యయమూలకమని యొకచో దొరగారే వ్రాసిరి." (కాల్డు. ౨౪౪-౨౪౫ పు. చూడు.) 'రు' అను బహువచన ప్రత్యయము తొల్కాప్పియమునాఁటికే వెలసి విస్తరిల్లి యున్నది. ఇట్లతిప్రాచీనమగు బహువచన 'రు' ప్రత్యయము 'కళ్' ప్రత్యయమునుండి

యేర్పడినదనుచున్న 'లు' ప్రత్యయమునుండి జనించెననుట యెట్లు పొసఁగును? 'రు' ప్రత్యయమునుండియే 'లు' ప్రత్యయ మేర్పడి యుండుననియు 'కళ్' ప్రత్యయ మట్టి 'లు' ప్రత్యయమునుండి యేర్పడి యుండుననియు నీవఱకె వ్రాయఁబడెను. (౧౮ VIII విష.) (చూడుఁ. ౭౮ I విష.) 'లు' ప్రత్యయ మతిప్రాచీనము. ఆస్ట్రేలియాది ఖండాంతరభాషలందును వ్యాపించి యున్నది (చూ. ౮ IV విష). ("'ల్=లు.' అనునదే ప్రాచీన బహువచన ప్రత్యయ మనియు 'ల్' అనునది స్త్రీలింగ ప్రత్యయముగా గ్రహించిన యనంతరము 'ర్' (రు) అనునది బహువచన ప్రత్యయముగాఁ గొనఁబడెననియు శబ్దాంగమై యున్న కకారముతోఁ జేర్చిన 'కళ్' అనునది యఱవము మున్నగు భాషలలోఁ జెప్పఁబడెనియుఁ దోఁచుచున్నది. ఎట్లయినను 'కళ్' ప్రత్యయమునుండి 'లు' అనునది గ్రహింపఁబడలేదు" విద్వాన్. వే. వేంకటరాజులు రెడ్డిగారు ౨౯-౮-౫౨ తేది).

సంస్కృత లకారము గౌడభాషలలో డకారమగు నననేల? సంస్కృత మందే 'లడ'ల కభేద మంగీకరింపఁబడియున్నది. "జడః-పుం......నపుం-వారిణి......జలతి=ఘనీభవతి. జల=ఘాతనే-అచ్. 'డ-లా' యో రేకత్వమ్." (శబ్దా-చిం.) "జడ. త్రి. జలతి=ఘనీభవతి. జల-అచ్-డస్యలః......జలే-నీసకేచ-న ....." (శబ్దస్తో).

"సంస్కృ-తాళీ. (తాళీ=కల్లు) గౌడభా-తాడి......" అని వ్రాయుటలో దొరగారి యభిప్రాయమేమో తెలియకున్నది. సంస్కృతమున 'లళ' లకు భేదములేదు. 'తాళీ=తాలీ' అను శబ్దమునకె "కల్లు-తాటిచెట్టు" అను రెండర్థములును గలవు. "తాలీ-స్త్రీ......(తాడీ). తాళజాత సురాయామ్ ......(తాళ) వృక్షభేదే" (శబ్దస్తో). లడల యభేదముచేతనే 'తాడీ' శబ్దము సైతము తాళవృక్షవాచకమయ్యెను. "తాడీ-స్త్రీ-పత్రద్రుమే." (శబ్దా-చిం.) "తాడిః-స్త్రీ-తాలీద్రుమే......" (శబ్దా-చిం).

౨౧. XVIII విష:—"పదాది వకారము కన్నడమున బకారమగును. ఉదా:—తమి-వాట్. (అభివృద్ధి నొందు). కన్న-బాళ్. ఇట్లు మాఱని పదాదీతర స్థల వకారము కన్నడమున లఘు వకారమగును. ఓష్ఠ్యమాత్రోచ్చారణము గలదగునని తాత్పర్యము. ఇట్టి వకార లఘూచ్చారణము గ్రామ్యాఱవమున నరుదుగను, వ్యానహారి కాఱవమునఁ దఱచుగను గలదు. మలయాళమున వకారము లఘ్వలఘుతలకు మధ్యస్థమగు నుచ్చారణము గల్గియుండును." (కాల్డు. ౧౬౦ పుట).

విమర్శము:—'బాళ్' అనునది హొసగన్నడ రూపము. పలగన్నడ రూపము "బాళ్ =(వృద్ధి నొందు)" అనియె యుండును. దీని నుజ్జగించి హొస గన్నడరూపము నుదాహరింపనేల?

తమిళమందుఁగాని కన్నడమందుఁగాని పదమధ్యస్థ వకారమునకు సయి తము లఘూచ్చారణము లేదు. దంతోష్ఠ్యముగానె వినఁబడుచున్నది (తొల్కా-. ౯౮ సూ.) (చూ. ౧౭ VIII విమ). తమిళ కన్నడ వ్యాకర్త లెవ్వరును వకార మున కట్టి యుచ్చారణ భేదము గలదని వచించి యుండలేదు. ఆంధ్రవ్యాకర్తలు మాత్రము తక్కిన యంతస్థములతో పాటుగ వకారమునకు లఘ్వలఘూచ్చా రణములు గలవని వచించిరి. వారు సైతము వకారము నోష్ఠ్యముగా మాత్రము (దంతోష్ఠ్యముగాఁ బల్కక) పల్కుట లఘూచ్చారణమని వచింపలేదు. వకారో చ్చారణమందలి స్థానకరణ శైథిల్యతదభావములె దాని లఘ్వలఘూచ్చార ణములని సంప్రదాయము. శాస్త్రసమ్మతమును. అయినను దొరగారు వ్యావ హారిక భాషయం దనిరి. ఎప్పుడాయన యెవ్వరినోట నట్టి యుచ్చారణమును వినిరో? కర్ణాటమునఁ బదాది వకారము బకారమగు నన్నమాటయేకాని యట్లు వచ్చి 'బ' కారము వాక్య ప్రయోగమున సమాససంధిలోఁ దఱచుగా మరల వకారమె యగుచుండును. "స్వరయరలేభ్యో బహుళం వః పవర్గస్య" (కర్ణా. భూ. ౩౧ సూ.)=అచ్చునకును యకార రేఫ లకారములకును బరమగు పవర్గము నకు బహుళముగా వకారాదేశమగును. ఉదా:—మెయ్+బసం=మెయ్ వసం=(శరీరవశము=శరీరపారవశ్యము.)

"అఱవమున సంధివశమున వచ్చిన వకారము తెలుఁగునఁ గొన్నియెడల గకారమగును. అఱవమున స్వరసంహితలో నుచ్చారణ సౌకర్యమునకయి యకార వకారములు నిల్చును. అట్టి చోటులందుఁ దెల్గున గకారము వచ్చును. కాఁగా నఱవమున సంధిగత వకారమేకాక యకారము సైతము తెల్గున గకార మగునని తేలుచున్నది. ఉదా:—తమిళ-అఱువర్. తెల్గు-ఆఱుగురు. తెల్గు- 'వారు' అను సర్వనామరూపము 'గారు' అను పూజ్యార్థ శబ్దముగా మాఱినది. అఱవమున భవిష్యదర్థమున వకారముచోట 'గ' కారము నిల్చును. ఉదా:— శెయ్వేన్=శెయ్గేన్=(చేయఁగలను)." (కాల్డు. ౧౬౧ పుట).

విమర్శము:—అఱవములోని సంహితా వకారమునకును దెలుఁగు గకార మునకును నెంతమాత్రమును సంబంధములేదు. అఱవమున వకారము గకార మయ్యెడి సంప్రదాయమే లేదు. మఱియు నఱవమున సరళమగు గకారమె ప్రాచీనకాలమున లేదు. తెల్గున 'గ' కారమునకు వకారము తఱచుగను, (అగు=అవు) వకారమునకు 'గ' కార మరుదుగను (ప్రవాళము=పగడము=

పగడను. వారు=గారు) నయ్యెడి సంప్రదాయము గలదు. "అఱువర్" అను తమిళ పదమునుండి "ఆఱుగురు" అను తెల్గుపద మేర్పడె ననలేల? తెనుఁగుననే "ఆఱువ్వురు" అను ప్రాచీనరూపము గలదు. దానినుండి "ఆఱుగురు" అను తెలుఁగుపద మేర్పడెనని దొరగారు గ్రహింపకుండుట వింత. ఇంకఁ దమిళమందలి స్వరసంహితాగమమగు యకారమునకును గకారము వచ్చుననెడి దొరగారి నిరుదాహరణ ప్రసంగము బొత్తిగా నగ్రాహ్యము ప్రాచీన తమిళమున 'గ' కారమనెడి సరళ వర్ణమే లేదు. ఇంక 'క'. కారము 'వ' కారమగుననెడి యశ్రుతచరమగు నిర్మూల ప్రసంగము దొరగారు చేయవలసియున్నది. తొల్కాప్పియమునాఁటికే 'చెయ్‌వేన్' అనుదానితో పాటుగ "చెయ్‌కేన్" (చెయ్‌గేన్) అను భవిష్యదర్థకరూపము వెలసియున్నది. కాఁగా 'చెయ్‌వేన్' అనుచోటి వకారము ముందెన్నఁడో పుట్టఁబోయెడి సరళ గకారముగా మాఱెనని దొరగారు చెప్పవలసియుండును. ద్రావిడభాషలందు 'వ' కారము భావ్యర్థకము. దానిచో 'వ' కారము నిల్చుటచేత 'చెయ్‌వేన్' అనురీతి రూప మేర్పడెను. (చూ. తొల్కా-౭౦౬-౭౦౭ నూ.) "అవ్వొడు........." (నన్నూలు-౧౪౫ నూ.)=కు—ఏకవచనము. కుమ్—బహు. చెయ్‌కు=చేయఁ గలను. చెయ్‌కుమ్=చేయఁగలము. ఇట్లివియు భావ్యర్థకములె. 'చెయ్‌కేన్' అనునది 'చెయ్‌కు' అనుదానికి భిన్నముకాదు. 'చెయ్‌కు' ప్రాచీన తరము, దానిపైని బురుషబోధక ప్రత్యయము నిల్చుటచే 'చెయ్‌కేన్' అను రూప మేర్పడెను.

"మలయాళమున 'వ' కారము కొన్నియెడల మకారమగుటయుఁ గలదు. అఱవ 'బ' కారము మలయాళమునఁ గొన్నియెడల మకారమగునని యీవఱకు (౨౧ XIII విష) వ్రాయఁబడెను. ఉదా:—తమి-ఉణ్‌బాన్ = (తినును). మల-ఉణ్‌మాన్ (ఈ రూపము మార్గాంతరమునను సాధించుచున్నాఁడు). అఱవ 'బ' కారము మలయాళమున వకారమగునను విధిచొప్పున (౨౧ XIII విష) వకారముచేసి ప్రకృత విధిచొప్పున నట్టి మలయాళ 'వ' కారమునకు మకారము చేయఁగా "ఉణ్‌మాన్" అనురూపము సిద్ధించును. ఉదా:—తమి-కాణ్‌బాన్. మల-కాణువాన్-(లేక) కాణ్‌మాన్. తమి-వాల్‌వవన్-(లేక) వాల్‌బవన్. (సంపదతో జీవించియుండువాఁడు) మల-వాల్‌వవన్ (లేక) వాల్‌మవన్." (కాల్డు. ౧౬౧ పుట).

<u>విమర్శము</u>:—తమి-'ఉణ్‌బాన్' అను దానికి 'తినును' అని యర్థ మనియు;—మల-'ఉణ్‌మాన్' అనుదానికి 'తినన్' అని యర్థమనియు, నిట్లీ రెండును విభిన్నపదములగుటచే శబ్దోత్పత్తిలోని ప్రక్రియయె వీనికి భిన్నమనియు

నక్కారణమున నివి సరియగు నుదాహృతులు కావనియు నీవఱకు (౨౧ XIII విష.) వ్రాసియే యున్నాను. 'వాల్‌పవన్' "వాల్‌బవన్" అనురూపములై యుండనేరవు. "వాల్ = (సంపదతో వర్ధిల్లు) వాల్ + ప (భావ్యర్థద్యోతకము) + అవన్ (వాఁడు) = వాల్‌పవన్" అని రూపసిద్ధి కల్గును. ఇందలి పకారమునకు సరళోచ్చారణము కల్గఁగా "వాల్‌బవన్" అని సిద్ధించుననియు భ్రమింపరాదు. అర్వాచీనమగు నీ సరళాదేశము పకారమునకు స్వానునాసికపరకత్వమందుమాత్రమె కల్గును. (చూ. ౧౭ XXII. ౧౭ XXIII విష.) 'వాఱుమవన్' అనుదాని నఱవమునందును సాధింపవచ్చును. "వాల్ + ఉమ్ + అవన్ = వాఱుమవన్" (వర్ధిల్లి దీపించువాఁడు) (తద్ధర్మార్థక ప్రథమ పురుషైకవచనము. తద్ధర్మార్థక విశేషణము) వ్యావహారికాఱవమున వకారము మకారమగుట కుదాహరణములు కన్పట్టుచున్నవి. ఉదా:—కువి = కుమి (పోకపోయుట) మొ.

<u>౨౧. XIX విష</u>:—"ద్రావిడభాషలలో టకారము ణకారమగును. తమి-ముఴుగు-తెల్గు-మునుఁగు (జల నిమజ్జనముచేయు). తమి-కుటి-కన్న-కుణి (గొయ్యి) అఱవ 'ట' కారము తఱచుగాఁ దెల్గున డకారముగా మాఱును. అరుదుగా లోపించును. అఱవ 'ట' కారము తఱచుగాఁ గన్నడమున ళకారమగును. దక్షిణ తమిఴ వ్యవహారమందును ళకారమగుట గలదు. టకారము మలయాళమునఁ గొన్నియెడల ళకారముగాను దఱచుగా 'య' కారముగాను మాఱును. ఉదా:—మల-మలయాట్ము=మలయాయ్మ. తుళుభాషలో నియ్యది రేఫముగా మాఱును. ఉదా:—తమి-పొఴుదు-(కాలము) తుళు-పొర్దు. ఇందలి రేఫము కన్నడమునఁ బరసవర్ణరూపమునందును. ఉదా:—హొత్తు=పొత్తు. తెల్గు-పొద్దు. తమి-కోఴి. తెల్గు-కోడి. కన్న-కోళి. తమి=ఏఴు= తెల్గు-ఏడు. (సప్తసంఖ్య) కన్న-ఏళు. "ఎళ్నూరు" అని సమాసమునఁ దెల్గునందును ళకారమగును. మలయాళమున నియ్యది పదాంతమున మాత్రమె ళకారమగును. తక్కినయెడల స్వస్వరూపముతోనె నిల్చును. ఉదా:—తమి-పొఴుదు. తెల్గు-ప్రొద్దు-పొద్దు. ('పుడు' అనియు నగును. ఉదా:—ఆ + పొఴుదు = అపుడు). మల-పోళ్-అప్పోఴుమ్-ఇప్పోఴుమ్. దీనిబట్టి-'ట-డ'లకు వలెనె 'ళ-డ'లకును మిక్కిలి సంబంధముగలదని తేలుచున్నది. ఉగ్రియన్ భాషలోను గౌడభాషలలోను 'ల-డ'లకు మార్పుగలదు. హిందూ జర్మానిక్ భాషలందును నీ మార్పు గలదు." (కాల్డు. ౧౬౧-౧౬౨ పు).

<u>విమర్శము</u>:—తమిఴ 'ఴ' కారము తెల్గు కన్నడములలో డకారాదిరూపమున మాఱెనన నేల? ఆంధ్రకన్నడములందె యట్టి శబ్దములు 'ఴ' కారము

తోనె ప్రాచీనకాలమందుండెడివి. కాలక్రమమున నట్టి యాంధ్ర కన్నడ ళకార మర్వాచీనపు తెల్గునందును, హళగన్నడమందును డకార ళకార ములుగ మాఱిపోయెను. (౧౭ IX. X—విష.) ద్రావిడభాషలందేకాక సంస్కృత మందును దుస్స్పృష్ట 'డ' కారమనెడి యీ 'ళ' కారము 'అజ్మధ్య 'డ' కార స్థలములందుఁ బాహుళికముగ నిల్చెడిది. ద్రావిడభాషలలోఁ దమిళ మల యాళములందు మాత్రమె యీ ళకారము నేఁటికిని నిల్చియున్నది. ఆంధ్ర కర్ణాటములలోఁ గొంతకాలము క్రిందటనే యంతరించినది.

'ముణుఁగు' అను తెల్గు శబ్దమునకు 'జలనిమగ్నమగు' అనునర్థము లేదు. దానికి 'సంకోచించు' అని యర్థము. ఉమంతమగునపుడు మలయాళమున ళకారమె నిల్చును. ఉదా:—అప్పోళుమ్-ఇప్పోళుమ్. 'అప్పోళుమ్' అను రీతి నివి యుండనేరవు. "పొలుదు, ప్రొద్దు, పొద్దు-పుడు-పొట్టు-పొత్తు-హొత్తు-పొర్దు" అను ద్రావిడ శబ్దములెల్ల సంస్కృత 'బ్రధ్న' శబ్దమున కభిన్నము (బ్రధ్న=సూర్యుఁడు) లందురు. ఇందేమియు విరోధము కన్పట్టదు. మధ్యా సియా వాసము మొదలుగ సంస్కృత సంబంధము ద్రావిడభాషలకుఁ గల్గి యుండుటచే నెల్లద్రావిడభాషలందును సంస్కృతభవము లుండుటలో విరో ధము లేదు.

౨౧. XX విష:—"ఱఱవ ఱకారము తుళుభాషలో జకారముగా మాఱును. ఉదా:—తమి-మూఱు-(ఇది తమిళ ప్రాచీనరూపము). మూన్రు-(ఇది తమిళ నవ్యరూపము). తుళు-మూజి. తమి-ఆఱు. తుళు-ఆజి. ఱకారము తుళుభాషలో 'డ' కారముగ సైతము మాఱును. తమి-నూఱు-తుళు-నూడు. తుళులో నిది రేఫముగా సైతము మాఱును. తుళుభాష రేఫవిషయమున సారళ్యాభిలాషి యని తేలుచున్నది. తమిళమున ఱకార మొకప్పుడు 'న' కారముగా మాఱును. ఉదా:—తమి-పిఱగు (వెనుక-తర్వాత) ఇందలి 'పిఱ్'అనునది 'పిన్' అని మాఱినది. తమి-శి (చి) ఱు=శి (చి) న్న" (కాల్డు. ౧౬౨ పుట).

విమర్శము:—మూఱు శబ్దము తమిళమున నెన్నఁడును లేదు. అది కన్నడ శబ్దము. 'మూన్రు' అనునదే తమిళమునఁ బ్రాచీనకాలమందు సైతము త్రిత్వవాచి. నేఁటి తమిళ వ్యవహారమందు 'మూణు' అని వినఁబడుట గలదు. 'పిఱగు—పిన్' శబ్దము లభిన్నములనుట సరికాదు. 'పిఱ్' అను పరుషాంత శబ్ద వ్యవహారము తమిళ సంప్రదాయ విరుద్ధము. అట్టి వ్యవహారమే లేనపుడు దానినుండి 'పిన్' అని యేర్పడుటెట్లు? 'శి (చి) న్న' అనునది తెనుఁగు శబ్దము. దీనిని కొన్ని నాళ్ళనుండి తమిళులు వాడుక చేయుచున్నారు. (చూడు. ౨౧

XVII విష.) దొరగారు 'శిక్' అనుదాని రూపాంతరము 'శిన్' అని లోఁగడను వ్రాసిరి. అందును బరుషాంతత తమిళ సంప్రదాయ విరుద్ధమే.

‟ళకారము తుళుభాషలో ణకారమగును. ఉదా:—తమి—కన్న-కేళ్-(విను) తుళు—కేణ్. తమి—కన్న—కొళ్ (కొను) తుళు—కొణ్. తెల్గు—కొను. తమి—కొణ్డు—(కొని). ఇందు 'కొళ్' అనుదానిలోని ళకారము సంధి వశమున ణకారమగుచున్నది. ళకారము మలయాళమున లకారముగ మాఱిన పిదప నది యకారమగును. ఉదా:—మలయాళ్మ=మలయాల్మ=మలయాయ్మ=(మలయాళదేశము—మలయాళభాష). ఆళ్=(ఏలు)-(మల-ఆళ్మ=తమి-ఆణ్మై)”

(కాల్డు. ౧౬౩ పుట).

విమర్శము:—'ణళ'లు రెండును మూర్ధన్యములుగాన వాని మార్పు సహజమె. ౨౧ XIX విషయమున 'ల' కారము ళకారమగునని చెప్పి యిటఁ దద్విపరీతముగ ళకారము లకారమగుననుట సరికాదు. లకారము ళకార ముగా మాఱుట కుదాహరణ శతము (౧౭ IX ౧౭ X విష.) గలదుగాని ళకా రము లకారమగుట కొక్క యుదాహృతియేని కన్పట్టదు. అట్లె 'ల' కారము యకారమగుటకు 'మలయాయ్మ' అను నుదాహృతితప్ప మఱొక యుదాహృతి ప్రాచీన భాషలో గానరాదు. ('చెన్నపురి సమీపమునఁ గొందఱు నేఁడు లకారమును యకారముగాఁ బల్కుదురు.' శ్రీ విద్వాన్. వే. వేంకటరాజులు రెడ్డిగారు).

—సంస్కృత 'శ—ష—స' ల మార్పులు—

౨౨. I విష:—‟సంస్కృత 'ష' కారము కొన్నియెడల 'శ' వర్ణ మగును. దక్షిణాఱవ వ్యవహారమున నీ మార్పు ప్రచురము. షకారము గ్రాంథిక తమిళమున నరుదుగ లకారమగును. డా. గుండర్టు దొరగా రీ క్రింది రీతిని వ్రాసిరి. సంస్కృత — క్షయ = (నాశ) ప్రాచీనమలయాళము—కిలయమ్. సంస్కృ—లక్షణ ప్రాచీన మలయాళ—ఇలక్కణన్. కొన్ని యెడల 'ష్ణ' అనునది 'ణ' కారమగును. సంస్కృ—విష్ణు—గ్రాంథిక—తమి—మల—విణ్ణు. గ్రాంథిక తమిళమున 'విణ్డు' (విష్ణువు—గాలి) అనియుఁ గలదు. డా. గుండర్టుగారు 'విణ్' (ఆకాశము) అనునది 'విళ్' (ప్రకాశము) అను ధాతువును సంబంధించినదే యనిరి. సంస్కృత షకార మఱవమునఁ దఱ చుగ డకారమగును. ఈ డకారము కొన్నియెడల దకారమగును. సంస్కృ-మనుష్య—గ్రాంథిక తమి. మానిడన్. దీని వికృతి-మానిదన్. సంస్కృ-ఆషాఢ. గ్రాం. తమి-ఆడి. ఇది మిక్కిలి ప్రాచీన రూపము. సంస్కృ-త్రైష=తమి-త్రై.

ఇందలి షకారము లోపించినది. ఇదియు మిక్కిలి ప్రాచీనమె." (కాల్డు. ౧౬౩ పుట).

విమర్శము:—సంస్కృత 'ష' కారము శవర్ణమగునని దొరగారు వ్రాసిరే కాని యుదాహరింపలేదు. ఉదా:—సంస్కృ-విషయ, తమి-విశ (చ) యమ్. క్షయ శబ్దభవమగు "కిటయమ్" అనునది డా. గుండర్టుగారి కోశమునఁ గలదు. కాని శబ్దతారావలీకోశమున లేదు-లక్ష్మణ శబ్దభవమగు "ఇలట్క్కణన్" అనునది గుండర్టుగారి కోశమునందును లేదు. తమిట మలయాళములలోఁ బ్రకాశార్థకమగు 'వెళ్' ధాతువు గలదు. డా. గుండర్టుగారు వ్రాసిన 'విళ్' అనునది 'వెళ్' ధాతువును సంబంధించినది కాదు. 'మానిడన్' అనుదాని ప్రకృతి "మనుష్య"శబ్ద మనుటకంటె 'మానుష' శబ్దమనుట లెస్స. 'మానిడన్' అనుదానిలోని డకారము 'ద' కారమయిన దనుటకన్న "మానుష=మానిస=మానిద,=మనితన్" అను రీతిగల పరిణామము నెన్నుట యుక్తము. తమిట తద్భవములలో 'స' కారము 'ద' (త) కారమగుట సంప్రదాయము. 'ఆషాఢ' శబ్దములోని 'ఢ' కారమున్నదిగాన నందలి 'ష' కారము 'త్రైష' శబ్దమందు వలెనే లోపించెననుట యుక్తము. సంస్కృ=ఆషాఢ=తమి-ఆడి-మె.

"సంస్కృత సకార మఱవమున 'ద' (త) కారమగును. ఉదా:—మాస-తమి-మాదమ్. సంస్కృ-మనస్. తమి-మనదు. దకారము సకారమగునని యీ వఱకు వ్రాయఁబడెను. (౨౧ IX విష.) ఈ మార్పు దానికి విపరీతము. ఈ మార్పు 'గ్రీకు-శ్పానిషు' మున్నగు పాశ్చాత్య భాషలందును గలదు. సంస్కృతపదాది సకారము తమిటమున లోపించును. ఉదా:—(సంస్కృ) సంధ్య=(తమి)-అన్ది. (సంస్కృ) స్థానమ్=(తమి) తానమ్. నేటి తమిటులు పదాది సకారము నుచ్చరింప యత్నించుచున్నారు. పదాది సకారమునకు మొదట 'ఇ' కారమును జేర్చి పలుకుదురు. ఉదా:—(సంస్కృ)-స్త్రీ=(తమి) ఇస్తిరి. సంస్కృత 'శ' వర్ణ మఱవమునఁ దఱచుగా 'చ' కారముగా వ్రాయఁబడును గాని కొన్నియెడల 'శ' వర్ణముచోట సకారస్థానమందువలెనె 'త' కారము నిల్చును. ఉదా:—(సంస్కృ)—శ్రీ=తమి-తిరు. కొన్నియెడల 'శ' వర్ణము సకారమువలె లోపించును. ఉదా:—(సంస్కృ)-శ్రావణ=(తమి)-ఆవణి=(మల) ఓణమ్=(శ్రావణ్యుత్సవము)".

"సంస్కృతభాషలోని యూష్మములు హిందూ జర్మానికు భాషలలోవలె ద్రావిడభాషలందు రేఫముగా మాఱనేరవు. కాని కొన్నియెడల నట్టి మార్పును నగపడుచున్నది. అట్టి మార్పు నిశ్చయమని చెప్పుటకుఁ దగిన యాధారము లేదు. ఉదా:—(సంస్కృ) అస్ (ఉండు)=(బ్రహుయి) అర్=తమి—కన్న

ఇర్. (ఉండు—కూర్చుండు) (సంస్కృ) జస్=అస్=(ప్రథమాబహువచన ప్రత్యయము) అర్. సంస్కృ—అయస్=(ఇనుము) (ఐరన్—ఇంగ్లీషు)=తమి ఇరుమ్బు." (కాల్డు. ౧౬౪-౧౬౫ పుటలు).

విమర్శము:—మనశ్శబ్ద వికృతి 'మనదు' అని యున్నది గాని తమిళమున 'మనమ్' అనునది ప్రచురము. సకారమునకు ముందు 'ఇ' కారము చేర్చు సంప్రదాయము తమిళమున లేదుగాని 'స్త్రీ' శబ్దపు సంయోగమును బలుకఁ జాలక యధమజాతి తమిళులు 'ఇస్తిరి' అని పల్కెదరు. (చూ. ౧౯ IV విమ.) సంస్కృత 'శ' వర్ణమును దఱచుగా 'చ' కారముగాను 'య' కారముగను, నరుదుగ 'త' కారముగను వ్రాయుటయేకాక పలుకుచునున్నారు. వ్యవహార ములో మాత్రము సంస్కృత 'శ' వర్ణము 'శ-స'లుగానే పలుకుదురు. తిరు శబ్దము దేశ్యమనియు శ్రీశబ్దభవము తమిళమున 'చీ' శబ్దమనియు దమిళ పండితుల యాశయము. తమిళ మళయాళములు రెంటను "ఓణమ్" అనుటకు శ్రవణ నక్షత్రమని యర్థము.

౨౨. II విమ. విమర్శము:—'ఇరుమ్బు' అనునది 'అయ' శ్శబ్దభవ మనుట సరికాదు. కన్నడమున "కర్+పొన్=కర్బొన్" (నల్లని లోహము =ఇనుము) అని ప్రసిద్ధము, "పొన్=పొన్ను" శబ్దము స్వర్ణవాచకమె యైనను లోహ సామాన్యవాచిగా నున్నది. ప్రాచీన తమిళ గ్రాంథికభాషలో 'పొన్' శబ్దమునకు లోహార్థమునఁ బ్రత్యేక ప్రయోగము లేదుగాని దానికి "ఇనుము-బంగారము" అను రెండర్థములందును బ్రయోగము గలదు, "ఇరుమ్+పొన్= ఇరుమ్బొన్—ఇరుమ్బు (నల్లని లోహము)" అని వ్యుత్పత్తి నెన్నుట యుక్తము. ఇట్లె—తమి—"పసు (చు) మ్బొన్=పైమ్బొన్=(బంగారము)—వెణ్బొన్= (వెండి), సెమ్ (చెమ్)+పొన్=సె (చె) మ్బొన్=(చెంబు-తామ్రము)" అనునవి ప్రసిద్ధములై యున్నవి.

సంస్కృత "జస్" ప్రత్యయము ద్రావిడ ప్రథమా (అర్) బహువచన మునకు మూలమునెడి కాల్డువెల్లుగారి యాశయము (చూ. ౨౨ I విమ.) యుక్తమె. అచట 'స' కారము రేఫమగుటలో దొరగా రంత సంకోచింపనేల? సంస్కృతమందే యచటి 'స' కారము రేఫమగును. "స సజుషో రుః. (౮-౨-౬౬)=పదాన్తస్య సస్య సజుష్ శబ్దస్యచ 'రుః' స్యాత్." (సి-కౌ. ౧౬౨ సూ.) "'రు' ఇతి ఉకార ఇత్" (బాల మనోరమా వ్యాఖ్య). పై చొప్పున సంస్కృతమందె 'జస్' ప్రత్యయము 'అర్' అను రూపమునందును. "ఖరవ సానయో ర్విసర్జనీయః (౮-3-౧౫) (సి-కౌ. ౭౬ సూ)." అను చొప్పున 'అర్' అనుదాని రేఫము సంస్కృతమున విసర్గమగును. యథాస్థితముగనే ద్రావిడ

భాషలలో రేఫమే ప్రథమా బహువచనమగును. అట్లేర్పడిన ద్రావిడ (చూడు. ౭౭ III విమ.) 'ర'కారరూప బహువచన ప్రత్యయమె తెల్గున 'లు' ప్రత్యయమగును. దానినుండి 'కళ్' ప్రత్యయ మేర్పడును. (చూ. ౧౮ III విమ.) తొల్కాప్పియము నాఁటికే తమిఴ ప్రథమా బహువచన ప్రత్యయము 'ర'కారము. (చూడు. తొల్కా. ౪౯౦ సూ.) "ద్రావిడ రకారరూప ప్రథమా బహువచన ప్రత్యయము కన్నను మకారము ప్రాచీనతమ బహువచన ప్రత్యయము." (చూడు. ౨౦ XVII విమ. ౧౮ VIII విమ.) (సంస్కృత 'జస్' ప్రత్యయమునుండి ద్రావిడ 'లు' ప్రత్యయ మేర్పడెననుటకు శ్రీ విద్వాన్. వే. వెంకటరాజులు రెడ్డిగారు సంకోచించుచున్నారు).

౨౩. I విమ:—"ద్వంద్వ సమాసమున నుత్తర పదాదినున్న పరుషము ద్రావిడభాషలలో సరళముగా మాఱును. అట్టి సరళమును సరళ లిపియున్న భాషలలో సరళముగనె వ్రాయుదురు. సమాస మేకపద మగుటచేత నఱవమున నిట్టిమార్పు వచ్చుట సహజమే కాని సంస్కృత సంబంధ మధికముగాఁగల యాంధ్ర కన్నడములందును నిట్టిమార్పు గల్గుటచేత నీయది ద్రావిడభాషా సాధారణమని యంగీకరింపక తీరదు. తెల్గున నఱవములో లేని విశేష మొకటి కలదు. తెల్గునఁ దత్పురుష సమాసమునఁ బూర్వ పదము ద్రుత ప్రకృతికముగా నుండునపు డుత్తరపదాది పరుషము సరళముగా మాఱును.

తు మున్నంతము పైని దత్పురుష సమాసములోను బరహల్లునకు సారళ్యము గల్గుటకు మాఱుగాఁ దమిఴమున ద్విత్వము వచ్చి పారుష్యము మిక్కిలి బలపడును. కన్నడమున సంధి విషయములో నంతగాఁ బాటించుట లేకున్నను నీ విషయమున మాత్రము సరళాదేశము తప్పక వచ్చును. ఉదా:— కన్న—హులి+తొగలు=హులిదొగలు=తమి—పులి+తోల్ = పులిత్తోల్." (కాల్డు. ౧౬౫—౧౬౬ పుటలు).

విమర్శము:—గ్రాంథిక తమిఴమున సరళోచ్చారణమె లేదు. తొల్కాప్పియమువఱకుఁ దమిఴమున సరళోచ్చారణము లేదని యీ వఱకు వ్రాయఁబడెను. (చూ. ౧౭ XXII, XXIII, XXIV విమ.) అర్వాచీనముగా వచ్చిన సరళోచ్చారణ మన్ననో ద్వంద్వసమాసమందే యననేల? వివిధసమాసములందును వ్యస్తసంధులందును బ్రత్యేకశబ్దములందును ద్రావిడభాషలలో విస్తృతముగా వ్యాపించియున్నది. ప్రాచీన తమిఴమున లేని గ జ డ ద బ లే కాక శసలును విస్తరించి యున్నవి (చూడు. ౧౭ XXII మొ. ౧౭ XXIV వ. విమ.)

"పరుషాణాం । గసదవాః స్యుః పదా ద్ద్వన్ద్వే" అను చింతామణి వాక్యము చొప్పుననగు "తల్లిదండ్రులు" మున్నగు ద్వంద్వసమాసరూపములను

దొరగారు విని పయిరీతిని గలగాయపులగముగా వ్రాసిరే కాని ద్రావిడ భాషలలోని యీ సరళాదేశము పెక్కువిధములుగ నున్నది.

I. తమిళభాషలోని ప్రాచీనమగు ననునాసిక పూర్వక పరుషము లర్వాచీనముగా సరళములగుచున్నవి. అందుఁ గొన్నిమొడలఁ బరపరుష ద్విత్వము గల్గుటయుఁ గలదు.

II. తమిళమందలి యర్వాచీన సరళోచ్చారణసిద్ధ సరళాదేశ విస్తృతి. (చూడు. ౧౭ XXII మొ. ౧౭ XXIV వ. విష).

III. తెల్గునందలి ద్రుతముమీఁది పరుషముల కగు సరళాదేశము.

IV. ప్రాచీన కర్ణాటమందలి సామాసిక గజడద బాదేశము. పవర్గ వకారాదేశమును.

V. తెల్గునందలి ప్రథమమీఁది పరుషములకగు గసడద వాదేశము.

VI. తెల్గునందలి ద్వంద్వ సమాసమందలి పరుషములకగు గసడద వాదేశము.

పయివానిలోని మొదటి యనునాసికపూర్వక సరళాదేశము ౨౮ IV ౨౪ I, II, III. విషయములలోఁ జెప్పఁబడిన యనునాసి కాగమస్థలములం దెల్లఁ గన్పట్టును. అట్టి చోటులందలి పరుషములెల్ల నేడు సరళములుగానె నియతముగఁ బలుకఁబడును. అచటి యనునాసికాగమమునకుఁ బర్యాయముగాఁ బరపరుష ద్విత్వమును విధింపఁబడును. అట్టి ద్విత్వమె యచటి యనునాసిక పూర్వక పరుషస్థితికి నిదర్శనమగుచున్నది. II ద్వితీయ విధమగు తమిళార్వాచీన సరళాదేశము ౧౭ XXII మొ. ౧౭ XXIV వ. విషయములందు వివరింపఁబడెను. III తృతీయ విధమగు తెల్గులోని ద్రుతముమీఁది సరళాదేశము ౨౬ విషయమున వివరింపఁబడును.

IV చతుర్థ విధమగు ప్రాచీన కర్ణాట సామాసిక సరళాదేశము:— కర్ణాటమున వాక్యమందలి సంహిత సంస్కృతానుసరణమున వైవక్షిక మగుటం జేసి సమాసమందుమాత్రమె కర్ణాటమున నీ సరళాదేశము గల్గును. వ్యస్త స్థలములందుఁ గల్గనేరదు. అనునాసికములయుఁ బూర్వ పదాంతిమస్వరములయు 'నాదిత' యొక్క తాఁకు దుత్తరపదాదిస్థ పరుషమునకు సామాసిక సంహిత నిత్యమగుటంజేసి గల్గెడి యవ్యవహితోచ్చారణముచే సంభవించును గాన నట్టి పరుషము సరళముగాఁ బరిణమించునని తత్వజ్ఞుల యాశయము. వ్యస్తపద సంధిలో సంహిత వివక్షింపఁబడని కారణమున నట్టి సరళాదేశము గల్గనేరదని తాత్పర్యము. ఉదా:—మున్ + చూరు = ముంజూరు = ముఞ్జూరు. (ముంజూ

రని యర్థము) పొన్+చరిగె=పొంజరిగె=పొఝరిగె=(బంగారుకత్తి). కెమ్+తళిర్=కెందళిర్=కెన్దళిర్=(ఎఱ్ఱని చిగురు.) బాన్+తొాఱె=బాందొాఱె=బాన్దొాఱె. (ఆకాశగంగ) తణ్+పులిల్=తణ్బులిల్=(చల్లని పులినము). పల+కన్నడం=పలగన్నడం (ప్రాచీన కన్నడము=పలగన్నడము=హళగన్నడము). అలి+కబ్బం=అలిగబ్బం=(దుష్కావ్యము). ఇట్లు గజడదబాదేశము కొన్ని కర్ణాట సమానములందుఁ జూపట్టుచున్నది. 'క-త' లకు 'గ-ద' లు సార్వత్రికముగ సమాసమున వచ్చును. ఇతర ద్రావిడభాషలలోని దంత్య చకారము కర్ణాటమున సాధారణముగ నత్యంతసారళ్యముగల 'స' కారముగఁ దఱచుగఁ బరిణమించును. ఉదా:—తెల్గు-ఇంచు. కన్న-ఇసు. తెల్గు-చాలు. =కన్న-సాల్. తెల్గు-చచ్చు=కన్న-సా. మొ. (చూ. ౧౭ XVII విష).

కొన్నియెడల సకారమె చకారమగును. కర్ణాట సమాస సంధులందుఁ బరస్థిత పకారమునకె కాక యట్టి పవర్గమునకె మిక్కిలి సారళ్యముగల వకారాదేశము గల్గును. సంస్కృత పదాది వకారము కర్ణాటులచే 'బ' కారముగ నుచ్చరింపఁబడును. అట్టి బకారము సైతము సమాసమున స్వర-య-వలపైని వకారమె యగును. కావునఁ గర్ణాటమున 'గ-జ-(డ)-ద-బా' దేశరూప సరళాదేశముకన్న గ-స-(డ)-ద-వా దేశరూప సరళాదేశమె" విరివిగాఁ గల్గునన వచ్చును.

"వర్గప్రథమానాం తృతీయాః సమాసోత్తరపదాదౌ." (కర్ణా. భూష. ౨౭ సూ.) ఉదా:—పల+కన్నడం=పలగన్నడం-మొ. "చ-ట వర్ణయో శ్చ" (కర్ణా. భూష. ౩౦ సూ.) సమాసోత్తరపదాదిస్థ 'చ-ట' లకు జడలు రావు. ఉదా:—కడు + చాగి = కడుచాగి. (గొప్పత్యాగి). పొసటంకం = (క్రొత్త టంకము). స్వరయవలేభ్యో బహుళం వః పవర్గస్య (కర్ణా. భూష. ౩౧ సూ.) ఉదా:—పొసతు + పెసర్ = పొసవెసర్ (క్రొత్తపెసలు) (లేదా-క్రొత్తపేరు) మెయ్+బసం=మెయ్వసం (పారవశ్యము). మొ.

అర్వాచీన సరళోచ్చారణము ద్రావిడభాషలందు విస్తరించుటలోఁ దమిళమండలి నియతత్వ మాంధ్ర కర్ణాటములలోఁ జూపట్టదు. తమిళమున సమాన పదములయందు స్వానునాసిక పూర్వక పరుషము నేఁడు నియతముగా సరళమగును. ఆంధ్ర కర్ణాటములందట్లు కాదు. ఉదా:—తెలుఁగు—చంక—పంచ—మంట—పంతము. ఇంపు, మొ. కన్న—బింకం—టంకం-మొ. ఇట్లు సమాన పదములం దనునాసిక పూర్వకత్వమున సరళాదేశ మాంధ్ర కర్ణాటములలో సంస్కృతమందు వలె రాకుండుట వ్యవహర్తల స్థితస్థాపకతాభిని వేశము మున్నగు కారణములచేత సంభవించి యుండును. ఉదా:—సంస్కృ—

శజ్కు—పఙ్చు—కణ్టక—అన్త—కమ్పు. మొ. అనునాసిక పూర్వకత్వము లేనపుడు సైతము సమాన పదములందును గొన్నియెడల నాంధ్ర కర్ణాటములలో సరళోచ్చారణము గల్గక పోలేదు. ఉదా:—సంస్కృ-ముఖమ్. తెల్గు-మొకము-మొగము. సంస్కృ-మృగ. తెల్గు-మెగము-మెకము. సంస్కృ-కుంతి. తెల్గు-గొంతి. సంస్కృ-కేతకి-కన్న-కేదగె. తెల్గు-గేదఁగి. సంస్కృ-ద్యూతము. కన్న-జూదాళి (ద్యూతశీలుఁడు) తెల్గు. జూదము-జూజము-మొ.

ఇట్లె మఱికొన్ని విషయములందును దమిళాంధ్ర కర్ణాటములకు భేదములు గలవు. అవసాన మందలి 'న-మ'లు కర్ణాటమున నియతముగా బిందురూపము నందును. తెల్గున నట్లు కానేరదు. తమిళమున సున్నయే లేదు. సంస్కృ తానుసారముగాఁ గర్ణాటమందలి బిందువు వర్గాక్షర పరకత్వమునఁ దత్తద్వర్గీయానునాసికముగాఁ బరిణమించును. కాని యర్వాచీన తమిళమందువలె నట్టి చోటులందలి పరస్థపరుషము సరళముగా మాఱవలయు నన్న నియమము లేదు. తెల్గునందలి యనుస్వారమునకుఁ బరసవర్ణానునాసికాదేశమె లేదు. అట్టియెడల బిందువే నిల్చును. తెల్గున 'క-చ' వర్గపంచమములగు 'ఙ-ఞ' వర్ణములె లేవు. (చూ. ౧౯ III విష).

"మనయో శ్బిన్దుః" (కర్ణా. భూష. ౧౧౨ సూ.) అవసానమునందలి మకార నకారములు కర్ణాటమున బిందు రూపమునందును. ఉదా:—(తాన్) తాం. (తామ్)—తాం. (తాను-తాము-తెల్గు). తమి—(అవన్) కన్న—అవం. (వాఁడు). కన్న (నెలమ్) నెలం (నేల). మొ.

"వర్గే తద్వర్గాన్త్యః" (కర్ణా. భూష. ౧౧౩ సూ.) మకార నకారములకు వర్గాక్షర పరకత్వమునఁ దత్త ద్వర్గ పంచమాదేశమగును. ఉదా:—బిఙ్క-మ్+కెట్టమ్=బిఙ్క-గెట్టమ్. (బింకమువలనఁ జెడును). (ఇది క్రియాకారక సమాసముగాన సామాసిక సరళాదేశము సైతము గల్గెను).

కర్ణాటమున వ్యస్తతలో సైతము పరసవర్ణానునాసికాదేశ మగును. ఉదా:—తాం+చలచిత్తం=తాఞ్చలచిత్తం. (తాను చలచిత్తుఁడు) అవం+కులీనం=అవఙ్కులీనం. (వాఁడు సత్కుల జాతుఁడు). ఇట్టి పరసవర్ణాను నాసికాదేశము వైకల్పికమని కర్ణాట శబ్దానుశాసనమునఁ జెప్పఁబడెను. "తదన్త్యో వా వర్గే" (కర్ణాట శబ్దా-౬౦ సూ.) వర్గాక్షర పరకత్వమున 'నకార-మకారములు' వైకల్పికముగాఁ దత్త ద్వర్గీ యానునాసికములగును. ఉదా:—ఆమ్+కులీనర్=ఆంకులీనర్=ఆఙ్కులీనర్ (మేము కులీనులము) ఆన్+కులీనం=ఆంకులీనం=ఆఙ్కులీనం=(నేను సత్కులవంతుఁడను). తెల్గునందు వర్గాక్షర పరకత్వమునం దనుస్వారము కొన్ని యెడలఁ దేలిపోయి లుప్తప్రాయమగును. కావుననే

ప్రాచీనాంధ్ర శాసనములం దట్టి తేలిన బిందువు లిఖింపఁ బడదయ్యె. ఉదా:—
తాను గట్టించె గ్రమంబున. పరగగ. మఠంబును గార్తికేయునకు. దీని జేబ్రోలు.
వీనిలో శాసన పరిష్కర్తలు బిందువును వ్రాసి చూపిరేకాని శాసన ప్రతి
బింబమున నట్టి సున్నలు లేవు. (చూడు. ౧౭ XVIII విధ.) (శాసన పద్య
మంజరి. ౨. శాసనము—ప్రతిబింబము. యుద్ధమల్లుని బెజవాడ శాసనము)
అట్లయినను నాంధ్రపండితు లట్టి తేలిన బిందువును వివేకించి ఖండబిందువు
నచట నిల్పసాగిరి. కర్ణాటపండితు లట్టి సూక్ష్మ విమర్శనము చేయమిచేఁ
గర్ణాటమున ఖండబిందువు లేదయ్యెను. (చూ. ౧౭ XX విధ).

V పంచమ విధమగు తెల్గునందలి గ స డ ద వాదేశము:— తెల్గున
వాక్యగత పదములకు సంహిత నియతమగుటంజేసియు నచ్చులు నాదములగుటం
జేసియునట్టి నాదిత తాఁకుడు పరస్థ పరుషములకుఁ గల్గును గానఁ గర్ణాటమున
సమాసమందువలెనె తెల్గున నంతటను గ స డ ద వాదేశము వచ్చుట సహజ
మనవచ్చునుగాని తెల్గున నాచ్ఛిక ప్రథమావిభక్తి పైని, గాలక్రమమున నాచ్ఛి
కేతర ప్రథమలమీఁదను గ స డ ద వాదేశము నిత్యముగా వచ్చుట ప్రసిద్ధమై
యున్నది. నున్న తాఁకుడు లేమింజేసి-'చ-వ' లకు 'జ-బ'ల యాదేశము గల్గ
దయ్యెను. వాని కతోధిక సారళ్యముగల 'స-వ'ల యాదేశము సంభవించెను—
భారతమున నీ గ స డ ద వాదేశము నిత్యముగా వాడఁబడెను. "గసడదవాః
స్యుః ప్రథమా। మాత్రా దాత్మా స్వదో ర్వినై వైతే। న వికృతిశబ్దా త్వరత।
స్సాంస్కృతికానాం భవన్తి గసడదవాః॥" (వ్యా. సం. ౭౭ విధ).

VI షష్ఠ విధమగు నాంధ్ర ద్వంద్వసమాస గ స డ ద వాదేశము:—
ద్వంద్వ సమాసమున లోపించియున్న చార్థక ద్రుతప్రకృతిక ను శబ్దమహిమచేఁ
గావలయుఁ దెల్గున ద్వంద్వమున నుత్తరపదాది పరుషములకు గ స డ ద వాదేశము
నిత్యముగా వచ్చుట ప్రసిద్ధమైయున్నది. "పరుషాణాం। గసడదవాః స్యుః
పదా ద్ద్వన్ద్వే" (వ్యా. సం. ౭౯ విధ). ఇట్లు తెలుఁగునందు మాత్రము
ద్వంద్వమందు గ స డ ద వాదేశము ప్రసిద్ధమయియుండఁగా "ద్వంద్వసమాస
మున నుత్తరపదాదినున్న పరుషములు ద్రావిడభాషలలో సరళములుగా
మాఱును" (చూ. ౨౩ I విధ.) అని ద్రావిడభాషా సామాన్యముగా నీ ద్వంద్వ
గ స డ ద వాదేశమును దొరగారు వ్రాయుట కేవలము పొరపాటు. మఱియు
దీనిని సరళాదేశ మనుటకంటె గసడదవాదేశమనుట యెక్కుడు సమంజసమనఁ
దగును. ప్రాచీన తమిళుములో సరళోచ్చారణమే లేదు. అర్వాచీన తమిళ
మున వచ్చిన సరళోచ్చారణము సైతము "తాయితన్దైయర్" (తల్లిదండ్రులు)

మున్నగు తమిళద్వంద్వములలో లేదు. తమిళమున నేసమాసమందును నీ యాదేశములేదు. ఉదా:—ఎన్కై =(నా చేయి). కరుక్కుదిరై =(నల్లని గుఱ్ఱము). 'ఎన్గై—కరుగ్గుదిరై' అని యుండనేరదు.

దొరగారు పరిశీలింపలేదు గాని ద్రుతముమీఁది పరుషములకు వచ్చు సరళాదేశము వేఱు. అది గజడదబాదేశము. ప్రథమావిభక్తుల మీఁదను, ద్వంద్వమందును వచ్చు సరళాదేశము వేఱు. ఇది గసడదవాదేశము. గజడదబాదేశమునకు ముందు ద్రుతరూపములగు 'న్-ఁ-ం' అనువానిలో నేదేని నిల్చియుండును. గసడదవాదేశమున నట్టి ద్రుతస్థితికిఁ బ్రసక్తి యుండదు.

౨౩. II విమ:—"తమిళమందును సమాసములోని పూర్వపదము క్రియగాఁగాని క్రియాజన్య విశేషణముగాఁగాని యుండునపుడు సరళాదేశము వచ్చును. పూర్వపదము నామముగాని గుణ విశేషణముగాని యగునపుడు సరళాదేశము రాదు. ఉదా:—కాయ్గొమ్బు (ఎండు కొమ్మ). కాయ్ కొమ్బు (పల్లకొమ్మ)" కాల్డు. ౧౬౬ పుట).

"తమిళ సంధులు పెక్కు సంస్కృతమును బోలక ద్రావిడభాషా పద్ధతుల ననుసరించియుండును:—'ల-ళ'లు 'న-ణ' లగుట:—తమి-పోల్+ద=పోన్ద (పోలిన). కొళ్+ద=కొణ్డ (కొనిన). ఇట్టి యఱవపు మార్పు చొప్పుననే తెల్గులోని 'కొను' ధాతువేర్పడెను. తుళు-కొణ్-(కొను). కకారమునకు ముందటి లకారము సైతము నకారమగును. ప్రాచీన తమి-నాల్కు=నవీనతమి-నాజ్గు. సంస్కృ-ఫల్గున. తమి-పఙ్గుని. తెల్గులో సైతము టకారమునకు ముందటి లకారము నకారమగును. ఉదా:—ఇల్ + టి = ఇన్టి. పై మార్పులనుబట్టి లకారరూపము ప్రాచీనమనక తీరదు. లాటిన్-అలియస్. సంస్కృ-అన్యస్." (కాల్డు. ౧౬౬ పుట).

"తుదభాషలో లకార కకార సంయోగమధ్యమున థకారమును, రేఫ కకార సంయోగమధ్యమున షకారమును నిల్చును. ఉదా:—తుద-నిల్థ్కెన్=(నిలఁబడుచున్నాను)='నిల్కెన్' అని యుండవలసినది. ఎర్ష్కెన్ (ఉన్నాను)= 'ఎర్కెన్' అని యుండవలసినది." (కాల్డు. ౧౬౭ పుట).

విమర్శము:—దొరగా రుదాహరించిన "కాయ్గొమ్బు" అను సరళోచ్చారణము తమిళమున నేఁడును లేదు. "కాయ్కొమ్బు"=(ఎండు కొమ్మ) అనియే నేఁడును బల్కుదురు. ఇట్లె దొరగా రుదాహరించిన 'పోల్+త= పోన్ద' అనికాదు. తమిళమున 'పోల్+త=పోన్త' అని యగును. మఱియు

"నాల్కు" అనునది ప్రాచీన తమిళ రూపమనియు "నాఙ్గు" నవీన తమిళ రూపమనియు దొరగారు వ్రాయుట సరికాదు. 'నాల్కు' అని కొన్ని ప్రాచీన కవి ప్రయోగములలో నున్నను దొల్కాప్పియరు నాఁటికి 'నాన్కు' శబ్దమె సాధువు. "నాన్కన్ ఒత్తే......" (తొల్కా. ౪౫౪ సూ.)=పరిమాణార్థక శబ్దము పరమగునపుడు 'నాన్కు' శబ్ద 'న' కారమునకు లకారాదేశమగును. ఉదా:—నాన్కు+వట్టు=నాల్వట్టు (నాలుగువట్టుల పరిమాణము). "నాన్కన్ ఒత్తే......" (తొల్కా. ౪౬౦ సూ.)=ఆయిర శబ్దము పరమగునపుడు 'నాన్కు' శబ్ద 'న' కారము 'ల' కారమగును. ఉదా:—నాన్కు.+ఆయిరమ్=నాలాయిరమ్. (నాల్గువేలు). ఇట్లు 'నాన్కు' శబ్ద ప్రాచీనత తొల్కాప్పియరుచేత సూత్రింపఁబడినది.

లకార ప్రాచీనతకు 'ఇంటి' శబ్దమును దొరగా రుదాహరించుటయు సరికాదు. 'ఇంటి' శబ్దములోనిది బిందుపూర్వక టి వర్ణమే కాని నకార పూర్వకము కాదు. ఇట్టి బిందుపూర్వక 'టి' వర్ణము లాంత శబ్దములందేకాక వివిధ స్థలములందును వచ్చును. ఉదా:—అన్ని—అన్నింటిన్. ఎనిమిది—ఎనిమిదింటిన్. తొమ్మిది—తొమ్మిదింటిన్. పది. పదింటిన్. రెండు-రెండింటిన్. వేయి-వేయింటిన్. మొ.

౨౮. I విష:—"ద్రావిడ భాషలలోఁ బరుషములకు సారళ్యము నొందవించుటకయి యుచ్చారణ సౌకర్యార్థముగాఁ బరుషములకుఁ బూర్వము తత్తద్వర్గపంచమాక్షర మాగమ మగుచుండును. 'ఙ-ఞ-ణ-న' అనెడి యనునాసికములు మకారవికారములేయని హిందూ వైయాకరుణులు చెప్పుదురు. 'మ' కారమున కట్టి 'ఙ'కారాద్యాకారము దానికిఁ బరమందున్న వర్గాక్షరమునుబట్టి కల్గును. అనఁగా నట్లు వచ్చిన మకారమె పరస్థిత వర్గాక్షర సవర్ణానునాసికముగ మాఱునని తాత్పర్యము. సంస్కృతమందువలెనె తమిళమునందును నట్టి వర్గ పంచమములె వ్రాయఁబడును. ఆంధ్ర కన్నడములలో నట్టి వర్గ పంచమములచోట ననుస్వారమును వ్రాయుచుందురు. కాని సంస్కృతమందువలెనె యచట వర్గపంచమములె వినఁబడుచుండును." (కాల్డు. ౧౬౭-పుట).

విమర్శము:—ద్రావిడ భాషలలోని యట్టి యనునాసికముగాని తన్మూలకపర పరుషద్విత్వముగాని యుచ్చారణ సౌకర్యార్థముగఁ దెచ్చికొన్నది కాదు. అది శబ్దసిద్ధము. అట్టి శబ్దసిద్ధానునాసికమె భాషా స్వభావమునుబట్టి తఱుచుగాఁ బరస్థ పరుషద్విత్వరూపమునఁ బరిణమించును. కొన్ని ద్రావిడ భాషలలో సరళోచ్చారణము విస్తరించిన పిమ్మటఁ బరస్థపరుషమునకు ద్విత్వము కల్గుటకు మాఱుగ నట్టి పరుషమునకు సారళ్యము గల్గియుండును. అట్టియను

నాసికమె తెల్గున ద్రుతమని వ్యవహరింపఁబడుచున్నది. అట్టి శబ్ద సిద్ధద్రుతమును స్వరసంహితలో నుచ్చారణ సౌకర్యార్థముగ వచ్చు యకార వకారముల వంటిదానినిగ దొరగారు తఱచుగా వ్రాయుచుండుట పరిశీలనరాహిత్యకృతము. (చూడు. కాల్డు. ౧౭౫ పుట).

తమిళమునఁ దొల్కాప్పియరువఱకు సరళోచ్చారణమే లేదు గదా. "పరుషములకు సారళ్యము నొదవించుటకయి యనునాసిక మాగమమగుచుండు" ననెడి దొరగారి యాశయమెట్లు పొసంగును? (చూడు. ౧౭ XXII, XXIII, XXIV విమ). మీఁదు మిక్కిలిగఁ బరమందు సహజముగ సరళములె యున్నట్లును నట్టి సరళములు ద్విత్వమునందునపుడు పరుషములుగా మాఱుచుండునట్లును కాల్డువెల్లుగారు యథార్థ స్థితికి విరుద్ధముగా వ్రాయుచుందురు. వీరి యిట్టి ప్రమాదముల కెల్లఁ దమిళమున సరళములు సహజముగా ననాదిగ నున్నవనెడి వీరి యపసిద్ధాంతమె మూలమగుచున్నది. (చూడు. ౧౭ XXII విమ. మొ. XXIV-వ విమ).

విమర్శము: ౨౮. II విమ:—'జ-ఞ-ణ-న' లకు మకారము మూలమని హిందూ వైయాకరణులు చెప్పుదురనుట (చూ. ౨౮ I విమ.) ప్రాచీన ప్రామాణిక సిద్ధాంత సమ్మతముకాదు. "నకార జా వనుస్వార। పఞ్చమా ఝలి ధాతుషు । నకారజ శ్శకారశ్చ । షా ట్టవర్గ స్తవర్గజః" (కవికల్పద్రుమము ౧౩ పుట) అను ప్రాచీన సంస్కృత వైయాకరణ సిద్ధాంతమును "వోపదేవుఁ" డుదాహరించియున్నాఁడు. దీనినిబట్టి జకారా దీతరానునాసికములకును ననుస్వారమునకును నకారమె మూలమని ప్రాచీన సంస్కృత (హిందూ) వైయాకరణుల సిద్ధాంత మనుటకు సందేహము లేదుగదా.

౨౮. III విమ—విమర్శము:— అనునాసికములలోఁ బ్రాచీనతమమగు 'న' కారమె ద్రుతమని పండితాగ్రేసరుఁడగు నన్నయ వచించెను. తొల్కాప్పియమును బట్టి చూచినను నకారమె ప్రాచీనతమమని విశదమగుచున్నది. "మకరత్తొడర్ మొఴి......" (తొల్కా. ౮౨ సూ.)="త్ర్యాదివర్ణ యుతా మహాచ్ఛబ్దముల తుదినున్న నకారముచోట మకారమును నిలుపని శబ్దములు తొమ్మిది మాత్రమె కలవందురు" అని సూత్రార్థము. ఆ తొమ్మిదియు 'ఉగిన్-సెగిన్-విఴన్ (నిష్ప్రయోజనమగు చెత్త, దీనినిపుడు 'విఴల్' అందురు) పయిన్ (లక్క) అఴన్ (పీనుఁగు) పుఴన్-కుయిన్ (మేఘము) కడాన్-వయాన్', 'అనునవి' అని వ్యాఖ్య. దీనినిబట్టి ప్రాచీన కాలమున 'అవన్' మున్నగు మహాచ్ఛబ్దముల తోపాటుగ 'నిలన్' మున్నగు నమహాచ్ఛబ్దములతుదిని సైతము

మూర్ధన్య నకారమె యుండెడిదనియుఁ గాలక్రమమునఁ బ్రథమ సంఘమువారు మహా దమహాత్తుల భేదము విశదపడుటకయి మహాత్తుల తుదినున్న నకారమును నిల్పి యమహాత్తుల తుదినున్న నకారము చోట మకారమును నిల్పిరని తోఁచుచున్నది. కావున నేఁడు మకారాంతములయియున్న తమిళ శబ్దములగు—నిలమ్ - మరమ్-కుళమ్—మున్నగువాని తుదిని—'నిలన్ - మరన్ - కుళన్' అను రీతిని నకారమె యుండెడిదని యెన్నదగును. ఇట్లగుటచేతనే యిట్టి తమిళ శబ్దములకు సరియగు తెల్గు శబ్దములు కొన్ని మ్రాను-కొలను మున్నగు రీతిని నకారాంతములయి యున్నవి. మఱియుఁ దమిళమున మాంతములగు మహా దమహాత్తులు మున్నగు పెక్కు శబ్దములు తెల్గులోని ద్రుత ప్రకృతికములవలె ద్రుతకార్యముల నొదవించుచున్నవని యిట నిరూపింపఁబడును (చూడు. ౨౪ IV మొ. ౨౪ VIII వ. ౨౫-౨౬ I, II, III విష).

"పయి తొల్కాప్పియపు సూత్రా (౧౨ సూ.) ర్థమును సరిగఁ బరిశీలింపక నన్నూలుకర్త నామాంతగత నమలలో మకారమె ప్రాచీన తరమనియు నట్టి మకారమునకె నకారము వచ్చినదనియు సూత్రించెను. దీనినిబట్టి నేఁటి తమిళ పండితులు కొందఱు 'నిలమ్-నిలన్' అను ద్వివిధరూపములను సంగీకరించుచుందురు" (విద్వాన్. శ్రీ వే. వేంకటరాజులు రెడ్డిగారు).

తెలుఁగులోని 'కొలను-మ్రాను' మున్నగు శబ్దములతుది నకారము వలెనె తమిళమందలి "కుళమ్-మరమ్" మున్నగు శబ్దములతుది మకారము సైతము శబ్దావయవమె కాని యది యుచ్చారణార్థముగఁ జేరిన యాగమ విశేషముకాదు.

విమర్శము ౨౪. IV విష:—తెల్గునందలి ద్రుతము (నకారపుపొల్లు) వలెనె తమిళమందలి శబ్దాంతిమ 'మ'కారము ద్రుతకార్యము లనఁదగు పరపరుష ద్విత్వాదికము నొదవించుచున్నది. తెల్గునందు సముచ్చయార్థకమగు 'ఉన్' శబ్దము వెలయుచుండఁగాఁ దమిళమునందట్టి యర్థమే కలదై 'ఉమ్' శబ్దము ప్రసిద్ధమైయున్నది. 'వచ్చున్ పోవున్' అను తద్ధర్మార్థక క్రియలందుఁ దెల్గున 'న' కారముండఁగా నఱవమున "వరుమ్—పోగుమ్" అని మకారము వెలయుచున్నది. ఇట్లే పెక్కువిధములచేతఁ దమిళ శబ్దాంతిమ 'మ' కారము తెల్గునందలి ద్రుతమువంటి దనఁదగును. తెలుఁగున ద్రుతము మీఁది క చ ట త ప లు గ జ డ ద బ లగుచుండఁగా నా ద్రుతము బిందువగును. వర్గపంచమము కానేరదు. వర్గపంచమాదేశ ముచ్చారణ స్వభావసిద్ధమై తమ కాలమున నుండమింజేసి యద్దాని నాంధ్రమహాకవు లంగీకరింపరైరి. "ఆంధ్ర కన్నడములలో నట్టి వర్గపంచమ స్థానమున ననుస్వారమును వ్రాయుచుందురు.

కాని సంస్కృతమందు వలెనె యచట వర్గపంచమములె వినఁబడుచుండును." అను కాల్డువెల్లుగారి (కాల్డు. ౧౬౭ పుట.) వ్రాఁత సత్యము కాదు. ఙ ఞ లచ్చాంధ్ర వర్ణసమామ్నాయమున లేనేలేవు. ఉచ్చారణమున వాని స్థితి యాంధ్రమున లేదనుట కంతకన్న వేఱు నిదర్శన మక్కఱలేదుగదా. ద్రుత మునకు 'ట-ప'లు పరమగునపుడు సరళాదేశమున 'డ-బ'లు వానిచో నిల్చినను నచటి ద్రుతము చోటఁ బాక్షికముగాఁ దెల్గున బిందువు నిల్చునుగాని 'ణ-మ'లు నిల్వవు. ప్రాచీనకాలమున వర్గాక్షర పరకత్వమున బిందువుచోటఁ దత్తద్వర్గ పంచమోచ్చారణమె తెల్గున నున్నచో ద్రుతమునకట్టి వర్ణము లాదే శింపఁబడకుండునా? పయి సందర్భమునుబట్టి తెలుఁగునఁ బ్రాచీన శాసనములందలి వర్గాక్షర పరక బిందుస్థాన వర్గపంచమ లేఖనము కొన్నియెడల నుండుట యప్ప టికిఁ బ్రసిద్ధమయి యున్న సంస్కృత పద్ధతి వాసనచే సంభవించినదే కాని యాంధ్రమునకు సహజమగుటచేఁ గల్గినది కాదని నిశ్చయింపనగును. దేశభేదము చేతను గాలభేదముచేతను నుచ్చారణ భేదములు రుచించుట సహజమే కదా.

౨౫. I విష:—ఇంకఁ దొల్కాప్పియమునాఁటి పరుష పరకానునాసికో చ్చారణస్థితి పరిశీలింపఁబడుచున్నది. ప్రాచీన తమిఴమున సరళములె లేవు. తమిఴమున ననుస్వారమును లేదు. తమిఴ ద్రుత మనఁదగు 'మ' కారమునకుఁ బరుషపరకత్వమునఁ బరపరుష సవర్ణానునాసి కాదేశము స్వాభావికముగఁ గల్గుచుండెను. తొల్కాప్పియమునాఁటి కట్టి స్వానునాసికపూర్వక పరుషస్థితియె వెలసి యుండెను. (౧౭ XXIII విష. చూడు). తొల్కాప్పియమునాఁటికి సరళో చ్చారణము తమిఴమున లేదు (౧౭ XXII విష. చూ). కావున నుచ్చారణ సౌకర్యాపేక్షచే నచటి సంయోగములోని యనునాసికమునందలి యానునాసి క్యము లోపించి దానియందలి కంఠ్యతాది ధర్మము నిల్వఁగా నట్టి యనునాసి కము పరస్థ పరుషరూపము నందుచుండెడిది. అనఁగా నట్టి పరుషపరక స్వవర్గీ యానునాసిక సంయోగము పరపరుషద్విత్వముగఁ దమిఴమునఁ బరిణమించెనని గ్రహింపవలెను. తెల్గునందన్నో యట్టి స్వానునాసిక పరుషసంయోగములోని యనునాసిక ముచ్చారణ సౌకర్యాపేక్షచే బిందువగుచుండఁగా నద్దానియందలి నాదిత తాఁకునఁ బరపరుషము సరళముగాఁ బరిణమింప సాగెను. తమిఴ మందును బరపరుషద్విత్వము గల్గిన స్థలములు పోఁగా సరళోచ్చారణము గల్గిన నాఁటికి మిగిలియున్న స్వానునాసిక పరుషసంయోగములు నియతముగా స్వానునాసిక పూర్వక సరళ సంయోగము లయ్యెను. అనునాసిక సంపర్కము లేని పదమధ్య పరుషములు సయితము కొన్ని తమిఴమున నుచ్చారణ సౌకర్యము మూలముననే సరళోచ్చారణము గలవయ్యెను. ఇతర ద్రావిడభాషలందును

నట్టి సరళోచ్చారణము విస్తరించెను. తమిళుల కనుస్వారోచ్చారణ వాసనయే లేమింజేసి సరళ పరకత్వమందు సయిత మనునాసికము బిందువుగాఁ బరిణమింప దయ్యెను. స్వానునాసికపూర్వక సరళ వర్ణోచ్చారణము సైతము శ్రమాపాద కము కామింజేసి యచట బిందుపరిణామము గల్గవలసిన ప్రసక్తి లేదయ్యెను. ఇట్లీ రెండువిధములగు నుచ్చారణములును సౌకర్యాపేక్షా కృతములయి తెల్గున నొకవిధమును నఱవమున నింకొకవిధమును నెలకొనినవని యూహింప నగును. కావునఁ బయిరీతిగల ద్వివిధోచ్చారణములును సహజములును ద్రుతరూపానునాసిక నకార మకార కృతములును నయి వెలసినవనఁదగును. ఈ విషయ మీవఱకె యొకరీతిది యుదాహరింపఁబడెను. (చూడు. ౧౭ XIX విష). వానిలోని కొన్ని యుదాహృతు లిచటఁ జూపఁబడుచున్నవి.

| నేఁటి తెల్గు | ప్రాచీనపుఁదెల్గు | కన్నడము | తమిళము | వివరణము |
|---|---|---|---|---|
| ఈఁటె | ఈంటె | ఈటి | ఈట్టి | కన్నడమునఁ దేలిన బిందు వనఁగా ఖండ బిందువు పరిశీలింపఁ బడలేదు. |
| కోఁట | కోంట | కోంటె | కోట్టై | |
| తోఁట | తోంట | తోంట | తోట్టమ్ | |
| నూఁకు | నూంకు | నూంకు | నూకు | |
| వేఁట | వేంట | బేంటె | వేట్టై | |
| వేఁపచెట్టు | వేంపచెట్టు | వేవినమరం | వేప్పమరమ్ | |
| దోఁటి | దోంటి | దోంటి | తోట్టి | |
| పొరఁటు | పొరంటు | పొరంటు | పురట్టు | |
| పోఁక | పోంక | ... | పాకు | |

పయిరీతిని ద్రుతసంధి యనుచు వచింపకున్నను గజడదబా దేశసంధి పర్యాయమె యనఁదగు పరుషపరక మకారసంధిని బరుషపరకాజంత హాలంత సంధులను దొల్కాప్పియరు సువిస్తరముగా సూత్రించిరి. (చూ. తొల్కా. ౩౧౧ మొ. ౩౩౨ సూ. వఱకు మకారసంధి. ౨౦౪ సూ. మొ. ౨౯౬ సూ. వ. అజంతసంధి. ౨౯౭ సూ. మొ. ౪౦౬ సూ. వ. హల్‌సంధి. ౪౦౭ సూ. మొ. ౪౩౦ సూ. వ. పొట్టి 'ఉ' కారపు సంధి. ఈ సంధులు గ-జ-డ-ద-బా దేశ సంధి కవతారములె యని విశదపఱచుటకయి యిట దిఙ్మాత్రముగా వాని నుదాహరించెదను.

మకారసంధి:—"మకారవిఱుది......" (తొల్కా. ౩౧౧ సూ.)=మకారాంత శబ్దములకు "క-చ-త-ప" లు. (తమిళపదాదిని 'ట' కార ముండదు గాన నిల్లె యంతటను నది పేర్కొనఁబడదు) పరమగునపుడు విభక్తిసమాససంధిలో నచటి 'మ' కారము లోపించును. పరస్థపరుషము ద్విరుక్త మగును. ఉదా:—మరమ్+కోడు=మరక్కోడు (చెట్టుయొక్క కొమ్మ).

"మెల్లెఱుత్తు......" (తొల్కా. ౩౧౩ సూ.)=మకారాంత శబ్దములకు 'క-చ-త-ప'లు పరమగునపుడు విభక్తి సమాస సంధిలో నచటి మకారమునకుఁ బరస్థవర్గీయ సవర్ణానునాసికాదేశము వైకల్పికముగ నగును. ఉదా:—కుళమ్+కరై=కుళఙ్కరై—కుళక్కరై (కొలనిగట్టు).

"ఇల్లమ్......" (తొల్కా. ౩౧౪ సూ.)='ఇల్లమ్' శబ్దమకారమునకు నిత్యముగాఁ బరపరుష సవర్ణాను నాసి కాదేశమగును. ఉదా:—ఇల్లమ్+కోడు=ఇల్లఙ్కోడు (ఇల్ల మ్మను చెట్టుయొక్క కొమ్మ).

"అల్వఴి యెల్లామ్......" (తొల్కా. ౩౧౫ సూ.)=విభక్తి సమాసేతర సంధియం దనఁగా వ్యస్తసంధియం దంతటను శబ్దము తుది మకారమునకు 'క-చ-త-ప'లు పరమగునపు డచటి మకారమునకుఁ దత్తద్వర్గీ యానునాసికాదేశము నిత్యముగా నగును. ఉదా:—మరమ్+కుఱిదు=మరఙ్కుఱిదు. (చెట్టు పొట్టిది) అంతటను ననుటచేతఁ బరుషేత రానునాసిక పరకత్వమున మకారము లోపించును. ఉదా:—మరమ్ + నీణ్డదు = మరనీణ్డదు (చెట్టు నిడుపైనది). ఇదియుఁ దెలుంగునందలి స్థిరపరక ద్రుత లోపరూప సంధికార్యము ను బోలి యున్న దనఁదగును.

"క-చ-త-ప-ముదలియ......" (తొల్కా. ౧౪౪ సూ.)=అచ్చునకుఁ గాని హల్లునకుఁగాని క-చ-త-ప-లు పరమగునపుడు వాని నడుమనుండు ననునాసికము తత్తద్వర్గీ యానునాసికముగా మాఱును. ఉదా:—విళ+మ్+కోడు=విళఙ్కోడు. (వెలగచెట్టుయొక్క-కొమ్మ). మరమ్+కుఱిదు=మరఙ్కుఱిదు. (చెట్టు పొట్టిది). (చూ. ౨౮-౨ సూ.) (౨౧౮ సూత్రము చొప్పున ననునాసికాగమము వచ్చును). ౩౧౩-౩౧౪-౩౧౫ సూత్రములందును నేతత్సూత్ర నియమముచేతనే యనునాసికములు పరపరుష సవర్ణానునాసికము లయ్యెనని యెఱుంగునది.

౨౫. II విష:—మకారస్థలములందువలె సార్వత్రికము కాకున్నను 'న్-న్' అనునవిస్సైతము కొన్నియెడలఁ బరపరుషద్విత్వము నొదవించుట యనునాసికాదేశము నందుట యను ద్రుతకార్యములను గలిగించుచున్నవి. తమిళ

పదాంతిమ నకారము సాధారణముగా మూర్ధన్యమె యగుచుండును. "వెరిన్ (వెన్ను-వీపు) పొరున్ (అనుకారము; వీటివానిపని)" అను రెండుశబ్దములు మాత్రమే దంత్య నకారయుక్తములు. "ఉచ్చకార మొడు......" (తొల్కా. ౮౯ సూ.)=దంత్య నకారము తుదినిగల శబ్దములు తమిళమున రెండుమాత్రమె కలవు.

"వెరినెన్ ఇఱుది......" (తొల్కా. ౩౦౧ సూ.) వెరిన్ శబ్దమునకుఁ బరుషపరకత్వమున 'న' కారము లోపించును. దానిచోటఁ బరపరుష వర్గీయానునాసికము నిల్చును. ఉదా:—వెరిన్+పుఱమ్=వెరిమ్పుఱమ్ (వీఁపు ప్రక్క).

"ఆవయిన్......" (తొల్కా. ౩౦౨ సూ.) పయి స్థలమందుఁ బరుషములకు ద్విత్వము కల్గుటయుఁ గలదు. ఉదా:—వెరిన్+పుఱమ్=వెరిప్పుఱమ్ (వీఁపుప్రక్క), 'పొరున్' శబ్దమునకు 'ఉ-అ' అను నాగమములు వచ్చును గాన నపుడజంతములకువలెఁ బరుష ద్విత్వము కల్గును. "నకర విఱుది యుమ్......" (తొల్కా. ౨౯౯ సూ.)=నకారాంత శబ్దములకును హల్లు పరమగునపుడు వ్యస్తసంధిలో వాని నడుమ 'ఉ' కారము నిల్చును. పరస్థ పరుషములు ద్విరుక్తములగును. ఉదా:—పొరున్+కడిదు=పొరునుక్కడిదు (వీటి వానిపని కఠినమైనది). పొరున్+మాణ్డదు=పొరును మాణ్డదు (వీటి వానికృత్యము ప్రశంసార్హము). "వేఱ్ఱుమైక్కు......" (తొల్కా. ౩౦౦ సూ.)= సమాససంధియందు నకారాంత శబ్దములకు హల్లు పరమగునపుడు వాని నడుమ 'అ' కారము నిల్చును. పరస్థపరుషములు ద్విరుక్తములగును. ఉదా:— పొరున్+కడుమై=పొరునక్కడుమై=(వీటివాని పనియొక్క మోటుతనము). పొరున్+మాఢ్చి=పొరున మాఢ్చి (వీటి వానిపనియొక్క శ్లాఘ).

౨౫. III విష:—మూర్ధన్య ణకారాంతమునకుఁ బరుష పరకత్వమున ఱకారాదేశమె తఱచుగానగును. కాని కొన్ని యెడలఁ బయిరీతిని ద్రుత కార్యములును గన్పట్టుచున్నవి. తమిళమున నిపు డమహా ప్రాణాంతమునఁ గన్పట్టుచున్న త్ర్యాద్యక్షరక శబ్దములందలి మకారములెల్ల మూర్ధన్య ణకార మూలకములెయనెడి తొల్కాప్పియ సూత్రము నీవఱకు సోదాహరణముగాఁ జూపియున్నాను (చూ. ౨౮ III విష). అట్లు మకారముగా నేర్పడని పదాంతస్థ ణకారములకుఁ బరమగు పరుషములకు ద్విత్వాదిరూప ద్రుతకార్యములు సాధారణముగాఁ గల్గనేరవు.

"ఉయరీఱాగియ ఉయర్తిణై......" (తొల్కా. ౧౫౮ సూ.)= మహత్తులలో నజంతములకుఁ గాని హలంతములకుఁగాని క-చ-త-ప-లు పరమగు

నపుడు వానికి ద్విత్వాదులగు మార్పులేవియుఁ గల్గవు. ఉదా:—అవన్+కుటి యన్=అవన్‌కుటియన్=(వాఁడు పొట్టివాఁడు) మొ.

"అప్పెయర్......" (తొల్కా. ౩౫౧ సూ.)=పితృ సంజ్ఞానామ నకారాంతములకుఁ బుత్ర సంజ్ఞానామము పరమగునపుడు పూర్వ పదాంతగత మగు 'అన్' అనునది లోపించి యచట 'అమ్' అనునది నిల్చును. ఇట్టి మహ త్తుల తుది నకారముచోట నయితము ద్రుతకార్యరూప 'మ'కారసంధి జరుగు నని తాత్పర్యము. ఉదా:—చాత్తన్+కొట్రన్=చాత్తఙ్కొట్రన్ (చాత్తననువాని పుత్రుఁడగు కొట్రనను వాఁడు).

మకారముగా నేర్పడక నిల్చిన మూర్ధన్య నకారాంత శబ్దము తుది నకారము చోట నయితము పరపరుషద్విత్వరూప ద్రుతకార్యము కల్గుట గలదు.

"అటనేన్......" (తొల్కా. ౩౫౫ సూ.) 'అటన్' అను శబ్దమునకుఁ (చూడు. తొల్కా. ౧౨ సూ. ౨౪ III విష.) బరుషపరకత్వమున సమాస సంధిలో నచటి నకారము లోపించి పరపరుషద్విత్వము గల్గును. ఉదా:— అటన్+పానై=అటప్పానై (పీనుఁగును సంబంధించిన కుండ).

తొల్కాప్పియములోని ౧౨ సూత్రము (౨౪ III విష.) వర్తింపని (త్ర్యాద్యక్షరవంతము కామింజేసి నకారాంతముగానె నిల్చిన యమహాచ్ఛబ్దము) 'తేన్' శబ్దపు నకారమునకు సమాససంధిలోఁ బరపరుషద్విత్వాదిరూప ద్రుత కార్యములు గల్గుట గలదు.

"తేన్ఎన్‌కిళవి......" (తొల్కా. ౩౪౧ సూ.) తేన్ శబ్ద నకారము నకు సమాససంధిలోఁ బరుషపరకత్వమున నకారలోప పరపరుషద్విత్వములు వైకల్పికముగఁ గల్గును. ఉదా:—తేన్+కుడమ్ = తేక్కుడమ్ - తేన్‌కుడమ్= (తేనెకుండ).

"మెల్లెఱుత్తు......" (తొల్కా. ౩౪౨ సూ.) పై సందర్భమున నను నాసికాగమమును వచ్చును. ఉదా:—తేన్+కుడమ్=తేఙ్కుడమ్=(తేనెకుండ).

"మెల్లెఱుత్తియెయిన్......" (తొల్కా. ౩౪౩ సూ.)=తేన్‌శబ్ద నకార మునకు సమాససంధిలో ననునాసిక పరకత్వమున నకారలోపము వైకల్పిక ముగా నగును. ఉదా:—తేన్+నుని=తేనుని-తేన్నుని (తేనెపట్టు తుదిభాగము). (స్థిరపరక ద్రుతలోపము తెల్గునఁ బ్రసిద్ధమెకదా).

౨౫. IV విష:—పయిరీతిని దమిళ పదాంతగత మకార నకారములు ద్రుతకార్యము లనఁదగు పరపరుషద్విత్వాదికమును గల్గించుటయేకాక యజంత

ములుగా నున్న తమిళశబ్దజాలమును, గొన్ని హలంత శబ్దములును సట్టి ద్రుత కార్యాపరావతారములగు పరపరుషద్విత్వమును, బరపరుష సవర్ణానునాసికా గమమును నొదవించుట వింతగా నున్నది. అట్టి యజంతములకుఁ బరముగా సమాససంధులలో సంబంధాద్యర్థకముగాఁ దచ్ఛబ్దార్థకమగు 'అమ్=అన్' శబ్ద మకార మాగమముగా నిల్చుటచేత నట్టి సంధికార్యములు సంభవించెనని యూహింపనగును. అజంతముల వ్యస్తసంధులలో సైత మట్టి పరపరుష ద్విత్వాది ద్రుతకార్యములు గల్గుట నరయఁగా నట్టి యజంతములెల్లఁ దొల్కా ప్పియమునకుఁ బూర్వకాలమునఁ జిరకాలము క్రిందట మకారాంతములుగాఁ గాని నకారాంతములుగాఁ గాని యుండెడివనియుఁ దెల్గునందలి చరిత్రాదులు 'ము' వర్ణకలోపము నందినట్లె యవియుఁ దుదినున్న యనునాసికమునకు లోపము నంది యుండెననియు నక్కారణమునం జేసి తొల్కాప్పియ రట్టి శబ్దముల సంధు లలో ననునాసికాగమమును బరపరుషద్విత్వమును సూత్రింపసాగిరనియు నూహింపనగును. ఇట్టి ప్రథమైక వచనలోప పద్ధతి కర్ణాటమునఁ బ్రసిద్ధమై యున్నది. ప్రాచీన కర్ణాటమున మకారమె ప్రథమైకవచన ప్రత్యయమనియు నది 'అ' కారాంతేతరములపైని లోపించుననియు నీ క్రింది రీతిని జెప్పఁబడెను.

"తాస్తు మ మిం కె అ ద దొళ్." (కర్ణా. భూ. ౩౯ సూ.)=ఆ విభక్తులు. "మ్-(ప్రథమావిభక్తి). అమ్-(ద్వితీ). ఇమ్-(తృతీ). కె-(చతు). అత్ (అత్తణిం)-(పంచ). అద్ (అ)-(షష్ఠి). ఒళ్-(సప్త)". అనునవి.

"అతోనుస్వారః ప్రథమైకవచనస్య" (కర్ణా. భూ. ౪౫ సూ.)=అకా రాంత ప్రాతిపదికమునకంటెఁ బరమైన ప్రథమైకవచన మకారమున కనుస్వారా దేశమగును. ఉదా:—నెలమ్=నెలం. (నేల-తెల్గు). వేలమ్=వేలం (వెలగ చెట్టు) మొ.

"అన్యస్మా ల్లోపః" (కర్ణా. భూ. ౪౬ సూ.) అకారాంతేతర ప్రాతిపదిక మునకుఁ బరమగు ప్రథమైకవచన 'మ'కారము లోపించును. ఉదా:—బిది (విధి)-సిసు (శిశువు)-హరి-కరి-మొ. తెల్గున నట్టి మకారము నిల్చుటగాని దాని లోపముగాని విధింపఁబడలేదు. అనేకములగు నజంత స్త్రీసమప్రాతి పదికము లంగీకరింపఁబడినవి. ఉదా:—నేల-వెలగ-తల్లి-తండ్రి-వదినె-మొ. స్త్రీసమమనఁగాఁ బ్రథమైకవచన లోపాదికము కలదేకదా.

తమిళమునందును ననేకములగు నజంతప్రాతిపదికము లంగీకరింపఁ బడెను. అవె ప్రథమైక వచనాంతములుగను నంగీకరింపఁబడెను. "అవైతామ్ పెయర్......" (తొల్కా. ౫౪౭ సూ.) ఆ విభక్తులు—"ప్రథమ=నామమె =ప్రాతిపదికమె" "ఐ (ద్వితీ) ఒడు (తృతీ) కు (చతు) ఇన్ (పంచ) అదు

(షష్ఠి) కణ్ (సప్త) సంబోధనము" అనునవి. అట్టి యజంత ప్రాతిపదికములు స్త్రీసమములవంటివె.

అట్టి అజంత శబ్దములకుఁ బరుషపరకత్వమున సంధులలో ననునాసికాగమము పరపరుషద్విత్వము నీ క్రింది రీతిని విధింపఁబడెను.

"అకర విఱుది ప్పెయర్ నిలై ......" (తొల్కా-. -౨౦౮ సూ.)=అకారాంత శబ్దములకుఁ బరముగా "క-చ-త-ప"లు నిల్చునపుడు వ్యస్తసంధియందుఁ బరుషములు ద్విరుక్తములగును. ఉదా:—విళ+కుఱిచు=విళక్కుఱిదు=(వెలగ చెట్టు పొట్టిది).

ఇట్లె తొల్కాప్పియమున VII ప్రకరణమందెల్లఁ (ఎఱుత్తధికారము) బరపరుషద్విత్వాది ద్రుతకార్యములు విధింపఁబడెను.

"విసైయెచ్చకిళవియుమ్" (తొల్కా-. -౨౦౫ సూ.)=అకారాంతములైన యసమాపక క్రియలకును, నుపమానవాచకములకును 'అ' అనెడి నిర్దేశక సర్వనామమునకును 'ఆజ్క' అనెడి పాదపూరణ శబ్దమునకును 'క-చ-త-ప' లు పరమగునపు డవి ద్విరుక్తములగును. ఉదా:—ఉణ్ణచ్చెన్ఱాన్=భుజింపఁ జనెను. (ఉణ్ణ+చెన్ఱాన్) కొళ్ళైనకొండ్డాన్=(కొళ్ళైన+కొణ్డాన్)=(కొను మనఁగాఁ గొనెను) పులిపోలప్పాయిన్దాన్=(పులిపోల+పాయిన్దాన్)=(పులివలె మీఁదఁ బడెను) అ+చాత్తన్=అచ్చాత్తన్=(ఆ చాత్త సనువాఁడు).

పయివానిలోని యసమాపకక్రియ తెనుఁగులోని నుజ్యంత ద్రుత ప్రకృతిమునకు సరియగునది. నిర్దేశక సర్వనామములనెడి త్రికము మీఁది హల్లు ద్విరుక్తమగుట (అ+మగువ=అమ్మగువ) తెల్గున సుప్రసిద్ధమె. పయి రీతిని 'అకారాంత వ్యస్తసంధులను మఱికొన్నిటిని సూత్రించి 'అకారాంత సమాససంధుల నీ క్రింది రీతిని దొల్కాప్పియరు సూత్రించిరి. "వేట్టు (ట్టు) మైక్కణ్ణుమ్......" (తొల్కా-. -౨౧౭ సూ.)=విభక్తిసమాససంధియందు 'అకారాంతములకుఁ బరమగు 'క-చ-త-ప' లు ద్విరుక్తములగును. ఉదా:—ఇరువిళ+చాత్తన్=ఇరువిళచ్చాత్తన్=(ఇరువిళ గ్రామముయొక్క చాత్తసనువాఁడు).

"మర ప్పెయర్ క్కిళవి......" (తొల్కా-. -౨౧౭ సూ.)=అకారాంత వృక్షవాచక శబ్దములకు 'క-చ-త-ప' లు పరమగునపుడు విభక్తిసమాససంధిలో ననునాసికాగమ మగును. ౧౮౭౮ సూత్రము చొప్పునఁ (చూ. తొల్కా-. -౨౭౩ సూ.) దత్తద్వర్గీయానునాసికాదేశము. విళ+కోడు=విళఙ్కోడు=(వెలగకొమ్మ). "అవఱ్ఱుళ్......" (తొల్కా-. ౧౫౭ సూ.) విభక్తిసమాససంధి లోని పూర్వావయవ ప్రాతిపదికము తత్తద్విభక్తితోనున్నట్లె యర్థము నిచ్చును.

సమాసవిభక్తి లోపించినను నట్టి యవిభక్తిక ప్రాతిపదిక మాలోపించిన విభక్త్యర్థమునే నొసంగునని తాత్పర్యము. నిలత్తై+కడన్దాన్=నిలమ్‌కడన్దాన్= నిలజ్కడన్‌దాన్=(నేలను గడచెను.) ఇచట 'నిలమ్' అను ప్రాతిపదికము తుది మకారము ౧౮౮ సూత్రము చొప్పున జకారమయ్యెను.

"మెల్లెఴుత్తు మిగువలి......" (తొల్కా. ౧౫౮ సూ.) ద్వితీయాతత్పురుష సమాససంధిలోని శాస్త్రవిధులు బహుళముగ నగును.

(౧) సమాసములో వచ్చు ననునాసికాగమమునకు మాఱుగాఁ బరస్థ పరుషములకుఁ గొన్నియెడల ద్విత్వమగును. ఉదా:—విళక్కుత్తైక్కాన్=(వెలగ మ్రానిని నఱికెను).

(౨) అట్లు పరుషములకు ద్విత్వము రావలసినచోట దానికి మాఱుగాఁ గొన్నియెడలఁ దత్తద్వర్గీయానునాసికము నగును. ఉదా:—మరజ్కుత్తైత్తాన్= (మ్రానిని నఱికెను).

(3) ఏ మార్పును రాదని ముందుఁ జెప్పిన చోట సైతము పరుషములకు ద్విత్వ మగును. ఉదా:—తాయ్ క్కొలై=తల్లిని జంపుట. మొ......

పయిరీతిని 'అ'కారాంతములకు వలెనె "ఆ-ఇ-ఈ-ఉ-ఊ" మున్నగు నచ్చులు తుదినిగల తమిళ శబ్దములకుఁ దొల్కాప్పియము VII ప్రకరణమున ద్రుతకార్యాపరావతారములగు ననునాసికాగమ పరపరుషద్విత్వము లుపదేశింపఁబడెను.

"ఇకర విఱుది......" (తొల్కా. ౨౩౬ సూ.) ఇకారాంత నామములకుఁ బరమగు పరుషములు విభక్తి సమాససంధిలో ద్విరుక్తములగును. ఉదా:—కిళి+కాల్=కిళిక్కాల్=(చిలుకయొక్క కాలు).

"ఉకార విఱుది......" (తొల్కా. ౨౫౫ సూ.)=ఉకారాంతములకుఁ బరమగు పరుషములు వ్యస్తసంధిలో ద్విత్వము నందును. ఉదా:—కడు+కుఱిదు=కడుక్కుఱిదు=(కరక్కాయ పొట్టిది).

"వేట్రుమైక్కణ్ణుమ్......" (తొల్కా. ౨౬౦ సూ.) ఉకారాంతములకుఁ బరమగు పరుషములు విభక్తి సమాససంధిలో ద్విత్వము నందును. ఉదా:—కడు+కాయ్=కడుక్కాయ్=కరకయొక్క కాయ.

ఇట్లె పదము తుది స్వరములన్నిటి విషయమునను బరుష పరకత్వమందలి ద్రుతకార్యాపరావతారము లనఁదగు పరుష ద్విత్వాదికము విపులముగా సూత్రింపఁబడెను.

(షష్ఠి) కణ్ (సప్త) సంబోధనము" అనునవి. అట్టి యజంత ప్రాతిపదికములు స్త్రీసమములవంటివె.

అట్టి అజంత శబ్దములకుఁ బరుషపరకత్వమున సంధులలో ననునాసి కాగమము పరపరుషద్విత్వము నీ క్రింది రీతిని విధింపఁబడెను.

"అకర విఱుది ప్పెయర్ నిలై;....." (తొల్కా. ౨౦౮ సూ.)=అకా రాంత శబ్దములకుఁ బరముగా "క-చ-త-ప"లు నిల్చునపుడు వ్యస్తసంధియందుఁ బరుషములు ద్విరుక్తములగును. ఉదా:—విళ+కుఱిదు=విళక్కుఱిదు=(వెలగ చెట్టు పొట్టిది).

ఇట్లె తొల్కాప్పియమున VII ప్రకరణమందెల్లఁ (ఎలుత్తధికారము) బరపరుషద్విత్వాది ద్రుతకార్యములు విధింపఁబడెను.

"వినైయెఞ్చకిళవియుమ్" (తొల్కా. ౨౦౯ సూ.)=అకారాంతములైన యసమాపక క్రియలకును, నుపమానవాచకములకును 'అ' అనెడి నిర్దేశక సర్వనామమునకును 'అజ్కా' అనెడి పాదపూరణ శబ్దమునకును 'క-చ-త-ప' లు పరమగునపు డవి ద్విరుక్తములగును. ఉదా:—ఉణ్ణచ్చెన్ఱాన్=భుజింపఁ జనెను. (ఉణ్ణ+చెన్ఱాన్) కొళ్ళైనక్కొణ్డాన్=(కొళ్ళైన+కొణ్డాన్)=(కొను మనఁగాఁ గొనెను) పులిపోలప్పాయిన్దాన్=(పులిపోల+పాయిన్దాన్)=(పులివలె మీఁదఁ బడెను) అ+చాత్తన్=అచ్చాత్తన్=(ఆ చాత్త ననువాఁడు).

పయివానిలోని యసమాపకక్రియ తెనుఁగులోని నుజ్యంత ద్రుత ప్రకృతిమునకు సరియగునది. నిర్దేశక సర్వనామములనెడి త్రికము మీఁది హల్లు ద్విరుక్తమగుట (అ+మగువ=అమ్మగువ) తెల్గున సుప్రసిద్ధమె. పయి రీతిని 'అ'కారాంత వ్యస్తసంధులను మఱికొన్నిటిని సూత్రించి 'అ'కారాంత సమాససంధుల నీ క్రింది రీతిని దొల్కాప్పియరు సూత్రించిరి. "వేట్టు (ట్టు) మైక్కణ్ణుమ్....." (తొల్కా. ౨౧౭ సూ.)=విభక్తిసమాససంధియందు 'అ'కా రాంతములకుఁ బరమగు 'క-చ-త-ప' లు ద్విరుక్తములగును. ఉదా:—ఇరువిళ+ చాత్తన్=ఇరువిళచ్చాత్తన్=(ఇరువిళ గ్రామముయొక్క చాత్తనువాఁడు).

"మర ప్పెయర్ క్కిళవి....." (తొల్కా. ౨౧౭ సూ.)=అకారాంత వృక్షవాచక శబ్దములకు 'క-చ-త-ప' లు పరమగునపుడు విభక్తిసమాససంధిలో ననునాసికాగమ మగును. ౧౪౪ సూత్రము చొప్పునఁ (చూ. తొల్కా. ౨౨౩ సూ.) దత్తద్వర్గీయానునాసికాదేశము. విళ+కోడు=విళఙ్కోడు= (వెలగకొమ్మ). "అవఱ్ఱుళ్......" (తొల్కా. ౧౯౭ సూ.) విభక్తిసమాససంధి లోని పూర్వావయవ ప్రాతిపదికము తత్తద్విభక్తితోనున్నట్లె యర్థము నిచ్చును.

సమాసవిభక్తి లోపించినను నట్టి యవిభక్తిక ప్రాతిపదిక మాలోపించిన విభక్త్యర్థము నొసంగునని తాత్పర్యము. నిలత్తై+కడన్దాన్=నిలమ్‌కడన్దాన్=నిలజ్కడన్‌దాన్=(నేలను గడచెను.) ఇచట 'నిలమ్' అను ప్రాతిపదికము తుది మకారము ౧౪౪ సూత్రము చొప్పున జకారమయ్యెను.

"మెల్లెఱుత్తు మిగువటి......" (తొల్కా. ౧౫౮ సూ.) ద్వితీయాతత్పురుష సమాససంధిలోని శాస్త్రవిధులు బహుళముగ నగును.

(౧) సమాసములో వచ్చు ననునాసికాగమమునకు మాఱుగాఁ బరస్థ పరుషములకుఁ గొన్నియెడల ద్విత్వమగును. ఉదా:—విళక్కుత్తెత్తాన్=(వెలగ మ్రానిని నఱికెను).

(౨) అట్లు పరుషములకు ద్విత్వము రావలసినచోట దానికి మాఱుగాఁ గొన్నియెడలఁ దత్తద్వర్గీయానునాసికము నగును. ఉదా:—మరఙ్కుఱైత్తాన్=(మ్రానిని నఱికెను).

(3) ఏ మార్పును రాదని ముందుఁ జెప్పిన చోట సైతము పరుషములకు ద్విత్వ మగును. ఉదా:—తాయ్ క్కొలై=తల్లిని జంపుట. మొ......

పయిరీతిని 'అ'కారాంతములకు వలెనె "అ-ఇ-ఈ-ఉ-ఊ" మున్నగు నచ్చులు తుదినిగల తమిళ శబ్దములకుఁ దొల్కాప్పియము VII ప్రకరణమున ద్రుతకార్యాపరావతారములగు ననునాసికాగమ పరపరుషద్విత్వము లుపదేశింపఁబడెను.

"ఇకర విఱుది......" (తొల్కా. ౨౩౬ సూ.) ఇకారాంత నామములకుఁ బరమగు పరుషములు విభక్తి సమాససంధిలో ద్విరుక్తములగును. ఉదా:—కిళి+కాల్=కిళిక్కాల్=(చిలుకయొక్క కాలు).

"ఉకార విఱుది......" (తొల్కా. ౨౫౫ సూ.)=ఉకారాంతములకుఁ బరమగు పరుషములు వ్యస్తసంధిలో ద్విత్వము నందును. ఉదా:—కడు+కుఱిదు=కడుక్కుఱిదు=(కరక్కాయ పొట్టిది).

"వేఱ్ఱుమైక్కణ్ణుమ్......" (తొల్కా. ౨౬౦ సూ.) ఉకారాంతములకుఁ బరమగు పరుషములు విభక్తి సమాససంధిలో ద్విత్వము నందును. ఉదా:—కడు+కాయ్=కడుక్కాయ్=కరకయొక్క కాయ.

ఇట్లే పదము తుది స్వరములన్నిటి విషయమునను బరుష పరకత్వమందలి ద్రుతకార్యాపరావతారము లనఁదగు పరుష ద్విత్వాదికము విపులముగా సూత్రింపఁబడెను.

అ౫. V విమ:—తమిళమునందలి పదముల తుదినున్న ఉకారములలో నొకతెగ "కుట్రియల్ ఉకరమ్=(పొట్టి యుకారము)" అను సంప్రదాయము గలదు.

"ఈరెఱుత్తొరుమొళి.....;" (తొల్కా. ౪౦౭ సూ.)=పదము తుది నున్న పరుషముమీఁది 'ఉ' కారము కొన్నియెడల పొట్టి దనఁగా నర్ధమాత్రాక మగుచుండును. ఇది యాఱు విధములు.

I. ఏకదీర్ఘపూర్వక పరుషస్థము. ఉదా:—నాటు (డు)=(దేశము). యాఱు=(నది).

II. త్ర్యాద్యక్షరక శబ్దగత స్వరపూర్వక పరుషస్థము. ఉదా:—వరకు =(ఆరుగ). కూప్పాటు (డు). (కూఁత)-మొ.

స్వరపూర్వకముకాని పరుషములందు:—

III. ఆయ్దపూర్వక పరుషస్థము. ఉదా:—అ∴తు=(అది).

IV. పరుషపూర్వక పరుషస్థము. ఉదా:—కొక్కు=(కొంగ).

V. అనునాసిక పూర్వకపరుషస్థము. ఉదా:—కురఙ్కు=(క్రోఁతి). (ఈ విధియె యనునాసిక పూర్వక పరుషస్థితికి నిదర్శన మనఁదగును).

VI. అంతస్థపూర్వకపరుషస్థము. ఉదా:—పోఱ్ఱు=(ప్రొద్దు). "అవ ఱ్ఱుళ్......" (తొల్కా. ౪౦౮ సూ.) వ్యంజనత్రయ సంయోగములోని మొదటి యంతస్థమునుబట్టి యంతస్థపూర్వక మనరాదు. ఉదా:—ఈర్కు= (ఆకునడిమి యీనె) ఇందలి పరుష మంతస్థపూర్వక పరుషము కాదు. పరుష పూర్వకము.

(ప్రస్తుతోపయోగి యంతగాఁ గాకున్నను సందర్భము వచ్చుటచే నొక విషయ మిట వ్రాయఁబడుచున్నది. "కుట్రి (ట్టి) య ఉకరమ్......" (తొల్కా. ౬౭ సూ.) "నుద్నై"=(నీ తండ్రి) అనుచోటి పదాదినున్న ఉకారము సైత మర్ధమాత్రాకముగనె పల్కఁబడుచున్నది. "ముట్రి (ట్టి) య ఉకరమ్..." (తొల్కా. ౬౮ సూ.)='నుద్నై' అను శబ్దము విశేష్యము......వెనుకఁ జెప్పిన యర్ధమాత్రికోకారఘటిత శబ్దములు విశేష్యములుగను క్రియలుగను నుండును. కాన నవి విశేష్యములుగ నున్నపుడె యర్ధమాత్రాకము లగును. విధిరూపములగునపుడు వాని 'ఉ' కార మేకమాత్రాకమె యని యెఱుంగ నగును).

పయిరీతిగల యర్ధమాత్రాకములగు 'ఉ' కారములకుఁ బరమైన పరుష ములకుఁ గల్గు ద్విత్వాదిక మనెడి ద్రుతకార్యములు తొల్కాప్పియము "ఎ

ఱుక్తధికారము''-౯ ప్రకరణము ౪౧౧ మొ. ౪౩౦-వ సూత్రములచే విశదీక రింపఁబడెను.

"ఈరెఱుత్తు మొఴియుమ్......" (తొల్కా. ౪౧౨ సూ.) సమాస సంధియందు 'పొట్రి ఉకారముతోఁ' గూడిన పరుషమును, దానికిఁ బరమగు పరుషమును ద్విరుక్తినందును. ఉదా:—కాటు (డు) + ఆఱు = కాట్టాఱు = (అడవినది). కాటు (డు) + చెటి (డి) = కాట్టుచ్చెటి = (అడవి చెట్టు). ముయిఱు + కాల్ = ముయిఱ్ఱుక్కాల్ = (ఒకజాతి చీమయొక్క కాలు). ఎరుతు + తిమిల్ = ఎరుత్తుత్తిమిల్ = (ఎద్దుయొక్క రెంటెము). ముయిఱు + ఎఱుమ్బు = ముయిఱ్ఱెఱుమ్బు = (ముయిఱనెడి యొకజాతి చీమ).

"ఒట్రిడై......" (తొల్కా. ౪౧౩ సూ.) = పయి కార్యద్వయములేని చోటులును గలవు. ఉదా:—నాకు + కాల్ = నాకుకాల్ = (లేఁత యాఁడు మృగముయొక్క కాలు). వరకు + కదిర్ = వరకు కదిర్ = (ఆరుగయొక్క యెన్ను).

"అల్లదు కిళప్పిన్......" (తొల్కా. ౪౨౬ సూ.) = వ్యస్తసంధియం దర్ధమాత్రికోకారమునకుఁ బరమగు పరుషములు ద్విత్వమునందవు. ఉదా:— నాకు + కడిదు = నాకుకడిదు = (లేఁతయాఁడు మృగము వేగమైనది.)

"వల్లొట్రుత్తొడర్......" (తొల్కా. ౪౨౭ సూ.) = పరుషపూర్వక పరుషముపై నిల్చిన యర్ధమాత్రికోకారమునకుఁ బరమగు పరుషము వ్యస్త సంధియందు సైతము ద్విత్వము నందును. ఉదా:—కొక్కు + పెరిదు = కొక్కు ప్పెరిదు = (కొంగ పెద్దది). మొ.

౨౬. VI విమ:—హల్ సంధియందును బూర్వపదాంతిమ హల్లు మకార మూర్ధన్య నకార దంత్య నకా రాన్యతమమగునపుడు జరుగు ద్రుతసంధి కార్య ములవంటి పరపరుష ద్విత్వాది కార్యము లీవఱకు (౨౪ V విమ.) వివరింపఁ బడెను.

పూర్వపదాంతిమ హల్లు నకార నకార మకా రేతరమగునపుడు వానిలో 'య-ర-ఴ' లకుఁ బరమగు పరుషములకు ద్విత్వాదిక ద్రుతకార్య సదృశకార్య ములు గల్గును. తక్కిన హల్లులకుఁ బరుషములు పరమగునపుడు వానినడుమ నేదేని స్వరము నిల్చుటయుఁ బరస్థ పరుషములకు ద్విత్వాదికార్యములు గల్గు టయు సంభవించును.

"ఇకారాఱై......" (తొల్కా. ౨౯౭ సూ.) ఇకారాంత పదములకుఁ బరుషపరకత్వమున ద్వివిధసంధులందును వానినడుమ 'ఉ' కారము నిల్చి పరస్థ

పరుషమునకు ద్విత్వము గల్గును. ఉదా:—ఉరిఞ్ + కడిదు = ఉరిఞుక్కడిదు = (పీల్చి త్రాగుట కష్టతరము). ఉరిఞ్ + కడుమై = ఉరిఞుక్కడుమై = (పీల్చి త్రాగుట యొక్క కష్టము).

“యకార విఱుది......” (తొల్కా. ౩౫౮ సూ.) = యకారాంతపదములకు సమాస సంధిలోఁ బరస్థ పరుషద్విత్వము గల్గును. ఉదా:—నాయ్ + కాల్ = నాయ్క్కాల్ = (కుక్కయొక్క కాలు).

“రకార ఇఱుది......” (తొల్కా. ౩౬౨ సూ.) = రకారాంతపదములకుఁ బరుష పరకత్వమున యకారసంధివలె నగును. అనఁగా సమాససంధియందుఁ బరపరుషద్విత్వమును వ్యస్తసంధియందు యథాస్థితియుఁ గల్గును. ఉదా:—తేర్ + కాల్ = తేర్క్కాల్ = (రథముయొక్క చక్రము). తేర్ + పెరిదు = తేర్ పెరిదు = (రథము పెద్దది).

“ఴకార విఴుది......” (తొల్కా. ౩౮౩ సూ.) = ఴకారాంత శబ్దములకుఁ బరుష పరకత్వమున రేఫాంతములకువలె నగును. అనఁగా సమాససంధియందుఁ బరుషద్విత్వమును వ్యస్తతలో యథాస్థితియుఁ గల్గును. ఉదా:—పూఴ్ + కాల్ = పూఴ్క్కాల్ = (పూఴ్ = పక్షియొక్క + కాలు) పూఴ్ + చిఱిదు = పూఴ్ చిఱిదు = (పూఴ్ = పక్షి చిన్నది). మొ.

౨౫. VII విధి:—పయిరీతిని బరపరుషద్విత్వము గల్గుచోటులందుఁ గొన్నియెడల ననునాసికాగమము గల్గును.

“పూవెన్ ఒరుపెయర్......” (తొల్కా. ౨౬౭ సూ.) = ‘పూ’ శబ్దమునకుఁ బరుషములు పరమగునపుడు వాని నడుమ ననునాసిక మాగమమగును. లేదా పరస్థ పరుషము ద్విరుక్తమగును. ఉదా:—పూ + కొడి = పూఙ్కొడి = పూక్కొడి = (పూఁదీఁగె).

“వల్లెఴుత్తు......” (తొల్కా. ౨౩౧ సూ.) = మీఁది సూత్రములలోని మొదటి మూఁడు శబ్దములకుఁ (‘యా-పిడా-తళా’ అను వృక్షవిశేషవాచకములకు) బరుషపరకత్వమున విధింపఁబడిన యనునాసికాగమమునకు మాఱుగాఁ బరపరుషద్విత్వమును రావచ్చును. ఉదా:—యా + అ + కోడు = యాఅక్కోడు = యాఅఙ్కోడు = (‘యా’ అను చెట్టుయొక్క కొమ్మ).

పయిరీతిస్థలము లనేకము గలవు. ఇంత యేల?

“వన్ఱొడర్......” (తొల్కా. ౪౧౫ సూ.) = పొట్టి ‘ఉ’ కారమునకుఁ బరమందున్న పరుషము ద్విరుక్తమగును. అట్టి పొట్టి ‘ఉ’ కారమునకుఁ బూర్వమందున్న స్వవర్గీయ పరుషపర కానునాసికము సయితము తాదృశ

పరుషమె యగును. ఉదా:—కురఙ్కు+కుట్టి=కురక్కు క్కుట్టి=(క్రోఁతిపిల్ల). ఇట్లు స్వవర్గీయ పరుషపరక సంయోగాది స్థానునాసికమునకుఁ దాదృశ పరుషాదేశము గల్గవచ్చునని తొల్కాప్పియరే కంఠోక్తముగా వచించిరి.

పయిరీతిని స్వవర్గీయ పరుషపరకానునాసిక సంయోగమును దదీయ పరుషద్విత్వమును బర్యాయములై యుండుట నరయఁగాఁ బ్రాచీనతమ కాలమున స్వవర్గీయ పరుష పరకానునాసిక సంయోగము లుండెడివనియు నందనేక సంయోగము లొకవిధమగు నుచ్చారణ సౌకర్యాపేక్షచేతఁ దత్రత్య పరుష ద్విత్వరూపమునఁ దొల్కాప్పియమునాఁటికె పరిణమించెననియుఁ దొల్కాప్పియమునకుఁ దర్వాతి కాలమున వేఱొకవిధమగు నుచ్చారణ సౌకర్యాపేక్షచేతనే యట్టి సంయోగములోని పరుషము సరళముగా మాఱుటచే నట్టి యనునాసిక సరళసంయోగము నేఁటికిని నిల్చియున్నదనియుఁ దోఁచుచున్నది. ఇట్టి స్వర్గీయ పరుష పరకానునాసిక మాంధ్రభాషా సహజమగు బిందుసరళరూపముల నందుట తెల్గులోని పరుషపరకద్రుతసంధి స్వరూపమని యెఱుంగనగును.

౨౪. VIII విష:—పయిరీతిని దమిళమున ద్రుతసంధి లక్షణములు చూపట్టుచున్నట్లె కళాశబ్దలక్షణములును దమిళమునఁ గన్పట్టుచున్నవి. ద్రుత కార్యరాహిత్య కలితత్వమె కళాశబ్దలక్షణమని గ్రహింపవలెను.

“మాఱుకోళ్......” (తొల్కా. ౨౯౧ సూ.) వ్యతిరేకార్థ బోధకము—ప్రశ్నార్థకము—సందేహార్థకము నగు ‘ఓ’కారాంతమునకుఁ బరమగు పరుషము ద్విత్వమునందదు. ఉదా:—యానో కొణ్డేన్=(నేనా కొంటిని=నేను గొనలేదని భావము).

“తేఱ్ఱ ఎకరముమ్......” (తొల్కా. ౨౮౭ సూ.)=అవధారణార్థక క్రియల ‘ఏ’కారమునకును, నైచ్యగౌరవార్థకక్రియల ‘ఓ’కారమునకును బరమగు పరుషము ద్విత్వమునందదు. ఉదా:—యానే చెయ్‌దేన్=(నేనే చేసితిని) యానో కొడియేన్=(నేనా దుష్టుఁడను).

ఇట్టి స్వరములెల్లఁ దెల్గునఁ గళలె యనియు వీనిమీఁది పరుషములకు సరళాదేశము రానేరదనియుఁ జెప్పుటకు సందేహము లేదుగదా.

“అన్నవెన్నుమ్......” (తొల్కా. ౨౧౧ సూ.)=అన్నశబ్దమునకును, చెయ్మ్మన (చేయునవి) మున్నగు ‘అ’కారాంతక్రియలకును, విధ్యాద్యర్థకసమాపకక్రియలకును ‘చెయ్దు’ (చేసినట్టి) మున్నగు ‘అ’కారాంత భూతార్థకవిశేషణములకును, ‘చెయ్యియ’ అనుదానివంటి యసమాపకక్రియకును, “అమ్మ” (వినుము) అను శబ్దమునకును ‘పల’ (అనేకములు) శబ్దమునకును, బరమగు

పరుషములకు ద్విత్వము కల్గనేరదు. ఉదా:—పొన్నన్న కుదిరై =(బంగారు వంటి గుఱ్ఱము), చెయ్ద కొల్లన్ =(చేసిన కొల్లనువాఁడు) పల కుదిరై =(పెక్కు గుఱ్ఱములు).

"చుట్టుముదల్ ఇఱుది......" (తొల్కా. ౨౫౭ సూ.) 'అదు-ఇదు-ఉదు' శబ్దములకుఁ బరమగు పరుషము ద్విరుక్తినందదు. ఉదా:—అదు కుఱివు (అది పొట్టిది) మొ.

పయిరీతి శబ్దములెల్లఁ దెల్గునఁ గళలె యనుటకు సందేహము లేదు గదా.

౨౬. విష:—ఆంధ్ర కర్ణాటకములలో సరళోచ్చారణము విస్తరించిన పిమ్మటి కాలమందలి సంధికార్యములను నిరూపించుటకు మాత్రమె యాధారములు లభించుచున్నవి. తమిళమందువలె సరళోచ్చారణమె యవతరింపని కాలమునాఁటి ప్రయోగములు లభింపలేదు. కావున నట్టి ప్రాచీనతమ కాలమున నాంధ్రకన్నడముల స్థితి యెట్లుండెడిదో నిరూపింప శక్యముకాదు. తెల్గునందలి ద్రుతసంధిస్వరూప మీవఱకుఁ గొంత వివరింపఁబడెను. (౨౮ IV విష.) తెలుఁగునందలి పదములెల్లఁ గళలు ద్రుతప్రకృతికములు నని రెండు విధములు. పొల్లునకారముతుదిని గలపదము ద్రుతప్రకృతికము, తద్భిన్నము కళ. "ద్రుతాఖ్యో నః" (వ్యా. సం. ౮౨ విష.) "తిఙ్షష్ఠ్య శేషషష్ఠీ। సున్ కర్మప్రవచనీయజవిభక్తిః। కిఞ్చ త్ప్రశంస నాద్భుత। సంతాప యదా త దా కిమేవాంశ్చ॥ క్త్వా కిల తూష్ణీ మాద్యా। నభిదధతి కళా ద్రుతో న యేషాం స్యాత్। అన్యే ద్రుతప్రకృతయో। యే స్యుర్హ్యానుజీవితద్రుతా నిత్యమ్॥" (వ్యా. సం. ౮౨ విష). "నకారంబు ద్రుతంబు" (బా. సంజ్ఞా. ౧౧ సూ.) "ద్రుతాంతములయిన పదములు ద్రుతప్రకృతికములు. (వివృతి) ప్రథమా కైపట్టి యొక్కేతరములయిన విభక్తులు, ఉత్తమపురుషైక వచనంబులు, భూత తద్ధర్మాద్యర్థక ప్రథమపురుషైక వచనంబులు, ఆశీరాద్యర్థంబులైన యెడు త వర్ణంబులు, శతృ తు మానంతర్య చేదాద్యర్థకంబులు, నేను తాను పదంబులు, (నేన్-తాన్ పదంబు లనఁదగును) వలె ప్రభృతులును ద్రుతప్రకృతికంబులు." (బాల. సంజ్ఞా. ౧౨ సూ.) ఇట్టి ద్రుతప్రకృతికములకుఁ బరమైన 'క-చ-ట-త-ప'లు వరుసగా 'గ-జ-డ-ద-బ' లగును. అట్టియెడల నా ద్రుతము తఱుచుగా బిందురూపము నందును.

"పరుషా ద్రుతప్రకృతికా। త్సరళాః స్యుస్తద్ద్రుతంచ బిన్దుః స్యాత్। అవికారగతే తస్మి। న్నపి సరళా ఏవ సన్తి తే పరతః" (వ్యా. సం. ౮౦ విష).

ఉదా:—వచ్చెన్ + తండ్రి = వచ్చెఁదండ్రి - వచ్చెందండ్రి. వచ్చెన్ దండ్రి యు. "లు గ్వా ద్రుత ప్రకృతికా। త్వరతః సరళే స్థిరేచ నస్య స్యాత్। అలుకిచ సంశ్లేషః స్యా। ద్బిన్దుం ప్రవదన్తి తం క్వచిత్ కేచిత్॥" (వ్యా. సం. ౮౧ విష.) ద్రుతమునకుఁ బరుషేతరహల్లు పరమగునపు డా ద్రుతము లోపించును. లేదా పరహల్లుతో సంయోగించును. అట్టి ద్రుతము బిందువగుటయు నరుదుగఁ గలదు. ఉదా:—వచ్చెన్ + గజము = వచ్చెగజము - వచ్చెన్ గజము. లతాంతములకున్ + మొనసి = లతాంతములకుం మొనసి. (భార. ఆది. ౫ ఆ. ౧౩౮) ద్రుతమునకుఁ బయిరీతిని బిందువే యగునుగాని పర సవర్ణానునాసి కాదేశము తెల్గున రాదు. అది యాంధ్రమహాకవి సమ్మతము కాదు. (చూ. వ్యా. సం. ౨౮ విష). ఉదా:—కం॥ పంగుల మూకాంధుల విక। లాంగులను నబాంధవుల దయం బ్రోతె భయా। ర్తుం గడిఁది శత్రు నైనను। సంగర రంగమునఁ గాతె శరణం బనినన్॥ (భా. సభా. ౧ ఆ. ౭౫ ప).

స్వానునాసికపూర్వక పరుషసంయోగము పరపరుష ద్విత్వరూపమునఁ బరిణమించుటలో నుచ్చారణ సౌకర్య మధికతర మనుటకును, నట్టి స్వానునాసిక పూర్వక పరుషసంయోగము స్వానునాసికపూర్వక సరళసంయోగముగఁ బరిణమించుటలో నుచ్చారణ సౌకర్య మధికతమ మనియుఁ జెప్పుటకు సందేహము లేదు. కావుననె పరపరుషద్విత్వ పరిణామము నందక మిగిలియున్న స్వానునాసికపూర్వక పరుషసంయోగములెల్లఁ దమిళమున స్వానునాసికపూర్వక సరళసంయోగములుగ నియతముగఁ బరిణమించెను. అట్టి సరళోచ్చారణము విస్తరించు నాఁటికే పరపరుషద్విత్వ పరిణామము కొన్ని స్థలములందుఁ గల్గి వాడుక కెక్కి యలవాటుపడి యుండుటచే నట్టి పరపరుషద్విత్వము తమిళమున వానియందు నిల్చిపోయెను. తెల్గునఁ బ్రాచీన తమకాలమందు నయితము పరపరుషద్విత్వ పరిణామము కల్గినట్లు కన్పట్టదు. మఱియుఁ బదముల తుది నకారమునకు మకార పరిణామముగాని యట్టి మకారమునకుఁ బరపరుష సవర్ణానునాసికతా పరిణామముగాని కల్గినట్లు నైతము తోఁచదు. పదాంతిమ నకారము బిందురూపము నందుటయు నట్టి యనుస్వారమందలి "నాదిత" సోఁకునఁ బరస్థ పరుషము సరళముగఁ బరిణమించుటయు సంభవించినట్లుగా నాంధ్రభాషా పరిపాటినిబట్టి విశదమగుచున్నది. తెల్గునఁ బర సవర్ణానునాసి కాదేశమె లేదు. ప్రాచీనాంధ్రశాసనములలోఁ బరసవర్ణానునాసికారూపమున బిందువును లిఖించుట సంస్కృత భాషా వాసనాజన్యమె కాని యాంధ్ర భాషా స్వభావముకాదు. తమిళభాషయందును బిందువు నియతముగాఁ బరసవర్ణానునాసికారూపమె కదా.

పరిశీలింపఁగా నీ సరళోచ్చారణము తెలుఁగునందె పైరీతిని మొట్ట మొదట నారంభించెననియుఁ (తమిళమందలి ప్రాచీనకాలమం దుండెడి పరపరుషద్విత్వమె యిట్టి యూహకు బీజము) గాలక్రమమున ద్రావిడభాష లన్నిటను విస్తరించె ననియు ననునాసిక బిందువుల తాఁకు డంతగా లేని చోటులందును గాలక్రమ మున నుచ్చారణ సౌకర్యాపేక్షచేత సరళోచ్చారణము ద్రావిడభాషలన్నిటను విస్తరించెననియుఁ దోఁచుచున్నది.

౨౭. విష:—పయిని వివరించిన రీతిని ద్రావిడభాషా శరీరమునకు వెన్నెముక యనఁదగు తమిళ పరపరుషద్విత్వము పరసవర్ణానునాసిక పరుష సంయోగము తెనుఁగులోని ద్రుతకార్యభూత సరళాదేశము మున్నగువానికెల్ల మూలమగు శబ్దావయవరూప ద్రుత ముచ్చారణార్థక మనుచు "ద్రావిడభాష లలోఁ బరుషములకు సారళ్యము నొదవించుటకయి యుచ్చారణ సౌకర్యార్థ ముగ వర్గపంచమాక్షరము పరుషములకుఁ బూర్వమున నాగమమగుచుండును ......" (కాల్డు. ౧౬౭ పుట) అని దొరగారు వ్రాయుట కేవలము పౌర పాటని ౨౪-౨౫-౨౬ విషయములు స్పష్టపఱుచుచున్నవి గదా.

వెనుక నుదాహరించిన కాల్డువెల్లు ౧౬౭ పుటలోని విషయములం (౨౪ I విష. చూడు.) దింకను ననేకములగు నశాస్త్రీయ విషయములు గలవు. ఈవఱకుఁ గొన్ని యశాస్త్రీయ విషయములు విమర్శింపఁబడెను. అఱవమందలి పరసవర్ణానునాసికస్థితి సంస్కృతపద్ధతితోఁ దుల్యముగ నుండునని దొరగారు వ్రాసిరి. అది సరికాదు. సంస్కృతమునఁ బదమధ్యమందుమాత్రమె యను స్వారము నిల్వక పరస్థవర్గీయ సవర్ణానునాసికరూపమున నిత్యముగ నిల్చును. పదాంతమందన్నచో యట్టిస్థితి వైకల్పికము. ఉదా:—"సంగచ్ఛతే=సఙ్గచ్ఛతే" అని యిట్లు నున్నయు నిల్వవచ్చును. ఇంకఁ దమిళమం దన్నచో యనుస్వారమే లేదు. పదాంతమందును ననునాసికమే నిల్చును. ఉదా:—మరమ్+కుఱిదు= మరఙ్కుఱిదు. (చెట్టు పొట్టిది).

ఆంధ్ర కర్ణాటములం దనుస్వారమును వ్రాయుదురే కాని యచట వర్గ పంచమమె వినఁబడుచుండునని వ్రాసిరి. (చూడు. ౨౪ I విష. కాల్డు. ౧౬౭ పుట). ఇదియు సరికాదు. తెల్గున వర్గపంచమశ్రుతి లేకుంటచేతనె యది నిరాకృతమయ్యెను. వర్గపంచమములలోని రెండువర్ణములె (ఙ-ఞ) యచ్చాంధ్ర వర్ణసమామ్నాయమున లేవు గదా యవి యెట్లు వినఁబడునని దొరగారు వ్రాసిరో తెలియకున్నది. మఱియు శ్రుతి ప్రాధాన్యమునఁ బుట్టిన యతి ప్రాసములలో వర్గపంచమశ్రుతి లేమింజేసియే కదా బిందుయతి యాంధ్ర పండిత కవీంద్రులచే నంగీకరింపఁబడినది (చూ. ౨౪ IV విష).

ఈ విషయమునఁ గన్నడాంధ్రములకు సామ్యము లేదు. కర్ణాటమున బిందువుచోటఁ బాక్షికముగ వర్గపంచమానునాసికము నిల్చుట సర్వసమ్మతము. ఉదా:—అవం+చలవాది=అవఞ్చలవాది=అవంచలవాది. క. మ న కారద పరదొళ్ వ్యం । జనమిర్ద్దొడమిల్ల దొడ మనుస్వారం సం । జనియిపుదు వర్గ మిదిరిరె । తనగె వికల్పదె తదీయ పంచమ మక్కు౦ ॥ (శబ్దమణి ౧౬౧ ప).

౨౮. I విష:—"ఈ యనునాసికాగమము మూఁడు విధములు: ఈ మూఁడిటిలో మొదటిది యత్యవమున నధికము గానున్నది. అది నామసాధక ప్రత్యయములకును క్రియా (ధాతు) సాధక ప్రత్యయములకును బూర్వమున నిల్చును. ఇట్లు వచ్చెడి యనునాసికాగమము విశేష్యములలోను నకర్మక క్రియలలోను (ధాతువులలోను) నిల్చును. విశేషణములలోను సకర్మక క్రియల (ధాతువుల)లోను నట్టి యనునాసికము లోపించును. పరస్థమగు ప్రత్యయముయొక్క మొదటిహల్లు ద్విరుక్తమగును. అకర్మక క్రియల (ధాతువుల) లోను విశేష్యములలోను లోపింపదు (కాల్డు. ౧౯౯ పుట దీనికి విరుద్ధము. చూడు. ౬౦ III విష.) గాన నట్లునిల్చియున్న యనునాసికము పరస్థిత వర్గాక్షరమున కనుకూలమగు ననునాసికముగ నేర్పడును. (కాఁగా నచట స్వవర్గీయానునాసిక పూర్వక పరుషసంయోగము నిల్చునని తాత్పర్యము). తెల్గులో నట్టి యనునాసికముచోట బిందువే నిల్చును. ఉదా: తమి:—ధాతు-అడ+గు (ప్రత్యయము) అడఙ్గు=(ఓర్చు-(లేదా) సహించు). (అడంగు-తెల్గు) ధాతు-కా+గై (ప్రత్య)=కాఙ్గై=(వేఁడిమి). ఇట్లు ప్రత్యయమగునపుడేకాక ప్రకృతులలో నున్నపుడును నిట్టి గకారమునకుఁ బూర్వమున నీ యనునాసికాగమము వచ్చును. ఉదా:—పగు=(విభాగించు) పఙ్గు. గకారమునకు ముందువచ్చు నీ యనునాసికాగమపు విస్తృతి నీ క్రింది తద్భవోదాహరణము విశదీకరించుచున్నది. ఉదా:—సంస్కృ-శునక=(తమి) శు (చు) ణగన్=శు (చు) ణఙ్గన్=శో (చో) ణఙ్గి=(కుక్క)." (కాల్డు. ౧౬౭-౧౬౮ పు).

విమర్శము ౨౮. II విష:—ప్రాచీన ద్రావిడభాషలో సరళోచ్చారణమె లేదు. కావున నీ పాశ్చాత్య పండితులు 'గు' ప్రత్యయ మనుచున్నది 'కు' ప్రత్యయమనుట యుక్తము. మఱొకవింత. కాల్డువెల్లుగా రీ యనునాసికాగమ ప్రకరణ మారంభించునపుడు (కాల్డు. ౧౬౭ పుట) మొదటఁ బరుషములె యుండెడివనియు నుచ్చారణ సౌకర్యార్థముగ వానికి సారళ్యము నొదవించుటకయి యనునాసిక మట్టి పరుషములకు ముందుగ నాగమమగుననియు వచించిరి. (చూడు. ౨౮ I విష.) ఇప్పుడో 'గు' ప్రత్యయమునకుఁ బూర్వముగ ననునాసికాగమ మగునని చెప్పుచున్నారు. ఈ పూర్వోత్తర సందర్భరాహిత్య

మిట్లుండఁగా నిచటి వీరి యుదాహృతులును ససంభవదోషదూషితము లగు చున్నవి. 'అడఁగు' అను నకర్మకము సకర్మక మనఁగాఁ బ్రేరణార్థక మగునపు డను నాసికము లోపించి ప్రత్యయపు మొదటిహల్లనఁగా 'గ' కారము ద్విరుక్తమగు నపుడు "అడగ్గు" అను ననిష్టరూప ముదయింపవలసివచ్చును. అట్టి యనిష్టరూప మును వారించుకొనుటకయి దొరగారు ధాతుప్రకరణమున నీక్రిందిరీతిని వ్రాసిరి. "ద్విరుక్తము లగునపుడు సరళములు పరుషములుగా మాఱు చుండును" (కాల్డు. ౧౫౮ పుట. 3 పేరా) "అఱవమున ద్విరుక్తి యధికము. అది వచ్చునపుడు సరళములు పరుషముగ మాఱును." (కాల్డు. ధాతుప్రక. ౨౦౪ పుట. ౨ పేరా) ఈధోరణినిబట్టి యచటి ప్రత్యయము సరళమగు 'గు' ప్రత్యయమే యనక తీరదు. అట్లంచుమన్న దొరగారు ౧౬౭ పుటలో వ్రాసిన "పరుషములకు సారళ్యము నొదవించుటకయి యనునాసికాగమ మగును" అను ప్రక్రియ విరోధించును. ఇట్టి సందర్భము పూర్వోత్తర సందర్భశూన్యమయి యున్నది.

౨౮. III విష. నిజస్థితి:—ప్రాచీన తమిళమున సరళోచ్చారణమె లేదు. 'అడఙ్కు' అనునదే ప్రాచీనరూపము. 'అడఙ్గు' అనురూప మర్వాచీనము. అందలి యనునాసికము శబ్దసిద్ధమేకాని యుచ్చారణ సౌకర్యార్థము చేరినది కాదు. అకర్మక క్రియయొక్క తుది హల్లు ద్విత్వమునందుటచేత నది సకర్మక మగుననునది మొదలగు డా. కాల్డువెల్లుగారి ప్రక్రియ సరికాదు. 'అడఙ్కు' అనుదాని పర్యాయరూపమె 'అడక్కు' అని యగునని యీవఱకు ౨౫ విషయ మున మిక్కిలి విపులముగా వివరింపఁబడెను. 'అడఙ్కు' అనుదానిలోని యనునాసిక పరుషసంయోగమె 'అడక్కు' అను పరిణామ మందును. 'అడఙ్కు' అనునది యంతర్గత ప్రేరణధాతువు. దానికే 'అడఁగు' 'అడఁగించు' అను రెండర్థములును గలవు. అట్లయినను వ్యావర్తకముగా 'అడఙ్కు' అను దానిని నకర్మకముగాను 'అడక్కు' అనుదానిని సకర్మకముగాను వ్యవహర్తలు వ్యవహరించుచు వచ్చిరని యూహింపనగును. ఇట్లు స్వానునాసిక పరుష సంయోగము లేని ఆకు (గు) ఆక్కు=(అగు-కావించు) మున్నగు చోటులందు 'ఆకు' మున్నగువానిమీఁదఁ బ్రేరణప్రత్యయము నిల్చుటచే 'ఆక్కు' మున్నగు ప్రేరణరూపము లేర్పడునని యెన్ననగును. ఇట్లంగీకరించునపుడే ప్రేరణరూప నిర్మాణపద్ధతి సమూలకముగను సయుక్తికముగను నుండుననుటకు సందియము లేదు. ఈ విషయము ధాతుప్రకరణమున (౬౦ III, IV, XI విష. ౬౧ విష.) విస్తరింపఁబడును. ఇచటనేకాక ధాతు ప్రకరణమునందును దొరగారు స్వాను నాసిక పూర్వకపరుషము ద్విరుక్తపరుషముగఁ బరిణమించుట యకర్మకము సకర్మక

మగునపుడును విశేష్యము విశేషణ మగునపుడును మాత్రమె సంభవించునని వ్రాసిరి. (చూ. కాల్డు. ౨౦౪ పు.) పరశ్శతములగు స్థలములయం దట్టి పరిణామము గల్గుననియు నచటి స్వానునాసిక పూర్వోక్తపరుషరూప మచటి పరుషద్విత్వ పరిణామమునకుఁ బర్యాయమె యనియు నీపజకు విపులముగ వివరింపఁబడెను. (చూ. ౨౪-౨౫ విభ.) అట్టి యనేకములుగనున్న స్వానునాసిక సంయుక్త పరుషములయు నట్టి పరుషద్విత్వములయు స్థలములను దొరగా రీ యనునాసికాగమ వివరణ సందర్భమునఁ బ్రదర్శింపకుండుట వింతగనున్నది. తొల్కాప్పియములోని యెలుత్తధికారమందలి VII, VIII, IX ప్రకరణములను దొరగారు చిత్తగింపరైరి.

౨౭. IV విభ:—ఏవో యలంతిస్థలములలోని యనునాసికాగమముల చరిత్రము సరిగఁ దెలియకపోవచ్చును. అంతమాత్రమున వాని నుచ్చారణార్థకములనుట సరికాదు. ప్రకృతిని బ్రత్యయములు చేరునపు డేదేని చారియై (ఆగమము) యూపవిభక్తికములవలె నిల్చుననియు నట్టి చారియైలలో "ఇన్-ఒన్-ఆన్-అన్" అనునవి చేరియున్నవనియుఁ దొల్కాప్పియరుగారే వచించియున్నారు. "అవైతామ్......" (తొల్కా. ౧౨౦ సూ.) ఆ చారియై శబ్దములు:—"ఇన్-వఱ్ఱు-అత్తు-అమ్-ఒన్-ఆన్-అక్కు-ఇక్కు-అన్" అనునవి యని సూత్రార్థము. ఇవి ప్రకృతిప్రత్యయ రూపవాక్యగత శబ్దముల పరస్పర సంబంధమును దెల్పు శబ్దవిశేషములనుట యుక్తముగాని యివెల్ల నుచ్చారణార్థము స్వరసంహితలో వచ్చు 'య-వ'ల వంటివనుట యుక్తముఁకాదు గదా. కాని కాల్డువెల్లుగారు నాటిన యీ విత్తు మొలకెత్తి మిక్కిలిగా విస్తరించినది. "అనునాసిక్యము=(Nasalisation)......వర్గాక్షరములకు ముందు నిర్నిమిత్తముగా వర్గపంచమాక్షరము చేరుచుండుటయు......" (ఆం. భా. వి. ౩౦౫ పుట). ఇట్లు నేఁటివారు పెక్కురీ కాల్డువెల్లుగారి ననుసరించుచున్నారు. ఇంక డా. కాల్డువెల్లుగా రిచ్చిన "కా+గై=కాఙ్గై=(వేఁడిమి)" అను నుదాహృతి (చూ. ౨౭ I విభ.) సరికాదు. తమిళ వ్యావహారిక భాషలో "కాఙ్గై" శబ్దమున్నను నది ప్రాచీనముకాదు. ప్రామాణిక ప్రాచీన కవులెవ్వరును నిట్టి రూపమును వాడియుండలేదు. ఇది 'కా' ధాతుజన్యమనుటయు సరికాదు. 'కా' ధాతువు రక్షణార్థకము. కావున నిది 'కాయ్'=(వేఁడిచేయు) అను ధాతువునుండి యేర్పడె ననవలసియున్నది. కాయ్ ధాతుభావార్థక కృదంతరూపము 'కాయ్కై=(వేఁడిమి)' అనునది ప్రాచీన సాధుశబ్దము. దీనినుండి 'కాఙ్గై' అను నపభ్రంశ రూపము వాడుకలోనికి వచ్చియుండును. దీనినిబట్టి ప్రాచీన కాలికమగు

ననునాసికాగమమును నిరూపించుట సరికాదు. దొరగారు 'శునక' శబ్దభవము లనుచు "శుణగన్-శోణక్ష్ణి" అను రూపములను జూపిరి. 'శుణ(జ్ఞ)జ్ఞన్' అను తద్భవమె యాదినుండియుఁ బ్రసిద్ధమైయున్నది. మఱియుఁ దద్భవములందలి వర్ణాగమాదేశాది వికృతులలో నిందలి యనునాసికాగమమును నొకటి యనిన ననవచ్చును. ఇట్టిదానినిబట్టి యుచ్చారణార్థకానునాసికాగమము నిర్వహింపఁ బడనేరదుగదా.

౨౫. V విష:—పయిరీతిని ముఖ్యములగు ద్రుతకార్య రూపానునాసిక స్థలముల నుపేక్షించి మఱికొన్ని యనునాసికాగమ స్థలములు ప్రకృతులలోఁ గలవని యీక్రింది రీతిని వ్రాసిరి.

"అజ్ఞు=(అక్కడ). ఇజ్ఞు=(ఇక్కడ). ఎజ్ఞు=(ఎక్కడ)." అను శబ్దములు 'అ-ఇ-ఎ' అను సర్వనామములకు 'కు' (లేదా) 'గు' అను ప్రత్యయమును ననునాసికాగమమును వచ్చుటచే నేర్పడినవి. 'అమ్-ఇమ్-ఎమ్' అను సర్వనామప్రాతిపదికములకు 'కు' ప్రత్యయమును జేర్చుటచేత 'అజ్ఞు ఇజ్ఞు. ఎజ్ఞు' శబ్దము లేర్పడి యుండునని డా. గుండర్టుగారు చెప్పిరిగాని యది నా యభిప్రాయము కాదు. 'అమ్బర్. (అక్కడ) ఇమ్బర్ (ఇక్కడ) ఎమ్బర్ (ఎక్కడ)' అనువానికి 'అమ్-ఇమ్-ఎమ్' అను సర్వనామ ప్రకృతులు మూలమైనఁ గావచ్చును. కాని 'అజ్ఞు' ప్రభృతుల కవి మూలము గావు. 'యాణ్డు' (సంవత్సరము) అనుదానిలో 'యా' అనునది సర్వనామ ప్రాతిపదికమనియు 'డు' అనునది ప్రత్యయమనియు వాని నడుమ ననునాసికాగమము నిల్చెననియు విభజించినట్లు 'అజ్ఞు' మున్నగు స్థలములందును బ్రకృతి ప్రత్యయ విభాగము చేయవలయును. "అగ=(అక్కడ) ఇగ=(ఇక్కడ) ఇజ్జ=(ఇప్పుడు) హింకె=(ఇక్కడికి) హాంకె=(అక్కడికి)" అను గోందురూపములను, 'ఆగ=ఆగలు=(అప్పుడు) ఈగ=(ఇపుడు) యావాగ=(ఎపుడు) హాగె=హాగ్గె=(ఆరీతిగ) హీగె=హీగ్గె = (ఈరీతిగ)' అను కన్నడరూపములను, 'అక్క=(అప్పుడు) ఇక్క=(ఇప్పుడు) ఎక్క=(ఎప్పుడు)' అను కొడగురూపములను బరిశీలింపఁగా 'అజ్ఞు' మున్నగు సజీవ శబ్దములలో నిది యుచ్చారణార్థ కానునాసికాగమమె యని విశదమగుచున్నది. (కాల్డు. ౧౬౨ పుట).

విమర్శము:—పరిశీలింపఁగాఁ దొలుకాప్పియరు చెప్పిన "ఆన్ (అక్కడ) ఈన్ (ఇక్కడ) అను శబ్దములు వీనిలోని పూర్వావయవములనుట యుక్తమని తోఁచుచున్నది. తెల్గులోని 'ఏమి' శబ్దమునకు సరియగు 'ఏన్-ఎన్' శబ్దములును దమిళమునఁ గలవు."

"మన్నుమ్ చిన్నుమ్......" (తొల్కా. ౨౭౬ సూ.) అను నీ సూత్రమున 'మన్-చిన్-అన్-ఈన్-పిన్-మున్' శబ్దములను దొలుకాప్పియరు పేర్కొని యున్నారు. ఇట్టి స్థితిలో 'అజ్జు' ప్రభృతులలోని యనునాసిక ముచ్చారణార్థక మనుట యుక్తము కాదు గదా. మఱియు 'అమ్బర్'=(అక్కడ) మున్నగు వానికై 'అమ్-ఇమ్-ఎమ్' అనువాని నంగీకరించియు దొరగారు 'అజ్జు' ప్రభృతులలో నట్టి శబ్దములె పూర్వావయవములనెడి డా. గుండర్టుగారి మతము నెట్లు నిరసింపఁ గల్గుదురు? ఇంక గోందు ప్రభృతిభాషలలోని 'అగ' ప్రభృతి శబ్దములలో ననునాసికము లేకుండుట యొక నిదర్శనమందురేమో? వానిలోని యనునాసికము లోపించెననియు సందును గొన్నిటియందు లోపింపక 'ఇజ్గ-హాజ్గె-హీఞ్జె' మున్నగువానిలో ననునాసికము నిలిచియు నున్నదనియుఁ జెప్పుట యుక్తము. 'యాణ్డు' = (సంవత్సరము) శబ్దములోని యనునాసికము సైత ముచ్చారణార్థకము కాదు. "అఱవమునందలి 'యాణ్డు' అనునది 'ఏణ్డు' అను దాని వికృతియె. తెనుఁగులోని 'ఏఁడు-ఏండు' అనునవియె సరియగు మూల రూపములు. 'ఏణ్ = (పరిమితి) + తు = ఏణ్డు = (పరిమితిగలది)' అని దీని వ్యుత్పత్తి నెన్నఁ నగును" (విద్వాన్. శ్రీ వే. వేంకటరాజులు రెడ్డిగారి జాబు. (ఫిబ్రవరి ౧-తే. ౧౯౩౮ సం).

"'ఆగ-ఆగలు' మున్నగునవి హళగన్నడరూపములు. 'ఆగళ్'=(ఆకాలమున) 'ఈగళ్'=(ఈకాలమున)" అనునవి పడగన్నడరూపములు. ఇవి తమిళమందలి 'ఆఙ్గణ్=(అక్కడ). ఈఙ్గణ్=(ఇక్కడ)' అనువానిని సంబంధించునవి. అఱవమున నివి స్థలవాచకములై యుండఁగాఁ గన్నడమునఁ గాలవాచకములగుచున్నవి. 'అన్టు-ఇన్టు' అనునవి యఱవమునఁ గాలవాచకములు. అవియే 'అందు-ఇందు' అని మాఱి తెల్గున స్థలవాచకములై యున్నవి. (విద్వాన్. శ్రీ వే. వేంకటరాజులు రెడ్డిగారి జాబు ౧ ఫిబ్రవరి ౧౯౩౮ సం).

౨౮. VI విష:—"చవర్గము పరమగునపు డనునాసికాగమము వచ్చుట తమిళ కన్నడములకన్నఁ దెల్గునం దధికము. ఉదా:— తెల్గు-పఞ్చు. ఇది 'పగు=(విభాగించు)' అను తమిళ ధాతువునుండి వచ్చినది. అఱవమున 'పజ్జు=(విభాగించు)' అనుశబ్దమేర్పడి యున్నది. అఱవాదులలోవలె నకర్మక ధాతువులకే కాక తెల్గున సకర్మక ధాతువులకును ననునాసికాగమము వచ్చును. ఉదా:— రెట్టిఞ్చు." (కాల్డు. ౧౬౯ పుట).

విమర్శము:—కాల్డువెల్లుగారి పై వ్రాఁతనుబట్టి తెలుఁగున ధాతువుల తుదిని స్వార్థ ప్రేరణములలో వచ్చెడి "ఇంచు=చు=పు" అనువానిలోని 'చు-పు' లు ప్రత్యయములనియు వానిముందటి (నున్న) యనునాసిక ముచ్చార

సార్థకమగు నాగమమనియు వారు తలంచినట్లు కనఁబడుచున్నది. 'రెట్టించు-చించు-చింపు' మున్నగువానిలోని 'చు-పు' అనువానికి ముందున్నది 'సున్న' యే కాని చవర్గ పంచమముకాదు. తవర్గపంచమమును గాదు. దొరగారు "రెట్టిఞ్చు" అని యుదాహరించుట యాంధ్రభాషా సంప్రదాయ విరుద్ధము. తెల్గున 'జ-ఞ' లు లేవు. 'ఇంచు' అనునది 'చేయు' అనునర్థముగల ప్రాచీన ధాతు విశేషమనియు, దాని కభిన్నములె 'చు-పు' లనియు గ్రహింపనగును. కాన నందలి 'సున్న' యుచ్చారణార్థము చేరినదికాదు. 'ఇంచు' అనుదానిలోని బిందువు తేలిపోఁగా మిగిలిన 'ఇచు' లోని దంత్య 'చు' వర్ణము 'సు' వర్ణముగా మాఱుటచే (చూ. ౨౩ I విష. ౧౭ VII విష). నేర్పడినదే కన్నడములోని 'ఇసు' అనెడి ప్రత్యయము (చూ. కర్ణా. భూష. ౨౧౩-౨౧౪ సూ.). (కన్న-సొగయిసు=తె-శోభిల్లు. కన్న-పాడిసు. తె-పాడించు). కొందఱు విమర్శకులు 'ఇచ్చు' అనుదానినుండి 'ఇంచు' అనునది యేర్పడెనని తలంతురు. (చూ-'ఇంచు' సూ-రా-ని) "ఇంచు" అనుదానినుండి 'ఇచ్చు' అని యేర్పడుట సహజము. విపరీతముగఁ జెప్పుట భాషాపరిణామ స్వభావవిరుద్ధము. (చూ. ౨౫ విష. ౧౭ XIX విష). (చూ. వ్యా. సం. విస్త. V ౩౨౬ విష).

౨౮. VII విష:—"కు-చు-ల వలె 'టు-డు'లు దుదిని జేరు ద్రావిడ క్రియలు కన్పట్టవు. కొన్ని యప్రాణి వాచకశబ్దముల తుదిని నిల్చు ప్రత్యయములలో 'ట-డ' లు చూపట్టుచున్నవి. ఉదా:—తమి-'ఇరణ్డు' శబ్దము 'ఇరడు' శబ్దమునుండి యేర్పడినది. కన్న-ఎరడు=(రెండు). 'ఆణ్డు=(అక్కడ) ఈణ్డు=(ఇక్కడ) యాణ్డు (ఎక్కడ)' అను నఱవశబ్దములలోఁ బైరీతినె 'డు' ప్రత్యయమును ననునాసికాగమమును బరిశీలించునది. పయివానిలో 'యాణ్డు' అను దానికి సంవత్సరమనియు నర్థముగలదు. ఈ యర్థములో దీనికి 'యాణ్డై' అను రూపాంతరమును గలదు. 'ఆణ్డు' అనునదే సంవత్సర పర్యాయమై యున్నను శాసనములలో 'యాణ్డు' అనియే యున్నది. 'ఆణ్డు-ఆణ్డై' అనుశబ్దములనుండి పుట్టిన 'ఆట్టై' (సాంవత్సరికము) అనుదానిలో ననునాసికము లేదుగాన 'ఆణ్డు-ఆణ్డై' అనువానిలోనిది యనునాసికాగమమె యని గ్రహింపనగును. ఉదా:—తమి-'ఇరణ్డు' అనుదానినుండి 'ఇరట్టై' అని పుట్టినది. కన్న-ఎరడు. పయి సందర్భమునుబట్టి 'ఆణ్డు' అనునది 'ఆడు' శబ్దమునుండి యేర్పడిన దనఁదగును. ఇందుకు సరిగాఁ దెల్గున 'ఆడ-ఈడ-ఏడ' అనుశబ్దము లగపడుచున్నవి. వీనిలో నుచ్చారణమున నానునాసిక్య మించుక యున్నను వ్రాఁతలో లేదు. వీనిలోని 'ఏడ' శబ్దము 'ఏడు' అని మాఱి సంవత్సర పర్యాయమగుచున్నది. తుళు

భాషలో "అడె=(అక్కడికి) ఇడె=(ఇక్కడికి) ఒడె=(ఎక్కడికి)" అను నిరను నాసికములై వెలయుచున్నవి. తెల్గు ప్రథమా 'డు' ప్రత్యయమునకు ముందుగ ననునాసికాగమము పెక్కుచోట్ల నగపడుచున్నది. ఉదా:—వాఁడు-వాణ్లు-వాండ్లు. "తమి-శరణ్డి=తెల్గు-గరిశె." అనురీతిగల స్థలములు నుండుటవలన ద్రావిడభాషలలో ననునాసికాగమము సార్వత్రికము కాదని విశదమగుచున్నది." (కాల్డు. ౧౬౯-౧౭౦ పుట).

విమర్శము:—'టు-డు' లు తుదినిగల ధాతువులు "కుణ్డు-గెణ్డు-పణ్డు-మణ్డు-వణ్డు" మున్నగునవి పెక్కులుండఁగా నట్టివి ద్రావిడభాషలలో లేవని యేల వచించిరో తెలియకున్నది. "తెల్గు-రెండు. తమి-ఇరణ్డు." అని యుండుట చేత 'కన్న-ఎరడు' అనుదానిలో శబ్దసిద్ధమగు ననునాసికము లోపించెననుట యుక్తము. 'ఇరణ్డు' మొదలగు వానిలోని యనునాసిక ముచ్చారణార్థము చేరినదనుట నిరాధారము. తమిఁటములోని 'ఆణ్డు' (అక్కడ) మున్నగు శబ్దములలోని యనునాసికమును నుచ్చారణార్థముచేరిన యాగమముకాదు. అది శబ్దసిద్ధము. 'యాణ్డు' అనునది సంవత్సరార్థమున శాసనములలో వాడఁబడిన దననేల? ప్రాచీన తమిఁటగ్రంథములందును బ్రయుక్తమయి యున్నది. 'యాణ్డై' అనుదానికి సమాసమందు మాత్రమె ప్రయోగముండును గాన నది 'యాణ్డు' శబ్దరూపాంతరమనుట సరికాదు. 'ఆణ్డు' మున్నగువాని వ్యుత్పత్తి విషయమున నీ క్రింది రీతిని విద్వాన్. శ్రీ వే. వేంకటరాజులు రెడ్డిగారు వచించిరి. "ఆణ్డు - ఈణ్డు - యాణ్డు శబ్దముల కీ క్రిందిరీతిని వ్యుత్పత్తుల నెన్నవలయును. 'అ+అణ్=అవణ్ (ఆస్థలము) (నడువణ్=మధ్యస్థలము. తమి-కన్న). ఇ+అణ్=ఇవణ్=(ఈస్థలము). యా+అణ్=యావణ్=(ఏస్థలము).' అని యేర్పడును. వీని తుదిని 'అదు' అను సర్వనామ శబ్దము నిల్వఁగా 'అవణదు (అక్కడిది) ఇవణదు (ఇక్కడిది) యావణదు (ఎక్కడిది)' అని యేర్పడును. వీనికిఁ బ్రాచీన తమిఁట గ్రంథములయందుఁ బ్రయోగములు పెక్కుగలవు. వీని సంక్షేపరూపములు — "అవణదు = అవణ్డు = ఆణ్డు, ఇవణదు = ఇవణ్డు = ఈణ్డు, యావణదు = యావణ్డు = యాణ్డు" అని యేర్పడనగును. ఇట్లగుట చేత వీనిలోని యనునాసికము శబ్దసిద్ధమనఁదగును. ఉచ్చారణార్థముచేరిన యాగమము కాదు. అక్కడిది మున్నగు నర్థములు కాలక్రమమున 'అక్కడ' మున్నగు నర్థములుగా నేర్పడిన వనఁదగును. ఇట్లె 'ఇరట్టై=రెండురెట్లు' అను నర్థము కాలక్రమమున 'రెండు' అనునర్థముగ సయితము మాఱినది." (విద్వాన్. శ్రీ వే. వేంకటరాజులు రెడ్డిగారు).

'అణ్డై' మున్నగువానిలో ననునాసిక ముండుటయు 'అట్టై' మున్నగు తజ్జన్యరూపములలో ననునాసికము లేకుండుటయు వానిలోని యనునాసిక ముచ్చారణార్థము చేరిన యాగమమనుటకు నిదర్శనములనుచు దొరగారొక యుక్తిని జెప్పుచున్నారు. ఇది కేవలము భ్రాంతి మూలకము. "అణ్డై=అట్టై" అనువానిలోని ణకారమందలి యానునాసిక్యము లోపింపఁగా మిగిలినరూపమె 'అట్టై' అనునది. (చూ. ౨౨ విభ). 'అణ్డు' అను నతిప్రాచీనరూపము లోని యనునాసిక ముచ్చారణార్థము చేరినదను భ్రాంతితో నున్నవారగుట చేత దొరగారట్టి 'అణ్డు' శబ్దము 'ఆడు' శబ్దమునుండి యేర్పడియుండునని విశ్వసించువారై ద్రావిడభాషలలోని నిరనుస్వారములగు నర్వాచీనరూపములను వానికిఁ బర్యాయములనుచుఁ జూపసాగిరి. ప్రాచీన ప్రామాణిక ప్రచుర వాఙ్మయములేని తుళు ప్రభృతులందలి శబ్దముల విషయమై దొరగారేమి వ్రాసినను బాధలేదుగాని తెల్గునందలి యర్వాచీనములగు 'ఆడ-ఈడ-ఏడ' శబ్దములను జూపుట సరికాదు గదా. ఇట్టి వ్రాఁతల నరయునపుడు వీ రాంధ్రాదుల విషయమున నెవరో యజ్ఞులు చెప్పినమాటలను ప్రమాణముగాఁ గొని యేమేమో వ్రాయుచుందురని తోఁచుచుండును. "ఆ + ఎడ (చోటు) = ఆయెడ, ఈ+ఎడ=ఈయెడ, ఏ+ఎడ=ఏయెడ" అనువానిలోని 'యె' వర్ణము లోపింపఁగా నేర్పడిన 'ఆడ' ప్రభృతిశబ్దంబు లత్యంత ప్రాచీనములగు 'అణ్డు' ప్రభృతులకు మూలరూపములని చెప్పుట యెంతయు నసంభవము గదా. 'ఆయెడ' మున్నగువానినుండి యేర్పడిన "ఆడ" ప్రభృతు లెక్కడ? మీఁద నుదాహరించినరీతిని "అవణదు=అణ్డు" అనురీతి వ్యుత్పత్తులుగల "అణ్డు" మొదలగు తమిళ శబ్దము లెక్కడ? ఇంకొక వింత! ఇట్టి చరిత్రగల 'ఏడ' శబ్దమె (ఏయెడ) సంవత్సరార్థకమగు 'ఏఁడు' శబ్దముగా మాఱెననియు దొరగారు చెప్పుచున్నారు. "ఏఁడు-ఏండ్లు" అనురీతిరూపములుగల "ఏఁడు" శబ్దము సబిందుకము. "ఏయెడ=ఏడ" అనునది నిర్బిందుకము. కేవలము విభిన్నమగు శబ్దము. ఇట్లె 'అవన్' శబ్దాపరావతారమగు "వాండు-వాఁడు" శబ్దము నుండి యేర్పడిన "వాండ్లు" అను వ్యావహారిక శబ్ద ముచ్చారణార్థకమగు ననునాసికము 'వాడు-వాడ్లు' శబ్దములందుఁ జేరుటచేత నేర్పడెననియు నసంభవముగా దొరగారు వచించిరి. (చూడు. 'డు' ప్రత్యయ చరిత్రము. ౧౨ IX విభ).

'తమి-కరణ్డి. తెల్గు-గరిటె' అనురీతిని 'గరిటె' నిర్బిందుకమనెడి కాల్డు వెల్లుగారి వ్రాఁత సరికాదు. "గరిఁటె=గంటె. (తమి-కరణ్డి)...... నేయి గరింటెఁడున్ బోయకయున్న (పండితా-వాద. ౨౦౩ పౌరట)" (సూ-రా-ని).

ఈ క్రింది మఱికొన్ని శబ్దములలో ననునాసికాగమము గలదను వారి గారి వ్రాఁతయు సరికాదు.

"తమి-తిరు-ధాతువు. తిరున్దు=(అకర్మక క్రియ) (బాగగు). తిరుత్తు=(సకర్మక) (బాగుచేయు=దిద్దు). (తమి)-మరున్దు=(ఔషధము)=(కన్న)-మద్దు=(తుళు)-మద్దు. (తమి)-అన్ద (న్త)=(ఆ). ఇన్ద (న్త)=(ఈ). ఎన్ద (న్త)=(ఏ). పయి శబ్దములలో ననునాసికాగమము కన్పట్టుచున్నది. 'అదు-ఇదు-ఎదు' అను వానిలో ననునాసికాగమము రాఁగా విశేషణములకు వచ్చు 'అ' ప్రత్యయము నిల్చుటచేత-'అన్ద-ఇన్ద-ఎన్ద' అనునవి యేర్పడును." (కాల్డు. ౧౭౨ పుట).

విమర్శము:—పయి వానియందును ననునాసికము శబ్దసిద్ధమె కాని యుచ్చారణార్థకమగు నాగమము కాదు. 'తిరున్తు' అను సహజానునాసిక స్వార్థికధాతువుపైని ప్రేరణార్థమున 'తు' నిల్వఁగా నచటి ద్విరుక్త పరుషపూర్వ స్థానునాసికము సహజముగా లోపించుటచేత 'తిరుత్తు' అను ప్రేరణరూప మేర్పడెను. (చూ. అ౦ III విష). 'మరున్దు' శబ్దము 'మరమ్' శబ్దమునుండి యేర్పడి యుండును. కాన నందలి యనునాసికము సహజమె యనఁదగును. 'మద్దు-మద్దు' అను కన్నడ తుళురూపములలో నట్టి యనునాసికము లోపించిన దనఁదగును. తెల్గు-మందు. "అన్ద (న్త) ఇన్ద (న్త) ఎన్ద (న్త)" అనునవి 'అనైత్తు=(ఆపరిమితి)' 'అనైత్త' = '(ఆపరిమితిగల)' మున్నగు శబ్దములనుండి యేర్పడెను గాన వానిలోని నకారము శబ్దసిద్ధమె యనుట యుక్తము. ఇవి, డా. గుండర్టుగారు చెప్పినట్లు 'అమ్-ఇమ్-ఎమ్' అను (చూ. అ౦ V విష.) సర్వనామరూపములనుండి యేర్పడినవనెడి పక్షము నంగీకరించినను నంగీకరింప వచ్చును. "'అన్ద-ఇన్ద-ఎన్ద' అను నీ శబ్దము లేడువందలయేండ్లక్రిందటి తమిళ వాఙ్మయమున లేవు. ప్రాచీన తమిళ వైయాకరణులు వీనిని నిరూపింపను లేదు. 'మణిమేగలై' కావ్యమున నొక్కచో 'అన్త' అను శబ్దము వచ్చియున్నది" (విద్వాన్. శ్రీ వే. వేంకటరాజులు రెడ్డిగారి జాబు ౧ ఫిబ్రవరి ౧౯౫౮ సం॥).

"మకారాగమముగల స్థలములు పెక్కుగలవు. ఉదా:—(తమి) తిరుమ్బు=(తెల్గు) తిరుగు=(కన్న) తిరువు. 'తిరుప్పు' అను నఱవ సకర్మక రూపమున ననునాసికము లేమింజేసి 'తిరుమ్బు' శబ్దములోని మకార ముచ్చారణార్థ కాగమరూప మనఁదగును. (తమి)-ఎరుమ్బు (చీమ), (కన్న)-ఇరువు. అఱవమున 'దు-బు' అను ప్రత్యయములు వచ్చునపుడెల్ల నవి యనునాసిక పూర్వకములుగనె వచ్చును." (కాల్డు. ౧౭౧ పుట).

విమర్శము:—పయివానిలోని యనునాసిక మాగమము కాదు. 'తిరుమ్' (తిరుగు) అను నకర్మకక్రియ కేవలము ప్రాచీనమైనది. దానినుండి 'తిరుమ్పు'

అనునర్వాచీనరూప మేర్పడనగును. దానిపైని ప్రేరణార్థమున 'పు' అను ప్రత్యయము నిల్వఁగా నచటి ద్విరుక్త పకారమునకు ముందటి యనునాసికము సహజముగా లోపించుటచేత సకర్మకమగు "తిరుప్పు" (త్రిప్పు) శబ్దమేర్పడును. (చూ. ౨౫ III విష). కాన 'తిరుమ్బు' లోని మకార ముచ్చారణార్థకము కాదు. కన్నడములోని 'తిరువు'-'ఇరువు' (చీమ) అనునవి 'తిరుమ్బు-ఎరుమ్బు' అను ప్రాచీనరూపములలో వర్ణలోపాదికము కల్గుటచేత నేర్పడినవి. కాన వానినిబట్టి 'తిరుమ్బు-ఎరుమ్బు' శబ్దములలోని మకార ముచ్చారణార్థముచేరిన యాగమమని తలంపరాదు. మఱియు 'తిరువు-ఇరువు' అనునవి హొసగన్నడ రూపములు. 'తిరి' (తిరుగు) 'ఇఱుంపె' (చీమ) అనునవి పళగన్నడరూపములు.

౨౫. VIII విష:—"వెనుకఁ జెప్పిన (కాల్డు. ౧౭౭ పుట. ౪ పేరా) (చూ. ౨౭ విష. ౨౫ I విష). రెండవ విధమగు ననునాసికాగమము:— ఇది తమిళమున భూతార్థక 'ద' ప్రత్యయమునకుఁ బూర్వమున నిల్చును. కర్ణాటాంధ్రములలో భూతార్థక 'ద=త' ప్రత్యయము కలదుగాని దానికి ముందీ యనునాసికాగమములేదు. (తమి) వాల్‌న్‌దేన్=(వాల్+న్+ద్+ఏన్) (నివసించితిని). ప్రాచీన కర్ణాటరూపము-బాళ్‌దేన్ (నివసించితిని). (తమి-క్ష్వ) = విఱున్దు = (హైటామిల్-వీఱున్దు) (పడిపోయి) = (కన్న)-బిన్దు, = (మలయా) వీణు. (ఇందనునాసికముతో దకారమేకీభవించినది). వ్యావహారి కాఱవమున ననునాసికాగమము తఱుచు. (గ్రాం-తమి) చెయ్ద=(చేసిన)=(వ్యా-తమి)=సెఞ్జ. (గ్రాం-తమి) పెయ్ద=(వర్షించిన)=(వ్యా-తమి) పెఞ్జ". (కాల్డు. ౧౭౨ పుట).

విమర్శము:—ప్రాచీన కన్నడమున 'బాల్‌దెన్' అని యున్నది గాని "బాళ్‌దేన్" అని యుండలేదు. అట్లె 'బిద్దు' అనునది హొసగన్నడరూపము, పళగన్నడమున 'బిల్‌దు' (పడిపోయి) అని యుండును గాని 'బిన్దు' అను రూపము లేదు. వ్యావహారిక తమిళమునందు సైతము "సెఞ్జ-పెఞ్జ" అని పల్కరు. తక్కువ జాతులవాడుకలో 'సేఞ్జ-పేఞ్జ' అని పల్కుదురు. వీనిలో నున్న 'య' కారమును 'న్ద' అనునదియు 'ఞ్జ' అనురూపము నందెను. ఉత్తమ జాతులవారు "సెయ్ద-పెయ్ద" అనియె పల్కుదురు. వీనియందలి 'ద' ప్రత్యయ మనునాసికపూర్వకము కానట్లె "వాల్‌న్‌దేన్" అనుచోటను సయితము "ద" ప్రత్యయ మనునాసికాగమపూర్వకము కాదు. అచటి నకారము భూతార్థకమగు 'ఇన్' ప్రత్యయముయొక్క ఖండము (చూడు. ౧౩౧ V విష.). మలయాళమున

'వీణు' అనురూపమున్నను 'వీణ్ణు' = (తమి·వీఙ్డు) అనునదియే సరియైన రూపము. (చూడు ౧౫ III విష).

౨౮. IX విష:—"వెనుకఁజెప్పిన (కాల్డు. ౧౬౭ పు. ౮ పేరా). (చూ. ౨౭-౨౮ I విష). మూఁడవ విధమగు ననునాసికాగమము:—ఇది ధాతువు లలో (మూలభూత శబ్దములలో) 'ద-డ' లకు ముందగపడుచున్నది. ఒక్కొ కప్పుడు శకటమునకును ముందగపడును. కన్న-కఱు=(దూడ). తమి-కన్రు. కన్న-మూఱు. తమి-మూన్రు. ఈ మూఁడువిధములగు ననునాసికాగమము లును సంస్కృతమందును గన్పట్టును" (కాల్డు. ౧౭౭ పుట).

విమర్శము:—'మూన్రు-కన్రు' మున్నగు తమిళ శబ్దములలోని యనునాసి కము శబ్దసిద్ధము. తెల్గునందును "మూఁడు=మూండు" అనురూపములు గలవు. అట్టి యనునాసికము కన్నడమున లోపించిన దననగును. దొరగారు 'ద-డ' లకు ముందటి స్థితి నుదాహరింపలేదు. అచటను గర్ణాటాంధ్రములలో నను నాసిక లోపము వెలయుచునే యున్నది. ఉదా:—తమి-ఐన్దు. తెల్గు-ఐదు. కన్న-ఐదు. తమి-ఇరణ్డు. తెల్గు-రెండు. కన్న-ఎరడు. అవన్రు=వాన్రు= వాండు. మొ. అన్రు = (కాదు). ఇన్రు = (లేదు). చెన్రాన్=(చనెను). నిన్రాన్=(ఉన్నాఁడు). నన్రు=(మంచిది). ఇట్టి వానిలోని నకార ముచ్చార ణార్థక మనుట సాహసము. వీనిలోని నకారములు సంధిజన్యములు. శబ్దావ యవములు. తమి-మూన్రు. తెల్గు-మూండు. తమి-కున్రు. తెల్గు-కొండ. తమి- కన్రు. తెల్గు-కందు. తమి-ఇన్రి = (లేక.) తెల్గు-ఇండి. తదభావద్యోతక ప్రత్యయము. ముక్కిండి-వాలిండి. మొ. ఇట్టివెల్ల నుచ్చారణార్థక నకారము లనుట సరికాదు గదా. 'అవన్రు=వాన్రు=వాండు' ఇత్యాదులలో నకారము శబ్దసిద్ధమె యనుటకు సందియము లేదుగదా.

౨౯. విష:—"సంస్కృతభాషలో "నఙ్" సమాసములం దుత్తర పద మజాది యగునపుడు నకారాగమము వచ్చుటచేత "అన్-ఇన్-ఉన్" అను రూపములు గల్గును. (కాల్డు. ౧౭౩ పుట).

"ద్రావిడభాషలలోఁ దఱచుగా నట్టి నకారాగమమునకు బదులుగా యకార వకారాగమములు వచ్చుచుండును. ద్రావిడభాషలలోఁ బరరూప సంధి యరుదు. ఆంధ్ర కన్నడములలో మాత్రము కొంత యధికముగా నున్నది. అట్టి పరరూపసంధి జరుగనపు డాయచ్చులనడుమ యకార వకార ములలో నొకటి నిల్చును. పూర్వాచ్చు 'అ-ఆ-ఒ-ఓ' అనువానిలో నేదియైె యున్నను 'వ' కారము నిల్చును. పూర్వాచ్చు 'ఇ-ఎ-ఐ' అనువానిలో

నేదియైయున్నను 'య' కారము నిల్చును. ఉదా:—తమి:—వర+ఇల్లై= వరవిల్లై. (రా లేదు). వటి+అల్ల=వటియల్ల (దారికాదు)."

"సంహితలో మొదటమొదట వకారాగమమె వచ్చుచుండెడిదనియు నంతకంత కుచ్చారణ స్వభావమునుబట్టి యకారాదులును వచ్చుట వాడుక కెక్కెననియుఁ జెప్పఁదగును. మలయాళమునలో వకారాగమము పోయి యకారాగమమె నిల్చియున్నదని, డా. గుండర్టుగారు చెప్పిరి. 'అవన్-ఇవన్' అను నఱవ సర్వనామములలోను (అ+వ+న్. ఇ+వ+న్) 'వాఁడు-వీఁడు' అను తెనుఁగు సర్వనామములలోను 'వ' కారాగమమె కనబడుచుండుటచేత 'వ' కారాగమమె ప్రాచీనమనక తీఱదు. ఇట్లె 'నకార-మకా' రాగమములలో మకారాగమమె ప్రాచీనమై యుండవచ్చును. 'తెలుఁగు-కన్నడము తుళు' అనుభాషలలో 'మ-న-య-వ' అను నాల్గును నాగమము లగుచుండుటయు నఱవ మున 'న-వ-య' అను మూఁడుమాత్రమె యాగమము లగుచుండుటయుఁ బ్రసిద్ధమై యున్నది. వాఙ్మయములేని 'కు' అను ద్రావిడభాషలో సయిత మీ యాగమ మగపడుచుండుటచేత నీ యాగమములు ద్రావిడభాషా సామాన్యములని గ్రహింపనగును. ఉదా:—'కు' భాష:—ఆ+ఆలు=ఆవాలు. (ఆమె). ఇవి ప్రకృతి ప్రత్యయ సంధులలో సైతము వెలయుచున్నవి. ఉదా:— తమి-పుళి+ఇల్=పుళియిల్ (చింతపండులో). పిలా+ఇల్=పిలావిల్ (పనస పండులో). నఞర్థమున 'అ' కారము వచ్చుట ద్రావిడభాషలలో లేకుండుటచేత హిందూ జర్మానికు భాషలలోవలె ద్రావిడభాషలందు 'అన్-ఇన్-ఉన్' అనునవి గల్గుటకు వీలులేకపోయెను. అఱవమున స్వరసంహితలో 'వ' కారము వచ్చుచోఁ దుళు తెల్గుభాషలందుఁ దఱుచుగా 'న' కారాగమము వచ్చును. తెల్గు స్వరసంహితలలోఁ గొన్నియెడల 'న' కారాగమమును దక్కినయెడల 'య' కారాగమమును నిట్లుద్వివిధముగ వచ్చుచుండును. ఉదా:—తిన్నగా+ వేఁగెను=తిన్నగా నేఁగెను. ఇట్టి నకారమునకు ద్రుతమని పేరు. ద్రుతము వచ్చుపదము ద్రుతప్రకృతికము. ద్రుతమనఁగా జరుగుట. ద్రుత మొక ప్పుడు లోపించును గాన దానిపే రన్వర్థకము. ద్రుతప్రకృతికములు కాని పద ములు కళలు" (కాల్డు. ౧౭౮-౧౭౯ పుటలు).

విమర్శము:—ద్రావిడభాషలలో స్వరసంహితలందు 'న-మ' అనునవి యుచ్చారణార్థము చేరుననుట సత్యము కాదు. ఈ విషయము ముందు విపుల ముగా విశదీకరింపఁబడును. తమిళమున ననునాసికాగమము చేరుననెడి (కొన్నియెడల మకారము చేరును. అది తత్తద్వర్గీయానునాసికముగ మాఱును) కాల్డువెల్లుగారి వ్రాఁత సరికాదని యీావఱకు విపులముగా విశదీకరింపఁ

బడెను. (చూ. ౨౮ I విష. మొ. ౨౮ VIII విష. వ. ౨౭ విష. ౨౯ I విష. మొ. ౨౯ IX విష. వ.). ఇట్లె తెల్గులోని ద్రుత మనఁబడెడి 'న' కారము చ్చారణార్థకము కాదు. అది శబ్దావయవమగు నక్షరము. అయ్యది స్వర సంహితలోనే కాక హల్ పరకత్వమందును బూర్వశబ్దాన్త్యావయవముగా నిల్చి పరహల్లుతో సంధించి సంధికార్యముల నొదవించును.

శ్లో॥ "పరుషాద్రుత ప్రకృతికా ।
త్సరళాః స్యుస్తద్ద్రుతంచ బిన్దుః స్యాత్ ।
అవికారగతే తస్మిన్నపి సరళా ఏవ సన్తి తే పరతః"

(చూ. ౨౮ VIII విష). ఉదా:—వచ్చెన్ + తంద్రి = వచ్చెందండ్రి-వచ్చెఁదండ్రి-వచ్చెద్దండ్రి. మొ. ఇట్టి నకారమును స్వరసంహితలో నుచ్చారణార్థముగఁ జేరు 'య-వ' ల వంటిదానినిగాఁ జెప్పుట కేవలము సంప్రదాయ విరుద్ధము.

౨౯. I విష:—స్వరసంహితేతర స్థలములయందును బయిరీతిని వెలసియున్న ద్రుతము సామ్యసిద్ధాంతము మూలమున (Analogy) విస్తరించినదని యీ క్రిందిరీతిని వికాసకర్తగారును వ్రాసిరి. "ఇట్లె 'య-న' లు మాత్రమేగాక యితరాక్షరమును విసంధి నాపుటకు ఆగమములుగా వచ్చుచునే యుండునట్టి యభ్యాసము సామ్యమువలనఁ దెలుఁగున (ద్రుతము) నేర్పడినదని యంగీకరింపక తప్పదు." (ఆం. భా. వి. ౩౨౨ పుట) ఈసామ్య సిద్ధాంత మనన్యగతికస్థల విషయకమని తలంపక దానిని వేలకొలఁది స్థలములందు వెలసియున్న శబ్దసిద్ధ 'న' కారము విషయమున నుపయోగించుట యుక్తమా? వికాసకర్తగారిట్టి యభిప్రాయముతో నుండుటచేతనే ద్రుతప్రకృతిక నిర్వచనము నీ క్రిందిరీతిని స్థలాంతరములందును వ్రాసిరి. "సంధ్యభావస్థలములయందు పూర్వపరశబ్దముల సన్నికృష్టాచ్చులకు నడుమ యడాగమము (టిత్త్వఫల మెట్లు పొసఁగునో?) వచ్చినచో నాపూర్వశబ్దములు కళలు మిగిలినవి ద్రుతప్రకృతులు." (ఆం. భా. వి. ౩౧౭ పు). యడాగమమురాని 'చిగురుటాకు-ధీరురాలు-నట్టడవి-రాజునాజ్ఞ' మున్నగు ననేకస్థలములు గలవు: అట్టి చోటులందలి పూర్వశబ్దములు ద్రుతప్రకృతికములని యెవ్వరును జెప్పఁజాలరు గదా.

" 'వడియేను - వడిహేను - వడునేను' అను మూఁడురూపములలోను 'య-హ-న' అనునవి ప్రకృతిభావనివారణకు ఏర్పడినవనుట స్పష్టము." (ఆం. భా. వి. ౩౨౧ పు.). "ప్రభువు+ఆజ్ఞ-విధాతృ+ఆనతి, మొదలయిన స్థలములలో అచ్చులను నశింపకుండ నిలుపుటకు నడుమ ఆగమము రావలయును.

ఇచ్చట యడాగమము కలుగుట సుగమము కాదు. ఉకారము ఓష్ఠ్యము. వకారాగమమును ఉచ్చారణలో సౌకర్యమును గలిగింపదు. ముందొక వకారము కలదు గదా. కావున నకారాగమము గలిగినది. నిర్హేతుకముగా 'న' కారాగమము గల్గుచుండుటయు, ఉన్నది పోవుచుండుటయు భాషలో పరిచిత మగుటచేత నట్లాని సామ్యమున నియ్యది కల్గినది." (ఆం. భా. వి. ౩౭౦ పుట).

విమర్శము:—'ప్రభువు+ఆజ్ఞ' అనుచోట వకారముండుటచేత వకారాగమము రాదయ్యె ననుట సరికాదు. 'రాజు+ఆజ్ఞ' అనురీతిగల వకార రహిత స్థలములందు 'వ' కారాగమము రానేరదు గదా. 'రాజునాజ్ఞ విధాతృనాజ్ఞ-ప్రభువునాజ్ఞ' మున్నగు ననేక స్థలములందు వెలయుచున్న 'న' కార ముచ్చారణార్థము వచ్చిన యాగమము కాదు. అచ్చటి నకారము షష్ఠ్యర్థక ద్వితీయా సంబంధమైనదనుట యుక్తము. సామాసిక ద్రుతలోపము వచ్చుటచేత "షష్ఠ్యా ఉతోఽచి నుమ్ సేచ" (వ్యా-సం. ౯౬ విష) అని యిట్లు ప్రక్రియా సౌష్ఠవమునకై 'న' కారాగమము నాంధ్రశబ్ద చింతామణి వ్యాకరణ ఫక్కిలో విధించుచున్నను నది షష్ఠ్యర్థక ద్వితీయాసంబంధి 'న' కారమె యనుట భాషా తత్త్వశాస్త్ర పద్ధతిని యుక్తమై యుండును. ఈ విషయమున నన్నయాథర్వణ సమ్మతమగు సహజమార్గమును గ్రహింపఁజాలక "షష్ఠీభవే ద్వితీయా తుల్యా తత్పురుష సంస్థితా నామ్నా"మ్మను చింతామణిమార్గమును విడిచి యపమార్గమునఁబడిన బాలవ్యాకరణకారాదుల నుగాగమ విధానాదికము శంకాస్పదము కానేరదు. గ్రాంథికభాషా వ్యాకరణములు మహాకవ్యాదృత రూపసాధన మాత్ర ప్రవణము లగుటచేత వానిలోని విషయములను శబ్దచరిత్ర పరిశీలన విషయమునఁ బరిగణింపవలసిన యావశ్యకత లేదు. (చూ. ౨-౩ విష). పయి రీతిని 'పదునేను' మున్నగుచోటులందు నిల్చిన నకారము సముచ్చయార్థకమగు 'ఉన్' శబ్దసంబంధి యనుట యుక్తముగాని యుచ్చారణ సౌకర్యమాత్ర ప్రయోజనికమగు నకారమనుట యుక్తము కాదు. "పది+ఉన్+ఏను" అనురీతి నట్టి యెడల నర్థవంతములగు పదముల నరయనగును.

తెలుఁగున స్వరసంహితలో నుచ్చారణసౌకర్యార్థము చేరునది యొక్క-యకారముమాత్రమె యనియుఁ దద్భిన్నములు పదద్వయసంధిలో నుచ్చారణ సౌకర్యార్థము చేరునవనుట సత్యవిదూరమనియు గ్రహింపనగును. "యశ్రుతి మార్యా లఘుయం। ప్రవదన్తి ప్రాణతః పరం ప్రాణమ్" (వ్యా. సం. ౫౩-౬౭ విష.) అను చొప్పునఁ దెల్గున సంధిలేని, స్వరసంహితలో నుచ్చారణసౌకర్యార్థము చేరున దొక్క- 'య' కారమాత్రమెయని యెఱుంగనగును. తెల్గున వాక్యమధ్యమున స్వరములకు సంధి జరుగుటగాని యది లేనపుడు సంహితా

యకారము నిల్చుటగాని నియతము. తమిళ కన్న డాదువలెఁ దెల్గున వాక్య మధ్యమునఁ బ్రకృతిభావము సైతము లేదు. అట్లే తమిళకన్నడములందువలె స్వరసంహితలో నుచ్చారణ సౌకర్యార్థముగ వకారము నిల్చుటయు సంప్రదాయముకాదు. "చతుర్థి=చ+ఉ+తి=చవుతి. రాహుత్త=ర+ఉ+తు=రవుతు" మొదలగు తద్భవములలో (వ్యా. సం. ౬౭I విష. వై. పా. ౩౭౬ విష.) నఖండపదములందుఁ దెల్గున స్వరసంహితలో వకారమునిల్చుట యరుదుగఁ గలదుగాని వాక్యమధ్యమున సంధి జరగని పూర్వపరస్వరముల నడుమ నుచ్చారణ సౌకర్యార్థము వకారముచేరుట (చూడు ౬౦ VI విష.) యెంతమాత్రమును లేదు. "తెలుఁగున యడాగమము మాత్రమంగీకరింపఁబడెను. క్వాచిత్కముగ వకారాగమము ఉన్నను......" ఆం. భా. వి. ౩౧౫ పుట.) అని యిట్లు వికాస కర్తగారు 'ఆ+ఊరు=ఆ వూరు' అను రీతిని దెల్గునందును స్వరసంహితలో వకారాగమము నయితము గలదని యభిప్రాయపడిరి. కాని 'వూరు—వోడ' మొదలగు వకారఘటితశబ్దము లర్వాచీనములై దెల్గున వెలసియుండుటచేత నట్టి వకారము స్వరసంహితలో విసంధి నివారణమునకు వచ్చినది కాదనియు వ్యావహారిక శబ్దసిద్ధమె యనియు గ్రహింపనగును. ఆయూరు మొదలగు యకారాగమ కలిత కవిప్రయోగములు ప్రాసాదిస్థలగతములై ధారాళముగ వెలసియుండుటచే నిట్టి వ్యావహారికపదాది వకార మాంధ్ర వైయాకరణులచే నుపేక్షిత మయ్యెను. యెవఁడు-యేఱు-యేనుఁగు? మొదలగు శబ్దముల మొదట వినఁబడుచున్న యకారము సైతము 'అతఁడెవఁడు' మున్నగు సంధులలో నిల్వమిం జేసి యదియు సహజముకాదనియె యర్వాచీన వైయాకరణులు నిరసించిరి. కాని ప్రాచీనులగు నన్నయాథర్వణు లట్టి యకారము శబ్దసిద్ధమనియు సంధి సందర్భమున నది లోపించుననియు సూత్రించిరి. "అద్యః క్రియాసు భూతార్థ ద్యోతి నమాగం వినా సర్వః" (వ్యా. సం. ౫౩ విష.) "సర్వ త్రాజ్వత్ కార్యం జ్ఞేయం యస్య" అని నన్నయయు "వికృత్యాదిగతో యోత్ర । స్యా చ్ఛబ్దాంతర యోగతః । ప్రాణమాత్రావశేషః స్యా । దితి శ్రీకవి సమ్మతిః" అని యథర్వణుఁడును వచించియున్నారు—"తెల్గు-యెవరు. తమి-యావర్. తెల్గు-యేనుఁగు. తమి-యానై, తెల్గు-యేఱు. తమి-యాఱు" అను రీతి నచటి యకారము ద్రావిడశబ్ద సహజమై యుండుటచేతఁ దెలుఁగు వ్యవహారమునఁ బదాదినుండెడి 'ఎ' కారాది విశిష్ట యకారము సహజము కాదనుటకు నన్నయ భట్టారకుఁడు సమ్మతింపఁజాలఁ డయ్యెనని తోఁచెడిని.

౭౯. II విష:—నేఁటికొందఱు తెలుఁగుపండితులు సంస్కృతమందు వలెనె తెల్గునందును సంహిత వైవక్షిక మనియు, వక్త యథేష్టముగ యకారమును స్వరసంహితలో నిల్పవచ్చుననియు "నీవు ఇప్పుడు ఏమిపనికయు వఁగు

చున్నావు" అను రీతిని వాక్యప్రయోగము చేయవచ్చునని యు వచించుచున్నారు. "సంహితైకపదే నిత్యా। నిత్యా ధాతూపసర్గయోః। నిత్యా సమాసే వాక్యేతు। సా వివక్షా మపేక్షతే" అను సంస్కృత వైయాకరణసిద్ధాంతము చొప్పున సంస్కృతవాక్యమధ్యసంధి (సంహిత వైకల్పికము కాన) యెల్లయెడలను నైచ్ఛికమె యనుట సత్యమెకాని యట్టి సిద్ధాంతమును ద్రావిడపండితులు — అందును తెలుఁగుపండితులు—సమ్మతింపలేదు. "న స్యా ద్వాక్యవిరామే తు। సంధ్యభావోఽపి దోషకృత్" (వ్యా. సం. ౧౧౭ విమ.) అని యిట్లాంధ్ర వైయాకరణులు వాక్యమధ్య విసంధి సహజము కామింజేసి దుష్టమని యభిప్రాయ పడియున్నారు. ఆంధ్రమహాకవులు వాక్యమధ్యసంధిని నియతముగాఁ బ్రయోగించి యున్నారు. (చూ. వ్యా. సం. ౧౧౭ I విమ.) వ్యావహారికాంధ్రమందును వాక్యమధ్య విసంహిత సమ్మతము కాదు. అయినను నేఁటి ద్రావిడపండితులు కొందఱు వాక్యమధ్య విసంధిని విస్తరిల్లఁ జేయుచున్నారు.

ఆ. III విమ:—సంధిగ్రంథకర్తగారు స్వరసంహితలో నుచ్చారణ సౌకర్యార్థముగా 'య వ'లు నిల్చుననుట సరికాదనియు నట్టి 'య వ'లును ననేకములు ప్రకృతిసిద్ధములును దక్కినవి సామ్యసిద్ధాంతప్రాప్తములును నయియున్నవనియు దలంచుచున్నారు. పూర్వపరస్వరములు రెండును 'అ' కారములైనపుడు తాలవ్యసంబంధము లేమింజేసి యచటఁ జూపట్టెడు యకారము స్వరసంహితలోని యుచ్చారణార్థక సంహితా వ్యవధాయక వర్ణ మనఁదగదనియు నట్లే "అ+అన్=అవన్" మున్నగు చోటులందును నోష్ఠ్యసంబంధము లేమింజేసి యచటి 'వ' కారమును నుచ్చారణార్థక సంహితా వ్యవధాయక వర్ణమనుట సహజము కాదనియు నట్టి స్థలములందలి యకార వకారముల నీక్రిందిరీతిని సమర్థింపనగు ననియు వ్రాసిరి. "సామాన్యముగా తెలుఁగున అకారాంతములైయున్న పెక్కు-శబ్దము లఱవమున ఐకారాంతములై యున్నవి. తెలుఁగునందలి 'వెల' శబ్దమాభాషలో 'విలై' అనురూపము గలదై యున్నది. ఇదియే ప్రాచీనభాషలో నొకకాలమున దీనిరూపంబై యుండవచ్చును. ఇందలి 'ఐ' కార మాకాలమున 'అఇ' అనియు 'ఎఇ' అనియుఁ గూడ నుచ్చరింపఁబడుచున్న ట్లూహింపవచ్చును. ఏలయనఁగాఁ దమిళమున నైకారాంతములై యున్నవని చెప్పఁబడుచున్న యిట్టి శబ్దములన్నియుఁ గన్నడభాషలో 'ఎ' కారాంతములై యున్నవి. తెలుఁగులో అకారాంతము లగుట వ్యక్తమె. 'ఐ' అను సంధ్యక్షర ముచ్చారణమున 'అఇ=అయ్' అగుట సహజమె గావున 'విలై=విలయ్+ఆళ్=విలయాళ్=వెలయాలు' అనురూపమును బొందియుండును......'ఐ' అనునది యిప్పుడు కొందఱవవా రుచ్చరించుచున్నటుల 'ఎయ్' గాఁ గూడ నుచ్చరింపఁబడఁదగును. కన్నడమునను తరువాతికాలపు వైయాకరణులు తెలుఁగులోవలెనె ఎకారాంతమె

శబ్దమనుకొని దానిని విడఁదీసినప్పుడు మిగిలిన యకారము సంధివశమున వచ్చిన దని తలంచుటచేతనే వారును ఎకారాంత శబ్దములపై యడాగమమును విధించి యుందురు....కంఠ్యవివృతమగు అకారము తాలవ్య సంవృతమగు ఎకారము ('ఎ' కారము సంవృత మగుట కేవలము నశాస్త్రీయము నసంభవము. ఇట్లీ సందర్భమున గ్రంథకర్త పలుసారులు వ్యవహరించెను.)......ఎకారోకారములు పూర్వమందుఁగాని పరమందుఁగాని నిల్చినపుడు తత్‌స్థానీయములగు తాలవ్యోష్ఠ్య ('వ్యోష్ఠ్య'తప్పు. 'వ్యా' అనవలెను.) ష్ఠ్యాంతస్థవర్ణము లుచ్చారణమునకు సహాయ వర్ణములుగా వచ్చిచేరుట సహజమె కాని పూర్వపరస్వరములు రెండును అకారములైనపుడును తత్సమశబ్దములపైనిగూడ యకారము వచ్చుటకుఁ గల కారణ ముచ్చారణసౌలభ్యమె యని చెప్పవలనుపడదు. అట్టిసందర్భములలో నెల్లఁ బైని దెలుపఁబడిన విలై మొదలగు ప్రాచీనభాషలోని 'ఐ' కారాంతశబ్దముల సంధిగతరూపముల సాదృశ్యముచేతనే (Analogy) యకారము గల్గినదని తలంప వలసియున్నది......తమిళ కన్నడములలో......'అ+అన్' అనియుండఁగా అకారముపై యకారము వచ్చి 'అయన్' కాక వకారాగమము వచ్చి "అవన్" అయినది. ఇట్లకారముపైనెకాక ఇకారపైఁగూడ వకారమే వచ్చుట విశేషము. ఇ+అన్=ఇవన్......కాని తమిళమునఁ గొన్నిసందర్భములలో అనఁగా 'అ+యానై' మొదలగుచోటుల వకారం బాగమంబై 'అ+వ్+యానై = అవ్యానై' మొదలగు రూపంబు లగుచుండుటంబట్టి అవన్-అవళ్-ఇవన్-ఇవళ్ మొదలగు రూపములలోని తొలిపదంబగు నిర్దేశ వాచకమూలరూపము అకార మాత్రమెకాక 'అవ్-ఇవ్' అని వకారాంతమై యుండెనేమో? యని సందేహము కలుగక మానదు.......ఈ సర్వనామరూపములందేగాక యీ వకారాగమము కొన్ని అకారాంతశబ్దములపైఁ గూడఁ గనఁబడుచుండుట పైరూపముల సామ్య ముచేఁ (Analogy) గల్గినదని చెప్పవలసియున్నది" (సంధిగ్రంథము. ౨౮ మొ. 33-వ. పుటలలోనిది).

ఆంధ్రభాషావికాస కర్తగారు సయితము మీసంధి గ్రంథపద్ధతి నామో దించియె యున్నారు "తలై+అక్కడ=తలయ్+అక్కడ=తలయక్కడ. ఇట్లే ర్పడిన యకారమును కాలక్రమమున సంధిలోవచ్చిన యాగమమాత్రముగా గ్రహించియుండవచ్చును. ఈ 'య' కారము కాలక్రమమునఁ దక్కినయెడల కును బ్రాఁకి యుండవచ్చును." (ఆం. భా. వి. ౩౧౬ పుట).

విమర్శము:—౨౯. IV విష:—కాని యొకస్థలమున సాదృశ్యపద్ధతి కుదిరి నంతమాత్రమున నారీతినె యంతటను సిద్ధాంతము చేయుట యుక్తముకాదు. ఈ సాదృశ్య సిద్ధాంత (Analogy) మగతిక గతియని శబ్దతత్వశాస్త్రజ్ఞులు జ్ఞప్తియం

దుంచి కొనుట యావశ్యకము. ఇతర యుక్తమార్గములచేఁ గుదురుపడని స్థలము లందుఁగదా యేదో యొకస్థలమునఁ గుదిరిన దాని సామ్యమునుబట్టి లక్ష్యములు కాని స్థలములయందును నట్టి కార్యము విస్తరించినదనెడి యగతికగతి నంగీకరింప వలయును. "సామ్యము ప్రవర్తించుటకు ఒకటిరెండు శబ్దము లేర్పడినం జాలును," (ఆం. భా. వి. ౩-౨౫) అనునిట్టి పద్ధతి ప్రామాణిక సమ్మతము కాఁజాలదు. వ్యాప్తి నిశ్చయమునకు భూయోదర్శన మత్యావశ్యకము.

మఱియు "<u>ఆయా కాలము-ఆయడవి.</u>" మున్నగు పరశ్శతములగు స్థలములందలి స్వరసంహితలోని 'య' కారములెల్ల "విలైయాలు" వంటి తమిటపదములను జూచి వివేకహీనముగా లోకము యకారముతో వాడఁజొచ్చెననుట యుక్తముకాదు. ఇంతియకాక తాలవ్యాదిస్థలాంతరములం దెట్లును స్వర సంహితా యకార వకారముల నంగీకరింపక తీరదు గదా. అకారద్వయ మధ్యవర్తిస్థలములందు మాత్రమె యీ యగతికగతిరూప సాదృశ్యపద్ధతి నంగీకరింప నేల? ఇంతకును 'అ' కారద్వయమధ్యమున 'య' కారము నిల్చుట యంత యపూర్వవిషయము కాదు. అకారద్వయమధ్యగత స్వరసంహితయందె యుచ్చారణ సౌకర్యార్థముగ 'య' కార శ్రుతిగల్గుట సహజమని యీ క్రింది ప్రాకృతభాషా ప్రసిద్ధినిబట్టి విశదమగుచున్నది. "యశ్రుతిరః" (౧-౩-౧౦) ప్రాయో లుగిత్యాదినా కాదీనాం లోపే యోవశిష్యతే 'అ' వర్ణః సః 'అ' వర్ణాత్పరో లఘుప్రయత్నతర యకారశ్రుతి ర్భవతి..... ఆతపః=ఆఅపః=ఆయవో ...... (షడ్భాషాచంద్రిక ౧౧ పుట). "యశ్రుతిరః" (౧-౩-౧౦) ఆదిత్యనువర్తతే. ప్రాయోలుక్‌-గచజేత్యాదినా లుకిసతి యోఽవశిష్యతే అవర్ణః సః అవర్ణాత్పరః లఘుప్రయత్నతర యకారశ్రుతి ర్భవతి. ఉదా:—శకటమ్=సయడం. ఆకరః=ఆయరో. ప్రకారః=ప్రయారో. ఆకాశః=ఆయాసో. నాగరం=ణాయరం. వచనమ్=వయణమ్. ఆచారః=ఆయారో. రజతమ్=రయయం. భాజనమ్=భాయణం. ప్రజాపతిః=పయావఇ. (ఇచట తాలవ్య సంబంధమున్నను యకారము రాదు) కృతమ్=కయం. గదా=గయా. నయనమ్=ణయణం. జాయా=జాయా...... (త్రివిక్రమ ప్రాకృత శబ్దానుశాసనము). యత్వ మవర్ణే=కవర్గ తృతీయయో రవర్ణే పరే యత్వం భవతి. కాకాః=కాయా. నాగాః=నాయా. పిశాచాః=పిసాయా......(చండ ప్రాకృతలక్షణము. తృతీయ విధాన. ౩౯ సూ.). ఇట్టి ప్రాకృతశబ్ద ప్రపంచమందలి 'అ' వర్ణద్వయమధ్యగత యకారములెల్ల 'విలైయాలు' సాదృశ్యము చేతనే వచ్చినవందురా? ప్రాకృతమందే కాక సంస్కృతమందును 'అ' వర్ణద్వయమధ్యమున 'య' కారము నిల్చుట ప్రసిద్ధమై యున్నది. "భో భగో

అఘో అపూర్వస్య యోఽశి. (౮-౩ ౧౭)=ఏతత్పూర్వస్య రోః యకారాదేశః స్యా దశిపరే." (సి-కౌ. ౧౬౭ సూ.) అనుపాణిని సూత్రము చొప్పున "దేవాః+అత్ర=దేవాయత్ర" అనురీతిరూపము లనేకములు సంస్కృతమునఁ బ్రసిద్ధములై యున్నవి. మీఁదు మిక్కిలిగ నోష్ఠ్యమగు నోకారమునకంటెఁ బర ముగ నైతము యకారమే నిల్చును. "భోః+అచ్యుత=భోయచ్యుత." మొ.

పయిసందర్భమునుబట్టి 'అ' కారద్వయమధ్య సంహితలో యకార వకారములు నిల్చుట సరికాదనుట సరికాదనియు నకారణమున నగతికగతి యగు సాదృశ్య సిద్ధాంతము నాశ్రయించి రూపసాధనము చేసికొనుట యప మార్గమనియు విశదమగుచున్నది. యవలును హల్లులెయైనను వానియందుఁ గల పాక్షికాను నాసిక్యరూప ధర్మవిశేషమునుబట్టి (చూ. వై. పా. ౨౧౪ విష.) లక్షింపఁదగిన స్వరతుల్యత (Semi-vowels) నాశ్రయించి వాని నర్ధాచ్చు లందురు. అట్లగుటంజేసి యవియే స్వరసంహితలో నెల్లయెడలను నుచ్చారణ సౌకర్యార్థముగా నిల్వఁదగిన వర్ణములనియు, నట్లగుటచేతనే పెక్కుభాషలలో నవి యట్టియెడల నిల్చుట ప్రసిద్ధమై యున్నదనియు గ్రహింపవలయును.

౨౫. V విష:—సంధిగ్రంథకర్త 'విలైయాలు' మున్నగు చోటులందు 'విలెయాలు' అనురీతిని 'ఐ' కారమును గొందఱు "ఎయ్" అని పల్కుట 'నాఁడును నేఁడును' గలదనియు నకారణమునఁ గన్నడములో 'ఎ' కారమునకుఁ బరముగా స్వరసంహితలో 'య' కారము నిల్చునని కర్ణాట వైయాకరణు ల నుచితవిభాగముచేసి వచింతురనియు వ్రాయుట కేవలము సత్యవిదూరము. తొల్కాప్పియమునాఁటికి 'ఐ' కారమునకు 'ఎయ్' అను నుచ్చారణము లేదనియు నేఁడును బండితులు 'ఐ' అనియే పల్కుదురనియు నీవఱకు విపుల విమర్శన పూర్వకముగ వివరింపఁబడెను (చూ. ౧౮ II విష). సంధిగ్రంథకర్తగారు డా. కాల్డువెల్లుగారి యసత్యపు వ్రాత నాధారముగఁ గొని నైరీతిని వ్రాసిన వారైరి. ఐకారమునకుఁ బదాంతమున 'ఎ' అను నుచ్చారణము సామాన్యుల వాడుకలోఁ గలదని యొకప్పు డంగీకరించినను 'ఎయ్' అను నుచ్చారణ మెన్నఁడును లేదనుటకు సందేహములేదు. అట్టియెడల 'య' కారము స్వర సంహితలో నుచ్చారణ సౌకర్యార్థము నిల్చు వర్ణము కాదనియు శబ్దావయవ భూతమె యనియుఁ జెప్పెడి సంధిగ్రంథము పరాస్తమగుచున్నదనక తీరదు.

౨౫. VI విష:—సంధిగ్రంథకర్తగారు స్వరసంహితావ్యవధాయక 'య' కారము నంగీకరింప నక్కఱలేదనునట్లె స్వరసంహితా వ్యవధాయక వకారమును నంగీకరింప నక్కఱలేదనియు నదియు సామ్యసిద్ధాంతముననే సాధించుకొననగు ననియు 'అవన్' మున్నగువానిని సాధించుటకు "అ+అన్=అ+వ్+అన్=

అవన్. ఇ+వ్+అన్=ఇవన్" అను రీతిని 'అవన్-ఇవన్' శబ్దములను సాధించు కొనరాదనియు 'అవ్+అన్=అవన్. ఇవ్+అన్=ఇవన్' అను రీతిని వానిని సాధించుకొనుట యుక్తమనియు 'అ - ఇ' అను నిర్దేశసర్వనామములకు 'అవ్ - ఇవ్' అను రూపాంతరములుగలవని 'అవ్వానై'= (ఆ యేనుఁగు) మున్నగు ప్రసిద్ధరూపములనుబట్టి యంగీకరింపకతీరదనియు ౨౯ III విషయమున వ్రాసి యున్నారు. 'అవ్-ఇవ్' అను రూపాంతరముల నంగీకరింపనిచో 'అ+యానై' =(ఆ యేనుఁగు) అనుచో 'అయ్యానై' అను ననిష్టరూపము సిద్ధింపవలసి వచ్చునని వారి యాశయము.

ఇట్టి వివాదస్థమగు 'అవ్వానై' అనుదానివంటి రూపముల సాధించు నపుడు తప్ప నింకెఁ దమిళ ప్రపంచమున నెచ్చటను 'అవ్ - ఇవ్' అను సర్వ నామ ప్రకృతుల - స్థితిలేదు. కావున 'అవ్వానై' అను దానివంటి రూప ముల సాధనమునకై 'అవ్ - ఇవ్' అను సర్వనామ ప్రకృతులను గల్పింప రాదు. అట్టివాని నీ క్రిందిరీతిని సాధించుకొననగును — "యలో ద్వ్యాధా౽ యో నిరను । నాసిక స్యానునాసికః ।" అను (ముగ్ధబోధవ్యా. హల్‌సంధి ౪౮ సూ.) వైయాకరణసిద్ధాంతముచొప్పున (చూడుడు. వైయాకరణ పారిజాతము ౨౧౪ విష.) 'యవ'లు హల్లులే యైనను వానియందుఁగల పాక్షికానునాసిక్య రూప ధర్మవిశేషమునుబట్టి (చూడుడు. - 'వై. పా.' ౨౧౪ విష.) లక్షింపఁదగిన స్వరతుల్యత నాశ్రయించి (Semi-vowels) తమిళమున విశేష విధిగ నవి నిర్దేశక సర్వనామములకుఁ బరమగునపుడు స్వరములు పరమగునప్పటివలెనె స్వరసంహితా వ్యవధాయకవర్ణమగు వకారము వచ్చునని గ్రహింపవలయును. ఈ విషయమునె తొల్కాప్పియ రీ క్రిందిరీతిని సూత్రించిరి. ఈ పద్ధతిచొప్పున "అ+యానై = అ+వ్+యానై=అవ్వానై =(ఆ యేనుఁగు)" మున్నగురూపములు సిద్ధించును గాన నట్టివానికై 'అవ్ - ఇవ్' అను నశ్రుతచర సర్వనామప్రకృతులను గల్పించుకొన నక్కఱలేదు.

"యవమున్వరినె......" (తొల్కా. ౨౦౭ సూ.) = నిర్దేశ సర్వనామ మగు 'అ' శబ్దమునకు యవలు పరమగునపుడు వాని నడుమ 'వ' కారము నిల్చును. ఉదా:—అ+యానై =అవ్వానై =(ఆ యేనుఁగు). అ+వళై = అవ్వళై =(ఆ రంధ్రము. లేదా-ఆ గాజులు). "చుట్టిన్ ఇయత్తై......" (తొల్కా. ౨౩౯ సూ.) 'ఇ' అను నిర్దేశసర్వనామమునకు 'అ' అను సర్వనామ శబ్దమునకు వచ్చు కార్యములు సంభవించును. ఉదా:—ఇ+యానై = ఇవ్వానై =(ఈ యేనుఁగు). ఇ+వట్టు=ఇవ్వట్టు=(ఈయాటవస్తువు).

ఇట్లగుటంజేసి 'అవన్ - ఇవన్' మున్నగు స్థలములందు సాధారణమగు సంహితా వ్యవధాయక 'వ'కార మీక్రిందిచొప్పున నిల్చునని యెన్ననగును.

"ఉయిర్ మున్ వరినుమ్......" (తొల్కా. ౨౬౫ సూ.)=నిర్దేశసర్వనామమగు 'అ' శబ్దమున కచ్చు పరమగునపుడు వానినడుమ 'వ' కారము నిలుచును. అను చొప్పున "అ+వ్+అన్" అనుచో 'అవన్' అను రూపము సిద్ధించును. అశబ్దకార్యములె 'ఇ' శబ్దమున కగును గాన (తొల్కా. ౨౩౯ సూ.) "ఇ+అన్=ఇ+వ్+అన్=ఇవన్" అను రూపమును సిద్ధించును. 'అన్' అనునది పదము కామింజేసి యచటి వకారమునకు ద్విత్వము కల్గలేదు. ('అవ్' మున్నగు ప్రకృతుల నంగీకరించువారి పక్షమునందును హ్రస్వైకాక్షరపూర్వకహల్లగు 'వ' కారము ద్విత్వము నందవలసినదేకదా) పయిరీతినె ప్రయోగ ప్రసిద్ధిచొప్పుననె "అ+వ్+అన్=అవన్. ఇ+వ్+అన్=ఇవన్" అను సమానపదస్థలములందు 'వ'కారాగమము నిత్యమని యెఱుంగునది. తమిళమునందలి స్వరసంహితా వ్యవధాయకవర్ణము నిత్యముకామింజేసి పైరీతిని ప్రయోగమునుబట్టి నిత్యత సూత్రింపఁబడెనని తాత్పర్యము.

అ. VII. విష:—"ఎల్లామొழிక్కుమ్......" (తొల్కా. ౧౮౧ సూ.) = అజంతపదముల కచ్చుపరమగునపుడు వానినడుమ నొకహల్లు నిలువ వచ్చును. అట్లు నిల్చిన హల్లును "ఉడమ్పడుమెయ్" (రెండచ్చులజేర్చు హల్లు.) అని వ్యవహరింతురు. ఇట్లనుటచేతనె విసంహితగ ననఁగా వానినడుమ నేహల్లును నిలువక ప్రకృతిభావముగలుగుటయుఁ దమిళమున విరుద్ధముకాదు. యవలలో నొకటియే స్వరసంహితలో నిల్చుననువిషయమునం దేది యెపుడు వచ్చునో యను విషయము మున్నగునవి తొల్కాప్పియమునఁ జెప్పఁబడలేదు. నన్నూలునఁ గలవు. "ఇ ఈ ఐ వ టి......" (నన్నూలు. ౧౬౨ సూ.) యొ. చే+అడి= చేవడి (ఎఱ్ఱనికాలు) ఏఏ యివళోరుత్తి = (ఏఏ ఇది యొకర్తె) మున్నగురీతిని 'ఏ' కారమునకుఁ దర్వాతఁ గొన్నియెడల 'ఇ' కారమును గొన్నిట 'య' కారమును నిల్చుట మున్నగు విశేషములును నన్నూలునఁ గలవు.

అ. VIII విష:—ప్రాచీన కర్ణాటమున స్వరసంహితలో నిల్చు 'యవ'ల వివరణము నాగవర్మాదులచేఁ జూపఁబడెను. "ఆ దివర్ణైకారేభ్యో యః" (కర్ణా. భూష. ౨౨ సూ.) "ఆకారము 'ఇ' వర్ణము 'ఏ' వర్ణము" అనునవి తుదిని గల శబ్దముల కచ్చు పరమగునపుడు 'య'కార మచట సంహితావ్యవధాయకముగా నిల్చును. ఉదా:—ఆ+ఎడె=ఆయెడె(ఆచోటు). శ్రీ+ఒడయం= శ్రీయొడయం. (శ్రీపతి). సలె+ఇర్పర్=సలెయిర్పర్ (బాగుగనున్నారు).

"అకారా చ్చావధారణే ఎ" (కర్ణా. భూష. ౨౩ సూ.)=అవధారకార్థకమగు 'ఎ' అనునది పరమగునపుడు హ్రస్వాకారమునకుఁ బరమందును యకారమె

సంహితా వ్యవధాయకముగ నిల్చును. ఉదా:—అతన+ఎ=అతనయె. (అతని యొక్క-యే).

"వో వృవర్ణాభ్యామ్" (కర్ణా. భూష. ౭౪ సూ.) ఉవర్ణ ఋవర్ణముల కచ్చు పరమగునప్పుడు 'వ' కారము సంహితా వ్యవధాయకముగ నిల్చును. ఉదా:—విధు+ఇల్లద+ఇరుళ్=విధు విల్ల దిరుళ్=(చంద్రుఁడు లేని రాత్రి). పూ+ఇల్లద=పూవిల్లద (పూవు లేనట్టి). పితృ+ఇవం=పితృవివం (వీఁడు తండ్రి). మొ. తక్కినయెడలఁ గొన్నిటఁ బరరూపసంధియుఁ గొన్నిటఁ బ్రకృతిభావమును నగును. ఐకారమునకుఁ బరముగ యకారమును "ఓ-ఔ"లకుఁ బరముగ వకారమును నిల్చుట మున్నగునవి క్వాచిత్కములగు విశేషవిధు లిందును గలవు.

ఆ. IX విష:—ఆ విషయమునందలి కాల్డువెల్లుగారి యితరవిషయముల వివరణ మిచట విమర్శింపఁ బడుచున్నది:—

'అ+వ+న్=అవన్' అనురీతిని దొరగారు ఛేదము చేయుట సరికాదు. "అ+అన్='అ+వ్+అన్=అవన్' అనురీతిని ఛేదముచేయవలయును. "అన్ఱై......" (తొల్కా. ౬౮౭ సూ.)=......ఆదిని నిర్దేశసర్వనామశబ్దమును (అ-ఇ-ఉ) దుదిని 'అన్-అళ్' ప్రత్యయములును గల శబ్దములు......మహన్మహతీవాచకములు." అనుచోప్పున 'అవన్' మున్నగువాని తుదిది 'అన్' ప్రత్యయము కాన-'అవన్' మున్నగువానిలో నుచ్చారణార్థము చేరినది వకారరూప హల్లుగాని 'అ'కారసహిత వకారము కాదు.

'అవన్=వాఁడు' మున్నగు వానిలో 'వ' కారాగమము కన్పట్టుచుండుటచేత 'య-వ' లలో వకారము సంహితా ప్రాథమికాగమమని దొరగారు వ్రాసిరి. కాని యకారాగమము సంస్కృత ప్రాకృతములందును బ్రసిద్ధమై యుండుటచేత (ఆ IV విష. చూ.) నట్లు చెప్పుట సరికాదు. యకారాగమము ప్రాచీనమనుటయు సరికాదు. (చూడు. ౨౦ XIV విష.) డా. గుండర్టు దొరగారట్లు చెప్పిరనుచు గాల్డువెల్లుగారు వ్రాసిరె కాని మలయాళమున 'వ' కారాగమము నశింపలేదు. తమిళమున వకారాగమము వచ్చుచోటులలోఁ గొన్నిట యకారాగమము వచ్చుట మాత్రము నిజము. ఉదా:—తమి-వల్ల+ఇడమ్=వల్లవిడమ్ (బలమైనచోటు) మలయాళ-వల్లయిడమ్, (ఇతరమైనచోటు). మలయాళమున 'వ' కారాగమము వచ్చుచోటులు పెక్కుగలవు. ఉదా:—తిరు+ఓణమ్=తిరువోణమ్ (శ్రీమంతమగు శ్రవణనక్షత్రము) పూ+అమ్బు=పూవమ్బు=(పుష్పబాణము). తడ+ఉన్ను=తడవున్ను (తడవుచున్నాఁడు). అ+ఇడమ్=అవిడమ్ (ఆచోటు). ఇ+ఇడమ్=ఇవిడమ్. (ఈచోటు). చొల్లార్న్న+అయోధ్య=చొల్లార్న్నవయోధ్య (పేరెక్కినయయోధ్య).

'చొల్లార్క్నయయోధ్య' అను యకారాగమ ఘటితరూపమును నవ్యముగా వచ్చినది. మలయాళమున స్వరసంహితా వ్యవధాయక వర్ణముల నుపేక్షించి ప్రకృతిభావముగ వ్రాయుటయుఁ గలదు.

య-వలు పదముల సంధులలోనే కాక ప్రకృతి ప్రత్యయ సంధులందును దమిళమున నగపడుచున్నవనుటకు దొరగారు "పుళియిల్ (చింతపండులో) పిలావిల్ (పనసపండులో)" అని యుదాహరించుట సరికాదు. 'చింతచెట్టులో - పనసచెట్టులో' అనవలెను. తమిళమున 'పలావిల్' అని యుండును. 'పిలావిల్' అనునది మలయాళపదము. మలయాళమున నిది 'ప్లావిల్' అనియు నున్నది.

సంస్కృతాదులలో నఞ్ సమాసమం దుత్తరపద మజాదియయినచో 'న' కారాగమము వచ్చి పూర్వపదము 'అన్-ఇన్-ఉన్' అనురూపముల నందుననియు ద్రావిడభాషలలో నఞర్థమున 'అ' కారము నిల్చుట లేమింజేసి యిండో జర్మానికు భాషలలోవలె ద్రావిడభాషలందు 'అన్-ఇన్-ఉన్' అనునవి యేర్పడ వీలులేదయ్యెననియు డా. కాల్డువెల్లుగారు ఈ విషయమునందె వ్రాసిరి. ఈ వ్రాఁతయు సరికాదు. సంస్కృత నఞ్ సమాసమున వచ్చు 'న' కారము స్వరసంహితలో నుచ్చారణార్థము వచ్చెడి 'య-వ' ల వంటి యాగమముకాదు. అది నఞ్ సమాసములోని 'న' శబ్దపురూపమె. 'న+ఏక' అనుచో నకారముచోట 'అ' కారము నిల్వఁగా నచటి స్వరసంహితలో నుచ్చారణ సౌకర్యమునకయి నకారాగమము వచ్చెననుట కేవలము నసత్యము. 'న=న్+అ' అనుభేదము చొప్పున సమాసములో 'న' శబ్దముచోట హల్ పరకత్వమున 'అ' కారము నిల్చి వ్యంజన నకారము లోపించును. ఉదా:— న+బ్రాహ్మణ=అబ్రాహ్మణ (బ్రాహ్మణుఁడు కానివాఁడు). స్వరపరకత్వము న వ్యత్యయ పరిణామముచేత 'న' శబ్దావరావతారమె యగు 'అన్' శబ్దము నిల్చును. న+ఏక=న్+అ+ఏక=అ+న్+ఏక=అనేక (ఒకటికానిది=పెక్కు) అనురీతిని రూపసిద్ధి గల్గును. నకుల-నక్షత్ర-నాకాదులగు కొన్ని శబ్దములలో 'న' శబ్దమె నిల్చిపోవును. 'అక్షత్ర' మున్నగు ననిష్టరూపములు గల్గనేరవు.

మఱియు ద్రావిడభాషలలో నిషేధార్థమున 'న' శబ్దమునకు మాఱుగ 'అ' శబ్దము నిల్చుటలేదని చెప్పుటయు సరికాదు. తమిళమున 'ఆ' శబ్దమును నాంధ్రకన్నడములలో 'అ' శబ్దమును ధాతుప్రయత్యయముల నడుమ నిల్చుట ప్రసిద్ధమై యున్నది. కన్నడములోని 'అ' శబ్దము పరస్థిత ప్రత్యయాదిగత స్వర పరరూపసంధిచే లోపించి చూపట్టకున్నదని తోఁచుచున్నది. లేదా కన్నడములోని క్రియాప్రత్యయముల (అమ్-అర్-మొ) మొదటి 'అ' కార

మును వ్యతిరేకార్థకముగా నెంచి పరిశిష్ట ప్రత్యయభాగములనె పురుషబోధక ములనుగా నెన్నినను క్షతిలేదు. సంస్కృతమున నిషేధార్థకములగు 'న-నా' అను రెండు శబ్దములును గలవు. అందుఁ దమిళములోని 'ఆ' శబ్దము సంస్కృత 'నా' శబ్దసంబంధి యనియు నాంధ్రకన్నడములలోని 'అ' శబ్దము సంస్కృత 'న' శబ్దసంబంధియనియు దలంచుట యుక్తము. (చూ. ౧౨౬ I మొ. V విభ).

"న. అవ్య. (నహ-బన్ధనే. డ) నిషేధే......" (శబ్దస్తో).

"నా. అవ్య. (నహ. డా) నిషేధే......" (శబ్దస్తో).

సంస్కృతమున వ్యతిరేకార్థక 'న' శబ్దము సుబంతములతోనె సమసించును. తిఙంతములతో వ్యస్తముగా నిల్చి యన్వయించును. ద్రావిడభాషలలో వ్యతిరేకార్థకములగు నీ 'అ-ఆ' శబ్దములు ధాతువులకును దిఙ్ఞులకును నడుమ నిల్చును. ద్రావిడభాషలలో వీనికి సుబంతములతో సంబంధము లేదు. సుబంతములతో "అల్ల-ఇల్ల" మున్నగువానికి మాత్రమె సహ ప్రయోగము వ్యతిరేకార్థమున సంప్రదాయసిద్ధమై యున్నది. కాని ద్రావిడ వైయాకరణులు పయిరీతి నుపదేశింపలేదు. డా. కాల్డువెల్లుగారు మున్నగువారు సంస్కృతసంబంధమును "అగ్గబుయ్యు" గా నెడఁబెట్టుచుందురు.

తొల్కాప్పియమున వ్యతిరేకరూపసాధనమే లేదు. ఆంధ్ర వైయాకరణులు "వ్యతిరేకాదా భావిని చాత్ స్యా" త్తని యిట్లు ధాతువులతుదిని వ్యతిరేకార్థక రూపములలో 'అ' శబ్దము నిల్చునని మాత్ర ముపదేశించిరి. అది 'న' శబ్దవైకృత రూపమని యెవ్వరును వచింపలేదు. వెనుక వ్రాసినరీతి నీ వ్యతిరేకార్థ ద్యోతక మనఁదగు 'అ' అనునది కన్నడమునఁ దిఙ్ఞుల సంధిలో లోపించుటచేతను గ్రి (చూ. ౧౨౬ I విభ.) యా ప్రత్యయములు 'అ' కారాదులుగ నుపదేశింపఁబడుటచేతను వ్యతిరేకార్థమున ధాతువులతుదిని 'వికరణ' మేదియు నిల్వదని సైతము వచింపఁబడెను. "ద - దప - వకారా స్తా భూతవతీ, వర్తమానా, భవిష్యన్త్యః" (కర్ణా. భూష. ౧౯౬ సూ.) 'నైవం నఞర్థే' (కర్ణా. భూష. ౧౯౭ సూ.)=భూతార్థమున 'ద' అనునదియు, వర్తమానార్థమున 'దప' అనునదియు భావిని వ కారాదులును నిల్చును. వ్యతిరేకార్థమున నిక్కేదియు నిలుచుట లేదు.

ఉదా:—కన్న, భూత - తాం మాడిదం = (తాను జేసెను) వర్త:—తాం మాడిదపం = (తాను జేయుచున్నాఁడు) భవిష్యత్ - తాం మాడువం (తాను జేయఁగలఁడు. చేయును) వ్యతిరేక:—తాం మాడం=(తాను చేయఁడు) మాడర్ =(చేయరు) మాడదు=(చేయదు). తమి - చెయ్యాన్=(చేయఁడు) చెయ్యార్ (చేయరు). చెయ్యాదు (చేయదు) చెయ్యా=(చేయవు) మొ. తెల్గు—చేయఁడు-

చేయరు. చేయదు - చేయవు - మొ. తమిళములో వకారాగమము వచ్చు చోటఁ దెలుగున 'న' కారము నిల్చునని దొరగారు వ్రాయుటయు సరికాదు. దొరగారట్టి యుదాహృతుల నియ్యలేదు. అట్టి యుదాహృతులును లేవు. స్వరపరకత్వమున ద్రుతప్రకృతికముల తుదిని ద్రుత 'న' కారము తెలుగున నిల్చును. కళలతుదిని 'య' కారము నిల్చును.

ద్రుత మనఁగా జరుగుట యని దొరగా రర్థము వ్రాసిరి. అదియు సరికాదు. ద్రుతమనఁగా ద్రుతినందు నది=ఒల్లనియెడల లోపించునది (చూ. వ్యా. సం. ౪౭ II విష).

౩౦. విష:—"ద్రుతరూపములయిన 'ని - ను'లపైనున్న 'క చ ట త ప'లు తెలుగున 'గ జ డ ద బ' లగును. ద్రుతమున (నకారపు పొల్లునకు) కే హల్లుపర మయినను దానిచో 'ని–ను' లు వికల్పము గానిల్చును. హల్పరకత్వమున ద్రుతముచోట బిందువు సైతము నిల్చును. కొన్ని సంహితలలో నుచ్చారణ సౌకర్యమునకయి యజవమున వకారము నిల్వఁదగిన చోటులందుఁ దెలుఁగున 'మ' కారాగమము సయితము వచ్చును" (కాల్డు. ౧౭౫ పుట).

విమర్శము:—అజవమున వకారము స్వరసంహితలో నిల్చును, అట్టిచోటఁ దెలుగున 'న' కారముగాని మకారముగాని నిల్చుట కేవలము నసంభవము. కావుననె దొరగా రట్టి యుదాహృతుల నియ్యలేదు. ఈ విషయము పైని వ్రాయఁబడియె యున్నది. కాల్డువెల్లుగారి యీ ప్రపంగమె ద్రుత 'న' కారము స్వరసంహితలోని 'య వ'ల వంటిది కాదని విశదపఱుచుచున్నది. స్వర సంహితలోనేకాక హల్‌పరకత్వమందును నిల్చు 'న' కారము శబ్దావయవమె యగునుగాని స్వరసంహితావ్యవధానమునకై చేరినది కాదనుటలో సందియ మేమున్నది?

౩౧. విష:—"సంహితలో వచ్చు 'న - య' ల కన్న 'మ' కారము ప్రాచీనతరమని యీవఱకుఁ జెప్పి యున్నాను. (ఇది ఖండింపఁబడెను. చూడు. ౨౧ XIV విష.). ప్రాచీన కన్నడమునఁ గొన్ని నామముల ద్వితీయైకవచనము నందలి ప్రకృతిప్రత్యయ స్వరసంహితలో నకార వకారములు నిల్వక 'మ' కారము నిల్చుట యగపడుచున్నది. ఉదా:—గురు – ద్వితీ – 'గురువమ్' అనుటకు మాఱుగా 'గురుమమ్' అనియు నుండవచ్చును. తుళుభాషలోఁ బ్రాచీన 'వ' కారము 'మ' కారముగాను 'ఙ్బ' అనునదిగాను మాఱును. ఉదా:—తుళు - మేర్=ఇమర్=తమి - ఇవర్ (వీరు). తుళు - ఇమ్బె=తమి - ఇవన్ (వీఁడు) తుళు - ఆమె=తమి - అవన్. (వాఁడు). ఇతర ద్రావిడ భాషలలోని వకారరూపములను బట్టి చూడఁగాఁ దుళులోని మకారరూపము

నవ్యమని తోఁచుచున్నది. గ్రామ్యాళవములో మకారముగల కొన్నిచోట్ల గ్రాంథికాళవమునందును శిష్టవ్యవహారమందును వకారమె కన్పట్టుచున్నది. ఉదా:—గ్రామ్య - ఎన్నమో. గ్రాంథిక - ఎన్నవో. (ఎన్న + ఓ)=(తెల్గు - ఏమో)" (కాల్డు. ౧౭౬ పుట).

విమర్శము:—కన్నడమున. 'గురు+అమ్=గురువమ్' అనుచోట 'గురుమమ్' అనియుఁ గలదనుట సరికాదు. పల గన్నడమందు లేదు సరేకదా తుదికి హాళాసగ్రన్నడమందు సైత మట్టి సంహితా 'మ' కార ఘటితరూపము లేదు. "వోవృ వర్ణాభ్యామ్" (కర్ణా. భూష. ౨౮ సూ.) అను సూత్రము చొప్పున నచటి స్వరసంహితలో వకారాగమము మాత్రమే కల్గును. "గురు+అమ్=గురువమ్" (గురువును) అని మాత్రమె యగును. 'మ న' లలో మకారము ప్రాచీన తర మనరాదని యీావలకే విశదీకరింపఁబడెను. (౨౧ XIV విష. చూ).

3_౨. I విష:—"సంస్కృతమునఁ బ్రకృతిప్రత్యయసంధిలో వైదిక భాషలో యకారము వచ్చుచోట లౌకికసంస్కృతమున 'న' కారము వచ్చును. తెల్గున వచ్చు 'మ-న-య' అనునాగమములలో మకారాగమము ప్రాచీనతమ మని తోఁచెడిని. తెనుఁగులో 'న' కార-'య' కారములు వచ్చు చోటులందుఁ దమిళమున 'వ' కార-'య' కారాగమములు వచ్చునని యీావలకు వ్రాసియె యున్నాను. అళవమునసైతము 'వ' కారమువచ్చుటకు మాఱుగాఁ గ్రియాపదములం దనేకస్థలములలో 'న' కారమువచ్చుట కలదు. తచ్ఛబ్దా మహత్ప్రథమా బహువచనము 'అవై' అని యుండుటచేతఁ బ్రథమ పురుష బహువచన క్రియల తుదిని 'అవై' (అవ) అని నిలువవలసియుండఁగా 'అన' అనునది నిలుచుచున్నది. ఉదా:—ఇరుక్కి-న్టన (ఉన్నవి). కాఁబట్టి 'అవన్ (వాఁడు) అవర్ (వారు)' అనుసర్వనామములు వకారముతోనున్నను బురుష బోధక క్రియాప్రత్యయములలో 'అనన్-అనర్' అని యిట్లు 'న' కారముతోనె గ్రాంథికాళవమున నున్నవి. ఉదా:—ఇరున్దనన్=(ఉండెను) 'ఇరున్దవన్' అని యుండవలయునుగదా. అమహదర్థకములగు (విధేయవిశేషణ) క్రియల బహువచనములయందుసైతము 'న' కారముకొన్నియెడల నగపడుచున్నది. ఉదా:—పొరుళన (నిజమైన వస్తువులు)='పొరుళవై.' యనియుండవలయునుగదా. 'వరున=(రాఁగలవి)=వరువవై' అనియుఁండవలసినదిగదా. అళవక్రియల భూతార్థకరూపములందును భూతార్థకవిశేషణ రూపములందును 'న' కారమె యగపడుచున్నది. ఉదా:—కాట్టినేన్=(చూపితిని). కాట్టిన=(చూపినట్టి). వీనిలో 'కాట్టి' అనుదానిపైని 'ఏన్-అ' అనునవి చేరునపుడు సంహితలో 'న'

కారమె వచ్చెను. 'కాట్టిన' అనుదానికి 'కాట్టియ' అనురూపాంతరము వెలయు చుండుటచేత వీనిలోని 'న' కారము సంహితలో వచ్చినయాగమమె యని చెప్ప నగును." (కాల్డు. ౧౭౬-౧౭౭ పుట.) (కాల్డువెల్లుగారి గ్రంథమున '3_౨ I 3_౨ II' అను రెండువిషయములును నొక్క-పేరాగా వ్రాయఁబడెను. (చూడు. కాల్డు. ౧౭౭ పుట. మూఁడవ యెడిషను.) అట్లయినను విషయభేద మునుబట్టి దానిని '3_౨ I 3_౨ II' అను రెండు విషయములుగాఁ జేసితిని. వీని విమర్శములలో '3_౨ IV, V, VI, VII విషయములు 3_౨ I' విషయ మునకు విమర్శములనియు '3_౨ VIII, IX' విషయములు 3_౨ II విషయ మునకు విమర్శమనియు గ్రహింపవలెను).

3_౨. II విష:—"ఇట్లు సంహితలో నకారాగమము వచ్చుట సంఖ్యా వాచకములలో సైతము గలదు. తమిళమున 'పది' అనుదానికి మాఱుగా 'పత్తు' అనివాడఁబడును. ఏకాదిసంఖ్యావాచకములు పరమగునట్టి సమాస మున నిది 'పది' అనియేయుండును. వింశత్యాద్యర్థక పదములకుఁ బరముగ నిల్చు 'పది' శబ్దముచోట 'పదు' అనురూపము నిల్చును. దీనికజాది సంఖ్యా వాచకము పరమగునట్టి సంహితలో 'న' కారాగమము ప్రాచీనాఱవమునందును 'వ' కారాగమము నవీనాఱవమునందును వచ్చును. ఉదా:—

| అఱవము | | తెలుఁగు |
|---|---|---|
| పదినైన్దు | — | పదిహేను. |
| పదినాఱు | — | పదిహారు=పదహారు. |
| పదినేలు | — | పదిహేడు. |

అఱవమున 'పదిన్మూన్తు' (పదుమూఁడు) అనుదానిలో నచ్చుపరమందు లేనపుడును 'న' కారము గన్పట్టుచున్నది. తెల్గు—పదుమూడు-కన్న-పాది మూరు. ఇట్లుండుటచేత నఱవమునందలి 'న'కార మూర్ధ్వాధస్సంఖ్యావాచక ముల సామ్యమున (Analogy) సంభవించి యుండును. డా. గుండర్టుగారు పది శబ్దపు విభక్తిరూపము 'పదిన్' శబ్దమనియు నక్కారణమునఁబై సమాసములలోని నకార మాగమము కాదనియుఁ బయికారణముచేతనే "తమి-పదిన్మూన్తు. మలయా-పదిన్మూన్ను. తమి-ఒమ్బదిన్-ఆయిరమ్ (తొమ్మిదివేలు) ఎణ్ బదిన్కోడి (ఎనుబదికోట్లు)" అనుశబ్దములలో నయితము 'న' కారము కన్పట్టు చున్నదనియుఁ జెప్పిరి. కాని తెల్గులోని సంఖ్యావాచకముల సమాసములలోని హ కారము విభక్తిరూపమనుటకు (పదిహేను-మొ.) వీలుపడనందున నట్టియఱవ సమాసములలోని 'న' కారము విభక్తిరూపము కాదనుట యుక్తము. విభక్తు లలో 'న' కారరూపములేని 'తుళు-కూర్గు' భాషలలో సైతము 'న' కారము

కన్పట్టుచుండుటచేత నఱవమునందలి 'న' కారము సయితము విభక్తిరూపము కాదనఁదగును. ఉదా:—కూర్గు-పదునన్‌జె (పదునేను) పదునారు (పదునాఱు) పదునేళు (పదునేడు) తుళు-పద్నొర్మ్బ (పందొమ్మిది)" (కాల్డు. ౧౭౭-౧౭౮ పు).

3_౨. III విమ:—పయి కాల్డువెల్లుగారి యాశయముల నామోదించి 'ఆం. భా. వి.' కర్తగారు స్వీకరించిరి. "సంఖ్యావాచకములలో 'పదియేను=పదిహేను=పదునేను' అనుమూఁడు రూపములలోను 'య-హ-న' అనునవి ప్రకృతిభావ నివారణకు ఏర్పడినవనుట స్పష్టము. అరవమునఁ బ్రామాణిక భాషలో 'కాట్టి+న్+అ' (కాట్టిన) 'కాట్టి+య్+అ' (కాట్టియ) అను రెండు రూపములును వాడుకలో నున్నవి. ఇక్కడి 'న' కారము ప్రకృతిభావ నివారణ కొఱ కేర్పడినదే యనుట నిస్సంశయము. ఇట్లె అరవమునందలి అమహద్బహు వచనమున 'ఇరుక్కిన్టన (ఉన్నవి) ఇరుక్కిన్ట+(న్)+అ' అని (ఇది పొరపాటు—'ఇరుక్కిన్టు+అన్+అ' అని ఛేదము) నకారము సంధినాపుటకు వచ్చినది. న్యాయముగా 'అవ-అవై' అను శబ్దములలో నున్న 'వ్' కారము సంధినాపు టకు వచ్చి యుండవలెను. (C. G. D. ౧౭౭ పు.)" (ఆం. భా. వి. 3_౨౧ పుట).

3_౨. IV విమ. విమర్శము:—వైదిక లౌకిక సంస్కృతములలోని స్వర సంహితలలో 'య-వ' లు గలవని చెప్పిరేకాని (చూ. 3_౨ I విమ.) యందు లకు దొరగా రుదాహృతుల నియ్యలేదు. తెలుగులోని 'య-న-మ' ' అను సంహితా వ్యవధాయక వర్ణములలో మకారము ప్రాచీనమనుటయుఁ దెలుఁ గున, 'య న' లు వచ్చుచోఁ దమిళమున వకారము వచ్చుననుటయు సరికాదని యీవఱకె వ్రాయఁబడెను (30-3౧-విమ. చూ.) స్వరసంహితలో మకారము నిల్చుటకును దొరగా రుదాహృతి నియ్యలేదు. అట్టి యుదాహృతియు లభింప నేరదు. అఱవక్రియల స్వరసంహితలో వకారము రావలసినచోట నకారము నిల్చుననుచు దొరగారు చూపిన యుదాహృతులు (చూ. 3_౨ I విమ) సరియైనవి యుండలేదు. "ఇరుక్కిన్టు+అవ=(అవై)=ఇరుక్కిన్టవ" ('అ+అన్=అ+వ్+అన్=అవన్' (వాఁడు) అనునట్లె 'అ+ఐ=అ+వ్+ఐ=అవై' అని యగునని తాత్పర్యము) అని యుండవలసి యుండఁగా 'ఇరుక్కిన్టన' (ఉన్నవి) అని సిద్ధించెను గాన వకారాగమముచోట నకారాగమము వచ్చెనని యిట్లు డా. కాల్డువెల్లుగా రయథార్థవిభాగము చేసిరి. 'అవై' (అవి)=(మలయా-అవ) అను నమహత్సర్వనామము 'అవ' అనురూపముతోఁ గ్రియల తుదిని నిల్చునని దొరగా రనుకొనుట పొరపాటు. 'అవై=అవ్' (అవి) అను రెండును దమిళ మునఁ దచ్ఛబ్దామహద్బహువచనరూపములు. వాని సంక్షేపరూపమగు 'అ' అనునది ప్రథమపురుషమందలి యమహద్బహువచన ప్రత్యయమని గ్రహింప

వలయును. 'అ-ఆ-వ......' (తొల్కా. ౨౦౦ సూ.)='అ-ఆ-వ' అనునవి తుదినిగల క్రియ లమహత్ప్రథమపురుష బహువచనరూపములు. 'ఆ' అను నది వ్యతిరేకార్థకము. 'వ' అనునది భవిష్యదర్థకము. కాన "ఇరు+కు+ ఇన్ఱు+(అన) అన్+అ=ఇరుక్కిన్ఱన=(ఉన్నవి)" అను ప్రక్రియ యథార్థమును శాస్త్రీయమును సంప్రదాయ సిద్ధమును నని యెఱుంగునది. తమిళమునఁ బురుష బోధక ప్రత్యయములు చేరకముందే యెల్లపురుషములందును 'అన' అనునది భూత వర్తమాన క్రియలయందుఁ జేర్పఁబడెడిదని గ్రహింపనగును. ఉదా:— చెయ్+ద+అన=అన్+అన్=చెయ్దనన్=(చేసెను=చేసినాఁడు). (రూపా- చెయ్దాన్). చెయ్దనర్=(చేసిరి) (రూపా. చెయ్దార్)......చెయ్+ద+ అన=అన్+ఎన్=చెయ్దనెన్=(చేసితిని). (రూపా-చెయ్దేన్). చెయ్దనెమ్= (చేసితిమి). (రూపా-చెయ్దేమ్).........చెయ్+ద+అన=అన్+ఐ=చెయ్ దనై=(చేసితివి) (రూపాం-చెయ్దాయ్) చెయ్దనిర్=(చేసితిరి) (రూపా. చెయ్ దీర్). (నన్నూ. 'అన్......౧౪౦ సూ.)'.

ఇవి పురుషబోధక ప్రత్యయములు చేరిన 'అన' ప్రత్యయాంతములగు నర్వాచీనరూపములు. తొల్కాప్పియమునాఁటి కీ పురుషబోధక ప్రత్యయములు చేరని 'అన' ప్రత్యయాంతరూపములును నుండెడివి.

"మున్నిలై......" (తొల్కా. ౨౦౬ సూ.) "మధ్యమపురుష క్రియ లును, నాశీరాద్యర్థకములును, నసమాపకక్రియలును, 'ఇల్లై' (లేదు) శబ్దమును, వేఱు=(భిన్నము) శబ్దమును 'చెయ్మ్మన' మున్నగు 'అన' ప్రత్యయాంతక్రియ లును, 'ఉమ్' తుదినిగల క్రియలును, 'చెయ్ద' మున్నగు క్రియాజన్య విశే షణములును," అను నీ యెనిమిది విధములగు పదములును మహ దమహత్తులు రెంటను నేకరీతిని యుండును......ఉదా:—చేయ్మ్మన=(చేయుదును-చేయు దుము) (౨౦౬-౨౦౯ సూ.). తొల్కా. ౨౧౧ సూత్రమందును 'అన' ప్రత్యయము పేర్కొనఁబడెను. 'అన్నవెన్నుమ్......' (తొల్కా. ౨౧౧ సూ.). ఇట్టి ప్రాచీనతమములగు 'అన' ప్రత్యయాంత క్రియలలోని 'న' కారము 'వ' కార స్థానమున వచ్చిన స్వరసంహితా వ్యవధాయక వర్ణమనుట పొరపాటు. 'అవన్' మున్నగు తచ్ఛబ్దరూపములకుఁ బ్రసక్తిలేని "చెయ్దనెన్-చెయ్దనెమ్-చెయ్ దనై-చెయ్దనిర్" మున్నగురూపములందును నీ 'అన' ప్రత్యయము వెలయు చున్నదే! ఇంక దొరగారి యాశయము భ్రాంతిమూలకమనుటకు సందియము లేదుగదా.

ఇట్లే 'ఇరున్దనన్' (ఉండినవాఁడు) అనుచో 'ఇరున్ద+అవన్=అనన్' అని దొరగారి యాశయముచొప్పున ఛేదము చేయుట సరికాదనియు (చూ. 3_౨ I విష.)

'ఇరున్ద+(అన)=అన్+అన్' అనిచ్ఛేదమనియు నెఱుంగునది. ఇందలి మొదటి 'అన్' అనునది మీఁద వివరించినరీతిగల ప్రాచీనమగు 'అన' ప్రత్యయమనియుఁ దరువాతి 'అన్' అనునది కాలక్రమమునఁ జేరిన ప్రథమ పురుషైకవచన ప్రత్యయమనియు నెఱుంగనగును. ఇట్లె "ఇరున్దనర్=(ఉండిరి) ఇరున్దనెన్ (ఉంటిని) ఇరున్దనెమ్ (ఉంటిమి) ఇరున్దనయ్=ఇరున్దనై (ఉంటివి) ఇరున్దనిర్ (ఉంటిరి)" అను స్థలములయందును వకారాగమ ప్రసక్తియే లేదని గ్రహింపవలెను.

3_౨. V విమ:—పయిరీతినె 'పొరుళన'=(నిజమైన వస్తువులవంటివి) అనుచోటనయితము భిన్నరీతి నెన్నునది. "తమి. పొరుళ్+అనై=పొరుళనై. మలయా-పొరుళవ. తమి-పొరుళన" అనురీతిగలదొరగారి (చూ. 3_౨ I విమ.) యాశయము సరికాదు. పయి నుదాహరించిన తొల్కాప్పియ సూత్రము (౨౦౦ సూ.) చెప్పిన 'అ' అను నమహత్ప్రథమ పురుష బహువచన ప్రత్యయము నిల్వఁగా "పొరుళ్+అన్+అ=పొరుళన" అనురూపమేర్పడెననియు నందు సంహితావ్యవధాయక వకారాగమ ప్రసక్తి లేదనియు నెఱుంగనగును. ఇందలి 'అన్' అనునది సదృశార్థకము. దీనివ్యుత్పత్తి నీ క్రిందిరీతి నరయునది. "అఱ్ఱు=(అట్టిది). అన్నన్=అనన్=(అట్టివాఁడు). అన్నళ్=(అట్టిస్త్రీ). అన్నర్=(అట్టివారు)" అను రూపములు తమిళమున వెలయుచున్నవి. 'పొరుళన' అనునది వాఙ్మయమున మిక్కిలి యరుదు. తమి-పొరుళ్=(నిజమైన వస్తువు). పొరుళ్+అ=పొరుళ=(నిజమైనవస్తువులు) ఇది సహజ బహువచనము. తమి-పొరుళ్+అన్+అ=పొరుళన=(నిజమైనవస్తువులవంటివి). ఇట్టిది సదృశార్థక శబ్దమేళిత రూపమని గ్రహింపనగును. 'పొరుళన=వస్తువు' అనుచో 'న్' ఆగమము.

3_౨. VI విమ:—దొరగారు 'వరున' అనుదానివిషయమున వ్రాసినదియు (3_౨ I విమ. చూ.) సరికాదు. "వర్=(వచ్చు) ధాతువు. తమి-వరువనై. మల-వరువవ=వరువ=వరున"=(రాఁగలవి) అను ప్రక్రియచెప్పిన వకారము చోట నకారము నిల్చెనని దొరగారు తలంతురు. 'వరుప' అనునది తమిళమున నున్నను నది 'వరుప' అను భావ్యర్థకరూపమునుండి యేర్పడినది. "వరు+ప్=వరుప్=వరువ్+అ=('అవై-అవ్' అనువాని సంక్షేరూపమగు బహువచన ప్రత్యయము. చూ. పయిని. తొల్కా. ౨౦౦ సూ.) వరువ" అని యిట్లు దాని ప్రక్రియ నరయునది. కావున 'వరుప' అనుదానిలోని వకారము సంహితావ్యవధాయక వర్ణము కాదు. "వరుప=వరువ=వరుపవై" అను తమిళరూపముల కంటె 'వరున' అనునది మిక్కిలి ప్రాచీనము. అర్వాచీనరూపములనుండి కేవల ప్రాచీనమగు 'వరున' అనురూప మేర్పడె ననుట కేవలము నసంభవము. 'వరున' అను ప్రాచీనరూపపు ప్రక్రియ నీ క్రిందిరీతి నరయనగును. "వర్+

ఉన్ + అ = వరున = (వచ్చునవి)" అనియద్దాని ఛేదము సరయనగును. ఇది తద్ధర్మార్థక విశేషణరూపము. ప్రాచీన తమిళమున ధాతువు తుదిని-'ఉన్'. లేదా 'న్' అనునది యేకవచనమునందును, 'ఉమ్' లేదా 'మ్' అనునది బహువచనము నందును జేరుటచేతఁ దద్ధర్మార్థము బోధ్యమగుట సంప్రదాయము. ఇపుడు 'ఉమ్' అనునది చేరుటచేతనే యేకత్వబహుత్వములు బోధ్యములగుచున్నవి. ఉదా:—తమి - వరుమ్ = అది వచ్చును. అవి వచ్చును. ప్రాచీనకాలమందన్నవో-తమి-వరున్ = అదివచ్చును. వరుమ్ = అవివచ్చును. తెరియున్ = తెలియునది. తెరియుమ్ = తెలియునవి. తెలుఁగున 'ఉన్' రూపమె యేకత్వ బహుత్వబోధకము- తెలియున్ = తెలియునది. తెలియునవి. మొ. తమిళ మున 'తెరి' అనునది ధాతువు. 'తెలియు' అని దాని కర్థము. తెరి + ఉన్ + అన్ = తెరియునన్ (తెలియువాఁడు = తెలిసెడువాఁడు). తమి- తెరియుమవన్ = (తెలిసెడువాఁడు). తెరియుమవర్ (తెలిసెడువారు) తెరియునై = (తెలిసెడు వాఁడవు) (ఉత్తమైక బహువచన రూపములును మధ్యమ బహువచన రూప ములును నిట్టివి చూపట్టలేదు).

3-౨. VII విష:—వయిరీతినే "కాట్టి + న్ + ఏన్ = కాట్టినేన్ = (చూపితిని.) కాట్టి + న్ + (అవై) = అవ = కాట్టినవ = కాట్టిన = కాట్టియ = (చూచినట్టి)" అను దొరగారి ప్రక్రియ (చూ. 3-౨ I విష.) సరికాదు. 'కాణ్' (చూచు) అనునది తమిళధాతువు. దానిపైని ప్రేరణార్థమున 'తు' అనునది చేరఁగా 'కాణ్ + తు = కాట్టు' అని యేర్పడును. దాని పయిని భూతార్థమున 'ఇన్' అనునదియుఁ బురుషబోధక ప్రత్యయములును నిల్వఁగా "కాట్టు + ఇన్ + ఏన్ = కాట్టినేన్ (చూపితిని)" మున్నగు రూపము లేర్పడును. కావున 'కాట్టు + ఇన్ + అ = కాట్టిన = (చూపిన)' అని దాని ఛేదమును నర్థమును నెన్నవలెను. ఇందు స్వరసంహితా వ్యవధాయక 'వ' కారాగమమునకుఁగాని 'న' కారాగమ మునకుఁగాని ప్రసక్తియే లేదు. "కాట్టు + ఇన్ + అ = కాట్టిన = (చూపిన)" అను చోటి 'న' కారము తెల్గునందలి 'చూపిన-చూచిన-చదివిన' మున్నగువానిలో వలెనె యావయవిక భూతార్థక 'న' కారమెకాని యా 'న' కారము ప్రకృతిభావ నిరాసమునకయి యుచ్చారణ సౌకర్యార్థమై వచ్చునట్టి యాగమ 'న' కారము కాదు. 'తడఅ......' (నన్నూలు. ౧౪-౨ సూ.) = "'త్ -ట్ -ఱ్ -ఇన్'-అను నవి భూతార్థద్యోతక ప్రత్యయములు. ఉదా:—"చెయ్ + త్ + ఆన్ = చెయ్తా (దా) న్ = (చేసెను) పో + ఇన్ + ఆన్ = పోయినాన్ = పోనాన్ = (పోయెను) మొ." అని యిట్లు నన్నూలున 'ఇన్' అనునది భూతార్థక ప్రత్యయమని చెప్పఁ బడెను. ఇట్టి భూతార్థకమగు 'ఇన్' ప్రత్యయములోని 'న' కారము లోపింపఁగా నచటి స్వరసంహితలో యకార ముచ్చారణ సౌకర్యార్థకమగుచు నిల్వఁగా

'కాట్టిన్=కాట్టి+అ = కాట్టియ' అను రూప మేర్పడనగును. 'కాట్టినేన్' మున్నగువానిలోని 'ఇన్' ప్రత్యయసంబంధి 'న' కారము లోపింపదు. 'కాట్టి యేన్' అను రీతిగలరూపము లీ యర్థమున లేవు. మఱియు 'చొల్+ఇన్+అ' అనుచో 'ఇన్' ప్రత్యయములోని 'ఇ' కారము లోపించి 'న' కారమె నిల్చును. ఉదా:—చొల్+(చెప్పు) ఇన్+అ=చొల్+న్+అ=చొన్న=(చెప్పిన). పయి సందర్భమునుబట్టి 'కాట్టిన' మున్నగువానిలోని నకారము స్వరసంహితలోఁ బ్రకృతిభావ నివారణమునకు వచ్చెడి యాగమము కాదనియు నావయవికమె యనియు నిశ్చితమగుచున్నది.

3_౨. VIII విష:—సంఖ్యావాచకములలోని నకారము సైతము స్వర సంహితాగమము కాదు. దొరగా రెట్లువ్రాసిరో కాని (చూ. 3_౨ II విష.) నవీనాఱవమునందు సైతము పదిశబ్దపు స్వరసంహితలో వకారాగమము వచ్చుట లేదు. కావుననె దొరగారట్టి రూపముల నుదాహరింపలేదు. 'పదినైన్దు' మున్నగు దొరగా రుదాహరించిన రూపములు (3_౨ II విష. చూ.) ప్రాచీన ములె. వానిలోని 'పదిన్' అను చోటిది సంహితా 'న' కారము కాదు. అది సముచ్చయాద్యర్థ విశేషబోధక శబ్దావయవ నకారము. తెల్గులోని "పది+ ఉన్+ఐదు=పదునైదు" మున్నగుచోటులలోని 'ఉన్' అను చార్థకశబ్దమె యిందులకు నిదర్శనము. కాని తమిళ వైయాకరణు లిట్టి "ఇన్" శబ్దమును 'చా (సా)రియై' అని వాడుదురు. కాన నిది యుచ్చారణసౌకర్యార్థక స్వర సంహితా వ్యవధాయక వర్ణము కాదు. తమిళమున 'పది' శబ్దము లేదు. తమిళ 'పత్తు' శబ్దము దశార్థకము. దానికి 'ఒన్రు' మొదలగు సంఖ్యావాచకములు పరమగునపు డందలి 'తు' అనుభాగము లోపింపఁగా మిగిలిన 'పత్' అనుదాని మీఁద 'ఇన్' అను 'చా (సా)రియై' నిల్చును. ఉదా:—పత్తు+ఆఱు=పత్+ ఇన్+ఆఱు=పతినాఱు. అర్వాచీన తమిళ సరళోచ్చారణముచొప్పున 'పది నాఱు' అనురూపము సిద్ధించును. ఇట్లె 'పదినైన్దు. పదినేఱు' అనువాని సిద్ధి నరయునది. 'ఒన్రుమొదలాక......' (తొల్కా. ४३४ సూ.)='ఒన్రు' (ఒకటి) అనునది మొదలు 'ఎట్టు' (ఎనిమిది) అను దానివఱకుఁ గల సంఖ్యా వాచకములు పరమగునపుడు పత్తు శబ్దముయొక్క 'తు' అనుభాగము లోపించును. లుప్తశేషమునకుఁ బరముగ 'ఇన్' అను 'చా (సా)రియై' నిల్చును. ఇరణ్డు శబ్దము పరమగునపుడు మాత్రము 'ఇన్' అనునది రాదు. ఉదా:—పత్తు + ఒన్రు = పత్ + ఒన్రు = పత్ + ఇన్ + ఒన్రు = పతినొన్రు= పది నొన్రు=(పదునొకండు). ఇట్లె "పదిన్మూన్రు-పదిన్నాన్కు—పదినైన్దు-పదినాఱు -పదినేఱు-పదినెట్టు" అనురూపముల సిద్ధి నరయునది. వీనియందలి 'ఇన్' శబ్దము 'చార్థమును బోధించుచున్నది. "పత్తన్ ఒట్టు......" (తొల్కా.

४3८ సూ.) ఇరణ్డుశబ్దము పరమగునపుడు పత్తుశబ్దములోని 'తు' వర్ణమేకాక తక్కిన తకారము సయితము లోపించును. దానిచో నకారద్వయము నిల్చును. ఉదా:—పత్తు+ఇరణ్డు=ప+న్+న్+ఇరణ్డు=పన్నిరణ్డు=(పండ్రెండు).

"ఆయిరమ్......" (తొల్కా. ४3౬ సూ.)=ఆయిరమ్ శబ్దము పరమగునపుడును 'పత్తు' శబ్దమునకుఁ బైకార్యము లెల్ల నగును. అనఁగా 'తు' వర్ణము లోపించుట 'ఇన్' అనునది వచ్చుట సంభవించునని తాత్పర్యము. ఉదా:—పత్తు+ఆయిరమ్=పదినాయిరమ్=(పదివేలు) ఇందలి 'ఇన్' శబ్దము 'రెట్టి' అనునర్థము నిచ్చుచున్నది. పదిచే గుణితమగు 'వేయి' అని యర్థము.

"నిఱైయుమ్ అళవుమ్......" (తొల్కా. ४3౭ సూ.)=తూనికను గొలతను దెల్పు శబ్దములు పరమగునపుడును 'పత్తు' శబ్దపు 'తు' వర్ణము లోపించును. అచట 'ఇన్' అను 'చా (సా) రియై' వచ్చును. ఉదా:—పత్తు+ కలమ్=పత్+ఇన్+కలమ్=పదిన్కలమ్=(పదికలములు) (కలమనఁగాఁ బండ్రెండు తూములు) (ఇచటి 'ఇన్' శబ్దము 'పరిమితిగల' అనునర్థ విశేషమును బోధించుచున్నది).

పయిరీతిని స్వరసంహిత లేనపుడు సయితము తమిళమున 'ఇన్' అనునది కన్పట్టుచుండుటచేత నీ నకారము 'యవ'లవలె స్వరసంహితలో నుచ్చారణ సౌకర్యార్థముగ వచ్చిన వర్ణమనుట సరికాదు. పన్నిరణ్డు-పదిన్మూన్ఱు-పదిన్నాన్కు-'పదిన్కలమ్'-పదిన్తొడి (పదిపలములు) మున్నగు ననేక హలాది శబ్దములు పరమగునపుడు 'ఇన్' సారియై వచ్చునని ప్రామాణికుఁడును బ్రాచీనతముఁడునునగు తొల్కాప్పియరు చెప్పుట నరయక దొరగారు "ఊర్ధ్వాధస్సంఖ్యావాచకముల సామ్యమున" అనుచు సామ్యసిద్ధాంతమును (Analogy) జేరఁబొఱుట కేవలము నయుక్తము. పై నుదాహరించిన తొల్కాప్పియ ప్రక్రియనుబట్టి పయివానిలోని 'పదిన్' శబ్దము విభక్తిరూపమనెడి డా. గుండర్టుగారి యాశయము సయితము ప్రాచీనభాషాలక్షణ పరిశీలన రాహిత్యకృతమె యనఁదగును. కేవలము నాధునికములగు 'పదిహేను-పదహారు' మున్నగు నాంధ్ర వ్యావహారిక శబ్దములలో హాకారముండుటచేత 'పదినైన్దు' మున్నగు ప్రాచీన తమిళ శబ్దములలోని నకారము సంహితా నకారమనక తీరదనుట-కేవలము నసంగతము.

పదునైదు మున్నగు ప్రాచీనాంధ్ర శబ్దములలో 'ఉన్' అనెడి సముచ్చయార్థక శబ్దము తమిళములోని 'ఇన్' అనుదానికి సరిగ వెలయుచున్నది. కుడగు తుళు భాషలలోని యీ శబ్దములందలి నకారము సైతము 'చా' ర్థకమె కాని యుచ్చారణార్థకము కాదు.

3_౨. IX విష:—వింశత్యాద్యర్థక తమిళ శబ్దములందు 'పదు' అని నిల్చునని నెడు దొరగారి వాక్యము సయితము సత్యము కాదు. (చూ. 3_౨ II విష.) (చూ. కాల్డు. ౧౭౭ పు.). "ఇరుప ∴ తు. (ఇరువది) ముప్ప ∴ తు (ముప్పది) నాల్ప ∴ తు (నలువది) ఐమ్ప ∴ తు (ఏఁబది)" మున్నగురీతిని (చూ. తొల్కా. ౪౩౯ సూ. మొ. ౪౪౫-వ. సూ.) ప్రాచీన తమిళమునందలి వింశత్యాద్యర్థక శబ్దములు తొల్కాప్పియరుచేఁ జూపఁబడెను. వానిలోని 'ప ∴ తు' అనునర్ధ మాత్రికాయ్ద పూర్వక 'తు' వర్ణమును గొంత యొత్తిపలుకుట ప్రాచీన తమిళ సంప్రదాయము. పత్తుశబ్దములోని 'త్తు' అనుదానికంటెఁ గొంత తేలికగాఁ బల్కవలయును. "చార్‌న్‌దువరిన్......" (తొల్కా. ౧౦౧ సూ.) = "ఇతరాక్షరములతోఁ గూడియే పలుకఁబడునవని చెప్పఁబడిన మూఁడక్షరములును (పొట్టివగు 'ఇ-ఉ' వర్ణములును '∴' అనులిపిగల అయ్‌దమును) దా మే యక్షరముపై నిల్చునో దాని యుత్పత్తిస్థాన మునసే జనించు స్వభావముగలవి" అని తొల్కాప్పియమునఁ జెప్పఁబడెను. కాని నేఁడిది తమిళులచేత జిహ్వామూలీయమువలెఁ బల్కఁబడుచున్నది. "అచ్త్వమును హల్త్వమును గల్గినట్టియుఁ గొన్ని విషయములలో సంస్కృత విసర్గమును బోలునట్టియు వర్ణ మొకటి యఱవమునఁ గలదు. దానికి 'ఆయ్‌దమ్' అని పేరు. అది కంఠ్య హాకారము వంటి యుచ్చారణముగలది." (కాల్డు. ౧౩౦ పుట) (చూ. ౧౭ IV విష). అని కాల్డువెల్లుగారు చెప్పినట్లు నేఁటి యర్వాచీన తమిళాయ్‌దోచ్చారణ సంపర్కమునఁ దెల్గులోని "ముఫై-నలభై-యాభై-డెబ్భై-యెనభై-తొంభై-" అనువానిలోను వానియందువలెనె "పథ్నాలుగు - పదిహేను - పదహారు - పదిహేడు-పద్ధెనిమిది-పంథొమ్మిది." అనువానిలోను దెల్గున మహాప్రాణోచ్చారణము సంభవించెనా యని యాలోచింపవలసియున్నది. ఇట్టి యర్వాచీన హాకారోచ్చారణమును బట్టుకొని యత్యంత ప్రాచీనములగు "పదినొన్రు-పదిన్మూన్రు-పదినైన్దు" మున్నగు వానిలోని నకారము సయితము స్వరసంహితా వ్యవధాయకమేయని యనద్ధేతు మూల కానుమానాభాసము చేయుట యుక్తము కానేరదు.

33. విష:—"ఐదంతములగు నామవాచకముల సంహితలో సయితము తమిళమున 'న' కారాగమము వచ్చును. ఉదా:—"ఇళై + అన్ = ఇళైయన్" = (కుఱ్ఱవాఁడు) (ఇళై = లేఁత, బాల్యము. 'అన్' ప్రథమైకవచన చిహ్నము) అనుటకు మాఱుగా 'ఇళైఞన్' అని యగుచున్నది. ఇందలి ఞకారము నకారము కాకున్నను దత్సన్నిహిత మనఁదగును. మలయాళమున 'నాన్' అనుదానికి మాఱుగా 'ఞాన్' అని యగుచున్నది గదా. తమిళమున 'అను' ధాత్వర్థకము

యొక్క భవిష్యత్ప్రథమపురుష బహువచనరూపము 'మనార్' అని యున్నది. ఇందలి నకారము సయితము సంహితలో వచ్చిన 'న' కారాగమమె. ఉదా:— ఎన్న+న్+అర్=ఎన్ననార్=(అందురు). వ్యావహారిక తమిఁటమున 'న' కారాగమ రహితముగ 'ఎన్నార్' అనియు 'ఎమ్బార్' అనియు వాడుక గలదు." (కాల్డు. ౧౭౮ పుట).

విమర్శము:—తమిఁటమునందలి "ఇశైఇన్" అనుదానిలోని 'ఇ' కారము స్వరసంహితా వ్యవధాయక 'న' కారాగమ పరిణామము కాదు. సంహితా యకార పరిణామమనఁదగును. ఇంతయేల? కాల్డువెల్లుగారే నకార=ఇకారములకుఁ బ్రాచీనరూపము యకారమని తలంచియున్నారు. (చూ. ౧౯ I విష. కాల్డు. ౧౪౧ పుట) మఱియుఁ బదాదియందే 'న' కారముచోట ఇకార మరుదుగ నగపడుననియు నచట దొరగారు వ్రాసియున్నారు.

'ఎన్ననార్'=(అందురు) అనుచోట దొరగారు చేసిన 'ఎన్న+న్+అర్' అనుఛేదము సరికాదు. 'ఎన్న+అర్' అనిఛేదము నెన్నవలెను. 'ఎన్' అనునది 'అను' ధాత్వర్థకమగు తమిఁటధాతువు. 'అర్' అనునది ప్రథమ పురుష మహద్బహువచన ప్రత్యయము. 'ఎన్నన' అనునది 'అన' శబ్దము తుదినిగల యొక ప్రాచీన తమిఁట శబ్దము. (చూడు. 3-౨ IV విష.) "మున్నిలై......" (తొల్కా. ౨౦౬ సూ.)="మధ్యమపురుష క్రియలును నాశీరాద్యర్థక క్రియలును నసమాపక క్రియలును 'ఇల్లై'=(లేదు) శబ్దమును 'వేఱు'=(భిన్నము) శబ్దమును 'చెయ్మ్మన' మున్నగు 'అన' తుదినిగల శబ్దములును (ఇట్లే తొల్కా. ౨౧౧ సూత్రమునందును 'అన' శబ్దాంతము పేర్కొనఁబడెను) 'ఉమ్' తుదినిగల క్రియలును 'చెయ్దు' మున్నగు క్రియాజన్య విశేషణ శబ్దములును మహదమహత్తులు రెంటను నేకరీతిగనే యుండును" అని తొల్కాప్పియ సూత్రార్థము. పయి సూత్రములోని 'చెయ్మ్మన' శబ్దమువంటిదే యగు 'ఎన్నన' అనెడి 'అన' శబ్దాంత క్రియలోని నకారము స్వరసంహితలో నుచ్చారణార్థము నిల్చెడి 'య-వ' ల వంటి వర్ణమని దొరగారు వచించుట మిక్కిలి పొరపాటు. పైరీతిని 'ఎన్నన' శబ్దము మహదమహత్సాధారణ క్రియగానఁ గాలక్రమమున దానిపై మహత్త్వద్యోతకమగు 'అర్' ప్రత్యయము నిల్చెనని యెఱుంగ నగును. ('ఎన్+మ్+అన+అర్=ఎన్ననార్' అని ఛేదము నెన్నవలెను).

'ఎన్నార్' అనురూపము వ్యావహారిక తమిఁటమునఁ గలదని దొరగారు వ్రాసిరేకాని యట్టిరూపము వ్యవహారమున నెచ్చటను లేదు. 'ఎన్నర్' (అందురు)

అను గ్రాంథికరూపము గలదు. ఇంకను వ్యావహారిక తమిళమందేకాక వాఙ్మయమందును 'ఎన్‌పార్' (అందురు) అనురూపము గలదనుట సత్యమే కాని యిది 'ఎన్నార్' అను దాని పరిణామమని యెన్నరాదు. ఇందలి పకారము భావ్యర్థకము. "ఎన్+ప్+ఆర్=ఎన్‌పార్=ఎమ్‌బార్" అని ఛేదము నెన్నవలయును. 'అర్' ప్రత్యయము చేరినచో 'ఎమ్‌బర్' అనియేర్పడును.

3౮. విష:—"తెలుఁగునందును నఱవమునందును, సంహితలో 'య-వ' లకు మాఱుగ 'మ-న' లు నిల్చుచుండెడివనియు నందు మకారరూపమె ప్రాచీనమనియు నయ్యది (మ) యిటీవలఁ గొన్నియెడల 'వ'కారముగాను, గొన్నిట 'న'కారముగాను మాఱెననియు గ్రహింపవలయును." తెలుఁగు 'మ'కారము 'న'కారముకన్నఁ బ్రాచీనతర మనుటకుఁ గొన్ని నిదర్శనములు:—

I. ద్రుతరూపములగు 'ని-ను' ల చోట బిందువు వచ్చుచుండుట.

II. తెల్గున సముచ్చయార్థక శబ్దములో (ఉన్?) నకారముండఁగా నఱవమున మకారముండుట (ఉమ్).

III. తద్ధర్మార్థమునఁ దెల్గున నకార ఘటితరూప (ఉన్) ముండఁగాఁ దమిళమున మకార ఘటితముండుట (ఉమ్).

IV. సంహితలో నకారము నిల్వవలసిన కొన్నిచోట్ల మకారము నిల్చుట.

V. సంస్కృత సర్వనామములలోఁ బ్రకృతి ప్రత్యయముల నడుమ నకారము నిల్వవలసినచోటఁ బ్రాచీనభాషలో (వేదమున) మకారముండుట.

VI. "తెలుఁగు 'ని-ను' అనునవి ద్వితీయా విభక్తులయి యుండఁగాఁ గన్నడమున మకారము ద్వితీయయై యుండుట." (కాల్డు. ౧౭౯ పుట).

విమర్శము:—స్వరసంహితలో 'య-వ' లు నిల్చుచోటులందుఁ బ్రాచీన కాలమున 'మ-న' లు నిల్చుచుండెడి వనుట కల్ల. మకారము నిల్చుచుండెడి దని వ్రాయుదురేకాని దొరగారట్టి యుదాహృతి నొక్కటినేని యీయలేదు. "నకారము స్వరసంహితా వ్యవధాయక వర్ణము కాదు. అయ్యది శబ్దావయవము" అను విషయ మీవఱకు విశదీకరింపఁబడెను. (చూ. ౨౯-౨౯ I విష). మకార ప్రాచీనతకు దొరగారు చూపిన నిదర్శనములు సరియైనవికావు. "నకారజా వనుస్వార । పఞ్చమా..." అను వైయాకరణ సిద్ధాంతము చొప్పున (చూ. ౨౮ II విష) సున్నయు నకారజన్యమె యగునుగాన దొరగారు చూపిన మొదటి నిదర్శనము మకార ప్రాచీనతను నిరూపింపఁజాలదు. మఱియు సున్న మకారమున కభిన్నమనెడి దొరగారి యాశయము సరికాదు. ద్రావిడభాషల లోని సున్నకు 'న-మ' లు రెండును మూలములై యున్నవి.

తమిళములోని 'ఉమ్' అనునది తెల్గులోని 'ఉన్' అనుదానికి మూల మను నభిప్రాయముతో దొరగారు పై రెండు-మూడు నిదర్శనములను జూపి యున్నారు. 3౨ VI విషయమునఁ జూపఁబడిన రీతిని బ్రాచీనకాలమున ద్రావిడభాషలలో నకార మేకవచనద్యోతకమును మకారము బహువచనద్యోతకమును నగుటచేత 'ఉన్-ఉమ్' అను రెండిటిలో నొకటి ప్రాచీనతర మన రాదు. నకార ఘటితరూపము (ఉన్) తెలుఁగునందును, మకార ఘటితరూపము తమిళమందును నిల్చి రెండును నేకత్వ బహుత్వములను రెంటిని గాలక్రమమున బోధింపసాగెను. కాన దొరగారి రెండవ నిదర్శనమును మూఁడవ నిదర్శనమును మకార ప్రాచీనతను నిరూపింపఁజాలవు. ౪-౫ నిదర్శనములుదాహరణ శూన్యములగుటచే విమర్శసహములు కానేరవు.

ఆఱవ నిదర్శనము:—కన్నడమున ద్వితీయాప్రత్యయము 'అమ్' అనునదే. కాని సంస్కృత వ్యాకరణానురోధమునఁ గర్ణాటవైయాకరణు లట్లు చెప్పినను దాని నిజస్వరూపము 'అన్' అనునదె యని తలంపనగును. పదాంత 'న-మ'లు రెండును గన్నడమున నిత్యముగా బిందురూపముననే నిల్చును గానఁ గన్నడవైయాకరణులకు ద్వితీయాప్రత్యయము మాంతమైనను నాంతమైనను ఫలభేదము లేదు. "మనయోర్బిన్దుః" (కర్ణా. భూ. ౧౧౨ సూ.)=మకార నకారముల కవసానమున బిందు వగును. కన్నడమందలి ద్వితీయాంత నిజరూపము నాంతమె యై యుండు ననుటకు హళాసగన్నడములోని "అన్ను" అను ద్వితీయాప్రత్యయము నిదర్శన మగుచున్నది. పతగన్నడములోని ద్వితీయాప్రత్యయ నిజరూపము "అమ్" అను నాకారము గలదె యైనచో హళాసగన్నడమున 'అన్ను' అని యేర్పడక 'అమ్ము' అను ద్వితీయాప్రత్యయ మేర్పడి యుండవలయునుగదా.

3౫. విష:—"తుళుభాషలో విసంధినాపుటకుఁ గొన్నియెడల నకారాగమము వచ్చును. క్రియాజన్య విశేషణములకుఁ బురుషబోధక సర్వనామములు పరమగునపుడు తమిళ కన్నడములలో వకారాగమము వచ్చుచుండఁగాఁ దుళుభాషలో నకారాగమము వచ్చుచుండును. ఉదా:—మళ్పు+న్+ఆయె=మళ్పునాయె=(చేయువాఁడు. చేసినవాఁడు). ఇకారాంతములగు భూతార్థక విశేషణములకుఁ దమిళమున నయితము నకారాగమమె వచ్చును. ఉదా:—తమి—పణ్ణి+న్+అవన్=పణ్ణినవన్=(పన్నినవాఁడు—చేసినవాఁడు) తుళు—బట్టి+న్+ఆయె=బట్టినాయె=(వచ్చినవాఁడు). అటవమున వకారాగమము వచ్చు చోటులందును దుళుభాషలో నకారాగమము వచ్చును. ఉదా:-దొరె+న్+ఆకులు=దొరెనాకులు=(పూజ్యులు). అఱ-దొరై+య్+అవర్గళ్=దొరైయవర్గళ్=(పూజ్యులు) తుళు-అమ్మ+న్+ఆకులు=అమ్మనాకులు=

(పూజ్యురాండ్రు). తుళుభాషలో "అగ" అనునది కాలబోధక శబ్దము. ఇది ధాతువును జేరునపుడును నకారాగమము వచ్చును. ఉదా:—మళ్ప+న్+అగ=మళ్పనగ=(చేయునపుడు). దీనిని దెల్గులోని ద్రుతము చాలవఱకుఁ బోలియుండును. అవధారణార్థకమగు 'ఎ' శబ్ద మఱవమందువలెనె తుళు భాషయందును బూర్వ స్వరానుసారముగా 'యె-వే' అను రూపములతో నిల్చియుండును. అకారమునకుఁ దర్వాతను గొన్నియెడల 'ఎ' కారమునకుఁ దర్వాతను 'నె' అను రూపముతో నిల్చును. (స్వరసంహితలో నకారము నిల్చునని తాత్పర్యము) ఉదా:—ఆయె+న్+ఎ=ఆయెనె=(వాడె). ప్రశ్నార్థకములగు 'ఆ-ఏ-ఓ' అనునవి సైతము నకారాగమ పూర్వకములై తుళుభాషలో నిల్చును. అఱవమున నవి వకారాగమ పూర్వకములై నిల్చును." (కాల్డు ౧౭౯ పుట).

విమర్శము:—తుళు భాషా విషయములు చాలవఱకు దొరగారి వాక్యములను బట్టియె పరిశీలింపవలయును. ఆ భాష నాకు పరిచితము కాదు. తమిళాంధ్ర కన్నడములందువలెనె తుళుభాషా విషయమందును దొరగా రపమార్గగాములె యనుట సాహసము కాదు. తుళుభాషయందును దెల్గునందువలెనె 'మళ్పన్' అనునది తద్ధర్మార్థక ప్రథమ పురుషైకవచనమును దద్ధర్మార్థక విశేషణ రూపమును నయియుండునని నిశ్చయింపనగును. తమిళమున నిది మకారాంతమై యుండును. ఉదా:—వరుమ్+అవన్=వరు మవన్=(వచ్చువాఁడు). భూతార్థక విశేషణాదులలోనిది స్వరసంహితావ్యవధాయక నకారము కాదనియు నట్టి నకారము భూతార్థకమగు 'ఇన్' ప్రత్యయసంబంధియనియు నీ వఱకు విశదీకరింపఁబడెను. (చూ. 3_౨ VII విమ.). దొరగారుదాహరించిన తమిళములోని 'పణ్ణిన' అనునదియుఁ దుళులోని 'బట్టిన' అనునదియు వెనుక వివరింపఁబడిన (చూ. 3_౨ VII విమ.) 'కొట్టిన' అనుదానివంటివె యని నిశ్చయింపనగును. "దొరెనాకులు (పూజ్యులు) అమ్మనాకులు (పూజ్యురాండ్రు)" అను స్థలములందలి 'న' కారము నయితము స్వరసంహితావ్యవధాయక వర్ణము కాదనియు 'దొరెన్-అమ్మన్' అనునవె పదములనియుఁ దలంపనగును. తమిళమున 'అమ్మన్' (దేవతాస్త్రీ) అని నకారాంతపదమె వెలయుచున్నది. 'దొరెన్' మున్నగు మహద్వాచుల తుదిని నకారము నిల్చుట సహజమె కదా. ఇట్లె 'ఆయెన్'=(వాఁడు) 'ఆయెన్+ఎ=ఆయెనె=(వాఁడే)' మున్నగు చోటులందును నకారము పదావయవమె కాని స్వరసంహితావ్యవధాయకము కాదని తలంపనగును.

3౬. విమ:—"విసంధిలో నిట్టి యాగమములు వచ్చుట సంస్కృతముకన్న గ్రీకులో నధికము. అట్లయినను గ్రీకునుండి ద్రావిడభాషల కిట్టి యాగమములు వచ్చెననుట సరికాదు" (కాల్డు. ౧౭౯ పుట).

"ద్రావిడభాషలన్నిటిలోను స్వరసంహితలో రేఫాగమము సయితము వ్యవధాయక మగును. ఉదా:—తమి-కా+ఉమ్=కారుమ్=(కావుఁడు=రక్షింపుఁడు). (సాధారణపద్ధతి నైనచో 'కావుమ్' అనికావలయును). కన్నడమునఁ బ్రాతిపదికమునకును బ్రత్యయమునకును నడుమ 'న్-వ్-ద్' అనువానికి మాఱుగాఁ గొన్నిచోట్ల రేఫముకాని 'అర్' అనునదికాని వచ్చును. ఉదా:— కరిదు+అ=కరిదర=(నల్లనిదానియొక్క). ఇందలి 'అర్' అనునది 'అద్' అనుదాని రూపాంతరమై యుండును. తెల్గు-సుందరు+ఆలు=సుందరురాలు. అఱవమున నిట్టిచోట వకారాగమము గన్పట్టుచున్నది. ఉదా:—సౌన్దర్యవళ్= (సుందరురాలు). తెల్గు-పొద+ఇల్లు=పొదరిల్లు (లతాగృహము)." (కాల్డు. ౧౮౦ పుట).

విమర్శము:—'కారుమ్' అనునది తమిళమునఁ గేవల నవ్యరూపము; అపశబ్దము. దొరగారు చెప్పిన యర్థము 'కావుమ్' అనుదానికి లేదు. "కావుమ్" అనుదానికి "కావడి మోయునట్టి" అని యర్థము. 'కా' ధాతు తద్ధర్మరూపము 'కాక్కుమ్' (కా+ఉమ్) (రక్షించును) అని యుండును. కన్నడమున 'కరిదర' అనునది లేదు. 'కరిదఱ' అనునది గలదు. కన్నడమందేకాక ద్రావిడభాష లన్నిటి యందును బ్రకృతి ప్రత్యయముల నడుమ నిల్చునట్టి 'న్ - ద్ - అఱ్' మున్నగునవి ప్రకృతులకును బ్రత్యయరూప శబ్దభాగములకును గల సంబంధాద్యర్థములను బోధించు శబ్దవిశేషభాగములె కాని యవి కేవలము నుచ్చారణ సౌకర్య మాత్రార్థకములగు స్వరసంహితావ్యవధాయక వర్ణములు కావు. దొరగారు స్థలాంతరమున నిట్లె వచించిరి (చూడు. ౮౨ IV విష). 'కరిదఱ' అను దానిలోని 'ద' కారము తచ్ఛబ్దసంబంధియనియు 'ఱ' కారము 'కరిదు' అను దానిపైని షష్ఠీవిభక్తి ప్రత్యయమగు 'అ' అనునది నిల్చునపుడు వచ్చెడి 'అఱ్' అను దాని భాగమందలి ఱకారమనియు నూహింపనగును. కాన నది రేఫఘటిత మనుటగాని యట్టి రేఫము స్వరసంహితా వ్యవధాయక వర్ణ మనుటగాని యుక్తము కాదు. "అఱు కారస్య సంఖ్యా సర్వనామ గుణవచనేషు" (కర్ణా. భూష. ౧౧౧ సూ.)=ఉకారాంతములగు సంఖ్యావాచక గుణవాచక సర్వనామముల 'ఉ' కారమునకుఁ దృతీయాది విభక్తులు పరమగుచుండఁగా 'అఱ్' అను నాదేశమగును. ఉదా:—ఎరడఱ= (రెండిటియొక్క). కరిదఱ= (నల్లనిదానియొక్క) మొ. తెల్గునందలి 'సుందరురాలు' మున్నగువానిలోని రేఫ ముచ్చారణసౌకర్యార్థము స్వరసంహితా వ్యవధాయకము లగుచు నిల్చు 'య - వ'ల వంటి యాగమము కాదు. అయ్యది 'బాలుర - ఎల్లర -' మున్నగువానిలోఁ బ్రసిద్ధమైయున్న బహుత్వబోధక ద్రావిడ 'ర' కారము. 'పొదరిల్లు' అను దానిలోని రేఫము సైతమట్టిదే. కాని దీని బహుత్వద్యోతకతను మఱచిన లోకముయొక్క వాడుకలో, నది 'పొదరు'

శబ్దముగా నేర్పడినది. తమిఱమునందును నిల్లె 'పుదర్=(పొద - పొదరు)' అను శబ్దము ప్రసిద్ధమైయున్నది. "'సౌన్దర్యవళ్' అనెడి రూపము తమిఱమున లేనే లేదు." (విద్వా. శ్రీ వే. వేంకటరాజులు రెడ్డిగారి జాబు. ౧-౨-౧౯౫౪).

32. విమ:—"కన్నడమున 'క్త' ప్రత్యయార్థముతో ధాతువు కూడు నపుడు దకారము వచ్చుట కలదు. ఇది యిట్టియెడల భూతార్థకము కానోవును. ఇట్టి దకారము స్థలాంతరములందు వచ్చుటయుఁ గలదు. ఉదా:—మాడి+ద్+అ=మాడిద=(చేసిన). ఈ దకారము తమిళాంధ్రములందు తప్పక 'న' కారమగును.

తెల్గులో సంహితయందుఁ గొన్నిచోట్ల (కర్మధారయమున) 'ట' కారాగమ మగును. ఉదా:—కఱకు+అమ్ము=కఱకుటమ్ము. ఇందలి టకారము మొదట 'టి' అను ప్రత్యయమై యుండవచ్చును.

అఱవమున వకారము వచ్చెడి కొన్నియెడల 'గ' కారము వచ్చును ఉదా:—తెల్గు - ఆఱుగురు. (షట్సంఖ్యాకులు) తమి - అఱువర్ - మొ.

పదకొండులోని కకారము సయితమిట్టి సంహితాగమమె కావచ్చును.

తెల్గున వకారమునకు 'గ' కారము వచ్చుట గలదు. ఉదా:—గాఁడు=వాఁడు. గారు=వారు" (కాల్డు. ౧౮౦ పుట).

విమర్శము:—కన్నడమందలి భూతార్థక 'ద' ప్రత్యయము వేఱు. దాని కిచటఁ బ్రసక్తియే లేదు. విభక్తి పూర్వాగమ 'ద' కారము వేఱు. విభక్తి పూర్వాగమ దకారము సయితము ప్రకృతి ప్రత్యయముల నడుమ నిల్చి వాని సంబంధాదులఁ దెల్పెడి శబ్దపు భాగమె కాని యది స్వరసంహితా వ్యవధాయక వర్ణము కాదు. "నపుంసక లిఙ్గే దః" (కర్ణా. భూష. ౫౧ సూ.)=అకారాంత నపుంసక లింగ శబ్దమునకుఁ దృతీయాది విభక్తి పరమగుచుండఁగా 'ద' కారాగమ మగును. ఉదా:—మనదిం=(మన+ద్+ఇం)=(మనస్సుచేత). వన+ద్+అ=వనద=వనముయొక్క. మఱియు భూతార్థక దకారము వేఱు. ప్రాతిపదిక ప్రత్యయముల నడుమ నిల్చు దకారము వేఱు. భూతార్థక విశేషణములలోని తమిళాంధ్ర 'న' కారము భూతార్థకమగు 'ఇన్' ప్రత్యయావయవమె కాని స్వర సంహితా వ్యవధాయక వర్ణము కాదని యీవఱకె విశదీకరింపఁబడెను (చూ. 32 VII విమ).

తెలుఁగునఁ గర్మధారయ సమాసమున వచ్చు 'టు' గాగమ టకారము 'టి' ప్రత్యయ సంబంధియనుచు దానే చెప్పియు దానిని స్వర సంహితాగమ ప్రకరణమున వచించు టేలొకో తెలియకున్నది. కఱకుటమ్ము మున్నగు వానిలోని టకారము తచ్ఛబ్దార్థకమగు "అతు=అదు=అది" శబ్దసంబంధి యనఁదగును. (చూడు ౨౯ I విమ).

"తెల్గు - ఆఱుగురు. తమి-అఱువర్" అను దొరగారి ప్రసంగము కేవలము నసంగతము. తమిళమున వకారముండు చోటులందుఁ దెల్గున 'గ' కారముండునను సూత్రమును గల్పించుకొనుటేల? తెల్గునందలి "క్వచి ద్గకారో వః" అను చింతామణి సూత్రము చొప్పున "గ=వ; వ=గ" పరిణామము ప్రసిద్ధమె కదా. "తెలుగు - ఆఱువురు=ఆఱుగురు. తమి - అఱువర్" అను శబ్దములలోని వకారము తచ్ఛబ్దార్థమగు "వారు=అవర్" శబ్దము సంబంధియేకదా. ఆఱు+వారు=ఆఱువురు. 'అవర్' శబ్దములోని వకారము స్వర సంహితా వ్యవధాయక వర్ణ మనుటలో (అ+వ్+అర్=అవర్) విప్రతి పత్తియే లేదు—(చూ. ౨౧ I విష. ౨౧ XVIII విష).

'పదకొండు' శబ్దము 'పదునొకండు' శబ్దపు వికృతిరూపము. కాఁగా 'ఒకండు' శబ్దములోని కకారము స్వరసంహితాగమమని దొరగారెట్లు తలంచిరో తెలియకున్నది. "పది+క్+ఒండు" అని వింతగా ఛేదమగునని భ్రమించిరేమో? "పది + ఉన్ + ఒకండు = పదునొకండు" అని పద విభాగము నరయ వలయును.

3౦. విష:—స్వరశక్తి = (Vowel-harmony) "శబ్దములలోఁ బూర్వాచ్చు తర్వాతి స్వరములను స్వసజాతీయ స్వరములనుగా మార్చుటను 'స్వరశక్తి' యందురు. ఇట్టి స్వరశక్తి 'టర్కిష్' మొదలగు సిథియను భాషలం దధికముగా నున్నది. ద్రావిడభాషలు, సంధి నివారణమునకయి స్వరసంహితలో 'య-వ'లు మున్నగు నవి నిల్చుటలో హిందూ జర్మానికుటుంబ భాషలను, స్వరశక్తి విషయమున సిథియను భాషలను బోలుచున్నవి. ఈ స్వరశక్తి ద్రావిడభాష లన్నిటి యందును నున్నను దెలుఁగున నధికమగుటచేతఁ దెలుఁగున నుదాహృతులీయఁబడును. ఈ స్వరశక్తి యాధునిక పారసీకమునందును గలదు. హిందూ జర్మానికుభాషలందును నిది యరుదుగఁ గలదు. తెల్గున నీ స్వరశక్తి "ఇ - ఉ" వర్ణములను సంబంధించి యుండును. 'ఇ-ఈ-ఐ' లకుఁ బరమున 'ని' అనియుఁ దక్కిన యచ్చులకు వెనుక 'ను' అనియు సముచ్చయార్థకశబ్దము నిల్చును. షష్ఠీ 'కు' ప్రత్యయము 'ఇ-ఈ-ఐ' లకుఁ దర్వాత 'కి' అను రూపమున నిల్చును. ప్రత్యయముల యచ్చుసైతము ప్రకృతులయచ్చులను మార్చుట గలదు. ఉదా:- కత్తి+లు=కత్తులు. కత్తి+కు=కత్తికి - కత్తులకు. మొ. క్రియాపదములందుఁ గాలబోధకవర్ణములకుఁ బ్రాబల్యముండును. ఉదా:—కలుగు+ఇ=కలిగి. ('ఇ' అనునది భూతార్థకము). కలుగు+ఇ+తి+ను=కలిగితిని. మొ. కన్నడమందును గ్రియల యచ్చులనుబట్టి క్రియాప్రత్యయముల స్వరములు మాఱుచుండును. ఉదా:—మాడుత్తేవె (మేము చేయుచున్నాము) మాడుత్తీరి (మీరు

చేయుచున్నారు) మాడిదెవు (మేము చేసితిమి)" (కాల్డు. ౧౮౦-౧౮౧-౧౮౨ పుటలు).

విమర్శము:—"శబ్దములలోని పూర్వాచ్చు తర్వాతియచ్చులను స్వస జాతీయములనుగా మార్చుట స్వరశక్తి" అను లక్షణము సరిదైయుండలేదు. ఉదా:—కత్తి+లు=కత్తులు. కలుగు+ఇ=కలిగి. ఇట్టి విపరీతోదాహరణము లను గాల్డువెల్లుగారె యిచ్చియున్నారు. "శబ్దములోని స్వరము, తనకు ముందటిస్వరములనుగాని వెనుకటి స్వరములనుగాని స్వసజాతీయములనుగా మార్చుట స్వరశక్తి యనఁబడును" అని యద్దాని లక్షణము చెప్పుట యుక్తము. డా. కాల్డువెల్లుగా రుదాహరించిన "మాడుత్తేవె - మాడుత్తీరి" అనునవి హాళస గన్నడశబ్దములు. ఈ రెండిటియందును నంత్యస్వరములందుఁ బరిణామమున్నను నది ధాతుస్వరకృతము కాదు. 'మాడు+ఉత్త+ఎవు'. అను దానియందలి 'ఎవు' అనునది 'ఏవె' అని యైనది:—మాడుత్తేవె. 'మాడు+ఉత్త+ఈర్=అను చోటి 'ఈర్' అనునది 'ఈరి' అని యయ్యెను:—మాడుత్తీరి. ఇంక 'మాడిదెవు' అను పట గన్నడరూపములో స్వరపరిణామమె చూపట్టదు. "మాడు+ఇ+ ద+ఎవు" అనుచో 'ఇ-ద' అనునవి భూతార్థకములు. 'ఎవు' అనునది యుత్తమ పురుష బహువచన ప్రత్యయము.

3౯. I విమ:—"సంయుక్తాక్షరములు లేకుండుటచేత సుఖముఖోచ్చార ణము కల్గియుండుట ద్రావిడభాషలకు సహజమైయున్నది. పదాదియందును బదాంతమందును రెండు మూఁడు హల్లుల సంయోగము ద్రావిడభాషలలో లేదు. పదమధ్యమందు సజాతీయాక్షర ద్విత్వముండును. లేదా యచటి సంయోగము నడుమ నొక యచ్చు నిల్చుటచేత నా సంయోగము విభక్తమగును. తెలుఁగు తుళు కన్నడములందుఁ బదాంతమున నచ్చు తప్పక నిల్చును. తమిళ మునఁ బదాంతమం దచ్చుగాని 'ర-ల' లు గాని 'మ-న' లు గాని నిల్చును. మల యాళ మీా విషయమున నరవమునె పోలియుండును గాని యం దజంతపదములు హెచ్చు. పయిలక్షణములెల్ల సంస్కృతమునకుఁ గేవలము విలక్షణములు." (కాల్డు. ౧౮౨-౧౮౩ పుటలు).

విమర్శము:—ద్రావిడ పదమధ్యమున హల్సంయోగము లేదనుటకంటెఁ దఱచుగా నుండదనుట యుక్తము. ఉదా:—తెల్గు-కప్రము-అబ్రము—ఎదిర్చు-కల్గును-మొ. కన్నడశబ్దాంతమునఁ దెలుఁగు తుళులందువలెనె యచ్చు తప్పక నిల్చుననుటయు సరికాదు. అట్లు స్వరము తప్పక నిల్చుట హాళసగన్నడమునఁ గలదుగాని ప్రాచీనకర్ణాటమున ననఁగా పఱగన్నడమునఁ దమిళమందువలెనె హలంతశబ్దములె యధిక సంఖ్యగలవి యున్నవి. తమిళపదాంతమున 'ర-ల-

మ-న' అను హల్లులు మాత్రమె యుండుననుట సరికాదు. అవియేకాక 'ణ-య-ఴ-ళ' అను హల్లులు సైతము తమిఴశబ్దాంతమున మిక్కిలి తఱుచుగ నిల్చును. ఇంకను 'వ-న-ఞ' అను హల్లులును నరుదుగ నిల్చును.

"ఞ-ణ-న-మ......" (తొల్కా. ౭౮ సూ.)='ఞ-ణ-న-మ-న-య-ర-ల-వ-ఴ-ళ' అను నీ పదునొకండు హల్లులు మాత్రము తమిఴ శబ్దాంతమున నిల్చునని తొల్కాప్పియమున స్పష్టముగా వక్కాణింపఁబడెను. (చూ. ౧౭ VI విమ).

౩౯. II విమ:—"తమిఴమునందలి వర్ణములస్థితిలోని నియమములు:— ౧. వర్గపంచమములు స్వస్వవర్గీయ తృతీయములతోనె సంయోగించి యుండును. ౨. "ఙ్గ-ఞ్జ-ణ్డ-న్ద-మ్బ-ఞ్ఞ-న్ద" అను సంయోగము లుండును. ౩. "క్క-చ్చ=(శ్శ)-ట్ట-త్త-ప్ప-ళ్ళ-ఱ్ఱ (ట్ర) య్య-ల్ల-వ్వ" అను ద్విత్వము లుండును. ౪. "ట్క-ట్ప-ఱ్క-ఱ్చ-ఱ్ప-న్ఱ-(న్ద్ర) ట్ద్న-య్ద్న" అను సంయోగము లుండును. తక్కిన సంయోగములు సజాతీయ ద్విత్వములుగా మాఱును. లేదా వాని నడుమ నచ్చు నిల్చుటచేత విభక్తము లగును. ఇతర ద్రావిడభాషలలో సంస్కృత సంబంధముచేత వర్గపంచమములు పరుషములతోఁ గూడ సంయోగించు చుండును. ఉదా:—తెల్గు-పమ్పు (పంపుట). కన్న-ఎణ్టు (ఎనిమిది). వర్గ పంచమ పరుషసంయోగము తమిఴ విరుద్ధముగాన నది ద్రావిడభాషా సంప్రదాయ విరుద్ధము." (కాల్డు. ౧౮౩ పుట).

<u>విమర్శము</u>:—కొన్ని యశాస్త్రీయ విషయము లటుండఁగా గొప్ప యపసిద్ధాంతము నొకటిని దొరగారు స్థాపించిరి:—తమిఴమున వర్గపంచమ పరుష సంయోగ ముండనేరదనియు వర్గపంచమ తృతీయముల సంయోగముమాత్రమె ప్రసిద్ధమనియు స్పష్టముగా వక్కాణించిరి. ఇది కేవలము నపసిద్ధాంతము తొల్కాప్పియరునాఁటికి వర్గ పంచమ ప్రథమముల సంయోగము మాత్రమె ప్రసిద్ధము. వర్గతృతీయ వర్ణములె యాయన నాఁటికిఁ దమిఴమున లేవు. కాల క్రమమున నర్వాచీనముగఁ దమిఴమున సరళోచ్చారణము వెలసెను. అది వెలసినపిమ్మట వర్గ పంచమ ప్రథమ సంయోగము నియతముగా వర్గ పంచమ తృతీయ సంయోగముగా మార్పు నందెను.

"ఙ-ఞ-ణ......" (తొల్కా. ౨౫ సూ.) = "ఙ్-ఞ్-ణ్-న్-మ్-న్" అనెడి పొల్లులకుఁ బరముగ వానివాని వర్గాక్షరములగు 'క-చ-ట-త-ప-ఱ' అను నక్షరములు నిల్చి సంయోగించునని తొల్కాప్పియరు స్పష్టముగా వచించెను. మఱియుఁ గాల్డువెల్లుగారు చెప్పిన హల్సంయోగములె కాక మఱి

కొన్ని విధములగు హల్సంయోగములును దమిఱమున వెలయుచున్నవి. (౧౭ VI విష. చూడు).

"ట-ఱ-ల......" (తొల్కా. ౨౩ సూ.)='ట-ఱ-ల-ళ' అను హల్లులకుఁ బరముగ 'క-చ-ప' అను మూఁడు హల్లులు మాత్రమె నిల్చును. ఉదా:—కళ్ +చిఱార్ =కట్చిఱార్ (దొంగపిల్లలు).

"అవఱ్ఱుళ్......" (తొల్కా. ౨౪ సూ.)=పై వానిలో 'ట-ఱ' అనువవి తప్పఁ దక్కినవానికి—ల-ళ-లకుఁ బరమందు 'య-వ' లును నిల్వవచ్చును. ఉదా:—వెళ్యానై (తెల్లయేనుఁగు) వెళ్వాళై =(తెల్లగాజు).

"అవఱ్ఱుళ్......" (తొల్కా. ౨౬ సూ.) = అనునాసికములలో 'ఙ-ఞ-న-మ' లు తప్పఁ దక్కిన 'ణ-న' లు రెంటికిని బరమందు "క-చ-ఞ-ప-మ-య-వ" అను నేడక్షరములును నిలువవచ్చును. మఱియు 'ఞ-మ-వ' అను హల్లులకుఁ బరమందు యకారము నిల్వవచ్చును. "మ .: కాన్......" (తొల్కా. ౨౮ సూ.)=మకారమునకుఁ బరమందు మీఁదఁజెప్పిన రీతిని 'య' కారమె కాక 'వ'కారమును నిలువ వచ్చును.

"య-ర-ఴ......" (తొల్కా. ౨౯ సూ.) = 'య-ర-ఴ' అను నీ మూఁడక్షరములకునుఁ బరమందు "క-చ-త-ప-ఞ-న-మ-య-ర" అను నీ తొమ్మిది యక్షరములును ఙకారమును నిలువవచ్చును. ఙకారము నిల్చుట యరుదు. (౧౭ VI విష. చూడు).

కాల్డువెల్లుగారు చెప్పిన హల్లుల ద్విత్వములె కాక యింకను వివిధ ద్విత్వములు తమిఱమందుఁ గలవు.

"మెయ్నిలై......" (తొల్కా. ౩౦ సూ.)="ర-ఴ" అనునవి తప్పఁ దక్కిన హల్లులకెల్లఁ దమిఱమున ద్విత్వముండవచ్చును.

ఇతర ద్రావిడ (తమిఱు మలయాళేతర=ఆంధ్ర-కన్నడ. మొ.) భాషలలో సంస్కృత సంబంధముచేత వర్గపంచమ ప్రథమముల సంయోగము గలదనుటయు సంప్రదాయ విరుద్ధమె. 'పమ్పు'-(పంపుట) అను మకార సంయుక్త పకారము నుదాహరించుట కేవలము పొరపాటు. తెల్గున వర్గపంచ మాదేశమె లేదు. 'పంపు' అనియే యుండునుగాని యందు వర్గపంచమమునిల్చుట యాంధ్రభాషా సంప్రదాయ విరుద్ధము. మీఁదు మిక్కిలి సంస్కృత కవి పండిత సమ్మతమగు పదమధ్యవర్గ పంచమాదేశము పైతము (శఙ్కా-పణ్డిత-దన్త-మొ) తత్సమ పదములం దుండరాదని యాంధ్ర కవి పండితులు నిరసించి యున్నారు. (శంక-పండిత దంత అనవలయును). (చూ. వ్యా. సం. ౨౮ విష. విస్తర I ౨౮ విష).

ఉ॥ నిండుమనంబు నవ్యనవనీత సమానము పల్కు దారుణా।
ఖండల శస్త్రతుల్యము జగన్నుత విప్రులయందు నిక్కమీ।
రెండును రాజులందు విపరీతము గావున విప్రుఁ డోపు నో।
పం డతిశాంతుఁడయ్యు నరపాలుఁడు శాపము క్రమ్మఱింపఁగా॥

(భార. ఆది. ౧. ఆ. ౧౧౧ ప).

ఈ భట్టారక ప్రయోగమందలి 'ఆఖండల' అనునది సంస్కృత పద్ధతిని 'ఆఖణ్డల' అనికదా యుండవలయును. అట్లు నిల్పినచో భట్టారక పద్యము ప్రాసభంగదోష దూషితము కావలసివచ్చును. అప్పకవి యనుకృత సంస్కృత విభక్త్యంత శబ్దములను సైతము బిందు యతి కీ క్రిందిరీతి నుదాహరించుటచేతఁ బరసవర్ణ వర్గపంచమాదేశము తెల్గున లాక్షణిక సమ్మతమును గాదనుటకు సందియము లేదు.

తే॥ గీ॥ "జ్ఞానవేద్యాయ తప్తకాంచన విభూష।
ణాయ మేచకవర్ణ కంఠప్రియాయ।
నగధరాయ నమోస్తు సౌందర్య విజిత।
మనసిజాతాయ గోపడింభాయ యనఁగ॥"

(అప్ప. 3. ఆ. ౫3 ప.)

ప్రాచీన కర్ణాటమందును వర్గపంచమ బిందులకుఁ బర్యాయస్థితి సిద్ధాంతితమై యున్నది.

3౯. III విష:—సంస్కృత శబ్దములు తమిఁటములోనికి వచ్చునపుడు వానిలోని సంయోగముల నడుమఁ దఱచుగా 'ఇ' కారమును గ్వాచిత్కముగా 'ఉ' కారమును నిల్చును. ఉదా:—(సంస్కృ)-ప్ర=(తమి)-పిర. (సంస్కృ) కృష్ణ. (తమి) కిరుట్టినన్. లేదా-కిట్టినన్. (సంస్కృ) ద్య-(తమి) దియ. (సంస్కృ) ద్వ-(తమి) దివ. (సంస్కృ) గ్వ. (తమి) గివ. ఇట్టి విప్రకర్షములం దంతస్థేతర వర్ణము ద్విరుక్తమగును. సంస్కృ-తత్వ-(తమి) తత్తివ. (సంస్కృ) అప్రయోజన (తమి) అప్పిరయోజన.

"సిథియను కుటుంబములోనివగు 'ఫిన్నిషు-హంగేరియా' మున్నగు భాషలందును నీ విప్రకర్షము గలదు. పదాదియందలి యూష్మములకు హలంతర సంయోగ ముండునపుడు వాని మొదట ద్రావిడ భాషలందువలెనె విప్రకర్షము రాక యా సంయోగమునకు ముందొక యచ్చు చేరును. ప్రొఫెసరు మాక్సుముల్లరు దొరగారు పెక్కు భాషలందు విప్రకర్షము గలదని చూపిరి. చీనా భాషలోని శబ్దములెల్ల నజంతములు ననునాసికాంతములు నయియున్నవి.

ప్రాకృత భాషలలో సంయుక్తాక్షర మున్నపుడు ద్రావిడభాషలలోవలెనె యట్టి సంయోగమందలి యొక హల్లునకు ద్విరుక్తి గల్గునని బీమ్సు దొరగారు వ్రాసిరి." (కాల్డు. ౧౮౩-౧౮౪-౧౮౫-పుటలు).

నన్నూలు ౧౪౯ సూత్రపు వివృతిలోని "పక్వమ్-తద్భ-పక్కువమ్." అను నుదాహృతి చొప్పున దొరగా రుదాహరించిన "ద్వి=దివ. గ్వ=గివ. తత్వ=తత్తివ" అను విప్రకర్ష వికృత్యుదాహృతులు సరికావనియు "గ్వ=గువ. ద్వ=దువ. తత్వ=తత్తువ" అని యుండుననియు నెఱుఁగనగును. (చూ. ౧౯ X విష).

౮౦. విష:—వర్ణవిపర్యయము:—"ఉచ్చారణత్వరచేత వ్యావహారిక భాషలో వర్ణవిపర్యయము తఱచుగ సంభవించును. ఉదా:—తమి-తచై (శై)=చదై (శదై)=(మాంసము). కుదిరై=కురిదై (గుఱ్ఱము). తెలుఁగులోని 'గుఱ్ఱము' అనుదానివలన వీని పౌర్వాపర్య మేర్పడనేరదు. అఱవమున 'దాఁటుట' అను నర్థముగల 'కుది' ధాతువు గలదు. కాన 'కుదిరై' అనునదే ప్రాథమిక రూప మనఁదగును. ఈ వర్ణవిపర్యయము ద్రావిడభాషల పర్యాయ పదములలో నగపడును. ఉదా:—తమి-కొప్పళ్ (బొడ్డు). తెలుఁగు-పొక్కిలి. మల-పొక్కుళ్=పొక్కిళ్. తమి-పడర్ (వ్యాపించు)=కన్న-పరడు" (కాల్డు. ౧౮౬ పుట).

విమర్శ:—'కురిదై' అను రూపము తమిళమున బొత్తిగా మాటలు పలుక లేనివారి నోటవచ్చును. కాన నిదొక వర్ణవిపర్యయోదాహృతి యనిపించు కొనదు.

౮౧. వర్ణప్లుతి:—"ఈ చిత్రమగు మార్పు తెల్గులో మాత్రము తఱచుగా నున్నది. మూఁడు హ్రస్వాచ్చులుగల పదములో మొదటి యక్షర మచ్చై యున్నపు డీ వర్ణప్లుతి వచ్చుటగలదు. అం దా మొదటియచ్చు రెండవ యచ్చును ద్రోసి దానిచో దీర్ఘముగ నిల్చును. ఇది ద్వివిధము. I. మొదటి స్వరము రెండవదానిమీఁదికిఁ బోవుట. II. రెండును గలసిపోవుట. ఉదా:— I. తమి-అవర్. కన్న-అవరు. తెలుఁగు-వారు. తమి-ఇవర్. కన్న-ఇవరు. తెల్గు-వీరు. అది+నిన్=దానిన్. ఇది+నిన్=దీనిన్. II. నామములు:—తమి. ఉరల్-(ఉచ్చారణము. ఒరల్) తెల్గు-రోలు. ఈ వర్ణప్లుతి 'ర-ల' మున్నగువాని సంబంధ మున్నపుడే తఱుచని డా. గుండర్టుగారు చెప్పిరి.

ఈ వర్ణప్లుతిలో ననేక తమిళాంధ్రపదముల సంబంధము వెల్లడియగును. ఉదా:—తమి-ఆగాదు (అహాదు అని యుచ్చారణము)=తెల్గు-కాదు. తమి-

ఇల్లదు=ఇలదు. తెల్గు-లేదు. తమి-ఉళ్. కన్న-ఓళ్. తెల్గు-లో. ఈ వర్ణప్లుతి తుళుభాషలోను నరుదుగఁ గలదు" (కాల్డు.౧౮౬-౧౮౭ పుటలు).

విమర్శము:—మూఁడు హ్రస్వాచ్చులు మున్నగు ననుగమము లాభాస రూపములు. 'అదురు' అనునది 'దారు' అని కానేరదుగదా. ఏడు+పది= డెబ్బది. ఇట్టి చోటుల 'ర-ల' ల సంబంధము లేదుగదా.

౮౨. విష:—క్రియల హల్లుల లోపము:—"ధాతువులలోని రేఫ లకారా దులకు లోపము గల్గును. ఉదా:—తమి-నెరుప్పు=తెల్గు-నిప్పు=తమి-ఎలుమ్బు-తెలుఁగు-ఎమ్ము. తమి-ఉడల్ ('ఒడల్' అని పల్కుదురు)=తెల్గు-ఒళ్లు. తమి-పొలుదు-తెల్గు-పొద్దు. తమి-ఎరుదు-తెల్గు-ఎద్దు. తమి-మరున్దు-తెల్గు-మందు. తుళు-మద్దు. కన్న-మద్దు. (ప్రాచీన కన్నడము-మర్దు). తమి-ఎళుపదు-కన్న-ఎప్పత్తు-తెల్గు-డెబ్బది. తమి-ఎళుప్పు-(ధాతు-ఎళు)-కన్న-(ధా-ఏలు= లేచు) ఎబ్బిసు-తెల్గు-లేపు. తమి-కొళుప్పు-కొళుమై-తెల్గు-క్రొవ్వు. కన్న-కొబ్బె-తుళు-కొమ్మె. తమి-ఎరుమై (ఎనుపోతు)-తుళు-ఎర్మె-కన్న-ఎమ్మె. వ్యావహారిక తమిళమందును నీ లోపము గలదుగాని యింత నియమము లేదు." (కాల్డు. ౧౮౭ పుట).

విమర్శము:—తెలుఁగునందును 'ఒడలు' శబ్దముగలదు గాన దీనినుండి 'ఒళ్లు' శబ్దమేర్పడెననుట యుక్తము. మఱియు నిందు వర్ణలోపము లేదు. డల సంయోగము ళకారద్వయముగాఁ బరిణమించెననుట లెస్స. కన్నడమున 'ఏళ్'=(లేచు) అని యున్నదిగాని 'ఏలు'=(లేచు) అని యుండలేదు. తెలుఁగు 'క్రొవ్వు' శబ్దము ప్రాచీన కన్నడములోని 'కొర్వు' శబ్దమున కభిన్నమనుట యుక్తముగాని 'కొబ్బె' అను హళగన్నడ శబ్దముతో సంబంధము చూపుట యర్హముకాదు. అట్లె 'ఎరుమై' (తెల్గు-ఎనుము-ఎనుపోతు) అను తమిళ శబ్దముతో 'ఎర్మె' అను ప్రాచీనకన్నశబ్దము సంబంధించుచున్నదని చూపుట యుక్తముకాని 'ఎమ్మె' అను హళగన్నడ శబ్దమును జూపుట యుక్తముకాదు.

౮౩. విష:—వర్ణలోపము:—"కొన్ని తెలుఁగు శబ్దములలోని యక్షర ములు తత్సమాన తమిళ శబ్దములలో లేకుండుటగలదు. ఉదా:—తమి-ఓడు. (సహార్థకము). తెలుఁగు-తోడ. తెల్గున 'డ' అని యున్నచోటఁ దమిళమున 'ట' వర్ణముండును. ఈ పక్షమునఁ దెల్గు-'తోడ' అనుచోఁ దమిళమున 'తోట' అనియుండుట యర్హము. తమి-తోట=(స్నేహము) (తోటమై=స్నేహము.) తెలుఁగులో సైతము సమాసమున 'తోడ' అనుదాని కీ యర్థము గలదు. కానఁ దమిళములోని 'తోట=ఓడు' అనునవి పరస్పరసంబంధము గలవనియుఁ దెల్గులోని 'తోడ' అనుదానిని సంబంధించునవనియుఁ దేలు

చున్నది. కావుననె తమిళములోని 'ఓడు' అనునది తృతీయాప్రత్యయ మగు చున్నది. పయి సందర్భమునుబట్టియే 'ఉడన్' అను తమిళ ప్రత్యయము 'తొడర్=వెంబడించు' అను ధాతువుతో సంబంధించునని తేలుచున్నది."

డా. గుండర్టుగారీ క్రిందిరీతిని జెప్పిరి. 'తమిళ మలయాళ గ్రాంథిక భాషలలోని 'ఒడు' శబ్దమునకు 'ఓడు' అనునది రూపాంతరము. ప్రాచీన కన్నడమున 'ఒడ-ఒడమ్' అనియు నవీనకన్నడమున 'ఒడనె' అనియుఁ దుళులో 'ఒట్టుగు' అనియు నున్నవి. తమిళములోని 'ఉడన్' అనునది కన్నడములోని 'ఒడనె' అనుదానికి సరిపడియున్నది. ఇట్టి 'ఒడు' శబ్దమునకుఁ దెలుఁగులోని 'తోడు' అనుదానితోను దమిళములోని 'తోటు' అనుదానితోను సంబంధము లేదు. తమిళములోని 'తోటు' శబ్దము 'తోటు' ధాతుజన్యము. 'తొడర్' అనునది 'తొడు'=(అంటు-ముట్టు) అను ధాతువునుండి పుట్టినది. కాన వీనికిఁ బరస్పరసంబంధము లేదు.'

"పయిరీతిని గుండర్టుగారు చెప్పినను బైవానికి రూపమందు నర్థమందును బోలికయుండుటచేత నవి యభిన్నములనియె నా యభిప్రాయము. ధాతువులోని దీర్ఘము హ్రస్వమగుట యఱవమున సాధారణ విషయము" (కాల్డు. ౧౮౨ పుట).

విమర్శము:—'తోడు = తోడన్' శబ్దములోని తకార లోపమున 'ఓడు=ఒడు' అను తృతీయా ప్రత్యయ మేర్పడెనని దొరగారి యాశయము. కాని తొల్కాప్పియరు 'ఒడు' అనునది మాత్రమె ('ఓడ్' మలయాళ తృతీయా ప్రత్యయము. తమిళ ప్రత్యయము కాదు) తృతీయా ప్రత్యయమని చెప్పిరి. 'ఓడు' అని దిద్దినచో సూత్రపు పద్యము చెడును. మఱియు వీని కర్థసామ్యమును నంతగాఁ గన్పట్టదు. డా. గుండర్టుగారు చెప్పిన ట్టివి, విభిన్నశబ్దములనియె తోఁచుచున్నది. 'తోడన్' అను తృతీయా ప్రత్యయము సహార్థకము, తమి- తోటన్=(మిత్రుఁడు), తోటి=(సఖి), తొడు=(అంటు-ముట్టు) తొడర్=(వెంబడించు) తొడర్పు=(సంబంధము). ఓడు=పరుగెత్తు. ఓడు=(పెంకు). తమిళ తృతీయా ప్రత్యయమగు 'ఒడు' అనుదానికి 'చేతన్' అను సహార్థేతర మగు కరణార్థమును గలదు. తమిళములోని 'ఉడన్' సహార్థకము.

౨౨. విష:—ఊనిక=(Accent):—"గ్రీకు సంస్కృత భాషలలోవలె ద్రావిడభాషలలో నుదాత్తాది స్వరములు లేకున్నను నొకవిధమగు 'ఊనిక' అను స్వరము లేకపోలేదు. పదము మొదటి భాగము ప్రకృతి సంబంధమైనదియుఁ దర్వాతిది ప్రత్యయాది సంబంధమైనదియు నగుటంజేసి ద్రావిడభాషలలో 'ఊనిక' పదాద్యక్షరముపై నుండును. సమాసములో నుత్తరపదము

మొదట నయితే మల్పమగు 'ఊనిక' యుండును. ఇట్టి యూనికకును సంయోగ పూర్వకత్వాదులచేఁ బూర్వాక్షరములకుఁ గల్గు 'ఊఁదుటకును' భేదము గలదు. ఈ రెండును గేవలము విభిన్నములు. ఉదా:—అడఙ్గుగిఱదు= (అడఁగుచున్నది). ఇందలి 'డ' అనునది సంయోగ పూర్వస్థమగుటచేత నూఁది పల్కఁబడును. కాని పదాదినున్న 'అ' అను నక్షరమందే 'ఊనిక' గలదని యెన్నవగును. ఇట్లె "ఉడై న్దిరుక్కిఱదు" (పగిలి యున్నది). అనుచోట నయితము 'ఉ' అను శబ్దాది వర్ణమందె 'ఊనిక' యున్నది. 'డై' అనునది దీర్ఘమగుటచేతను సంయోగ పూర్వస్థమగుటచేతను నూఁది పల్కఁబడుచున్నది. పరశబ్దములోనిదగు 'ఇరుక్కిఱదు' అనుశబ్దము నాదియగు 'ఇ' అనుదానితో సంధించియున్న 'ది' అను దానియందును నలంతి యూనిక గలదు.

"గ్రాంథికాఱవమున నొక్కపదమె ధాతుజ విశేషణముగను సమాపక క్రియగను వాడఁబడును. కాన నది క్రియాపదమగునపుడు పదాది యందును ధాతుజ విశేషణమగునపుడు తచ్ఛబ్ద 'వ' వర్ణముమీఁదను నూనిక యుండునని గ్రహింపవలయును. ఉదా:—తమి-'ఓదు వాన్' = (చదువఁ గలఁడు=చదువువాఁడు) అను సమాపక క్రియాపక్షమున 'ఓ' అనుదానిపై నూనిక నిల్చును. దానిని ధాతుజ విశేషణముగ వాఁడునపుడు 'వా' అను దానిపై నూనిక నిల్చును. ఇట్లె 'ఓదువదు'=(చదువఁగలదు-చదువునది) అనురీతిగల వ్యావహారిక తమిఱశబ్దమందును నర్థమునుబట్టి యూనిక నిల్చునని యఱవ వైయాకరణులు చెప్పిరి." (కాల్డు. ౧౪౭-౧౪౯ పుటలు).

విమర్శము:—నన్నూలు వ్యాఖ్యాతలలో నొకఁ డీ దొరగారు చెప్పినట్లె యూనికను వివరించెను. 'ఓదువదు' అనునది క్రియావిశేషణముగా మాత్రమె వాడఁబడును. దానిని సమాపక క్రియగా వైయాకరణు లుదాహరించినను నట్టి వాడుకలేదు. 'ఓదుమ్' అనునదియె యమహత్ కర్తృక క్రియగా వాడఁబడును. దీనికి విశేషణముగా నయితము వాడుకఁ గలదు.

౨౫౭. విష:—తద్భవములు:—"ప్రాచీన తద్భవములలోఁ జాలవఱకు నియమము గలదు. (డా. గుండర్టుగారు ౧౮౬౯ సంవత్సరమున (క్రీ. శ.) నీ ప్రక్రియను వివరించిరి) సంస్కృ-వృషభ. కన్న-తెల్గు-తుళు-బసవ-తమి-మల-ఇడబ=ఎడవ. సంస్కృ-పర్వ-తమి-పరువ. కన్న-హబ్బ. సంస్కృ-బ్రహ్మ. తెల్గు=బొమ్మ-తమి-పిరమ. ఇట్టి మార్పులలో నియమము గలదని చెప్పుటకు సందేహము లేదని గుండర్టుగారు చెప్పిరి. కాని యట్టి నియమములలో నొక్కటిని మాత్రము చెప్పి విరమించిరి. సంస్కృత శబ్దము ద్రావిడభాషలలో వాఁడబడునపు డందలి వర్ణములలోని 'అద్రావిడ' వర్ణములు లోపించునని వచించిరి.

ఉదా:—సంస్కృ - సహస్రమ్. కన్న - సావిర (హళగన్నడము) తుళు - సార. తమి-ఆయిరమ్. (సహస్రమ్ = సహసిరమ్-అ + అ+ఇ+రమ్ = ఆయిరమ్) సంస్కృ-సింహళమ్=పాళీ-సీహాలం=ప్రాచీన తమి-ఈళమ్. సంస్కృ-మృగశీర్ష. మల-మగయిరమ్. సంస్కృ-శ్రావణమ్. తమి-ఓణమ్. సంస్కృ-శ్రమణ= (జయిన సన్న్యాసి). తమి-చ (స) మణన్=అమణన్. సంస్కృ-సీసమ్. తమి-ఈయమ్. కన్నడభాషలో నొక విశేష నియమము—దీర్ఘము హ్రస్వమగుట—కలదు. సంస్కృ-కుమారీ. తమి-కుమరి. కామరిన్ (ఇంగ్లీ). సంస్కృ-శ్రేష్ఠి. తమి-చె (సె) ట్టి. సంస్కృ-స్నేహ=తమి-నెయ్. ఎల్లద్రావిడ భాషలందును తద్భవము లగునపుడు సంస్కృతాదులలోని యచ్చులు విడుచుండును. ద్రావిడ భాషలలో రేఫ లకారములు పదాదిని నుండవు. ఉదా:—సంస్కృ-రాజా. తమి-ఇరాశా. సంస్కృ-లోక. తమి-ఉలోగమ్. వీనిలోని దీర్ఘములకు హ్రస్వము వచ్చును. ఉదా:—అరసన్=అరయన్=(రాజు) ఉలగమ్=ఉలగు= (లోకము). సంస్కృ-రేవతి=తమి-ఇరేవతి." (కాల్డు. ౧౫౦ పుట).

విమర్శము:—బ్రహ్మశబ్దభవము తెల్గున దొరగారు వ్రాసినట్లు 'బొమ్మ' కాదు-బమ్మ. కన్నడభాషలో దీర్ఘమునకు హ్రస్వమయ్యెడి నియమము గలదని చెప్పి దొరగారు 'కుమరి' అను తమిళశబ్దము నుదాహరించుట వింత! ద్రావిడ భాషలలోఁ బదాదిని రేఫ లకారము లుండవనుటయు సరికాదు. తమిళమున మాత్రమె పదాదిని రేఫ లకారము లుండ వనవలయును. ఆంధ్రకన్నడము లలోఁ బదాదిని రేఫ లకారములు గల తద్భవములును దేశ్యములును ననేక ములు ధారాళముగఁ గలవు. ఉదా:—సంస్కృ-రాక్షస=రక్కస. సంస్కృ-లక్షణ=లక్కణ. మొ. ఆంధ్రమందలి తద్భవములు నారచించిన వైయాకరణ పారిజాతము II ప్రకరణము ౪౮ విషయము మొ-౧౪౦ విషయమువఱకు విస్తరింపఁబడెను. తమిళ తద్భవములు నన్నూలులో ౧౪౬ సూత్రము మొదలు ౧౫౦ సూత్రమువఱకు వివరింపఁబడెను. కర్ణాట తద్భవములు కర్ణాట శబ్దానుశాసన గ్రంథమున ౧౩౭ సూ. మొ. ౧౬౦ సూ. వ. వివరింపఁబడినవి. (చూడు ౧౫ X విష. నన్నూలు తద్భవ ప్రక్రియ).

౨౬. I విష:—తత్సమ తద్భవ విషయమున నాంధ్రకర్ణాట తమిళము లకుఁ గొంత భేదము గలదు. సంస్కృతశబ్దములు తెల్గులోనికి వచ్చునపుడు విభక్తి సంబంధమగు మార్పులు మాత్రము గల్గినవి తత్సమములని వ్యవహరింపఁ బడును. ఉదా:—సంస్కృ-రామః=తెల్గు తత్సమ-రాముఁడు. సంస్కృ. శఙ్కా=తెలుఁగు తత్సమ-శంక. మొ. ఇట్లు విభక్తులుచేరుటలో వానిని సంబంధించిన మార్పులు మాత్రము ప్రకృతియందుఁ గల్గుట తెల్గు తత్సమత్వ

మునకు లక్షణము. ప్రకృత్యవయవ వర్ణములందు సైతము లోపాదేశాది వికృతులు గల్గుట తెల్గు తద్భవములకు లక్షణము. ఉదా:—సంస్కృ-రథః= తెల్గు-తత్స-రథము. తెల్గు తద్భవ-అరదము. సంస్కృ-శయ్యా-తెలుఁగు తత్సమ-శయ్య. తెల్గు తద్భవ-సెజ్జ. మొ. (చూ. 'వ్యా. సం'. I మొ. V వ. విమ. ౙం. I, ౙం II, ౙం III విమ).

పయివానిలోని తద్భవము లాచ్ఛికము లనఁబడును. ఆంధ్ర విభక్తి కలిత ములుకాని శుద్ధ సంస్కృత పదము లాచ్ఛికములతో సమసింపకుండుట తెలుఁగు సంప్రదాయము. ఉదా:—'తటాకమునీరు' అనవలయునెకాని 'తటాకనీరు' అన రాదు. ఇట్టి 'తటాకనీరు' అనువాని వంటివి వైరిసమాసములనియు నట్టి సమాస ములు దుష్టములు నప్రయోజ్యములు ననియు నాంధ్ర వైయాకరణులచే నిరా కరింపఁబడినవి.

రూ. II విమ:—తత్సమ తద్భవముల లక్షణ విషయమునఁ జాలవఱకుఁ దెలుఁగురీతినె కర్ణాటమందును వెలయుచున్నది. కర్ణాటమునందును నొక్క సంస్కృత శబ్దమునకె తత్సమరూపముతోను దద్భవరూపముతోను బ్రవేశము గలదు. ఉదా:—శ్రీ-సిరి-మొ.

కన్నడమందును వైరిసమాసము దుష్టమె. బిరుదనామములందును 'మంగళారతి' ప్రభృతులగు కొన్ని శబ్దములందును మాత్రమె కన్నడమున వైరిపదదోషము లేదుగాని తక్కిన యెల్లెడలను వైరిపదము దుష్టమె. 'తచ్చ బిరుదావళ్యామ్' (కర్ణాటశబ్దా-౫౯౪ సూ.)=(వృత్తి)"సంస్కృత మసంస్కృ తంచ సుబన్తం సంస్కృతేన అసంస్కృతేన చ సుబన్తేన సహ సమస్యతే బిరుదా వళ్యాం విషయే ...... ఉదా:—నరలోకదల్లణం ...... బిరుదావళీగ్రహణ మన్యత్ర సంస్కృతాసంస్కృతయోః సమాస నిరాసార్థమ్." ("నరలోకదల్లణం= భూలోకభయంకర ఇత్యర్థః" మఞ్జరీమకరన్దవ్యాఖ్యా). 'కదురాగాదయః.' (కర్ణాటశబ్దా-౫౯౭ సూ.)=(వృత్తి) "కదురాగాదయ శ్శబ్దాః కృతసమాసాః సాధవో వేదితవ్యాః". "అనన్తరయోగద్వయోక్త నియమా దన్యత్ర సంస్కృతా సంస్కృతయో స్సమాసో నాస్త్యేవ......కడిదు+రాగ=కదురాగం=అధిక రాగ ఇత్యర్థః......మంగళారతి=మఙ్గళారతికమ్=......మఙ్గళప్రసాధనమ్." (మఞ్జరీ మకరందవ్యాఖ్య).

"సమసంస్కృతం దేశీయపదేన సమస్యతే" (కర్ణా. భూష. ౧౩౭ సూ.)=సమసంస్కృతపదము దేశీయపదముతో సమసించును......తురగ దళం-మంగళారతి......మొ.

సమసంస్కృత మనఁగా సంస్కృతమందును నచ్ఛకర్ణాటమునందును దుల్యముగా నుండు శబ్దమనియు నట్టిది దేశీయపదముతో ననఁగా నచ్ఛకర్ణాటముతో సమసించుట నిర్బాధమె యనియు శబ్దమణి దర్పణకర్త సవరణముగా వివరించెను. అట్టి సమసంస్కృతశబ్దము లిరువది యొకటి యనియు కేశిరాజు వివరించెను.

క. మణి, మంచం, పట్టం, తో ।
రణ, మట్టం, గోణి, సబళ, మంకం, లతె, కం ।
కణ, మొసెవకోంటె, బల, మం ।
గణం, బిలం, బంది, మాలె, గాళం, గండం ॥

క. గల్లం, మల్లం, తళ, మిం ।
తెల్లం తత్సమము మివ ఉదాహరణెగళం ।
సొల్లిసువె, నెరదు, మెయ్గుం ।
బల్లర్‌గళ్ మెచ్చుతిరె సమాసోక్తిగళిం ॥

(శబ్దమణిదర్పణము ౨౯౭-౨౯౮ ప.) (వృత్తి). "ఈ శబ్దంగళ్ సంస్కృతక్కం కన్నడక్కం సరి;......".

మహాకవి ప్రయుక్తములను వెదకి పృథక్కరించెనని తోఁచుచున్నది.

౪౬. III విష:—తమిళ తత్సమ తద్భవపద్ధతి:—ఇది మఱియు భిన్నమార్గముగనుండును. ఒక్కొక్క సంస్కృత శబ్దమునకుఁ గర్ణాటాంధ్రములందుఁ దత్సమ రూపములుఁ దద్భవరూపములు కొన్నియెడల వేర్వేఱుగ నేర్పడినట్లు తమిళమున రూపద్వయమేర్పడదు. ఒక్క సంస్కృతశబ్దమున కొక్కవిధముగనె తమిళమునఁ బ్రదేశ ముండును. అది యొకపుడు తత్సమమనియు నొకప్పుడు తద్భవమనియుఁ జెప్పఁదగియుండును. సంస్కృతశబ్దమునందుఁ దమిళతద్భవ పద్ధతులచొప్పున వర్ణాగమాది వికృతులు గల్గినయెడల నది తద్భవమె యనఁదగును. ఇంచుకేని యట్టి వికృతిగలుగనపు డది తత్సమ మనిపించుకొనును. తమిళ తద్భవసూత్రములచొప్పున వర్ణాగమాది వికృతులు సంభవించునపు డవి నియతముగనె గల్గును. (అట్టియెడఁ దత్సమరూప ముండరాదని భావము). అట్టి శబ్దమునం దట్టి మార్పుగల్గని విభక్తి యోగమాత్రపు వ్యత్యాసముగల తత్సమ రూపము నిల్వనేరదు. తమిళవర్ణ సమామ్నాయమున లేని వర్ణములు సంస్కృత శబ్దములలో నుండెనేని యట్టిచోటఁ దమిళ తద్భవసూత్రములచొప్పున మార్పు నియతముగ సంభవింపవలసినదె. ఉదా:—సంస్కృ-, ధరా = తమి - తరై = (భూమి). సంస్కృ-భాషా=తమి-పాడై. మొ. సంస్కృ-'రామః. తమి-రామన్' ఇట్టి సంజ్ఞా నామములందు సైతము విభక్తియోగమాత్రమె యున్నను నిట్టివి

(తద్భవములె) యాదృచ్ఛికములే యని తమిళవ్యాకరణవ్యాఖ్యాతలెల్ల వ్రాసిరి. ఇంక నించుకేని మార్పులేని 'అమలమ్' 'కమలమ్' అను రీతిగలవి మాత్రమె తత్సమములని తమిళపండితు లంగీకరింతురు.

తత్సమ తద్భవ విషయకమగు నీ తమిళపద్ధతి చాలవఱకుఁ బ్రాకృతమును బోలియున్నది. కాని ప్రాకృతమందు సయితము "సంస్కృ-రామః-ప్రాకృ-రామో" అనుచో 'రామో' అనునది తత్సమ మనఁబడునేకాని తద్భవ మనఁబడదు. ప్రకృత్యవయవమందు వర్ణవికృతి గల్గునపుడుమాత్రమె దానిని దద్భవమనుట ప్రాకృతసంప్రదాయము.

౪౭. I విష. సంధి:—పరరూప సంధి స్వాభావికత:—వాక్యగత పదములను సన్నిహితముచేసి వక్త పలుకునుగానఁ బూర్వపదాంతిమవర్ణ పరపదాదివర్ణములకు సంఘర్షణము సంభవించును. అట్టి సంఘర్షణమున నూనిక లేమిని బలహీనమగు పూర్వపదాంతిమ స్వరము లోపించి యూనిక గల బలవత్తరమగు పరపదాది స్వరము దానిచోట నిల్చును. ఇందుఁ బూర్వ స్వర రూపము మాసిపోయి పర స్వరము నిల్చును గాన దీనిని బర రూపసంధి యందురు. ఇదియె ద్రావిడభాషలం దత్యధిక వ్యాప్తి గల్గి యున్నది.

సంస్కృతమున—సవర్ణదీర్ఘసంధి - గుణసంధి - వృద్ధిసంధి - పరరూప సంధి-పూర్వరూప సంధి-యణాదేశ సంధి మొదలగు పెక్కువిధములగు సంధులు వర్తిల్లుచున్నవి. అందుఁ బరరూప సంధి మాత్రమె సహజమగుట చేతఁ ద్రావిడభాషలందు విస్తరిల్లినది. మఱియు సంస్కృతమున వాక్య గత పదములను సన్నిహితము చేసి పలుకుట యనెడి సంహిత వక్త కైచ్ఛిక మనియు వక్త సన్నిహితముగాఁజేసి పల్క నుద్దేశించునపుడే సంధికార్యములు గల్గుననియు నట్లు సంహిత వివక్షింపనపుడు "సీతా ఇహ ఆసీనా ఇచ్ఛతి గన్తుమ్. తస్మాత్ ఆనయ రథమ్" అను రీతిని వాక్యము సంధికార్య రహితముగా నుండవచ్చుననియు సంస్కృత వైయాకరణు లంగీకరించిరి. "శ్లో॥ సంహి తైక పదే నిత్యా। నిత్యా ధాతూప సర్గయోః। నిత్యా సమాసే వాక్యేతు। సా వివక్షా మపేక్షతే" అని యిట్లుగ సమానపదమందును సమాస పదమందును ధాతూపసర్గ సంధి యందును మాత్రమె సంహిత నిత్యమనియు వాక్యమునం దైచ్ఛికమనియుఁ బ్రామాణికులు వచింతురు. కాని యలంకార శాస్త్రజ్ఞు లసహజమగు నీ వాక్యసంధి వైకల్పికత నంగీకరింపక "వాక్యం స్యా ద్యోగ్య తాకాంక్షాసత్తియుక్తః పదోచ్చయః" (సాహిత్య దర్పణము) అను రీతిని వాక్యమందును 'ఆసత్తి' యనఁగా సంహిత నిత్యమె యని వచించిరి. "విసంహితో విరూపో వా। యస్య సంధి ర్విసంధి తత్ ॥ యథా:—శౌర్యాణీ ఈ దృశాన్యా సన్ । ......" (ప్రతాప రుద్రీ

యము. దోషప్రకరణము) అని యిట్లు వాక్య సంధిరాహిత్యము దుష్టమని వచించిరి. "శౌర్యాణి ఈ దృశాని ఇత్యత్ర సవర్ణదీర్ఘాభావాత్ విశ్లేషః, నచాత్ర వ్యాకరణవిరోధః వాక్యసంధే ర్వైవక్షికత్వాత్, సంహి తైకపదే నిత్యా......వాక్యేతు సా వివక్షా మపేక్షతే" (రత్నాపణవ్యాఖ్య).

పయిరీతిని సంస్కృతవాక్యమున సంధివైవక్షికమె యయ్యును దెలుఁగున సహజమగు వాక్యమధ్యసంధి నిత్యమై వెలయుచున్నది. (చూడు. ౨౯ II విభ.) (చూ. వ్యా. సం. ౬౪ I విభ.) "రాముఁడు ఎక్కడ ఉన్నాఁడు" అను వాక్యపు ప్రయోగము వక్తృస్వభావసిద్ధమును గాదు. ఇట్టి విసంధి స్వభావవిరుద్ధ మగుటయేకాక శాస్త్రవిరుద్ధమునునై యున్నది. పయివాక్యమందలి 'ఎక్కడన్' అనుచోటి ద్రుతము స్వరపరకత్వమున లోపించుట కేవలము సశాస్త్రీయము. "న స్యా ద్వాక్య విరామే తు। సంధ్యభావోఽపి దోషకృత్" అని యథర్వణా చార్యుఁడు వాక్యాంతసంధి చేయకున్నను దోషము లేదనుటచేతఁ దెల్గున వాక్య మధ్యసంధి మానుట దుష్టమని కైముత్యన్యాయసిద్ధ మగుచున్నది. తమిళ మలయాళ కర్ణాటములందేకాక తెల్గునందును నేఁటి కొందఱు పండితులు విసంధిని నియమ శూన్యముగాఁ జేయుచున్నారు. ద్రుతసంధిని సంహితా యకారాదులను నియమ శూన్యముగాఁ జేయుదురు. పయికారికలో 'నిత్యా సమాసే' అని యుండఁగా 'ఆ ఊరు' మున్నగు వ్రాఁత లెట్లు పొసంగునని "సంధిరేక పదే నిత్యే" త్యాదికారిక పక్షమందును తలంతురో తెలియకున్నది. ఆంధ్రమహాకావ్యములం దెచ్చటను విసంధిని నిర్వహించు ప్రయోగములు లేవు. వ్యావహారి కాంధ్రములో సైతము "వాఁడు ఎక్కడ ఉన్నాడు" అనురీతిని వ్యవహరింపరు. 'వాడెక్కడున్నాడు' అనియే పల్కుదురు. తెల్గున సాధారణ ముగాఁ బూర్వపదాంతిమ స్వరలోప రూప పరరూపసంధి గల్గుటగాని సంధి లేనపు డచటి స్వరసంహితలో 'య' కారము నిల్చుటగాని సంప్రదాయము. అంతియకాని స్వరసంహితా రూపమగు ప్రకృతి భావము వాక్యమధ్యమున నిల్చుట సంప్రదాయము కాదు.

౪౭. II విభ:—తమిళమునందుఁ బరరూపసంధి విధింపఁబడలేదని తొల్కాప్పియ వ్యాఖ్యాతలు చెప్పిరే కాని యందు స్పష్టముగాఁ బరరూప సంధి విధింపఁబడియున్నది. తమిళమున నుచ్చారణార్థముగాఁ జేరిన 'ఉ' కార మర్ధమాత్రికమని చెప్పఁబడి యున్నది. అట్టి పొట్టి 'ఉ' కారము స్వరపర కత్వమున లోపించును. అది మాత్రమె తమిళమందలి పరరూపసంధి. తక్కినయెడల స్వరసంహితలలో 'య-వ'లు యథోచితముగఁ జేరును.

"అవట్రుళ్......" (తొల్కా. ౧౦౫ సూ.)=వానిలోఁ బదాంతగత మగు పొల్లు హల్లు మీఁద నొక బొట్టు నిల్పవలెను.

"కుఱ్ఱియ లుకరముమ్......" (తొల్కా. ౧౦౯ సూ.) = పొట్టి 'ఉకారము' పైని సయితము బొట్టును నిల్పవలయును.

'పుళ్ళియీఱ్ఱుమున్......' (తొల్కా. ౧౩౯ సూ.)=బొట్టు తలమీఁదఁ గల వర్ణములకు (పొల్లుహల్లులకును బొట్టి 'ఉ'కారమునకును) స్వరము పరమగునపు డా రెండును గలసి పోవునేకాని వేర్వేఱుగ నవి నిలువవు. పరమందున్న యచ్చు పొల్లు హల్లుమీఁద నిలుచుననియు, నర్ధమాత్రికోకారము లోపింపఁగా నచటఁ బరస్థితమగు నచ్చు నిలుచుననియుఁ దాత్పర్యము. అర్ధమాత్రికోకార (పొట్టి 'ఉ'కారము) మెట్టిచోటుల నిల్చునో యీవఱకు విశదీకరింపఁబడెను. (చూ. ౨౭ V విష). పయి సందర్భమునుబట్టి యర్ధమాత్రికోకారమునకు స్వరపరకత్వమునఁ దమిళమందు నిత్యముగాఁ బరరూపసంధి యగునని తొల్కాప్పియమునఁ జెప్పఁబడె ననుట స్పష్టముగదా. తమిళమున సంధిలేని స్వరముల సంహితలో యకారము కొన్ని యెడలను వకారము కొన్ని యెడలను వ్యవధాయకములుగా నిల్చును. అరుదుగ నేదియు నిల్వక ప్రకృతి భావముగా నుండుటయు విరుద్ధము కాదని తొల్కాప్పియమునఁ జెప్పఁబడి యున్నది.

'ఎల్లామొళిక్కుమ్......' (తొల్కా. ౧౪౧ సూ.). అజంత శబ్దముల కచ్చు పరమగునపుడు వానిమధ్య నొక హల్లు నిల్వవచ్చును. అట్లు నిల్చిన హల్లునకు 'ఉడమ్పడుమెయ్' (నడుమ నిల్చు హల్లు) అని పేరు. 'ఒక హల్లు నిలువ వచ్చును' అనుటచేత స్వరసంహితలో వ్యవధాయక వర్ణము నిలువని ప్రకృతిభావము సయిత ముండవచ్చునని తేలుచున్నది. ఇట్టి కవి ప్రయోగములు లేకున్నను నొకకాలమున నిట్టి ప్రకృతిభావస్థితి యుండెడిదని యంగీకరింపక తీరదు. స్వరసంహితా వ్యవధాయక వర్ణములు 'య-వ' లు మాత్రమె యని యీవఱకు సిద్ధాంతిత మయ్యెను (చూ. ౨౯ మొ. 32 వ. విష).

౪౭. III విష:—కర్ణాటమున సర్వసంహితలోఁ బరరూప సంధియే కల్గుననుటలోను, సంధి జరుగనపుడు స్వరసంహితలో 'య-వ' లె వ్యవధాయక వర్ణములుగ నిల్చుననుటలోను భేదము లేదు. కాని వాక్యసంధి సంస్కృతమందు వలెనె వైవక్షికమని మంజరీ మకరందవ్యాఖ్యాత వ్రాసెను. నాగవర్మకును నిదె యభిప్రాయమని తోఁచుచున్నది. స్వరసంహితలోఁ గొన్ని యెడల వ్యవధాయక వర్ణ మేదియు నిల్వక ప్రకృతిభావమె కల్గుననుట కర్ణాటమున సర్వసమ్మతమె కాని యట్టి ప్రకృతిభావము "ప్లుతస్వరములు, నిపాతశబ్దస్వరములు శంకావధారణార్థక స్వరములు" అను స్థలములందె గల్గునని ప్రాచీనుఁడగు నాగవర్మ వచించెను. కేశవ పండితుఁడును భట్టాకలంకదేవుఁడును మఱికొన్ని సామాన్య స్థలములందును బ్రకృతిభావము గల్గునని వచించిరి.

'సన్ధౌ' (కర్ణా. భూష. ౧౮ సూ.) ఇది యధికార సూత్రము. దీనిని బట్టి సంధికార్యములెల్ల సంధియం దనఁగా సంహితయం దనఁగా సన్నిహితముగా వాక్యగత శబ్దములను బలుకుటను వక్త వివక్షించునపు డను నర్థము వ్యక్తమగు చున్నది. ఇట్లె భట్టాకలంకదేవుఁడు వివరించి యున్నాఁడు. 'సన్ధౌ' (కర్ణాట శబ్దానుశాసనము ౩౮ సూ.) "వృత్తిః—అధికారోఽయమ్. పరస్సన్నికర్షః సంధిః. య దిత ఊర్ధ్వ మనుక్రమిష్యామః తత్ సంధి వివక్షాయాం భవతీతి వేదితవ్యమ్ ('యక్ స్వరే స్వరస్య' అను కర్ణాట శబ్దా. ౩౫ సూత్రచేత యక్కు వచ్చును) యతి యీతం (యతి యితఁడు) సంధావితి కిమ్-ముని ఈతమ్. (ముని యితఁడు) యతి ఈతం......పదేతు సంహితా నిత్యా। నిత్యా ధాతూపసర్గయోః। నిత్యా సమాసే వాక్యేతు। సా వివక్షా మపేక్షతే" (భాషామంజరీ వృత్తి).

"తత్సర్వం సంధి వివక్షాయామ్=వివక్షితాయామేవ సంహితాయామ్, నాఽవివక్షితాయా మిత్యర్థః" (మంజరీ మకరంద వ్యాఖ్య).

సంహితను వివక్షించునపుడు సయితము సంస్కృతమునఁ గొన్నియెడల స్వరసంహిత ప్రకృతిభావము నంది నిల్చుట గలదు.

'ఈ దూదే ద్ద్వివచనం ప్రగృహ్యమ్' (౧-౧-౧౧). "ఈ దూ దే దన్తం ద్వివచనం ప్రగృహ్య సంజ్ఞం స్యాత్. హరీ ఏతౌ. విష్ణూ ఇమౌ. గఙ్గేఅమూ. పచేతే ఇమౌ......" (సి. కౌ. ౧౦౦ సూ).

'వాక్యస్య టేః ప్లుత ఉదాత్తః' (౮-౨-౮౨) (సి. కౌ. ౯౩ సూ.) "వాక్యస్య టేః పదావయవస్య ప్లుతో భవతి. సచ ఉదాత్తో భవతీత్యర్థః." (బాలమనోరమావ్యాఖ్య).

'ప్లుతప్రగృహ్యా అచి నిత్యమ్' (౬-౧-౧౨౫)="ప్లుతాశ్చ ప్రగృహ్యాశ్చ......అచి పరే నిత్యం ప్రకృత్యా స్యుః. ఏహి కృష్ణ౩ అత్ర గౌశ్చరతి హరీఏతౌ." (సి. కౌ. ౯౦ సూ).

'లోపః శ్శాకల్యస్య' (౮-౩-౧౯)="అవర్ణపూర్వయోః పదాన్తయో ర్య్వయోః వా లోపోఽశిపరే. పూర్వత్రాసిద్ధమితి లోప శాస్త్ర స్యాసిద్ధత్వా న్న స్వరసంధిః. హరఏహి=హరయేహి. విష్ణఇహ=విష్ణవిహ......" (సి. కౌ. ౬౭ సూ.) "భో భగో అఘో అపూర్వస్య యోఽశి" (౮-౩-౧౭)="ఏతత్పూర్వస్య రో ర్యకారాదేశః స్యా దశి పరే......లోప శ్శాకల్యస్య ఇతి పాక్షికో యకారలోపః. దేవాఇహ=దేవాయిహ. భోఅచ్యుత=భోయచ్యుత..." (సి. కౌ. ౧౬౭-౧౬౯ సూ).

ప్రాకృతమందును నిట్లె స్వరసంహిత నిల్చిపోవుట గలదు.

"క గ చ జ త ద ప య వాం ప్రాయో లుక్" (వృత్తి) స్వరా త్పరేషా మనాది భూతానా మసంయుక్తానాం "క గ చ జ త ద ప య వాం ప్రాయో లు గ్భవతి. ఉదా:—కాకః=కాఓ. నాగః=నాఓ. పిశాచః=పిసాఓ......" (చండప్రాకృతవ్యాకరణము. III వ్యంజన విధానము. ౩౮ సూ).

'స్వర స్యోద్వృత్తే' (వృత్తి) వ్యఞ్జన సంపృక్తస్వరో యో వ్యఞ్జనే లుప్తేఽవశిష్యతే స ఉద్వృత్త ఇహోచ్యతే. స్వర స్యోద్వృత్తే స్వరే పరే సంధి ర్న భవతి. ఉదా:—గగనమ్=గఅణం. గన్ధకుటీ=గన్ధఉడీ. (చండ. ప్రా. వ్యా. II స్వర విధానము. 3 సూ).

సంస్కృత ప్రాకృత ప్రసిద్ధమగు నిట్టి స్వరముల యవ్యవహితోచ్చారణమును గర్ణాటులును సంహితా వివక్షయందును గొన్నియెడల నంగీకరించిరి. 'ఏ దో దన్తా నిపాతాః స్వరేప్రకృత్యా' (కర్ణా. భూష. ౨౫ సూ.)=ఏకారాంతములును 'ఓ' కారాంతములును నగు నిపాతములకు స్వరపరకత్వమునఁ బ్రకృతి భావ మగును. ఉదా:—ఎలె+ఇదావుదో=ఎలెఇదావుదో (ఓయీ యిది యేమి?) ఓహో+ఇరలిం=ఓహోఇరలిం (ఓహో ఉండవద్దు).

'విశ జ్ఞావధారణయోః' (కర్ణా. భూష. ౨౬ సూ.)=ఉదా:—ఆనెయొ+అద్రియొ=ఆనెయొ అద్రియొ=(ఏనుఁగో కొండయో) రజ్జువో+అహియో=రజ్జువో అహియో (త్రాడో పామో) పొరెవనె+ఆళం=పొరెవనె ఆళం=(పోషించినవాఁడె రాజు) కూర్పనె+ఆప్తం=కూర్పనె ఆప్తం=(ప్రీతి చేయు వాఁడె ఆప్తుఁడు).

'ప్లుతాశ్చ' (కర్ణా. భూ. ౨౭ సూ.) ఉదా:—ఎలె అణ్ణా౩+ఇత్త బా (ఓయీ 'అన్నా' యిచటికి రమ్ము).

పయివిషయములను సూత్రించి భట్టాకలంక దేవుఁడు నిపాతాదిభిన్న సామాన్యస్థలములందును బ్రకృతిభావమును సూత్రించెను.

'ఆదే' (వృత్తి) "ఆకారః అవర్ణేపరే ప్రకృత్యా తిష్ఠతి-ప్రయోగః:—ఆ అరసం (ఆ రాజు) ఆ అంచె (ఆ హంస)......ఐ దాతో ర్విశ్లిష్టావయవత్వాత్తత్రైవ భవతి. ఆ ఐశ్వర్యం (ఆ యైశ్వర్యము) ఆ ఐలబిలం (ఆయక్షుఁడు) ఆ ఔదార్యం-(ఆ యౌదార్యము)." (భాషామంజరీ వృత్తి).

'పొసత్వాదిః' (కర్ణాటశబ్దా. ౪౬ సూ.) "......పొసత్వాదిః అకారాన్తః స్వరే పరే ప్రకృత్యా తిష్ఠతి. ప్రయోగః:—పొసఅడకె=(క్రొత్తమాంసము,) పొసఆనె=(క్రొత్త యేనుఁగు) ఎళఅంచె (లేఁతహంస)." (భాషామంజరీ వృత్తి).

'గడాదిః' (కర్ణాట శబ్దా. ౪౫ సూ.) (వృత్తి) "......గడాదిగణపఠితా శ్శబ్దాః స్వరే పరే వా ప్రకృత్యా తిష్ఠన్తి. ప్రయోగః:—తాంగడ అంగజం=(తాను జమీా యంగజుఁడు=మదనుఁడు)." (భాషామంజరీ వృత్తి).

'శ్లోకార్థమ్' (కర్ణాటశబ్దా. ౫౦ సూ.) = (వృత్తి) "శ్లోకః=ఛన్దోబద్ధం కన్దవృత్తాది. తస్యార్థం=సమభాగః. స్వరాన్తం శ్లోకార్థం స్వరేపరే వా ప్రకృత్యా తిష్ఠతి." (భాషామంజరీ వృత్తి).

'అనుకరణమ్' (కర్ణాటశబ్దా-౫౧ సూ.)="స్వరాన్త మనుకరణం స్వరేపరే వా ప్రకృత్యా తిష్ఠతి. ప్రయోగః:—యత్తో యాదృశ స్తాదృశో బలి ఎంబుక్తిగె"= (యత్తుఁ డెట్టివాఁడో బలియు నట్టిదె యను నుక్తికి) (భాషామంజరీ వృత్తి).

పయిరీతిగల ప్రకృతి భావ స్థలములకు భిన్నములగు సంధి స్థలములందలి స్వరసంహితలోఁ గర్ణాటమున 'య-వ'లు వ్యవధాయక వర్ణములుగ నిలుచును.

"ఆ దివర్ణైకారేభ్యో యః" (కర్ణా. భూష. ౨౨ సూ.)="ఆకారము-'ఇ' వర్ణము-'ఎ' కారము ననువానికి స్వరము పరమగునపుడు వానినడుమ 'య' కారము వ్యవధాయకముగ నిల్చును. ఉదా:—ఆ+ఎడె=ఆయెడె. (ఆ స్థలము) శ్రీ+ఒడయం=శ్రీయొడయం. (శ్రీపతి) సలె+ఇర్పర్=సలెయిర్పర్ (బాగుగ నున్నారు).

'అకారాన్తా చ్చావధారణార్థే ఏ' (కర్ణా. భూష. ౨౩ సూ.)=అకారాంత శబ్దములకు నవధారణార్థకమగు 'ఎ' కారము పరమగునపుడు 'య' కారము వ్యవధాయకముగ నిల్చును. ఉదా:—ఆతన+ఎ=ఆతనయె (ఆతనియొక్క-యే).

"వో వృవర్ణాభ్యామ్" (కర్ణా. భూష. ౨౪ సూ.)='ఉ-ఋ' వర్ణములు తుదినిగల శబ్దములకు స్వరము పరమగునపుడు వకారము వ్యవధాయకముగ నిల్చును. ఉదా:—విధు + ఇల్లద+ఇరుళ్ = విధు విల్ల దిరుళ్ =(చంద్రుఁడు లేని రాత్రి) పూ+ఇల్లద=పూ విల్లద (పూవులేనట్టి) పితృ+ఇవం=పితృ వివం (తండ్రి వీఁడు).

కర్ణాటమునఁ దక్కిన 'అ-ఎ' అనువానికి స్వరపరకత్వమునఁ బరరూప సంధి కల్గును. 'స్వరే స్వరస్య లోపః' (కర్ణా.భూష. ౧౯ సూ.)=స్వరము పర మగుచుండఁగాఁ బూర్వస్వరము లోపించును. పరరూప సంధి యగునని తాత్ప ర్యము. ఉదా:—ఎన్న+అరసం=ఎన్నరసం (నాయొక్క రాజు) నేసె+ఇక్కిదం =నేసిక్కిదం=(అతఁతలు వేసినాఁడు).

"ప్రకృతే రుదేతోః" (కర్ణా. భూష. ౨౦ సూ.)=పరరూప సంధివిషయ మునఁ బ్రకృతి సంబంధియగు స్వరము లోపింపవలసినపుడు "ఉకారము-ఎకా రము" మాత్రము లోపించును. ఉదా:—మాతు+ఎల్లం=మాతెల్లం=(మాట సర్వమును). లేసు+ఎల్లం=లేసెల్లం=(మంచిది సర్వమును). నాలగె+ఉళ్ళ నె=

నాలగుళ్ళనె=(జిహ్వాకలవాఁడు). సేసె+ఇక్కిదం=సేసిక్కిదం=(అక్షతలు వేసి నాఁడు). (ఎకారమునకుఁ బరరూపసంధి తెల్గునఁ గల్గదు-వదినె+ఇచ్చెను= వదినె యిచ్చెను).

"న నామభాగ ప్రధ్వంసే" (కర్ణా. భూష. ౨౧ సూ.)=నామభాగమునకుఁ బ్రధ్వంసము కల్గునపుడు 'ఉ-ఎ' అనువానికిఁ బయిసూత్రము చొప్పున లోపము గల్గదు. ఉదా:—పటు+ఈతం=పటు వీతం (సమర్థుఁ డీతఁడు). ఆనె+ఒడ్డు= ఆనెయొడ్డు (గజసైన్యము).

౪౭. IV విధ:—తెల్గునందును స్వరమునకు స్వరము పరమగునపుడు పెక్కుచోట్లఁ బరరూపసంధి యగును. ఉకారమునకును మధ్యమపురుష క్రియల తుది 'ఇ' కారమునకును స్వరపరకత్వమునఁ బరరూపసంధి నిత్యము. 'అ-ఇ' అను స్వరముల కచ్చు పరమగునపుడు పరరూపసంధి బహుళము. ఉకార సంధికిని సమానస్థలములలో నపవాదవిధులు గలవు. ఆమ్రేడితము పరమగు నపుడును బ్రత్యయాదుల యచ్చు పరమగునపుడును నెల్ల యచ్చులకును బర రూపసంధి నిత్యముగా నగును. తక్కిన స్థలములందలి హ్రస్వాచ్చులకును దీర్ఘాచ్చులకును స్వరపరకత్వమునఁ బరరూపసంధి సంభవింపదు. తెలుఁగునఁ బదముల సంధి కాని యచ్చులనడుమ యకారమె వ్యవధాయకముగ నిల్చును. తెలుఁగున వాక్యమధ్యమునఁ బ్రకృతిభావరూప స్వరసంహిత నిల్వనేరదు. "సంధి ర్నా చోఽచ్యనుతో, । వాతో, నాదిషు విభక్తిషూతో వా । నిత్య మనుత్తమ పురుష । క్రియా స్వితః పరిమితౌ సమస్తానామ్" (వ్యా. సం. ౯౪ విధ. మొ). "య శ్రుతి మార్యా లఘుయం । ప్రవదన్తి ప్రాణతః పరం ప్రాణమ్" "అద్య స్యామ్రేడి తేన్యలోపశ్చ" (వ్యా. సం. ౯౪ I. మొ. ౭౫ వ. విధ). ఉదా:— రాముఁడు + అతఁడు = రాముఁడతఁడు. చేసితివి + అపుడు = చేసితివపుడు. మేన+అత్త=మేనయత్త=మేనత్త. చేసితిమి+అపుడు=చేసితిమపుడు=చేసితిమి యపుడు. చేసి+అరిగెన్=చేసియరిగెన్. ఓహో+అనియెన్=ఓహో యనియెన్. వదినె+ఇచ్చెన్=వదినెయిచ్చెన్. గ్లా+ఉదయించెన్=గ్లాయుద యించెన్. ఓహో+ఓహో=ఓహోహో. ఔరా+ఔరా=ఔరౌరా. అర్థ+ఇంచు=అర్థించు. వీసె+ఎఁడు=వీసెఁడు. మొ.

ద్రావిడభాషలందలి సరళాదేశసంధు లీ వఱకు (చూ. ౨౩ I మొ. ౨౯ వ. విధ) విపులముగా వివరింపఁబడినవి. ద్రావిడభాషలందలి స్వర సంహితా యవలును నీవఱకు (౪౫ విధ. చూ.) విస్తరింపఁబడెను.

౪౮. I విధ:—హల్లున కచ్చు పరమగునప్పటి సంధికార్యములు:— ప్రాచీన కర్ణాటమందును దమిళ మలయాళములందును వివిధహలంత శబ్దములు

మెండుగా నుండును. తెలుఁగున సాధారణముగా ద్రుతాంత (నకారాంత) శబ్దములు మాత్రము హలంతములు. తమిళ కర్ణాట మలయాళ శబ్దాంతములం దుండు హల్లున కచ్చు పరమగునపు డాహల్లుపై నట్టి యచ్చు నిల్చును. (చూడు ౪౭ II విష). కాని యేకహ్రస్వస్వరపూర్వక హల్లు గల శబ్దమున కచ్చు పరమగునపు డాహల్లు ద్విత్వము నందుట తమిళ కర్ణాటములు రెంటను బ్రసిద్ధమై యున్నది. త్ర్యాద్యక్షరక తమిళ శబ్దములందును నట్టి ద్విత్వ మరుదుగఁ గలదు. "ఉలగమ్+ఒరుమూన్రు=ఉలగ మ్మొరు మూన్రు=(లోకము లోకమూఁడు) (తిరుత్తక్క దేవరు జీవకచింతామణి). "నెడియదన్ ముస్నర్......" (తొల్కా. ౧౬౧ సూ.)=దీర్ఘాక్షర పూర్వక వ్యంజనము హల్పరకత్వమున లోపించును. హ్రస్వపూర్వక వ్యంజనము స్వర పరకత్వమున ద్విత్వము నందును. ఉదా:—కోల్+నన్రు=కో నన్రు=(రాజుచేతి కోల యనఁగాఁ గఱ్ఱ మంచిది). మణ్+అగల్=మణ్ణగల్=(మంటిపాత్రము). దీని కలంతి యపవాదములును గలవు:— తన్ + అ + కు = తనక్కు = (తనకు). నుమ్+అ+కు=నుమక్కు=(మీకు). నుమ్+అ+అదు=నుమదు (మీయొక్క).

"ఞ ణ న మ......" (తొల్కా. ౭౮ సూ.)=ఞ ణ న మ న య ర ల వ ఴ ళ అను పదునొకండు హల్లులు మాత్రమె తమిళపదముల తుదిని నిల్చును. అవి యథాసంభవముగాఁ బైరీతిని ద్విత్వము నందును.

కర్ణాటమున 'న-ణ-య-ల-ళ' వర్ణములకు మాత్రమె యట్టి ద్విత్వము కల్గును.

"న ణ ల య ళా ద్విః స్వరే హ్రస్వ పూర్వాః"-(కర్ణా. భూష. 3౪ సూ.) ఉదా:—పొన్+ఉళ్ళ+అవనె=పొన్నుళ్ళవనె (బంగారుగలవాఁడె). మణ్+ఎల్లం=మణ్ణెల్లం=(మన్నంతయు). పుల్+ఇల్లం=పుల్లిల్లం=(తృణము లేదు). కెయ్+ఆదుదు=కెయ్యాదుదు=(చేయి యైనది). ముళ్+ఉళ్ళువె+కేదగె గళ్=ముళ్ళుళ్ళువె కేదగెగళ్=(ముళ్ళుగలవె కైతకములు).

'నానేకాక్షరపదే......' (కర్ణా. భూష. 3౫ సూ.)=ఒకటికన్న నెక్కు డచ్చులతో నున్న పదములచోటఁ బైసూత్రము వర్తింపదు. ఉదా:—కడన్+ఇల్లం=కడనిల్లం=(ఋణము లేదు). పవణ్+ఉంటు=పవణుంటు=(ప్రమాణము గలదు). కవల్+ఇల్లం=కవలిల్లం=(ఉపశాఖ లేదు) తొదల్+ఇలద + నుడి=తొదలిల్లద నుడి=(అసత్యము లేని వార్త).

'అవ్యయేపిచ' (కర్ణా. భూష. 3౬ సూ.)=అవ్యయ శబ్దములందలి 'న ణ ల య ళ' లకును ద్విత్వము కల్గదు. ఉదా:—ఇదు+దల్+అపూర్వం=

ఇదుద లపూర్వం (ఇది నిజముగా విం\త్తైనది) స్మరన వొల్ + ఈతం = స్మరనవొలీతం (ఇతఁడు మదనసదృశుఁడు).

౭౫. II విష:—తెలుగునందలి శబ్దములెల్లఁ గళలు ద్రుతప్రకృతికములు నని రెండు విధములు. కానఁ దెలుగున హలంతశబ్దము లన్నవి సాధారణముగా ద్రుతాంతములు (నకారాంతములు) మాత్రమె. అట్టి ద్రుతాంతమునకుఁ బరమగు స్వర మా ద్రుతముపై నిల్చుటమాత్రమె సాధారణ విషయము. ఉదా:—చూచెన్ + అతఁడు = చూచె నతఁడు — వచ్చెన్ + ఇతఁడు = వచ్చె నితఁడు. అట్లైనను నరుదుగా ననేకస్వరక పదముల తుదిని నిల్చినను ద్రుతము స్వరపరకత్వమున ద్విత్వము నందుటఁ గలదు. ఉదా:—మత్తకోకిల...... ఎన్నఁడు । న్నెనిమోఘము గాదు దిగ్ధరణీ రవీందు లెఱుంగఁగన్ (ఆది. ౭ ఆ ౧౪౨) చ. వరదుఁడు పాక్షశౌర్య విభవంబున కాతని ధైర్యవృత్తికి । న్నరుదుగ...... (ఆర-౧ ఆ ౩౨౧) (చూ. 'వ్యా. సం.' ౮౪ I విష. విస్తర IV. ౮౪ I విష) (ప్రౌఢ-సంధి-3 సూ).

ఆంధ్ర వైయాకరణులు చెప్పలేదుగాని యేకహ్రస్వపూర్వక ద్రుతము నియతముగాను సార్వత్రికముగాను స్వరపకరత్వమునఁ దెల్గునందును, ద్విత్వము నందుట చూపట్టుచున్నది. ఉదా:—......వల్లి। యన్నిష్టసఖ నూఁది యున్నదాని (ఆది ౩ ఆ ౧౪౦) వృత్తుఁ డన్నసుర గర్వించి (ఆర ౩ ఆ-౩౫). మ...... నం । దిని యన్నేటి తరంగలన్ (ఆది ౮ ఆ ౭౯) (చూడు. ప్రౌఢ-సంధి-3 సూ. ౯ సూ.) పెన్నుద్ది (పాండు-3 ఆ) వల్లఱవు (హరిశ్చ ౪ ఆ) "నన్ + ఏలెన్ = నన్నేలెన్, విల్ + అందెన్ = విల్లందెన్. కన్ + ఆకు = కన్నాకు." మొదలయినవి సైత మేకహ్రస్వ పూర్వక ద్రుతద్విత్వమునకె యుదాహృతు లనఁదగునుగాని యాంధ్ర వైయాకరణులు "నన్నున్ + ఏలెన్ + నన్నేలెన్. విల్లు + అందెన్ = విల్లందెన్. కన్ను + ఆకు = కన్నాకు" అని వాని పదచ్ఛేదమును జూపుచు "జడ్డక్కరంబుతోఁ బదాది స్వరంబు గూడుచో జడ్డకు లోపంబు లేదు. ఉదా:—......కన్నదరె-నన్నడిగె-పల్లొత్తె-విల్లందె" (బాల. ప్రకీ ౯ సూ.) అను రీతిని సమర్థింతురు.

తెలుఁగునందును బ్రాచీనతమకాలమున హలంత ప్రాతిపదికములె యత్యధికముగా నుండెడివని యూహింప నగునుగాని కాలక్రమమున వాని తుది హల్లు లుచ్చారణార్థక స్వరయోగమున ద్విరుక్తములయ్యు నద్విరుక్తములయ్యు నన్నయాదులచే 'బ్రాతిపదికములుగ' గ్రహింపఁబడెను. "ఇల్ = ఇల్లు. కల్ = కల్లు. విల్ = విల్లు. ముల్ = ముల్లు. పల్ = పల్లు. మిన్ = మిన్ను. విన్ = విన్ను. మున్ = మున్ను. మన్ = మన్ను." మున్నగుచోటులం దేక హ్రస్వ

పూర్వకహల్లు నియతముగా ద్విత్వము నందె ననఁదగును. దీర్ఘపూర్వకహల్లులును ననేకాచ్‌పూర్వక హల్లులును నుచ్చారణార్థస్వరయోగముననే ప్రాతిపదికములయ్యెను. ఉదా:—నీర్ = నీరు. పాల్ = పాలు. కాల్ = కాలు. తేన్ = తేనె. కేల్ = కేలు. సంస్కృతశబ్దములు తెల్గునకు వచ్చుటలో సైత మీపద్ధతులంగీకరింపఁబడెను. "ద్విత్వో త్వే సర్వహాలాం। హ్రస్వా ద్విత్వంతు దీర్ఘతో బహుళమ్" (ఆం. చిం.) (వ్యా. సం. ౧౮౯ విష). ఉదా:—దిక్ = దిక్కు. వాక్ = వాకు = వాక్కు—మొ.

౮౯. I విష:—'ఆ ఈ ఏ' అను నిర్దేశకసర్వనామములకు మూఁడిటికిని త్రికమను సంజ్ఞ తెలుంగునఁ గలదు. సమానాధికరణ సమాసమున వీని కూష్మ రేఫ భిన్నమగు నసంయుక్తహల్లు పరమగునపు డాత్రికమునకు హ్రస్వమును బరహల్లునకు ద్విత్వమును దెల్గునందు వైకల్పికముగా సంభవించును.

"ఇద మద ఏత ద్య త్త। చ్ఛబ్దా శ్శబ్దాన్తరాస్వయే బహుళమ్। హ్రస్వం ప్రపద్య దీర్ఘా। ద్విత్వ ముపర్యక్షరస్య జనయన్తి" (ఆం. చిం.) "ఊష్మ రేఫాన్ వినా ద్విత్వ। మయుక్తస్య హాలో మతమ్। ఋకారంచ విముచ్య స్యా। త్త్రికానాం ద్విత్వసంగతిః॥ (వికృ) (చూ. 'వ్యా. సం'. ౨౮౦ విష). అజాదిశబ్దము పరమయినను నట్టి స్వరసంహితలో 'య' కారము నిల్చునుగాన దానికే ద్విత్వమును బూర్వస్థిత త్రికమునకు హ్రస్వమును గల్గును. ఉదా:—ఆ+మగువ= అమ్మగువ = ఆమగువ. ఈ+ఇంతి = ఇయ్యింతి = ఈయింతి. ఏ+పురుషుఁడు = ఎప్పురుషుఁడు = ఏపురుషుఁడు. సమానాధికరణ సమాసమున మూఁడుశబ్దమునకు హల్పరకత్వమున బిందుపూర్వక డు వర్ణమునకు లోపమును బైరీతిని హ్రస్వద్విత్వములును గల్గును. ఉదా:—మూఁడు + జగములు = ముజ్జగములు=మూఁడు జగములు. మొ. (చూ. 'వ్యా. సం'. ౨౮౩ విష). (చూ. ౮౯ III విష).

౮౯. II విష:—తమిళభాషయందు నిర్దేశక సర్వనామములకు 'చుట్టు' అను సంజ్ఞ గలదు. తమిళమున నిర్దేశసర్వనామములు 'అ ఇ ఉ' అని హ్రస్వరూపములు. వీనికిఁ బరమగు "క చ త ప ఞ న మ వ" అను హల్లులు ద్విరుక్తములగును. 'ఉ' అను దానికిఁ బరోక్ష పురోవర్తుల మధ్యస్థితి యర్థము. పై విషయములకుఁ దొల్కాప్పియములోని, ౨౦౫ మొ. ౨౦౭ వ. సూత్రములును, ౨౩౭-౨౩౮-౨౫౬-౨౫౭ సూత్రములును మూలము. ఉదా:— అ+చాత్తన్=అ చ్చాత్తన్=(ఆ చాత్తనువాఁడు) అ+నాడు=అన్నాడు (ఆ దేశము) అ+ఞాలమ్=అఞ్ఞాలమ్ (ఆ నేల). అ+మణి=అమ్మణి=(ఆ గంట). అ+వళై=అవ్వళై (ఆ రంధ్రము) (లేదా ఆగాజు). అ+అడి = అవ్వడి (ఆ

పాదము). ఇట్లే 'ఇ ఉ' లకును లక్ష్యముల నరయునది. ఇ+కొొట్రన్ = ఇకొొట్రన్ (ఈ కొొత్ర ననువాఁడు). ఇ+ఇడై = ఇయ్యిడై (ఈ చోటు). ఉ+కొొట్రన్=ఉక్కొొట్రన్ (ఈ కొొట్రననువాఁడు). ఉ+ఞాణ్=ఉఞ్ఞాణ్=(ఈ దారము). ఇట్లు వీనిని హ్రస్వరూపములనుచుఁ జెప్పినను వీనికి దీర్ఘాకారము పద్యములందుఁ బ్రయుక్తమగునని తొల్కాప్పియరు ౨౦౯-౨౩౯-౨౫౭ సూత్రములందు వచించిరి. "నీడవరుదల్......" (తొల్కా. ౨౦౯ సూ.)= 'అ' శబ్దము పద్యములందు 'ఆ' శబ్ద మగును. ఉదా:—అ+ఇడై =ఆ యిడై. మొ. పరుషపరకత్వమున నిట్టి దీర్ఘరూపము కానరాదు. "చుట్టు మొదలాగియ ......" (తొల్కా. ౧౬౦ సూ.)=దీర్ఘములగు చుట్టులు (ఆ ఈ ఊ శబ్దములు) పదాదియందును 'ఐ' కారము పదాంతమందును గల శబ్దములకుఁ బరమైన 'క చ త ప' లు బహుళముగా ద్విరుక్తములగును. ఉదా:—అజ్జ (జ్య)వై కొొణ్డాన్=అజ్జవై కొొణ్డాన్=(ఆ చోటనున్నవానిని కొొనెను).

౪౯. III విష:—కర్ణాటమున 'అ ఇ ఉ' అనునవి ప్రాతిపదికములని చెప్పఁబడలేదు—'అదు-ఇదు-ఉదు' అనునవి ప్రకృతులని చెప్పుదురు. ఉత్తర పద పరకత్వమున వీనికి వరుసగ 'ఆ-ఈ-ఊ' అను నాదేశము లగునని చెప్పఁ బడెను. 'ఆ దీ దూ దద్విదూదోః' (కర్ణాట. శబ్దా. 320 సూ.) (వృత్తి) 'అదు-ఇదు-ఉదు' ఇత్యేషాం యథాక్రమం 'ఆ ఈ ఊ' ఇత్యేతే ఆదేశా భవన్తి ఉత్తర పదేపరే-ప్రయోగః:—అదు+నాడు=ఆనాడు (ఆదేశము). ఈయానె (ఈ యేనుఁగు) ఊమానిసం=(ఈమానిసి).

ఇట్లు కర్ణాటమున నిర్దేశక సర్వనామము లున్నను వీనిమీఁది హల్లునకు ద్విత్వముగాని వీని దీర్ఘమునకు హ్రస్వతగాని కలుగు సంప్రదాయము లేదు. (చూడు ౪౭ III విష. ప్రకృతి భావము. ఆ అరసం=ఆ రాజు).

ఆంధ్ర కర్ణాట తమిటములు మూఁడిటియందును మూఁడు శబ్దమునకుఁ బరమగు హల్లు ద్విరుక్తమగును.

"సమానాధికరణంబగు నుత్తరపదంబు పరంబగునపుడు మూఁడు శబ్దము డుజ్ వర్ణమునకు లోపంబును మీఁది హల్లునకు ద్విత్వంబు నగు". (బాల. సమా. ౧౭ సూ.) (చూ. వ్యా. సం. ౨౧౩ విష). "ద్విరుక్తంబగు హల్లు పరం బగునపు డాచ్ఛికంబగు దీర్ఘంబునకు హ్రస్వంబగు" (బాల. సమా. ౧౩ సూ.) ఉదా:—మూఁడు+జగములు=ముజ్జగములు.

'మూఱోః' (వృత్తి) 'మూఱు' ఇత్యస్య దోః (తుది వర్ణమునకు) లు బ్భవతి వ్యఞ్జనాదా ఉత్తరపదే పరే. న ద్వన్ద్వసమాసే.....ప్రయోగః:—

మూఱు + గావుదం = మూగావుదం = మూఱుగావుదం. (మూడు యోజనములు).
(కర్ణాట. శబ్దా. ౩౫_౨ సూ).

"హ్రస్వ స్తత్ర వా" (వృత్తి) 'మూఱు' ఇత్యస్య 'ఱు' (తుదివర్ణము) లోపేసతి హ్రస్వాదేశో వా భవతి "ప్రయోగః:—ముచ్చోటు = మూచోటు. (మూఁడు చోటులు)" (కర్ణాట. శబ్దా. ౩౫౩ సూ).

తమిళమందును గొన్నియెడల మూన్రుశబ్దముచోట నిట్టికార్యములు చూపట్టుచున్నవి.

'మూన్రన్ ఒత్తే......' (తొల్కా. ४४४ సూ.)......మూన్రు + కలమ్ = ముక్కలమ్. (మూఁడు కలముల కొల్త) మూన్రు + పలమ్ = ముప్పలమ్ (మూఁడు పలముల యెత్తు).

౫౦. విష:—టుగాగమ సంధి:—ప్రాతి పదికముల వలెనె వానిపై నిల్చు విభక్తులు సైత మేవేని శబ్దముల భాగములె. అట్టి శబ్దద్వయమును సంబంధింపఁ జేయు నేదేని శబ్దపు భాగము వాని నడుమ నుండుట సహజము. ఈ విషయము తొల్కాప్పియ రీ క్రిందిరీతిని వాని నడుమ నేదేనిఁ చా (సా) రియై నిల్చుచుండునని వచించిరి.

'అవట్రువలి......' (తొల్కా. ౧౯౯ సూ.) = ప్రాతిపదికములకుఁ దర్వాత విభక్త్యాది సంధిలో సా (చా) రియై నిల్చును.

"వేట్రుమై కుఱిత్త......" (తొల్కా. ౧౧౩ సూ.) విభక్తిసమాస సంధిలోను దక్కిన సంధులలోను బూర్వపర పదముల నడుమ నొక యక్షరమో లేక శబ్దమో సా (చా) రియై (ఆగమము) నిల్చుట తమిళ సంప్రదాయమై యున్నది.

"అవైతామ్......" (తొల్కా. ౧_౨౦ సూ.) = ఆసా (చా) రియైలు:— (ఆగమములు) "ఇన్-వట్రు-(అట్రు) అత్తు · అమ్-ఒన్-ఆన్-అక్కు-ఇక్కు-అన్ (౧_౨౧ సూ-న్)" మొదలగునవి. ఇవెల్ల నిర్దేశక సర్వనామ వికృతి రూపములె యనఁదగును. వీనిలోని తుది నకారము అకారానునాసికమగు మూర్ధన్య నకారము. ఇందలి యానునాసిక్యము లోపించినపుడు అకారము శేషించును. అనఁగా నాకాలపు 'ట-త' మధ్యస్థోచ్చారణము నిల్చును. 'అన్' అనునది తమిళమున సదృశార్థకము. కావునఁ దెల్గులోని 'అట్టి' మున్నగునవి (అన్ = అట్ + తి = అట్టి) తమిళములోని 'అన్ + తు = అట్రు' శబ్దమును సంబంధించున వనఁదగును. పయి సా (చా) రియైలు ప్రకృతి ప్రత్యయరూప శబ్దద్వయార్థ సంబంధమును దెలుపునవై తెల్గులోని యాపవిభక్తికముల వంటివగు ననఁదగును. తెల్గు

లోని నిర్దేశార్థక సర్వనామము 'అది-ఇది' అని యేర్పడుటచేతఁ దెలుఁగులోని యాపవిభక్తికములు 'టి-తి' రూపము నందినవి. తెల్గులోని యాపవిభక్తికములె యననేల? రామునిచేత (రామ+న్+ఇ+చేత) రాములచేత (రామ+ల్+అ+చేత) మున్నగు వానిలోని "ఇ-అ" అనునవి సైతము ప్రకృతి ప్రత్యయార్థములను సంబంధింపఁ జేయు నిర్దేశార్థక సర్వనా మాభిన్నములె యనఁదగును. 'అ-ఇ' అను నిర్దేశ సర్వనామములకు "అన్-ఇన్-అమ్-ఇమ్" అనురూపాంతరము లుండుటచేతఁ (చూ. ౨౮ V విషయము) దెల్గున "అంటి=అటి, ఇంటి-ఇటి" మున్నగు నౌపవిభక్తికముల రూపప్రపంచము గల్గియుండును. పయి సందర్భమునుబట్టి నిర్దేశ సర్వనామమగు-'అతు' (దు) అనుదాని ఖండమగు 'తు' అనునదే తెల్గులోని "కఱకుటమ్ము" మున్నగువానియందలి 'టు' గాగమమునకు మూలమని యూహింపనగును. (చూడు. ౩౭ విష. ౨౯-౨౯ I విష). ఉదా:—కఱకు + అతు = తు = టు + అమ్ము = కఱకుటమ్ము. నిద్దము + అద్దము = నిద్దపు + తు = టు + అద్దము = నిద్దపు టద్దము. ('త-ట' ల మార్పునకు:—పత్తనము = పట్టనము. మృత్తిక = మట్టి. మొ.) ఇట్లె కుఱు + తు + ఉసురు = కుట్టుసురు. చిఱు + తు + ఎలుక = చిట్టెలుక. నడు + తు + ఇల్లు = నట్టిల్లు. నిడు + తు + ఊర్పు = నిట్టూర్పు. కడు + తు + అలుక = కట్టలుక. ద్రావిడ భాషలలోని సరళోచ్చారణ మర్వాచీనముగాన 'నడు-నిడు' శబ్దములలో నిది 'టు' కారమె యనుట నిశ్చయము 'కుఱు-చిఱు-నడు-నిడు-కడు' శబ్దములలోని తుది హల్లు ప్రాస్వికాచ్ పూర్వకమగుటచేత స్వరపరకత్వమున ద్విరుక్తమయ్యె ననునది మార్గాంతరము. (చూ. ౪౭ I విష). అకారము ప్రాచీనకాలమున 'ట-త' మధ్యస్థోచ్చారణము గలదని యెఱుంగవలెను. (౧౭ XIII విష).

అకారము 'ట-త' మధ్యస్థోచ్చారణముగల దగుటచేతనే తెల్గునందలి తజ్జన్య ద్విరుక్త టకారస్థలములు కర్ణాటమున ద్విరుక్త తకారస్థలములయి వెలయుచున్నవి. (చూ. ౧౭ XIII విష.)

"విశేష్యోత్తరపద పూర్వపద స్యోపాన్త్య స్వరాదే ర్లోపః" (కర్ణా. భూష. ౧౪౦ సూ.)=స్వరపరకత్వమున విశేష్య ముత్తరపదముగాఁగల విశేషణ శబ్దముయొక్క యుపాన్త్యస్వరము మొదల్కొన్న శబ్దావయవము లోపించును. ఈ సూత్రముచే "కిఱిదు+అడి" (చిన్న యడుగు=చిన్న పాదము) మున్నగుచోటులందు 'ఇదు' అనుభాగము లోపింపఁగా 'కిఱ్' అనురీతిగల భాగము నిల్చును.

"కిఱిదో స్తః" (కర్ణా. భూష. ౧౪౨ సూ.) కిఱిదు శబ్దముయొక్క తుది అకారస్థానమున 'తు'కార మాదేశమగును. ఉదా:—కిఱిదు + అడి = కిఱ్ + అడి = కిత్ + అడి.

"ణ-ట-ళ-న-తానాం ద్విర్భావః" (కర్ణా. భూష. ౧౩౯ సూ.) అజాది శబ్దపరకత్వమున లుప్తశేషములలోని "ణ-ట-ళ-న-త" కారములు ద్విత్వము నొందును. ఉదా:—కిఱిదు+అడి=కిఱ్+అడి=కిత్+అడి=కిత్+త్+అడి=కిత్తడి=(ముని=ప్రతి) (చిన్నపాదము). కిఱిదు+ఈలె=కిత్తీలె=(చిన్న యీాడె పండు) ఇట్టి కన్నడ లక్ష్యములందును వైరీతిని హ్రాస్వైకాచ్, పూర్వక హల్లు స్వర పరకత్వమున ద్విత్వమునందుటచేత రూపసిద్ధి గల్గఁగా (చూ. ౪౮ I విష). వైయాకరణులు పైరీతిని ప్రక్రియ కల్పించిరని యూహింపవగును. "కిఱిదు" లోని 'దు' అనునది 'అదు' శబ్దాంశమె యని యెఱుంగనగును.

"కడిదు నిడిదు ద్వయ స్యాద్యైకస్వరా త్పరస్య టః" (కర్ణా. భూష. ౧౪౦ సూ.) 'కడిదు-నిడిదు' శబ్దములయొక్క మొదటి స్వరమునకుఁ బరమగు నవయవము స్థానమున 'ట' కారాదేశమగును. ఉదా:—కడిదు+ఆళ్=కట్టాళ్ (కఠినసేవకుఁడు=వీరుఁడగు భృత్యుఁడు) (కడిదు+ఆళ్=కట్+ట్+ఆళ్=కట్టాళ్). నిడిదు+అడకిల్=నిట్టడకిల్ (పొడవగు వరుస=పొడవగు దొంతి) (అడకిల్=ఒకదానిపై నొకటిగఁ జేర్చిన పేర్పు). వీనిలోని ప్రాచీన శబ్దభాగములు-'కట్-నిట్' అనునవె యనియు వానిపైని నిర్దేశక సర్వనామ శబ్ద భాగము నిల్వఁగా 'కడిదు-నిడిదు' శబ్దము లేర్పడినవనియు నక్కారణముననె స్వరపరకత్వమున హ్రాస్వైకాచ్ పూర్వక హల్లు (చూ. ౪౮ I విష.) ద్విత్వము నందెననియుఁ దత్వమును గ్రహింపవలయును.

'నడోశ్చ' (కర్ణా. భూష. ౧౪౧ సూ.)=నడుశబ్ద 'డ' కారస్థానము నందును 'ట' కార మాదేశ మగును. ఉదా:—నడు+ఇరుళ్=నట్టిరుళ్ (మధ్య రాత్రము). నడు+అడవి=నట్టడవి (అడవి నడుమ). ప్రాచీన ద్రావిడశబ్ద భాగము టకార విశిష్టమె యనియుఁ గాలక్రమమున నది సరళోచ్చారణము గలదయ్యెను నట్టిసమాసస్థలములం దా ప్రాచీన 'ట' కారమె నిల్చెననియు సహజస్థితి నెఱుంగునది. తెల్గులోని కడుప్రభృతులకుఁ గన్నడమందలి కడిదు ప్రభృతు లభిన్నములు. కన్నడమందును నట్టిస్థితిగలదు. "తేషా ముదన్తత్వం వ్యఞ్జనేషు" (కర్ణా. భూష. ౧౪౩ సూ.) కడిదు-నిడిదు-నడు-కిఱిదు శబ్దములకు హల్లు పరమగునపుడు వానికి 'ఉ' కారాంతత్వమగును. ఉదా:—కడిదు+కుదిరె=కడుగుదిరె=(బలమైన గుఱ్ఱము) నిడిదు+తోళ్=నిడుదోళ్ (సంస్కృ. దోర్=తోళ్=పొడవగు బాహువు) నడు+పగల్=నడుపగల్ (మధ్యాహ్నము) కిఱిదు+నెలె=కిఱునెలె (చిన్న నేల).

తమిళమునందును పైరీతిరూపములుగలవు. కాని తొల్కాప్పియ రీ విషయమును సంక్షేపించిరి.

"ఉయిరుమ్ పుళ్ళియుమ్......" (తొల్కా. ౪౮౩ సూ.)=అజంతము గాను హలంతముగాను నుండెడి వర్ణలోపము నొందిన 'ధ్వన్యర్థకము-గుణ వాచకము' నగుశబ్దములకును గర్మధారయ సమాసశబ్దములకును దద్ధర్మార్థక విశేషణ పూర్వపద సమాసములకును నామ్రేడిత సంఖ్యావాచకములకును నిట్టి మఱికొన్నిటికిని సంధికార్య ప్రక్రియ చూప శక్యము కాదు. ఉదా:— "కరుఙ్కుదిరైగళ్" అను సమాసమునం బూర్వపదము 'కరియన-కరియవై' మున్నగువానిలో నేది నిల్చినను నిలువవచ్చునుగానం జూపశక్యము కాదని చెప్పంబడెను. నన్నూలుకర్త "చిఱుమై (చిన్నతనము) కడుమై (గట్టితనము) కుఱుమై (పొట్టితనము)" అను నిట్టి భావార్థక శబ్దములను సమాస పూర్వావయవములుగా నిల్పి ప్రక్రియను సూత్రించెను. ఉదా:—చిఱుమై+ఎలి= చిట్టెలి=(చిన్నతనముగు నసంగాం జిన్నదగు నెలుక) కుఱుమై+ఉయిర్= కుట్టుయిర్=(కుట్టురుఱు=చిన్న ప్రాణము). కడుమై+ఎఱుమ్బు=కట్టెఱుమ్బు= క్రూరమగు చీమ) నడుమై+ఆఱు=నట్టాఱు (నట్టేఱు) వ్యస్తప్రయోగమున "చిఱిదు-కుఱిదు-నడువణదు-నెడిదు." అనురీతి నుండును. హల్పరకత్వమున— "చిఱుమై+మగన్=చిఱుమగన్=(చిన్న మానిసి)" అనురీతి నుండును.

స్వరపరకత్వమునందు బైరీతిని "చిఱుమై+ఎలి=చిఱు+ఎలి=చిట్టు+ ఎలి=చిట్టెలి" అనురీతిని రూపసిద్ధి నరయునది. ఇందలి పూర్వపదము "చిఱిదు" అని యుండు నన్నను ననవచ్చును. తమిళమున 'ఱు-టు' అనువాని కచ్చుపరమగునపుడు 'ఱ-ట'లకు ద్విత్వము గల్గుట సంప్రదాయము గాన 'చిఱు+ఎలి' మున్నగు చోటులందు 'చిట్టెలి' అనురీతిని రూపసిద్ధి గల్గును. (చూ. ౪౮ I విష.) ప్రాచీన కాలమున ఱకారము "ట-త" మధ్యస్థోచ్చారణముగలది.

తొల్కాప్పియమునందు స్వరపరకత్వమున "ఱ-ట (డ)లకు హ్రస్వైక స్వరపూర్వకత్వము" లేనపుడు సైతము (౪౮ I విష. చూడు.) ద్విత్వము గల్గుట సూచింపంబడి యున్నది.

"నెట్టెఴుత్తిమ్బర్......" (తొల్కా. ౧౯౭ సూ.)=విభక్తి పరమగు నపుడు ద్విత్వము వచ్చెడి చోటులందు మాత్రము పొట్టి 'ఉ' కారమునకుం బైరీతిని "ఇన్" సారియై రాదు. ఉదా:—యాఱు+ఐ=యాత్తై (నదిని). యాటు (డు)+ఐ=యాట్టై=(మేంకను). ఉకారాంతములగు 'ఱ-ట' (డ)ల కచ్చుపరమగునపుడు ద్విత్వము తఱుచుగా వచ్చునని సూచితము.

"అవైతా మియత్కై......" (తొల్కా. ౧౯౮ సూ.)=విభక్తి పరమగు నపుడు ద్విత్వము గల్గెడి పైచోటులం దే యాగమమును రాదు. ఉదా:— యాఱు+ఐ=యాఱ్ఱై (యాట్టై) (ఏటిని) మాడు+ఒడు=మాట్టొడు (పశువుతో) యాఱు+ఇల్=యాఱ్ఱిల్=(ఏటిలో). విభక్తిపరకత్వము లేనపుడు-"యాఱు+అదు=యాఅదు. (అదియేఱు) మాడు+అదు=మాడదు (అది పశువు)" అనియే రూపసిద్ధి గల్గును. (చూ. ౪౮ I విష).

౫౧. విష:—రాగమ సంధి:—"దారార్థేత ఉదపి రః" (అం. చిం.) (చూ. వ్యా. సం. ౯౩ విష.) అనుచొప్పున 'ఆలు' శబ్దపరకత్వమున సమానాధికరణ సమాసములో రేఫాగమము వచ్చునని యాంధ్ర వైయాకరణులు వచించిరి. అచటి రేఫము స్వరసంహితా వ్యవధాయకవర్ణమని డా. కాల్డువెల్లుగారు మున్నగువారు వచించిరి. ఈ విషయమీవలనె విమర్శితమయ్యెను. (చూ. ౩౬ విష). శబ్దతత్త్వము నరసినపుడు తెల్గున 'ఎల్లరు-ఎల్లరన్-వారు-బాలురు-బాలురన్' మున్నగుచోటులందుఁ బ్రాచీన ద్రావిడ బహువచనరూపమగు రేఫము నిల్చినట్లు 'ఆలు' శబ్దపరకత్వమునందును నయ్యది నిల్చుననుట యుక్త మని తోఁచును. (చూ. ౨౧ XVII. ౧౮ VIII. ౨౨ II. విష.) (చూ. 'వ్యా. సం.' ౧౪౪-౧౪౪ I విష.) ఈ విషయమునఁగల మతభేదము లిట విమర్శింపఁబడుచున్నవి.

"కొమరు" శబ్దమునకే "ఆలు" శబ్దమును జేర్పఁగా "కొమరాలు" అను రూపము భాషలో నేర్పడినదనుటకు సందేహము లేదు. ఇట్టి శబ్దముల సామ్యము చేతనే ప్రాచీనకాలమున 'మనుమరాలు' మొదలగు దేశ్యశబ్దములును జవరాలు-ముద్దరాలు మొదలగు తద్భవశబ్దములును నేర్పడి యుండును. (సంధి గ్రంథము. ౧౧౧ పుట).

"ప్రకృతిభావ నివారణమునఁ బయి 'య-వ' లు మాత్రమెగాక ఇంకను ఇతరములైన యాగమములు తెనుఁగున వచ్చుచునే యున్నవి......" (ఆం. భా. వి. ౩౨౩ పుట). "పేదరాలు-ముద్దరాలు-జవరాలు ఇత్యాది శబ్దముల యందు 'రు' గాగమము......పేదర్. (పేదయర్ యొక్క వికృతి=పేదవారు). పేదర్+ఆలు=పేదరాలు, ఇందును అనుచిత విభాగము. ఇట్లేర్పడిన రుగాగమము ఇతరస్థలములయందును సామ్యమువలనఁ గలిగినది. ధీరురాలు-గుణవంతురాలు మొదలయిన శబ్దములలోని రుగాగమము సామ్యమువలననే గలిగినది" (ఆం. భా. వి. ౩౨౪ పుట).

బహువచన 'రు' ప్రత్యయము శబ్దావయవమగుటచేత నది సంహితా వ్యవధాయక వర్ణమనుట యెంతమాత్రమును బొసఁగనేరదు. బాలురు, నృపా

లురు మున్నగు తత్సమములందును బహువచన 'రు' ప్రత్యయము నిల్చియుండు టచే 'ఆలు' శబ్దపరకత్వమునఁ గొన్ని తత్సమములందును దద్భవదేశ్యములం దంతటను రేఫము సహజమే యనఁదగుననియు దీని నగతిక గతియగు సామ్య సిద్ధాంతముచే సమర్థింప నక్కఱలేదనియుఁ దోఁచును. 'పేదర+ఆలు=పేదల స్త్రీ' అని యర్థము. "లు" ప్రత్యయ మవతరింపని ప్రాచీనకాలమందే యిట్టి రూపము లేర్పడినవగుటచేత నీ సంధి మిక్కిలి ప్రాచీనతమ మనఁదగును.

౫౨. విష:—నుమాగమము:—ద్రుతప్రకృతికముల ద్రుత మనునాసికాగమరూపమె యనుట సరికాదను విషయ మీవఱకు విపులముగా విమర్శింపఁ బడెను. (చూ. ౪౮ I ౪౭ విష. మొ.) ఇంక "నుమ్ చోతః" (ఆం. చిం.) "సరళే పరుషే చైవ। సమాసే ను ముతో భవేత్। అద్రుతాత్ స్వరసా దందు। పట్టి కూర్చి విభక్తిషు। తనేచ కుత్రచి దతో। వికారాచ్చాపి కేచన" (వికృ). (చూ. 'వ్యా. సం.' ౭౭-౯౯ విష.) అనునవి మొదలగు సూత్రములచే వైయాకరణులు విధించెడి నుమాగమ నకారము సయిత ముచ్చారణ సౌకర్యమాత్రార్థక స్వరసంహితా వ్యవధాయక వర్ణమె యను పాశ్చాత్య పండితాశయము సరికాదు. అట్టి సామాసికాగమ నకారము సైత మర్థ విశేష బోధకమె యగుచున్నది. సమానాధికరణ సమాసములలో వచ్చు "తళుకుం జెక్కులు" మున్నగు తావులందలి నకారము చార్థక మగుచున్నది. "నీలం చ తత్ ఉత్పలం చ=నీలోత్పలమ్" అను మొదలగు విగ్రహములందుఁ జూపట్టుచున్న 'చ' శబ్దార్థము నయ్యది (నుమ్) బోధించుచున్నది. (అది నీలత్వ ధర్మ విశిష్టమును నుత్పలత్వ ధర్మ విశిష్టమును నని యచటి విగ్రహమున కర్థము) ప్రాఁబల్కులు (ప్రాఁత+పల్కులు-ప్రాఁత-ప్రాక్ చ శబ్దభవము) లేఁబ్రాయము (లేఁత+ప్రాయము) మీఁగడ (మీఁదు+కడ) కెందామర (కెంపు+తామర) చెందొవ (చెన్ను+తొవ) మున్నగు చోటులందలి నకార మయ్యయి సమాసములలోని పూర్వపదములందలి యావయవికమగు నకారమె యనఁడగును. అచటి నకారము లోపించిన దననేల? మరల నుమ్మును విధించుకొననేల? అంతటను నేకవిధమగు సూత్రమును గుదురుపాటు చేసికొనుటకయి వైయాకరణు లట్లు సూత్రించుకొందురు గాక. ఇంక "క్రొంజాయ (క్రొత్త+చాయ) సంగోరు" (సగము+కోరు=భాగము) మున్నగుచోటులందలి నకారము పూర్వపదాంత్య భాగలోపమునకు బదులుగా నిల్చిన యనునాసిక మని చెప్పనగును.

ఇంక "రాజుయొక్క+ఆన=రాజునాన" అనునది మొదలగు స్థలములందలి "షష్ఠ్యా ఉతోఽచి నుమ్ నేచ" (చూ. 'వ్యా. సం.' ౯౬ విష.) అనునది మొదలగు సూత్రములచే విధింపఁబడిన 'ను-మాగమ 'న'కారము షష్ఠ్యర్థ

ద్వితీయా ప్రత్యయ నకారమె యై యుండుటచే నది యర్థవంతము. "షష్ఠీ భవే ద్వితీయా తుల్యా। తత్పురుష సంస్థితా నామ్నామ్" (చూ. 'వ్యా. సం.' ౨౭౦ విష.) అనురీతిని వైయాకరణు లచటి నకారము షష్ఠ్యర్థక ద్వితీయా రూపమనియె వచించియు దానికి "ద్రుతస్య సర్వత్ర లుక్ సమాసేషు" అను చోప్పున (చూ. 'వ్యా. సం.' ౬౭-౯౦ విష.) లోపము కల్గుననుచు వ్యాకరణ పద్ధతి ననుసరించి "షష్ఠ్యా ఉతోఽచి నుమ్ సేచ" (చూ. 'వ్యా. సం.' ౯౬ విష.) అను సూత్రముతో మరల నుమాగమమును విధించికొన్నవారైరి. ఇట్లు "రాజునాజ్ఞ" అనునది మున్నగుచోటులందలి నకార మావయవికము నర్థవంతము నయియున్నదేకాని యాగంతుకముగా వచ్చినదికాదు. ఉచ్చారణ సౌకర్యార్థక స్వరసంహితా వ్యవధాయక వర్ణమని భ్రమింపరాదు.

"ప్రభువు+ఆజ్ఞ; విధాతృ+ఆనతి" మొదలయిన స్థలములలో అచ్చులను నశింపకుండ నిలుపుటకు నడుమ ఆగమము రావలయును. ఇచ్చట యకారాగమము కల్గుట సుగమము కాదు. ఉకారము ఓష్ఠ్యము. వకారాగమమును ఉచ్చారణములో సౌకర్యమును గలిగింపదు. ముందొక వకారము కలదు గదా. కావున నకారాగమము కల్గినది. నిర్హేతుకముగా 'న'కారాగమము కల్గుచుండుటయు ఉన్నది పోవుచుండుటయు భాషలో పరిచితము లగుటచే నద్దాని సామ్యమున నియ్యది కల్గినది. ఇట్లే యనేకస్థలములయందు నకారము ప్రకృతిభావ నివారణముకొఱకు వచ్చినట్లు నిరూపింప వచ్చును" (ఆం. భా. వి. ౩౭౦ పుట). ఇట్లు వ్రాయుటకు "రాజుయొక్క+ఆజ్ఞ=రాజునాజ్ఞ" మున్నగుచోటులందు నకారాగమము లేకుండుటయు వకారాగమము వచ్చుటయు మచ్చునకేని గలదా? ముందొక వకారముండుటచే 'ప్రభువువాజ్ఞ' అను రీతిగల వకారాగమమునకుఁ బ్రతిబంధము గలిగినట్లు "రాజువాజ్ఞ" మున్నగు చోటులందుఁ బ్రతిబంధము గలుగలేదు గదా.

౫౩. విష:—"మో స్తు విభక్త్యేకవచనకే పు-౦పూ" (ఆం. చిం.) "సామానాధికరణ్యేతు। బహుత్వార్థే పరేపిచ। ముబ్వో ర్భవేతాం పు-౦ప్వాఖ్యా। వాదేశా వత్ర సర్వదా" (వికృ) ('వ్యా. సం.' ౯౮ విష.) అని యిట్లాంధ్ర వైయాకరణులు "ము-మ్ము-౦బు" అనువానిచోట 'పు-౦పు' లను విశేషణ సమాసములతో నాదేశములుగా నుపదేశించిరి. ఉదా:—నిద్దము+చెక్కు-లు=నిద్దపు చెక్కు-లు-నిద్దంపుచెక్కు-లు. ఈ 'పు-౦పు' ల చరిత్రము పరిశీలింపవలసి యున్నది.

"ప్రాచీన ద్రావిడభాషలో 'ప' కారము భావిచిహ్నము. (తెల్గు) అగు ధాతువునకు మూలమగు ప్రాచీన ద్రావిడధాతువు-'ఆ' అనునది. దానిపై నీ

భావిచిహ్నమును జేర్పఁగా 'అప్' అగును. దానిపై నుచ్చారణార్థకమగు 'ఉ' కారము చేరఁగా "అపు=అప్పు" అని యేర్పడనగును. 'అమ్'=తుదినిగల శబ్దములపై (నిద్దమ్-ము) దీని నిల్పఁగా "నిద్దమపు=నిద్దంపు" కావచ్చును. అనునాసికలోపమున 'నిద్దపు' అని కావచ్చును. ప్రాచీన కన్నడము "అల రంతప్ప కణ్=పూవువంటిదగు బాణము. (అలర్=పూవు. అంతు=అట్టి. అప్ప=అగు. కణ్=బాణము). నుణి తప్ప మాతు=మృదువగు మాట=(నుణ్ణితు=మృదువు. అప్ప=అగు. మాతు=మాట). అప్పన్=అగువాడు. అప్పళ్=అగునామె. ఇట్లె "ఎంబ=అనునట్టి (ఎన్+వ) తింబ=తినెడి=(తిన్+ప)" అను రీతి నితర ధాతువుల తద్ధర్మవిశేషణములును గలవు. "అప్పదు=(అగునది) అప్పవు=(అగునవి)" అను నుత్వ విశిష్టరూపములును గలవు. ప్రాచీన తమిఴమందు నిట్టివి గలవు. నల్లవై ఆప అఱజ్కళే=(మంచివగునవి ధర్మములె.) చెయ్యత్తగుప అఱజ్కళే=(చేయదగునవి ధర్మములె)." (శ్రీ విద్వాన్. వే. వేంకటరాజులు రెడ్డిగారు.)

పయిరీతికన్న ను విశ్వసనీయమగు మార్గాంతరము:—తమి-వేమ్బు (మ్బు)=(వేఁపచెట్టు) పిరమ్బు (మ్బు)=(ప్రేఁపచెట్టు). ఇరుమ్బు=(మ్బు)=(ఇనుము) పామ్బు (మ్బు)=(పాము). ప్రాచీన ద్రావిడభాషలో సరళోచ్చారణము లేమింజేసి (చూడు. ౧౭ XXII. ౧౭ XXIII. ౧౯ II. ౨౫ I విష). 'మ్బు' అను రూపమె ప్రాచీనతరము. "మ్బు=మ్బు=ంబు=బు=మ్ము=ము" అను రూపములలోఁ ప్రాచీనతరము. అట్టి "ంపు=పు" అనునది తెల్గున విశేషణ రూపములందును "ంబు=మ్ము=ము" అనునవి విశేష్య ప్రథమారూపములందును వ్యావర్తకముగా నిల్చెనని యెన్నన గును. అట్లు వెలసిన ప్రథమాప్రత్యయములె సంస్కృతసమ-సంస్కృతభవాది ప్రాతిపదికములపై నిల్పఁబడుచు వచ్చెనని. యెన్నన గును. తమిఴమందును 'ఇరుమ్బు' మున్నగునవి 'ఇరుప్పు' అను రీతిని సహజముగాఁ బరిణమించును. (చూడు. ౨౫ I మొ. ౨౫ VII వ-విష).

'వన్ఱొడర్......' (తొల్కా-౪౧౫ సూ.)=స్వానునాసికోపధకములగు కొన్ని పొట్టి 'ఉ' కారములతోడి పరుషములు ద్విరుక్తములగును. అట్టి ద్విరుక్తములగు పరుషములతో నున్న 'ఉ' కారమునకును, స్వాభావికపరుష పూర్వక పరుష స్థోకారమునకును, ననునాసికపూర్వక పరుష స్థోకారమునకును, బరమగు పరుషము సైతము సమాససంధిలో ద్విత్వమునందును. ఉదా:—ఇరుమ్బు+పెట్టి=ఇరుప్పు ప్పెట్టి (ఇనుప పెట్టె)......" మొ.

"మరప్పెయర్ క్కిళవి......" (తొల్కా. ౪౧౬ సూ.)=అర్ధమాత్రికో కారాంత వృక్షవాచకములకుఁ బరుష పరకత్వమున సమాసమందు "అమ్" అను నాగమము వచ్చును. ఉదా:—వేమ్బు+కోడు=వేప్పఙ్కోడు=(వేఁపకొమ్మ).

ఇట్లే తెలుగునందును ప్రాచీనకాలమునందలి "పు-ంపు" ల పైని సంబంధార్థకమగు 'అ' ప్రత్యయము నిల్చుటచేత "ప-పజ్" వర్ణకము లేర్పడియుండును. ఉదా:—వేంపు+అ+కొమ్మ=వేంపకొమ్మ=వేఁపకొమ్మ. ఇనుప పెట్టె-మొ.

ద్రావిడభాషలలోఁ గాలక్రమమున వచ్చిన సరళోచ్చారణము మూలమున 'మ్పు' అనునది 'మ్బు' అను రూపమునందెను. ఉదా:—(తమి) వేమ్బు-ఇరుమ్బు-మొ. తెల్గునందును నట్టి 'మ్బు' రూపములై "ంబు=మ్ము-బు-ము" అను రీతిని బరిణమించియుండును. వీనిలో ననునాసికలోపమున నేర్పడిన 'బు' వర్ణరూపము ప్రాచీనాంధ్రశాసనములలోఁ జూపట్టుచున్నను నది యాంధ్రపండితకవీంద్రసమ్మతి నందఁజాలదయ్యెను. 'మ్పు' అను దానిలోని యనునాసికము లోపించిన 'పు' వర్ణాంతవిశేషణ రూప మాంధ్ర పండిత కవీంద్ర సమ్మతిని గాంచెను. నన్నయభారత ప్రయోగములు:—

మధ్యా......నల్లనైన దీర్ఘపుఁ దనువును జూచి......(ఆది. ౪ఆ. ౨౫౪) సీ...... । బలితంపురక్కసు చెలియల (ఆది. ౬ ఆ. ౨౧౪). ఆ. వె. లోకవిరుద్ధంపువరము (ఆది. ౭ ఆ. ౨౬౨). తే-గీ...... । వీని పుట్టిన పాపంపు వేళయందు (ఆర. ౧ ఆ. ౪౯) తిక్కనభారతభాగమున నివి ప్రాసస్థలములం గన్పట్టుచున్నవి. ఎ-గీ......అగ్గ । లంపు సందడి నూష్మ జనింప...... (అశ్వ-౪ ఆ. ౩ ప) క. కృపి మున్నగు శిష్యులు......శోకా । ర్తపు టాడఖులతో......(స్త్రీ-౨ఆ-౧౨౪). (చూ. 'వ్యా. సం.' ౯౪ విష). 'ంబు' మున్నగువాని నన్నయప్రయోగములు:—క. ......ప్రభవిం । చెం బాండురాజు కురువం । శంబుఁ బ్రతిష్ఠింప (ఆది. ౪ ఆ. ౨౫౬) క. అమ్మానిసి......నె । య్యమున......(సభా. ౧ ఆ. ౧౪౬) ఉ. ఇమ్మది......త । త్వమ్ములు......సా । మమ్మున......రూ । కమ్ముగ......(సభా. ౨ ఆ. ౩౯) మ. హిమకరుఁదొట్టి ......యస్మదీయ వం । శమునఁ బ్రసిద్ధులై......(ఆది. ౧ ఆ. ౧౪ ప). పై వానిలో "ంపు-పు-ంబు-బు" అనునవి "మ్ము-ము" అనువానికన్నఁ బ్రాచీనములనుటకు సందియము లేదు. ప్రాచీనాంధ్రశాసనములలో "మ్ము-ము" అనునవి చూపట్టవు. "ంబు-బు" అనునవె తఱుచుగాఁ గన్పట్టును.

"స్వస్తి శ్రీమత్ సకలలోకాశ్రయ జయసింఘమహారాజులాకున్...... సంవత్సరంబుల్......ఉత్తరంబున పులొంబున......పడువారంబు......" (దక్షిణ హిందూదేశశాసనములు - సంపుట VI. పుట ౨౦౯ - నెంబరు ౫౯౪- కాలము, సుమారు. క్రీ॥ శ॥ ౬౪౧. సం॥ "స్వస్తిశ్రీ మగిదొగరజుల...... రాజ్యంబున......మిరియమ్బుబోళజకు......పదేన్దుంబు......" (లక్ష్మీపుర శాసనము. క్రీ॥ శ॥ ౬౭౫ మొ. ౬౯౯ సం॥ భారతిలోఁ బ్రచురితము).

"స్వస్తిశ్రీచోట......విక్రమాదిత్య శక్తికొమర విక్రమాదిత్యుల కొడుకుళ్......వేవాన్త్రూల్లు నిల్పినమ్ పుణ్యమ్ము. దీనికి వక్రమ్ము......లోకమ్మునున్డువాన్డు." (సత్యాదిత్యుని మాలెపాడు శాసనము-ఎపి-ఇం-పుట ౩౪౫. (౭ శతాబ్దము) (ఆం. భా. వి. ౧౦౦ పుట చూడుడు).

పయిశాసనము లీ వఱకుఁ జూపఁబడినవె (చూ. ౧౭ VII విష.) 'బు' అను రూపము నయితము నన్నయకు ముందటి శాసనములలో నగపడుచున్నది. మధ్యా:—"వెలయంగ నియ్యోట్టు ఱస్సి మలిను్రై విడిసిన బ్రోల । గల తానపతులును రాజు పట్టబు గట్టిన పతియు । నలియంబయ్యారల వెల్వఱించిన నస్వమేధంబు । ఫలబు పేక్కొంచిన లింగబటిసిన పాపంబు దమకు ।......(యుద్ధమల్లుని బెజవాడ శాసనము. శాసనపద్య మంజరి ౨-నెంబరు, శ. సం. ౮౨౦ ప్రాంతము) (పై పద్యములు ప్రతిబింబమునకు సరిగ వ్రాయఁబడినవి) ఇట్టి ప్రాచీన శాసనములలో "మ్ము-ము" అనునవి చూపట్టవు.

సంధిగ్రంథమున 'ము' అనునదే ప్రాచీనతమమను విషయమున నీ క్రింది రీతిని వ్రాయఁబడెను. "సంస్కృతమందలి అకారాంత నపుంసక శబ్దముల ప్రథమైక వచనరూపము "అమ్" అంతమందుఁ గలదై యుండుటచే 'ధనం-జ్ఞానం-ఫలం' మొదలగు శబ్దములు తత్సమములై యీ భాషలోఁ జేరునపుడు సామాన్యముగా హలంత శబ్దము తుదినొక యుకారమును జేర్చుకొను నలవాటునుబట్టి, అవి యొక 'ఉ' కారమును గ్రహించుటచే 'ధనము-జ్ఞానము-ఫలము' మొదలగు 'ము' వర్ణాంతశబ్దము లేర్పడుట తటస్థించినది. ఇట్లు తత్సమ నపుంసక లింగ శబ్దములెగాక దేశ్యశబ్దములలోను 'అమ్మ'ంత శబ్దములును గొన్ని గలవు. ఉదా:—"గుఱ్ఱమ్-ఏతమ్-మిాసమ్-చుట్టమ్" మొదలయినవి......ఈ దేశ్య పదముల తుదినిగల 'అమ్' అనునది అమహద్భావమును సూచించుటకో లేదా పూర్వ పదమును విశేషణముగా మార్చుటకో తరువాతికాలమున నమహచ్ఛబ్దంబులపైఁ జేర్పఁబడిన 'అతు' అను శబ్దమువలెనె ప్రాచీనకాలమున నాయా శబ్దములపైఁ (అమ్) జేర్పఁబడియుండుననియు నీ 'అమ్' అనునది నిర్దేశార్థ కామహత్సర్వనామమై యుండుననియు కాల్డ్వెల్ పండితుని యభిప్రాయమై యున్నది." (సంధి-౭౦-౭౨ పుటలు) ఇట్లు 'ము' వర్ణకాంతరూపమె ప్రాచీనతమమైనచో నయ్యది ప్రాచీనాంధ్రశాసనములం దెచ్చటను జూపట్టకుండునా? కేవల ప్రాచీన శాసనములందు 'మ్బు=ంబు' అను రూపములె చూపట్టుచున్నవి గదా.

ఆంధ్రభాషావికాస కర్తగారు పయిరూపముల పౌర్వాపర్యము విషయమునఁ గొంతవఱకు భిన్నాభిప్రాయులై యున్నారు. 'వు-బు' అను రూపములు

ప్రాచీనతమములని వారు తలంచుచున్నారు. "పువర్ణకంబు మాయ్యాదులకగు-. ఉదా:-మాపు-మేపు. అడుపు-కానుపు మొదలయినవి......ఇందలి పకారము బకారమగుటయు ముందు నాసిక్యమేర్పడుటయు వింతలేదు......క్రమబు-పట్టనబు-మొదలయిన రూపముల తరువాతనే క్రమంబు మొదలయిన రూపములు గలిగినవనుట యుక్తము." (ఆం.భా. వి. ౩౯౪-౩౯౫ పు). ఇది సరియని తోఁపదు. 'పు' అను కృత్ప్రత్యయము ధాతువు తుది 'చు' వర్ణము యొక్క పరిణామము. లక్ష్యాభాసములనఁదగు "మాయు-మాపు-మేయు-మేపు-కను-కానుపు" అను మూఁడిఁటి నిట నుపేక్షించినచోఁ దక్కిన యా సూత్రము నుదాహృతులెల్ల 'చు' వర్ణాంత ధాతుజకృదంతరూపములె. అడుచు-అడుపు-ఇంచు-ఇంపు-ఏఁచు-ఏఁపు-ఏచు-ఏపు-మొ. అట్టి చువర్ణ పరిణామరూప 'పు' ప్రత్యయమున కిటఁ బ్రసక్తియే లేదు. అవెల్ల స్త్రీ సమములు-పు=(ము) ప్రత్యయాంతములు కావు. "క్రమబు-ఫలబు" మున్నగు 'బు' ప్రత్యయాంతములు కేవల ప్రాచీనాంధ్ర శాసనములందు లేవు-కేవలప్రాచీనాంధ్ర శాసనములందెల్ల 'మ్బు=ంబు' అనునవె వాడఁబడియున్నవని పైని జూపఁబడెను గదా. 'ంబు' అనుదాని కర్వాచీన సరళోచ్చారణము లేనికాలమున 'మ్బు' అనునదె పూర్వరూపము. కాన "'ంపు=ంబు' అనునవె ప్రాచీనతరములు. 'పు=బు' అనునవె వాని తర్వాతివి" అనుట యుక్తము. అనునాసిక్య మూరకయె కల్గినదనుట సరికాదు. అయ్యది లోపించినదనుట యుక్తము.

౫౪. I విష:—ఆమ్రేడిత పరరూపసంధి నిత్యత:—పూర్వపదాంతిమ స్వరము బలహీనమును, నుత్తర పదాది స్వర మూనికగలదిగాన బలవత్తరమును నగుటచే వక్తకుఁ బరపదాదిమ స్వరోచ్చారణమం దాస్థ యధికమయియుండును గానఁ బరరూపసంధి మిక్కిలి స్వాభావికమయి ద్రావిడ భాషలందు—అందును దెల్గున—విస్తరించి యున్నది. ఇంక భృశార్థాదులవలనఁ గల్గు ద్విరుక్తియందు పరస్థమగు నామ్రేడితపదాద్యచ్చున కతోధిక ప్రాబల్యము స్వాభావికమగుటం జేసి యామ్రేడితపరకస్థలములందలి పరరూపసంధి యెల్లయచ్చులకును నిత్యమగుచు వెలయుచున్నది.

ఆమ్రేడిత సంధియందును బ్రకృతి ప్రత్యయసంధియందును స్వర సంహితా వ్యవధాయక వర్ణములు నిల్చుట కేవలము నసహజమగుటచేత నట్టి స్థలములందలి పరరూపసంధి నిత్యమై సంభవించును. ఆమ్రేడిత పరకత్వమునఁ బూర్వపదాంత్య వర్ణమునకును మఱికొన్ని యనాది వర్ణములకును లోపము గలుగుటయు భృశార్థమునఁ గల్గు నుచ్చారణ వేగాతిశయమున సహజమె యనఁదగును. ఉదా:—నాఁడు+నాఁడు=నానాఁడు. ఇంచుక+ఇంచుక=

ఇంచించుక. అప్పటన్ + అప్పటన్ = అప్పటప్పటన్. ఇంటన్ + ఇంటన్ = ఇంటింటన్-మొ.

౫౮. II విష:—భృశార్థామ్రేడితస్థలములందలి యుచ్చారణత్వరచేఁ బూర్వపదమందలి యనాదివర్ణములు లోపించుటయు నూనికచే బలవత్తరమగు నాద్యక్షరము మాత్రము నిల్చుటయు నట్టి లోపమునకుఁ బరిహారముగా నామ్రేడిత పదాద్యక్షరమునకు ద్విత్వముగాని పూర్వ పదలుప్త శేషాద్యక్షరము నకుఁ బరముగా బిందువుగాని నిల్చును. కొన్ని యెడలఁ బూర్వపదమందలి యేదేని యక్షరము తడఁబాటుగా నిల్చి ద్విరుక్తమగుటయు లేదా బిందుపూర్వక మగుటయు సంభవింపవచ్చును. ఉదా:—తునియలు+తునియలు=తుత్తుని యలు. తుమురు + తుమురు = తుత్తుమురు. అదుకు + అదుకు = అందదుకు. కడ + కడ = కట్టకడ. కడపటన్ + కడపటన్ = కట్టకడపటన్. నడుము+ నడుము=నట్టనడుము. పిడుగు+పిడుగు=పిట్టపిడుగు. (నేఁటి సరళములచోటఁ బ్రాచీనకాలమునఁ బరుషము లుండెడివను విషయము స్మరింపనగును) "తుట్ట తుది-మొట్టమొదలు" మున్నగుచోటులం దాదిని 'త'కారద్విత్వమె సహజముగా నుండెననియు వానిలో "పత్తనమ్=పట్టనమ్" మున్నగు స్థలములందువలెనె 'ట'కార ద్విత్వము కాలక్రమమునఁ గల్గెననియుఁ దోఁచెడిని.

"తుదిమొదలః పూర్వ స్యాదిస్వరాత్ త్తశ్చ" (కర్ణాట. శబ్దా. ౩౮౮ సూ.)=(వృత్తి) ఆధిక్యే ద్విః ప్రయుజ్యమానస్య తుదిశబ్దస్య మొదల్ శబ్దస్యచ పూర్వ స్యాదిస్వరా దుత్తరావయవస్య "త్త" ఇతి ద్వితకా రాదేశో భవతి. ప్రయోగః-తుత్తతుది-మొత్తమొదల్...... అను కర్ణాటరూపములు పై యభిప్రాయమున కనుకూలముగఁ జూపట్టుచున్నవి. 'ఎట్టయెదురు' మున్నగు చోటులందలి టకారస్థితియుఁ బైరీతినే సంభవించి యుండును. ఇంక "బయలు+ బయలు=బట్టబయలు. పగలు+పగలు=పట్టపగలు. కొన+కొన=కొట్టకొన. చివర+చివర=చిట్టచివర. తెన్ను + తెన్ను = తెట్టతెన్ను." మున్నగు నలంతి స్థలములందలి ద్విటకారక రూపములు పై వాని సామ్యమునఁ గల్గెనని యగతి కగతిగ నంగీకరింపవలయును.

౫౮:—III విష. వయివిషయముల పట్టున విమర్శకులు భిన్నభిన్నాభి ప్రాయులై యున్నారు. ౧౯౩౫-౧౯౩౬ సంవత్సరములలోఁ బ్రకటితమయిన సంధి గ్రంథమున 'నట్టనడుము' మొదలగు వానియందలి 'నడు' ప్రభృతులలోని 'డ=ట' కారమునుబట్టి ద్విత్వ టకారమేర్పడుట సహజమనియు, వాని సామ్య మునఁ దక్కినవానియందు ద్విరుక్త టకార మేర్పడెననియు వ్రాయఁబడెను. "'కట్టకడ-నట్టనడుము' అనురూపములలో 'కడు-నడు' శబ్దములనుబట్టి ద్విరుక్త

టకారము సహజముగా వచ్చినదనియుఁ దక్కిన వానిలో నిది సహజము కాదనియుఁ గావుననే సాదృశ్యజ (Analogical) మనియు నిశ్చయింపఁ దగి యున్నది." (సంధి ౧౧౨-౧౧౩ పుటలు) ఈ విషయములనె యాంధ్రభాషా వికాసకర్తగారు స్వీకరించి వ్రాసిరి. ఆం. భా. వి. ౩౨౫-౩౨౬ పుటలు చూచునది-ఇయ్యది ౧౯౪౭ సంవత్సరమునఁ బ్రకటితము.

ఇఁక 'అదుకు+అదుకు=అందదుకు' మున్నగువాని విషయమున సంధి గ్రంథకర్తగా (౧౯౩౫ సం॥) రట్టిజంటలు భృశార్థద్విరుక్తి స్థలములు కావనియు నట్టి జంటలలోని పూర్వపదములు పరపదార్థక ప్రత్యేక ప్రాచీన ద్రావిడపదము లనియు నిరూపింపఁగా 'ఆం. భా. చ' కర్తగారు (౧౯౩౭ సంవత్సరమునఁ బ్రకటి తము) "కట్టకడ" మున్నగువానిలోని పూర్వపదములు సైతమట్టివె యని నిరూ పించిరి. "పైదానినిబట్టి యా మ్రేడిత సంధి రూపములని చెప్పఁబడు పై సమా సములలోఁ బూర్వపదములు సంధివశమున వచ్చినవి కావనియుఁ బ్రత్యేకము లయినను బరపదములకు రూపాంతరములనియు, ఇచ్చట నామ్రేడిత ప్రసక్తి లేదనియుఁ దేలుచున్నది" (ఆం. భా. చ. ౩౬౩ పుట).

ఇట్టి నిరూపణములపై నీ క్రిందిరీతిని వికాసకర్తగారు తీర్మానించిరి. "ఆంధ్రభాషాచరిత్రకారుని మతంబున ద్విరుక్తియని చెప్పఁబడిన పైరూపముల లోని పూర్వపదము లన్నియును స్వతంత్రములె యనియు అన్యద్రావిడ భాష లలోఁ గలవనియు సిద్ధాంతము. ఇందుఁజెప్పఁబడినవన్నియు స్వతంత్రములేనా యను విషయము పరిశోధింపఁదగినది......కొన్ని యిందు వారూహించి నట్లే స్వతంత్ర పదములని నిరూపింపనగును గాని యన్నిటిని స్వతంత్రపదములని నిరూపించుట దుర్ఘటము. చాలవఱకి య్యవి సామ్యమున నేర్పడిన వనుట యుక్తము" (ఆం. భా. వి. ౩౨౫-౩౨౬ పుట).

౫౮. IV విష:—'కట్టకడ' మొదలగు స్థలములెల్ల భృశార్థద్విరుక్తి విష యములె యని సంధి గ్రంథకర్తగారు వచించుచుండఁగా వానిలో సైతము పూర్వపదములు ప్రత్యేక స్వతంత్ర శబ్దములె యనెడి "ఆం. భా. చ" కర్తగారి నిరూపణము:—తెల్గు-కట్ట (కడ) "కన్న-కట్ట=కడ". 'కడ' అను నర్థముగల 'కట్ట' శబ్దము కన్నడమునఁ గలదనియు నట్టిదె తెల్గునందును బ్రాచీన కాలమున నుండెడిదనియు నది యితర స్థలములందు నిల్వక నశించినదనియు "కట్టకడ" అను జంటయందు మాత్రమె నిల్చియున్నదనియు నాంధ్ర భాషా చరిత్రకర్తగారి యాశయము. ఇట్లె యంతటను వీరి సిద్ధాంతము నరయవలెను. "తెనుఁగు-నట్ట (నడుము) కన్న-నట్ట=(మధ్యముననున్న) నట్టగొంబు=(మధ్యనున్న కొమ్మ) తమి-నట్టమ్=(నిట్ట=నిలువు)." (ఆం. భా. చ. ౩౬౨ పుట) వీరి యీ వ్రాత

విశ్వసింపఁదగి యుండలేదు-"కడె నడో ష్ట్టః"=(వృత్తి) "అధిక్యే ద్విరుచ్యమానయోః 'కడె నడు' ఇత్యేతయోః పూర్వ స్యాదిస్వరా దుత్తరావయవస్య 'ట్ట' ఇత్యాదేశో భవతి......కట్టకడె. నట్టనడు......" (కర్ణాటశబ్దా-౩౯౦ సూ.) కర్ణాటమున వీరు వ్రాసినది సరియై యున్నయెడల కర్ణాట శబ్దానుశాసన కర్తయగు భట్టాకలంకదేవుఁడు పైరీతిని వ్రాసియుండఁడుగదా. కేశవ పండితుఁడును నిట్లె వచించెను. "అత్వం నడు వినంతె కడెగం టత్వం...... నట్టనడు-కట్టకడె......" (శబ్దమణిదర్పణము ౧౯౩ ప).

"తెనుఁగు-తుట్ట (తుద) కన్న-తుట్ట=కడ-కొన"
"తెనుఁగు-మొట్ట (మొదలు) కన్న-మొట్ట=సరిగానున్న"

(ఆం. భా. చ. ౩౬౨ పుట). ఈ వ్రాఁతయు విశ్వసింపఁదగినది కాదు. వీరి వ్రాఁతయే సరియై యున్నయెడల కర్ణాట శబ్దానుశాసన మందును శబ్దమణి దర్పణమునందును నీ క్రిందిరీతిని వ్రాయఁబడియుండదు గదా. "తుది మొదలః పూర్వ స్యాదిస్వరాత్ త్తశ్చ=(వృత్తి) అధిక్యే ద్విః ప్రయుజ్యమానస్య తుదిశబ్దస్య మొదల్ శబ్దస్యచ పూర్వ స్యాదిస్వరా దుత్తరావయవస్య 'త్త' ఇతి ద్వితకారాదేశో భవతి." ప్రయోగః-తుత్తతుది-మొత్తమొదల్. (కర్ణాట శబ్దానుశాసనము. ౩౮౭ సూ).

"తుదిమొద లెంబ దకార । క్కొదయిసుగుం ద్విత్వవృత్తియిందె తకారం । మొదలెంబ లకార క్కెం । ప్పొ దదర్శనవిధివిశేషమం నుడివెడెయొళ్ ॥ ......ప్రయోగ-తుత్తతుది. మొత్తమొదల్" (శబ్దమణి దర్పణము ౧౯౪ పద్యము).

'కట్ట-నట్ట-తుట్ట-మొట్ట' అను శబ్దములకుఁ బ్రాచీన కర్ణాటవాఙ్మయమునఁ బ్రత్యేక ప్రయోగములేదు. అట్టియెడల వానిస్థితి నిరాధారము-అట్టిశబ్దములు కర్ణాటభాషలో నెంతమాత్రము లేవనుటకు మహాపండితులగు భట్టాకలంక దేవ, కేశవ పండితుల పై సూత్రములె ప్రబల నిదర్శనము లనవచ్చును.

మఱియు నామ్రేడిత రూప ద్విరుక్తి నంగీకరింపనపుడు "క్రియా సమభిహారేచ" (సి. కౌ. ౪౬౫౫-వార్తి) "పౌనఃపున్యం భృశత్వంచ । క్రియాసమభిహారః..." (బాలమనోరమా వ్యాఖ్య) అనుచొప్పున ద్విరుక్తివలనఁ గల్గవలసిన భృశార్థసిద్ధి యెట్లు గల్గును? (చూ. 'వ్యా. సం.' విస్తర II ౧౦౨ I విష.) రూపాంతర పునః ప్రయోగమున నట్టి భృశాద్యర్థ సిద్ధి గల్గనేరదు గదా, రూపాంతర పునః ప్రయోగమునఁ బునరుక్తిదోషము గల్గునేకాని పునరుక్తి నివారణపూర్వక భృశాద్యర్థ సిద్ధిగల్గనేరదు. "ఆమ్రేడితమ్. న. ద్విస్త్రిరుక్తే. యథా సర్పః సర్ప ఇతి. ఆమ్రేడ్యతే అధిక్యే నోచ్యతేస్మ. మ్రేడృ ఉన్మాదే క్తః." (శబ్దా. చిం.)

ఉస్సత్తునివలెఁ బల్కిన శబ్దమునే మరలఁ బల్కుటచేత భృశార్థము లక్షితమగు నని భావము. ఈ జంట శబ్దములనే యాధారముగాఁ గొని యీ జంట శబ్దములలోని పూర్వావయవములను మఱికొన్నిటిని సయితము నవీన కన్నడ కోశములలోఁ జూపిరి. వానిని మూలముగాఁ గొని భాషా చరిత్రకర్తగారవెల్ల ద్విరుక్తి విషయములు కావనుచు వ్రాయుట సరికాదు.

"తెనుఁగు-పిట్ట (పిడుగు). కన్న-పిట్ట=పిడుగు. తెనుఁగు-బట్ట (బయలు) కన్న-బట్ట=శూన్యము=బయలు. తెనుఁగు-మట్ట (మధ్యాహ్నము). కన్న-మొట్ట=సరిగా నున్నది. దీనిరూపాంతరము-మట్ట. మిట్టునకుఁ దెనుఁగుననే మిట్ట రూపాంతరము గలదు." (ఆం. భా. చ. ౩౬౨ పుట).

పయిరీతి నిట్టి జంటశబ్దములె మూలముగాఁ గల కన్నడ రూపాంతములు సైతము కుదురుపడమిచే భాషాచరిత్రకర్తగారు త్రొక్కిన యపమార్గములు:— "తెనుఁగు-చిట్ట (చివర)=చివ్ర=చిట్ర=చిట్ట్ర=చిట్ట" (ఆం. భా. చ. ౩౬౨ పుట) చివ్రశబ్ద వికృతి చిట్టయనియు దాని ప్రాచీనోచ్చారణము చిట్ట యనియుఁ దాత్పర్యము. కాని 'చివర' అనునది "చివ్ర" అగుననుటకుఁ బ్రమాణమేమి? 'చివ్ర' అనునది "చిట్ర" అని యేల పరిణమించును? 'ట్ర' అనుదానికి 'ట్ర' అను నుచ్చారణము ప్రాచీనకాలమున నుండెడిదనుట యింకొక పొరపాటు. అకారమందు రేఫోచ్చారణము ప్రాచీనకాలమున నెంతమాత్రమును లేదు. అకారము 'ట త' మధ్యస్థోచ్చారణము గలదని తొల్కాప్పియమున స్పష్టముగాఁ జెప్పఁబడెను. (చూ. తొల్కా. ౯౪ సూ.) (చూ. ౧౯ VII విష). 'పట్ట పగలు' అనుచోట నింకను నసంగతముగ వ్రాసిరి. "తెనుఁగు-పట్ట (పగలు), తమి-పట్టప్పగల్. ఇందు 'పట్ట' అనుదానికి తగిన యుదాహరణము దొరక లేదు. తమిళమున "పట్టు" అను తు మర్థకరూపము గలదు. దానికి 'తెగిన-పగిలిన' అను నర్థము గలదు. పట్ర=పత్ర=పట్ట." (ఆం. భా. చ. ౩౬౨ పుట). తమిళమున నట్టి శబ్దమును దానికట్టి యర్థములును లేవు.

౫౮. V విష:—"ఇంకులు+ఇంకులు=ఇట్టింకులు. ఇగ్గులు+ఇగ్గులు= ఇల్లిగ్గులు" మున్నగుచోటులు సయితము (బాల. సంధి. ౪౨ సూ.) భృశార్థ ద్విరుక్తి విషయములు కావనియు నట్టి జంటలలో సైతము మొదటి శబ్దములు వేఱు స్వతంత్ర శబ్దముల భాగములనియు సంధి గ్రంథకర్తగారును (౧౯౩౪ సం॥ ముద్రితము) నించుక నవరణముతో నాంధ్రభాషా చరిత్రకర్తగారును (౧౯౩౭ సం॥ ముద్రితము) వ్రాసిరి. ఇంక మఱికొన్నిటి నేతత్పూర్వోక్తములను విడువనేల యని కాఁబోలును నిర్వివాదముగ భృశార్థ ద్విరుక్తి విషయములె యనఁదగు "తుత్తుమురు-తుత్తునియలు" మున్నగువానిని సయితము ద్విరుక్తి విషయములు కావనియె సమర్థింపయత్నించిరి.

"తుత్తునియ-తుత్తుమురు:—"తుణ్ణు-తుని - తునక - తుప్పర - తునుము - తునుగు-తునియ" మొదలగు ననేకములగు శబ్దములనుబట్టి చూడఁగా 'తున్' అనునది మూలధాతువుగాఁ గనఁబడుచున్నది. "తమి - తుణి - తుణికై ౯. కన్న-తుణక......" అని యున్నవి. తున్+తునియ=తుత్తునియ-యయి యుండును. పూర్వానునాసికము పరమందలి పరుష తకార సాహచర్యమున తకారముగా మాఱిపోయినది (సంధిగ్రంథ ౧౮౯ పుట) "తుటి పాదసంఘట్టనే-శబ్దమణిదర్పణము)......ఈ తుటి లేదా తుఱు ధాతువునుండియే తుఱుమ్బు-తుమ్బు-దుమ్ము మొదలగు రూపములు......బయలుదేఱినవి......తుట్-తున్+తుఱుము=తుత్తుఱుము అని యయి వర్ణవ్యత్యయముచే "తుత్తుమురు" ......" (సంధిగ్రంథ ౧౨౦-౧౨౧ పుట). ఈ వక్రమార్గములు సరికావని తోఁచి కావలయు డా. నారాయణరావుగారు, "కన్న-తుత్తు+తుమురు= తుత్తుమురు. తుత్తు + తునియ = తుత్తునియ=(తునుక = ముక్క)" అయ్యెనని వ్రాసిరి. (ఆం. భా. చ. ౩౬౨ పుట). వీరి 'తుత్తు' శబ్దమును వారి 'తున్' శబ్దమును భాషలోను గోశములందును లేవు.

ఆంధ్ర వ్యాకరణములలోను నాంధ్రకోశములలోను వ్రాయఁబడిన మార్గము కాదని యిట్టి యపమార్గములను ద్రొక్కిరేకాని "తునియ + తునియ=తుత్తునియ - తుమురు + తుమురు = తుత్తుమురు" అను ఛేదములలో విరోధమేమున్నది. ద్విరుక్తి వేగమునఁ బూర్వపదమం దాద్యక్షరము నిల్చి తక్కినభాగము లోపించుటయు నందులకుఁ బరిహారముగాఁ బరపదాద్యక్షరము నకు ద్విత్వము గల్గుటయు (నెత్తావి-క్రొగ్గండి. మొ.) నుచ్చారణ స్వభావము లనుటలో సందియము లేదు గదా. "తుత్తునియలు-దే వి-బ-(తునియలు+తునియలు)......". "తుత్తుమురు-దే-వి. (తుమురు+తుమురు) మిక్కిలి తుమురు (తుమురు=పొడి)". (శ-ర)

"కన్నడభాషలో......అఱుందు + అదుకు = అందు + అదుకు=అందదుకు." (సంధి గ్రంథ ౧౧౪ పు) "అందు=అదుకు". (ఆం. భా. చ. ౩౬౩ పు.) ఇట్లు కన్నడములో నిల్చియున్న శబ్దములు తెల్గులో నుండెడివనియు నవి యుండు కాలమున నీ జంట యేర్పడెననియుఁ గల్పించుకొననేల? తెనుఁగులోమాత్ర మిపుడును 'అందు' శబ్దము లేదా. "అందు+అదుకు=అందదుకు=అందియు నందని రీతిగా నదుకుకొని యుండు" అని యర్థము చేయరాదా. కన్నడము నకుఁ బోనేల? "అందదుకు. దే-విణ. (అదుకు+అదుకు) మిక్కిలి యదుకు కలది. మ......రాత్రుసాంగనచే నందదుకైన యయ్యొడలు" (జరాసంధుని యొడలు) (శ-ర) అనురీతిని భృశార్థ ద్విరుక్తి యన్నమాని యాంధ్ర పండిత వైయాకరణు

లభిప్రాయపడిరి. ఈ ఛేదములోని శబ్దముల వికృతి సహజముగా లేమింజేసి "అందదుకు ప్రభృతులు యథాప్రయోగంబుగ గ్రాహ్యంబులు" అని సూరి గారు భృశార్థ ద్విరుక్తి నంగీకరించుచు నందలి వికృతికై వ్యాకరణపద్ధతి నాశ్ర యించి నిపతించిరి. ఇట "అదుకు+అదుకు=అందదుకు" అను ద్విరుక్తి వేగ మునఁ బూర్వశబ్దములోని 'ద' కారము సైతము నిల్వఁగా 'అదదుకు' అని సిద్ధింప వలసి యుండఁగా లుప్తాక్షర పరిహారముగా నానునాసిక్యము ప్రథమాక్షరము నకు వెనుక నిల్చెనని యంగీకరించుట యుక్తము.

ఆంధ్రపండిత వైయాకరణులు "ఇఱ్ఱింకులు-ఇల్లిగ్గులు-చెల్లచెదరు-చెల్లా చెదరు-మిఱుమిట్లు" మున్నగువానిని సయితము భృశార్థద్విరుక్తిరూపములను గానే యంగీకరించి యందలి వర్ణవికృతులను వ్యాకరణ పద్ధతుల చొప్పున నిపతించుచు సమర్థించిరి. "ఇఱ్ఱింకులు-దే-వి-బ (ఇంకులు+ఇంకులు) మిక్కిలి యింకుటలు......" "ఇల్లిగ్గులు. దే. బ. (ఇగ్గులు+ఇగ్గులు) మిక్కిలి వెనుక కొఱగుటలు" "చెల్లచెదరు-దే-విణ. (చెదరు+చెదరు) మిక్కిలి చెదరినది" "మిఱుమిట్లు-దే-వి-బ-(మిట్లు+మిట్లు) (కన్నులు) మిక్కిలి మిట్టుటలు" (శ-ర).

పయివానిలో "ఇఱ్ఱింకులు" అనుచో ఱకారద్వయము 'ఇల్లిగ్గులు' 'చెల్ల చెదరు' అను చోటులందు లకారద్వయము "మిఱుమిట్లు" అనుచో శకటమును నూరకయె వచ్చిచేరినవనుట శబ్దతత్త్వపరిశీలనపద్ధతులకు విరుద్ధమని తలఁచి సంధి గ్రంథకర్తృ ప్రభృతులు మార్గాంతరముల సమర్థింపఁజూచిరి.

"ఇఱ్ఱింకులు:—ఇఱుకు=ఇంకు. ఇఱుకు=ఒత్తుడుపడియుండు. ఇంకు= నీరింకిపోవు. ఒత్తుడు పడియుండి యత్యల్పస్థలమాక్రమించి తుదకాస్థలమున లీనమై రూపు మాసిపోవుటయే యింకుట......కన్నడమున 'ఇఱుకు-ఇఱింకు- ఇఱుంకు'......'ఇఱికిను-ఇఱుకిను-ఇఱుంకిను' అను రూపము లేర్పడుచున్నవి." (సంధిగ్రంథ ౧౧౫ పుట). దీనినిబట్టి "ఇఱుకు+ఇంకు=ఇఱ్ఱింకు" అని ప్రక్రియ యేర్పడుచున్నది. సూరిప్రభృతు లంగీకరించిన భృశార్థకద్విరుక్తిని వీడినను సంధి గ్రంథకర్త చూపినరీతి నర్థసిద్ధికి భంగములేదుగాన నిదియు సరియేయని యంగీక రించిన నంగీకరింపనగును. "ఆం. భా. చ" కర్తగారు పైమార్గము నుపేక్షించి యీ క్రిందిరీతిని వ్రాసిరి. "తెనుఁగు-ఇవురు=ఇవ్రు=ఇఱ్ఱు+ఇంకు=ఇఱ్ఱింకు" (ఆం. భా. చ. ౩౬౨-౩౬౩ పుటలు). ఈ పరిణామక్రమము కేవలము నసం భవము. 'ఇవ్రు' అనునది 'ఇఱ్ఱు' అని యగుటెట్లు? ఎచ్చటనైన నిట్టి పరిణామము గలదా! ప్రాచీన కాలమున రేఫోచ్చారణము ఱకారోచ్చారణమునకు సన్ని హితముకాదు - ఱకారము 'ట-శ' మధ్యస్థోచ్చారణము గలది.

"ఇల్లిగ్గులు-'ఇగ్గు' అనునది "ఈఁగు" ధాతురూపాంతరము......దండ ప్రణామం బాచరించునపుడు మనుజుఁడు క్రిందికి వంగి భూమిపై వ్రాలుట సంభవించును......ఎఱఁగు శబ్దము......'నమస్కరించు' అను నర్థముగలదై యున్నది. "ఇటి" అను మూలధాతువునుండియె తెలుఁగున 'డిగు-దిగు' అను రూపము లేర్పడినవి. ఇది తుళుభాషలో "ఇళి-ఇలి" అను రూపములు గలదై యున్నది......'ఇలిగు+ఇగ్గు' అనునవి చేరుటచేత "ఇల్లిగ్గులు" అను రూపము ప్రాచీనకాలమున నేర్పడియుండును". (సంధిగ్రంథ ౧౧౭ పుట).

"ఇలుగు. దే-అ-క్రి. (ఈలుగు యొక్క రూపాంతరము.) చచ్చు." (శ-ర) "ఇలుగు=ఇల్లు+ఇల్లు=ఇల్లిల్లు=ఇల్లిగ్గు" అను రీతిని జంటశబ్దములను గల్పించినను "ఇల్లిగ్గు" అను రూపము సిద్ధించును గదా. చచ్చుటయు వెనుక కొఱగిపడుటయు సన్నిహితార్థకములే కదా! హల్సంయోగమున నొక హల్లు లోపించి తక్కిన హల్లు ద్విరుక్తినందుట సర్వసమ్మతమే కదా. ఇచటి ద్విరుక్తిచే భృశార్థసిద్ధియుఁ గల్గుచున్నది.

ఇట 'ఆం. భా. చ.' కర్తగా రీ క్రిందిరీతిని వ్రాసిరి. "తెనుఁగు-ఇవ్రులు=ఇవ్లు=ఇల్లు=ఇగ్గు." (ఆం. భా. చ. ౩౬౨-౩౬౩ పుటలు). శబ్దరత్నాకరాది కోశములలో 'ఇవ్రులు' శబ్దము లేదు. "ఇగులుచు-దే-స-క్రి. ఇగిలించు (రూ-ఇగుల్చు)" (శ-ర). "ఇవులుచు. దే-స-క్రి. (ఇగులుచు యొక్క రూపాంతరము) (రూ-ఇవుల్చు)" (శ-ర). ఇట్లు "ఇవులుచు" శబ్దముగలదు. దీని 'ఇగిలించు' అను నర్థమున కిచటఁ బ్రసక్తియే లేదు.

చెల్లచెదరు=చెల్లాచెదరు. "కన్నడమున-"చెల్లు" ధాతువే కలదు. దీనికి "వికీర్ణత్వమె" (To scatter about) = చల్లుట యనియే యర్థము......దీనికి రూపాంతరము "చెలంకు"......తెలుఁగున......చిలుకుధాతు వీ చెలంకు ధాతువుయొక్క రూపాంతరము లేదా మూలరూపమై యుండును......చెల్లు నట్లుగా వికీర్ణమగునట్లుగా చల్లఁబడునట్లుగా చెదరుట 'చెల్లాచెదరు' అగును" (సంధిగ్రంథ ౧౧౯ పుట).

ఇంత శ్రమపడి కన్నడ 'చెల్లు' ధాతు (వికీర్ణ) నుజ్యంతరూపము తెల్గు నను నుండెడిదని కల్పింపనేల? తెల్గునందలి "చెల్లు" ధాతు నుజ్యంతరూపమునే గ్రహించి సమర్థింపరాదా? "చెల్లన్ + చెదరు = చెల్లాచెదరు = చెల్లచెదరు = చెల్లిపోవునట్లు=నిశ్శేషమగునట్లు చెదరు" అని యేల చెప్పరాదు? ఈ రెండు సమర్థనములందును నొక యనుపపత్తి లేకపోలేదు. "చెల్లన్+చెదరు= చెల్లఁజెదరు" అగుట ప్రాచీన పద్ధతి. ద్రుతము లోపించి పూర్వాచ్చునకు

దీర్ఘము నొదవించుట నవీనపద్ధతి. ఇది ప్రాచీనరూపముల పట్టున నుపచరింపదు గదా.

మిఱుమిట్లు:—"మిట్లు శబ్దము......దీనికి రూపాంతరము-'మిఱ్ఱు' అనునది......'మిఱ్ఱు' అనఁగా నున్నత భూమి......మిక్కిలి మిట్టలు గొనుట యని యర్థము. ప్రాచీనమగు మిఱు శబ్దము దానిరూపాంతరమగు మిట్టు శబ్దముతోఁ గూడి "మిఱుమిట్లు" అను శబ్ద మేర్పడినది." (సంధిగ్రంథ ౧౧౭ పుట) ఇది సరికాదు.

మిట్టుశబ్దమునకు సంధి గ్రంథకర్త తలంచిన ట్లున్నత ప్రదేశ మర్థము కాదు. అట్టి యర్థము కోశములందును లేదు. ప్రాచీన కవి ప్రయోగము లందునులేదు. 'మిట్ట' శబ్దమున కున్నత భూమియని యర్థము. మిఱ్ఱు శబ్దమునకు నున్నత భూమి యనియే యర్థము. 'మిఱుమిట్లు' అను శబ్దమునకు మిక్కిలి మిట్టలు గొనుట యనునది యర్థము కామింజేసి సంధి గ్రంథకర్తగారి రూపకల్పనము సంగతము కాదు. "మిఱుమిట్లు గొను. దే-అ-క్రి. (మిఱుమిట్లు+కొను) (కన్నులు) మిక్కిలి చెదరు. సీ. శాతహేతిచ్ఛటాచ్ఛచ్ఛవి స్ఫూర్తిచే మిగులఁ గన్నులు మిఱుమిట్లు గొనఁగ. (పురూరవశ్చరిత్రము. ౧ ఆ.)" (శ-ర) గొప్ప తేజస్సును జూచునప్పుడు కన్నులు 'ఎగిరిపడుట' యని మిఱుమిట్టుగొను శబ్దమున కర్థము. "మిట్టిపడు ద్వ. అ-క్రి. ఎగిరిపడు......" (శ-ర) అను చొప్పున "మిట్టు" శబ్దమునకు 'ఎరిగిపడు=త్రుళ్ళిపడు' అని యర్థము. నేఁడు ద్వి టకారక మగుచోటులందుఁ బ్రాచీనతమకాలమున ఱకారద్వయ ముండుట సంప్రదాయ మగుటంజేసి 'మిట్టు' శబ్దముయొక్క ప్రాచీనతమకాలరూపము "మిఱ్ఱు" అని యుండనోపును. (చూ. ౧౭ XIII విభ.) అట్లగుటం జేసి "మిఱుమిట్లు" అను ప్రాచీన శబ్దమున ఱకారముండుట విరుద్ధము కానేరదు.

"తమి-మిఱ్ఱు=తెలుఁగు-మిట్టు=ప్రకాశించు." (ఆం. భా. చ. ౩౬౨-౩౬౩ పుటలు) పయి నుదాహరించిన ప్రమాణముల చొప్పున ప్రకాశార్థమునకిచటఁ బ్రసక్తిలేమింజేసి యాంధ్ర భాషాచరిత్ర కర్తగారి వ్రాఁత కేవలము నప్రసక్తము. మఱియు 'మిఱ్ఱు=ప్రకాశించు' అనునది తమిళమున లేదు.

ఇది ద్రావిడభాషా పరిశీలనమునందలి

ధ్వనిప్రకరణము.

---

# ద్రావిడ భాషా పరిశీలనము.

## II ప్రకరణము – ధాతువులు

క్రియా వాచకములు ధాతుసంజ్ఞగలవి.

౫౫. I విష:—సంస్కృత వైయాకరణులు "భూవాదయో ధాతవః. (౧-౩-౧) క్రియా వాచినో భ్వాదయో ధాతుసంజ్ఞాః స్యుః" (సి. కౌ. సంజ్ఞా-౧౮ సూ.) "భ్వాద్యదాదీ జుహోత్యాది ర్దివాది స్స్వాదిరేవచ। తుదాదిశ్చ రుధాదిశ్చ। తన క్ర్యాది చురాదయః" (ముగ్ధ. ౧౧ సూ. వ్యాఖ్య.) అను చొప్పున "భూ సత్తాయామ్" అనునది మొదలగు క్రియా వాచకములైన ప్రకృతులు మాత్రమె ధాతువులని వ్యవహరింతురు. ప్రాతిపదికములగు ప్రకృతులను ధాతువులని వ్యవహరించు సంప్రదాయము సంస్కృతమున లేదు. ఈ పద్ధతి ననుసరించియే ద్రావిడ వైయాకరణులును క్రియా వాచకములె ధాతువులని వచించిరి.

"వినై......" (తొల్కా. ౬౮౨ సూ.)= క్రియ యనునది సుబ్విభక్తి ప్రత్యయములను బొందదు. కాలమును దెలుపును.

"ప్రాతిపదికం హి నామ । ప్రత్యయ ఇహ వర్ణకః క్రియా ధాతుః", (ఆం. చిం) (వ్యా. సం. ౩౦ విష).

"క్రియార్థో ధాతుః. (కర్ణా. భూ. ౧౯౮ సూ.) = క్రియావాచి ధాతు వనఁబడును".

అట్లయినను భాషా చరిత్ర శాస్త్రజ్ఞులు ధాతువనఁగా "మూల భూత శబ్ద మాత్రము" అని చెప్పుదురు.

"సుప్తిఙ్ ప్రత్యయములు నేర్పు కొన్ని ధాతువుల నుండియు నామముల నుండియుఁ బుట్టిన వని గ్రహింపవలయును". (కాల్డు. ౧౯౫ పు.) క్రియా వాచకములే కాక నామములును ధాతువులె యన్న తలంపున్న డా. కాల్డువెల్లు గారు పయిరీతిని ద్వైవిధ్యమును వచించుట సరికాదు. కాల్డు వెల్లుగారు తఱుచుగాఁ గ్రియావాచకములనే ధాతువులుగా నుదాహరించియు (చూడు ౫౬ విష). నరుదుగ నామములను సయితము ధాతువులుగా నుదాహరించిరి.

“తమి—విరల్ =(వ్రేలు)—ధాతు—విరి=(వ్యాపించు). కడల్ =(సముద్రము) ధాతు—కడ=(దాఁటు). పగల్ =పగలు—ధాతు—పగు=(విభజించు). కుడల్ =(ప్రేగు)—ధాతు—కుడై =(గుల్లచేయు)” (కాల్డు. ౧౯౩ పుట).

“క్రియా నామవాచకములు మరల ధాతువులగు చుండెడివి”. (కాల్డు. ౨౦౮ పు.) (చూ. ౬౨ విష). “పన్ని=(పంది) ధాతు—పల్ =(దంతము-కోఱ)”. (కాల్డు. ౧౯౪ పు). (ఇట్లు వ్రాసిరేకాని యిచట సయితము ‘పల్’ ధాతువునకు ‘కోఱలతో గ్రుచ్చు’ అనురీతిని క్రియావాచిత్వ మేల చెప్పరాదు). ఇట్టి వ్రాఁతలను జూచియే కాఁబోలును “స్టడీ. ద్రవి” గ్రంథకర్తగారీ క్రిందిరీతిని వ్రాసిరి. “VII. ద్రావిడ ధాతువులెల్ల వ్యాపారబోధక మాత్రములు కావు. విశేషణ సర్వనామాది రూపములును ధాతువులు గలవు. ఉదా:—వ్యాపార బోధక—పో=(పోవు). ఈ=(ఇచ్చు). గుణవాచక—వెళ్—కర్. సర్వనామ-నా. నీ. నిర్దేశవాచక—అ. ఇ. ఉ......విశేష్యాదులును ధాతువులగును”. (స్టడీ. ద్రవి. ౪౬ పుట). ఇట్టి వ్రాఁతలు కాల్డువెల్లుగారి గ్రంథమునఁ గానరావు.

“అ. ఇ. ఉ ల నుండి ‘అగు-ఇచు-ఉతు’ అను ధాతువు లేర్పడి యను నాసికోచ్చారణముతో ‘అంగు-ఇంచు-ఉందు’ అని యేర్పడెను”. (స్టడీ. ద్రవి. ౫౧ పుట) అనియు వ్రాసిరి. ఈ వ్రాఁత యీ క్రింది కాల్డువెల్లు వాక్యమునకుఁ బ్రతికూల మనఁదగును.

“పురుష బోధక సర్వనామములు, విభక్తులు, విభక్త్యర్థ కావ్యయములు మఱికొన్ని నామములు మున్నగు వానికి ధాతువులను జూపుట శక్యముకాదు”. (కాల్డు. ౧౯౫ పుట).

౫౫. II విష:—శబ్ద ప్రపంచమునకు ధాతువులె మూలమని పెక్కురు శాస్త్రజ్ఞుల యాశయము.

“ధీయతే సర్వం నిక్షిప్యతేఽస్మిన్నితి ధాతుః”. ధా—ధారణే. ‘సిత ని గమి మసీత్యాదినా, తున్’. (ఉణాది. ౬౯ సూ. సి. కౌ.) అను చొప్పున శబ్ద ప్రపంచమున కెల్లఁ గ్రియావాచి ధాతువే మూలమని పెక్కురు వైయాకరణుల సిద్ధాంతము. కాని శబ్దములలో ననేకము లవ్యుత్పన్నము లుండును గాన శబ్ద ప్రపంచమంతయు ధాతు జన్యమె యనరాదని కొందఱు ప్రామాణికుల యాశయము. “అజన్య జన్యభేదేన। శబ్దాః స్యు ర్ద్వి కృతౌ మతాః”. (వ్యా. సం. ౧౮౮ వి. వికృ) అని యధర్వణుఁడు శబ్దములలోఁ గొన్ని యజన్యములనఁగా నవ్యుత్పన్నము లుండునని వచించెను.

"పురుష బోధక సర్వనామములు విభక్తులు విభక్త్యర్థ కావ్యయములు మఱికొన్ని నామములు మున్నగు వానికి ధాతువులను జూపుట శక్యము కాదు". (కాల్డు. ౧౯౫ పుట).

౫౫. III విష:—భాషలు మూఁడు విధములు:—

౧. "ధాతుమాత్ర భాషలు (Root languages)". వీనిలో "చీనా భాష" ముఖ్యమైనది. ఇందర్థ విశేషములనుబట్టి ధాతువులకు రూపభేదములు గల్గవు. ఈ భాషలందు ధాతు మాత్రమె పదముగ వాడఁబడును. ప్రత్యయాదులుండవు. అర్థ విశేషములు భిన్నభిన్న ధాతు ప్రయోగమువల్లను నాయా శబ్దముల స్థానభేదములవల్లను బోధ్యములగును. ఈ భాషలందలి ధాతువు లేకాచ్కములై యుండును. ఇట్టివి (Isolative languages) 'ప్రత్యేకతాస్థితి ధాతువులు' అనియు — (Monosyllabic languages)='ఏకాచ్క ధాతువులు' అనియుఁ జెప్పఁబడును.

౨. ధాతు పరిణామ భాషలు:—ఇవి "అరెబిక్-హెబ్రు" మున్నగు సెమెటిక్కుటుంబ భాషలు. ఈ ధాతువు, లనేకాచ్కములై యుండును. వీనిలోని యచ్చుల మార్పులచేత నర్థవిశేషములు గల్గుచుండును. వీనిని "Intro-mutative languages" అందురు.

3. ప్రత్యయాది విశిష్ట భాషలు:—("Agglutinative languages") 'సంస్కృతము-గ్రీకు' మున్నగు నిండో యూరపియను కుటుంబ భాషలును సిథియను కుటుంబ భాషలును నీ విభాగములోనివి. వీనియందుఁ బ్రత్యయములను జేర్చుటచేత నర్థవిశేషములు బోధ్యములగును. ఇండో యూరపియను కుటుంబ భాషలలోఁ బ్రత్యయములు (సుప్—తిజ్) స్వపూర్వ రూపమును గోలుపోయి మూల శబ్దమును దెలిసికొనుటకు శక్యము కాక యుండును. సిథియను కుటుంబములో నట్లుగాక ప్రత్యయములు స్వపూర్వపదాకృతిని దెలిసికొనుటకు వీలుపడు నాకారముతో నుండును. ఈ విషయమున ద్రావిడ భాషలు సిథియను భాషాలక్షణము కలవే.

"ఎల్లభాషలును బ్రప్రథమమున ధాతుమాత్రస్వరూపముననే యుండి యుండవలయును. అట్టి ధాతుమాత్రభాషలు కాలక్రమమునఁ బ్రత్యయాది విశిష్టభాషలుగ మాఱును. ఈ ప్రత్యయాది విశిష్టభాషలలో సయితము ధాతువులలోని వర్ణములకుఁ బరిణామముండును. ఇట్టి ధాతుపరిణామము 'ఇండో యూరపియను' కుటుంబభాషలలో నధికముగను ద్రావిడభాషలలో నలంతిగను నుండును" (కాల్డు. ౧౯౧, ౧౯౨ పుటలు).

"ఇండో యూరపియను భాషలందువలెఁగాక సిథియను భాషలందువలె ద్రావిడభాషలందుఁ బ్రార్థనాద్యర్థక మధ్యమపురుషైక వచనమునఁ బ్రత్యయాదులు చేరని కేవలధాతురూపములె ప్రయుక్తములగును ...... కొన్ని యలంతి హలంత ధాతువులలో, నఱవాంధ్రములందుఁ బ్రార్థనాద్యర్థక మధ్యమ పురుషైకవచనమున ధాతువు తుదివర్ణము కంఠ్యముగాని యంతస్థముగాని యైన యెడల నది లోపించును. ప్రార్థనాద్యర్థక బహువచనమునందును భావార్థకము నందును నట్టి వర్ణలోప ముండదు" (కాల్డు. ౧౯౨ పుట).

విమర్శము:—తొల్కాప్పియము చొప్పునఁ దమిళమునఁ బ్రార్థనాద్యర్థక మధ్యమ పురుష రూపములు:—"తమి-ఏక-చెయ్‌ది-చెయ్=(చేయుము) (ధా-చెయ్) బహు-చెయ్‌మిన్=(చేయుఁడు)" అను రీతి నుండును. కాని నన్నూలు ౧౩౭ సూత్రమున ౨౩ విధములగు ధాతువులును గేవలధాతువులె విధ్యర్థకైకవచనములుగ నుండుననియు నేకవచన విధిరూపధాతువులకు 'చెయ్' అను సంజ్ఞగల దనియుఁ జెప్పఁబడెను. దీనిని బట్టి కేవలధాతురూప మేకవచన విధిరూపముగ నయిత ముండవచ్చునని తేలుచున్నది. కాని తుదిహల్లు కంఠ్యముగాని యంతస్థముగాని యైనచో నది లోపించునను విషయము నిర్మూలముగను నుదాహరణశూన్యముగను నున్నది. ఈ విషయమున నఱవాంధ్రము లేకరీతి గలవని చెప్పుట సరికాదు- తెల్గున హలంతధాతువే యుండదు. తెల్గునఁ బ్రార్థనాద్యర్థకైకవచనమున-'ము' ప్రత్యయము నిల్చును. దానికి హల్పరకత్వమందును నవసానమందును వైకల్పికముగ లోపము గల్గును. స్వరపరకత్వమున నట్టిలోపము గల్గుట ప్రాచీనాంధ్ర సంప్రదాయముకాదు. ఉదా:—చదువుము నీవు=చదువు నీవు. నీవు చదుము=నీవు చదువు. 'నీవు చదువుమనియె' అను రీతిగల చోటులందు 'ము' లోపము రాదు-"న ప్రాణే తు కదాచన" అని యథర్వణుఁడు వచించెను. నన్నయ స్వరపరకత్వమున 'ము' ప్రత్యయలోపము చేయఁడు. తుదియంతస్థ లోపమునకు - "పోవు - పొమ్ము" అని యుదాహరించుట సరికాదు - బహువచనమందును నంతస్థలోపము కన్పట్టుచున్నది. ఉదా:—పొండు. మఱియు "పోవు" అనునది తెల్గున హలంతధాతువుకాదు. కాన నంత్యవర్ణలోపమున కుదాహరణము మృగ్యము.

౫౬. విష:—"(౧) - క్రియావాచకములుగను నామములుగను నగపడు ధాతువులు. (౨) నామములుగామాత్ర మగపడు ధాతువులు నని ధాతువులు ద్వివిధములు. అందు మొదటి జాతియే యత్యధికము." (కాల్డు. ౧౯౨ పుట).

"ఉదా:—(తమి) - చొల్ =(చెప్పు) ధాతువు. చొల్ =(శబ్దము...... తాటియాకు పద్దు) నామ. కొన్ని విశేష్యములుగను గొన్ని విశేషణములు గను నామము లుండును. ఉదా:—తమి-విశేష్య-కడు (టు)=(పారుష్యము-కారము). విశేషణ:—కడు (టు) = (పరుషమైనది - కారమైనది). క్రియా వాచకము:—కడు (టు)=(పరుషముగానుండు). ఈ 'కడు' ధాతువుపైని 'గు' ప్రత్యయము చేరును. 'కడుగు'=(ఆవాలు-కారమైనవిగాన). కడు ధాతువు నందలి 'అ' కారమునకు దీర్ఘము వచ్చును. 'కాడు' = (అడవి = నిమ్నోన్నత ములుగా నుండునది - కఠినమైనది)." (కాల్డు. ౧౯౨ పుట).

విమర్శము:—"కటు. న. (కట+ఉ). దూషణే - దుష్టకార్యే. రసభేదే. తద్వతి-త్రి." (శబ్దస్తో) "కటు=కారో=కారము" (బాలవ్యా.సంజ్ఞా ౧౯ సూ.). వీనిని బట్టి 'కటు' శబ్దము సంస్కృత శబ్దసంబంధియు ననవచ్చును.

తొల్కాప్పియ వ్యాఖ్యాతలు (తొల్కా. ౨౬౦. సూ.) 'కటి' అను ద్రావిడ ధాతువునకు 'కారము' మొదలగు ౧౨ అర్థములు గలవని ప్రదర్శించిరి. "కడుత్తేన్ =(కోపించితిని). కడుప్పేన్ =(కోపింపఁగలను)." అను ప్రయోగములును గలవు. తొల్కా. ౫౬౨ సూత్రము క్రింద "కడు (టు) మై=కాఠిన్యము" అని యుదాహృతమై యున్నది. "పయి సందర్భమునుబట్టి యరయఁగా మొదట ద్రావిడ ధాతువులెల్ల నామములునునై యుండెడివనియుఁ గాలక్రమమున రెండిటికిని భేదముండిన బాగుండు నను నూహతో వ్యవహార్తలు ధాతువులకుఁ బ్రత్యయములను జేర్చి నామములను గ్రహించిరనియు విశదమగు చున్నది." (కాల్డు. ౧౯౩ పుట).

"సంస్కృతమున సర్వనామాదులగు సలంతి శబ్దములు తప్పఁ దక్కినవెల్ల ధాతుజములె యనుచు వైయాకరణులు సాధించిరి. ద్రావిడభాషలందును ధాతుజములె యధికము" (కాల్డు. ౧౯౩ పుట).

"ద్వ్యక్షరకములగు నఱవధాతువులలో ననేకములు 'అల్' ప్రత్య యాంతములు. అఱవ-కన్నడ-గోందుభాషలలో నీ ప్రత్యయము భావార్థక మనఁజనును. అఱవ వైయాకరణు లవ్యుత్పన్నములని చెప్పిన యీ క్రింది. వానికి ధాతువులను జూపవచ్చును. ఉదా:—తమి-విరల్ =(వ్రేలు)-ధాతువు-విరి=(వ్యాపించు). కడల్ =(సముద్రము) - ధాతువు - కడ=(దాఁటు). పగల్ = (పగలు - దినము) - ధాతువు - పగు = (విభజించు). కుడల్ = ప్రేగు - ధాతు - కుడై =(గుల్లచేయు)." (కాల్డు. ౧౯౪ పుట).

విమర్శము:—తమిళ వైయాకరణు లెవ్వరును 'విరల్' మున్నగునవి యవ్యుత్పన్నములని చెప్పలేదు. వారు నామముల వ్యుత్పత్తులను జూపు పనిఁ బూనలేదు. కావున వీనికే కాక వేనికిని వ్యుత్పత్తులను జూపరైరి.

'కుడై' ధాతువునకు 'గుల్లచేయు' అను నర్థములేదు. "తణ్ణీర్ కుడై క్కి-ఱాన్=(చల్లని నీటిని జేయిపెట్టి త్రిప్పుచున్నాఁడు)" అను దానినిబట్టి "కుడై = గాలించు" అని యర్థము చెప్పనగును. కాన 'కుడల్'=అనునది (ప్రేగు)—'కుడై' ధాతువునుండి యేర్పడె ననుట సరికాదు. "కుడ=వక్రముగానుండు" అని యర్థము చెప్పుట యుక్తము.

"ఏమియు మార్పులేకుండఁగాఁగాని స్వల్పమగు మార్పుగల్గుటచేఁగాని ధాతువు నామమగుటచే నీ ద్రావిడభాషలు నవ్యములని (లేఁతవి) తలంపరాదు. వ్యవహర్తల లక్షణజ్ఞాన విశేషమునఁ జిరకాలమునకైనను మార్పు రాఁజాలదయ్యె నని గ్రహింపవలెను. ఉదా:—తమి-నిలమ్=(నేల). ధాతువు-నిల్=(నిలుచు). నాడు (టు)=(వ్యవసాయపు భూమి) - ధాతువు - నడు=(మొక్కపాతు). కాడు (టు)=(అడవి) - ధాతు - కడు (టు)=(పరుషముగానుండు=నిమ్నోన్నతముగా నుండు). విణ్=(ఆకాశము) - ధాతు - విళ్=(స్వచ్ఛముగానుండు). మీన్= (చేఁప-నక్షత్రము)-ధాతు - మిన్=(తళతళలాడు). వెళ్ళి=(శుక్రుఁడు - వెండి)- ధాతు - వెళ్ = (తెల్లనిదిగఁ జేయు). కుదిరై=(గుఱ్ఱము) ధాతు-కుది= (గంతులువేయు). పన్ఱి=(పంది) - ధాతు - (పల్=కోఱ - దంతము). ఆడు= (గొఱ్ఱె) - ధాతువు - ఆడు=(గంతులాడు). డా. గుండర్టుగారు 'ఆడు' అనునది= (శబ్దము) "అడు=(దెబ్బలాడు - (లేదా) వండు)" అను ధాతువునుండి యేర్పడెనని పొరపాటుగఁ జెప్పిరి. ("పోట్లాడునది - వండితినఁబడునది" అని వ్యుత్పత్తి). కణ్=(నేత్రము) - ధాతు - కాణ్=(చూచు). మూక్కు=(ముక్కు)-ధాతు- ముగర్ = (వాసనచూచు). నాక్కు = (నాలుక) - ధాతు - నక్కు=(నాకు). ప్రాచీనరూపము - నా = (నాలుక). దీనినుండియే 'నాయ్' = (కుక్క) శబ్ద మేర్పడెను. నాకెడిదిగాన 'నాయ్' అని యయ్యెను. "సంస్కృ - కృ - (ధాతు) కర" అని యగునట్లు - తమి - సె (చె)య్ ధాతువునుండి "కై=(చేయి)" అనునది పుట్టియుండును. తెలుఁగు - చేయు - ధాతువు. చేయి=(హస్తము). ద్రావిడభాషలలో జంతువుల పేర్లు వాని గుణములనుబట్టి వచ్చునుగాని వాని ధ్వన్యనుకృతులనుబట్టి రాలేదు."

"పురుషబోధక సర్వనామములు - విభక్తులు - విభక్త్యర్థకావ్యయములు- మఱి కొన్ని నామములు మున్నగువానికి ధాతువులను జూప శక్యముకాదు. ఉదా:—తమి-కాల్=(కాలు). కల్=(ఱాయి). కర్=(నల్లని) వెళ్=(తెల్లనిది) సె

(చె)=(ఎఱ్ఱనిది). ఇ ట్లవ్యుత్పన్నములగుచున్న శబ్దములును గొన్ని వ్యవహారార్థ ధాతువులనుండి పుట్టియుండును. ఉదా:—తమిళ - మున్ =(ముందు). ఇది "ముదల్ =(మొదటిది)" అనుదానికి మూలమగు 'ము' ధాతువునుండి యేర్పడి యుండును. మేల్ =(మీఁద) ఇది మీఁదు శబ్దమునకు మూలమగు 'మి' ధాతువునుండి పుట్టియుండును. (మి+య్+ఇల్ = మేల్ = మీఁద). కీళ్ = (క్రింద). ఇది 'కిలుఙ్గు' అను దానికి మూలమగు 'కిల్' అను ధాతువునుండి పుట్టియుండును." (కాల్డు. ౧౫౪—౧౫౫ పుటలు).

విమర్శము:—తమిళమున 'నాడు' శబ్దమునకు 'దేశము' అని యర్థము. 'వ్యవసాయపు భూమి' అను నర్థమును లెక్సికనులో నున్నది. తెల్గున 'నాటు' 'నాడు' శబ్దములకీ యర్థము లేదు. తమిళములోని 'ఇళ్' ధాతువునకు "స్వేచ్ఛముగానుండు" అను నర్థము లేదు. దానికి 'విడుచు' అని యర్థము. వర్ష జలము-నక్షత్రాదుల కాంతి మున్నగువానిని విడుచునదని యర్థము చేయ నగును. ("మిన్ = తళతళలాడు" అను ధాతువునుండియే 'మిన్ = ఆకాశము' అనునది యేర్పడియుండును). 'ఆడు' = (మేకజాతి) అనుదానికిఁ బ్రాచీన రూపము 'యాడు' అని యుండెడిది. కాఁబట్టి 'ఆడు' శబ్దము 'ఆడు' ధాతువు నుండికాని 'అడు' ధాతువునుండికాని పుట్టెననుట సరికాదు. 'యా' అనునది 'ఆ' అనునదిగా మాఱునుగాని 'ఆ' అనునది 'యా' అనునదిగా నేర్పడెననుట కేవలము నసంభవము. చెయ్ ధాతువునుండి 'కై' శబ్దమేర్పడె ననుటయు సరికాదు. 'కయ్'=(చేయుట) అను దానికి మూలమగు ధాతువునుండి యేర్పడె ననుట యుక్తము. కన్నడమున "గెయ్=(చేయుట)" అను ధాతువు గలదు.

౫౭. విష:—"విభక్తి ప్రత్యయములును (సుప్ - తిఙ్) విభక్త్యర్థాభిధాయ కావ్యయములును (Post positions) క్రియలుగాని నామములుగాని వాని భాగములుగాని యై యుండును. క్రియలు తుము న్నంతావస్థలోను, నామములు ప్రథమా షష్ఠీ సప్తమీ విభక్త్యవస్థలలోను నుండి విభక్త్యర్థాభిధాయ కావ్యయము లగుచుండును. తెల్గులోని తృతీయార్థక 'చే - చేత' వర్ణకములు హస్తార్థక 'చేయి' శబ్దపు ప్రథమా సప్తమీ రూపములయి యున్నవి. ఇట్లే యఱవము నందలి సప్తమీవిభక్తి 'కణ్-ఇడమ్-ఇల్-తలై' మున్నగు స్థలార్థక శబ్దరూపమున నుండును. తమిళమందలి యపాదానార్థక పంచమీవిభక్తి "ఇన్ = ఇక్కడ. ఇల్=ఇల్లు" అను శబ్దముల రూపమున నిల్చును. ధాతువునకు - 'ఇన్ - ఇల్' అను వానిని జేర్చినచోఁ దమిళమునఁ జేదాద్యర్థకరూప మేర్పడును. ఉదా:— వరిన్=వరిల్=(వచ్చినన్). కొన్ని ప్రత్యయములకు వాని పదత్వావస్థలోని యర్థమే నిల్చును. కొన్నిటి కర్థమించుక మాఱును. 'కి-కు-గె' అను

చతుర్థీప్రత్యయముల చరిత్రమె దుర్గ్రహమైయున్నది. సంస్కృతమునందువలె విభక్తిప్రత్యయపు మూలరూపము తెలియకుండుట యీ చతుర్థీస్థలమందె చూపట్టుచున్నది. కాన నివె నిజమైన విభక్తులు." (కాల్డు. ౧౯౫-౧౯౬ పుటలు).

విమర్శము:—కణ్ - ఇడమ్ - ఇల్ - తలై మున్నగునవి తమిళమున స్థల వాచకములు. వీనికిఁ బ్రత్యేక ప్రయోగమును గలదు. షష్ఠీప్రత్యయమగు 'అదు' అనునది తచ్ఛబ్దార్థకము. తక్కిన విభక్తి ప్రత్యయముల కిట్టి మూల భూతశబ్దములు తెలియలేదు. 'ఇన్' శబ్దమునకు 'ఇక్కడ' అను నర్థము వాడుకలో లేదు. "ఇఙ్గు=(ఇక్కడ) అఙ్గు=(అక్కడ) ఎఙ్గు=(ఎక్కడ)" అనువాని మొదటి భాగములు-"ఇన్-అన్-ఎన్" అని తలంచిరేమో? కాని 'ఇన్' మున్నగు వాని మూర్ధన్యనకారము పరుష పరకత్వమున 'జ' కారము కానేరదు. వ్యావహారిక స్థితిలో "పిన్ + కట్టు=పిఙ్కట్టు = (పెడచేతులు విఱిచికట్టు). వెణ్ + కలమ్ = వెఙ్గలమ్ = (కంచులోహము. తెల్లనిపాత్రము) పెణ్ +జాది (తి)= పెఞ్జాది = (తి) (ఆఁడుజాతి. భార్య). తున్ + పమ్ = తుమ్పమ్ = తుమ్బమ్ = (కష్టము-దుఃఖము)." అని పల్కుటకలదు గాని యట్లాయా చోటులందు 'జ' కారాద్యాదేశముల నెవ్వరును వ్రాయరు. అచటి యనునాసికాదేశము ప్రామాణికసమ్మతముకాదు. మఱియు నట్టిచోట నపాదానార్థము దుర్ఘటము.

"ఇల్" అనునది పంచమీవిభక్తియనుట యర్వాచీనము. తొల్కాప్పియ సమ్మతముకాదు. నన్నూలులోఁ జెప్పఁబడినది.

"కి-కు-గె" అను చతుర్థికి మాత్రమె మూలము తెలియ దననేల? తమిళ "ప్రథమ-న్-మ్. ద్వితీయ-ఐ. తృతీయ-ఒడు. చతుర్థి-కి-కు-గె. పంచమి-ఇన్" అనువాని కన్నిటికిని మూలము తెలియ దనవచ్చును. "తృతీయ-ఒడు" "తోడు-తోలు" శబ్దములకు భిన్నము. (చూ. ౪౨—౪౩ విష). ఇంక షష్ఠి-'అదు' శబ్దము తచ్ఛబ్దార్థకము. సప్తమి-స్థలవాచకము. ఈ రెండిటి మూలము మాత్రమె తమిళమున సుజ్ఞేయము.

౫౮. విష:—"ద్రావిడ ధాతువులు మొదటమొదట నేకాచ్కములయియే యుండెడివి. అట్టి వానిపైని గాల పురుష వచనాద్యర్థ విశేష బోధక ప్రత్యయ పరంపర నిల్చుటచేతను సంధిలోవచ్చు నాగమాదులచేతను ద్రావిడ పదములు దీర్ఘములుగ నేర్పడసాగెను. త్ర్యక్షర ధాతువులలోని (పెరుగు-మొ.) తుది వర్ణము మొదట భావార్థకమై యుండి కాలక్రమమున సకర్మకత్వాది బోధక మయ్యెను. తక్కిన రెండు వర్ణములలోను దుదిస్వర ముచ్చారణార్థకము. మిగిలిన యే కాచ్కమే ధాతువు. ఉదా:—పెరుగు. (ధాతువు). దీనిలోని

'గు' అనునది మీఁద వ్రాసినట్లుగ సకర్మకతా ద్యోతకము. మిగిలిన 'పెరు' శబ్దములోని 'ఉ' కార ముచ్చారణార్థకము. శేషించిన 'పెర్' అనునది- "పేర్=(పెద్ద)" అను దాని రూపాంతరము. ఉదా:—పెరుగుగిరదు (అ?) (పెరుగుచున్నది). ఇందలి 'అదు' అనునది సర్వనామ రూపభేదము—పురుష వచనద్యోతకము. 'గిర్' అనునది వర్తమానార్థ ద్యోతకము. మిగిలిన 'పెరుగు' అను దానిలోని 'గు' అనునది యకర్మకతా ద్యోతకము. ఉకారము సంధివలనఁ జేరినది. ఇంక శేషించిన 'పెర్' అనునది 'పెద్ద' అను నర్థముగల 'పేర్' అనుదాని రూపాంతరము. "పెరియ-పెరుమ్" అనునవియు దీని సంబంధములె. ఇట్లు ధాతుస్వరూపము మాఱకుండఁ బదములలో స్పష్టముగా నిల్చియుండుట సిథియను భాషల లక్షణము. ఇండో యూరపియను భాషలలో నిట్టి స్వభావము లేదు" (కాల్డు. ౧౯౬ పుట).

విమర్శము:—'పెరుగు' అనుదానిలోని 'గు' అనునది యకర్మకతా ద్యోతకమని కాని భావార్థకమని కాని చెప్పుట సరికాదు. పెఱు- 'గు' వర్ణాంతములు సకర్మకములును గలవు. "పెర్=పేర్=పెద్ద" అను విశేషణమును వ్యాపార బోధకముగఁ జేయుటకై చేరినదనుట యుక్తము. పెరియ వీడు=(పెద్ద యిల్లు) అనుదానికిఁ బర్యాయముగా "పెరు వీడు=పెరుమ్ వీడు" అనియు ననవచ్చును. ఇందలి 'ఉమ్' అనునది క్రియావాచకముల పైని నిల్చు 'ఉమ్' కాదు. అది నిల్చినచో "పెరుగుమ్ వీడు=పెరుగు వీడు" అని యుండును. వీనికి వృద్ధియగునట్టి యిల్లని యర్థము.

౫౯. విష:—"ద్రావిడ ధాతువు లజంతములగునపుడు తఱుచుగా దీర్ఘాంతము లగుననియు హలంతము లగునపుడు హ్రస్వోపధకము లగుననియు డా. గుండర్టుగారు చెప్పి యుదాహరించిరి:—అజంత:—ఆ=(అగు)శా=చా= (చచ్చు). పో=(పోవు). హలంత:—అడ్=(దగ్గఱకుఁ జేరు). అణ్=(అంటి యుండు). నిల్=(నిలుచు). శెల్ (చెల్)=(పోవు)" (కాల్డు. ౧౯౭ పుట).

విమర్శము:—ధాతువు 'అడు' అని 'ఉ' కారాంతముగా నుండునని తమిళ పండితుల యభిప్రాయము. కాని శ్రీ విద్వాన్. వే. వేంకటరాజులు రెడ్డిగారు డా. గుండర్టుగారి యాశయమె సరియని వచించిరి.

"ఆంధ్రకర్ణాటములలో శబ్దముల తుది హల్లుపై నుచ్చారణ సౌకర్యార్థముగ నచ్చుచేరును. రెండు మూఁడక్షరములు గల ధాతువుల తుది నచ్చు చేరుట యుచ్చారణ సౌకర్యార్థమని తెలియఁగునది. కొన్ని యేకాచ్క ధాతువుల తుదిని జేరిన యచ్చు 'ఉచ్చారణార్థకము' కాదనియు సంధివశమున వచ్చిన దనియు నెఱుంగునది" (కాల్డు. ౧౯౭ పుట).

విమర్శము:—పటగన్నడమునఁ బదాంత హల్లుమీఁద నుచ్చారణార్థక మగు నచ్చు చేరదు-హలంత ధాతువులె పటగన్నడమునఁ దఱుచు. హొస గన్నడమున నట్లు పదాంత హల్లుపై నచ్చు నిల్చును. ఏకాచ్క ధాతువుల మీఁద సైతి ముచ్చారణార్థము పటగన్నడమున స్వరము చేరదు. హొస గన్నడమునఁ దెలుఁగునందువలెనె యచ్చు చేరును. అట్లు చేరిన యచ్చు నుచ్చారణార్థక మనుటలో బాధ యగపడదు.

"హలంత ధాతువుమీఁద నుచ్చారణార్థకముగ 'ఉ' కారము చేరును. అజాది శబ్ద పరకత్వమున నట్టి 'ఉ' కారము లోపించును. ఏకాచ్క ధాతువు తుదిని 'ఉ' కారమేకాక తక్కిన యచ్చులు సైతము నిల్చును. ఏకాచ్క ధాతువు తుదిని నిల్చిన యచ్చు స్వరపరకత్వమున సాధారణముగా లోపింపదు. ఏకాచ్క ధాతువు తుదిని 'ఉ' కారముకన్న నరుదుగ 'ఇ' కారమును దానికన్న నరుదుగ 'అ' కారమును దానికన్న నరుదుగ 'ఎ' కారమును జేరుచుండును. సంస్కృత ధాతువు ద్రావిడ భాషలలోనికి వచ్చునపుడు దాని తుదిని దమిళ మున 'ఇ' కారమును దెల్గున 'ఇంచు' అనునదియుఁ గన్నడమున 'ఇసు' అను నదియుఁ జేరును. ఉదా:—సంస్కృ-శప్-(ధాతువు) తెల్గు-శపించు. కన్న-శపిసు. తమి-శబి (చపి)." (కాల్డు. ౧౫౮ పుట.)

"ద్రావిడ ధాతువుల తుదిని భిన్నభిన్న ధాతువులపైని భిన్నభిన్న స్వర ములు నిల్చును. అఱవ-మర. తెల్గు-మరచు. కన్న-మరె. తమి-కడి(టి). తెల్గు-కఱచు=(కొఱుకు). తమి-గెలి. తెల్గు-గెలుచు. కన్న-గెల్లు. తమి-ముళై. తెల్గు-మొలచు. ఇట్టి స్వరభేదముల కర్థ విశేషభేదములు లేవు." (కాల్డు. ౧౫౮-పుట).

విమర్శము:—ఏకాచ్క ధాతువు తుదిని నిల్చిన 'ఉ' కారము సయితము స్వరపరకత్వమునఁ దఱుచుగా లోపించును. ఉకారేతరస్వరమట్లు లోపింపదు. ఉదా:—తమి-అడు+అల్=అడల్=(చంపుట). అడై+అల్=అడైయల్= (చేరుట). "అడు-అడై" మున్నగువాని తుదినున్న స్వరము లుచ్చారణార్థము చేరినవి కావనియు ధాతువులకు సహజ సిద్ధములెయనియుఁ దమిళ పండితుల నిశ్చయము. "మఱ=మఱచు" అను ద్రావిడ ధాతువు అకార ఘటితము. తమి-మఱ. కన్న-మఱె. తెల్గు-మఱచు. తమి-గెలి=(వ్యావహారిక భాషలోనిది మాత్రమె)=తెలుఁగు-గెలుచు. పటగన్నడము-గెల్.

౬౦. I విమ:—"అకర్మక ధాతువులు సకర్మకములగునపు డా యకర్మక ధాతువు తుది హల్లు ద్విరుక్తమగును. విశేషణము విశేష్యమగునపుడు సయి త మీ కార్యము సంభవించుచుండును. ఆ విధముగా ద్విరుక్తమగునపుడు

సరళము పరుషముగా మాఱును. అకర్మకముల తుదిహల్లు తఱుచుగా ననునాసిక పూర్వకమై యుండును. తమిళమున 'గు-ఙ్గు' అనునవి తుదిని గల రూపము లకర్మకములందును 'క్కు' అనునది తుదినిగల రూపములు సకర్మకములందును నుండును. తెలుఁగులోని 'చు-న్చు' అనునవి వీనికి సమాన రూపములు. ఇట్లే-"అకర్మక-శు (చు)-సకర్మక-శ్శు (చ్చు). డు=ణ్డు-ట్టు. దు=న్దు-త్తు. బు=మ్బు-ప్పు." అను రీతిని మార్పులు గలుగును." (కాల్డు. ౧౯౭ పుట).

విమర్శము:—సకర్మకత్వా కర్మకత్వములనుచోట నీ ప్రకరణమునఁ బ్రేరణాప్రేరణములని వ్యవహరించుట యుక్తము. అప్రేరణ వాక్యమందలి కర్త ప్రేరణ వాక్యంబునఁ గర్మంబగును. కానఁ బ్రేరణ వాక్యమందలి క్రియ యెప్పుడును సకర్మకమె యగును. అప్రేరణవాక్యమందలి క్రియ యకర్మక మగునపుడు దాని ప్రేరణ వాక్యమందలి క్రియ సకర్మకమగును. అప్రేరణవాక్యమందలి క్రియ సకర్మకమగునపుడు దాని ప్రేరణ వాక్యమందలి క్రియ ద్వికర్మకమగును. (చూ. 'వ్యా.-సం.' ౨౩౬ I విష. ౩౫౩ విష).

మఱియు ననేకములగు సకర్మకములు సైతము ప్రకృతమున లక్ష్యములగుచున్నవి. ఉదా:—సక-కాణ్=(చూచు). కాట్టు=(చూపు). సకర్మ-చెయ్=(చేయు)-చెయ్వి=(చేయించు). చెయ్విప్పి=(చేయింపించు). ఇట్లగుటచేత నిట సకర్మకత్వా కర్మకత్వము లప్రయోజకములనియు నప్రేరణ ప్రేరణక్రియల మార్పులై పరిశీలింపఁబడుచున్నవనియు నెఱుంగనగును.

ప్రాచీనకాలమునఁ ద్రావిడ భాషయందు వఱకును దమిళమున సరళధ్వనియే లేదు (చూ. ౧౭ XXII విష. మొ. ౧౭ XXIII వ.). అట్లగుటచేత ధాతువు తుదిని సరళమే యున్నదనియు నయ్యది ద్విత్వము గల్గునపుడు పరుషముగా మాఱుననియుఁ జెప్పుట కేవలము నయథార్థ వివరణము.

అప్రే. తమి-ఉరుకు = (ద్రవించు) ప్రేర-ఉరుక్కు = (ద్రవింపఁజేయు) అప్రే-ఆడు (టు)=(క్రీడించు)-ప్రేర-ఆట్టు=(క్రీడింపఁజేయు). అప్రే-ఆగు= (అగు)-ప్రేర-ఆక్కు=(కావించు). ఇట్టివి యనేకములు ప్రసిద్ధములైయుండుట చేత నకర్మకముల తుది వర్ణము తఱుచుగా ననునాసికపూర్వకమై యుండుననెడి దొరగారి వాక్యము సరికాదు.

అప్రే-ఉరుళ్ = (దొర్లు)-ప్రేర-ఉరుట్టు = (దొర్లునట్లు చేయు) అప్రే-తుయిల్ = (నిద్రించు)-ప్రేర-తుయిఱ్ఱు-(ట్టు) = (నిద్రింపఁజేయు) అప్రే-ఎఱు= (లేచు)-ప్రేర-ఎఱుప్పు = (లేపు). అప్రే-కాణ్ = (చూచు) ప్రేర-కాట్టు = (చూపు). మున్నగునవి యనేకములు ప్రసిద్ధములయి యుండుటచే నకర్మకముల

తుది హల్లు సకర్మకత్వమున ద్విరుక్తమగునను దొరగారి వ్రాఁతయుఁ బొసఁగ నేరదు.

అప్రే-"కాణ్=(చూచు) ప్రేర-కాట్టు=(చూపు) అప్రే-చెయ్= (చేయు) - ప్రేర - చెయ్‌వి=(చేయించు). చెయ్‌విప్పి=చేయింపించు." అను రీతిని సకర్మకములును నప్రేరణార్థకము లగుటయు వానినుండి పైని జెప్పిన లక్షణ ములుగల రూపము లేర్పడుటయుఁ గలదు. కాన నకర్మకముల కర్తయే కర్మంబగునని తలంపరాదు—మఱియు దొరగారు చెప్పిన లక్షణములకు 'క-త- ప'లు తుదినిగల ధాతువులు మాత్రమె లక్ష్యములు కన్పట్టుచున్నవి. ఉదా:— "అక=అడఙ్గు=(ఇమిడియుండు)—సక అడక్కు=(అణఁచు). అక-తిరున్దు= (చక్కఁబడు) - సక - తిరుత్తు = (చక్కఁబెట్టు). అక నిరమ్పు = (నిండు) - సక-నిరప్పు=(నింపు)." ఇట్లు దొరగారు చెప్పిన వానికి లక్ష్యములను వారు చూపవచ్చును. కాని యిట్టి లక్షణములుగల లక్ష్యములు 'చ-ట' ల విషయ మునఁ జూపట్టవు. 'చ' ద్విత్వము 'ట' ద్విత్వము గల సకర్మక (ప్రేరణ) ధాతు రూపములు గలవు గాని వాని యకర్మక (అప్రేరణ) రూపములు చాంత టాంత ములు కావు. చద్విత్వ:—అక-(అప్రే)-పాయ్=(నీరు పాఱు)-సక-(ప్రేర)- పాయ్‌చ్చు=(నీరు పాఱునట్లు చేయు). అక-(అప్రే)-కాయ్=(వేఁడిగా నుండు) సక (ప్రేర)-కాయ్‌చ్చు=(వేఁడిగా నుండునట్లు చేయు). దీనికి 'కాయ్' అనియు రూపాంతరము గలదు. ఇట్లె "పాయ్‌చ్చు" అనుదానికిని 'పాయ్' అనురూపాంతర మున్నది. టద్విత్వ:—సక-అప్రే-కాణ్=(చూచు) ప్రేర- కాట్టు=(చూపు). అక-అప్రే-ఆడు=(క్రీడించు)-సక-ప్రేరఆట్టు = (క్రీడింపఁ జేయు-ఆడించు). ఈ లక్ష్యమున నకర్మక ధాతు వనునాసికోపధకము కాదు. ఇట్లెకాంతములును గొన్ని గలవు. ఉదా:—అక (అప్రే) ఆగు-(అగు) సక-(ప్రేర) ఆక్కు=(కావించు).

పయి సందర్భములనుబట్టి యీ ప్రకరణము సకర్మకాకర్మక విషయకమనుట కన్న ప్రేరణాప్రేరణ ధాతు విషయక మనుట యుక్తము.

ఉ౦. II విమ:—"తొల్కాప్పియమున ప్రేరణార్థక ప్రత్యయములు వేఱుగఁ జెప్పఁబడలేదు. మధ్యమ పురుష క్రియలనే ప్రేరణార్థకములని తొల్ కాప్పియ వ్యాఖ్యాత లందురు" (౧౦-౧౧-౨౧ తేదీ విద్వాన్ వే. వేంకటరాజులు రెడ్డిగారి జాబు). సంస్కృత ధాతువులు తమిటమునకు వచ్చునపుడు వాని తుదిని 'ఇ' అనునది నిలుచును. నన్నూలులో ప్రేరణార్థక ప్రత్యయముల విషయ మీ క్రింది రీతిని వివరింపఁబడెను—"చెయ్‌ఎన్......" (నన్నూ. ౧౩౭ సూ.)= చెయ్ సంజ్ఞ గల యనఁగా ధాతురూపమె విధ్యర్థకైకవచనముగా నుండు ధాతువు

లకు-యథాప్రయోగముగా 'వి' అనుదానిని గాని 'పి' అను దానిని గాని చేర్చుట చేతఁ బ్రేరణ రూపమేర్పడును. 'పివి' అనికాని, 'విపి' అనికాని చేర్చినచో ప్రేరణద్వయ మేర్పడును. ఉదా:—అప్రే-చెయ్=(చేయు) ప్రేర-చెయ్వి=(చేయించు). చెయ్విప్పి=(చేయింపించు). మొ.

"విళంబియ......" (నన్నూ. ౧౩౬ సూ.)=ప్రేరణ రూపములు వేఱు విధముగా నుండుటయు విధియె. ఇట్టి వేఱు విధమయిన స్థితిని విద్వాన్ శ్రీ. వే. వేంకటరాజులురెడ్డిగారు క్రింది రీతిని వివరించిరి. "ప్రేరణమున 'వి-పి' అనునవి చేరుటయే కాక వివిధములగు నాకారములు గల్గుటయుఁ గలదని యీ సూత్రమునకుఁ దాత్పర్యము. ఉదా:—అప్రే-పో=(పోవు) ప్రేర-పోక్కు=(పోవఁ జేయు-పంపించు). అప్రే-తుయిల్=(నిద్రించు) ప్రేర-తుయిఱ్ఱు (ట్టు)=(నిద్రింపించు). అప్రే-ఉరుళ్=(దొర్లు)-ప్రేర-ఉరుట్టు=(దొరలించు). అప్రే-ఆడు=(క్రీడించు)-ప్రేర-ఆట్టు=(క్రీడింపఁజేయు=ఆడించు). అప్రే-ఎఴు=(లేచు) ప్రేర-ఎఴుప్పు=(లేవు)".

ఉం. III విష:—తెల్గునందువలెనే తమిఴమందును నంతర్గత ప్రేరణార్థక ధాతు రూపములు గలవు. ఉదా:—కరై=(కరఁగు-కరఁగించు). చేరు=(చేరు—చేర్చు). తేయ్=(కృశించు-కృశింపఁజేయు). మొ.

పయి సందర్భమునుబట్టి "అడఙ్కు=(ఇమిడియుండు) తిరున్తు=(చక్కఁబడు). నిరమ్బు=(నిండు)" అను రీతిగల ధాతువు లంతర్గత ప్రేరణార్థకము లనియు వాని తుదినున్న యనునాసిక పరుష సంయోగము—అ౹౹ I మొ. అ౹౹ VII విషయములందు వివరింపఁబడిన పద్ధతుల చొప్పునఁ బరపరుష ద్విత్వ రూపముగ సహజముగఁ బరిణమించుననియు నట్లగుటంజేసి యీ రెండు విధము లగు రూప భేదములలో ననునాసిక పరుష సంయోగము తుదినిగల రూపముల ప్రేరణార్థకములుగను, బరుషద్విత్వము తుదినిగల రూపములు ప్రేరణార్థకములు గను నిట్లు వ్యావర్తకముగ వ్యవహరింపఁబడఁ సాగెననియు నూహింపనగును. తత్తత్ స్వానునాసిక పరుష సంయోగ రూపమునకుఁ దత్తత్పరుష ద్విత్వరూపము పర్యాయమేకాని విభిన్నవిషయకము కాదని యీ వఱకు విపులముగా వివరింపఁ బడెను. (చూడు. అ౹౹ I మొ. అ౹౹ VII వ విష). డాక్టరు కాల్డువెల్లుగారును నామముల పట్టున ననునాసిక పరుష సంయోగముయొక్క రూపాంతరమే పరుష ద్విత్వ రూపమని చెప్పిన విషయ మీ క్రింద నుదాహరింపఁ బడును.

ఉం. IV విష:—అప్రే-ఆగు=(అగు) ప్రేర-ఆక్కు=(కావించు). అప్రే-పెరుగు=(వృద్ధినొందు) - ప్రేరణ - పెరుక్కు=(వృద్ధినొందించు). ఈ రీతిగల

రూపములయందలి పరుష ద్విత్వమునకు మూలభూతమగు ననునాసిక పరుష సంయోగము లేమింజేసి వీని రూపసిద్ధి విచార్యమై యున్నది. ఇట్టి రూపములు మీఁద నుదాహరించిన నన్నూలు ౧౩౯ సూత్రము చెప్పునఁ బ్రేరణ విశేష రూపములని గ్రహింపవలయును. లేదా తెల్గున "ంచు-చు-పు" అనునవియును గన్నడమున 'చు-ఇసు' అనునవియును ప్రేరణార్థక ప్రత్యయములయినట్లె తమిళమున వాని కభిన్నములనఁదగు 'కు చు టు తు పు ఱు' అనునవి ప్రేరణార్థక ప్రత్యయములగుచుఁ బ్రయోగానుసారముగా నిల్చునని యంగీకరించి యాయా రూపములను సాధించుకొననగును. (చూడు ౧౨౧ II విష). లేదా—తెలుఁగులోని 'ంచు-చు' అనువాని కభిన్నమనఁదగు 'తు' అనునది మాత్రమె తమిళమునఁ బ్రేరణార్థక ప్రత్యయమనియు నట్టి 'తు' ప్రత్యయము ధాతువు తుది హల్లుతో సంధించునప్పుడు ప్రాకృత పద్ధతిని సహజముగఁ బూర్వపక్షహల్ ద్విత్వ రూపముగఁ బరిణమించునని గ్రహించినను గ్రహింప వచ్చును. ఇట్టి ద్విత్వాభాసమునె డా. కాల్డు వెల్లుగారు ముందు నిరూపింప నున్నారు. (చూడు ౧౩౧ I విష). ప్రాకృత సంయుక్తవర్ణ పరిణామ పద్ధతి:—

"లోపే ద్విత్వమ్"=సంయోగాక్షరస్య లోపేఽవశేషస్య "ద్విత్వం భవతి" (చండ—III వ్యంజన విధానము ౨౭ సూ). ఉదా: రక్తమ్=రత్తం. మొ. పయి మార్గములను విడిచికొని యూరక యంత్య హల్లు ద్విత్వమునందు ననియుఁ దావన్మాత్రమునఁ బ్రేరణార్థము భాసిల్లుననియుఁ దొరగారు వచించుట సరికాదు (చూ. ౨౮ III విష).

"విశేషణములందును విశేష్యములందును 'ఙ్గు' వర్ణమును దాని ద్విత్వరూపమగు 'క్కు' అనునదియుఁ గన్పట్టుచుండుటచేత వానికి భేదము లేదు. పయి యుదాహృతులనుబట్టి 'ఙ్గు' అను దానికిని 'క్కు' అను దానికిని భేదము లేదనియు వానిలో 'గ' కారముతోడి రూపమే ప్రాచీన మనియు నయ్యది 'క్కు' అను రూపములోనికి మాఱెననియు విశదమగు చున్నది. ధాతువులందలి 'క్కు' అనునది వ్యావహారిక తమిళమున 'చ్చు' అనునదిగా మాఱును. ఉదా:— 'కాయ్క్కు'=(మఱిగించు) (కాయ్=వేఁడిగానుండు) అనునది 'కాయ్చ్చు' అను రూపమునందును, ఇట్లు తమిళమున నరుదగు 'చు' ప్రత్యయము తెల్గున నతి ప్రచురముగ నుండును" (కాల్డు. ౧౯౯ పుట).

విమర్శము:—పయిరీతిని నామములందు దొరగారంగీకరించినట్లె ధాతువులందును 'ఙ్కు' మున్నగునవి 'క్కు' మున్నగురీతిని బరిణమించుట సహజమె యని గ్రహింపవలెను. ఇంక విశేషమేమనఁగాఁ బయి రెండు విధములలో ద్విత్వరూపములె ధాతువులందుఁ బ్రేరణార్థకములుగా వాడఁబడుచున్నవి.

నామములం దట్టి నియమము లేదయ్యెను. దొరగారిచట నిట్లు నామములందు భేదములేదని వ్రాసినను వెనుక ననునాసికాగమ నిరూపణ సందర్భమున విశేష్య ములలోను సకర్మక క్రియలలోను ననునాసికాగమము నిల్చుననియు విశేషణ ములలోను సకర్మక క్రియలలోను నట్టి యనునాసికము లోపించి పరస్థపరుషము ద్విరుక్తమగుననియు వ్రాసిరి. (చూ. ౨౮ I విష). ఇట్టి పూర్వోత్తర సందర్భ రాహిత్యము పెక్కు-చోట్లఁ గలదు.

౬౦. V విష:—"తమిళమందును దెల్గునందును 'గు' ప్రత్యయ మను నాసికపూర్వకమగును. తెలుఁగున 'అడఁగు' మున్నగువానిలోని 'గు' ప్రత్యయ మునకుఁ బూర్వముగ ననునాసికము లేకున్నను నర్థానునాసికమనఁగా నర్ధబిందు వుండునుగదా. ఒక విశేషము గలదు. తమిళమున సకర్మక ధాతువులందే 'గు' ప్రత్యయ మనునాసికపూర్వక మగును. తెల్గునందలి 'చు' ప్రత్యయము సకర్మకత్వమున ననునాసికపూర్వకమై యుండును. (తమిళ 'గు' ప్రత్యయ స్థానీ యము తెల్గు 'చు' ప్రత్యయమని దొరగారి యాశయము). తెల్గున ధాతువు తుదిని 'ఇ' కారము నిల్చియుండఁగా (అనంతములగు సంస్కృత ధాతువుల తుదను) నట్టి 'ఇ' కారమునకుఁ దర్వాత 'చు' ప్రత్యయ మనునాసిక పూర్వక మగుచు నిల్చును. తమిళమం దెన్నఁడును నిట్లు 'చు' స్థానీయమగు 'క్కు' అనునది యనునాసిక పూర్వకము కానేరదు. ఉదా:—రట్టి=(రెట్టి)-తమి-రట్టిక్క- (రెట్టించ భావార్థక) (Infinitive) = తెల్గు-రెట్టించ. తమి-మన్నిక్క-. తెల్గు- మన్నించ. తెల్గున 'ంచు' అనునది 'ఇ' కారమునకుఁ దర్వాతనే కాక తక్కి-న యచ్చులకుఁ దర్వాత నయితము (అనునాసికపూర్వకముగానే) నిల్చును. ఉదా:—పెరుగు-(తెల్గు-తమి-అకర్మకము-వృద్ధిపొందు) దీని సకర్మకము-తమి- పెరుక్కు. తెల్గు-పెంచు. 'పెరుచు' అని కానేరదు. (పెర్+ఇంచు.). తమి- పగుక్కు = తెల్గు-పంచు. (పగ్+ఇంచు)." (కాల్డు. ౧౯౯ పుట).

విమర్శము:—తెల్గున 'అడఁగు' అనియే కాక 'అడంగు' అనియు నుండును. కానఁ దెల్గున నర్థానునాసికపూర్వకము మాత్రమె యగునను దొరగారి వ్రాఁత సరికాదు. తెల్గునందును 'అడంగు' మున్నగురీతిని 'గు' అనునది పూర్ణమగు ననునాసికమునకుఁ దర్వాతనే యుండును.

తెనుఁగున నాచ్ఛికధాతువులు కాని తత్సమధాతువులు కాని 'ఇ'కారాంత ములు కావు. సంస్కృతధాతువు 'రక్ష్-వద్' మొదలగునవి నయితము హల్లు తుదిని గల్గి యుండును. అవిస్వస్వరూపముతోనె తెల్గునకు వచ్చి సంవృతి ధాతువు లనఁబడుచున్నవి. 'పుష్' మొదలగు సంస్కృత ధాతువులు

'ఘోష' మున్నగు కృద్యోగయోగ్య రూపముతోఁ దెల్గునకు వచ్చి యుపకృతి ధాతువు లనఁబడుచున్నవి. 'భూ-జి' మున్నగు ధాతువులు-'భవ్-జయ్' మున్నగు పరిణామములనంది తెల్గునకు వచ్చి పరిణతిధాతువు లనఁబడుచున్నవి. పయి మూఁడు విధములగు సంస్కృత ధాతువులమీఁదను 'ఇంచు' అనునది నిల్చును. "ఉపకృతి పరిణతి సంవృతి। భేదా త్రివిధా క్రియా ఘుష ణ్వాదిః। ఉపకృతి రథ భూ జ్యాదిః। పరిణతి రన్యా తు రజ్జి వస్యాదిః॥ స్యాదుపకృతిః కృదన్తా। సా పరిణతి ర య వ రన్విత్తైవ భవేత్। సంవృతి రహతాకారా జ్ఞేయా। త్రివిధాను చ క్రియా స్వేవమ్॥ భవతి క్రియాపదానాం। త్రివిధానా మించు గాగమో ణేశ్చ।" (అం. చిం.) (వ్యా. సం. 3౽౬ విమ.). దొరగారు తమ యనునాసికాగమ వాదమును బలపఱుచుకొనుటకుఁ గావలయు నిట్లు 'ఇంచు' శబ్దము నయథార్థముగాఁ విడఁదీయఁ గడంగుచున్నారు. కన్నడములోని 'ఇసు' ప్రత్యయమునకు మూలమగు నీ తెనుఁగు 'ఇంచు' అనునది "రుచించు=ఇష్ట మగు=చేయు" (గౌణార్థము) అను నర్థముగల యఖండ శబ్ద విశేషమనఁదగును. క......నీ। కర్ణములకు నించు నెట్లు కార్యవచనముల్ (ఉద్యో. ౨-ఆ ౨౮౮) "ఇంచు. వి-(సం-ఇక్షుః-ప్రా-ఉచ్చూ-పా-ఉచ్చు. కన్న-ఇన్=తీపి) ౧-చెఱకు ......౨ ప్రేమము......అ-క్రి-ఇంపగు......సక్రి-అభిలషించు......" (సూ-రా-ని). "ఇంచు-అప. (కన్న-ఇచు=ఇసు). తమి-ఇక్కు. పూర్వశాసనములు కొన్నిటిలో 'సరియిచ్చువాఁడు=సరిచ్చువాఁడు' ఇత్యాది స్థలములందు 'ఇంచు'నకు బదులుగా 'ఇచ్చు' కనఁబడుచున్నది.......మొదట నిది 'ఇచ్చు' అను రూపముగా నుండి పిదప 'ఇంచు'గా మాఱియుండునని యూహ పొడమ చున్నది" (సూ-రా-ని). ఈ సూ-రా-నిఘంటుకారుల యూహ శబ్దతత్వ సంప్రదాయ విరుద్ధము. 'ఇంచు' అనునది 'ఇచ్చు' అనునదిగా మాఱిన మాఱవచ్చును గాని 'ఇచ్చు' అనునది 'ఇంచు'గా మాఱుట యసంభవము. పూర్వశాసనములలో 'ఇంచు' అని యుండవలసినచోట 'ఇచ్చు' అని కన్పట్టుచున్నదనుట నిజమె "నిరుపమ మతి నృపధాము డైత్తిచ్చె నెగి దీచ్చౌ మఠంబు" (యుద్ధ-బెజవాడ శాసనము. శాసన పద్యమంజరి-౨-శాసనపు ప్రతిబింబము). సూ-రా-నిఘంటుకారుల యూహ సరికాదనుటకుఁ బై రీతిని వ్రాసితినిగాని 'ఇంచు' అనుదానినుండి 'ఇచ్చు' అను ధాతు వేర్పడెనని నా యభిప్రాయముకాదు. "ఈ" =(ఇచ్చు) అను ద్రావిడ ధాతువునకు "చు" ప్రత్యయము చేరుటచేత 'ఇచ్చు' అనునది యేర్పడెను.

దొరగారు వ్రాసినట్లు తమిఱమున 'రట్టిక్క' అనరాదు. 'ఇరట్టిక్క' అనునది సాధురూపము. (చూ. ౧౯ X నమ్మాలు తద్భవప్రక్రియ. ౪౪ విమ).

'ఇరట్టిక్క' అనునది భావార్థకమనుట ('Infinitive') కాల్డు. ౨౦౦ పుట) భ్రాంతిమూలకము. ఇందలిది యాశీ శ్శ్యాపాద్యర్థకమగు 'క' ప్రత్యయముకాని తుమర్థకములందుండు 'క'కారము కాని కానోపును. ప్రేరణార్థకములకుఁ దమిళ మున వచ్చు పరుపద్విత్వము కాదు. తమి-'ఇరట్టు'=(రెట్టిల్లు) అనునది యప్రేర ణార్థకము. అకర్మకము-దీని సకర్మకరూపము - (ప్రేరణార్థకము) 'ఇరట్టి'=(రెట్టిల్లఁ జేయు=రెట్టించు) అనునది. (మధ్యమపురుషైకవచన ప్రత్యయమగు 'ఇ' అను నది ప్రేరణార్థకమనియుఁ దమిళసంప్రదాయము). అట్టి సకర్మక ప్రేరణరూపముపై నాశీ శ్శ్యాపాద్యర్థకమగు 'క' ప్రత్యయము నిల్వఁగా 'ఇరట్టిక' అని యేర్పడును. (నన్నూ. ౧౪౦ సూ. 'క' ప్రత్యయము చెప్పఁబడినది). కానఁ దెల్గులోని 'రెట్టించు' అనుదానికి సరియగు తమిళ రూపము "ఇరట్టి" అనునది. 'ఇరట్టిక్క' అను తమిళరూపమునకు సరియగు తెల్గురూపము 'రెట్టించుతన్' 'రెట్టింపన్' అనునవి యగును. అట్లె "మన్నిక్క" అను తమిళరూపమునకు సరియగు తెల్గురూపము "మన్నించుతన్" 'మన్నింపన్' అనునవి యగును.

'పెరుఁగు' అనునది, సబిందుకమని శబ్దరత్నాకరమున వ్రాయఁబడెను. ఆ పక్షమున "పెరుక్కు" అను తమిళరూపమునకు మూలమనఁదగు 'పెరుఙ్కు' అను ప్రాచీన తమిళరూప ముండెడిదేమో యని యాలోచింపవలసియున్నది.

'పంచు'=(విభజించు) అనునది తెల్గు సకర్మక రూపము. దీని కకర్మకరూపము తెల్గున లేదు. ఇట్లె తమిళమునందును దీని కప్రేరణరూపము గానరాదు. తమిళమున 'పగు' అను దానికిఁ బ్రేరణమునందు "పగు" 'పగుక్కు' అను రూపములు రెండును గలవు. (చూడు ౫౬ విష.)

౬౦. VI విష:—"తెల్గునఁ దఱుచుగా 'చు' స్థానమున 'వు' అనునది వాడఁబడుచుండుటచేతఁ దమిళములోని 'కు' అనునది తెలుఁగులోని 'చు' అను దానికి భిన్నముకాదు. 'చు' స్థానమున 'వు' అనునది వాడఁబడుచుండుట నరయఁగాఁ దెలుఁగునందును నొకప్పుడు 'గు' అనునది వాడఁబడుచుండెడిదని తేలుచున్నది. 'చ' వర్ణము 'ప-బ-వ' లుగా మాఱదుగాని తెల్గునందేకాక వ్యావహారిక తమిళ మందును 'క-గ' లు వకారముగా మాఱుట గలదు. 'ప-బ-వ' లు పరస్పరము మాఱుట సుప్రసిద్ధము. పయి సందర్భమునుబట్టి 'గు' అనునది ద్రావిడభాష లలోఁ బ్రాచీనమనియుఁ దెలుఁగులోని 'చు' అనునదియుఁ గన్నడములోని 'సు' అనునదియు తమిళ 'గు' ప్రత్యయపు సకర్మక (ప్రేరణ) రూపమగు "క్కు" అను దానికి రూపాంతరము లనఁదగుననియు నెఱుంగనగును" (కాల్డు. ౨౦౨ పుట).

విమర్శము:—గకారము వకారమగుట తమిళాంధ్ర ప్రసిద్ధమనియుఁ దమిళ మందువలెనె తెల్గునందును 'గు' వర్ణాంతములయి ధాతువులుండుటంబట్టియె తెల్గున "గెలువన్ - పిలువన్" మున్నగు వాంతరూపములు సంభవించుననియు (చూడు స్టడీ. ద్రవి. ౬౮ పు.) దొరగారియాశయము. (చూడు. ౨౦ II విష) కాని తమిళమున 'గు' వర్ణాంతధాతువులు నవ్యములు. ప్రాచీన తమిళమున నరళోచ్చారణములేదు. తెల్గున 'గు' వర్ణాంత ధాతువు లుండెడివన్నచో "గెలు గుట-గెలువుట-పిలుగుట-పిలువుట" మున్నగు ననిష్టరూప పరంపర యుండెడిదని యంగీకరింపవలసివచ్చును. మఱియు 'చు' వర్ణముచోటఁ దెల్గున 'వ' కారము కొన్నియెడల నిల్చుట ధాత్వవయవసహజ 'చు' కారస్థలములందె కలదుగాని 'ఇంచు' గాగమ సంబంధి చకారస్థలములం దెన్నఁడును నెచ్చటను లేదు. ఇట్టి స్థితిలో "ఝ్క -జ్గు=న్క" అని తమిళరూపముఁ గుఁ దెల్గులోని 'చు' వర్ణకము 'వు' వర్ణముద్వారమున (గెలువన్. మొ)-నెట్లభిన్నము కాఁగలదు?

తెల్గున 'చు' వర్ణాంతధాతువుల 'చు' స్థానముఁ గొన్నియెడల 'వ' కారము నిల్చుట 'గకార వకార' పరిణామమూలకముకాదు-"గెలుచు+అన్=గెలువన్-గెలుచు+ము=గెలువుము" మున్నగు కొన్నియెడల ధాతువు తుది 'చ' కారము ప్రాకృతపద్ధతిని లోపింపఁగా నచటి స్వరసంహితలో 'వ' కారము వ్యవధాయక ముగా నిల్చుటచేత నచట వకారము గల్గుచున్నదని యూహింపనగును.

"క గ చ జ త ద ప య వాం ప్రాయో లుక్" (చండ III విధాన-3౮ సూ.) అను చొప్పునఁ బ్రాకృతములందుఁ బదాదీతర స్థలములందలి కకార చకారాదులు లోపించుట ప్రసిద్ధము. అట్టి స్వరసంహితలోఁ దెనుఁగునఁ గొన్నియెడల యకారమును గొన్నియెడల వకారమును నిల్చుట సంప్ర దాయము. ఉదా:—ఘటిక=గడియ. దీర్ఘిక=డిగ్గియ. మొ. చిగురు=చివురు. చతుర్థి=చవుతి. రాహుత్త=రవుతు-మొ. (చూ. వ్యా. సం. ౫౮, ౫౮ I విష.) ఇట్లే-గెలుచు+అన్=గెలు+వ్+ఉ+అన్=గెలువన్, గెలుచు+ము=గెలు+వ్+ఉ+ము = గెలువుము - మొదలగు రూపములను సాధించుకొననగును. (ఇంచుగాగమముచోట బిందువుమీఁద స్థిరమగు 'వ' కారము గాని యకా రముగాని నిలుచుట యాంధ్రసంప్రదాయ విరుద్ధముగాన నచట 'వ' కార సన్ని హిత వకారము నిల్చుచున్నదని యెఱుంగనగును.

౬౦. VII విష:—"శు-శ్శు:—('చు' 'చ్చు' అని పల్కఁబడును). ఈ ప్రత్యయములు తమిళమున మిక్కిలి యరుదు. తెలుఁగున 'శు' తుదినిగల పద ములు కూడ నిజముగా నే తత్ప్రత్యయాంతములు కావు. అవి యన్నియు 'ళ్కు' అను దాని వికారమగు 'చు' అను దాని వికృతియగు (చ్చు) 'శ్శు' అను

దానితోఁ గూడినవై యున్నవి. ఉదా:—తమి-అడైయ్‌శు=(దాఁగొను)-అడెయ్‌చ్చు=(చుట్టుకొను=దాఁచు). (ఇట్టిది చాంతము పక్షమునందలి యుదాహృతి యని దొరగారి యాశయము)" (కాల్డు. ౨౦౦ పుట).

విమర్శము:—తమిఱమున 'అడెయ్‌శు'=(దాఁగొను) అను శబ్దము లేదు. మఱియు నిందు "అడెయ్" అని పలుకరాదనియు 'అడై' అనియే 'ఐ' కారోచ్చారణము సరియనియు నీ వఱకు వివరించి యున్నాను (చూ. ౧౮ II విష). 'అడై'=(చేరు-'మూయు' అనునది గౌణార్థము) అను ధాతువు తమిఱమునఁ గలదు. 'అడు'=(సమీపించు) అనునది దీనికి మూలము. 'అడై'=(చేరుట=అట్లు చేరియున్న యాకులు) అను నామమును గలదు. 'అడై' (శు) అను సకర్మకము లేదు. 'అడైచ్చి'=(పువ్వు ముణుచుకొని) అను క్త్వాంతము మాత్రము ప్రాచీన భాషలోఁ గలదు. ఇట్టి మఱియేవేని చకారాంతములును దమిఱమున 'చ' కార పక్షో'దాహృతులు లేవు.

ఇట్లగుట చేతనే సకర్మకాకర్మకములకుఁగాని ప్రేరణా ప్రేరణములకుఁగాని దొరగారు వ్రాసిన లక్షణములు గల చాంత టాంత ధాతువుల యుదాహృతులు లేవనియు దొరగారు వానిని జేర్చుట నిరాధారమనియు నీ వఱకు వ్రాయఁబడెను (చూ. ఉం I విష).

ఉం. VIII విష:—"దు-న్దు-త్తు: వీనిలో 'దు' అనునది క్రియలయందుఁ గన్పట్టదు. నామములం దరుదుగఁ గలదు. క్రియలయందు 'న్దు' అనునది మాత్రమె చూపట్టును. 'ను' అనునది విశేషణములందు సైతము మార్పు లేక నిల్చును. 'దు' అట్లుకాదు. విశేషణములందు 'త్తు' అను రూపము నందును. ఉదా:—తమి-(అక) తిరున్దు=(బాగుగనుండు=నిర్దుష్టమగు)-(సక) తిరుత్తు=(దిద్దు=నిర్దుష్టమగునట్లు చేయు). విశేష్యము-మరున్దు=(మందు)-విశేషణము-మరుత్తుప్పై=(మందుసంచి). ఎరుదు=(ఎద్దు)-ఎరుత్తుప్పూట్టు=(ఎద్దు పూఁజు) 'దు-న్దు' అను ప్రత్యయములు తఱుచుగా త్ర్యక్షర ధాతువులందే చూపట్టును. ద్వ్యక్షరధాతువులలో వింతగా "నీన్దు"=(నీటి మీఁదఁ దేలు. ఈఁదు) అని యున్నది. ఇందు 'నీ' అనునది ధాతువు. 'దు' అనునది ప్రత్యయము. తమిఱమందె "నీత్తల్=(ఈఁత)" అను తజ్జన్యనామము గలదు. 'నీ' అను తమిఱ ధాతువునందును దెల్గునందలి 'ఈదు' అను ధాతువునందును గన్నడమందలి "ఈసు=ఈజు" అను రూపములందును ననుస్వారము లేదు గాన 'నీదు' అను నిరనునాసిక రూపమె తమిఱమునఁ బ్రాచీనమనియు, 'నీన్దు' అనునది తజ్జన్యమగు నర్వాచీన రూపమనియు విశదమగుచున్నది. ద్రావిడ భాషలన్నిటిలోను సమానముగ 'నీర్' శబ్దము నిరనునాసికముగాన దానితో సంబంధించిన 'నీ' ధాతువుకూడ మొదట నిరనునాసికమనుటయె యుక్తము.

గ్రీకు-'నిఓ'-లాటిను-'నో'-నటో-నా-అనువానికిది సరిపడును. సంస్కృ-నౌ= (ఓడ). సంస్కృతమున వీనికి ధాతువె కన్పట్టదు" (కాల్డు. ౨౦౦ పుట).

విమర్శము:—వెనుక వ్రాసిన రీతిని (౬ం-II-III. విభ.) "తిరుస్తు= తిరుత్తు" అను నప్రేరణ ప్రేరణ రూపములను సాధించుకొనవలెను. ప్రాచీన తమిళమున సరళస్థితి (తిరుదు-తిరుస్దు) నంగీకరించుట, యయ్యాది సకర్మకత్వమునఁ గల్గు ద్విత్వమునఁ బరుషముగా మాఱుననుట, మున్నగు దొరగారి వ్రాఁతలు సరికావని యీ వఱకె విశదపఱుపఁబడెను. "తిరుస్తు-మరుత్తు" మున్నగురీతి నున్నవానిలోని పరుష స్థితియే ప్రాచీన తమిళ సమ్మతము. "ఎరుత్తు వ్వాట్టు" అనునది తమిళ దేశ్యము కాదు. తమిళ కోశములలో నయ్యాది జాప్నా దేశీయమని వాడఁబడెను. తెనుఁగున "ఈఁదు" శబ్దము నిర్బిందుక మనుట సాహసము. శబ్దరత్నాకరాది కోశములందెల్ల "ఈఁదు-ఈఁత" అనురీతి నివి సబిందుకములుగనే యుదాహృతములయి యున్నవి. "క......।మీఁదన్ విరోగ సాగర ।మీఁదంగలవా లతాంగి......(విజయ విలాసము-౨ ఆ-౧౯-౨ ప). నీ......ఈఁతకు మిక్కిలి లోఁతు లేదు" (రామలిం-౮౩ ప. సూ-రా-ని.) అను రీతిని వీనిని మహాకవులు సార్థబిందుకములుగనె ప్రాసములలోఁ బ్రయోగించి యున్నారు. ఎట్టి యాధారము చూచుకొని తెల్గులోని 'ఈఁదు-ఈఁత' శబ్దములు నిర్బిందుకములని దొరగారు వ్రాసినారో? తెలియకున్నది. 'నీత్తల్' అను తమిళ శబ్దములోని ద్విత్వమె 'నీన్దు' శబ్దమందలి యనునాసికపు ప్రాచీనతకు నిదర్శన మగుచున్నది. 'నీర్' శబ్దమున ననునాసికము లేదు గాన 'నీన్దు' ధాతువునకు మూలమగునది 'నీన్' అను సానునాసికము కాదనియు 'నీ' అను రీతిగల నిరనునాసికమె యనియుఁ జెప్పట యసంగతము. ఆ రెండును విభిన్న విషయకములని గ్రహింపవలెను. 'నీర్' అనునది జలార్థకము. 'నీన్దు' అనునది "ప్లవన" మర్థము గలది=నీటి మీఁదఁ దేలుట. మఱియు 'నీర్' శబ్దము 'నీర-నార' అను సంస్కృత శబ్దములను సంబంధించినదె. దొరగారుదాహరించిన "నీఓ" 'నో' మున్నగు నిండో యూరపియను కుటుంబ భాషలలోని ధాతువులిట్టి యభిప్రాయమునకు హస్తావలంబ మొసఁగుచున్నవి. నారశబ్ద మూలకమగు నారాయణ శబ్దము వేద ప్రసిద్ధము.

"నీరమ్. న,.....నీయతే. ణీఞ్......నిర్గతం రా దగ్నే ర్వా......అగ్నే రాప ఇతిశ్రుతేః." (శబ్దార్థ చింతామణి కోశము). "స్ఫాయి తఞ్చి వఞ్చి శకి ...నీ......రక్." (సి. కౌ. ఉణాది. ౧౭౦ సూ.) ఇట్లు 'నీ' ధాతుజమగు 'నీర' శబ్దము ప్రాచీన మగుటచేత నియ్యది ద్రావిడులనుండి స్వీకరింపఁబడిన (చూ. VII ప్రక-శబ్దసామ్య. ౧౬ శబ్ద.) దనుట సరికాదు. ద్రావిడ శబ్దములకు

వ్యుత్పత్తి కల్పనమె వ్యాకర్తలు చేయ యత్నింపలేదు. ‘నీర్’ శబ్దము ద్రావిడ భాషలు పెక్కిటిలో నుండుట యొక్క ప్రమాణము కానేరదు. ద్రావిడ భాషలం దెల్ల సంస్కృత సమ భవములు విస్తరించి యున్నవనుటలో నెవ్వరును విప్రతి పన్నులు కాఁజాలరుగదా. పైరీతి వ్యుత్పత్తులుండఁగా ‘నీర్’ శబ్దమునకు సంస్కృతమున ధాతువే లేదనుట సరికాదు.

౬౦. IX విష:—“ప్రత్యయాంత ధాతువునుండి నామము పుట్టినపుడు ధాతువు తుది హల్లు పరుషమయి ద్విత్వము నందును. ఉదా:—తమి-తిరున్దు=(ఒప్పగు)-నామము-తిరుత్తమ్=(ఒప్పు) (దిద్దుబాటు). తమి-తూఙ్గు=(నిద్రించు)-నామ-తూక్కమ్=(నిద్ర). కొన్నియెడల నకర్మక ధాతువునకు “త్తు” అను దానిని జేర్చుటచేత సకర్మక ధాతు వేర్పడును. తమి-(అక) పడు=(పడియుండు)-సకర్మ-పడుత్తు=(ఉంచు). తమి-(అక)-తాళ్=(క్రిందగు-దిగు)-సక-తాళ్‌త్తు=(దించు). తమి-(అక) నిల్=(నిలఁబడు)-(సక)-నిఱుత్తు=(నిలఁబెట్టు). ఇట్లు తమిళమున ‘త్తు’ అనునది వచ్చుచోటులందుఁ గన్నడమున ‘దు’ అనునది వచ్చును. ఉదా:—కన్న-తాళ్-దు=(దించు).

పయిరీతిగల స్థలములు ప్రేరణార్థకములని కొందఱందురు. కాని ద్రావిడ భాషలలో ‘ఇ’ అనునది మాత్రమె ప్రేరణార్థకమని నిరూపింపఁబడును. (చూ. ౧-౨౧ II-విష.) కాన నియ్యవి ప్రేరణార్థకములు కావు. తమిళమున ‘త్తు’ వచ్చుచోటులందుఁ దెల్గున ‘చు’ అనునదిగాని ‘పు’ అనునదిగాని వచ్చును” (కాల్డు. ౨౦౧ పుట).

విమర్శము:—ధాతువులనుండి నామములు పుట్టుటలో ‘త్తు’ అనునది ప్రత్యయ మననేల? ‘తిరున్తు’ అను ధాతువు పయిని ‘అమ్’ అను ప్రత్యయము నిల్వఁగా “తిరున్తు+అమ్=తిరుత్తు+అమ్=తిరుత్తమ్” అని యేర్పడెననుట యుక్తము. అట్లె “తూఙ్కు+అమ్=తూక్కు+అమ్=తూక్కమ్” మున్నగు వానిని సాధించు కొననగును. పడుత్తు-తాళ్‌త్తు-నిఱుత్తు మున్నగు ప్రేరణ రూపములలో ‘త్తు’ అనునది నిలుచుటలో వింత యే మున్నది? వెనుక నుదాహ రించిన సన్నూలు సూత్రము మొదలగు రీతుల చొప్పున (చూ. ౬౦ II, ౬౦ III విష) నట్టి విశేష రూపములను సాధించు కొననగును గదా. పో=(పోవు) ధాతువు మీఁద “క్కు” అనునది నిల్వఁగా “పోక్కు=(పంపు)” అను ప్రేరణ రూప మేర్పడ లేదా? “ఎఱు=(లేచు)” ధాతు ప్రేరణ రూపము “ఎఱుప్పు=(లేపు)” అని యేర్పడలేదా? “తాళ్=క్రిందగు. తాళ్‌త్తు=క్రిందగునట్లుచేయు” అని యర్థము సెన్నవలెను. కాని “తాళ్‌త్తు” అను దానికి ‘దించు’ అను నర్థము కన్నడమున లేదు. కన్నడమందు-“తాళ్=వహించు-

ధరించు. తొట్ దు=వహించి-ధరించి" అని యర్థముల నెన్నవలెను. 'తొట్ దు' అను దానికి 'దించు' అని యర్థము కాదు. తమిళమున 'త్తు' వచ్చుచోటఁ గన్నడమున 'దు' వచ్చుననుట పొరపాటు. కన్నడమందలి 'దు' అనునది క్త్వార్థకము. ప్రేరణార్థమునఁ (లేదా సకర్మకత్వమున) గన్నడమందు 'ఇసు' అను నది వచ్చునే కాని 'దు' అనునది రానేరదు. తమిళమున 'త్తు' వచ్చు చోటులు మున్నగునవి ప్రేరణార్థకములు కావనియు ద్రావిడ భాషలలో 'ఇ' అనునది మాత్రమె ప్రేరణార్థకమనియు దొరగారు చెప్పుట సరికాదు.

౬౦. X విష:—"డ్-ణ్డ్-ట్టు" అనునవి సయితము 'ద్-న్ద్-త్తు' అను వాని వంటి కార్యములనె పొందును. ఉదా:—తమి-విశేష్య-కురుడు=(గ్రుడ్డి తనము) - విశేషణ - కురుట్టు = (గ్రుడ్డియైనవాఁడు) విశేష్య - ఇరణ్డు = (రెండు) విశేషణ-ఇరట్టు=(ద్విగుణితమైనది. రెట్టి) తెనుఁగున నీ 'డు' అనునది ద్విత్వ ముతో నుండదు. ఉదా:— తెల్గు-ఓకు=(స్రవించు). విశేషణ-ఓటి-కుండ= (స్రవించెడి-కుండ). తమిళమునఁ గొన్ని శబ్దములలో 'దు' అనుచోట 'ఱు' అనునది నిల్చును. విశేషణార్థమున ద్విత్వము నందినపుడు 'ట్ఱు' అని పల్కఁ బడును. "తమి-కిణఱు=(నుయ్యి) కిణట్ఱు=(ట్ఱు)=(నూతియొక్క)". (కాల్డు. ౨౦౨ పుట).

విమర్శము:—ప్రాచీన తమిళమున 'డ' లేదు. కాన 'డ్-ణ్డ్' లలో నిది 'ట' కారముగా వ్రాయుట లెస్స. దొరగారు 'కు-తు-పు' అనువానితో పాటుగ 'చాంత-టాంత' ధాతువులకును సకర్మకత్వమున నంత్యహల్లు ద్విత్వమునందునని వెనుక పొరపాటుగ వ్రాసిరి. (చూ. ౬౦ I విష). కాని తద్విమర్శమున నేను వ్రాసి నట్లె యిట 'టాంత' ధాతువులకు లక్ష్యములు లేమింజేసి 'టాంత' విశేషణోదా హారణములను మాత్రము చూపిరి. 'కురుటు' అను దానికిని 'తు' ప్రత్యయము (అతు=అదు=అది?) చేరిన సంధి రూపమే 'కురుట్టు' అను విశేషణ రూపమని యెఱుఁగ నగును. (కేవల ప్రాచీన కాలమున 'అతు=అదు' అనునది మహాద మహాత్సాధారణముగ నుండెడిది. (చూ. ౧౮ IX విష).

విశేష్యము తుదిని 'తు' అను 'అదు' శబ్దభాగము చేరుటచేత విశేషణ రూప మేర్పడును. దొరగారు అట్టి దాని సంధిరూపమని తలంపక భ్రమించి ద్విత్వమందురు. దొరగారు తెల్గున 'టు' ద్విత్వము లేదన నేల?. "రెండు- రెట్టి" మున్నగునవి తెల్గున లేవా? వయి రీతినె "కిణఱు+తు" అనువాని సంధి రూపమె 'కిణట్ఱు' అనునది. ఇట 'దు' అను దానిచోట 'ఱు' అని రాలేదు. 'కిణఱు' శబ్దములోని 'ఱు' శబ్ద సిద్ధము. 'కిణట్ఱు' అనుచోటి ఱకార ద్విత్వమును 'ట్టు' అనుదానివలె పల్కుట తమిళ పండిత సంప్రదాయము. కాన 'ట్ఱు' అని

పలుకఁబడునని దొరగారు వ్రాయుట సంప్రదాయ విరుద్ధము. (చూడు. ౧౭ XIII విష).

౽౦. XI విష:—"బు-మ్బు-ప్పు:—'బు-మ్బు' అను తమిళ ప్రత్యయముల చోటఁ గన్నడమున 'వు' అనినిల్చును. తెల్గు నామములందు 'ము' అను నదియుఁ (తెల్గునందును నమహాన్మప్రత్యయ మర్వాచీనము—"మ్బు=౦బు-బు" అను రూపమె ప్రాచీన శాసనములందుఁ గన్పట్టును) క్రియలయందు 'వు'-లేక-'గు' అనునదియు నిల్చును. తమిళమందలి 'ప్పు' అనుదాని చోటఁ దెలుఁగున "పు-౦పు-ప్పు" (తెల్గు-త్రిప్పు) అనునవి యథాసంభవముగా నిల్చును. ఉదా:—ధాతువులకు:—(అక)-నిరమ్బు=(నిండు)-సకర్మ-నిరప్పు=(నింపు). "నిర-నిరవు-నిరై-నిఱై" అను ధాతువులలో 'నిర్' అనునదే యగపడుచున్నది. తెల్గు (అక) నిండు-(సక) నింపు. నామములకు: – తమి-(విశేష్య)-ఇరుమ్బు=(ఇనుము). విశేషణ-ఇరుప్పు కోల్=(ఇనుపకోల)-తెల్గు-(విశేష్య) ఇనుము. విశేషణ-ఇనుప (కోల). కన్న-విశేష్య-హావు=(పాము). తమి-పామ్బు. తెల్గు-పాము" (కాల్డు. ౨౦౨ పుట).

విమర్శము:—వెనుక వ్రాసిన రీతినె (౽౦ II, III విష). 'నిరమ్బు-నిరప్పు' అను ప్రేరణ రూపమును సాధించుకొన వలయును. 'నిరమ్పు' అనునది యంతర్గత ప్రేరణార్థక మనునది మొదలగు విషయములు వెనుక వ్రాసిన వానిని స్మరించునది. 'నిరమ్బు' అను దానిలోని సరళము సహజమనియు నది సకర్మకత్వమున ద్విత్వమునందు నపుడు పరుషమగు ననియుఁ జెప్పెడి దొరగారి నిరూపణము సరికాదని వెనుక వ్రాసిన రీతిని గ్రహింపవలయును.

అఱవమునఁ గ్రియలలో "బు-మ్బు" నిల్చుచోటఁ దెల్గున 'వు'-లేక-'గు' నిల్చుననుట సరికాదు. అట్టి యుదాహృతులను దొరగారియ్యను లేదు. దొరగారు చెప్పిన 'నిర' ప్రభృతులలో 'నిర' అను దానికి 'నిండు' అను నర్థములేదు. "నిరవు=చదునుచేయు; నిరై=వరుస; నిఱై=నిండు" అను తమిళ శబ్దములందు సామ్యము లేమింజేసి యివి యభిన్నములను నూహ సరికాదు. 'నిరమ్బు' అను తమిళ శబ్దమునకును 'నిండు' అను తెల్గు శబ్దమునకుఁ జాల నెడమున్నను సామ్యము బలముగాఁ గన్పట్టుచున్నది. "తమి-నిరప్పు=తెల్గు-నింపు" అనునది దొరగారు చేసిన నిరూపణమునకు సరియగు లక్ష్య మగుచున్నది. "ఇరుమ్బు-పామ్బు" మున్నగు తమిళ శబ్దములందలి బకార సరళ మర్వాచీనము. 'ఇరుమ్పు-పామ్పు' అను పరుష ఘటిత రూపములె ప్రాచీనములు. "ఇరుమ్పు=ఇరుప్పు; పామ్పు=పాప్పు" అనునవి పరస్పరమును రూపాంతరములగుటచేతఁ బర్యాయ శబ్దములె. (చూడు ౨౫ I మొ.

౨౫ VII వ. విష). విశేషణము దాని విశేష్యముతో సమసించునపు డచటి సమాస శక్తిచేత విశేషణత్వము సిద్ధించును. ఇరుమ్బురొక్క కోల యనఁగా నిరుమ్బు సంబంధమైన కోలయని యర్థము. అట్టి యెడల 'ఇరుప్పు' అను ద్విత్వ ఘటిత రూపమును విశేషణముగాను 'ఇరుమ్బు' అను ననునాసిక ఘటిత రూపమును విశేష్యముగాను వ్యవహర్తలు వ్యావర్తకముగా వ్యవహరించిరని యూహింపనగును. ఇట్లగుటచేత విశేష్యము తుదిహల్లు ద్విరుక్తి నొంది విశేషణమగుచున్నదను భ్రమకల్గుచున్నది.

"పాప్పు-ఇరుప్పు" అను తమిటి విశేషణ స్థితికిఁ దెలుఁగులోని 'నామ్వాది-కనుమ్వాదుల స్థితి సరిపడదు. తెల్గు-విశేష్య-ఇనుము. విశేషణ-ఇనుప కోల. విశేష్య-పాము-విశేషణ-పాఁపతేఁడు. ఈ రీతిని విశేషణ స్థలములలో 'ప-ంప' అనునవి నిల్చును. తెలుఁగులోని 'పు-ంపు' లకు 'ప-ఁప' అనునవి యపవాదముల వంటివి. అందలి 'అ' త్వము విశేషణ ప్రత్యయమని యూహింపనగును. (చూడు-౨౩ విష).

ౘం. XII విష:—"అటవమున 'ప్పు' అనునది యుండు చోటులందే కాక "క్కు-త్తు" అనునవి యుండు చోటులందును దెలుఁగులో 'పు-ంపు'లు నిల్చును. ఉదా:—తమి-మేయ్క్క=తెల్గు-మేపఁగా. తమి-నిరుత్త=తెల్గు-నిలుపఁగా=నిలఁబెట్టఁగా. తమిటమున "ఇక్కు" అనునది నిల్చుచోటులందు సయితము తెలుఁగున 'ంపు' అనునది గాని 'ంచు' అనునది గాని నిల్చును. ఉదా:—తమి-ఒప్పువిక్క=తెల్గు-ఒప్పగింప=ఒప్పగించ, మొ." (కాల్డు. ౨౦౨ పుట).

విమర్శము:—ఈ వ్రాఁత సరూప భ్రాంతికృతము. దొరగారి యుదాహృతులందలి 'క్కు' అనునది 'అడక్కు' మున్నగు వాని యందువలెఁ బ్రేరణ మందుఁగాని సకర్మకత్వమందుఁగాని యేర్పడినది కాదు. తమిటి 'మేయ్' ధాతువంతర్గత ప్రేరణార్థకము. 'మేయ్' అనుదానికే "మేయు-మేపు" అను రెండర్థములును గలవు. కాన 'మేయ్క్కు' అను తమిటి శబ్దమునకుఁ దెల్గులోని 'మేపు' అనునది పర్యాయము కాదు. తమిటమందలి 'మేయ్' అను దానికే తెల్గులోని 'మేయు-మేపు' అను రెండును బర్యాయములు. తమిటములోని 'మేయ్క్క' అను దానిలోని 'మేయ్' అనునది ధాతువు. 'కు' అనునది భావ్యర్థకము. 'అ' అనునది తుమున్నర్థక ప్రత్యయము. తుమున్నర్థకము భావ్యర్థమందు వచ్చుట సంప్రదాయము. కాన భావ్యర్థక 'కు' ప్రత్యయము తుమర్థక రూపములలో నిల్చుట తమిటమునఁ బ్రసిద్ధమయ్యెను. 'కు' ప్రత్యయము భావ్యర్థకమని తమిట వ్యాకర్తలు వచించిరి.

"క ట త అ......" (తొల్కా. ఽ౬౭ సూ.) = 'కు-టు-తు-ఱు' అను నవియును 'ఎన్-ఏన్-అల్' అనునవియును దుదినిగల క్రియ లుత్తమపురుషైక వచనములు......'అల్-కు' అనునవి భావిలో మాత్రమె వచ్చును. తొల్కాప్పియమునఁ దుమర్థకము ప్రత్యేకముగ సాధింపఁబడ లేదు.

"అన్......" (నన్నూలు ౧౪౦ సూ.) = 'కు' భవిష్యదర్థకము. చెయ్కు=చేయఁగలను. చెయ్కుమ్=చేయఁగలము. తుమర్థమున భావ్యర్థము భాసిల్లునను వైయాకరణ సంప్రదాయము తెలియక యర్వాచీనులు 'కు' అనునది సా (చా) రియైగా (ఆగమము) వచ్చునని చెప్పుచున్నారు. కాని 'తుమున్' ప్రత్యయము (Infinitive), భావ్యర్థమందె వచ్చుననునది వైయాకరణ సంప్రదాయము.

"తుమున్ ణ్వులౌ క్రియాయాం క్రియార్థాయామ్. (3-3-౧౦)=క్రియార్థాయాం క్రియాయా ముపపదే భవిష్యత్యర్థే ధాతో రేతౌ (తుమున్ ణ్వుల్) స్తః". (సి-కౌ. 3౧౭౫ సూ). "కృష్ణం ద్రష్టుం యాతి=కృష్ణకర్తక భవిష్యద్దర్శనార్థం యాన మిత్యర్థః। అత్ర యాతీ త్యుపపదమ్". (బాలమనోరమా వ్యాఖ్య).

పయి సందర్భమునుబట్టి "మేయ్ (ధాతు) +కు (భావ్యర్థక) + అ (తుమర్థక ప్రత్యయము) = మేయ్క" = (మేపన్=మేపఁగా) అని యేర్పడెనని యెఱుఁగనగును. ఇట్లె "ఒప్పు (ధాతు)+వి (ప్రేరణార్థకము. చూ. ఽం II విష)+కు (భావ్యర్థకము)+అ (తుమర్థకము)=ఒప్పువిక్క"=(ఒప్పగింపన్) అను దొరగారి యుదాహరణమును సాధింపనగును. ఇట్లె "కల్=(ధాతు-అభ్యసించు)+కు (భవిష్యదర్థకము)+అ (తుమర్థకము)=కఱ్క=(అభ్యసింపన్). నిల్=(నిలుచు-ధాతు)+కు (భవిష్యదర్థకము)+అ (తుమర్థకము)=నిఱ్క"=(నిలువన్) ఇట్లు తుమర్థక రూపములు తమిఁటమున సాధ్యములు.

దొరగారుదాహరించిన 'నిరుత్త' అనునది రేఫఘటితముకాదు. అకారయుక్తము, తమిఁటమున నిట్లు కొన్ని తుమర్థకములలో 'కు' ప్రత్యయము చేరకుండుటయుఁ గలదు.

ఽం. XIII విష:—"సకర్మక క్రియలకుఁ గర్మాకాంక్షయు విశేషణములకు విశేష్యాకాంక్షయు నుండుటచేత నీ రెండిటిని నొక తరగతిగాఁ బ్రాచీనద్రావిడులు భావించి రనఁదగును." (కాల్డు. ౨౦౨ పుట).

విమర్శము:—ప్రాచీనద్రావిడులు వీని నొక తరగతిగ భావించుటచేత వీని కంత్యహల్ ద్విత్వమనెడి వ్యాకరణకార్యైక్యము సంభవించెనని దొరగారు

తలంచుట సరికాదు. జనులవాడుకలో భాష ప్రవహించునేకాని వాని వ్యాకరణ కార్యములను జను లేకీభవించి కల్పింతురనుట స్వభావవిరుద్ధము, 'అడఁగు' మున్నగునవి యంతర్గతప్రేరణార్థకములనియు 'అడఁచు-=అడక్కు-' అనునవి పర్యాయరూపములె యనియుఁ దలంచునపుడు వ్యాకరణకార్యైక్యమును లేదని చెప్పవచ్చును. 'గు-ఙ్గు, దు-న్దు' మున్నగుధాతువుల తుదివర్ణములపైని ప్రేరణార్థమున 'కు-తు'-మున్నగు ప్రేరణార్థకములు నిల్చి సంధించుటచే నచటి ద్విత్వము లేర్పడె ననునప్పుడును (ఉం IV విష.చూ.) వానికిఁ గార్యైక్యములేదు.

ఉం. XIV విష:—"పయిని వివరించిన ప్రత్యయములన్నియు నేకరీతివె మైనను ధాత్వవయవ సంబంధమున వాని యాకారము భేదిల్లుచువచ్చె ననఁ దగును. ద్రావిడశబ్దములలో "గు-ఙ్గు-క్కు-; చు-చ్చు; (శు-శ్శు) డు-ణ్డు-ట్టు; దు-న్దు-త్తు; బు-మ్బు-పు-ంపు-ప్పు; ము-వు" అనునవి తుది నగపడు నపుడవి ప్రత్యయములని గ్రహించి వానిని విడఁదీసినచో ద్రావిడప్రకృతుల పరస్పర సంబంధము సులభముగా గుర్తింపనగును. ఉదా:—"తమి - కొమ్బు=(కొమ్మ-కట్టుపుల్ల)-వేమ్బు=(వేఁపచెట్టు)-వమ్బు=(నింద)-పామ్బు=(పాము)." అను వీని లోని 'మ్బు' అనుదానిని విడఁదీసినచో వరుసగా, ఛేదనార్థకమగు 'కొయ్' ధాతువును, 'నీడనిచ్చు' అను నర్థముగల 'వేయ్' ధాతువును, నిందార్థకమగు 'వయ్' ధాతువును, 'త్రుళ్ళు' అను నర్థముగల 'పాయ్' ధాతువును మూల రూపములని విశదమగును. వీనిలోని తుది యకార ముచ్చారణార్థకమనియు మిగిలినదే ధాతువనియు గ్రహింపవలయును. నామములనుండి నయిత మిట్లె గ్రహింపవలయును. ఉదా:—మరున్దు = (మూలిక) - మరు = (పరిమళించు—ధాతువు). కిఴఙ్గు=(దుంప) - కిఴ్ =(క్రిందైయుండు—ఇది - ధాతువు - తెల్గు-క్రిందు)" (కాల్డు. ౨౦౩ పుట).

విమర్శము:—తమిఴమున-"కొయ్=ఛేదించు; వేయ్=ఇల్లుకప్పు; వయ్=నిందించు; పాయ్=నీరుపాఱు - దుముకు;" అను ధాతువు లుండుటనుబట్టి దొర గారు పైరీతి కల్పనమును జూపిరి. కాని యట్టి కల్పనమునందలి వ్యుత్పత్తులు "కొమ్బు=కొమ్మ; వేమ్బు=వేఁపచెట్టు; వమ్బు=వ్యర్థము (తొల్కాప్పియమున 'వమ్బు=అస్థిరము' అని ప్రయుక్తమైయున్నది)" (తెల్గున "వమ్ము=వ్యర్థము); పామ్బు=పాము" అనువాని పట్టున నర్థవంతములై తత్తద్వస్తుస్వభావద్యోతకములై సరిగా నున్నవా? యని యాలోచింపవలసియున్నది. సంస్కృత శబ్దములకు వైయాకరణులు చూపు "గచ్ఛతీతి గౌః" అను రీతిగల వ్యుత్పత్తులు కొన్ని యింతకంటెను నవిశ్వాస్యములై యుండును. 'కొమ్బు' శబ్దమునకు 'కొనల'

వ్యాపించునదనియు, 'వేమ్బు' శబ్దమునకు వెగడు (లేక) వెగటుగా నుండున దనియు, 'వమ్బు' శబ్దమునకు వట్టిపోవునదనియు, 'పామ్బు' శబ్దమునకు విష మును బాఱించునదనియు వ్యుత్పత్తులను గల్పించుట లెస్సయేమో. 'మరున్దు' అను దానికి "పరిమళించు" అను నర్థముగల 'మరు' ధాతువు మూలమనుట కంటె 'మరమ్'=(తెల్గు - మ్రాఁకు) అనునది మూలమనుట యుక్తము, 'సుశ్రు తము-చరకము' అను నాదిమవైద్యగ్రంథములలోఁ జెప్పఁబడిన మందులెల్ల వృక్షౌదుల మూలికాదులె. "మందో? మాకో? (మ్రాఁకో)" అను నానుడియుఁ దెల్గునఁ బ్రసిద్ధము.

౬౧. విష:—"ద్రావిడభాషలందును నిండో యూరపియను భాష లందును ధాతువులోని వర్ణములకు ద్విరుక్తి గల్గుట గలదు. కాని యట్టి ద్విరుక్తి వచ్చుటలోను దానిని జేయు నుద్దేశములోను రెండిటికిని జాలభేదము గలదు. ఆర్యభాషలలో ధాత్వాదివర్ణమునకును ద్రావిడభాషలలో ధాతువు తుదివర్ణమున కును ద్విరుక్తిగల్గును. అఱవమునందలి ద్విరుక్తి యనేకములగు స్థలములందుఁ గల్గును. అది వచ్చునపుడు సరళము పరుషముగా మాఱును. ఈ క్రింది సందర్భములలో నఱవమున ద్విరుక్తులు వచ్చును."

I. "విశేష్యము విశేషణమగునపుడు తుదివర్ణము ద్విరుక్తమగును. ఉదా:—మాడు=(ఆవు-ఎద్దు). మాట్టు తోల్=(ఆవుయొక్క లేదా యెద్దు యొక్క చర్మము).

II. అకర్మకధాతువు సకర్మకముగా మాఱునపుడు ధాతువు తుదివర్ణము ద్విరుక్తినందును. ఉదా:—(అక) ఓడు=(పరుగెత్తు). సకర్మ-ఓట్టు=(పరుగెత్తించు= వడిగాఁ ద్రోలు).

III. భూతార్థకములందు ద్విరుక్తివచ్చును. ఉదా:—తగు=(తగియుండు) (ధాతువు). భూతార్థక విశేషణము. 'తక్క'=(తగియుండిన).

IV. కృత్ప్రత్యయాంతములందు ద్విరుక్తి గల్గును. ఉదా:—ఎఱుదు= (వ్రాయు). ఎఱుత్తు=(అక్షరము, ఉత్తరము)." (కాల్డు. ౨౦౮ పుట).

విమర్శము:—ఆర్యభాషలందు ధాత్వాదివర్ణమునకే కాదు. ధాతువునకే ద్విరుక్తి గల్గును. అయినను నట్టి ద్విరుక్తులలోని మొదటిదాని యాద్యచ్చునకుఁ బరభాగము లోపించునని చెప్పఁబడుటచేత నాద్యక్షరముమాత్రము ద్విరుక్తమయి నట్లు భాసిల్లును. మఱియు నార్యభాషలందు స్వరసహితమగు నాదిహల్లు నిల్చునుగాన నది ద్రావిడభాషలందలి ద్విత్వహల్లుతోఁ బోల్పఁదగినది కాదు.

మఱియు నది ధాత్వాదిభాగమగుటచేత ప్రత్యయాదిరూప మనుటకును వలను పడదు. మఱియు, డా. కాల్డువెల్లుగారు ద్రావిడభాషలందుఁ దుదిహల్లు ద్విరుక్త మగునని భ్రమపడి చెప్పినకారణముచేత నిట్లు రెండిటికిని బోలిక గలదా? లేదా యని విచారింపవలసెనుగాని నిజముగా ద్రావిడభాషలందలి తుదిహల్లు, నిర్నిమిత్త ముగా ద్విరుక్తము కానేరదు (చూడు ౧౩౧ I విష). ధాత్వవయవాక్షరముల యొక్క కాని ప్రకృతి ప్రత్యయాక్షరములయొక్క కాని మేళమున (ప్రాకృతపద్ధతి. చూడు ౬౦ III విష.) సంధివశమున నంత్యవర్ణద్విత్వము సంభవించును గాన నిది సంస్కృతమునందలి ద్విరుక్తితో నెంతమాత్రమును బోల్పఁదగదు. 'అడక్కు' అనుచోటి "జకార కకార" సంయోగము 'క' ద్విత్వముగాఁ బరి ణమించినదని చెప్పుట యుక్తముగాని 'క' కారము పునరుక్తమయ్యెనని చెప్పుట యుక్తము కాదుగదా. ఆంధ్రకర్ణాటములయం దిట్టి ద్విత్వపు గంధమేని లేదు. ద్రావిడ భాషలందననేల?

డా. కాల్డువెల్లుగారు చూపిన యుదాహృతులందలి ద్విత్వములును జైరీతిని వర్ణద్వయమేళనము సంభవించినవె యై యున్నవి.

I. దొరగారు 'మాడు' అనిరిగాని ప్రాచీన తమిళమున నది 'మాటు' అని పరుషయుక్తమె. మాటు=(పశువు)+తు (విశేషణత్వమున వచ్చిన 'తు' ప్రత్యయము. 'అతు=అదు=అది' అను తచ్ఛబ్దసంబంధి)=మాట్టు=(పశు సంబంధమయిన). టత సంయోగము = టకారద్విత్వముగాఁ బరిణమించినది (చూ. ౬౦ III విష).

II. పైరీతినే 'ఓడు' శబ్దము కాదు-'ఓటు'=(పరుగెత్తు) శబ్దము. దీనిపైని సకర్మకత్వమున=ప్రేరణార్థమున - 'తు' అను ప్రత్యయముచేరి సంధింపఁగా 'ఓట్టు'=(పరుగెత్తించు) అను రూపమేర్పడెను (చూ. ౬౦ II, III విష).

III. పైరీతినె 'తగు' శబ్దము కాదు. 'తకు'=(తగియుండు) శబ్దము. దీనిపైని భూతార్థకమగు 'త' కారమును విశేషణతాద్యోతకమగు 'అ' ప్రత్యయ మును నిల్పఁగా "తకు + త్ + అ = తక్క" = (తగియుండిన) అను రూప మేర్పడెను.

IV. 'ఎఱుదు' శబ్దము కాదు - 'ఎఱుతు'=(వ్రాయు) శబ్దము. ఈ (ధాతువు)పైని 'తు' అను కృత్ప్రత్యయముచేరి సంధింపఁగా 'ఎఱుత్తు'= ఉత్తరము-అక్షరము) అను శబ్దమేర్పడెను.

పై యుదాహృతులలో నొకరకమె ద్విత్వ మెందును వచ్చియుండలేదు.

ఆర్యభాషలయందలి ద్విరుక్తి యిట్లు వర్ణాంతరమేళన సంధిజన్యము కాదు. భూతానద్యతనపరోక్ష లిట్టు రూపములందును జుహోత్యాది ధాతురూపములందును సన్నంత యజన్త యఙ్లుగన్త రూపములందును ధాతువు ద్విరుక్తమగును. అందలి పూర్వఖండము యొక్క యాద్యచ్చునకుఁ దర్వాతిభాగము లోపించును. ఉదా:—భూ=(అగు)+లిట్=భూ+భూ+లిట్=బభూవ=(ఆయెను) మొ. హు=(హోమముచేయు). హు+హు+తిప్=జుహోతి=(హోమము చేయుచున్నాఁడు). సన్నంతము:—కృఞ్ ధాతువు(చేయు). చికీర్షతి=(చేయఁదలంచుచున్నాఁడు) (కృ+కృ+స+తిప్). చికీర్షా=(చేయునిచ్ఛ). చికీర్షుః=(చేయ నిచ్ఛించువాఁడు). యజన్తములు:—జేగీయతే=(గా-స్తుతించు-ధాతువు). గా + గా + య + తే=(పలుమాఱు నత్యంతము గానముచేయుచున్నాఁడు). (జేగీయమాన=పలుమాఱు స్తుతింపఁబడుచున్న) యఙ్లుగన్తములు-రారాజతి=('రాజ్ - దీప్తౌ. ధాతు) - రాజ్+రాజ్=(యఙ్లుక్+తి) = (మిక్కిలి ప్రకాశించుచున్నాఁడు) రారాజత్=(మిక్కిలి ప్రకాశించుచున్న).

౬౨. I విమ:—"ద్వ్యక్షరధాతువులు:—ద్వ్యక్షరధాతువులలోని మొదటి యక్షర మాదినుండియు ధాతువేయైయుండి సామాన్యార్థబోధకమగుచుండును. రెండవ యక్షరము విశేషార్థబోధకమైయుండి రూపుమాసిన ప్రత్యయము యొక్క కాని వేఱొక ధాతువుయొక్క కాని సంబంధార్థబోధక పదముయొక్క కాని భాగమై యుండును. ఈ ద్వితీయాక్షరము ధాత్వర్థమునకుఁ గొన్నియెడల వైపుల్యమును గొన్నియెడల సంకోచమును గల్గించును. కొన్నియెడల దీని వలనఁ గల్గు మార్పు దుర్గ్రాహమై యుండును. కొన్నియెడల నీ ద్వితీయాక్షరము భావార్థకప్రత్యయరూపమై యుండును" (కాల్డు. ౨౦౫ పుట).

"సెమెటిక్కుటుంబభాషలందును నిట్లు, ధాతువుయొక్క మొదటివర్ణము ధాతువయియుండఁ దర్వాతివర్ణము లర్థవిశేషబోధకములగును. (ఈ విషయ మిచట దొరగారు మిక్కిలి విస్తరించి వ్రాసిరి). ఈ విషయమున ద్రావిడధాతువుల కును సెమెటిక్కుటుంబభాషలకును—అందును హెబ్రూభాషకును—నధికమగు పోలిక గలదు. ఈ రెండిటియందును ధాతువు మొదటి యక్షరము సామాన్యార్థబోధకమై యుండఁగాఁ దర్వాతియక్షర మట్టి యర్థమునకు సంకోచమును గాని వికాసమునుగాని బోధించుచుండును" (కాల్డు. ౨౦౫–౨౦౬ పుటలు).

౬౨. II విమ:—'I అడ్' ధాతుజన్య శబ్దగణము. తమిటిశబ్దములు.

| డా. కాల్డువెల్లుగారి నిరూపణము. | విమర్శము. |
|---|---|
| "అడు=సమీపించు-చెందు-కలుపు-చంపు-వండు. | 'అడు' ధాతువునకు "చెందు-కలుపు" అను నర్థములు లేవు. |

| డా. కాల్డువెల్లుగారి నిరూపణము. | విమర్శము. |
|---|---|
| అడఙ్గు=అణఁగియుండు. | ప్రాచీనతమిళమున సరళములు లేవు గాన "అటఙ్కు" ప్రాచీనరూపము. |
| అడకుక=ఆవరించికొను-చుట్టుకొను. | 'అడక్కు' అనునది 'అడఙ్కు' అను దాని ప్రేరణరూపముగాన దీనికి "అణఁచు = అడఁగి యుండునట్లు చేయు" అని యర్థము. |
| అడి = త్రోలుకొని వచ్చు - కొట్టు - (అడుగు భాగమను నర్థముగల నామమును గలదు). | అడి="కొట్టు-క్రిందిభాగము-పాదము" అని దీని యర్థములు. |
| అడై =పొందు - లోనికివచ్చు. సకర్మకత్వమున 'ఆవరించు' అని యర్థము. | అడై =చేరు-మూయు. దీనికి సకర్మకత్వమున ననఁగాఁ బ్రేరణమున 'చేర్చు' అని యర్థము. 'ఆవరించు' అను నర్థము దీనికి లేదు. వేలి అడైత్తాన్ = వెలుగు కట్టు చోటి దారిని మూసెను. ఇట్టిదాని నావరించుటగా నర్థము చేయుట సరికాదు. |
| అడైశు(చు)=కుక్కు-లోనికిఁద్రోయు. | 'అడైశు (చు)' అను శబ్దము తమిళమునఁ గన్పట్టదు. "అడైచ్చి = పూవును గొప్పులో ముణుచు" అను క్త్వాంతము మాత్రము ప్రాచీన భాషలోఁ గలదు—'మూసి' అని వాడుక. |
| అడర్ = చేరియుండు - గుమిగూడి యుండు. యుద్ధముచేయు-కలియఁబడు. | తెల్గు-అడరు. |
| అడుక్కు=దొంతరగాఁ బేర్చు. దీనికిని మీఁద వ్రాసిన 'అడకుక' అను దానికిని వరుసగా 'అడుక్-అడక్-' అనునవి నిజమైన రూపములు. ఉచ్చారణార్థకమగు 'ఉ' చేరుటచే ద్విత్వము వచ్చినది. | ఈ పటువు 'అడఙ్గు' అనుదానికి సకర్మకత్వమున ననునాసికము లోపింపఁగా మిగిలిన 'గ' కారము 'క' కారమై ద్విత్వము నందుటచేత 'అడక్కు' అను రూప మేర్పడెనని డా. కాల్డువెల్లుగారే వ్రాసిరి. |

| డా. కాల్డువెల్లుగారి నిరూపణము. | విమర్శము. |
|---|---|
| | (చూడు ౬౦ I విభ, ౨౮ I విభ). ఇట్టి పూర్వోత్తర సందర్భరాహిత్య మిందనేక స్థలములందుఁ గలదు. |
| అణ్డు=(తెల్గు-అంటు) సమీపించు. ఇది మీఁద నుదాహరించిన ‘అడు’ ధాతువునం దుచ్చారణార్థకమగు ననునాసికాగమము చేరుటచేత నేర్పడినది” (కాల్డు. ౨౦౭ పుట). | కాల్డువెల్లుగారి యీ వ్రాఁత సరికాదు. నిరర్థకముగా ననునాసికాగమము చేరుననుట విశ్వసనీయము కాదు. (చూ. ౨౮ IV. ౨౯ I. విభ.) ‘అణ్ = సమీపించు + తు = అణ్డు’ అను రీతి నిది యేర్పడెనని గ్రహించుట యుక్తము. |

“పయిధాతువు లన్నిటియందును నొక్కవిధమగు పోలిక యగపడుచున్నది. అందలి మొదటి ‘అడ్’ అను భాగమునకు సామాన్యమగు నర్థము ‘సామీప్యము’. తక్కినభాగము లా సామీప్య మేవిధమైనదో తెల్పుచున్నవి.” (కాల్డు. ౨౦౭ పుట).

II అణ్ ధాతుజన్య తమిళ శబ్దగణము-

| | |
|---|---|
| “అణు=అణుగు. సమీపించు-తాఁకు. | తమిళమున ‘అణ్’ ధాతువు కలదు. ‘అణుగు’ అను ధాతువును గలదు. వీనికి ‘సమీపించు’ అని మాత్రమే యర్థము. ‘అణు’ అను ధాతు రూపము లేదు. |
| అణి=ధరించు. కట్టు ‘ఆణి=మేకు’ అను నచ్చవశబ్దము సైతము ‘అణ్’ ధాతు జన్యమే. సంస్కృత మందలి “అణి=ఆణి” అనునవియు దీనిని సంబంధించినవె. గ్లసోరియల్... ౧౬౮ పుటలో నిట్లు వ్రాయఁబడెను. ‘ఆణి=చీల. మేకు-గూటము. (అణ్+ఇ=అణి=పైనుంచు) అణై=ఆలింగించు. కట్టు-బంధించు. ‘అణవు=అంటుకొను’. తగులుకొను. అణు= | ‘అణై’ అను దానికి ‘కట్టు-బంధించు’ అను నర్థములు లేవు. ‘ఆశ్లేషించు’ అను నర్థము గలదు. “అణి. పుం-స్త్రీ (అణతి=శబ్దాయతే అణ + ఇన్). రథచక్రాగ్రస్థితే కీలకే. సూచ్యాద్యగ్రభాగే చ. స్త్రీత్వే వా జీష్......అణి-అణీ ఇత్యపి” (శబ్దస్తో). ఇట్లు సంస్కృతమున ‘అణ్’ అను ధాతువును గలదు. అణు=పరమాణువు- సూక్ష్మవస్తువు. అణవ్య=సర్షపాద్యుత్పత్తి |

డా. కాల్డువెల్లుగారి నిరూపణము.

తాఁకు.' అని తమిళమున ననేకశబ్దములు దీనిని సంబంధించునవి గలవు. కాన నిది ద్రావిడశబ్దమె యనుట యుక్తము.

విమర్శము.

క్షేత్రము. అణక=అధమ - అణిమన్-అణీయస్ మొదలగు పెక్కుశబ్దములు గలవు. 'సమీపించు' అను నర్థముగల ధాతువుకన్న 'సూక్ష్మత' అను నర్థముగల ధాతువు దీని కర్హము. ఇది సంస్కృత శబ్దము కాదనుట విశ్వసనీయము కాదు. (చూ. ౧౮౨ II విష. ౮ శబ్ద).

అణై=కలుపు - ఆశ్లేషించు. (నామమగునపుడు-ఆనకట్టు).

'అణై' అను ధాతువునకు 'ఆశ్లేషించు' అను నర్థము నామ:—'సేతువు' అను నర్థమును గలవు.

అణవు=అంటుకొను.

'అణవు' అను దానికి 'చేరు' అని యర్థము. దీనికి 'అణ' అను రూపాంతరమును గలదు.

అణ్ణు=ఆశ్రయించు, చేరఁబడియుండు. (దీని నుండియే జ్యేష్ఠ భ్రాతృ వాచకమగు 'అణ్ణల్-అణ్ణన్' అను రూపములు గల్గెను. ఈ యర్థము గౌణము.) దీనికి సరియగు తెనుఁగు ధాతువు - 'అను(ట)' అనునది.

అణ్ము = సమీపించియుండు" (కాల్డు. ౨౦౭ పుట).

'అణ్ణు' అనుటకంటె 'అణ్' అను దాని నంగీకరించుటె లెస్స. దీనికి సరియగు తెల్గు ధాతువు 'ఊను' అనుటకు సరియగు 'ఆను' ధాతు వనుటకంటె "అనఁగు=కలయు" అను దానిని జెప్పుట యుక్తము.

ఉ౨. III విష:—" 'అడ్-అణ్' అను ధాతువుల గణములలో 'అడ్' అనుటకు 'సామీప్యము' అనియు, 'అణ్' అనుటకు 'కలయిక-(లేక) తాఁకుట' అనియు నర్థములగుటచేత నీ రెండును విభిన్నములు." (కాల్డు. ౨౦౭ పుట).

విమర్శము:—ఇపుడిట్లు నామపదముచేసి యర్థభేదము చెప్పినను నేతద్గణ ద్వయమును జూపునపుడు వెనుక 'అడ్=సమీపించు' 'అణ్=సమీపించు' అనియే దొరగారు వ్రాసిరి. రెండిటికిని 'సమీపించు' అనియే యర్థము గాన నీ రెండును నభిన్నములె యనఁదగును. ఈ రెండిటికిని మూలరూపము 'అళ్' అనునది కావచ్చును. అది 'తు' అను దానితోఁగూడి 'అడు' అను రూపము

నందును. ళకారము వర్ణాంతరసంయోగము లేకయె ణకారముగాఁ బరిణమించుట గలదు. ఉదా:—ఎళ్ =ఎణ్ =(ఏక) (నువ్వులు.) ఆళ్ =(ఏలు). ఆణ్ =ఏలువాఁడు; మగవాఁడు. ఇట్లె లకార మూఁరకయె నకారముగాఁ బరిణమించును. ఉదా:—మేల=మేన=(పైది) అణ్ణల్ =(అణ్ణన్)=(జ్యేష్ఠభ్రాత.) మొ.

౬3. I విష:—"పయి యుదాహృతులనుబట్టి ధాతువులలోని ద్వితీయ భాగ ముచ్చారణ మాత్రార్థకము కాదనియు నర్థవిశేష బోధకమనియు విశద మగుచున్నది. ధాతువుల తుదిని, 'అ-ఇ-ఉ-ఎ-ఐ' అను నచ్చు లుచ్చారణార్థము నిల్చునని యీ వఱకు వ్రాసితిని. (చూడు ౧౯ విష) కాని పెక్కుచోటులం దట్టివి యర్థవిశేష బోధకములును గావచ్చును. ఇవు డుచ్చారణార్థకములనుకొనుచున్నవానికి సయిత మర్థవిశేషము లుండవచ్చును. అర్థవిశేషమును బోధించునపు డవి యే మార్పును బొందవు. అట్టి యచ్చులు రేఫపరకములయ్యు లకారపరకములయ్యు నుండుట గలదు. మొదట నివియును నర్థవిశేషమును బోధించుచుఁ గ్రియలనుండి క్రియానామవాచకములను బుట్టించుచుండెడివి. ఇట్టి క్రియానామవాచకములు మరల ధాతువులై యగుచుండెడివి. ఈ క్రింది యుదాహృతులెల్ల నఱవమునుండి సంగ్రహించినవె. తక్కిన ద్రావిడ భాషలందు రేఫ లకార రూపహల్లులు పదాంతమున నిల్వవు, వాని తుది నుచ్చారణార్థకమగు 'ఉ' కారము చేరుచుండును. అఱవమున నిట్టి 'ఉ' కారము ఱకారాంతశబ్దములకును ననునాసికాంతస్థేతర హలంతశబ్దములకును దుదిని జేరుచుండును. 'ల్-ర్' అనునవి తుదినిగల ప్రత్యయములతోఁ గూడినవి యథాసంభవముగాఁ దమిళమున నామములును గ్రియలును నగుచుండును." (కాల్డు. ౨౦౧ పుట).

విమర్శము:—రేఫ లకారాంతములని యిట దొరగారు చెప్పుదు రేకాని యట్టి ప్రత్యయముల నుదాహరించుటలో "ర్-ట్-ల్-ళ్" అనునవి తుదినిగల శబ్దము లుదాహరింపఁబడినవి. తమిళేతర ద్రావిడభాషలలో రేఫాంత లకారాంత శబ్దము లుండనేరవనియు వానిపై నుచ్చారణార్థము 'ఉ' కారము నిల్చియుండుననియు దొరగారు వ్రాయుట పొరపాటు. పఱగన్నడమున రేఫాంత లకారాంత శబ్దములు తమిళమందువలెనె యనేకము లున్నవి. (చూ. శబ్దమణి దర్పణ ధాతుపాఠము, ౧౧౬ ధాతువులు రేఫాంత లకారాంతము లుదాహరింపఁబడినవి. టాంత ళాంతములు షఱి డెబ్బదెనిమిది చూపఁబడినవి. ఇట్లె ఇంకను నామాదు

లును ననేకము లున్నవి). హళాస గన్నడమందుఁ దెల్గునందువలెనె హలంత శబ్దము లుండవు. దొరగారు కన్నడవిషయము వ్రాయునపుడెల్లఁ బ్రాచీన కర్ణాటమును విడిచి యర్వాచీనమగు హళాస గన్నడమునుండి శబ్దముల నుదాహరించుచుండుటకుఁ గారణమేమో తెలియకున్నది.

తొల్కాప్పియమున అకారము పరుషముగాఁ జెప్పఁబడెను. ఇట్లు తమిళమందలి అకార మనునాసికాంతస్థేతరమని గ్రహింపక యంతస్థములలోని దనుకొని కావలయు దానిని వేఱుగాఁ జెప్పుట యవిమర్శకృతము.

౬3. II విష:—తమిళ శబ్దములు—అర్ మున్నగు ప్రత్యయములు తుదిని గలవి.

| ప్రత్యయ | ధాతువు | నామము | విమర్శము |
|---|---|---|---|
| "అర్ | వళర్ = (ఎదుగు) | సు(చు)డర్ = (కాంతి) | ...... |
| ఇర్ | తుళిర్ = (చిగుర్చు) | ఉగిర్=(గోరు) | "తుళిర్=చిగురు" అను నామమును గలదు. |
| ఉర్ | ... | నుదుర్ + ఉ= నుదురు= (లలాటము)—(తెల్గు) | తమిళమున నుదాహృతి లభింపమిం జేసి తెల్గుశబ్ద ముదాహరింపఁబడెను. తెల్గునందలి "నుదురు=నొసలు" శబ్దము లభిన్నములు. తమి—మల—నుదల్. కన్న—నొసల్. సకార దకారములును బదాంత రేఫ లకారములును బరస్పరము మాఱుచుండును. (చూ. ౨౨ I విష). నుదల్=నొసల్=నుదురు=నొసలు. దకారము మీఁది 'ఉ' కారము స్వరశక్తి సిద్ధము. పదాంతమందలి 'ఉ' కార ముచ్చారణార్థకము. |
| అల్ | పుగల్ = (స్తుతించు) | ఇదల్ =(పూరేకు) | ...... |
| ఇల్ | మగిల్ = (సంతసించు) | అవిల్ =(మెతుకు) (అన్నపుకణము) | 'అవిల్' అనునది మొదట ధాతువె. 'విచ్చు=వికసించు' అని యర్థము. తర్వాత నది నామమయ్యెను. |
| అఱు | ఇడఱు= (ఎగురు) | కిణఱు=(బావి—నుయ్యి) | 'ఇడఱు' అను దానికి 'ఎగురు' అని యర్థము కాదు. 'జాఱు' అని యర్థము. |

| ప్రత్యయ | ధాతువులు | నామములు | విమర్శము |
|---|---|---|---|
| ఇఋ | ... | ఞాయిఋ=(రవి) | ...... |
| అల్ | సు (చు)ఁటల్ = (సుడి చుట్టు) | ఈరల్=(లివరు కోశము) | 'సు (చు) టల్' అను దానికి 'సుడి' అను నామార్థమును గలదు. 'ఈరల్' అను దాని ప్రాచీన రూపము 'ఈరళ్' అనునది. ఈర్=(తేమ—రెండు.) |
| ఇల్ | కుయిల్= (శబ్దించు) | వెయిల్=(ఎండ) | 'కుయిల్' అను దానికి ధాతువగునపుడు—"అమరు-స్థగితముచేయు-వాద్యము వాయించు. నేయు" అనియు నామమగునపుడు 'కోకిల' అనియు నర్థములు. |
| ఉల్ | పగుఋ=(తెల్లు) (బ్రద్దలగు) | ... | తమిళమున దీని కుదాహృతి లభింపక తెల్గు శబ్దము నుదాహరించెను. తమి—పగల్=బ్రద్ద లగు. స్వరశక్తిచేఁ దెల్గున 'ఉ'కారము వచ్చెను. పదాంతమందలి 'ఉ'కార ముచ్చార ణార్థము నిల్చెను. |
| అళ్ | తువళ్=(వంగు) | తిఙ్గళ్=(చంద్రుఁడు) | 'తువళ్' అను దానికి 'చలించు' అని యర్థము. |
| ఇళ్ | ... | మదిళ్=(కోటగోడ) | 'మదిల్' అనునది దీని సరియగు రూపము. |
| ఉళ్ | ఉరుళ్=(దొర్లు) | ఇరుళ్=(చీఁకటి)" | ...... |

(కాల్డు. ౨౦౫ పుట).

"పయివానిలో 'అర్' అనుదాని-చోట 'ఐ' అని నిల్చుటయుఁ గలదు. ఉదా:—తమి-'అమర్=అమై' అను రెండు శబ్దములును 'విశ్రమించు' అను నర్థమున వాడఁబడుచున్నవి. 'పెరుఁగుట' అను నర్థముగల 'వళర్' అను నటవ శబ్దమునకు సరియగు కన్నడశబ్దము-'బళె' అని యున్నది-దీనినిబట్టి యటవమున 'వళై' అను రూపము సయితముండి యుండు ననఁగును." (కాల్డు. ౨౦౫ పుట).

విమర్శము:—"అమర్=అమై" అను వానికి 'విశ్రమించు' అను నర్థము లేదు. 'అమర్=కోరు. అమై=సిద్ధమగు' అని వాని యర్థముల నెన్ననగును. తమిళమున "వళై=వంగు-వంచు" అను శబ్దము గలదుగానఁ బయి కన్నడ శబ్దమునుబట్టి "వళ=ఎదుగు" అను తమిళశబ్ద ముండి యుండునని యూహించుట యుక్తము.

౬3. III విష:—"పయి-'అర్' మున్నగు ప్రత్యయముల కర్థము తెలియకున్నది. వానిలోని 'ఇల్-ఉళ్' అను వాని యర్థము నూహింపనగును."

| ప్రత్యయ | ధాతువులు | నామములు | విమర్శము |
|---|---|---|---|
| "ఇల్ | ... | ఇల్=(ఇల్లు. ఇక్కడ). ఇల్=(తమిళ మలయాళ సప్తమీ ప్రత్యయము.) | 'ఇల్' అను దానికి 'ఇక్కడ' అను నర్థము తమిళ మలయాళములలో లేదు. |
| ఉళ్ | ఉళ్=(ఉండు) | ఉళ్=(లోపల) | 'ఉళ్' అనునది ధాతువనుట పొసఁగదు. ఇది కాల పురుషాదులందు మాఱదు. అన్ని కాలములందును నేకరీతినె యుండును. |
| ఇల్ | వెయిల్=(ఎండ—వేఁడిమి) వెయ్=(వేఁడియగు వేఁడియుండునది) | వాయిల్=(ద్వారము) (వాయ్=నోరు — ద్వారమింటికి నోరు వంటిది). | వెయిల్ శబ్దమునకు 'వేఁడిమి' అను నర్థము లేదు. |
| ఉళ్ | ... | పొరుళ్=(ధనము) (పొరు=చేర్చు = "లోపలఁజేర్చు= సంపాదించు" అని కావలయు దొర గారి యాశయము) | 'పొరు' ధాతువునకు 'చేర్చు' అను నర్థము లేదు. "పొరు=యుద్ధము చేయు—సమానమగు" అను నర్థములు గలవు. |
| | అరుళ్=(సౌందర్యము) (అరు=అరుదగు) (సౌందర్యమరుదై యుండునది యని దొరగారి యాశయము కాఁబోలును!) | ... | 'అరుళ్' అను దానికి 'సౌందర్యము' అను నర్థము లేదు. దానికి 'కృప' అని యర్థము. 'అరు' అనునది ధాతువు కాదు. 'అరిదు' = (అరుదని యర్థము) అనునది ధాతువు. మూలరూపము. సమాసమున 'అరు' అని నిల్చును. దయయు నరుదుగనే యుండును గాన నుదాహృతికి భంగము లేదు. |
| | ఇరుళ్=(చీఁకటి) ("ఇరా=రాత్రి' అను దానిలోని 'ఇర్' అనునది ధాతువు. రాత్రి చీఁకటిగల్గి యుండును.)" | ... " | ... |

(కాల్డు. ౨౦౯ పుట).

౭౪. I విమ:—"పయిని వివరించిన 'అర్-ఇల్' మున్నగు ప్రత్యయములు తుదిని నిల్చు ధాతువులకు (చూడు ౭౩ II, III విమ.) విలక్షణములగు ద్వ్యక్షర ధాతువులు గలవు. ఇర్వంకల నచ్చులుగల హల్లు వీనిలో నుండును. అట్టి హల్లు ధాతుసంబంధమైనదియు దానికిర్వంకలనుండు నచ్చు లర్థవిశేషబోధమునకు సూచకములగు మార్పుల నందునవియు నై యుండును. ఈ క్రింది ధాతువు లాటిటుయందును నడుమ డకారముండుటచేతను నర్థసామ్య ముండుటచేతను నివి యొక్క గణములోని వనఁదగును" (కాల్డు. ౨౦౯ పుట).

విమర్శము:—ఒక్క వ్యంజనముమాత్రమె ధాతుభాగమనుట సరికాదు. హల్మాత్ర ముచ్చరింప శక్యముకాదు. దొరగారు వ్రాసిన యాటిటి యర్థములు సరియై యుండలేదు.

| ధాతువు | అర్థము | విమర్శము |
|---|---|---|
| ఇడు | నొక్కు | ఇడు ధాతువునకు 'నొక్కు' అను నర్థము లేదు. 'ఇచ్చు' అని యర్థము. |
| ఒడు | పిండు — | 'ఒడు' అను ధాతువె తమిళమున లేదు. |
| ఇడి | గాయము చేయు | 'ఇడి' ధాతువునకు 'గాయము చేయు' అను నర్థము లేదు. 'పిండిదంచు—పొడుచు' అను నర్థములు గలవు. |
| అడి | లోనికిఁ ద్రోయు | అడి ధాతువునకు 'లోనికిఁద్రోయు' అను నర్థము లేదు. 'కొట్టు' అని దీనికర్థము. |
| ఒడి | విఱుచు — | ఇది సరియె. |
| ఒడై | బ్రద్దలు కొట్టు | 'ఒడై' అను ధాతువే లేదు. "బ్రద్దలు కొట్టు-పగులఁ గొట్టు" అను నర్థములు గల 'ఉడై' అను ధాతువు గలదు. |

౭౪. II విమ:—"ఇట్లు రూపమందును నర్థమందును సామ్యముగల ధాతుగణము లార్యభాషలందును గలవని మాక్స్ ముల్లరుగారు చెప్పిరి. ఉదా:—సృ (సర్)=సర్ప్. నద్=నన్ద్. యుజ్=యాట్" (కాల్డు. ౨౧౦ పుట).

విమర్శము:—వీని కర్థాదులను దొరగారు వివరింపలేదు. 'నన్ద్'=సంతోషించు, సంతోషించునపుడు హాసాదికము గల్గునుగాన 'నద్=శబ్దించు' అను నది సరిపడునని దొరగారి యాశయము కాఁబోలును.

౭౫. I విమ:—"ధాతువులలోని యచ్చుల మార్పులు:—ఆర్యభాషల లోను సెమెటిగ్భాషలలోను ధాతువుల యచ్చులు మాఱునట్లు (కాలపురుషాదులను బోధించుటకై) ద్రావిడభాషలలో మాఱవు.

సెమెటిగ్భాషలలో (అరేబియా. మొ.) హల్లులసంయోగము ధాతువుగా నుండ వాని నడుమఁ గాలపురుషాద్యర్థ విశేష బోధమునకై వివిధములగు నచ్చులు దూఱును." (కాల్డు. ౨౧౦ పుట).

"సిథియను భాషలలో (టర్కి-మున్నగు దేశములలోనివి) ధాతువులలోని యచ్చులు కాలపురుషాద్యర్థ విశేషబోధమునకయి మార్పు నందవు. ద్రావిడ భాషలందును దఱచుగా నట్టి విషయమున నచ్చుల మార్పు లేదు. కాని యచ్చటచ్చటఁ గల్గెడి మార్పుల నిటఁ బ్రదర్శించుచున్నాను" (కాల్డు. ౨౧౧ పుట).

ఉ.గ. II విమ:—" I - ఉచ్చారణ సౌకర్యమునకయి యీ క్రింది మార్పులు ధాతువులందుఁ గల్గును. ద్వ్యక్షర ధాతువులలోని మధ్య హల్లు లోపింపఁగా దాని కిర్వంకలనుండు స్వరము లేకీభవించి మార్పునందును. ఉదా:—కన్న-దొగలు=(తోలు) అఱ-తోల్. కన్న - పెసర్=(పేరు)-అఱ - పెయర్=పేర్. అఱ-తొగుప్పు=(సమూహము)=తోప్పు=(తోఁట). 'వాఁడు' అను నర్థము గల 'అవన్' శబ్దము క్రియతోఁ జేరునపుడు తమిటమున 'ఆన్-ఓన్' అను ప్రత్యయములుగా మాఱుచున్నది. ఇట్లే-'అ-ఇ' అను సర్వనామములును హ్రస్వ దీర్ఘరూపములతోఁ గన్పట్టుచున్నవి." (కాల్డు. ౨౧౧ పుట).

విమర్శము:—'దొగలు' అనునది హళాన గన్నడరూపము. 'దొగల్' అనునది పట గన్నడరూపము. 'ఆన్-ఓన్' అను వానికి దొరగా రుదాహృతుల నీయలేదు. చెయ్వాన్=(చేయువాఁడు. చేయఁగలఁడు) చెయ్వోన్=(చేయువాఁడు-చేయఁగలఁడు-చేయును). 'అ-ఇ' అనువానికి:—అయిడై=(ఆ చోటు)-అవ్విడై=(ఆ చోటు).

ఉ.గ. III విమ:—"II-సహజ సిద్ధములైన మార్పులు:—తమిట మలయాళ కన్నడ తుళుభాషలలో యుష్మదస్మదర్థక శబ్దములు ప్రథమావిభక్తియందు దీర్ఘాచ్చులతో నుండి ద్వితీయాది విభక్తులలో హ్రస్వాచ్చులతో నుండును. 'తెలుఁగు-గోండు-కు' భాషలలో నట్టి మార్పు గలుగదు. ఉదా:—తమి-నాన్=(నేను). నామ్=(మేము)=(We). నీ=(నీవు). నీర్=(మీరు). కన్న-ననగె=(నాకు)-నినగె=(నీకు). తెనుఁగులో 'నిను-నిన్ను' మున్నగువానియందు మాత్రమిట్టి మార్పు కన్పట్టుచున్నది. వీనిలో హ్రస్వాచ్చులతో నుండు రూపములె ప్రాచీనములని నా యభిప్రాయము. (చూ. సర్వనామములు). సిథియను భాషలలో నయితము సర్వనామములం దిట్టి మార్పే చూపట్టుచున్నది." (కాల్డు. ౨౧౨ పుట).

విమర్శము:—'నామ్' అను దానికిఁ దమిటమున 'మనము' అని యర్థము. మేమని యర్థముకాదు. ఇండోయూరపియను భాషలలో 'మనము' అను

దానికి సరియగు రూపము లేదు. 'నాన్=(నేను)' అనునది తమిళమున సర్వాచీన రూపము. ప్రాచీన తమిళరూపము 'యాన్=(నేను)' అనునది. యుష్మదస్మదర్థక శబ్దములకే కాక యాత్మార్థక (తా శబ్దము) శబ్దమునకును దమిళ కన్నడములలోఁ బ్రథమావిభక్తియందు దీర్ఘరూపములును దక్కిన విభక్తులయందు హ్రస్వరూపములును నేకత్వబహుత్వములు రెంటను గలవు. తెనుఁగులో ద్వితీయావిభక్తియందుమాత్రము ''నన్నున్ - మమ్మున్. నిన్నున్ - మిమ్మున్. తన్నున్-తమ్మున్'' అను రీతిని హ్రస్వఘటిత రూపములును దక్కిన యంతటను 'నేను - మేము - నాచేతన్ - మాచేతన్' అను రీతిని దీర్ఘఘటితరూపములును వెలయుచున్నవి. తెల్గున నాత్మార్థక (తా శబ్దము) శబ్దమునకుఁ దృతీయాదులందేకత్వబహుత్వములు రెంటను 'తనచేతన్-తమచేతన్' అను రీతిని హ్రస్వఘటితరూపములై వెలయుచున్నవి. ''యాన్ = (నేను) - యామ్ = (మేము) ఎన్నై=(నన్ను) - ఎమ్మై=(మమ్ము)'' అను రీతిగల తమిళరూపములందు హ్రస్వఘటితములు ప్రాచీనములనుట వింత! ద్విత్వపరకత్వమున నాది వర్ణదీర్ఘము హ్రస్వమగుట స్పష్టముగాఁ గన్పట్టుచుండుటచేత దీర్ఘరూపములై ప్రాచీనములనుట యుక్తము కాదా?

ఉ-౫. IV విష:—''III - ప్రత్యయసహాయము లేకయే ధాతువు నామముగా మాఱినపుడు ధాతువులోని యచ్చు దీర్ఘమగుచుండును. ప్రత్యయము నిల్చునపు డట్టి మార్పు గల్గదు. ఉదా:—అఱ - కెడు - (చెడు - ధా) కెడుది= కేడు = (చెడుగు = నాశము). పడు=(బాధపడు - ధా) పాడు (టు)=(బాధ) మిన్ = (ప్రకాశించు - ధా) మీన్ = (నక్షత్రము). సు (చు) డు=(దగ్ధమగు-ధా)=సూ (చూ) డు=(వేఁడి). పెఱు=(పొందు - ధా) - పేఱు=(లాభము). కొళ్ = (తీసికొను - ధా) - కోళ్ = (గ్రహణము = తీసికొనుట).'' (కాల్డు. ౨౧౨ పుట).

ఉ-౫. V విష:—''ఇట్టి మార్పు సిథియను భాషలలోఁ గన్పట్టదు. ఆర్యభాషలలో నిట్టి మార్పు కొంత భేదముతోఁ జూపట్టుచున్నది. ద్రావిడభాషలలో ధాతు గతస్వరము దీర్ఘమగుచుండఁగా నార్యభాషలలో విభిన్న దీర్ఘస్వరము సయితము వచ్చుచుండును. ఇట్టి పోలిక కాకతాళీయ మనక సహవాసజన్యమె యనఁదగు నన్నచో నిండియాకు వారు రాకముందే సంభవించి యుండవలయును. (ఆర్యభాషల దీర్ఘములకు దొరగా రుదాహృతుల నీయలేదు. ఉదా:—వస్ - వాస=(నివాసము). నద్-నాద=(ధ్వని). భిద్-భేద=(భేదము). పుష్-పోష=(పోషణము). 'భేద-పోష' అను రీతిగల చోటులలోనిది విభిన్నస్వర దీర్ఘమని యెఱుంగనగును).''

"ద్రావిడభాషలందు సైతం మిట్టి విభిన్నస్వరదీర్ఘము రెండు స్థలములం దగపడుచున్నది. (ఈ రెండేకాక మఱి కొన్నిచోటులు దొరగారిచే స్థలాంతర మునఁ జూపఁబడినవి. చూ. ౬౬ II విష). ఉదా:—తమి:—విరి (ధా)= (వికసించు) - వేర్ = (చెట్టుయొక్క వేరు). నిర (సమముగానుండు) - నేర్ = (తిన్నన)" (కాల్డు. ౨౧౩ పుట).

విమర్శము:—ఆర్య ద్రావిడభాషల కంగీకరింపక తీరని సామ్యము కనఁ బడినపు డెట్టి ప్రబలబాధలున్నవని వెలిచియో యట్టి సామ్యము వారు హిందూ దేశమునకు రాకముందటి సహవాసమునఁ గల్గియుండవలెనని దొరగారు వచించు చుందురు. వారు హిందూదేశమునకు వచ్చినపిమ్మట సయితము వారికి మిక్కిలి ప్రాచీనమగు సహవాస సంబంధము గలదు గదా.

'విరి=వికసించు' అను ధాతువునకును 'చెట్టువేరు' అను నర్థముగల 'వేర్' శబ్దమునకును నర్థసామ్య మగపడదు. ఇట్టి స్థితిలో నా రెండును నభిన్నములని చెప్పుట యెట్లు పొసఁగును?

౬౬. I విష:—"ద్రావిడభాషలలో విశేష్యములకును విశేషణములకును వ్యాకరణసంబంధమగు భేదములేదు. ఉదా:—పేర్=(పెద్ద). కార్=(నల్లని). ఆర్=(విలువైన). ఇందు 'కార్' అనునది విశేష్యమును విశేషణమును నై యున్నది. ఉదా:—కార్=నల్లని. (విశేషణము.) కార్=నలుపు-మేఘము-వర్షర్తువు. (విశేష్యము). వీనికి మూలములగు ధాతువులును వ్యవహారములో నున్నవి. ఉదా:—పెరు=(పెద్దదగు). కరు=(నల్లగానుండు). అరు=(విలువ గల్గియుండు). ఈ ధాతువులలోని తుది 'ఉ' కార ముచ్చారణార్థకము. పై వానిలో హ్రస్వముతోనున్న రూపములు ప్రాచీనతరము లనవచ్చును. అట్టి హ్రస్వరూపమునకె గుణనామవాచకతాద్యోతకమగు 'మై' ప్రత్యయము చేర్పఁ బడును. ఉదా:—అరుమై=(విలువ). పెరుమై=(పెద్దతనము) మొ. కొన్ని సంఖ్యావాచకములలో సైతమిట్టి స్వరవిపర్యాసము కన్పట్టుచున్నది. తమిళమున నేకత్వ ద్విత్వములను బోధించు 'ఒర్-ఇర్' అనునవి విశేషణావస్థలో 'ఓర్-ఈర్' అని యేర్పడును. త్రి షట్ సప్త సంఖ్యార్థబోధకశబ్దములందును నిట్టి స్వర భేదమున్నది. కాని యచట హ్రస్వాచ్చులతో నున్న రూపములె విశేషణ ములు. దీర్ఘాచ్చులతోడి రూపములు విశేష్యములు. ఉదా:—(తమి) – 'ము-మూ-' అను త్రిత్వబోధకశబ్దములు విశేషణములు. 'మూన్ఱు'=(మూఁడు) అనునది విశేష్యము. 'అఱు'-విశేషణము-'ఆఱు' విశేష్యము. 'ఎఱు'= (విశేషణము) 'ఏఱు' విశేష్యము. ఇందలి హ్రస్వరూపములకు వ్యస్థ ప్రయోగము లేదు.

పయిసందర్భమునుబట్టి విశేష్యములవలెనే విశేషణములును ధాతువుల నుండి యచ్చుల మార్పువలనఁ గల్గుచున్నవని విశదమగుచున్నది. ఉదా:— "పఴు=(ధాతువు) (ప్రాఁతయగు). పాల్=(చెడిన) - విశేషణము. 'పఴమ్'=(పండు) విశేష్యము. పఴ=(ప్రాఁతది) విశేషణము. పఴగుఁ=(అభ్యస్తమగు)" (కాల్డు. ౨౧౩-౨౧౪ పుటలు).

విమర్శము:—విశేష్యములకును విశేషణములకును వ్యాకరణసంబంధమైన భేదములేదనుట సరికాదు. రెండును ధాతువుల స్వరముల మార్పువలన నేర్పడినవె యని చెప్పినఁ జెప్పనచ్చును. "పేర్=(పెద్దదైన) - ఆర్=(అరుదైన) కార్=(నల్లనిదైన)." అను వానికిఁ బృథక్ప్రయోగములేదు. అవి విశేషణ సమాసగతములై యుండును. తమిఴమందలి విశేషణములెల్ల 'అదు' శబ్దముతోఁగూడి నామములగుచుఁ బ్రయుక్తములగును. 'ఓర్-ఈర్' అను వానివలెనె 'ఒర్-ఇర్' అనునవియును విశేషణములు. ఇవి నామము లగునపుడు 'ఒన్రు-ఇరణ్డు' అని యేర్పడును.

'పేర్' మున్నగునవి ధాతువులగునపు డీ యర్థములు లేవు. పేర్—పెయర్=చోటుమాఱు. ఆర్=శబ్దించు. 'కార్' అను ధాతువేలేదు. "పెరుఁగు=(వృద్ధినొందు). అరుగు=(క్షీణించు). కరుగు=(నల్లనగు - మాడు)" అను ధాతువులు గలవు. వీనిలోని 'గు' అనునది ప్రత్యయమనుచుఁ దీసివేసి దొరగారు 'పెరు-అరు-కరు' అనునవి మూలరూపములని వ్రాసిరి. 'అరు' అను దానికి 'విలువ గల్గియుండు' అను నర్థము లేదు. వస్తువు క్షీణించి లభింపనపుడది యరుదగును. దానికి విలువయుఁ గల్గును - ఇట్లు గౌణముగ సరిపెట్టుకొనవచ్చును.

త్ర్యాద్యర్థక విశేషణరూపముల యుదాహృతులు:—తమి.—ముక్కణ్=(మూఁడు కన్నులు.) మూ వులగు=(మూఁడు లోకములు). ఇందలి వకారము స్వరసంహితా వ్యవధాయకము. లోకశబ్దభవ తమిఴరూపము - 'ఉలగమ్' అనునది. ఇట్లు-'ము-మూ' అను విశేషణములు సమాసగతములు. ఇందు 'మూ' అను విశేషణము దీర్ఘాంతమె. స్వరవిపర్యాసము లేదు. 'మూన్రు' అనునది విశేష్యము. తమిఴ సప్తసంఖ్యావాచి-'ఏఴ్' అని తొల్కాప్పియమున నున్నది. 'ఏఴు' అని యుదంతము నర్వాచీనుఁడు నన్నూలు కర్త చెప్పెను. ఆఱు+పత్తు = అఱుపంతు. = (అఱువది). ఏఴ్+పత్తు = ఎఴుపంతు = (డెబ్బది).

'పఱు' అనునది 'పక్వమగు' అను నర్థమున ధాతువు. 'ప్రాఁతయగు' అని యర్థముకాదు. కొంతకాలముక్రిందటఁ బుట్టిన ప్రాఁతవె కాలక్రమునఁ బక్వమగునని తలంచినచో 'ప్రాఁతవగు' అను నర్థము సరిపడును. 'పఱగు=అభ్యస్తమగు' అను చోట సైత మావటుకుఁ దెలిసిన ప్రాఁతదె యభ్యాసము చేయఁబడునని భావించినచో నదియుఁ బైవాని కభిన్నమగును.

సంఖ్యావాచక విమర్శము-'ఒర్-ఓర్' అనియెకాక 'ఒరు' శబ్దము విశేషణముగా నిల్చుటయుఁ గలదు.

"ఒన్రుముదల్ ఒన్పాన్......" (తొల్కా. ౪౩౭ సూ.)=ఒకటి మొదలుగఁ దొమ్మిదివఱకుఁ గల సంఖ్యావాచకములకు 'పత్తు' శబ్దము పరమగునపుడా 'పత్తు' శబ్దములోని మొదటి తకారము లోపించును. దానిచోట 'ఆయ్దము' నిల్చును. ఆఱు శబ్దేతరములందలి పొట్టి 'ఉ' కారము స్వీయవ్యంజనముతో లోపించును.

"ముదలీ రెణ్డిన్......" (తొల్కా. ౪౩౯ సూ.) = 'ఒన్రు - ఇరణ్డు' శబ్దములందుఁ బయి సూత్రము చెప్పిన 'ఉ-డు' ల లోపమేకాక 'న-ణ' లు 'రు' వర్ణముగా మాఱును. ఉదా:—ఒన్రు+పత్తు=ఒరు పంతు=(ఒక పది).

"ఇడైనిలైరకరమ్......" (తొల్కా. ౪౪౦ సూ.)='ఇరణ్డు' శబ్దమునకుఁ బయి రెండు సూత్రముల ప్రక్రియ జరగుటేకాక 'ర' అనునదియు లోపించును. ఉదా:—ఇరణ్డు+పత్తు=ఇరుపంతు=(రెండు పదులు=ఇరువది). పయి రీతిని విశేషణతాస్థితిలో "ఒర్ - ఓర్ - ఇర్ - ఈర్" అని నిల్వక 'ఒరు-ఇరు' అనునవి నిల్చినవి.

"ఆఱెన్కిళవి......" (తొల్కా. ౪౫౯ సూ.)=ఆఱుశబ్దమునకుఁ బరిమాణార్థకశబ్దముల యచ్చు పరమగునపుడు 'అఱు' అని నిల్వక 'ఆఱు' అనియే నిల్చును. ఉదా:—ఆఱు+అకల్=ఆఱకల్=(ఆఱకల పరిమాణము). ఆఱు + ఉటక్కు = ఆఱుటక్కు = (ఆఱుటక్కుల పరిమాణము. 'అకలు-ఉటక్కు' అనునవి తమిటి ప్రసిద్ధములగు పరిమాణవాచకములు).

"అళవుమ్ నిఱైయుమ్......" (తొల్కా. ౩౯౦ సూ.)='ఏట్' శబ్దమునకుఁ గొలత-తూనికలను దెల్పు శబ్దములును సంఖ్యావాచక శబ్దములును బరమగునపుడు సమాస సంధిలోనే హల్లుపరమైనను నది 'ఎటు' అను రూపము నందును. ఉదా:—ఏట్+మూన్రు=ఎటు మూన్రు=(ఇరువది యొకటి).

"నూఱాయిర్న్దు......" (తొల్కా. ౩౯౩ సూ.)='ఏట్' శబ్దమునకు 'నూఱాయిరమ్' శబ్దము పరమగునపుడు 'ఏట్' అని నిల్చును. ఉదా:—ఎట్+నూఱాయిరమ్=ఏట్ నూఱాయిరమ్=(ఏడు లక్షలు).

"అయ్యమ్పల్......" (తొల్కా. ౩౯౪ సూ.)='ఏట్' శబ్దమునకుఁ బరముగ 'అయ్ (ఐ) అమ్-అల్' అనునవి తుదినిగల సంఖ్యావాచకములు నిల్చునపుడు 'ఏట్' అనియే నిల్చును. ఉదా:—ఏట్ + తామరై = ఏట్ తామరై =(ఏడు పద్మముల సంఖ్య) ఏట్ + వెళ్ళమ్=ఏట్ వెళ్ళమ్=(ఏడు వెళ్ళముల సంఖ్య) ఏట్ + అమ్బల్ =ఏటామ్బల్ =(ఏడు కుముదముల సంఖ్య).

"ఉయిర్ మున్......" (తొల్కా. ౩౯౫ సూ.)=ఏట్ శబ్దమున కజాది సంఖ్యాపరిమాణాది వాచకము పరమైనను 'ఏట్' అనియే నిల్చును. ఉదా:— ఏట్ + అటాక్కు =ఏటాటాక్కు = (ఏడశాకులు). ఏట్ + ఇరణ్డు =ఏటిరణ్డు= (పదునాల్గు).

"ఆయిరమ్ వరువటి......" (తొల్కా. ౩౯౭ సూ.)='ఏట్' శబ్దము 'ఆయిరమ్' శబ్దపరకత్వమున 'ఎట్' అను రూపమునందును. ఉదా:—ఏట్ + ఆయిరమ్=ఎటాయిరమ్=(ఏడువేలు).

"ఆఱు - ఏట్" శబ్దములు కేవల షట్ సప్త సంఖ్యార్థకములయినపుడు విశేష్యములు. "ఆఱకల్-ఆఱులక్కు—ఏటాటాక్కు" మున్నగు రీతి వాడుకలలో నవి విశేషణములు, ఇవి పయిస్థలములందు విశేషణత్వ విశేష్యత్వములలో నొక్క రీతినే యున్నవి. వీనియందు స్వరముల మార్పేమియు లేదు. ఇట్టి శబ్దములు పెక్కు గలవు. విస్తరభీతి నుదాహరింపలేదు. ఇట్టి రీతులుగల భాషాసముద్రమున దొరగా రేనేవో యొకటి రెండు స్థలములం జూచి వానికి సరిగాఁజేయు నిబంధనము లంధగజదర్శన న్యాయ ప్రాయములె యగునుగదా.

౭౭. II విష:—"ధాతువుల తుది హల్లు నుచ్చరించుట శ్రమాపాదకమగునపుడు దానిపయిని 'ఉ' కారమును జేర్చి పల్కుట ద్రావిడభాషల సంప్రదాయము. ఉదా:—పశు (చు)=పచ్చగానుండు - (ధా). దీనినుండి పుట్టిన విశేషణము 'పాశు (చు)' అని యగునుగాని 'పాశ్ (చ్)' అని ('పేర్' అను దానివలె) కానేరదు. సంస్కృతమందువలెఁ గొన్ని ద్రావిడశబ్దములందు సైతము విభిన్న దీర్ఘస్వరము వచ్చుట గలదు. (చూడు. ౭౫ V విష). ఉదా:— 'పశు (చు) మ్' (పచ్చనిది) ('పశు (చు)' అను దాని రూపాంతరము) అనునది యొకప్పుడు 'పైమ్' అను రూపాంతరము నందును. ఉదా:—పైమ్ పొన్= (పచ్చని బంగారము). ఈ మార్పుచ్చారణ స్వభావమునఁ గల్గినది. పద మధ్యగతమగు 'శ' (చ) వర్ణము యకారముగా మాఱి పిదప లోపించునని యీవఱకు వ్రాసియున్నాను. (చూ. కాల్డు. ౧౫౩ పుట). (చూడు. ౨౧ V విష). పశుమ్=పయుమ్=పైమ్. కశు (చు) ప్పు=(చేదు)=కయుప్పు=కైప్పు. 'పశు (చు) మ్, పైమ్' అను రెండు రూపములును వాడుకలో నున్నవి. వీనిలోఁ

పశు (చు) మ్" అను రూపముకన్న 'పైమ్' అను రూపమె ప్రాచీనమై యుండ వచ్చును.

" 'బెస్కి' అను తమిలు వైయాకరణుఁడు చెప్పినట్లు 'పశు (చు) మై= (పచ్చఁదనము)' అను దానిలోని 'ఐ' అనునది (భావార్థకము) లోపింపఁగా 'పశు (చు) మ్' అనునది యేర్పడెననుట సరికాదు. భావార్థక ప్రత్యయము 'మై' అనునదెకాని 'ఐ' అనునదికాదు. 'పశు (చు)' ధాతువుపయిని దద్ధర్మార్థకమగు 'ఉమ్' ప్రత్యయముచేరఁగా 'పశు (చు) మ్' అని యేర్పడె ననఁదగును. ఇట్టి 'ఉమ్' ప్రత్యయాంతమును విశేషణముగా వాడుట ద్రావిడభాషా సంప్ర దాయము" (కాల్డు. ౨౧౮-౨౧౯ పుటలు).

విమర్శము:—" 'పశు (చు)' అనుదానికి 'పచ్చగానుండు' అను క్రియార్థము లేదు. 'పశు (చు)' (పచ్చనిది) అనునది విశేషణరూపము. 'పస (చ)' అనునది క్రియా (ధాతు) రూపము. ఉదా:—ఇలై పసన్దదు=ఆకు, పచ్చగానున్నది. దీని భావనామము 'పసప్పు' (పసుపురంగు) అనునది. పసత్తల్=పచ్చ నగుట. పశు (చు)+ఇలై = పాశి (చి) లై = (పచ్చనియాకు)" అను దానినిబట్టి 'పశు (చు) పాశు (చు)' అనునవి రెండును విశేషణములె యనఁ దగును. "పశు (చు) మ్=పయుమ్=పైమ్" అను రీతిని వాని పరిణామ క్రమము నంగీకరించుచు (అయ్=ఐ) 'పైమ్' అనునది ప్రాచీనమని దొరగారు వచించుట వింత! "పశు (చు) మై=పచ్చన=పచ్చ (దనము)" అను దానిలోని 'ఐ' కారము లోపింపఁగా 'పశు (చు) మ్' అని యేర్పడెనను 'బెస్కి' దొరగారి ప్రక్రియ సరికాదనుట యుక్తమెకాని డా. కాల్డువెల్లుగారు చెప్పినట్లుగ నందలి ('పశు (చు) మ్' అను దానిలోని) 'ఉమ్' అనునది తద్ధర్మార్థక ప్రత్యయమను టయుఁ బొరపాటె. 'పశు (చు)' అనునది ధాతువు (క్రియ=వ్యాపారవాచి) కాదు. విశేషణము. దానిపైని దద్ధర్మార్థక ప్రత్యయము నిల్చుట యెట్లు పొసఁ గును? 'పస (చ)' అనునది ధాతురూపముగాన నది తద్ధర్మార్థక రూప మందనగును. అట్టి తద్ధర్మార్థకరూపము 'పస (చ) క్కు-మ్' అనునది. దీనిని దద్ధర్మార్థక విశేషణ ముగా వాడవచ్చును. ఉదా:—పసక్కు మిలై =పచ్చనయ్యెడి యాకు.

"పశు (చు) మై+తార్=(పుష్పమాల)=పశు (చు) న్దార్=(పచ్చని= వాడని) పూలమాల." అనుచో 'మై' ప్రత్యయము లోపించెనని నన్నూలు వచించుచున్నది. ఇట్లె పసు (చు) మ్పూ=(పచ్చనిపూవులు) మున్నగు రూపము లును వెలయుచున్నవి. తెనుఁగున 'కమ్మని + తేనె = కమ్మందేనె' 'తళుకు + చెక్కు-లు = తళుకుంజెక్కులు' మున్నగుచోటులందువలెనె పై స్థలములం దనునాసికాగమము వచ్చియుండును. విశేషణ సమాసములలోని యాగమమగు

ననునాసికము "నీలంచ త దుత్పలం చ=నీలోత్పలమ్" అను సమానపు విగ్రహములందు నిల్చు 'చ' శబ్దము నర్థమును దెల్పును. (చూ. ౫౨ విష).

ఉ౨. I విష:—"భూతార్థమున ధాతువు దీర్ఘమునకు హ్రస్వము వచ్చుట తమిళ కన్నడములలోఁ గలదు. ఉదా:—తమి-వే=(మండు)-వెందు=(మండి). నో=(బాధపడు) - నొందు=(బాధపడి). కాణ్=(చూచు) - కణ్డు=(చూచి). సా (చా) = (చచ్చు) = శె (చె) త్తు = (చచ్చి). కన్నడ - మలయాళ - సత్తు= చత్తు. తమిళమునఁ గొన్నియెడల భూతార్థమందు దీర్ఘమునకు హ్రస్వము రాకుండుట గలదు. అట్టియెడలఁ గన్నడ రూపములు హ్రస్వముతోనె యున్నవి. ఉదా:—తమి. ఈ=(ఇచ్చు) - ఈన్దు=(ఇచ్చి). కన్న - ఇత్తు= (ఇచ్చి)." (కాల్డు. ౨౧౫ పుట).

విమర్శము:—కన్నడమునందునుఁ గొన్ని ధాతువులందె దీర్ఘమునకు హ్రస్వాదేశము గల్గును. తమిళమున 'ఈన్దు' (ఈన్తు) అనుదానికి 'ఈత్తు' అను రూపాంతరముగలదు. తొల్కాప్పియమున 'నొ' అను హ్రస్వాంత ధాతువె పేర్కొనఁబడెను. కాని 'నో' అను దీర్ఘాంతధాతువును గలవని తమిళ పండితు లంగీకరింతురు.

ఉ౨. II విష:—"'వా - తా' ధాతువుల విశేషములు:—భూతార్థ ప్రార్థనాద్యర్థ వ్యతిరిక్తస్థలములందెల్ల 'వా' = (వచ్చు) ధాతువు 'వర్' అను రూపముతోను 'తా'= (ఇచ్చు) ధాతువు 'తర్' అను రూపముతోను నగపడు చున్నవి. ఉదా:—వరుగిఱేన్=(వచ్చెదను=వచ్చుచున్నాను). తరుగిఱేన్= (ఇచ్చెదను=ఇచ్చుచున్నాను). భూతార్థమునందు వాని దీర్ఘమునకు హ్రస్వము వచ్చుటయుఁ, బ్రార్థనాద్యర్థమున నేకత్వమున దీర్ఘరూపమె నిల్చుటయు, బహుత్వమున రేఫపరక దీర్ఘరూపము నిల్చుటయు సంభవించును. ఉదా:—తమి:— భూత:—వన్దేన్=(వచ్చితిని). తన్దేన్=(ఇచ్చితిని). ప్రార్థ:—ఏక-వా=(రమ్ము). తా=(ఇమ్ము). ప్రార్థ-బహు:—వారుమ్=(రండు). తారుమ్=(ఇండు) పోపు దొరగారి రెండు రూపములందును రేఫ ముచ్చారణసౌకర్యార్థము చేరినదే యనిరి. 'కారుమ్'=(రక్షింపుఁడు) అను రీతిని 'కా=రక్షించు' అను ధాతువు యొక్క ప్రార్థనాద్యర్థక బహువచనమునం దుచ్చారణార్థక రేఫము చేరినట్లే వీని యందును రేఫ ముచ్చారణ సౌకర్యార్థము చేరినదే యనరాదు. ప్రార్థనాద్యర్థక బహువచనమునందే కాక యనేక రూపములం దిట్టి రేఫ మీ రెండు ధాతువులకును వచ్చుట ప్రసిద్ధమై యున్నది. ఉదా:—వరల్=వరత్తు=వరుదల్=వరవు= వరుకై=(వచ్చుట) (ఇట్లె 'తా' ధాతువునకును). ఈ ధాతువులకు రేఫము సహజమె కాకున్నచో వీని వర్తమాన భావి, తుమున్-వ్యతిరేకాది రూపములు

రేఫరహితములై 'నో' ధాతుప్రభృతుల రూపములవలె గకార, వకారాది సంధి సిద్ధాగమములతో నుండవలెనుగదా. ఉదా:—నో - నోగ్గ =(నొచ్చుట). నోవు=నోదల్ =(నొప్పి). నోగ=(నొవ్వన్). కన్నడమునందును నీ ధాతువులు-'బర్-తర్' అను రూపములతో నున్నవి. తెల్గునందును ప్రార్థనాద్యర్థకైక వచనము 'వా' అనియు బహువచనము 'రమ్ము' అనియు నున్నవి. తమి- 'ఇలదు=తెల్గు-లేదు' అను చోటులందువలెనె 'వార్=రా' అని వర్ణప్లుతిచే సిద్ధించెననదగును. కాన డా. గుండర్టుగారు చెప్పినట్లు వీనికి "వా-వర్; తా-తర్" అని రెండేసి రూపము లంగీకరించుట లెస్స. సంస్కృతమందలి 'దా' ధాతువు పోలికచేత నఱవమున 'తా' అని మాత్రమె ధాతురూప మనవలసిన నిర్బంధము లేదు. గ్రీకు - "Dōron=దోరన్" అని రేఫవిశిష్ట రూపమగపడుచున్నది." (కాల్డు. ౨౧౬ పుట).

విమర్శము:—తమిళమునందు 'వా - తా' ధాతువుల ప్రార్థనాద్యర్థక బహువచన రూపములు "వారుమ్=(రండు) తారుమ్=(ఇండు)" అనునవి యర్వాచీనములు. ప్రాచీన తమిళమునం దన్ననో "(వరుమిన్) = వమ్మిన్ = (రండు). (తరుమిన్)=తమ్మిన్ =(ఇండు)" అనియె యుండును. ఇంకను-"వర=(రమ్ము - రండు). తర=(ఇమ్ము-ఇండు)" అనియు నేకత్వబహుత్వార్థకములును బ్రాచీనములు గలవు. 'కా=(రక్షించు)' అను ధాతువు యొక్క ప్రార్థనాద్యర్థక బహువచన రూపము సయితము తమిళమున నేమేని చదివినవారు 'కామిన్= (రక్షింపుఁడు)' అనియె వాడుదురు. బొత్తిగాఁ జదువులేనివారు 'కారుమ్' అని వాడుదురు. కాన నది పరిగణనీయము కాదు. తెల్గునందుఁ బ్రార్థనాద్యర్థకైక వచన రూపము 'వా' అనియు, బహువచనరూపము 'రమ్ము' అనియు నున్నవని డా. కాల్డువెల్లుగారు వ్రాయుట కేవలము తప్పు. వారి కట్టితప్పు భోగటా యెవరిచ్చిరో తెలియకున్నది. తెల్గునఁ బ్రార్థనాద్యర్థకైకవచనము 'రమ్ము' అనియు దాని బహువచనరూపము 'రండు' అనియు నుండునని తెల్గువారికెల్ల విదితము. తెల్గున "వరద=వచ్చునీరు=ప్రవాహము. రావించు-రప్పించు-రాక-రాఁగల-వచ్చుట-వచ్చెను" మున్నగురీతిని వకారఘటితములు రేఫఘటితములును గలవు.

తమిళమున 'వా-వర్-తా-తర్' అని యిట్లు ద్వివిధధాతువుల నంగీకరింపవలసిన యావశ్యకత లేదు. ఆయా రూపములందు రేఫలోపము నంగీకరించుట యుక్తము. "మర్న్దు=(మందు). విర్న్దు=(విందు)-(ఆమెత) పొర్న్దు=(పొందు)" అని యిట్లు తమిళమునఁగల రేఫము తెల్గున లోపించుట ప్రసిద్ధమైయున్నది. "అరుమరున్దు = అరుమన్దు = (అమృతము = అరుదగు

మందు). అరుమ్బల్=అమ్బల్=(మొగ్గదొడుగు). పెరుమాన్=పెమ్మాన్=(పెద్దమానిసి=స్వామి). ఒరుత్తన్=ఒత్తన్=(ఒకఁడు)." అని యిట్లు రేఫలోప రూపములు తమిళమున లేకపోలేదు.

౭౮. విష:—"ధాతువులందలి స్వరములు పై రీతిని మాఱుట విషయమున ద్రావిడభాష లార్యభాషలను జాలవఱకుఁ బోలియున్నవని యీవఱకు వివరించియున్నాను. (చూడు ౭౫ IV, V విష). సిథియను భాషలలో నిట్టి మార్పులు మిక్కిలి యరుదుగా నున్నవి. ఉదా:—ఫిన్నిషుభాష:—ఓల్=(ఉండు) - ఒలెన్=(ఉన్నాను). లీనెన్=(ఉండినన్). హంగేరియన్ భాష:—లెవెన్=(ఉండుట)-వొల్తె=(ఉండి) లెన్ని=(ఉండన్)-మొ. వీనినిబట్టి ద్రావిడ భాషల కీ విషయమున నార్యభాషా సంబంధమే కలదనియు, సిథియను భాషా సంబంధము లేదనియుఁ జెప్పుటకు వీలులేదు." (కాల్డు. ౨౧౭ పుట).

విమర్శము:—దొరగారు తమ సిథియను సిద్ధాంతమున కేమి ప్రమాదము వచ్చునోయని వెఱచి పైరీతి నెట్టెటో ధాతు స్వరవిపర్యాసము సిథియను భాషలందును గలదని చూప యత్నించిరి. ఈ పక్షమువారెల్ల నిట్లు బలముగానున్న యార్యభాషల సంబంధమున కింత వెఱవనేల? ఉన్నదానిని గప్పి పుచ్చ యత్నింపనేల? ఆర్యులకును ద్రావిడులకును బలమైన సహవాసము సదా కల్గుచు వచ్చెనుగదా. (చూ. ౮ విష.) తుదికి - సంస్కృత 'దా=దానే' అనుదానికిని దమిళ 'తా - ఇచ్చు' అనుదానికిని గల సంబంధమునుగూర్చి డా. కాల్డువెల్లుగారు ప్రసంగించుటలోఁ దమిళమందలి 'తర్' అను రేఫ సంబంధము సైత మిండోయూరపియను భాషలలోఁ గలదని చెప్పవలసెనుగదా. ఉన్నది దాఁచినను దాఁగదు. లేనిది తెచ్చినను రాదు.

II ధాతు ప్రకరణము ముగిసినది.

# ద్రావిడ భాషా పరిశీలనము

## III ప్రకరణము — నామవాచకములు

### (I లింగవచనములు)

౭౯. విష:—'నామవాచకములు' అనునది యాంగ్లమునఁ బ్రసిద్ధమై యున్న 'Nouns' అనుదాని స్థానమున నిందు వాడఁబడుచున్నది. నామవాచకములనఁగా "సర్వనామేతర విశేష్యములు" అని యిచటి వాడుకలోని యభిప్రాయము. ఆంగ్లభాషలోని 'Noun' అను దానికి 'పేరు' అని యర్థము. "మనుష్యుని యొక్క-కాని స్థలముయొక్క-కాని వస్తువుయొక్క-కాని పేరు" అని యాంగ్ల వ్యాకరణములలో దీనికి లక్షణము చూపఁబడెను. మనుష్యాదులును వస్తువులె కాన 'వస్తువు పేరు' అను నర్థము పర్యవసిత మగుచున్నది. కాఁగా— "నామ=నామధేయమును, వాచక=వచించునది=నామవాచకము" అని యర్థము తేలుచున్నది. కాని, డా. కాల్డువెల్లుగారీ ప్రకరణమున "నామవాచకములను-విశేషణములను" వివరించిరి. కాన 'Nouns' అనునది "విశేష్యములు—విశేషణములును" అను నర్థమున, డా. కాల్డువెల్లుగారిచే వాడఁబడెనని గ్రహింపనగును. విశేషణము వస్తువు పేరనిపించుకొనదు. కావుననే యాంగ్ల వ్యాకరణములందు "I. నామవాచకములు. II. సర్వనామములు. III. విశేషణములు. IV. క్రియలు......" అను రీతిగల భాషాభాగములలో విశేషణము వేఱుభాగముగాఁ బరిగణింపఁ బడెను. అయినను విశేషణము=విశేష్యనిష్ఠ విశేష బోధకమె కాన దీనిని విశేష్యముల భాగములోఁ జేర్చుట విరుద్ధము కాదు.

తెల్గున నామ మనఁగా 'ప్రాతిపదికము'. 'ప్రాతిపదికం హి నామ' (ఆం. చిం.) (చూడు 'వ్యా. సం.' ౩౦ విష,) ధాతు ప్రత్యయేతరమగు నర్థవంతమైన శబ్దము ప్రాతిపదిక మనఁబడును. "సాక్షాత్సంకేతితం యోర్థ। మభిధత్తే స వాచకః" అను చొప్పున సంకేతితార్థబోధకము వాచక మనఁబడును. ఇట్లు 'నామ' మన్నను వాచకమె యగును గాన నిచటి నామవాచక శబ్దములోని 'నామ' శబ్దమున కిది (ప్రాతిపదికము) యర్థము కాదని గ్రహింపవలయును.

౮౦. విష:—డా. కాల్డువెల్లుగారీ నామవాచక ప్రకరణమును మూఁడు భాగములుగా విభజించిరి. I. లింగము. వచనము. II. విభక్తి. III. విశేషణము.

“లింగవిషయమున ద్రావిడభాష లిండోయూరపియను భాషలను బోలక సిథియను భాషలను బోలుచున్నవి. ఇండో యూరపియను భాషల లోని లింగము లౌకిక పుంస్త్వ స్త్రీత్వములనుబట్టి వాడుక చేయఁబడదు. అప్రాణి వాచకములు సైతము పుం స్త్రీ లింగము లగుటయుఁ గలదు. వా రాయా వ్యక్తులందుఁ బుంస్త్వాదికమును భావించి యట్లు వ్యవహరించి యుందురు. (ఇట నిండోయూరపియను లనిరే కాని దొరగారు సంస్కృత భాషను మాత్రమె ముఖ్యముగా నుదాహరింతురు) సెమెటి గ్భాషలలో సైతము (అరబిక్-హెబ్రూ-మొ.) చాలవఱకిట్టి పద్ధతియే కలదు. కాలక్రమమునఁ దత్తజ్జన్య నవీన భాషలలో నట్టి పద్ధతి కొంత మాఱినది.

మంచు-మంగోలియా-టర్కిష్షు-మున్నగు సిథియను భాషలలో నపుంసక లింగ మొక్కటే కలదు. మగఁడు-పెండ్లము-దేవుఁడు-పురుషుఁడు-స్త్రీ మున్నగు నలంతి శబ్దములు మాత్రము పుం స్త్రీలింగవాచకము లనెడి వ్యవహారము గలదు” (కాల్డు. ౨౧౭-౨౧౮ పుటలు).

విమర్శము:—“స్తనకేశవతీ స్త్రీ స్యా। ల్లోమశః పురుషః స్మృతః” అను చొప్పున స్తనములు యోనియుఁ గల స్త్రీ వ్యక్తిని బోధించునది స్త్రీలింగ వాచకము. మగగుఱిగల పుంవ్యక్తిని బోధించునది పుంలింగ వాచకము. ఈ రెంటికిని భిన్నమగు వ్యక్తిని బోధించునది నపుంసకలింగ వాచకము. ఇవియె లౌకికలింగ లక్షణములు. వ్యాకరణ విషయమున నెందును లౌకిక లింగ ముపయోగింపఁబడదు.

“స్తనకేశవతీ స్త్రీ స్యా। ల్లోమశః పురుషః స్మృతః। ఉభయో రన్తరం యచ్చ। తదభావే నపుంసకమ్. ఇతిలక్షణ లక్షితం అవయవ సంస్థాన విశేషాత్మకం లౌకికం స్త్రీ పుంసయో ర్లిఙ్గమ్. తదభావే=తయో రుభయో ర భావేసతి, య దుభయో రన్తరం సదృశం తన్నపుంసక మిత్యర్థః. తదిదం లౌకికం లిఙ్గ మస్మిన్ శాస్త్రే నోపయుజ్యతే. తస్య అచేతనే ఖట్వా మాలాదా బాధా, స్త్రీ ప్రత్యయానాపత్తేః......” (సి. కౌ. ౪౫౩ సూ. బాలమనోరమావ్యాఖ్య).

ఖట్వా మాలాద్యచేతన వాచకములు స్త్రీలింగవాచకములును, వృక్షా ద్యచేతన వాచకములు పుంలింగ వాచకములు నగుటచేత సంస్కృతమున వ్యాకరణశాస్త్ర విషయమున లౌకికలింగ ముపయోగింపఁ బడదని తాత్పర్యము. సంస్కృతమందే యననేల? ఏభాషయందును శబ్దరూప వర్గీకరణ పక్షమున లౌకికలింగ ముపయోగపడదు. ద్రావిడభాషలందు బొత్తిగా కికలింగోప యోగము లేదు.

సంస్కృత వ్యాకరణ ప్రసిద్ధమగు పారిభాషిక లింగ మప్రాణివాచకముల యెడఁ బుంస్త్వ స్త్రీత్వ భావనవలనఁ గల్గియుండునని దొరగారు తలంచుట సంప్రదాయ విదూర విషయము. సత్వగుణోపచయ సత్వగుణాపచయ సత్వగుణ సామ్య వివక్షచేఁ పుంస్త్వ స్త్రీత్వ నపుంసకత్వములు గల్గెననియు నట్టి వివక్ష యప్పటి వ్యవహర్తల నాశ్రయించి యున్నదనియు నకారణముననే "లిఙ్గ మశిష్యం లోకాశ్రయత్వా ల్లిఙ్గస్య" అను మహాభాష్యోక్తి వెలసెననియు సంస్కృత వైయాకరణ సంప్రదాయము. (చూడు. 'వ్యా. సం.' విస్తర II ౧౩౦ I విష).

"స్తనకేశవతి స్త్రీ యనియు, మీసములు గడ్డములు గలవాఁడు పురుషుఁడనియు నీ రెండునులేనిది నపుంసక మనియుఁ బతంజలి యనెను" (ఆం. భా. చ. ౧౫౬ పుట).

ఈ వ్రాఁత సరికాదు. ఇచటి కేశ లోమ శబ్దములు వెండ్రుకలకు వాచకములు కావు.

"సంస్కృతమందే లింగజ్ఞానము సరిగ లేకపోయెను......ఇట్టి యవ్యవస్థితలింగ మగుటచేతనే "పరిష్యతి హ్యాచార్యో లింగ మశిష్యంలోకాశ్రయత్వా ల్లింగస్యేతి" అని మహాభాష్యకర్త చెప్పి యూరకొన్నాఁడు" (ఆం. భా. చ. ౧౫౭ పుట) ఈ వ్రాఁతయు సరికాదు. 'లోకాశ్రయత్వా ల్లిఙ్గస్య' అను దానికి లింగ జ్ఞానము సరిగ లేదని యర్థము కాదు. సంస్కృతమున లింగానుశాసనము విపులగఁ జేయఁబడియున్నది. కాన సంస్కృత పారిభాషిక లింగ మవ్యవస్థిత మనుట సాహసము!

'ఆం. భా. చ.' కర్తగా రీ సందర్భమునఁ గాల్డువెల్లుగారిని, వారు ప్రశంసించిన యిండోయూరపియనులను నీ క్రిందిరీతిని విమర్శించిరి.

"కాల్డువెల్లు పండితుఁడు......ఇండోయూరపియను భాషను మాట్లాడు జాతులవారు అధిక భావనా సంపత్సంకలితులు గావున......తిర్యగ్జడ వాచక శబ్దములు తెలుపు నాయా వస్తువులకును గుణవాచక శబ్దములకును గూడ పుం స్త్రీ భేదమును గల్పించి వానికి ప్రాణ ప్రతిష్ఠచేసి తమ కవితాదృష్టిని వెల్లడించిరనియు సిథియను భాషలను మాట్లాడువారట్లు చేయక తిర్యగ్జడ వాచకములను నపుంసకలింగములుగఁ దలంచిరి సరేకదా బుద్ధియుతులగు మానవ పురుష స్త్రీలను గూడ నప్రాణి వస్తువుల జతఁజేర్చి వానికిని నపుంసకలింగత్వమును నంటఁగట్టి ప్రాణ్యప్రాణి వాచకము లన్నిటి నొక్క వర్గములోనికి దింపి తమ భావనా బలహీనతను బ్రకటించిరనియు......వ్రాసియున్నాఁడు......ఇండో యూరపియను భాషలను మాట్లాడువారు స్త్రీ యైన పెండ్లమును భార్యవలె స్త్రీ

లింగమందుంచక ఒకప్పుడు మగవానినిచేసి 'దార' అనియు ఒకప్పుడామెకు నపుంసకత్వము నారోపించి కళత్రమనియుఁ జెప్పుట యేటి భావన? పాషాణమును పుంలింగముచేసి శిలను స్త్రీ లింగము చేయనేల?......సంగ్రామ రణాజులయందుఁ గావలసిన వీర్యబలములు నపుంసకము లనుట యేటి భావన? (ఇంకను గొన్ని యశ్లీలోక్తులు వ్రాసి పరిహాసించిరి)" (ఆం. భా. చ. ౧౩౯-౧౪౦ పుటలు). వీరీసందర్భమునఁ బరిహాసావేశముచే మైమఱచి యచటిది లౌకిక లింగము కాదనియుఁ బారిభాషిక లింగమనియు సత్వగుణోపచయాదు లెల్లవ్యక్తులందును నుండుట సర్వసమ్మతమనియు వివేకింపరైరి.

౭౧. I విష:—"ద్రావిడభాషలు లింగవిషయమున నిండో యూరపియను భాషలతోనే కాక సిథియను భాషలతో సైతము భేదించుచున్నవి."

"ద్రావిడ భాషలలో నామవాచకములెల్ల రెండువిధములు. "I. ఉన్నత జాతి. II. జాతిహీనము- తెలుఁగున I. మహత్తు II. అమహత్తు" అని వ్యవహరింతురు. ఆంధ్రేతర ద్రావిడభాషలలో దేవమనుష్యాదులగు వివేకముగల వ్యక్తులను దెలుపు శబ్దములెల్ల 'ఉన్నతజాతి' అనియు వాని కేకవచనమున పుంలింగ స్త్రీ లింగరూపములు రెండును వేర్వేఱుగ నుండుననియు బహువచనమున నట్టి భేదము లేదనియుఁ జెప్పుదురు. తక్కిన శబ్దములెల్ల జాతిహీనములని చెప్పుదురు.

ఈ పద్ధతి మిక్కిలి యుక్తమైయున్నది. న్యూపెరిషియనుభాష యీ విషయమున ద్రావిడభాషలను జాలవఱకుఁ బోలుచున్నది. అందలి బహువచనము ప్రాణ్యప్రాణివాచకముల భేదమునుబట్టి భిన్నముగా నుండును" (కాల్డు. ౨౧౯-౨౨౦ పుటలు).

విమర్శము:—డా. కాల్డువెల్లుగారు వెనుక (చూ. ౭౦ విష.) సిథియను భాషలను లింగవిషయమున ద్రావిడభాషలు పోలుచున్నవని చెప్పినను (కాల్డు. ౨౧౭ పుట) నిచట 'పోలవు' అని చెప్పిరి. ఇట్టి పూర్వాపరవిరోధ మున్నను నిచటఁ జెప్పినమాటే నిజము.

ద్రావిడ భాషలన్నిటిలోను లింగవిషయమున శబ్దములు రెండే విధము లనుటయు సరికాదు. మఱియు నట్టి లింగవిషయకమగు వివరణములోఁ దమిళ కర్ణాటాంధ్రములకుఁ బరస్పర భేదములు గలవు.

౭౧. II విష:—తమిళ వైయాకరణులు మానవ స్త్రీలను బురుషులను దెల్పు శబ్దములెల్ల "ఉయర్ తిణై చ్చోల్ =ఉన్నత జాతివాచకములు" అని చెప్పఁబడుననియుఁ (ఉయర్ =ఉన్నత. తిణై =జాతి. చోల్ =శబ్దము) దక్కిన

జాతి శబ్దములు 'అఃఱిణై' చ్చొల్ = అట్టిది కాని శబ్దమని చెప్పఁబడుననియు (అల్ + తిణై = అఃఱిణై) ('అల్' అనునది నఞర్థకము) (దొరగారు చెప్పినట్లు జాతి హీనములని చెప్పఁబడలేదు) నపుంసక వాచకములును దేవతా వాచకములును నివి యని తెల్పు ప్రత్యయములు లేవని వచించిరి.

"ఉయర్ తిణై......" (తొల్కా. ౪౮౪ సూ.) = మహన్మహతీ వాచకములగు వస్తువులు 'ఉయర్ తిణై' అనఁబడును. తక్కిన వస్తువులు 'అఃఱిణై' అని చెప్పఁబడును.

"ఆడూ ఉఱటి చొల్......" (తొల్కా. ౪౮౫ సూ.) = మగవానిని దెల్పు శబ్దమును నాఁడు దానిని దెల్పు శబ్దమును నుభయవాచక శబ్దమును 'ఉయర్ తిణై చ్చొల్' అనఁబడును.

"ఒన్ఱటి చ్చొల్......" (తొల్కా. ౪౮౬ సూ.) = మానవ స్త్రీ పురుషేతరజాతి వస్తువును దెల్పు శబ్దము 'అఃఱిణై చ్చొల్' అనంబడును.

"పెణ్ మై......" (తొల్కా. ౪౮౭ సూ.) = పుంస్త్వముగాని స్త్రీత్వముగాని పూర్ణముగా లేని నపుంసకుని దెల్పు శబ్దమును దైవత వాచకమును నివి యని తెల్పు ప్రత్యయములు లేవు 'ఉయర్ తిణై' అను జాతిలోఁ జేరి యుండును. ఉదా:—పేడివన్దాళ్ = నపుంసక వ్యక్తి వచ్చినది. (ఇట నీ వ్యక్తి స్త్రీగాఁ దలంపఁబడెను. కావుననే 'ళ్' అను స్త్రీలింగవాచక ప్రత్యయము క్రియలో నిల్చినది). వాసుదేవన్ వన్దాన్ = వాసుదేవుఁడు వచ్చెను (ఇచట నీవ్యక్తి పురుషుఁడుగా భావింపఁబడెను. కావునని 'న్' అను పురుష వాచక ప్రత్యయము క్రియలోఁజేరినది.

పయి తొల్కాప్పియ సూత్రములనుబట్టి కాల్డువెల్లుగారు 'దైవత' వాచకములను మానవజాతితో జతఁజేసి చెప్పుటయుఁ దదనుయాయులు "'మనుష్యులు దేవతలు నరకవాసులు' అను వానికి వాచకములయిన శబ్దములే (౧) ఉయర్ తిణై (౨) అఫ్ఱిణై (అల్ + తిణై) = (అది కానిజాతి)..." అని వ్రాయుటయు (ఆం. భా. వి. ౪౨౩ పుట) సరికావని విశదమగుచున్నది. (నన్నా లిట్లు వచించును) మఱియు వికాసకర్తగారు 'ఆయిద(త)ము' అను తమిలు వర్ణమును 'హ' కారముగ వ్రాయుటయు దొరగారి పద్ధతుల ననుసరించుట మూలముననె సంభవించినది (చూడు. ౧౭ IV విష).

౭౧. III విష:—తెలుఁగున సంస్కృత సమశబ్ద విషయమునఁ దప్ప మఱెచ్చటను బారిభాషికలింగమును (పుం. స్త్రీ. నపుంసకలింగములు) వ్యవ

హరింపరాదు. "మహత స్సో ర్ధ జ నితో భ వే త్పుంసి" (ఆం. చిం.) ('వ్యా. సం.' ౧౯-౧౩౦-విష.) (ఇందలి 'పుంసి' అనఁగాఁ బారిభాషిక పుంలింగమందని యర్థము), అను రీతిని సంస్కృత సమశబ్ద విషయమునఁ బారిభాషికలింగ ముపయోగింపఁబడును. ఇంకఁ దెల్గున నాచ్ఛి కానాచ్ఛిక సాధారణముగ నెల్ల శబ్దముల విషయమునను "మహద్వాచకములు-అమహద్వాచకములు" అని వ్యవహరింపఁబడును. దేవ రాక్షస మనుష్యాది జాతులలోని పురుష చిహ్నముగల వ్యక్తిని దెల్పుశబ్దము మహద్వాచకమనియుఁ దద్భిన్న శబ్దము 'అమహద్వాచకము' అనియుఁ (ఇది తమిళ పద్ధతిని స్మరింపఁజేయుచున్నది). జెప్పఁబడును. "స్త్రీ పశు జడాన్ వినాన్యే మహదాఖ్యాః" (ఆం. చిం.) ('వ్యా. సం.' ౧౨౫ విష). ఇట్లనుటచేత దేవ రాక్షస మనుష్యాది జాతిలోని స్త్రీ వ్యక్తిని దెల్పు శబ్దము సైతము 'అమహద్వాచకమె' యగుచున్నది. (ఇది తమిళ పద్ధతికి విలక్షణము). కాని యట్టిశబ్దమును 'స్త్రీవాచకము-మహతీవాచకము' అని వ్యవహరించుట గలదు. (చూడు "వికృతౌ చ స్త్రీలిఙ్గాః స్త్రీలిఙ్గక సర్వనామధేయాః స్యుః"—(ఆం. చిం.) ('వ్యా. సం.' ౧౮౬ విష.) 'ఉభయవిధ మమహతీనామ్.' (ఆం. చిం.) ('వ్యా. సం.' ౧౮౬ II విష.) (చూడు. ఆం. భా. వి. ౪౨౫ పుట అహోబలపత్యాదులు కల్పించి రనరాదు). కాన 'తల్లి-సీత' మున్నగునవియు 'అమహద్వాచకములె'. (మహతీవాచకములును). "ఆవు-ఎద్దు-ఎనుపోతు-గేదె-హంసి-హంస-సింహము" మున్నగునవెల్ల 'కొండ-నది-ఊరు' మున్నగు వానితో పాటుగ 'అమహద్వాచక మాత్రములె'. ఇట్టివానిలోని స్త్రీ వ్యక్తి వాచకములు సైతము 'అమహద్వాచకములె'. లతాది పారిభాషిక స్త్రీ లింగ శబ్దము లమహతీవాచకములనియు వాడఁబడును.

తెల్గున నింకొక విశేషము గలదు. దొరగారు వ్రాసిన మహ దమహద్విభాగమాత్రమె కాక "పుంలింగసమములు - స్త్రీలింగసమములు - నపుంసకలింగ సమములు" (వీనిలోని లింగశబ్దము పారిభాషిక లింగపరమె) అను విభాగము సైతము గలదు. [ఈ విభాగమె లేనిచోఁ బ్రథమైకవచన 'డు' ప్రత్యయము (చందురుఁడు-కొమరుఁడు మొ.) ప్రథమైకవచన లోపము (తల్లి-తండ్రి-మొ.) మువర్ణకము (బియ్యము-సున్నము-మొ.) మున్నగునవి యాచ్ఛికములకు సిద్ధింపనేరవు.] "వికృతౌ సర్వే శబ్దాః క్లీబసమాః స్త్రీసమాశ్చ" (ఆం. చిం.) ('వ్యా. సం.' ౧౮౭ విష.) 'అ-ఇ-ఉ. స్త్రీ విషయాః' (ఆం. చిం.) (చూ. 'వ్యా. సం.' ౨౧౭ I విష. ౨౨౧ విష.) అని యట్టి విభాగము చేయఁబడెను. ఈ తెల్గు పద్ధతిలో 'అన్న-తండ్రి-కొడుకు' మున్నగు మహద్వాచకములు సయితము "అమ్మ-చెల్లియ-తల్లి-కూఁతురు-కోడలు-గోడ-మేడ-ఇల్లు-వాకిలి" మున్నగు

వానితో పాటుగ స్త్రీలింగసమములె. పెండ్లము మున్నగు మహతీవాచకములు సైతము బియ్యము-సున్నము మున్నగు వానితోపాటుగ నపుంసకలింగ సమములె. ఈ విషయములు సంస్కృత ప్రసిద్ధ పారిభాషిక లింగము పోలికగలవి.

౭౧. IV విష:—కర్ణాటమున నాచ్ఛిక శబ్దముల విషయమునందును లింగ శబ్ద వ్యవహారము గలదు. కాని కర్ణాట వ్యవహ్రియమాణ లింగము సంస్కృత ప్రసిద్ధ పారిభాషికలింగము కాదు. లౌకికలింగమును గాదు. తెల్గు నందలి మహ దమహ ద్విభాగమునకును సరిపడదు. మనుష్యాది పుంవ్యక్తిని దెల్పు శబ్దము పుంలింగము. మనుష్యాది స్త్రీవ్యక్తిని దెల్పునది స్త్రీలింగము. తక్కినది నపుంసకలింగము. లౌకిక నపుంసకలింగము పేడిజాతి వాచకమందే వర్తించును. అనఁగాఁ గొంత పుంవ్యక్తి సాదృశ్యమును గొంత స్త్రీవ్యక్తి సాదృశ్యమును నుండవలయును. జడవాచకములం దట్టి లౌకిక నపుంసకత్వ మసంభవము గదా. కన్నడమున జడవాచకములు నపుంసక లింగములు.

ఆంధ్రేతర ద్రావిడభాషలందు దేవమనుష్యాదులగు వివేకముగల వ్యక్తులను దెల్పు శబ్దములెల్ల 'ఉన్నత జాతి' (High Caste) యనియుఁ దక్కిన వెల్ల జాతి హీనములనియు (Caste less) వివరించిన డా. కాల్డువెల్లుగారి వివరణము కర్ణాట విషయమున నెంతమాత్రమును వర్తిల్లదు. పయి పంక్తులు వ్రాయునపుడు దొరగారు కన్నడమును స్మరింపనేలేదని తోఁచుచున్నది. కర్ణాట లింగ విషయమున నింకను గొన్ని విశేషములు గలవు. అవియు నీ క్రింద దిఙ్మాత్రముగఁ జూపఁబడును.

"కం.—పురుషరె పుంలింగం స్త్రీ। యరె తాం స్త్రీలింగ ముళిదు వెల్లం నప్పా। గిరెనల్లుం కన్నడదొళ్ । పరివర్తిసవుళిద లింగ మొళవాగిర్దుం ।" (శబ్ద మణి దర్పణము. ౯౧ ప).

"స్త్ర్యర్థః స్త్రీ (కర్ణాట శబ్దా. ౧౦౨ సూ.)=స్త్రీ వాచకాః శబ్దాః స్త్రీ లిఙ్గా భవన్తి."

"పుమాన్ పుమర్థః. (కర్ణాట శబ్దా. ౧౦౩ సూ.)=పురుష వాచకా శ్శబ్దాః పుంలిఙ్గా భవన్తి"

"న బన్యత్. (కర్ణాట శబ్దా. ౧౦౪ సూ.)=స్త్రీ పురుష వాచకా దన్యత్ శబ్దరూపం నపుంసకలిఙ్గం భవతి."

తమిట మలయా ళాంధ్రములలో నాచ్ఛిక శబ్దముల విషయమున నిట్టి లింగవ్యవహారము లేదు. ఇది లౌకిక లింగము కాదు. ఆనె (ఏనుఁగు) ఎత్తు-(ఎద్దు) ఆవు (ఆలపశువు) మున్నగునవి సయితము కన్నడమున లౌకిక

లింగ విలక్షణముగా నపుంసక లింగములు. దొరగారు వ్రాసిన 'ఉన్నతజాతి' మున్నగు విభాగము కన్నడమున మచ్చునకేని లేదు. కన్నడమున లింగ విషయక విశేష విధు లింకను గలవు.

"కళత్రాదయః. (కర్ణాట శబ్దా. ౧౦౫ సూ.)=కళత్రాదయ శ్శబ్దా నపుంసక లిఙ్గా భవన్తి" "బహువచనా దాకృతిగణోయమ్...... తేన భూత ప్రేత పిశాచ శాకినీ ఢాకినీ త్యాదయః మారి-మసణి-బళహారి-చాడి-చెళె, ఇత్యా దయోపి శబ్దా ఉపసంగ్రాహ్యాః." (మంజరీ మకరందవ్యాఖ్య).

పయిరీతినె 'న బన్యత్' (కర్ణాట శబ్దా. ౧౦౪ సూ.) అను సూత్రపు భాషామంజరీ వృత్తిలో "పిశాచం పీడిసిత్తు=(పిశాచము పీడించును) భూతం పిడిదుదు=(భూతము పట్టినది)" అని యిట్లు పిశాచాది శబ్దములు నపుంసకలింగ ముల యుదాహృతులలోఁ జూపఁబడెను. ఇట్టి విషయములనుబట్టియు వెనుక నుదాహరించిన 'పెణ్మై......' (తొల్కా. ౪౮౭ సూ.) అను తొల్కాప్పియ సూత్రమునుబట్టియు నీక్రింద నుదాహరింపఁబడు కర్ణాట శబ్దానుశాసన సూత్రమునుబట్టియు భూత ప్రేత పిశాచాదులు మున్నగు వివేకముగల వ్యక్తులు సైతము మానవజాతి స్త్రీ పురుషులతోపాటుగ 'ఉన్నతజాతి'లోఁ జేర్చుట తమిళ కర్ణాట పండితుల హృదయము కాదని విశదమగుచున్నది.

"దేవతాదయో నప్ స్త్రీ. (కర్ణాట శబ్దా. ౧౧౦ సూ.)=దేవతాది గణపఠితా శ్శబ్దాః నపుంసకలిఙ్గాః స్త్రీ లిఙ్గాశ్చ భవన్తి. దేవతే-శ్రీ-సిరి-సరస్వతి-వాణి-పెణ్-(ఆఁడుది) పెణ్డతి (భార్య) తొత్తు (తొత్తు=దాసి) ఇత్యాది-దేవతాది రాకృతిగణః."

"గ్రహార్థః పుమాంశ్చ (కర్ణాట శబ్దా. ౧౦౭ సూ.)=గ్రహా స్సూర్యా దయః-తద్వాచకా శ్శబ్దాః పుంలిఙ్గా నపుంసక లిఙ్గాశ్చ భవన్తి."

"వసన్తాదయః. (కర్ణాట శబ్దా. ౧౦౯ సూ.)=వసన్తాదయ శ్శబ్దాః పుంలిఙ్గా నపుంసక లిఙ్గాశ్చ భవన్తి."

పయిరీతిని విశేష విధు లీ సందర్భమున నింకను గలవు. విస్తరభీతి నుదాహరింపలేదు.

౭౧. V విష:—"ప్రాచీన ద్రావిడ భాషలోని పదములు లింగభేదమును దెలుపునవి కావనియు నిటీవల నట్టి లింగభేదమును దెలుపుటకయి వానికిఁ బ్రథమ పురుష సర్వనామ శబ్దభాగములు చేర్పఁబడుచు వచ్చెడివనియు నూహింపవచ్చును. కావుననె యట్టి సర్వనామ శబ్దభాగయుక్త పదములకు

'పగుపదమ్' అను వాడుక గల్గెను. మఱియు దేవన్-ఇరవన్-మున్నగు పగు పదములు (పగు=బ్రద్దలగు-పగులు) 'దేవు-ఇరై' (త్రై?) అను రూపములతోఁ బద్య కావ్యములందు వాడఁబడి యున్నవి." (కాల్డు. ౨౨౦ పుట).

"నవీనారవమున సూర్య చంద్ర శబ్దములు పుంలింగ బోధక ప్రత్యయము తో 'సూర్యన్-చంద్రన్' అని వాడఁబడుచున్నవి. కాని ప్రాచీనారవము నందును గ్రామ్యారవమునందును వానికి బదులుగ "ఞాయిఱు=పొలుదు= (సూర్య). తిఙ్గళ్=నిల" (చంద్ర) అనులింగ బోధక ప్రత్యయరహిత రూపములె గలవు. ఒక కొన్ని-చోట్లఁ బ్రాచీనారవములో నయితము లింగబోధకమగు 'అన్' ప్రత్యయముతోఁ గొన్ని పదములున్నను దత్ప్రత్యయ విరహిత రూపములు మలయాళ కన్నడములలో నగపడుచున్నవి. ఉదా:—అఱ—పెయన్= (కుఱ్ఱవాఁడు)=మల-పెయ్‌దల్. ఆణ్ పెయ్‌దల్=(మగకుఱ్ఱవాఁడు). పెణ్ పెయ్‌దల్=(ఆఁడు కుఱ్ఱది)." (కాల్డు. ౨౨౧ విష.) (ఐకారమును 'ఎయ్' అని పల్కవలెననెడి దొరగారి సిద్ధాంతము చొప్పున వ్రాయఁబడెను కాని 'పైయన్-పైదల్' అనియె పై శబ్దముల నిజరూపము నెన్ననగును. చూడు. ౧౭ II విష).

విమర్శము:—నేఁటి కుపలబ్ధములగుచున్న ప్రాచీన తమిళ గ్రంథము లన్నిటికంటెను బ్రాచీనతమ మగు తొల్కాప్పియమున లింగబోధక ప్రత్యయము లీ క్రింది రీతిని సూత్రింపఁబడి యున్నవి. అంతకన్నఁ బ్రాచీన ప్రయోగములు దొరగారికి దొరకుట కల్ల. తెలుఁగు నందలి స్త్రీ సమములవలెనె తమిళ మందును గొన్ని లింగబోధక ప్రత్యయ రహిత పదము లుండిన నుండుఁగాక. అంతమాత్రమున నట్టి ప్రత్యయములు ప్రాచీన వాఙ్మయమున లేవనుట గాని యవి ప్రాచీనములు కావనుటగాని సరికాదు. వాఙ్మయము విస్తరింపని కాల మందలి ప్రాచీనతమ భాషలో లింగబోధక ప్రత్యయములు లేవని యూహించిన నూహింపవచ్చును. అపుడు సర్వనామములందు మాత్ర మట్టి ప్రత్యయము లెట్లువచ్చును? ఏ భాషయందును మొదటి యవస్థలో ధాతు మాత్రము లుండుననుటలో విప్రతిపత్తి యేముండును? (చూడు ౨౫ III విష).

"నఃకాన్......" (తొల్కా. ౧౮౭ సూ.)=పురుషులను దెల్పు శబ్దములు నకారాంతములై యుండును.

"ళఃకాన్......" (తొల్కా. ౧౮౮ సూ.)=స్త్రీలను జెప్పు శబ్దములు ళకారాంతములై యుండును.

"రహకాన్......" (తొల్కా. ౪౯౦ సూ.)=పై రెండిటి బహుత్వమును దెలిపెడి శబ్దములు రేఫాంతములుగను, 'ప' వర్ణాంతములుగను, 'మార్' శబ్దాంతములుగను నుండును.

"ఒన్ఱఱికిళవి......" (తొల్కా. ౪౯౧ సూ.)="అఃఱిణైశబ్దముల (ఉయర్ తిణై భిన్న=ఉన్నత జాతిభిన్న) యేకత్వమును 'తు-టు-ఱు' అనునవి దెల్పును." ఉదా-అతు (దు)=(అది) మొ.

"అ-ఆ-వ......" (తొల్కా. ౪౯౨ సూ.)=అఃఱిణై శబ్దముల బహుత్వమును 'అ-ఆ-వ' అను ప్రత్యయములు దెల్పును.

నవీనాఱవమున 'సూర్యన్-చంద్రన్' అని ప్రయోగింపఁబడుట కర్ణాట భాషాసంపర్క మూలకము కానోపును. "గ్రహార్థః పుమాం శ్చ" (కర్ణాట శబ్దా-౧౦౮ సూ.) అనెడి పయినుదాహరించిన కర్ణాట శబ్దానుశాసన సూత్రము చొప్పునఁ బఱగన్నడమందట్టి రూపములు (సూర్యన్-చంద్రన్) ప్రసిద్ధములై యున్నవి.

౭౧. VI విష:-"తెలుఁగు-గోండు-భాషలలోఁ దమిళాదులందువలెనె పుం స్త్రీలింగముల బహుత్వమున నైకరూప్యమున్నను స్త్రీలింగైకవచన ప్రత్యేకరూపము లేదు. ఇంక నపుంసకముల యేకవచనరూపమె స్త్రీలింగములకును వాడఁబడును. ఈ పద్ధతి సర్వనామములందును గ్రియలయందును నామములందును గలదు. దేవతాస్త్రీలు రాజస్త్రీలు మున్నగువారి విషయమునందును నిట్టి రీతినే వాడఁబడును. నపుంసక లింగములకుఁ జెల్లని స్త్రీలింగములకు బోధకములగు ప్రథమ పురుష సర్వనామపదములు కొన్ని గలవు గాని వాని వాడుక యరుదు. తెల్గునఁ బ్రథమ పురుష సర్వనామైకవచనమునఁ బున్నపుంసకరూపములె 'వాఁడు-అది' అనునవి కలవు. స్త్రీలింగరూపము లేదు. స్త్రీలింగ నపుంసక లింగములు రెంటను 'అది' శబ్దమె వాడఁబడును. స్త్రీలింగ బహువచనమునఁ బుంలింగ బహువచన రూపము గౌరవముగఁ వాడఁబడుచున్నది.

కన్నడ మలయాళము లీ విషయమున నేకత్వబహుత్వములు రెంటను నఱవమును బోలియున్నవి. కన్నడ మలయాళములందు సర్వనామ ప్రథమ పురుషైకవచనమున మూఁడు లింగములకును బ్రత్యేకరూపములు గలవు. తెల్గునకు సన్నిహితమగు 'కు' భాషయు నీ విషయమునఁ దమిళాదులనే పోలి యున్నది. నీలగిరి కొండలలోని 'తుద-కోట' భాషలలో 'అథమ్-ఇథమ్' అను రెండే ప్రథమపురుష సర్వనామములు గలవు" (కాల్డు. ౨౨౧-౨౨౨ పుటలు).

విమర్శనము:—డా. కాల్డువెల్లుగారీ విషయమున మిక్కిలి తడబాటుతోఁ గేవలము ప్రామాదికముగా వ్రాసిరి. తెలుఁగున నచ్ఛాంధ్రశబ్దముల విషయమున "పుంలింగము - స్త్రీలింగము-నపుంసకలింగము" అని యిట్లు లింగవ్యవహారము చేయుట సంప్రదాయవిరుద్ధ (చూడు ౭౧ III విష) మని తలంపక యీ సందర్భమున మహన్మహ త్యమహ ద్వాచకము లనవలసిన చోటులందెల్లఁ బుం స్త్రీ నపుంసక లింగము లనియె వ్యవహరించిరి.

మఱియు సర్వనామ ప్రథమపురుషైకవచనమున స్త్రీ వాచకమగు ప్రత్యేక శబ్దము తెల్గున లేదనియు 'ఆమె-ఆపె' మున్నగువాని వాడుక యరుదనియు నింక నమహత్ప్రథమ పురుషైకవచన సర్వనామమునె-'అది'-అనుదానినె స్త్రీ వాచకముల విషయమునను వాడుకొనవలయుననియు విని తడఁబడి నామవాచకములందును సర్వనామములందువలెనె మహతీవాచకములకు (స్త్రీలింగములకని దొరగారి వ్రాఁత) బ్రథమైకవచనమున నమహద్వాచకములకు వచ్చు 'ము' ప్రత్యయమె నిల్చునని భ్రమించి వ్రాసిరి:—

"They (తెలుఁగు గోందుభాషలు) are wholly or virtually destitute of a Feminine Singular, and instead of the Feminine Singular use the Singular, of the Neuter. This rule includes in its operation Pronouns and Verbs as well as *substantives*; and applies to goddesses and queens, as well as to ordinary women." (కాల్డు. ౨౨౧ పుట).

తెల్గున నిట్లు సర్వనామములందువలె నామవాచక ప్రాతిపదికములందు స్త్రీలింగములకుఁగాని (కంధరాదీతర) స్త్రీ సమములకుఁగాని నపుంసకలింగరూపముండు ననుట-ము-ప్రత్యయరూపముండుననుట-కేవలము పొరపాటు. తెల్గున సంస్కృత సమములగు స్త్రీలింగములయు నాచ్ఛికములగు స్త్రీ సమములయుఁ బ్రథమైకవచనము లోపించును. ఉదా:—సీత - గౌరి-అన్న-తండ్రి-తల్లి-మొ.

(ప్రధాన) ద్రావిడభాష లన్నిటియందును మహన్మహతీవాచకముల బహువచనరూపమునఁ బ్రథమపురుష సర్వనామములందు మహద్బహువచన రూపము నిల్చునట్లె తెల్గున సర్వనామ ప్రథమపురుష మహతీవాచకముల యేకవచనమునఁ దదీయామహద్వాచకైక వచనము-అది శబ్దము-నిల్చును. దీనిని దొరగారంత విచిత్రముగా భావింపనేల? తెల్గున మహతీవాచకములు సైత మమహ ద్వాచకములె కదా. ఇట్లగుటచేతఁ బ్రథమపురుష సర్వనామబహువచనమున మహన్మహతీవాచకముల కైకరూప్య ముండుట విచిత్రమనిన ననఁదగును.

తెల్గున మహతీవాచకేత రామహద్వాచకములకుఁ జెల్లనట్టియు మహతీ వాచకములకుమాత్రమె చెల్లునట్టియు సర్వనామ ప్రథమపురుషైక వచనరూప

ములు 'ఆమె-ఆపె' మున్నగు పూజ్యార్థకములె కాక 'ఎవ్వతె-ఒకతె' మున్నగు ననేకశబ్దములు ప్రచురవ్యవహార ప్రసిద్ధములు గలవు. కాన నట్టివి యరుదని దొరగారు వచింపరాదు.

దొరగారు 'గోండు-కు' భాషల విషయము నీ సందర్భమున విశదపడు నట్లుగ నుదాహరింపరైరి.

౭౨. విమ:—"ద్రావిడభాషలలో నెన్నఁడును ద్వివచనమున్నట్లు కనఁబడదు. 'మనము' అను శబ్ద మొకజాతి ద్వివచన మనుకొనవచ్చును. ఇట్టిది కొన్ని ద్రావిడభాషలలోఁ గలదు" (కాల్డు. ౨౨౨ పుట).

విమర్శము:—ప్రాకృత భాషలందే ద్వివచనము లేదు. "ప్రాకృతే న ద్వివచనం। సుప్తిఙాం చోపపద్యతే। యస్మా ద్ద్వివచనస్థానే। బహుత్వం సూత్ర చోదితమ్" (షడ్భా. ౪ పుట) "ద్వివచనస్య బహువచనమ్. (౨-3-3౪)=అస్మిన్ శాస్త్రే సుబన్తే తిఙన్తేచ ద్వివచనం బహువచనం భవతి." (షడ్భా. ౧౬ పుట).

'మనము' అనఁగా 'నీవును నేనును' అని యర్థమునెడి తలంపున డా. కాల్డువెల్లుగా రది యొక విధమగు ద్వివచన మనుకొనవచ్చునని వ్రాసిరి. కాని 'మనము' అనుదానికి 'మీరును మేమును' అనియు నర్థము కావచ్చును. అట్టి యెడల నది ద్వివచనము కానేరదు. ఇట్లు 'రాములు' అనుదానికిని 'ఇద్దఱు రాములు' అని యర్థము చేయునప్పు డది మాత్ర మేల ద్వివచనము కారాదు. ద్రావిడభాషలలోఁగాని ప్రాకృతభాషలలోఁగాని ద్వివచనము లేదనఁగా సంస్కృతమందువలె ద్వివచనమునకుఁ బ్రత్యేకరూపము లేదని మాత్రమె యర్థము. ద్విత్వమును బోధించు శబ్దములు లేవని యర్థముకాదు. బహువచన రూపము ద్విత్వమును బోధింపదనియు నర్థముకాదు. ద్విత్వ మనేకత్వ వాచకము కాకపోవునా?

౭3. I విమ:—"పుం వాచకైకవచన ప్రత్యయములు:—నామముల తుది నుండు లింగబోధక ప్రత్యయములు సర్వనామశబ్దభాగములయి యున్నవి. చిరకాలమునుండి సర్వనామములకు లింగబోధక ప్రత్యయములు చేర్పఁబడు చున్నవి. పూర్వకాలమందు నామవాచకములకు లింగబోధక ప్రత్యయము లను జేర్చెడి యలవాటు లేదు. సర్వనామములకుఁ జేర్చు లింగబోధక ప్రత్యయములు నామవాచకములకు నయితము చేర్చుచు వచ్చిరి." (కాల్డు. ౨౨3 పుట).

విమర్శము:—పయిరీతి వ్రాఁతలు నిరాధారములు. అవెల్ల నూహలు మాత్రమె. సర్వనామములకు లింగబోధక ప్రత్యయములను జేర్చుచు నామ

వాచకముల కట్లు చేర్పనిష్థితికి నిదర్శన మించుకేని గలదా? "అట్టి ప్రత్యయములు సర్వనామముల కెట్లు వచ్చినవి. నామవాచకముల కట్లేల రాలేదు" అనుటకు సమాధాన మేమి గలదు? మొట్టమొదట నెల్ల భాషలును ధాతుమాత్ర రూపములై యుండనగు ననెడి యూహకు విప్రతిపన్నులు లేరు.

23. II విష:—లింగవచన బోధకములగు 'న్ ళ్' అను వాని చరిత్ర నూహించుట దుశ్శకముగా నున్నది. డా. కాల్డువెల్లుగారు 'అన్' అనునది పుంవాచక ప్రథమైకవచన ప్రత్యయమనియు 'అళ్-తి' అనునవి స్త్రీవాచకప్రత్యయములనియు నందలి 'అళ్' అనునది తెల్గులోని 'ఆలు=స్త్రీ-భార్య' అను శబ్దమును సంబంధించినది కానోపుననియు వ్రాసిరి. వీరు వ్రాయలేదుగాని యిట్లే 'అన్' అనునది సైతము తెల్గులోని 'అన్న=అన=భ్రాత (పూజ్యుఁడు)' అను దానిని సంబంధించి యుండనోపుననియు స్థూలదృష్టికిఁ దోఁచును. తమిళుమందలి 'అ+అన్ = అవన్'=(వాఁడు) 'ఇ+అన్= ఇవన్'=(వీఁడు) అను శబ్దములం దిట్టి 'అన్' ప్రత్యయమును 'అ+అళ్= అవళ్'=(ఆ స్త్రీ) 'ఇ+అళ్=ఇవళ్'=(ఈ స్త్రీ) అను శబ్దములందు 'అళ్' ప్రత్యయమును గన్పట్టుచున్నవి. తెల్గులోని 'అన్న=అన' శబ్దమునకుఁ దమిళుమందలి 'అణ్ణ' శబ్దము మూలమని చరిత్రాభిజ్ఞుల యాశయము. అట్టి శబ్దముమీఁద నయిత మీ పుంవాచక ప్రత్యయభాగము 'అణ్ణన్' అను రీతిని నిల్చుచున్నది. తమిళుమందలి 'నీన్-యాన్-తాన్' మున్నగు ప్రాచీన శబ్దములమీఁది యీ ప్రత్యయములో 'అ' కార పూర్వకత్వములేదు. తుదికి తెలుఁగులో సైతము "వాఁడు-వీఁడు-జేఁడు-పరికాఁడు-విలుకాఁడు-మొకిలీఁడు-బానసీఁడు" మున్నగువానిలో 'అ' కార పూర్వకత్వము లేదు. స్త్రీవాచకముల తుదిని దెల్గున 'అళ్' ప్రత్యయగంధమే లేదు. ఇంతియకాక ద్రావిడవ్యాకరణములకెల్లఁ బ్రాచీనమగు తొల్కాప్పియమున నకారమాత్రము పుంవాచక ప్రత్యయమనియు ళకారమాత్రము స్త్రీవాచక ప్రత్యయమనియుఁ జెప్పఁబడెను. 'నఃకిళాన్......' (తొల్కా. ౪౮౮) ఏకత్వమునఁ బురుషులను, దెల్పు శబ్దములు నకారాంతములై యుండును. 'ళఃకిళాన్......' (తొల్కా. ౪౯౫ సూ.) స్త్రీలను దెల్పు శబ్దములు ళకారాంతములై యుండును.

పయికారణములచేత ద్రావిడ భాషలలోని నకార ళకార ప్రత్యయము (పుం స్త్రీవాచకములు) లక్షేయ చరిత్రకములనియు నవి యేవేని ద్రావిడశబ్దముల భాగములు కానోపుననియుఁ దలంపనగును.

కన్నడమునఁ బుంలింగవాచకములకే యను నియమములేదు. మకారము ప్రథమైకవచన ప్రత్యయము. అకారాంతేతర శబ్దములపై నున్న యట్టి మకార

ప్రత్యయము లోపించును. పదాంతగత మకారము సున్నయగును. తెలుఁగున బిందుపూర్వక 'డు' ప్రత్యయము పుంలింగ మహద్వాచకైకవచన ప్రత్యయము, ఇకారాంతాదుల కట్టి 'డు' ప్రత్యయము లోపించును. పుంలింగ మహద్వాచకములగు 'ఉ' కారాంతములకు 'వు' వర్ణకము సయితము నిల్చును. ఉదా:—కన్న-అవం-రామం-హరి-గురు-మొ. తెల్గు-రాముఁడు-కొమరుఁడు. మగఁడు-హరి-గురువు-గురుఁడు. మొ. నీవు-నేను-తాను మున్నగునవి విశేష రూపములు.

"తమిళ పుంవాచక ప్రథమైకవచన ప్రత్యయములు:—'అన్-ఆన్-ఓన్' అనునవి. 'అన్' ప్రత్యయము 'అవన్=(వాఁడు)' అను సర్వనామమునఁ జూపట్టును. (అ+అన్=అవన్). ఇందలి 'అ' శబ్దము నిర్దేశసర్వనామము. ఈ ప్రత్యయమును జేర్చుటచేత గుణనామవాచకములు గుణవన్నామవాచకము లగుచున్నవి. ఉదా:—తమి - మూప్పు = (ముదుసలితనము) - మూప్పన్=(ముదుసలివాఁడు) తమిళ్+అన్=తమిళన్=(అఱవవాఁడు). ఇట్టి శబ్దములను 'పగు' పదములని వైయాకరణులు వ్యవహరింతురు. విభాగయోగ్యపదములని యర్థము. (పగు=పగులు=బ్రద్దలగు). ఈ ప్రత్యయము లొకప్పుడు ప్రత్యేక శబ్దములై యుండిన నుండవచ్చును. పయి యుదాహృతులం దిట్లు ప్రథమా విభక్తి (ప్రాతిపదికము) పైని 'అన్' ప్రత్యయము నిల్చినను దఱుచుగా విభక్తియోగ యోగ్యమగు నంగముపై నిల్చుచుండును. అట్టి యంగము షష్ఠీసప్తమ్యంతములచోట సరిపడును. అట్టి యంగముపై నీ లింగబోధక ప్రత్యయములు నిల్చునపుడు "అది దీనికిఁగల-దీనియందుండు" అను నర్థములు బోధ్యములగును. ఉదా:—మలైయినన్=(మలై+ఇన్+అన్)=(పర్వతవాసి). పట్టనత్తన్=(పట్టన+అత్+అన్)=(పట్టనవాసి). కొన్నియెడల 'ఇన్' అనునది నిరర్థకముగ నాగమమగును. ఉదా:— విల్లినన్=(విల్+ఇన్+అన్)=(విల్లుగలవాఁడు). విల్లన్=(విల్+అన్)=(విల్లుగలవాఁడు). కొందఱు వానిని విశేషణము లందురు. అట్టి వాడుకలు లేవు." (కాల్డు. ౨౨౩ పుట).

విమర్శము:—తమిళమందు 'అన్ - ఆన్ - ఓన్' అనునవి పుంలింగబోధక ప్రత్యయములనెడి దొరగారి వ్రాఁత సరికాదు. తొల్కాప్పియమున నాంతములు పురుషవాచకైకవచనములనియు ళాంతములు స్త్రీవాచకైకవచనములనియు రేఫాంతములు బహుత్వ స్త్రీ పుంవాచకములనియుఁ జెప్పఁబడెను. నాన్-యాన్-నీన్-తాన్ మున్నగువానియందు 'అన్' ప్రత్యయము నిల్చె ననరాదుగదా.

"నంఃకాన్......" (తొల్కా. ౪౮౮ సూ.)=ఏకత్వమునఁ బురుషులను దెల్పు శబ్దములు నకారాంతములై యుండును. ఇట్టి తొల్కాప్పియ సూత్రములను

బట్టి "అ+అ+న్=అవన్=(వాఁడు)" అ+అ+ళ్=అవళ్=(ఆమె) అని భేదము చేయువలయునని తోఁచుచున్నది. అందలి మొదటి 'అ' శబ్దము నిర్దేశ సర్వనామ ప్రాతిపదికము. రెండవ 'అ' శబ్దము తద్వత్త్వార్థకము. విభక్తిప్రత్యయము ప్రాతిపదికముపైని నిల్చుట సంప్రదాయము. తమిళమునఁ బ్రాతిపదికమె సాధారణముగాఁ బ్రథమా విభక్తియని సంప్రదాయము. కాన నీ నకారాదులతోఁ గూడినవె నామములనఁగాఁ బ్రాతిపదికములనియు నవె ప్రథమా విభక్తి రూపము లనియు గ్రహింపవలయును. వానిపైనె యితర విభక్తులు నిల్చుట సంప్రదాయము.

"అవైతామ్ పెయర్......" (తొల్కా. ౫౪౭ సూ.)=ఆ యేడు విభక్తులును:—"౧. నామము. ౨. ఐ. ౩. ఒడు. ౪. కు. ౫. ఇన్. ౬. అదు. ౭. కణ్" అనునవి.

"కూఱియ ముఱైయిన్......" (తొల్కా. ౫౫౩ సూ.)=ప్రథమారూపమున కేమార్పును గలుగకుండనె దాని తుది నితరవిభక్తులు నిల్చును.

'అ-ఇ-ఉ' అను శబ్దములు తమిళమున నిర్దేశవాచక సర్వనామములు. ఇవి కావ్యములందు దీర్ఘరూపములును నై యుండును.

"నీడవరుదల్......" (తొల్కా. ౨౦౮ సూ.)='అ' శబ్దము పద్య కావ్యములందు 'ఆ' శబ్దమగును. ఉదా:—అ+ఇడై=ఆయిడై=(ఆ చోటను).

"చుట్టిన్ ఇయఱ్ఱై......" (తొల్కా. ౨౩౮ సూ.)=నిర్దేశవాచకమగు 'ఇ' అను సర్వనామశబ్దమునకు 'అ' శబ్దమునఁ జెప్పిన విధులెల్ల వర్తిల్లును.... పద్య కావ్యములలో 'ఇ' శబ్దము దీర్ఘమునందును—ఉదా:—ఇ+ఇడై=ఈయిడై=(ఈ చోటను). మొ.

ఇట్టి ద్రావిడ సర్వనామ శబ్దములలో 'అ' శబ్దము దూరస్థ విషయమునను 'ఇ' శబ్దము సమీపస్థ విషయమునను వాడఁబడును. కావున "అ+అ+న్=అ+వ్+అ+న్=అవన్=(వాండు)" అనుచో మొదటి 'అ' శబ్దము నిర్దేశవాచక సర్వనామము. రెండవ 'అ' శబ్ద మట్టి 'దూరస్థిత్యాదికముగల' అను నర్థము నిచ్చును (చూ. 22 I విష.) నకారము పుంలింగ వాచకైక వచనద్యోతకము. ఇట్లె 'మూప్ప+అ+న్' మున్నగు చోటులందు 'అ' అనునది తద్వత్త్వార్థము నిచ్చును. (తెల్గునందును చెడుగఁడు. ముదుకఁడు మున్నగు మతుబర్థక 'అ' ప్రత్యయము గలదు) మూప్పన్=వృద్ధత్వముగల వాఁడు. నకారము పుంలింగైకవచన ద్యోతకము. ఇట్లగుటంజేసి 'అన్' అనునది యఖండ ప్రత్యయమనియు నది పుంలింగైకవచనార్థకమనియు దొరగారు

వ్రాయుట సరికాదు. అందలి 'న' కారము మాత్రమె తొల్కాప్పియ సూత్రము చొప్పునఁ బుంలింగైకవచనార్థక మనఁదగును.

'అవన్' అనుదాని సంక్షేప (వకారలోపమునఁ గల్గినది) రూపము 'ఆన్' అనునదియు దాని రూపాంతరము 'ఓన్' అనునదియు నని యెఱుంగ నగును. ఉదా:—విల్లవన్=విల్లాన్=విల్లోన్=(విల్లుగల వాఁడు). ('విల్లవన్' అనునది తెల్గునందలి "పీతాంబరము వాఁడు=పీతాంబరము గలవాఁడు" అను దానివంటిది). (చూడు. కాల్డు–౨౨౫ పుట).

"ఆ ఓ......" (తొల్కా. ౬౭౯ సూ.)=నామములలోని 'ఆ' కారము కావ్యములయందు 'ఓ' కార మగును. ఉదా:—విల్లాన్=విల్లోన్=(విల్లుగల వాఁడు).

23. III విష:—"విశేషణములకు లింగబోధక ప్రత్యయములను జేర్చుట వలన వేఱొకజాతిదగు తద్ధితాంత విధేయ విశేషణ (Appellative) మేర్పడును. 'కొడియన్=(క్రూరుఁడు)' మున్నగువాని నిట్టి గుణవాచక విధేయ విశేషణము లనరాదు. అట్టివి క్రియాజన్య విశేషణజన్య నామవాచకము లనఁదగు నని నా యభిప్రాయము. 'కొడియ' అను దానిలోని తుది 'అ' శబ్దము నపుంసకలింగ బహువచన ప్రత్యయము కావచ్చును. షష్ఠీ విభక్తియుఁ గ్రియాజన్య విశేషణమును గావచ్చును. "ఓదు+(చదువు. ధా) ఆన్=ఓదు వాన్=(చదువువాఁడు) (ఇట్టివి కొడియన్ శబ్దము వంటివె)" అనునది క్రియా జన్య విశేషణజన్య నామవాచకము. 'ఓదినన్-ఓదిగి న్ద్రవన్' అనునవియు నిట్టివె. నిజమైన విశేష్యనిఘ్న విధేయ విశేషణము లేదా తద్ధితాంత విధేయ విశేషణము (Appellative) "కాప్పన్" (సంరక్షకుఁడు) అనునది. 'కాప్పు= (సంరక్షణము)' అను నామవాచకమునుండి యేర్పడినది. 'కాప్పాన్' అను భవిష్యత్కాలిక క్రియనుండి యేర్పడినది కాదు. ఇది మూప్పు=(వృద్ధ త్వము)"(చూడు. 23 II విషయము) అనుదానివంటిది.

" 'అన్' అనుదానిచోట 'అవన్' అనునది నిల్చినను నర్థభేదములేదు. ఉదా:—విల్లు+అన్+విల్లన్=(విల్లుగలవాఁడు). విల్లు+అవన్=విల్లవన్= విల్లాన్=విల్లోన్=(విల్లుగలవాఁడు.) 'ఆన్-ఓన్' అనునవి 'అవన్' శబ్దములోని 'వ' కారలోపమువల్ల నేర్పడినవి. 'ఆన్' అనునది యఱవ గ్రామ్యములోఁ గ్రియల ప్రథమ పురుషైక వచనములోఁ దప్పక వచ్చును. ఉదా:—పోనాన్= (వెళ్ళెను)." (కాల్డు. ౨౨౮, ౨౨౫ పుటలు).

విమర్శము:—విశేషణములకు లింగ బోధక ప్రత్యయములను జేర్చుట వల్ల గుణనామవాచక మేర్పడునని చెప్పి "కాప్పు=(సంరక్షణము)+అన్=

కాప్పన్='సంరక్షించువాఁడు'" అని యుదాహరించుట సరికాదు. 'కాప్పు'=(సంరక్షణము) అనునదియు దీనివంటిదే యగు 'మూప్పు'=(వృద్ధత్వము) అనునదియు విశేషణములుగావు. విశేష్యములు. కాన ప్రాతిపదికముపైని 'అ' ప్రత్యయము నిల్చుటవల్ల మఱొక ప్రాతిపదికము తద్వత్తార్థక మేర్పడుననియు దానిపైని లింగబోధక ప్రత్యయము (న్) నిల్చుననియుఁ జెప్పుట యుక్తము. 'ఓదువాన్' మున్నగు క్రియాజన్య విశేషణములు కృదంతములు, ఇవి తద్ధితాంతములు.

'అ' ప్రత్యయము నపుంసకలింగ బహువచన ప్రత్యయము కావచ్చును. తద్వత్తార్థకమగు తద్ధిత ప్రత్యయమును గావచ్చును. క్రియలనుండి విశేషణముల నేర్పరించు (తమి-కాట్టిన=చూపిన) కృత్ప్రత్యయమును గావచ్చును. ఆకార సామ్యమున కింత తడఁబడనేల? 'అ' అనునది తమిఁటమున షష్ఠీ ప్రత్యయము కాదు. 'అదు' అనునది తమిఁట షష్ఠీ ప్రత్యయము. (చూడు తొల్కా. ౧౧౮ సూ). "తనకైగళ్ = తనవిచేతు" అనుచో మాత్రము 'అ' అనునది సంబంధార్థకము.

"పీతాంబరము వాఁడు=పీతాంబరము గలవాఁడు" అను తెల్గు వాడుక వలెనె "విల్లు+అవన్=విల్లవన్=(విల్లుగలవాఁడు)" అను తమిఁట వ్యవహారమును సహజముగనె యున్నది. దాని రూపాంతరములె 'విల్లాన్=విల్లోన్' అనునవి యనుటయు సరియె. మఱియుఁ బ్రథమ పురుషైక వచన ప్రత్యయము 'అవన్=వాఁడు' అను దానినుండి యేర్పడెననుటలో విప్రతిపత్తి యేమున్నది?

23. IV విష:—"కన్నడమందలి 'అను' అనెడి ప్రథమైక వచనరూపమునకును నఱవములోని 'అన్' ప్రత్యయమునకును భేదములేదు. ప్రాచీన కన్నడమున 'అమ్' అని యుండెడిది. 'మ-న'ల వ్యత్యాసము వింతకాదు. వీనికి సరియగు తెల్గు పుంలింగ ప్రథమైకవచన ప్రత్యయములు 'డు-ఉడు-అడు' అనునవి. "(తెల్గు) మగండు=(భర్త)=(తమి)—మగన్=(కొడుకు)" అను వానికిఁ బ్రాచీన కాలమునఁ బురుషుఁడని యర్థమై యుండవచ్చును. "(అఱ) అరు=(తెల్గు) ఉరు" అనునవి యభిన్నములు. వీనిలోని చివరనున్న 'ఉ' కారము, ముందటి 'అ' కారమును దెల్గున 'ఉ' కారముగా మార్చినది. (స్వరశక్తి). "(అఱ) శి (చి)న్నవన్=(తెల్గు) చిన్నవాఁడు" అనునవి యభిన్నములు. అఱవ కన్నడములలో నున్నట్లె తెల్గునను 'అన్' ప్రత్యయమె పుంలింగైకవచన ప్రత్యయమైయుండు నన వచ్చును. దీనికి నిదర్శనములు:—గ్రాంథికపుఁ దెనుఁగులోనె 'అండు-ఉండు-ండు' అను సనునాసిక ఘటితరూపములున్నవి. ద్వితీయాది విభక్తులలో 'అని' కాని 'ని' కాని నిల్చుచున్నది. బహువచనమున 'అరు' ప్రత్యయము యొక్క భాగము ద్వితీయాదులలో 'రి' అని నిల్చినట్లె యీ పుంలింగ ప్రథమైకవచన

నకారము ద్వితీయాదులందు నిల్చుచున్నది. అఱవమునందును నిట్లే నిల్చును. (తెల్గు) - వానికి=(అఱ) - అవనుక్కు. (తెల్గు) - వారికి=(అఱ) అవరుక్కు. 'ఆయన' శబ్దములో సయితమీ 'న' కార ప్రత్యయమె యున్నట్లు కనఁబడు చున్నది.

తమిళాంధ్రములలోని 'అన్' ప్రత్యయమును గన్నడములోని 'అమ్' ప్రత్యయమును నభిన్నములె. తమిళ మలయాళములలోఁ గొన్ని యెడల 'అమ్' అనుదానికి మాఱుగ 'అన్' అనునదియు నపుంసకలింగ ప్రథమైకవచన ప్రత్యయముగ వాడఁబడుచున్నది. ఉదా:—(తమి)-పలన్=పలమ్. (ఫలము-పండు) (చూడు. ౨౧ XIV విమ.) (తొల్కా. ౮౨ సూ. చూడు).'' (కాల్డు. ౨౨౫-౨౨౬ పుటలు).

విమర్శము:—'అవను=(వాఁడు)' అనునది హళాసగన్నడ రూపము. ప్రాచీన కర్ణాట పుంలింగ ప్రథమైక వచనరూపము 'అవం'=(వాఁడు), అనునది. ఈ రెండిటియందును 'అను' అనెడిది ప్రథమైకవచన ప్రత్యయము కాదు. హళాసగన్నడమున 'ఉ' అనునదియుఁ బ్రాచీన కర్ణాటమున 'మ్' అనునదియుఁ బ్రథమైకవచన ప్రత్యయములు. తమిళమున నకారము ప్రథమైకవచన ప్రత్యయమగుచుండఁగా 'అన్' అను దానిని జెప్పుచున్నట్లె (చూడు 23 II విమ.) ప్రాచీన కర్ణాటమున మకారము ప్రథమైకవచన ప్రత్యయమగుచుండఁగా 'అమ్' అను దానిని గాల్డువెల్లుగారు వచించుచున్నారు. ఇట్లె తమిళ ప్రథమా బహువచన ప్రత్యయము రేఫమాత్రమగుచుండగా 'అరు' అను దానినిగా వచించిరి. తెల్గునందుఁ బ్రథమా బహువచన ప్రత్యయము 'రు' అనునది మాత్రమెకాని 'ఉరు' అనునదికాదు. ఎల్లరు-వారు-వీరు-మొదలగు నవి యరయునది.

''ఎల్లా ప్రాతిపదికగళమేలూ ఏళువిధవాద విభక్తి ప్రత్యయగళు హత్తువవు'' ఇవుగళు హత్తిద శబ్దక్కె కారకశబ్దవెందు హెసరు. ''కర్తృ-ప్రథమావిభక్తి-ఉ...'' (శబ్దాదర్శ-హళాస గన్నడ వ్యాకరణము).

''తాస్తు మమింకె అదదొళ్'' (కర్ణా. భూష. 3౯ సూ,)=ఆ విభక్తులు వరుసగా 'మ్-అమ్-ఇమ్-కె-అత్-అద్-ఒళ్' అనునవి.

''అతోఽనుస్వారః ప్రథమైక వచనస్య'' (కర్ణా. భూ. ౪౫ సూ.)=అకారాంత ప్రాతిపదికముకంటెఁ బరమైన ప్రథమైకవచన మకారమున కనుస్వారాదేశ మగును. ''అదు, ఇదు, ఉదూనా మన్తే 'వ-తౌ' పుంసి'' (కర్ణా. భూష. ౯౫ సూ.)='అదు-ఇదు-ఉదు.' అను ప్రాతిపదికముల తుదివర్ణమునకుఁ బుంస్త్వమున విభక్తి పరమగుచుండఁగా 'వ-త' అను నాదేశము లగును. ఉదా:—

అదు+మ్=అవం. ఇదు+మ్=ఇవం=(వాఁడు-వీఁడు) దీనినిబట్టి కర్ణాటమున అదు-ఇదు-ఉదు' అనునవె నిర్దేశసర్వనామ ప్రాతిపదికములని విశదమగు చున్నది.

"జసః స్థానే 'రు' రత్రస్యాత్-(విక్ర. అజం. 38 కారి.) లు లయో స్తథా పుంసి రు-రౌ స్మృతౌ" (విక్ర. అజం. ౫౨ కారి. 'వ్యా. సం.' ౨౧౫ విమ). "లాన్తాత్తు రు రౌ తయోః క్రమేణ స్తః" (ఆం. చిం.) (వ్యా. సం. ౧౭౭ విమ).

తెలుఁగులోని ప్రథమైకవచనములను జూపుటలో దొరగారు 'అడు-ఉడు' అని స్వరపూర్వకములనుగాఁ జూపుట సరికాదు. బిందుపూర్వక 'డు' వర్ణముమాత్రమె తెల్గు ప్రత్యయము. వీనిని 'అణ్=(పురుష)=అణ్డ్' అను రీతిని దమిళ శబ్దమునుండి యేర్పడెనని వచింపఁదలంచి (చూడు 23 V విమ.) యుండుటచేత నట్లు స్వరపూర్వకత్వ ముదాహరింపఁబడియుండును. 'వాఁడు-వీఁడు-సాలీఁడు'-మున్నగువానిలో స్వరపూర్వకత్వము లేదు గదా. మఱియు 'అదు' మున్నగురీతి నుదాహరించుటయు సరికాదు. వారి పక్షమున 'అందు' అనురీతి నుదాహరింపవలసియుండును. దొరగారే వీనిలో నర్ధబిందువు గలదని వచింతురు. (చూడు కాల్డు. ౨౨౮ పుట.) మగ శబ్దము ప్రాచీన ద్రావిడ భాషలోఁ బురుషవాచకమను దొరగారి వ్రాఁత సరికాదు. తమి-మగన్=(మగశిశువు) మగళ్=(ఆఁడు శిశువు) తెలుఁగు-మగువ. వీనిని బట్టి 'మగ' శబ్దము శిశు పర్యాయ మనఁదగును. ప్రాచీన కావ్యములో 'భర్త' అని ప్రయోగము గలదు.

రూపసాధన ప్రక్రియా ప్రదర్శనమాత్ర ప్రవణులగు నాంధ్ర వైయాకరణులు 'రామునిన్' మున్నగువానిలోని 'ని' అనునది యాగమమని సూత్రించిననను నయ్యది 'రామన్' అను పుంలింగ బోధక 'న' కార ప్రత్యయ సంబంధియె యనుటకు సందేహము లేదు.

"ఆ+అన=ఆయన" అను ఛేదముగల 'ఆయన' శబ్దములోని 'న' కారము 'అన్న=అన' అను శబ్దములోని దనఁదగును గాని ప్రథమా ప్రత్యయ 'న' కార సంబంధికాదు.

23. V విమ:—"వయి నుదాహరించిన నపుంసకలింగ బోధకమగు 'అన్' ప్రత్యయమును బుంలింగ వాచకమగు 'అన్' ప్రత్యయమును నభిన్నములు కావు. వాని వ్యుత్పత్తులు కేవలము విభిన్నములు. ఎట్లన:—'కు' భాషలోని 'ఆ-ఆళు'=(వాఁడు) 'ఆ-ఆళు' (అది=ఆ స్త్రీ) అనువానిలోని 'ఆళు' అనునది పుంలింగ వాచకము. 'ఆళు' అనునది స్త్రీ లింగవాచకము. ఇందలి 'ఆళు' అనునది తమిళములోని 'ఆణ్=ఆళ్'=(పురుషుఁడు). అనుదానికి భిన్నము కాదు. అట్టి 'ఆణ్' అనునదే తమిళ పుంలింగ ప్రథమైక వచన ప్రత్యయమగు

'అన్' అనునదిగా మాఱినది. ణకారము నుచ్చరించునపుడు దానిని డకారము వెంబడించుటయే కాక (పెణ్=ఆఁడుది. దీనిని గావ్యములలో 'పెణ్డు' అని వాడుదురు) ణకారము డకారమగుటయుఁ గలదు. ఉదా:—(అఱ)-పెడ్డై = (ఆఁడు కోడి). పెణ్=(ఆఁడుది). ఈ రెండును నభిన్నములె. కానఁ దెలుఁగులోని 'అండు' అను ప్రత్యయము 'అణ్' అను శబ్దమునుండి వచ్చియుండును. (అనుబంధము). 'అణ్' అనునది 'అన్' అనుదాని ప్రాచీన రూపమై యుండును. నణల విపర్యాసము తెల్గున గ్రామ్యములోఁ గలదు. ఉదా:—వాని=వాణ్ణి. 'వాఁడు' అనుదానిలోని యర్ధానుస్వారము సైత మందలి 'న' కార స్థితిని దెలుపును. కానఁ దెలుఁగులోని 'అడు' అను ప్రత్యయము 'అణ్' అనురూపము మూలమునఁ దమిఁట కన్నడములలోని 'అన్' అనుదానితో సంబంధించుచున్నదని చెప్పవచ్చును.

తమి-అన్=కుభాష-ఆఞు=(మనుష్యుఁడు) అనునవి దీర్ఘాక్షరాద్యమగు 'ఆణ్'=(పురుషుఁడు) అనుదాని కభిన్నము లగుటెట్లని శంకింపరాదు. కుభాష-'ఆ ఆఞు=(వాఁడు)' అనుదానిలోని ఆఞు శబ్దము క్రియాజన్య విశేషణముల కును ప్రయుక్తమగునపుడు హ్రస్వాదిక మగును. ఉదా:—"(కుభాష)-గిత్ఞు=(చేసినవాఁడు). (కన్న)-గెయిదను-(కుభాష)-గితారు=(కన్న)-గేయిదరు=(చేసినవారు). (కుభాష)-గితలు=గేయిదళు=(చేసిన స్త్రీ)" (కాల్డు. ౨౨౮ పుట).

విమర్శము:—ణ కారము నుచ్చరించునపుడు దానిని 'డ' కారము వెంబడించు ననుట యనుభవ విరుద్ధము. 'కణ్' మున్నగు ననంతములగు 'ణ' కారాంత శబ్దములలో లేని 'డ' కారము 'ఆణ్' శబ్దమందు మాత్రము గల్గెననుట విశ్వాసనీయము కాదు. ప్రాచీన కర్ణాట ప్రాచీన తమిఁటములలోని 'ణ' కారము చోటఁ దెల్గున 'న' కారముండుట ప్రసిద్ధము. తమిఁటమందె 'న' కారముగా మాఱి 'అన్' ప్రత్యయ మేర్పడినపు డింకఁ దెల్గులో 'ఆణ్=అణ్' శబ్దము లెట్లు నిల్చును? దానిని 'డ' కారము వెంబడించుటెట్లు? 'పెణ్డ్+తు=పెణ్డు' అని చెప్పుట యుక్తము. (చూడు 23 IV విష. కాల్డు. ౨౨౫ పుట). ఇంతియ కాక ద్రావిడ మహత్ప్రథమైకవచన ప్రత్యయము 'న' కారమని ప్రాచీనతమ మగు తొల్కాప్పియమున వచింపఁబడెను. 23 II విషయమున విమర్శింపఁబడిన రీతిని 'న' కార మాత్రమె పుంలింగ ప్రథమైకవచన ప్రత్యయమగునుగాని 'అన్'

అనుబంధము:—23. V విష:—ఇట్టి కాల్డువెల్లుగారి కల్పనమునె యనుసరించి శ్రీ కోరాడ రామకృష్ణయ్య పంతులు యమ్మేగారు 'డు' వర్ణకచరిత్రమును వివరించిరి. (చూడు ౧౫ IX విష.) (చూడు స్టడీ-ద్రవి. ౯౨-౯౮ పుటలు). ణకారమును 'డ' కారము వెంబడించునను దొరగారి వ్రాఁతయె మూలముగఁ గొనఁబడెను.

అను రీతిని స్వరపూర్వకము కానేరదు. వీఁడు-సాలీఁడు- వేఁడు మున్నగుచోట్టు లందు 'అన్' ప్రత్యయము నిల్చెననుట పొసఁగనేరదు. కావున 'నాంత మగు ప్రథమైకవచనము పైని ప్రాచీనతమ ప్రథమైకవచన 'తు' ప్రత్యయము (చూడు ౭౫ II విష.) నిల్వఁగా సంధివశమున "అవన్తు = వాన్టు = వాండు = వాఁడు" అను రీతిని దెలుఁగు 'డు' ప్రత్యయ మేర్పడెననుట సహజమై విశ్వస నీయమై యుండును. (చూడు ౧౮ IX విష.)

౭౩. VI విషయమున వివరించిన రీతిని గన్నడ పుంవాచకైకవచన ప్రత్యయము 'మ్' అనునదియుఁ, దదంత శబ్దము 'అవం' అను రీతినుండుననియుఁ జెప్పవలసి యుండఁగా దొరగారు గన్నడ ప్రథమైక వచన ప్రత్యయము సైతము తమిళమందువలెనె 'అన్' అనునదే యని వ్రాయుట యుక్తముకాదు. మకార నకారముల మార్పు సహజమగుటచేత నవి యభిన్నములనుట యుక్తము.

'వాని' అను తెలుఁగు గ్రాంథికరూపము యొక్క పరిణామము 'వాణ్ణి' అని యగునని వ్రాయుట సరికాదు. 'వాడిని=వాడ్ని=వాణ్ణి' అని యిట్లు తెల్గు గ్రామ్య శబ్దపు పరిణామక్రమమును జూపుట యుక్తము.

౭౮. I విష:—స్త్రీవాచక ప్రథమైక వచనము:—రూపసాధన ప్రక్రియా విషయమునఁ దమిళ కర్ణాటాంధ్ర వ్యాకరణ మార్గములు విభిన్నములు. తమిళ కర్ణాటములలో స్త్రీవాచక రూపములు పెక్కు 'ళ' కారాంతములు.

"ళఃకాన్......" (తొలాక. ౪౮౯ సూ.)= స్త్రీవాచకములు ప్రథమైకవచనమున 'ళాంతములైయుండును.

దీనినిబట్టి తమిళమున స్త్రీవాచక ప్రథమైకవచన ప్రత్యయము 'ళ' కారమని విశదమగుచున్నది. ఉదా:—అవళ్=(ఆ స్త్రీ). కర్ణాటమందును నిట్లె తెల్గున స్త్రీవాచక ప్రథమైక వచన మిట్లు 'ళాంతమైయుండదు. 'ళ' కారము తెల్గున స్త్రీవాచక ప్రత్యయము కాదు. తెల్గున సాధారణముగ సంస్కృత సమ స్త్రీలింగములయు నాచ్ఛిక స్త్రీసమములయుఁ బ్రథమైకవచనము లోపించును. ఉదా:—రమ-గౌరి. అమ్మ-చిగురు తల్లి-ఆమె-అది (ఆ స్త్రీ) మొ. ఉకారాంత సంస్కృత సమ శబ్దమును 'గో' శబ్దమును దెల్గున స్త్రీత్వమునందును 'వు' ప్రత్యయాంతములై యుండును. ఉదా:—వధువు-ధేనువు-తనువు-గోవు మొ.

తెల్గున నరుదుగ 'త-తి-తె-ఇ' అను స్త్రీ ప్రత్యయములు తుదినిగల శబ్దములు కొన్నిగలవు. ఉదా:—ఒకత-ఒకతి-ఒకతె-ఒకర్త-ఒకర్తి-ఒకర్తె-ఓర్తు-ఎవత-ఎవతి-ఎవతె-ఎవర్త-ఎవర్తి-ఎవర్తె-పాఱుత=(బ్రాహ్మణ స్త్రీ) ముట్టుత (రజస్వల) చాకిత-ఓయారి-బిత్తరి-మొ.

తెల్గున నిర్దేశక సర్వనామరూపములు—'అది-అవి' 'ఇది-ఇవి' మున్నగునవి కొన్ని గలవు. తెల్గున 'ఉ' అను నిర్దేశవాచక సర్వనామ మంతరించిన దనవచ్చును. 'ఏ' శబ్దరూపము 'ఏది-ఏవి' అని గలదుగాని యది స్త్రీ వాచకము గాదు. (చూడు 'వ్యా. సం.' ౨౧౭ II విష.) 'అది-అవి-ఇది-ఇవి' అనువానిలో 'అది-ఇది' అనునవి స్త్రీవాచకములును నమహద్వాచకములును నైయున్నవి (చూడు 'వ్యా. సం.' ౨౧౫ II. ౨౧౬ విష.) వాని బహువచన రూపము లమహద్వాచకమాత్రములె. స్త్రీవాచకములగు 'అది-ఇది' అను వాని బహువచనరూపములు వరుసగా 'వారు-వీరు' అనునవె. తమిఁల కర్ణాటములందలి నిర్దేశక సర్వనామ నపుంసకరూపములు:—తమి-అతు (దు) (సరళోచ్చారణ మర్వాచీనము) అవ్, అవై. ఇతు (దు)-ఇవ్-ఇవై. తెలుఁగున 'అది-ఇది' అనువాని స్త్రీవాచకత్వము మూలమున నయ్యవి 'ఇ' దంతములయిన వనియు వాని సామ్యమున 'అవి-ఇవి-ఏది-ఏవి' అనునవియును 'ఇ' దంతము లయ్యెననియుఁ దోఁచుచున్నది. అట్లయినను దెల్గునందును దమిఁల కర్ణాట ప్రసిద్ధములైన 'అదు-అవు' అనువానివంటి 'దు-వు' లు "చేయదు-చేయవు-చేయఁగలదు-చేయఁగలవు." అను వ్యతిరేక భావిరూపములలో నిల్చియున్నవి. భూత వర్తమాన రూపములలో "చేసినది - చేసినవి - చేయుచున్నది - చేయుచున్నవి" అనురీతిని-'ది-వి' అనునవె వెలసియున్నవి. 'అ-ఇ-ఉ' స్త్రీ విషయాః' (ఆం. చిం.) ('వ్యా. సం.' ౨౧౭ I. ౨౨౧ విష.) అను చొప్పునఁ దెల్గున 'అ-ఇ-ఉ' అనునవి స్త్రీ ప్రత్యయములగుటం జేసియు నందును స్త్రీత్వద్యోతకత్వమున 'ఇ' అనునది ముఖ్యమగుటం జేసియు 'ఇ' కారము 'అదు-ఇదు' శబ్దములపై నిల్చి స్త్రీవాచకత్వమును దెల్గున ఘటించెనని తోఁచుచున్నది. ఈ సూత్రము చొప్పునసె యచ్చాంధ్రమున 'అ-ఇ-ఉ-ఎ' అనునవి తుదినిగల శబ్దములెల్ల స్త్రీసమములయి సంస్కృతసమ స్త్రీలింగ శబ్దములవలెఁ బ్రథమైక వచనలోపము నందుచున్నవి. ఉదా:—అమ్మ - అయ్య - గోడ - తల్లి - తండ్రి - వెలఁది - కొలఁది - చిగురు. మొ.

కర్ణాటమందును-'ళ్' అనుదాని తోపాటుగ 'ఇతి-తి-ఎ' అనునవియును దమిఁలమున 'త్తి-తి' అనునవియును స్త్రీప్రత్యయములు గలవు.

౭౪. II విష:—"స్త్రీవాచకైక వచనము:— తెలుఁగు భాషలో నపుంసకైక వచనమె స్త్రీవాచకైక వచనమై యున్నది. తక్కిన ద్రావిడభాషలలో నపుంసక లింగైకవచనమునకు భిన్నమగు స్త్రీవాచకైకవచనరూపము గలదు. అఱవ మలయాళ ప్రాచీన కన్నడములలో స్త్రీవాచక ప్రత్యయము 'అళ్' అనునది. ఉదా:—తమి-అ + అళ్ = అవళ్ = (ఆ స్త్రీ). నపుంసకలింగములకును గుణ

క్రియావాచకములకును నీ ప్రత్యయమును జేర్చుటచేత నవి గుణక్రియా నామవాచకము లగుచున్నవి. ఉదా:—తమి-మగళ్ =(కూఁతురు) మగన్= (కొడుకు) (మగశబ్ద మపత్యార్థకము). 'ఇల్లాళ్-ఇల్లాన్' అనునవి 'ఇల్' శబ్ద మునకు 'అవళ్-అవన్' శబ్దములను జేర్చుటచేతఁ బరిణమించిన నామవాచక రూపములు." (కాల్డు. ౨౨౭ పుట).

విమర్శము:—అది శబ్దవ్యవహారమునుబట్టి దొరగారు వ్రాసినవ్రాఁత కేవలము ప్రామాదికము. ఈ విషయ మీ వఱకు విమర్శింపఁబడెను. (చూ. ౭౧ VI విమ). తెల్గున నపుంసలింగైకవచన ప్రత్యయ మనఁగా నమహాత్ ప్రథమైక వచన 'ము' ప్రత్యయము స్త్రీలింగ స్త్రీసమములకు రానేరదు. ఉదా:—నపుం-బియ్యము - నెయ్యము - అల్లము - మొల్లము - మొ. స్త్రీలింగ-రమ - గౌరి - మొ. స్త్రీసమ-తల్లి-తండ్రి-అన్న-అమ్మ-గోడ-మేడ-మొ.

తమిఁట కన్నడములందలి స్త్రీవాచక ప్రత్యయము 'అళ్' అనునది కాదు. ళకారమాత్రము. 'ళ ౦కాన్......' (తొల్కా. ౪౯౯ సూ.)= స్త్రీలను దెల్పు శబ్దములు ళకారాంతములై యుండును. అళ్ంతరూపములలోని 'అ' శబ్దము తద్వత్త్వార్థకము. ఉదా:—"అ+వ్+అ+ళ్=అవళ్" అను దాని లోని రెండవ 'అ' శబ్దము తద్వత్త్వార్థకము. దీనిలోని మొదటి 'అ' శబ్దము దూరస్థితి నిర్దేశవాచక సర్వనామము. తర్వాతి 'వ'కారము స్వరసంహితా వ్యవధాయక వర్ణము. తర్వాతి 'అ' శబ్ద మట్టి దూరస్థితిమత్త్వమును దెల్పును. ళకారము స్త్రీత్వవాచకము. దూరస్థితిగల స్త్రీ యని యర్థము. (చూడు 23 II, III విమ). ఇట్లు 'అళ్' అను దానిలోని 'అ' శబ్దము తద్వత్త్వార్థకమగుటచేతనే దీని మేళనమున గుణక్రియావాచకములు గుణక్రియావన్నామవాచకము లగు చున్నవి. ఉదా:—మూప్పు=(వృద్ధత్వము)-మూప్పళ్ =(వృద్ధస్త్రీ). కాప్పు= (సంరక్షణము) - కాప్పళ్ =(సంరక్షణముగల స్త్రీ). "విల్లు+అవన్=విల్లవన్= విల్లాన్" అను దానివలెనె "ఇల్+అవన్=ఇల్లవన్=ఇల్లాన్; ఇల్+అవళ్= ఇల్లవళ్ = ఇల్లాళ్ = (గృహస్థుఁడు - గృహస్థురాలు)" అనునవి యేర్పడెనని తెలియనగును.

౭౮. III విమ:—"తమిఁట కన్నడములలోని స్త్రీవాచకమగు 'అళ్' ప్రత్య యమునకు సరియగు 'ఆలు' ప్రత్యయము తెల్గున నరుదుగఁగలదు. కు భాషలోఁ బ్రచురమైయున్న యీ శబ్దము 'అళ్' అను తమిఁటశబ్దముయొక్క వ్యుత్పత్తిని నర్థమును విశదపఱుచుచున్నది. తెలుఁగులోని 'ఆలు' శబ్దమునకు 'స్త్రీ-భార్య' అను నర్థములు గ్రాంథిక గ్రామ్యభాషలు రెంటను గలవు. గోండుభాషలోని స్త్ర్యర్థకమగు 'ఆర్' శబ్దము దీనిని సంబంధించినదె. సంస్కృతమున 'ఆలి=సఖి'

అను శబ్దము గలదు. తెల్గు 'ఆలు' శబ్దము 'అల్' అనునదిగా మాఱి తుదికి 'అళ్' అను (తమిల స్త్రీవాచక ప్రత్యయము) నదిగ నేర్పడెను. ఆలు ప్రత్యయము 'మనుమరాలు' అను దానిలోఁ బూర్ణముగా నున్నది. మఱఁదలు-కోడలు మున్నగువానిలో 'అల్' అను భాగము సయితము చూపట్టుచున్నది. తెల్గు లోని 'ఆడు' శబ్దముకూడ 'ల డ' వ్యత్యాసమున దీనినుండియే యేర్పడియుండును. 'అళ్' అను నీ స్త్రీవాచకైకవచనము తమిలక్రియలలోను సర్వనామములోను గన్పట్టుచున్నది. నపుంసకవాచకమగు 'అది' అను తెల్గుశబ్దము తుది 'ది' అనునది తెల్గులోని స్త్రీకర్తృక క్రియలలో నిల్చుచున్నది." (కాల్డు. ౨౨౭-౨౨౮ పుటలు).

విమర్శము:—తెల్గున 'ఆలు'. అనునది ప్రత్యయముకాదు. పృథక్ ప్రయోగ యోగ్యమగు శబ్దవిశేషము. అది తెల్గున మిక్కిలి ప్రచురము. అరుదు వాడుక గలది కాదు. తెల్గులోని 'ఆలు' శబ్దమునుండి 'అళ్' అను తమిల స్త్రీవాచక ప్రత్యయ మేర్పడె ననుట విశ్వసనీయముకాదు. దొరగారిక్లె తమిల పుంవాచక ప్రత్యయమగు 'అన్' అనునదియుఁ దెలుఁగులోని 'అన్న=అన' అనుదానినుండి యేర్పడెనని యేల వ్రాయలేదో తెలియకున్నది. 'అన్-అళ్' అనునవి యఖండ ప్రత్యయములు కావనియు వానిలోని నకార ళకారములు మాత్రమె పుం స్త్రీవాచక ప్రత్యయములనియు నీవఱకు విశదీకరింపఁబడెను. (చూ. 23 II విష). అరయనరయఁ దమిల పలుగన్నడ ప్రసిద్ధమగు 'అవళ్'=(ఆ స్త్రీ) శబ్దమునుండియే తెల్గులోని యీ 'ఆలు' శబ్దము వకారలోపమున నేర్పడెనని తోఁచుచున్నది. అదియే మఱఁదలు మున్నగువానిలోని 'అలు' అను దానికిని 'ఆఁడు' శబ్దమునకును (ఆఁడుది) 'కు' భాషలోని 'ఆళు' శబ్దమునకును (చూ. కాల్డు. ౨౨౭ పుట). మూల మనఁదగును.

౭౪. IV విష:—"విశేషణ నామవాచకములలో మఱియొక విధమగు స్త్రీ ప్రత్యయములు 'ది - అత్తి - త్తి - ఇతి - తి' అను రీతిగలవి చూపట్టుచున్నవి. ఇవి తెల్గులోని 'అది' శబ్దము నందలి 'ది' అను దానినుండి యేర్పడియుండునని నా యభిప్రాయము. తెల్గులోని నపుంసకమగు 'అది' శబ్దము స్త్రీవాచకముగాఁ వాడఁబడు నలవాటుచేత నిది యేర్పడియుండును. తెల్గున నీ 'ది' ప్రత్యయము నామవాచక విశేషణముల తుదిని క్రియలలోను గన్పట్టుచున్నది. ఉదా:—కోమటిది-మాలది-చిన్నది మొ. 'అత్తి-త్తి' అను ప్రత్యయములు తమిలమునఁ గలవు. ఉదా:—వెళ్ళాళత్తి=(కాపుది-వ్యవసాయపుది). వెళ్ళాళన్=(వ్యవసాయదారుఁడు). ఒరుత్తి=(ఒకతె)-ఒరువన్=(ఒకఁడు). వణ్ణాత్తి=(చాకలది) వణ్ణాన్=(చాకలవాఁడు). 'ఇతి-తి' అనునవి

కన్నడమునఁ గన్పట్టుచున్నవి. ఉదా:—అరసితి=(రాణి). ఒక్కంతి=(వ్యవసాయపుది=కాపుది)." (కాల్డు. ౨౨౫ పుట).

"సంస్కృతభాషానుకరణమునంజేసి కావలయు ద్రావిడభాషలలో విశేషణములకు విశేష్య విభక్తియందు 'ఇ' అను స్త్రీలింగైకవచన ప్రత్యయము నిల్చుచున్నది. ఇది తద్భవములలోఁ బ్రచురము. దేశ్యములందును నరుదుగఁ గలదు. ఉదా:—తమి:—తల(లై?) వి=(తలగల స్త్రీ=గొప్ప స్త్రీ) - తల (లై?) వన్=(ఒక ప్రభువు). ఇది 'తలై'=(శిరస్సు) శబ్దమునుండి యేర్పడినది. గోండు భాషలో పెర్ద్ గల్=(కుఱ్ఱవాఁడు) - పెర్ద్ గి=(కుఱ్ఱది)." (కాల్డు. ౨౨౯ పుట).

విమర్శము:—డా. కాల్డువెల్లుగా రరుదనుచు దమిళమందు మాత్ర ముదాహరించిన స్త్రీ ప్రత్యయములు పలుగన్న డాంధ్రములలో విస్తృతముగ నున్నవి. తెల్గున 'తి-త-తె' అను స్త్రీ ప్రత్యయములు గలవనియు వానిలో ముఖ్యమగు 'తి' ('తి' లోని 'ఇ' అనునది. చూ. ౩౬౭ పుట.) అనునదియె 'ది' అనుదానికి మూలమనియు నీవఱకు వివరింపఁబడెను. (చూ. ౭౮ I విష). తెల్గున-పాఱుత (బ్రాహ్మణి) ముట్టుత (రజస్వల) మిండత (విటి) గుబ్బెత=(యువతి=పెద్దకుచములు గలది) ఆటకత్తియ=ఆటకత్తె. చెంచెత=చెంచిత-మాలెత-చాకిత-ఒకత-ఒకతి-ఒకతె. ఎవత-ఎవతి-ఎవతె-మొదలగు పెక్కు స్త్రీ ప్రత్యయాంతరూపము లాంధ్రవ్యాకరణములలో వివరింపఁబడెను. స్త్రీ ప్రత్యయములు సంస్కృతమునఁ దద్ధితాధికారమున లేకున్నను నాంధ్రవ్యాకర్తలు వీనిని దద్ధితప్రకరణమందె పెక్కిటిని వివరించిరి. 'ఇ' అనుతద్ధిత ప్రత్యయమును దెలుఁగునఁ గలదు.

"ఇవర్ణకం బోయారామలకు మతుబర్థంబునం దగు" (బాల. తద్ధి. ౧౫ సూ.) ఉదా:—బిత్తరి. (బిత్తరముగల స్త్రీ) ఓయారి=ఒయారి=ఒయ్యారి=(ఒయ్యారముగల స్త్రీ).

"తవర్ణకంబు కులవాచకంబునకు ప్రవాచ్యంబగునపుడు మతుబర్థంబునం దగు" (బాల. తద్ధి. ౧౯ సూ). ఉదా:—చాకిత-కోంఅవత-మొ.

"యువతీ-విటీ రజస్వలలు గుబ్బెత-మిండత-ముట్టుతలు నాఁబడును" (బాల. తద్ధి. ౨౧ సూ).

"కా-కత్తియ (కత్తె) వర్ణకంబులు పుంస్త్వ స్త్రీత్వంబుల మతుబర్థంబునం దాటాదులకగు" (బాల. తద్ధి. ౧౧ సూ). ఉదా:—ఆటకత్తియ=ఆటకత్తె-మొ.

"కా-కత్తియలు కొండొకవానికి స్వార్థంబునం జూపట్టెడు" (బాల. తద్ధి. ౧౩ సూ.) చెలికత్తె-మొ.

"దీనికి (ఒక శబ్దంబునకు) మహతి వాచ్యంబగునపు డేకత్వంబున వక్ష్యమాణ రూపంబు లెఱుంగునది"-(ఒకరిత-ఒకర్త-ఒక్కరిత-ఒక్కొరిత-మొదలగు నవి యేఁబదికిఁ బైఁగా నుదాహరింపఁబడెను.) (బాల. అచ్చి. ౧౫ సూ).

"మహతి వాచ్యంబగునే నేకత్వంబున యత్కిమర్థకశబ్దంబు (ఏ) ఎవ్వరిత-ఎవ్వర్త......అని యిరువదిరెండు రూపంబులు వడయు" (బాల. అచ్చి. $\frac{౭}{౨౮}$ వ్యా. సం. ౨౧౭ II విష).

కన్నడమునం దింతకంటె విస్తృతముగ స్త్రీ ప్రత్యయములు గలవు. "ళ్-ఇతి-తి-ఇ-ఎ" అనునవి కర్ణాటవ్యాకరణములందు వివరింపఁబడెను. ఈ క్రింద నుదాహరింపఁబడు కర్ణాటభాషాభూషణ, శబ్దమణిదర్పణములందలి సంక్షేప సూత్రములు కర్ణాటశబ్దానుశాసనమున నిరువది సూత్రములకుఁ బైఁగా సూత్రింపఁబడినవి.

"స్త్రియా మితి చ" (కర్ణా. భూష. ౧౮౮ సూ.)=స్త్రీత్వమునఁ బూర్వోక్త ప్రత్యయముల పైని 'ఇతి' ప్రత్యయము బహుళముగ నగును. ఉదా:—బాణసిగితి=(వంటది). (బాణసిగ+ఇతి). మడివళితి = (మడివళ + ఇతి =(చాకిత) ఘుట్టివళితి=(ఘుట్టివళ+ఇతి=(గంధము దీయు స్త్రీ).

"ఇ లోపః పరిణామినః" (కర్ణా. భూష. ౧౮౯ సూ.)=ఆదేశి శబ్దమునకుఁ బరమగు 'ఇతి' ప్రత్యయము యొక్క 'ఇ' కారము లోపించును. ఉదా:—బళెగార్త్తి = (గాజులది). గెల్లగార్త్తి = (విజయశీలిని). ఆటగార్త్తి = (నటి) ఇట్టి రూపములె తెల్గు 'కత్తె-కత్తియ' అను వానికి మూలమని తోఁచెడిని).

"అళేచ గుణవచనేభ్యః" (కర్ణా. భూ. ౧౯౦ సూ.)=గుణవాచకములకు స్త్రీత్వమున 'అళ్-ఎ' ప్రత్యయములగును. ఉదా:—ఒళ్ళిదళ్=(మంచి స్త్రీ). నల్లళ్ =(ప్రియురాలు). పొల్లళ్ = (దుష్టురాలు). ఎ:—చదురె = (చతుర). పాణ్బె=(జారిణి). జాణె=(ప్రౌఢ).

"ఇ దు దన్తం పుంసి వా" (కర్ణా. భూ. ౧౯౧ సూ.)=ఇకారాంతములును 'ఉ' కారాంతములును బుంవాచక రూపముతో సమముగనె స్త్రీవాచకములును విభాష నగును. ఉదా:—నాణిలి = (లజ్జాహీనుఁడు-లజ్జాహీన). మాతాళి = (వాచాలుఁడు-వాచాల). గాళు=(భ్రష్టుఁడు-భ్రష్ట).

క. "కాంతా విషయదొళాద మ। దంత క్కితియుం తదాది లోపము మక్కుం। భ్రాంతెం నళంతముం నెగ। ల్గుం తోఱదద ర్కదంతదల్లి వికల్పం" (శబ్దమణి దర్పణము-౨౦౮ వ.)

కర్ణాట శబ్దానుశాసనమున నిరువదిటికిఁ బైఁగా స్త్రీ ప్రత్యయ విధాయక సూత్రము లుండుటచేత వానిలోఁ గొన్ని మాత్రమె యుదాహరింపఁబడుచున్నవి.

"అతో౽నేకత్వే చాద్వాది గుణోక్తేః" (కర్ణాట శబ్దా ౧౮౮ సూ.)= అకారాన్తానా మద్వాదీనాం గుణవచనానాం చ 'ళు' గాగమో భవతి, ఏకత్వే అనేకత్వేచ స్త్రీలింగవిషయే. (అదు)-అవళ్. (ఇదు)-ఇవళ్. (ఉదు)-ఉవళ్. (అకారాన్త)-పెఱళ్=(అన్య స్త్రీ) (గుణ)-కరియళ్=(నల్లని స్త్రీ).

"జాతిశబ్దా దితిః" (కర్ణాట శబ్దా ౧౯౦ సూ.)=అకారాన్తాత్ జాతి వాచకాత్ శబ్దాత్ 'ఇతి' ప్రత్యయో భవతి స్త్రియాం విషయే. ఉదా:— బ్రాహ్మణితి (బ్రాహ్మణ స్త్రీ), అరసితి=(రాజ స్త్రీ=రాణి). కన్నడిగితి= (కన్నడ స్త్రీ).

"పుంయోగే." (కర్ణాట శబ్దా ౧౯౧ సూ.)=అకారాన్తాత్ శబ్దాత్ పుంయోగేర్థే ఇతి ప్రత్యయో భవతి స్త్రియాం విషయే. ఉదా:—అరసన పెండతి=అరసితి=(రాజు భార్య).

"గోగాది శ్చ" (కర్ణాట శబ్దా. ౧౯౩ సూ.)='గ' ప్రత్యయాన్తాత్ ఉగ ప్రత్యయాన్తాచ్చ శబ్దాత్ 'ఇ' ప్రత్యయోభవతి. చకారాత్ 'ఇతి' ప్రత్యయశ్చ. స్త్రియాం విషయే. ఉదా:—లంచగి=లంచగితి=(లంచగొండి స్త్రీ).

"అప్కాత్" (కర్ణాట శబ్దా. ౧౯౪ సూ.)=అప్ప్రత్యయాన్తాత్ కప్రత్యయాన్తాచ్చ శబ్దాత్ 'ఇ' ప్రత్యయో భవతి స్త్రియాం విషయే. ఉదా:— ముదుకి=(వృద్ధ స్త్రీ).

౭౫. I విష:—ద్రావిడభాషలలోఁ దెల్లున 'అ' కారాంతములగు నమహ ద్వాచకములు 'ము' ప్రత్యయాంతములై యుండును. సర్వనామములలో 'అది' శబ్దము పరోక్ష స్థిత వస్తువును దెల్పు నమహద్వాచకము. 'ఇది' శబ్దము సమీపస్థ వస్తువాచక సర్వనామామహద్వాచకము. మధ్యస్థితిని దెల్పు 'ఉ' శబ్దము తెల్గున నంతరించిన దనవచ్చును. "ఉల్ల తెల్లని తురగోత్తము వాలంబు" అని ('అల్ల ఇల్ల' శబ్దములవంటిది) నన్నయవాడిన దొక్క ప్రయోగ మగపడుచున్నది. తమిళ కన్నడములలో 'అదు-ఇదు-ఉదు' అనునవి ప్రథమ పురుష సర్వనామైకవచనములు. నీ-నా-తా శబ్దరూపములు మూఁడు లింగము లందును నేకరీతినె యుండును. తమిళమందును 'ము' ప్రత్యయాంత నామ వాచకములవంటివి గలవుగాని వానిలో ననేకములు నపుంసక ద్యోతకములు కావు. అవి క్రియలను నామములనుగాఁ జేయుటకుఁ జేరిన 'అమ్' అను దానితోఁ గూడినవి. ఉదా:—తమి-ఆగు-ధా:—ఆక్కమ్=(వృద్ధి). మీఁద

వ్రాసిన 'అదు-ఇదు' అనువాని తుది 'దు' వర్ణము విధేయ విశేషణములయుఁ గ్రియలయుఁ దుదిని నమహత్వ ద్యోతకములై నిల్చును.

"ఒన్రఱికిళవి......" (తొల్కా-౪౯౧ సూ.) = అమహదేకవచనమును దెల్పు తమిళ ప్రత్యయములు 'తు-ఱు-టు' అనునవి. ఉదా:— అతు(దు)=(అది) ఇతు(దు)=(ఇది) ఉతు(దు)=(ఇది). పోయిట్రు=(పో+ఇన్+ఱు (తు)=(అది పోయెను). కట్టు=(కణ్+టు (తు)). కుణ్డుకట్టు=(లోతైన చోటు గలదై కన్పట్టుచున్నది).

౭౫. II విష:—"ద్రావిడ శబ్దములెల్ల సహజముగా నపుంసకలింగములె యనఁగాఁ బుం స్త్రీవాచక భిన్నములె (Caste less). అట్టి నపుంసకములకుఁ బురుషవాచక మహతీవాచక ప్రత్యయములు చేరుటచేత నవి పుంవాచకములు స్త్రీ వాచకములు ననఁబడును. సంస్కృత శబ్దములు ద్రావిడ భాషలలోనికి వచ్చునపుడు వాని తుదిని జేరు 'అమ్' ప్రత్యయము నపుంసక ద్యోతకము కావచ్చును. ద్రావిడ భాషలందును గొన్నిచోట్ల 'అమ్' ప్రత్యయాంతములు నపుంసక ద్యోతకములగుట కలదుగాని తమిళమున ననేక స్థలములందు 'అమ్' అనునది క్రియలను నామములనుగా మార్చు ప్రత్యయమై యున్నది. ఉదా:— తమి:—(ఆగు-ధా.) ఆక్కమ్=(వృద్ధి). (వీఙ్గు-ధా=ఉబ్బు) వీక్కమ్=(ఉబ్బుట). (అఞ్జ్+ఉ. ధా.=భీతిల్లు) అచ్చమ్=(భయము). (కూడ్+ఉ. ధా.=కలయు) కూట్టమ్ = (కూడిక). (తోణ్డ్ + ఉ. ధా. = త్రవ్వు) - తోట్టమ్ = (తోఁట). (సీన్ద్+ఉ. ధా.=సీటిమీఁదఁ దేలు)-నీత్తమ్=(ఈఁదుట). (విరుమ్బ్+ఉ. ధా.= కోరు)-(విరుప్పమ్=(కోరిక)" కాల్డు. ౨౨౫ పుట) (చూడు ౧౯౬ I విష).

విమర్శము:—ఈ సందర్భమున దొరగారు పున్నపుంసక శబ్దములను వాడుటకన్న మహ దమహ చ్ఛబ్దములను వాడుట యుక్తము. నకారము పుంస్త్వమును దెల్పునది కాదు, మహత్త్వవాచకము. అట్లె ళకారము స్త్రీ లింగ వాచకము కాదు, మహతీత్వవాచకము. ప్రాచీనతమ కాలమున మహ దమహత్సాధారణముగా "తదాది శబ్దముల కభిన్నములగు (చూడు. ౭౫ V విష.) 'అదు-ఇదు' మున్నగువాని తుది 'తు' వర్ణమె ప్రథమైక వచన ప్రత్యయమై యుండెడిది. (చూడు. ౬౦ X విష. కురుట్టు=అంధుఁడు) కాల క్రమమున నకారము మహద్వాచక ప్రత్యయముగను ళకారము మహతీవాచక ప్రత్యయముగను నేర్పడిన పిదప 'తు' అనునది యమహద్వాచక ప్రత్యయముగా నిల్చిపోయినది. అమహత్తులకు సంస్కృత వాసనచే 'అమ్' అనునది యేకవచన ప్రత్యయ మేర్పడెను. 'ఆక్కమ్' మున్నగువానిలోని 'అమ్' అనునది ధాతువును నామవాచకముగాఁ జేయు కృత్ ప్రత్యయ మనుటయె యుక్తము."

౭౫. III విష:—“ద్రావిడ వైయాకరణులు మహన్మహతీవాచక భిన్నము లెల్ల నపుంసకములె యందురు. అవి పుంవ్యక్తులను దెల్పినను (ఎద్దు) స్త్రీ వ్యక్తులను దెల్పినను (ఆవు) నపుంసకములె. అట్టి వ్యక్తుల పుంస్త్వ స్త్రీత్వములను దెల్పుటకు వాని ముందట్టి యర్థమును దెల్పు శబ్దములను జేర్చుకొనవలెను. (మగ పక్షి-ఆఁడు పక్షి) వానినిదెల్పు సర్వనామమును నపుంసకమె యై యుండవలెను. కావుననే ద్రావిడ భాషలలో నపుంసకతా ద్యోతక ప్రత్యయమున కంతగా నావశ్యకత లేదయ్యెను. ఇంక సర్వనామశబ్దము తుది వర్ణమె నపుంసక ప్రత్యయ మగుచున్నది. ‘అదు-ఇదు’ అనునవి తమిళ కన్నడములలోను, ‘అది-ఇది’ అనునవి తెలుఁగులోను, ‘అద్-ఇద్’ అనునవి గోందుభాషలోను నపుంసక సర్వనామములు.” (కాల్డు. ౨౩౦ పుట).

తుళుభాషలోఁ దచ్ఛబ్ద దకారము లోపించినది. అందు ‘అవు’ అనఁగా ‘అది’ యని యర్థము. డా. గుండర్టుగా రిది యపభ్రంశమనియుఁ, దుళులో సైతము ‘ద’ కార ముండెడిదనియుఁ జెప్పుచు “అత్తె కాదు=(అది కాదు)” అనుదానిలో ‘త’ కార మున్నదని చూపిరి. దీని ప్రాచీన రూపము ‘అల్దు’ “దీనికి సరియగు తమిళ రూపములు-అల్లాద్=అంద్రు (అన్రు) అది కాదు. అల్దు. వీనిలో సర్వనామశబ్ద భాగము ‘ద్-దు’ అనునవి గలవు.” (కాల్డు. ౨౩౦ పుట).

విమర్శము:—‘ఆవు-ఎద్దు’ మున్నగు వానినిదెల్పు శబ్దములు ‘నపుంసకము’లనుట ద్రావిడ వైయాకరణ సంప్రదాయము కాదు. అవి యమహత్తులు. మహన్మహతీ వాచకములు కావనుటలో వింత యే మున్నది? తెల్గున మహతీత రామహత్త్వ ద్యోతకము ‘ము’ ప్రత్యయము గలదు. అమహత్సర్వనామ శబ్దము తుదివర్ణ మమహత్త్వద్యోతక ప్రత్యయమగుట సహజమె కదా!

౭౫. IV విష:—“క్రియలలోను నీ సర్వనామ శబ్దభాగము నిల్చును. ‘అదు-ఇదు’ అనువానిలోని మొదటి స్వరము సర్వనామ శబ్దభాగము గానఁ దుది దకార భాగము నపుంసకైకవచన ప్రత్యయ మనఁదగును. కావునని యిది ‘అవ’ మున్నగు బహువచన (మలయాళ) రూపములలో నిలువనేరదు” (కాల్డు. ౨౩౦ పుట).

“క్రియలతుదినేకాక విశేష్యముగ వివక్షింపఁబడు విశేషణముల (Appellative) = (విధేయ విశేషణము) తుదిని సయిత మీ సర్వనామభాగము నిల్చును. సంధివశమున నీ దకారము మాఱుటయుఁ గలదు. ఉదా:— తమి-నల్లదు = (మంచివస్తువు). అల్దు=అంద్రు (న్రు) =(కానిది-అదికాదు). పోగిర(అ)దు=(వెళ్ళుట) పోనదు=(వెళ్ళినది) పోవదు=(వెళ్ళునది)” (కాల్డు. ౨౩౧ పుట).

విమర్శనము:—క్రియలలో నిల్చుటకు. ఉదా:—ఏనుఁగు గలదు. పక్షి యెగురుచున్నది. మొ. 'పోగిరదు' అనుదానికి వెళ్ళుచున్న వ్యక్తి యని యర్థము.

౭౫. V విష:—"ఇట్టి సర్వనామ దకారభాగమున కిండో యూరపియను భాషలతో సంబంధము కన్పట్టుచున్నది. సంస్కృతము:—త్యద్-తద్-యద్-ఎతద్-అదస్ (అదత్ ప్రాచీనరూపము). లాటిన్-ఇల్లుద్-ఇద్ (ఇది). ఇంగ్లీషు-ఇట్ 'It'. వేదమున-'ఇత్' (అవ్యయము) అని యున్నది. 'న+ఇత్=నేత్' అనుదానికి సరియగు తెల్గుశబ్దము 'లేనిది.' అనునది. కాని యీ దకారము సంస్కృతమునుండి ద్రావిడభాషలకు రాలేదు. ద్రావిడభాషలలో 'అ=ఆ' శబ్దములు పరోక్షతా వాచకములగుచుండఁగా సంస్కృతమున నట్లులేదు. సంస్కృతమునఁ బరోక్షతావాచక సర్వనామము 'తద్' అనునది. ఇతరములగు నిండోయూరపియను భాషలలో ద్రావిడ భాషలందువలెనె 'అ' శబ్దము పరోక్షస్థితివాచి, 'ఇ' శబ్దము సమీపస్థితివాచి, కాన నీ సర్వనామ శబ్ద గత 'ద' కారము సంస్కృతమునుండి రాలేదు. సంస్కృతమున కెందుండి వచ్చెనో ద్రావిడభాషలలోనికిని దానినుండియే వచ్చెననుట యుక్తము" (కాల్డు. ౨౩౧ పుట).

విమర్శనము:—ఏమి పట్టుదల! సంస్కృత సంబంధమున్నదన్నచో ద్రావిడ భాషలు సంస్కృత ప్రాకృత జన్యములనెడి వాదము బలపడునని దొరగారి భీతి! ఇంతమాత్రమున జన్యజనకభావము స్థిరపడునా? భాషల జన్యజనకభావమును నిర్ణయించు విషయము వేఱుగదా. (చూడు. ౧౨ విష). ఇతరములగు నిండో యూరపియను భాషలలోని 'అ' శబ్దస్థితిని దొరగా రుదాహరింపలేదు గదా. సంస్కృతమునందలి 'తద్' అనుదానివంటి దిండో యూరపియను శాఖలోని యింగ్లీషునందును 'That' అనునదియుఁ గలదు గదా! తచ్ఛబ్దాదిగత 'తకారము' లోపింపఁగా 'అద్' అనియేకదా మిగులును! ఈ విషయమున నింగ్లీషులోని 'This' అనుదానిని బరిశీలింపనగును. దొరగా రెంత యొడఁ బెట్టుచున్నను మధ్యాసియా సహవాసరూప ప్రాచీన సంబంధమునను, నిండో యూరపియను భాషలును ద్రావిడభాషలును నేదో యొక యాదిమభాషనుండి యేర్పడినవని యైన నంగీకరింప తీరకుండుటను వానికిఁ గల యాంతరంగిక సంబంధము దాఁగనేరదు గదా. (చూడు. ౮ విష).

'త్యద్-తద్' ప్రభృతి శబ్దములును 'అదు-ఇదు' ప్రభృతిశబ్దములును బరస్పర సంబంధము గలవనుటకు సందియము లేదు.

౭౬. I విష:—౭౪ I విషయమున ద్రావిడ బహువచన ప్రత్యయములు కొంత వివరింపఁబడెను. తెల్గున సర్వనామములలో సాధారణముగా 'రు' అనునది మహన్మహతీ వాచక బహువచన ప్రత్యయము. "ఇద్దఱు-అందఱు-ఇందఱు-ఎందఱు-కొందఱు-మేము-తాము-వారలు-వీరలు-మీరలు" మున్నగునవి యపవాద రూపములు. నామవాచకములందును లాంతములందు 'రు' ప్రత్యయమె బహువచనమున నిల్చును. ఉదా:—బాలురు-నృపాలురు-మొ. తక్కిన నామవాచకము లందంతటను మహన్మహత్యమహద్బహువచన ప్రత్యయము 'రు' ప్రత్యయ రూపాంతరమగు 'లు' ప్రత్యయమె. ఉదా:—రాములు - సీతలు - కొమరులు - తల్లులు - వనములు - గోడలు - మేడలు - మొ. ఒకరువులు ఒకళ్ళు మొదలగు నేకత్వవాచక సర్వనామములందును వారలు వీరలు మీరలు మున్నగు సర్వనామములందును నియ్యది వ్యాపించియున్నది. తెల్గున సర్వనామామహద్బహువచనము "అవి-ఇవి-ఏవి-అన్ని-ఇన్ని-ఎన్ని-కొన్ని" మొదలగునవి విశేషరూపములు. నీ-నా-తా-మన-శబ్దములు మహదమహత్తులం దంతటను నేకరీతినె యుండును.

"భవే త్తదాదిశబ్దే వో । డుజాదిస్తు భవే న్న చోత్ । జసఃస్థానే రు రత్ర స్యాత్ । క్వచి దత్వం భవే ల్లు లే......" (వ్యా. సం. ౨౧౫ విష).

"లు జసో ల శసో ఉలాన్తా । ల్లాన్తాత్తు రు రౌ తయోః క్రమేణ స్తః" (ఆం. చిం.) ('వ్యా. సం.' ౧౩౫-౧౪౪ విష).

"దేశ్యా దస్థ ద్వ్యష్మ చ్ఛబ్దా । త్సు జసో ర్న్న మూ వు రూచ తత్ర స్తః ......ద్వయవ ద్వచన ద్వయే న్యయో రాత్మా" (వ్యా. సం. ౨౧౯ విష.) "ద్యన్తా త్తదాది శబ్దాత్ స్యా । ద్బహుత్వే తు వివర్ణకః । ......" (వ్యా. సం. ౨౧౫ I విష.) మొ.

పటిగన్నడమున 'మ్' అనునదియే యేకత్వ బహుత్వములందుఁ బ్రథమా ప్రత్యయము. ఇట్టిదానికిఁ బూర్వమున 'గళ్' అను నాగమము బహుత్వమున నిల్చును. అకారాంతేతరముల మీఁది ప్రథమా ప్రత్యయము 'మ్' అనునది లోపించును. మహన్మహతీ వాచకములకు బహుత్వమున 'గళ్' అనుదాని కపవాదముగ "అర్-ఇర్-విర్-డిర్" అనువానిలో నేదేని యాగమము నిల్చును. దానిపైని గొన్నిమొడల 'కళ్' అను నాగమము పాక్షికముగా నిల్చును—ఉదా:-(దేవశబ్దము-ఏక) దేవం-(బ) దేవర్-దేవర్కళ్=(దేవతలు). కణ్=(కన్ను). కణ్గళ్=(కన్నులు). మహతీ వాచకము-సీతాశబ్దము. సీతె=(ప్ర-ఏ). సీతెయర్=(సీతలు). అ శబ్దము-అవం = (వాఁడు). అవర్=(వారు). ఇవం=

(వీఁడు)-ఇవర్=(వీరు). ఉవం=(వీఁడు). ఉవర్=(వీరు). అమహద్వాచకములు:—అదు=(అది) అవు=(అవి). ఇదు-ఇవు. ఉదు-ఉవు. ఆం-నాం=(మేము) నీం=(మీరు). విశేష రూపములు.

"తా స్తు మమింకె అదదొళ్" (కర్ణా. భూ. ౩౯ సూ.) = ప్రథమా విభక్తి-మ్-ద్వితీయావి-అమ్......"

"ద్విత్వ బహుత్వయో ర్గళాదా" (కర్ణా. భూ. ౪౦ సూ.)=ద్విత్వ బహుత్వములం దా విభక్తులకుముందు 'గళ్' అను నాగమము నిల్చును.

"సర్వనామ గుణవచనానా మవు తదన్తే" (కర్ణా. భూ. ౪౧ సూ.)=ద్విత్వ బహుత్వములందు సర్వనామములకును గుణవాచకములకును విభక్తులు పరమగుచుండఁగా 'అవు' అను నాగమ మగును. ఉదా:—(ఏ) అది (బ) అవు. (ఏ) ఇది - (బ) ఇవు-మొ.

"స్త్రీ పురుష వాచకే ష్విరర్ దిర్ విర్" (కర్ణా. భూ. ౪౨ సూ.) = స్త్రీ పురుష వాచకములకుఁ బరమగు విభక్తులకు మొదట ద్విత్వ బహుత్వములయందు 'ఇర్-అర్-దిర్-విర్' అనునవి 'గళ్' అనుదాని కపవాదముగా నిల్చును. ఉదా:— దేవర్-అవర్-ఇవర్-మొ.

"అన్యస్మా ల్లోపః" (కర్ణా. భూ. ౪౬ సూ.) = అకారాంతేతర ప్రాతిపదికమునకుఁ బరమగు ప్రథమా ప్రత్యయ 'మ' కారము లోపించును. ఉదా:—అవ+మ్=అవం=(వాఁడు) అవ+అర్+మ్=అవర్=(వారు). దేవ+అర్+మ్=దేవర్. కణ్+గళ్+మ్=కణ్గళ్-మొ.

"స్వార్థేఽతః కళ్" (కర్ణా. భూ. ౪౩ సూ.) = అకారాంతములకుఁ బరముగ నిల్చిన 'అర్-ఇర్-దిర్-విర్' అనువానికిఁ బరముగ స్వార్థమున వికల్పముగ 'కళ్' అనునది నిల్చును. ఉదా:—పండితర్కళ్ = పండితర్ = (పండితులు). మొ.

తమిళమునఁ బుంస్త్రీవాచక బహువచన ప్రత్యయములు 'ర్-ప-మార్' అనునవి. ఉదా:—అవర్ = (వారు). ఎన్ప =(అందురు) తోటిమార్=(చెలికత్తెలు-చెలికాండ్రు).

'కళ్ అ-ఆ' అనునవి తమిళమున నమహద్బహువచన ప్రత్యయములు. ఉదా:—నాయ్=(కుక్క). నాయ్కళ్=కుక్కలు. వన్దన=(వచ్చినవి.) చెయ్యా=(చేయనివి).

విశేషరూపములు:—"అవై = అవ్ = (అవి). ఇవై = ఇవ్ = (ఇవి). ఉవై = ఉవ్ = (ఇవి)." అనునవి నిర్దేశక సర్వనామామహద్బహువచన రూపములు. తామ్=(తాము). నీయిర్ (మీరు). యామ్=(మేము), నామ్=(మనము). ఇవి యుష్మదస్మదాత్మార్థక బహువచన రూపములు.

"రంకాన్......" (తొల్కా. ౪౯౦ సూ.)=పురుషవాచక స్త్రీవాచక శబ్దములుల బహుత్వమును దెల్పు ప్రత్యయములు 'ర్-ప-మార్' అనునవి.

"అ-ఆ-వ......" (తొల్కా. ౪౯౨ సూ.)=అమహత్తులలో బహుత్వమును దెల్పెడి శబ్దములు 'అ-ఆ-వ' అనునవి తుదినిగలవై యుండును. ఉదా:—వన్దన=(వచ్చినవి=వచ్చెను). పొరుళన = వస్తువులు. చెయ్యా = (అవి చేయనివి=చేయవు). ఆకారము వ్యతిరేకార్థములందే యుండును. వరుకువ=(అవి వచ్చెడివి=వచ్చును) ఇదియు 'అ' ప్రత్యయమె యనుట లెస్స. భావి 'ప' కారము 'వ' కారమయి యుండును.

"కళ్ళొడు......" (తొల్కా. ౬౫౩ సూ.) = అమహన్నామముల యేకవచనములు బహువచనము లగునపుడు కొన్ని స్థలములలో 'కళ్' ప్రత్యయము వచ్చును. క్రియనుబట్టి బహుత్వము తెలియనపుడు 'కళ్' ప్రత్యయము నిల్చును. ఉదా:—అవనుమ్ యానైకళుమ్ పోయినర్=(వాఁడును నేనుఁగులును బోయిరి).

"ఇయఱ్పెయర్......" (తొల్కా. ౬౫౮ సూ.)=ఇందు మహదమహత్సామాన్య నామములు వివరింపఁబడెను. తాన్ = (తాను) ఎల్లామ్=(ఎల్ల) నీయిర్=(మీరు) మున్నగునవి పేర్కొనఁబడెను.

"అవ్వఴి......" (తొల్కా. ౬౮౬ సూ.)=పుం-అవన్-ఇవన్-ఉవన్-స్త్రీ-అవళ్-ఇవళ్-ఉవళ్-పుం-స్త్రీ. బ:-అవర్-ఇవర్-ఉవర్. యాన్-యామ్; నామ్; యావన్-యావళ్-యావర్-(చూడు ౬౯౮ సూ).

"అదు-ఇదు......" (తొల్కా. ౬౫౧ సూ.) = అదు-ఇదు-ఉదు-అఃదు. ఇఃదు. ఉః-దు-అవై-ఇవై-ఉవై. అవ్-ఇవ్-ఉవ్. యాదు-యా-యావై.

౭౬. II విష:—"బహువచనము-బహువచనము నేర్పఱుచు విధములు:—ప్రాచీనములగు నిండో యూరపియను భాషలలో నేకత్వ బహుత్వభేదము విభక్తి ప్రత్యయములచేతనె తెలుపఁబడును. సిథి యను భాషలలో నామవాచకముల కేకత్వ బహుత్వ బోధక ప్రత్యయములు లేవు. వాని నచటి సందర్భమునుబట్టి తెలిసికొనవలసినదె. మంచు భాషలోఁ బ్రాణివాచకములకు

మాత్రమె బహువచన ప్రత్యయము చేర్చుట గలదు. తొత్తారు భాషలో సర్వనామములకు మాత్రమె వచనబోధక ప్రత్యయములను జేర్చుట గలదు. బ్రహుయి భాషలో నామవాచకములకు వచన భేదబోధక ప్రత్యయము లుండవు. బహుత్వమున సందర్భబోధక పదములను జేర్పవలయును. క్రియలలో మాత్రము వచన భేదబోధక ప్రత్యయము లుండును. దానినిబట్టి నామవాచకముల వచనమును దెలిసికొనవలయును." (కాల్డు. ౨౩౧ పుట).

"బహువచన విధాన విషయమున ద్రావిడభాష లిండోయూరపియను భాషలను బోలక సిథియను భాషలను బోలుచున్నవి. అఱవభాషలో నపుంసక లింగశబ్దములకు వచనభేదము తెలియదు. దానిని సందర్భమునుబట్టి తెలిసికొనవలసినదె. అద్యతననాగరకుల వ్యవహారభాషలో నట్టి భేదములను దెల్పు ప్రత్యయము లున్నను బ్రాచీన పద్యవాఙ్మయమునందును నద్యతన గ్రామ్య భాషయందును నట్టి ప్రత్యయములు లేవు. ఉదా:—మాడు=ఎద్దు-ఎద్దులు. నాలుమాడు మేయ్‌గిఱదు=(నాల్గు 'ఎద్దు(లు)' మేయుచున్నది). "నాలుమాడుగళ్ మేయ్‌గిన్ఱన"=(నాలుగెద్దులు మేయుచున్నవి) అనువాక్యము తమిళమున మిక్కిలి యసహజముగను కృతకముగను నుండును. ఈ విషయమునఁ దెలుఁగు చాల విలక్షణముగ నున్నది. తెల్గున నిట్టియెడల వచనభేదబోధక ప్రత్యయములు పూర్తిగ నున్నవి. తుదభాషలో సర్వనామములును వానితో నన్వయించు క్రియలును బహువచన ప్రత్యయములతో నుండును. కొడగు భాషలో నపుంసక లింగ బహువచన ప్రత్యయము లేదు." (కాల్డు. ౨౩౨ పుట).

విమర్శము:—ప్రాచీన తమిళమునను నమహద్వాచకములకు బహువచన ప్రత్యయము లేదనరాదు. తొల్కాప్పియమునందే 'కళ్' ప్రత్యయము పేర్కొనఁబడినపుడు ప్రాచీన వాఙ్మయమున లేదనుట యెట్లు పొసఁగును? అది యరుదనిన ననవచ్చును.

"అన్నపిఱవుమ్......" (తొల్కా. ౬౫౮ సూ.)="పైని జెప్పిన యమహన్నామములును నట్టి యితరములగు నమహన్నామములును నేకత్వ బహుత్వ వాచకములై యుండును" అను చొప్పున నమహద్వాచకములగు నామవాచకము లేకత్వమును బహుత్వమును బోధించును గాన వాని యేకత్వ బహుత్వములు క్రియలనుబట్టి తెలిసికొనవలయునని తొల్కాప్పియ మిట్లు వచించుచున్నది.

"తెరినిలై......" (తొల్కా. ౬౫౫ సూ.)=అమహత్తుల యేకత్వ బహుత్వములు తదన్విత క్రియలనుబట్టి తెలిసికొన నగును. ఉదా:—ఆ వన్దదు. (ఆవు వచ్చెను). ఆ వన్దన=(ఆవులు వచ్చినవి.) 'ఆ' శబ్దమునకు 'ఆవు-ఆవులు'

అని యర్థములు గలవు. అట్లు క్రియలవలనఁ దెలిసికొనుటకు వీలుపడనపు డమహాన్నామమును 'కళ్' ప్రత్యయాంతముగాఁ బ్రయోగింపవలయునని తొల్కాప్పియ మిట్లు వచించుచున్నది.

"కళ్ళొడు......" (తొల్కా. ౬౧౩ సూ.)=అమహాన్నామములు బహుత్వమును బోధించునపుడు కొన్నిస్థలములలో 'కళ్' ప్రత్యయమును వాడవలెను. అనఁగాఁ గ్రియలవలన వచన నిర్ణయము కానపు డమహాన్నామమును 'కళ్' ప్రత్యయాంతముగాఁ బ్రయోగింపవలెనని యర్థము. ఉదా:—అవనుమ్ యానైకళుమ్ పోయినర్=(వాఁడును నేనుఁగులును బోయిరి) ఇచట మహత్కర్తృత్వమునం జేసి యిచటి బహుకర్తృక క్రియ మహద్బహువచన రూపముతో నుండవలసెను. ఇచట నేనుఁగని యేకవచనార్థమును గ్రహించినను గ్రియ మహద్బహువచన రూపముతోనే యుండును గాన క్రియవలన నిచటి యమహాన్నామవాచకపు బహుత్వము వ్యక్తపడదు. కావున బహుత్వమును విశదపఱుచుటకై దానిని 'కళ్' ప్రత్యయాంతముగాఁ బ్రయోగింపవలసెనని యెఱుంగునది. తదన్విత క్రియవలన బహుత్వము తెలియునపు డమహాన్నామమును 'కళ్' ప్రత్యయాంతముగఁ బ్రయోగించినచోఁ బునరుక్తి దోషము గల్గునని భావము.

౨౬. III విష:—"అఱవమున నమహాన్నామవాచకములకు బహువచన ప్రత్యయము చేరినను వాని క్రియ లరుదుగ బహువచన ప్రత్యయము నందును. తఱుచుగ నేకవచన క్రియారూపమె బహువచనమున వాడఁబడును. గ్రామ్యాఱవమున నీ పద్ధతి యవ్యభిచరితముగ నున్నది. పద్యగ్రంథములం దఱవమున బహువచన కర్తృక క్రియ కేకవచనరూపమె తఱుచుగా వాడఁబడును. మఱియుఁ దద్ధర్మార్థక ప్రథమ పురుషక్రియకు మహన్మహతీతరనామ బహువచనము కర్తయగునపుడు క్రియకు బహువచన రూప ముండరాదు. ఇట్టి యెడల బహువచననామ మొక సమాసము వంటిదని యనఁగా నచటి బహువచనము సమూహార్థకమని మాక్సుముల్లరు (Max-muller) గారు చెప్పిరి. పయి సందర్భమునుబట్టి ప్రాచీనకాలమున మహ దమహత్తులు రెండిటికిని బహువచన మస్పష్టముగనే యుండుటచేతఁ గ్రియ యేకవచనమున నుండక తీరదయ్యెనని నా యభిప్రాయము. సందర్భమునుబట్టి బహుత్వము గ్రహింపఁదగి యుండెడిది. కాలక్రమమున నాగరకత హెచ్చుటచేత మహన్మహతీ నామములకును దత్కర్తృక క్రియలకును బహువచనరూప మేర్పడి స్థిరపడియుండును. అమహద్బహువచన కర్తృకక్రియ తఱుచుగ నేకవచనమున నుండు పద్ధతి గ్రీకుభాషలో సైతము గలదు" (కాల్డు. ౨౩౩ పుట).

"ద్రావిడ భాషలలోని యేకత్వము నామ సర్వనామములందుం బ్రత్యయములవలన స్పష్టపడమింజేసి స్పష్టముగాఁ దెలుపవలసినపుడట్టి నామమునకుముం దేకత్వబోధక శబ్దము చేర్పఁబడును. ఉదా:—తమి-ఒరు మాడు=(ఒక పశువు). దీనిని బట్టి యింగ్లీషునందువలెనె ద్రావిడ భాషలందు సైతమేకత్వ బోధకశబ్దము చేర్పవలెననుకొని నామ సర్వనామముల కేకత్వ బోధకశబ్దమేళనము దొరలు నిత్యముగాఁ జేయుచుందురు. ఇట్లే బహువచన ప్రత్యయమును నిత్యముగా నపుంసకలింగ నామములకుఁ జేర్చుచుందురు. వాక్యముల సొంపునకై యఱవలు కూడ నిట్లు చేయుటగలదు. కాని యది సర్వసామాన్య విధికాదు. అఱవభాషలోని యీ సంప్రదాయము సిథియను భాషలలో సైతము గలదు" (కాల్డు. ౨౩౩ పుట).

విమర్శము:—కాల్డు వెల్లుగారు వెనుకఁ (౭౬ II విష.) ప్రాచీన పద్య వాఙ్మయమందును నద్యతన గ్రామ్యమునను నమహద్బహువచనబోధక ప్రత్యయమే లేదని వ్రాసి యిచట నమహన్నామములు బహువచన ప్రత్యయాంతములై యుండఁగాఁ గ్రియ లేకవచనాంతములుగనె తఱచుగా వాడఁబడునని వ్రాయుట పూర్వోత్తర సందర్భశూన్యముగా నున్నది. (చూడు ౭౬ II విష.) అన్విత క్రియలవల్లనే యమహన్నామ వాచకముల యేకత్వ బహుత్వములు తెలియవలెనని (చూ. ౭౬ II విష.) (చూ. తొల్కా. ౬౫౫ సూ.) తొల్కాప్పియరు సూత్రించిరి. ప్రాచీన వాఙ్మయమునఁ గర్తృ క్రియలు భిన్న భిన్నవచనములలో నుండుటయే తఱచని దొరగారు వచించుట కేవలము సత్య విదూరమై యున్నది. మిక్కిలి యరుదనుట నిజము. అట్టియెడలఁ బ్రత్యేకాన్వ మెన్ననగును. ఆ పద్ధతి తద్ధర్మార్థక ప్రథమ పురుష స్థలమున మాత్ర మమహత్కర్తృకత్వమున విశేషవిధిగ నున్నదనుట సత్యము.

"పల్లోర్......" (తొల్కా. ౭౧౧ సూ.)=ఉమంత సమాపక క్రియ మధ్యమోత్తమ పురుషములందును మహత్ప్రథమ పురుష బహువచనమునందును రాదు. అనఁగా నమహత్ప్రథమ పురుషైకవచన బహువచనములందును మహత్ప్రథమ పురుషైక వచనమునందును మాత్రమె వచ్చునని యర్థము. ఉదా:—అవన్ వరుమ్ = (వాఁడువచ్చును). అదు వరుమ్ = (అది వచ్చును). అవై వరుమ్ = (అవివచ్చును).

తమిళమందలి యీ యొక్క యమహద్వాచక స్థలమును నాధారముగాఁగొని నామ సర్వనామముల కెల్ల మహన్మహతీ వాచకములకుఁ దత్కర్తృక క్రియలకును బహువచన మస్పష్టమె యని దొరగా రూహించుట కేవలము

పొరపాటు. సర్వనామముల కమహత్తులందును "అవి-ఇవి-అవు-ఇవు-అవ్-ఇమ్-అవై-ఇవై" అను బహువచన రూపము లేకవచన రూపములతోపాటుగ చిర కాలమునుండి వెలసియుండఁగా నామవాచకములలో మహన్మహతీ వాచక ములకు 'న్-ళ్' అనునవి యేకత్వబోధక ప్రత్యయములుగాను 'ర్' అనునది బహు వచన బోధక ప్రత్యయముగాను దొల్కాప్పియము నాఁటికే యేర్పడి యుండఁగా దొరగారిట్లు వ్రాయుట కేవలము నయుక్తము. చరిత్ర తెలియని కేవల ప్రాచీన కాలమున నెల్లభాషలు ధాతుమాత్ర రూపములె యనుట క్రొత్తగా నూహింప వలసిన విషయముకాదు గదా.

పయిరీతి నమహన్నామవాచకేతర స్థలములం దేకవచనము ద్రావిడ భాషలలో సుస్పష్టముగా తెలియఁదగి యుండఁగా "ద్రావిడ భాషలలోని యేకత్వము నామ సర్వనామములందుఁ బ్రత్యయములవలన స్పష్టపడమింజేసి" అని సర్వసాధారణముగా వ్రాయుట కేవలము నసంగతము కాదా? తుది కమహన్నామవాచకముల యేకత్వ బహుత్వములను స్పష్టముగాఁ దెలియు నేర్పాటులు తమిళమున వ్యాకర్తలు చేసియున్నారు గదా. (చూడు ౭౬ II విష.) అజ్ఞులగు నెవరో దొరల వాడుకలకుఁ బరిగణన మేల?

ద్రావిడ భాషలందలి ప్రాచీన పుం స్త్రీవాచక ప్రథమా బహువచన 'రు' ప్రత్యయము తెల్గున సర్వనామములందు మాత్రము నిల్చెననియు దాని రూపాంతరమగు 'లు' ప్రత్యయము నామవాచకములందు మహ దమహత్తుల యందెల్ల వెలసెననియు నీ 'లు' ప్రత్యయ మత్యంత ప్రాచీనాంధ్ర శాసనము లందును (చూ. ౧౮ VII విష.) ధారాళముగాఁ జూపట్టుచుండుటచేత నత్యంత ప్రాచీనమనియు (చూడు ౨౧ XVII విష. ౧౮ VIII విష. ౮ విష.) గ్రహింపవలెను. కేవల ప్రాచీన కాలమున బహువచన ప్రత్యయమే లేని యమహత్తులకును గాలక్రమమున నట్టి 'లు' ప్రత్యయము బహుత్వబోధకముగా నేర్పడెనని తలంపనగును.

౭౬. IV విష:—"ఇండో యూరపియను భాషలకును సిథియను భాషలకును నింకొక భేదము గలదు. ఇండో యూరపియను భాషలలో విభక్తి ప్రత్యయము లేకత్వ బహుత్వములందు భిన్నభిన్న రూపములుగా నుండును. కావున నా ప్రత్యయములు విభక్తిబోధకములు వచనబోధకములును ననవచ్చును. సిథియను భాషలలోని విభక్తి ప్రత్యయము లేకత్వ బహుత్వముల యందొక్క రూపముననే యుండును. అందు బహుత్వము ప్రత్యేకమగు ప్రత్యయములచేఁ దెలుపఁబడును. ఈ బహుత్వబోధక ప్రత్యయ మన్ని విభక్తులలోను నేకరూపముననే యుండును. ఇయ్యది ప్రకృతికిని విభక్తి ప్రత్యయ

మునకును నడుమ నిల్చును. ఇండో యూరపియను భాషలలో నొకటగు గాతికు భాషయందు ద్వితీయా బహువచన ప్రత్యయమగు 'న్స్' అను దానిలోని నకారమునం దేకవచనాకారము సైతమున్నను విభక్తి ప్రత్యయ నకారము పూర్వావయవముగను వచనబోధక 'స' కార ముత్తరావయవముగను సంయోగించి యున్నవి.

పయిని వ్రాసిన సిథియను భాషల లక్షణములు ద్రావిడ భాషలయందుం బూర్తిగ వెలసియున్నవి. ఒక్క తుళు భాషలో షష్ఠీప్రత్యయమగు 'అ' కార మేకవచనమున నట్లెయుండి బహుత్వమున 'ఎ' కారరూపము నందుచున్నది. పయిరీతి సామ్యమిట నుదాహరింపఁబడుచున్నది.

సిథియన్ భాషలలోని "హంగేరి యనుభాష-హాజ్=(ఇల్లు).

| ఏ. | బ. |
|---|---|
| ప్ర-హాజ్ | హాజక్ |
| ష-హాజ్‌నక్ | హాజక్‌నక్ |
| చ-హాజ్‌నక్ | హాజక్‌నక్ |
| ద్వి-హాజత్ | హాజకత్ |

ద్రావిడ భాషలలోని తమిళభాష. మనై=(ఇల్లు).

| ఏ. | బ. |
|---|---|
| ప్ర-మనై | మనైగళ్ |
| ద్వి-మనైయై (నై=న) | మనైగళై (నై=న) |
| తృ-మనైయాల్ | మనైగళాల్ |
| సహార్థతృ-మనైయోడు | మనైగళోడు |
| చ-మనైక్కు. | మనైగళుక్కు |
| పం-మనైయిల్ ఇరున్దు | మనైగళిలిరున్దు |
| ష-మనైయినదు | మనైగళినదు |
| స-మనై యిడత్తిల్ | మనైగళిడత్తిల్ |
| సం-మనైయే | మనైగళే |

పయిరూపములలో విభక్తివచన ప్రత్యయములు రెండు భాషలందును పరస్పరము భిన్నములె యై యున్నను నవి ప్రకృతితోం జేరెడి పద్ధతి రెండుభాషలందును దుల్యముగా నున్నది." (కాల్డు. ౨౩౮-౨౩౯ పుటలు).

విమర్శము:—కాల్డు. ౨౩౧ పుటయందు, సిథియను భాషలలో నామవాచకముల కేకత్వ బహుత్వబోధక ప్రత్యయములు లేవనియు నవి యచటి సందర్భమునుబట్టి తెలిసికొనవలసినదె యనియు వ్రాసి (చూడు ౭౬ II విష.)

కాల్డువెల్లుగా రిచటఁ బయిరీతిని సిథియను భాషలలోని హంగేరియన్ భాషలోని విభక్తివచనయోగ పద్ధతులను జూపుట వింతగానున్నది.

౭౬. V విష:—“ఇతర ద్రావిడభాషలలో నంతటను మహన్మహతీ వాచకముల బహువచనమున కొక ప్రత్యయమును దద్భిన్న శబ్దముల బహు వచనమునకు వేఱొక ప్రత్యయమును నిల్చును. తెలుఁగునందట్టి పద్ధతి సర్వనామములందును క్రియలయందును మాత్రము నిల్చియున్నది. నామ వాచకములం దన్నియో నపుంసకలింగ బహువచన ప్రత్యయమె (‘లు’ ప్రత్యయ మని భావము) మహన్మహతీ వాచక బహువచనములందు సైతము విస్తరించి యున్నది.

మహన్మహత్యర్థముల కేకరూపమున నున్న ‘అర్’ ప్రత్యయమునకు ‘ఎపిసీన్’ (Epicene) బహువచనమని యింగ్లీషులో వ్యవహరింతురు. ఇట్టి ‘ఎపిసీన్’ బహువచనము, మహత్త్వ బహుత్వములను దెల్పుచుండఁగా నపుంసక లింగ ప్రత్యయము మహతీత రామహత్త్వబహుత్వములను దెలుపును. (ఇట్టిది కళ్ ప్రత్యయమని దొరగారి యభిప్రాయము). ఇట్లు మహత్త్వ బహుత్వము లను నొక్కటే ప్రత్యయము తెల్పుటయు నది మహతీత్వమును సైతము తెల్పుటయు నిండోయూరపియను భాషలందును గలదు. ఉదా:—సంస్కృ- జస్=అస్. లాటిను గ్రీకు:—ఎస్ (es). ఇట్టి సామ్యమున్నను ద్రావిడ భాషలందువలెఁ గాక యిండోయూరపియనుభాషలందు మహత్తులయినను నమహత్తులయినను బారిభాషిక నపుంసకలింగముల బహువచన మేకరీతిగనే యుండును. ఉదా:—దైవతాని=(దేవతలు). కళత్రాణి=(భార్యలు). అద్యతన పెరిషియను భాషలో నీ విషయమునఁ గొంత సామ్యము చూపట్టుచున్నది. అందుఁ బ్రాణివాచక బహువచనము ‘ఆన్’ అనునది. అప్రాణివాచక బహు వచనము ‘హా’ అనునది. పెరిషియనులు ప్రాణివాచకములనెల్ల నొక గణముగా నెన్నుచుండఁగా ద్రావిడులు ప్రాణులలోని జ్ఞానాతిశయము గలవారి నొక్కతెగఁగా భావించిరి.” (కాల్డు. ౨౩౬ పుట).

విమర్శము:—తెల్గునందలి “లు” ప్రత్యయ మమహద్బహువచన ప్రత్య యమె యను దొరగారి వ్రాఁత సరికాదనియు, నది ‘రు’ ప్రత్యయ రూపాం తరమెయనియు నీ వఱకె విశదీకరింపఁబడెను. (చూడు ౭౬ III విష).

ద్రావిడభాషలకును నిండోయూరపియను భాషలకును సామ్యము కుదురు పడదు. “జస్=అస్” అను సంస్కృత ప్రథమా బహువచన ప్రత్యయము మహన్మహతీ బహువచనమునేకాక యమహత్వబహుత్వములను సైతము

దెలుపును. "కళత్రాణి" మున్నగునవి సైతము జస్ ప్రత్యయాంతములనియె సంస్కృత వైయాకరణ సిద్ధాంతము.

౭౬. VI విమ:—"తెల్గున సర్వనామములందువలెనె నామవాచకము లందును బహుత్వమున 'రు' ప్రత్యయము నిల్వవలసియుండఁగా నట్టి నామ వాచకములందును నమహద్బహుత్వవాచి 'లు' ప్రత్యయము తార్మాఱయ్యెను. 'మగఁడు' అనుదాని బహువచనము 'మగరు' అని యేర్పడక 'మగలు' అను రూపమున నిల్చెను.

తెలుఁగునఁ గొన్నియెడల బహుత్వమున బహువచన 'లు' ప్రత్యయ మేకవచన 'డు' ప్రత్యయమునకుఁ బరముగ నిల్చుటయుఁ గలదు. ఉదా:— అల్లుండు-అల్లుండ్లు. ఇట్లె-వాఁడు-వాండ్లు. ఈ 'వాండ్లు' అను రూపము తమిఁటు మందలి "అవర్గళ్" అను రీతి నేర్పడక 'అవన్‌గళ్' అను రీతి నేర్పడినది. అఱ వమునందలి "మక్కళ్"=(జనులు) అనుచోటఁ బుం స్త్రీవాచక 'రు' ప్రత్యయము నిల్వక యమహద్బహువచన ప్రత్యయము (కళ్) నిల్చుట యెట్లని శంకింప రాదు. తమిఁటమున 'మగ' శబ్దము 'శిశు' పర్యాయముగాన దానిపైని 'గళ్' నిల్చుట విరుద్ధము కాదనఁదగును. కాని తమిఁటమున 'గురుక్కళ్' అనియుఁ, గన్నడమున 'గురుగళు' అనియుఁ దులుభాషలో 'గురుకుళు' అనియు నుండును. దీనిని సమర్థించుమార్గము కానఁబడదు. (తెలుఁగునందువలెనె మహద్వాచ కములలో 'కళ్=గళ్' ప్రత్యయముచేరుట విరుద్ధమని దొరగారి యాశయము)" (కాల్డు. ౨౩౭ పుట).

విమర్శము:—తెల్గునందలి 'లు' ప్రత్యయ మమహద్బహుత్వ వాచక మాత్రము కాదనియు నది 'రు' ప్రత్యయ రూపాంతరమనియు నక్కారణమున నది మహద్బహుత్వవాచియే యనియు నయ్యది కాలక్రమమున నమహద్బహువచన ముగా సైత మేర్పడెననియు నీ వఱకు వివరింపఁబడెను (చూడు ౭౬ III విమ.) (చూ. ౨౧ XVII విమ. ౧౮ VIII విమ. ౮ విమ.) తార్మాఱగుటయేమి? ఏల యీ చర్విత చర్వణము!

దొరగారు 'కళ్-గళ్-గళు' అను భేదములను బాటింపరైరి. 'కళ్' అనునది తమిఁట ప్రత్యయము. 'గళ్' అనునది ప్రాచీన కర్ణాట ప్రత్యయము. 'గళు' అనునది హళసగన్నడ ప్రత్యయము. 'అవర్గళ్' అను రూపము ప్రాచీ నముకాదు. తొల్కాప్పియమునాఁటి కది వాడుకలో లేదు. 'కళ్' అనునది మాత్రమె తొల్కాప్పియమునఁ జేర్కొనఁబడెను. తమిఁటమున 'అవర్గళ్' అనునది వ్యావహారికము. కన్నడమందు మాత్రమిది ప్రాచీన కర్ణాట వ్యాకర ణోపదిష్టమె.

“కళ్ళొడు......” (తొల్కా. ౬౨౩ సూ.) (చూ. ౭౬ II విష).

“ద్విత్వ బహుత్వయో ర్గళాదా” (కర్ణా. భూ. ౪౦ సూ).

“సుబంతప్రకృతిగళిగె విభక్తిప్రత్యయగళు పరవాదాగ బహుత్వవివక్షయాదరె ‘గళు-అరు-అందిరు-వరు-అవు’ ఎంబ ఆగమగళు యథాసంభవాగి బరువవు.” (హొసగన్నడ శబ్దాదర్శ-౪౨ సూ).

“స్వార్థేతః కళ్” (కర్ణా. భూ. ౪౩ సూ.)=అకారాంతములకన్నఁ బరముగ నిల్చిన ‘అన్-ఇర్-విర్-దిర్’ అను వానికిఁ బరముగ స్వార్థమున ‘కళ్’ అను నాగమ మగును. ఉదా:—సుతర్కళ్ = (పుత్రులు). తాయిర్కళ్ = (తల్లులు)..........

క. వికలం పెఱవజొళను విం। గె కళాగమమంతె సర్వనామదొళం తాం। ప్రకటం గళాగమం తిళి। వికల్పదిం దప్పు దత్తెగళ్ దిర్వర్గం॥ ......గళాగమక్కె—అవర్గళ్=(వారు) ఇవర్గళ్=(వీరు) ఉవర్గళ్=(వీరు). (శబ్దము. ౧౦౧ ప).

“అల్లుండ్లు-వాండ్లు” మున్నగు రూపములు తెల్గున నవ్యములు-వ్యావహారికములు. ప్రాచీన వాఙ్మయస్థములు కావు. “అల్లుళ్లు-వాళ్ళు” అనియు వీనికన్నఁ బ్రచురముగా వాడుకలో వెలయుచున్నవి. “అల్లురు-వారు-వాండ్రు” అనునవి వీని ప్రాచీన వాఙ్మయస్థ రూపములు. ప్రాచీన వ్యాకరణ సమ్మతములును. ప్రాచీన ద్రావిడ భాషల పరస్పరసంబంధమును బరిశీలించు నీ శాస్త్రమున నధునాతన గ్రామ్య రూపములను బరిశీలించుట యుక్తముకాదు. ‘అల్లుండు-వాండు’ అను రీతినున్న వ్యావహారిక ప్రథమైకవచనాంతములపై ‘లు-రు’ అను బహువచన ప్రత్యయములను జేర్చి వాడుటచేత నిట్టి రూపములు వెలసియుండును. ఇట్లె “కోడలు-కోడళ్ళు” మున్నగు వ్యావహారిక పదములును దెల్గునఁ గలవు. వ్యావహారిక భాషలోఁ బ్రథమైకవచనము మీఁద నితర విభక్తులు నిల్చుట సంప్రదాయము.

ప్రాచీన కన్నడ వాఙ్మయస్థములై ప్రాచీన కర్ణాట వైయాకరణులచేత సంగ్రహింపఁబడి యున్న ‘అవర్గళ్’ వంటివానితో నీ వ్యావహారికరూపములకు సామ్యమును గణించుట సరికాదు. తెలుఁగునందును బ్రాచీన వాఙ్మయస్థములై ప్రాచీనాంధ్ర వైయాకరణులచేత సంగ్రహింపఁబడిన యిట్టి పునరుక్త బహువచన రూపములు గలవు. ఉదా:—నీళ్ళులు - మొసళ్ళులు - మొ. “అపి సంయుక్త సమాప్తౌ। భూయోన్తే లుః ప్రదృశ్యతే నామ్నామ్” (ఆం. చిం.) (చూ. వ్యా. సం. ౨౦౪ విమ. విస్తర II ౨౦౪ విష.) అని ప్రాచీనుఁడగు నన్నయభట్టు సూత్రించెను.

'గుఱుక్కళ్' అను రీతి రూపములు తొల్కాప్పియ సమ్మతములు కావు. 'కళ్' ప్రత్యయము మహద్వాచులపై నిల్చుట ప్రాచీన తమిళమున మచ్చునకేని లేదు. పలుగన్నడమున 'అర్-ఇర్' మున్నగు పుం స్త్రీ బహువచన ప్రత్యయములపై 'కళ్' అనునది నిల్చుటయేకాక 'గళ్' అను నాకారముతోఁ గేవల ప్రాతిపదికముల మీఁద సైతము నపుంసకేతర స్థలములందును నిల్చుట గలదు.

"స్త్రీ పుంసా దర్-దిర్-విర్-బహుళమ్" (కర్ణాట - శబ్దా ౨౩౯ సూ.) ......బహుళ గ్రహణాత్ స్త్రీ పుంవాచకేభ్యః క్వచి ద్గళపి భవతి. ఉదా:— తాయ్‌గళ్ = (తల్లులు). తందెగళ్ = (తండ్రులు). అత్తెగళ్ = (అత్తలు). సొసెగళ్ = (స్నుషలు) (కోడండ్రు). క్వచిద్గళేవ, నాన్యత్. నీంగళ్ = (మీరు). తాంగళ్ = (తాము). ఆంగళ్ = (మేము).

క. వికలంపెఱ పజొళరువిం । గె కళాగమమంతె సర్వనామదొళం తాం ।
ప్రకటం గళాగమం తిళి । వికల్పదిం దప్పు దత్తెగళ్ దిద్వర్గం ॥

......అరువిల్లదల్లికళ్:—మక్కళ్ = (అపత్యములు) నాల్‌కళ్ = (దేశములు). కోల్‌కళ్ = (కొమ్ములు-శృంగములు). దిర్గె:—అణ్ణంగళ్ = అణ్ణందిర్ = (అన్నలు). భావంగళ్ = భావందిర్ = (బావలు). మావంగళ్ = మావందిర్ = (మామలు). అయ్యంగళ్ = అయ్యందిర్ = (అయ్యలు). అక్కంగళ్ = అక్కందిర్ = (అక్కలు).— విర్గె:—అత్తెగళ్ = అత్తెవిర్ = (అత్తలు). తాయ్‌గళ్ = తాయ్విర్ = (తల్లులు). తందెగళ్ = తందెవిర్ = (తండ్రులు). (శబ్దమణి దర్పణము ౧౦౧ వ).

౭౽. VII విష:—"తుళు భాషలోఁ బురుషబోధకనామ బహువచనమున 'ఎర్' అను ప్రత్యయ మగపడుచున్నది. కాని యిది మిక్కిలి యరుదు. దీనికి బదులుగ 'గళ్' అనునదె నపుంసక లింగములందువలెనె మహాత్ములయందును వాడఁబడును. ఉదా:—ఆకుళు = (వారు), మోకుళు = (వీరు) నీకుళు = (మీరు) ఈ శబ్దముల బహువచనార్థము నిచ్చు 'ఆర్-మేర్-ఈర్' అనునవి వాని యేకవచనార్థమునఁ బూజ్యతయందు వాడఁబడుచున్నవి.

'కు' భాషలో 'జ్గా' అనునది యమహద్బహువచన ప్రత్యయము. ఇది మహద్బహువచన ప్రత్యయముగా సైతము వాడఁబడుచున్నది. ఈ 'కు' భాషలో సర్వనామములందును ధాతుజ విశేషణములందును మహద్బహువచన ప్రత్యయము 'ఆరు' అనునది. ఇది తక్కిన భాషలలోని 'అర్' అను దానిని సంబంధించునది.

అధునాతన తమిళమునఁ దెలుఁగుభాష సంపర్కముచేత నమహద్బహువచన ప్రత్యయమగు 'గళ్' అనునది మహద్విషయమున 'అవర్గళ్' అని వాడఁ

బడుచున్నది. ఇట్లె మధ్యమపురుష సర్వనామబహువచనమగు 'నీర్' అను దానికి బదులుగా 'నీఙ్గళ్' అని తమిలమున వాడఁబడుచున్నది. 'నీర్' అను దానికిఁ బ్రాచీనరూపము 'నీమ్' అనునది. ఇట్లు మహద్బహుత్వమున రూప ద్వయ మేర్పడఁగా 'అవర్' మున్నగునవి పూజార్థకైకవచనమున వ్యావహారికాలవమున గద్యలలోను వాడఁబడుచున్నది. కన్నడమందును నిట్టివాడుక లేకపోలేదు. కాని యిట్టి వాడుకలు తమిల పద్యగ్రంథములలో లేవు. అద్యతనాంధ్రమునందును నట్టి పునరుక్త బహువచనములు వాడఁబడుచున్నవి. ఉదా:—వారలు-మీరలు. మలయాళమున 'అవర్' అనునది తచ్ఛబ్దబహువచనముగాను 'అవర్గళ్' అనునది పూజార్థకముగాను వాడఁబడుచున్నది. అటివమున నిట్టి వాడుకయుఁ గలదు. తెల్గున 'గారు' శబ్ద మిట్టి వాడుకలోనె యున్నది. ఉదా:—దొరగారు (దొరై అవర్గళ్—తమి). కన్నడమున 'అవరు' అనునది తచ్ఛబ్ద బహువచనార్థమున వాడఁబడుచున్నది. 'ఆతను' అనునదియు 'అవరు' అనునదియు పూజ్యతలోని యేకవచనమున వాడఁబడుచున్నవి. అటివ మలయాళములలో 'నీఙ్గళ్'=(మీరు) అనునది పూజ్యైకవచనమునందును బహువచనమునందును వాడఁబడుచున్నది. ఇట్లె కన్నడమున 'నీవు' అనునదియుఁ దెల్గున 'మీరు' అనునదియు వాడఁబడుచున్నవి."

"తెల్గున నమహద్బహువచన ప్రత్యయము మహద్బహువచనమున వాడఁబడుచుండఁగా గోండుభాషలో నిందులకు విలక్షణముగా మహద్బహువచన ప్రత్యయ మమహద్బహుత్వమున వాడఁబడుచున్నది." ఉదా:—కావాలోర్= (కాకులు).

పయిరీతిని విశేషములు కొన్ని యున్నను మొత్తముమీఁద బహువచనమున నమహత్తుల కొక ప్రత్యయమును మహత్తులకు వేఱొక ప్రత్యయమును నుండుట ద్రావిడభాషల స్వభావమై యున్నది. (కాల్డు. ౨౬౮—౨౭౫ పుటలు).

విమర్శము:—తమిళ మధ్యమ పురుష సర్వనామము:—'ఏక-నీ. బహు-నీయిర్' అని తొల్కాప్పియము చెప్పుచున్నది. 'నీమ్' అను బహువచన రూపము ప్రాచీన తమిలమున లేదు. 'నీఙ్గళ్' అనునది యర్వాచీనముగఁ దమిలమునకు వచ్చినది. కన్నడమున "నీన్=నీం-(ఏ), నీమ్=నీం (బ)" అనునవి వ్యాకరణ సమ్మతరూపములు.

కన్నడమున "ఆతం=(వాఁడు) ఈతం=(వీఁడు) అనునవి పూజార్థకములు కావు. ఏకవచనములు. "ఆతం=వాఁడు—ఈతం=వీఁడు" అని యర్థము. వీని బహువచనములు—'ఆతంగళ్'=(వారు). ఈతంగళ్=(వీరు). (చూ. శబ్దమణి. ౧౫౦ ప). "ఆతను=(వాఁడు) నీవు=(మీరు)" అనునవి హళాన

గన్నడ రూపములు. 'ఆతను' మున్నగు నేకవచనరూపములకుఁ బూజార్థకత్వము గలదనుట పొరపాటు. తెల్గు 'లు' ప్రత్యయ మమహద్బహువచన మను చుండుట సరికాదు. అది 'రు' ప్రత్యయ రూపాంతరము. మహద్బహువచన రూపము.

౭౭. I విష:—"పుం స్త్రీ వాచకమగు 'అర్' ప్రత్యయపు చరిత్రము:— 'అర్' ప్రత్యయమె పై నుదాహరించిన యీ క్రింది రూపముల నుచ్చారణ వశమునఁ బొందినదని నా యభిప్రాయము.

తమి:—అర్-ఆర్-ఓర్-ఇర్-ఈర్. కన్నడాంధ్ర:—అరు-ఆరు-ఆరె-ఏరు-రి-రు. తుళు:—ఎర్. 'కు' భాష:—ఆరు. గోందుభాష:—ఓర్. బ్రహుయి:—క్రియలలోని మధ్యమ పురుష బహు. ఎరె-ఉరె. ప్రథమ పురుష బహు-అర్-ఊ.

అఱవములోని "నీర్ (మీరు)" అనుదాని ప్రాచీన రూపములు "నీయిర్-నీవిర్" అనునవి. ఇట్లె తమిళమున మగళ్+ఇర్=మగళిర్. మగళ్+ఈర్=మగళీర్. (స్త్రీలు). వీనినెల్లఁ బరిశీలింపఁగా "బహువచన ప్రత్యయము రేఫమాత్రముకాదు-దానికి ముందేదో యొక యచ్చుగలదు" అని యంగీకరింపక తీరదు. కాన 'అర్-ఇర్' అనునవి స్వతంత్రములగు బహువచన ప్రత్యయములన నగును.

'అర్' అను బహువచన ప్రత్యయములోని 'అ' కారము నిర్దేశక సర్వనామ శబ్దము కానోపును. అట్లయినచో 'అర్' అనునది 'అవర్' అను దానికిఁ బ్రాచీన రూపమగుచు మహత్త్వచ్ఛబ్దార్థము నిచ్చును. ఇట్లె 'ఇర్' అను దానిలో నిది 'ఇ' అను సర్వనామము. ఇది 'ఇదం' శబ్ద మహద్బహువచనార్థము నిచ్చును. ఇది యొకప్పుడు ద్విశబ్దార్థకమగు 'ఇర్=ఈర్' శబ్దమందు మన్నచో 'నీర్=నీయిర్' మున్నగునవి ద్వివచనములగుచు 'మీరిద్దఱు' అను నర్థము నీయవలసి వచ్చును. బోర్న్ భాషలో "మేము-మీరు-వారు" అను నర్థములుగల శబ్దములు ద్వివచనములై యుండలేదా యని సమాధానము చెప్పుద మన్నను మఱొక పెద్దవిరోధము కన్పట్టుచున్నది. 'ఇర్' అనునది 'అర్' అను దానికి మూలమని స్వభావ విరుద్ధముగాఁ జెప్పవలసియుండును" (కాల్డు. ౨౬౯-౨౭౦ పుటలు).

విమర్శము:—'అర్-ఇర్' అను వానిలోని యచ్చులు నిర్దేశక సర్వనామములు కావచ్చుననెడి దొరగారి వ్యుత్పత్తిప్రదర్శనమున ఫలమేమో తెలియకున్నది. అందలి, రేఫముయొక్క చరిత్రము 'అన్' ప్రత్యయ నకార చరిత్రము వలెనె దుర్జ్ఞేయమేకదా. ఈ దొరగారి వ్యుత్పత్తి పక్షమున 'అవర్-ఇవర్'

శబ్దములలో రెండేసి నిర్దేశక సర్వనామములున్నవని యసంగతముగాఁ జెప్పుట సంభవించును. ఈ పద్ధతికన్న నేను వెనుకఁ జెప్పిన రీతిని 'అ+అ+న్'= అవన్ అను దానిలోని రెండవ 'అ' శబ్దము తద్వ్యాప్తార్థ బోధకమని చెప్పుట యుక్తముకాదా? (చూడు ౭౩ II విష.) ఇంకొక విశేషము. ఇవర్ (ఇ+అ+ర్) శబ్దములోని యిదంశబ్ద తచ్ఛబ్దార్థ ద్వయ మేళనము కేవలము సనంగత మగును.

౭౭. II విష:—"'మార్' అను బహువచన ప్రత్యయపు చరిత్రము:— అఱవములోని "మార్=మర్" అనునవి 'అర్' అనెడి బహువచన ప్రత్యయ మును సంబంధించినవె. వీనిలో నొక విశేషము గలదు. 'అర్' అనునది యేకవచన ప్రత్యయమును ద్రోసివేసి దానిచోట నిల్చును. 'మార్'- అనునది యేకవచన ప్రత్యయమునకుఁ బరముగా నిల్చును. ఉదా:—పురుషన్= (పురుషుఁడు) పురుషర్=(పురుషులు). పురుషన్మార్=(పురుషులు). "పురు షర్మార్" అనరాదు. 'మార్' అనునది రెండుమూఁడు పదములమీఁద నేకముగా నిల్చును. ఉదా:—తాయి తగప్పన్మార్=(తల్లిదండ్రులు). ఇట్లు శబ్దముల సమూహముమీఁద నిల్చుపద్ధతి సిథియను భాషలందును గలదు. 'అర్-మార్' అను వానికి భేదమున్నట్లు కనఁబడదు. అధునాతనాఱవమున నిది గౌరవార్థకము. మలయాళమున దీనికి గౌరవార్థము లేదు. ఉదా:— మల-కళ్ళన్మార్=(దొంగలు). దీనినిబట్టి ప్రాచీనకాలమున దీనికి గౌర వార్థకత్వము తమిళమున లేదని చెప్పవలసియున్నది". (కాల్డు. ౨౮౦ పుట).

"మార్" అను దానికి 'మర్' అను రూపాంతరము కొన్నిశబ్దములలోఁ జూపట్టుచున్నది. ఉదా:—ఎణ్మర్=(ఎనమండ్రు). 'ఆర్' ప్రత్యయముకన్న 'అర్': ప్రత్యయము ప్రాచీనమైనట్లు 'మార్' అను దానికన్న 'మర్' అనునది ప్రాచీనము. 'మ వ' అనువాని వ్యత్యాసము సహజమగుటచేత "మర్=వర్" అనునవి యభిన్నములని తోఁచుచున్నది. ఉదా:—నాల్వర్ = నలువురు. ఐవర్=(ఐదుగురు). ఎణ్మర్=(ఎనమండ్రు). 'నాల్మర్' అనరాదు. 'ఎణ్వార్' అనునది సాధువు." (కాల్డు. ౨౮౧).

"అఱవ మలయాళములలోఁ బుంస్త్రీ నామములకు 'వర్' అనునది సామాన్య బహువచన ప్రత్యయము. ఇది 'అవర్' అను సర్వనామమునకు భిన్నముకాదు. "విణ్ణవర్=(ఆకాశవాసులు=దేవతలు) శె (చె) య్దవర్"= (చేసినవారు) అను వానిలోని 'అవర్' అను ప్రత్యయము సర్వనామమె. ఇది 'వర్' అనురూపము నందినది. తెల్గున వారు అని యున్నది కాదా? 'నాల్వర్' మున్నగు వానిలో హల్లుమీఁద 'వర్' నిల్చుటచే నిందలి 'వ' కారము స్వర

సంహితా వ్యవధాయక వర్ణము కాదు. ఇట్లు 'వర్' అనునది సర్వనామశబ్ద మైనపుడు 'మర్' అనునదియు నట్టి సర్వనామ మేల కాఁగూడదు? 'అర్' అనునది 'ఆర్' అను రూపాంతరమునందినట్లె 'మర్' అనునది 'మార్' అను రూపాంతరము నందినది. కాన 'తగప్పన్ వార్' అనియుండుటకు మాఱుగా 'తగప్పన్ మార్'=(తండ్రిగారు) అని యేర్పడెను. 'తగప్పన్ అవర్గళ్' అనుచో నేక వచన రూపము పయిని బూజార్థమున 'అవర్గళ్' అనునది నిల్చినట్లె 'తగప్పన్ మార్' అనుచోట సైత మేకవచనముమీఁద 'మార్' అనునది నిల్చెను. దీనికి 'తగప్పనార్' అనునది భిన్నముకాదు" (కాల్డు. ౨౮౧ పుట).

"డా. గుండర్టుగారు 'మర్-మార్-మనార్' అను క్రియా బహువచన ప్రత్యయములును 'మర్-మార్' అను నామబహువచన ప్రత్యయములును నభిన్నములె యనిరి. కాని యందులకు నేను సమ్మతింపఁ జాలను. ఈ క్రియా ప్రత్యయములు భవిష్యదర్థమునఁ బద్యకావ్యములలో నగపడుచున్నవి. కాన వీనిలోని మకారము భావ్యర్థక వకార బకారముల కభిన్నముకాని సార్వనామి కము కాదు. కాన 'మర్-మార్' అను నామప్రత్యయములలోని మకారము వీనికి భిన్నమని నా యభిప్రాయము. ఉదా:—'ఎన్'=(అను ధాతువు.) అను దాని భావ్యర్థకములు "ఎన్బర్ = ఎన్మర్; ఎన్బార్ = ఎన్మార్ = ఎన్మనార్= (అందురు)" అనునవి. 'ఎన్మనార్' అనుదానిలోని 'ఆర్' అనునది 'తగప్పనార్' (తండ్రిగారు) అనుదానిలోని 'ఆర్' వంటిదనెడి గుండర్టుగారి యాశయము సరికావచ్చును" (కాల్డు. ౨౮౨ పుట).

విమర్శము:—కాల్డువెల్లుగా రీ విషయమునఁ దడఁబాటు పడిరి. 'మార్' అను తమిళ మహద్బహువచన ప్రత్యయము తెల్గులోని 'వారు' అను దాని వంటిది. తెల్గులోని 'రాచవారు-ఆర్వీటివారు-అత్తవారు' మున్నగువానివంటిదె తమిళమందలి 'తమప్పన్మార్' అనునది సాధురూపము. 'తగప్పన్' అనునది యర్వాచీనము నపభ్రంశమును. 'తమ్+అప్పన్=తమప్పన్' అనునది సాధు శబ్దము. దాని పైని గౌరవార్థకముగా 'మార్' అనునది చేరఁగా 'తమప్పన్ మార్' అను రూప మేర్పడును. (తమ తండ్రిగారు). 'తమప్పన్' అనునది ప్రథమైక వచనమున కభిన్నమగు ప్రాతిపదికము (౧౧_౨ III విమ. చూడు). ప్రాచీన బహువచనమగు ('మ్') మకారముతో 'అర్' అను ప్రత్యయము చేరఁగా 'మార్' అనున దేర్పడియుండును. ఉదా:—గురుమార్-మొ.

ప్రాచీన తమిళమున 'వారు' అనికాని 'వార్' అనికాని 'అవర్' శబ్ద పరిణామరూపము లవతరించి యుండమింజేసి తమిళములోని 'మార్' శబ్దము

'వార్'=(వారు) శబ్దమునకు రూపాంతర మనరాదు. 'వర్' అను ప్రత్యయము 'అవర్' శబ్దపు సంక్షేప రూపము. ఇది "తమిళ-మలయాళ-కన్నడ"ములలో సంఖ్యా వాచకములందుమాత్రమె నిల్చును. ఇది తెల్గున 'వురు-గురు' అను రూప ముల నందినది. ఉదా:—తమి-కన్న-ఒరువర్=(తె-ఒకరు). ఇరువర్=ఇర్వర్= (తె-ఇరువురు). మూవర్=(తె-మూవురు) నాల్వర్=(తె-నల్వురు)—ఇట్లె తమిళమున "ఎట్టు+వర్=ఎణ్మర్" అను విశేషరూప (తెల్గున-ఎనమండ్రు-వ్యావ-ఎనమండువురు=ఎనమండుగురు) మున్నంతమాత్రమున సార్వత్రికముగ 'వర్' అనుదానికి 'మర్' అనురూపాంతరము నంగీకరింపరాదు. అట్టిది మఱెచ్చ టను దమిళమున లేదు. ఇట్టి యంగీకార్యముకాని 'మర్' శబ్దమును 'మార్' అనుదానికి మూలరూపమునుగాఁ గల్పించుట కేవలము నసంగతము. 'మర్' అనుదానినుండి 'మార్' అని యేర్పడె ననుటకు 'అవర్=ఆర్' అనుదానివలె 'మవర్' అనురూపములేదు గదా? వానికి సామ్యమెట్లు సంగత మగును? 'అర్' అనుదానినుండి 'ఆర్' అని యేర్పడలేదు. 'అవర్' అనుదానినుండి 'ఆర్' అనునది యేర్పడినది. మఱియు 'ఎణ్మర్' అనుదానికి 'ఎన్మార్' (ఎనమండ్రు) అనురూపాంతరము గలదనుట సత్యవిదూరము. అట్టిది తమిళమున నెంత మాత్రమును లేదు.

కాలక్రమమున మలయాళమున 'మార్' శబ్దసమాసమునకుఁ గల పూజార్థకత్వ మంతరించుటచేత నందు "కళ్ళన్మార్=(దొంగలు)" అనురీతిగల వాడుకలు వెలసి యుండును.

పయిని వ్రాసిన గుండర్టుగారి వ్రాఁత కేవలము ప్రామాదిక మగుట చేత డా. కాల్డువెల్లుగారు వారితోఁ బయివిషయమున నేకీభవింపకుండుట యర్థమె. కాని కాల్డువెల్లుగారు 'ఎన్మార్=(అందురు)' అనురూపము తమిళ మునఁ గలదని వ్రాయుట సరికాదు. 'ఎన్మార్=(అందురు)' అనురూపము తమిళ వ్యవహారమునందును లేదు. (చూడు 33 విష). 'ఎన్మర్' అనునదె సాధురూపము.

22. III విష:—"ద్రావిడ మహన్మహతీ బహువచనము రేఫాంతమయి యున్నట్లే మఱి కొన్ని భాషలందును—ఇండో యూరపియను కుటుంబములోని ట్యూటానిక్‌శాఖయందలి (ఇంగ్లీషు - జర్మని - ఐస్లెండు) భాషలందును—రేఫాం తత్వముగలదు. ఉదా:—కోనుంగుర్=(రాజులు) (ఐస్లెండు భాష). సుబే టోర్.—(లాటిన్‌శాఖ). ఇండో యూరపియను భాషలలోని యీ రేఫము సకారజన్యము. ద్రావిడభాషలలో సకారము రేఫముగా మాఱుట యెచ్చటను లేదు. కాన నీ సామ్యము కాకతాళీయము.

సిథియన్ భాషలందును నీ సామ్యముగలదు. ఉదా:—టర్కిష్షు-ఆన్ లర్=(వారు). మంగోలియా భాషలో 'నర్' అనునది బహువచన ప్రత్యయము. 'ల-న' అను వాని మార్పు సహజముగాఁ బై రెండును నభిన్నము లనఁదగును. ఇంకను దమిళములోని 'మర్' అనునదియు దీనిని సంబంధించినదే యననగును. మఱియుఁ బైని వ్రాసిన తమిళములోని 'ఎన్ననార్'=(అందురు) శబ్దములోను, 'ఇళైనర్'=(బాలురు) శబ్దములోను గల 'నర్' అనునది సైతము పై మంగోలియా భాషలోని 'నర్' అను దానిని సంబంధించినదా యని యాలోచింపవలసి యున్నది." (కాల్డు. ౨౮౨-౨౮౩-౨౮౪ పుటలు).

విమర్శము:—ఇండో యూరపియను భాషలలోని మహద్బహువచన ప్రత్యయము "జస్=అస్" అను రీతిని సకారరూపముగాఁ జెప్పఁబడినను నట్టి భాషలందే యట్టి సకారము రేఫరూపము నందుచున్నది. కాన యేదేని భాష నుండి యిండో యూరపియను భాషలకు సకార రేఫములు రాఁగా ద్రావిడ భాషలకు రేఫము వచ్చెనని యేల చెప్పరాదు? సంస్కృతమునందును నట్టి సకారము రేఫమగుచున్నది. "స సజుషో రుః (౮-౨-౬౬) పదాన్తస్య సస్య సజుష్ శబ్దస్యచ రుః స్యాత్" (సి. కౌ. ౧౬౨ సూ.) "రు విధౌ ఉకార ఇత్" (బాల మనోరమావ్యాఖ్య) అను చొప్పున సంస్కృతమున 'జస్' ప్రత్యయము మహత్త్వమున 'అర్' అను రూపముననే నిల్చును. (చూడు ౨౨ II విష).

డా. కాల్డువెల్లుగారును నిచట నిదికాకతాళీయమని వ్రాసినను స్థలాంతరమునందు దీనిని గొంతవఱ కంగీకరించి యున్నారు. (చూ. కాల్డు. ౧౬౪-౧౬౫ పుటలు) (చూడు ౨౨ I విష).

'మర్' అను ప్రత్యయమె తమిళమున శశవిషాణ ప్రాయము. (చూడు 22 II విష). కాన నది మంగోలియా భాషలోని 'నర్' ప్రత్యయమును బోలుటెట్లు? ఇంకఁ దమిళములోని 'ఎన్ననార్'=(అందురు) అను శబ్దమునకు "ఎన్+మ్+అన+అర్" అని ప్రకృతిప్రత్యయ విభాగము చేయవలయుననుచు నీ వఱకు విపులముగా వివరింపఁబడెను (చూడు. 33 విష). కాన నట్టి శబ్దములో 'నర్' అనునది గలదనుట సత్యవిదూరము.

౭౮. I విష:—"అమహద్బహువచన చరిత్రము:—ద్రావిడ భాషలలో నమహద్బహువచనములు రెండు గలవు: (I) 'గళ్' అను బహువచనము. (II) 'అ' ప్రత్యయము (౭౯ I విష. చూడు).

అమహద్బహువచనమగు 'గళ్' ప్రత్యయము తమిళ కన్నడములలోఁ గ్వాచిత్కముగా మహద్వాచకములపైని సయితము నిల్చుటగలదు. తెల్గునఁ

దత్సంబంధి 'లు' ప్రత్యయము మహాదమహత్తులు రెంటను నిల్చును. ప్రాచీ నాధునాతన నాఱవములు రెంటను 'గళ్' అనునది యమహద్వాచకములపైని నిల్చును. ఉదా:—కైగళ్=(చేతులు) సంధివశమున నీ గకారము కకారముగను ద్విరుక్త కకారముగను దమిఱమున మాఱును. ఉదా:—కల్‌గళ్-కఱ్కళ్. తమిఱ పద్యవాఙ్మయమున నిది 'గాళ్' అను రూపముతోను నున్నది. మలయాళమున నిది 'గళ్-కళ్-క్కళ్' అను మూఁడు రూపములతోను నున్నది. జకారమునకుఁ బరముగా 'గళ్' గకారము సంయోగించునపుడు మలయాళమున నట్టి సంయోగము ద్విరుక్త 'జ' కారముగ నేర్పడును. నిజ్+గళ్=నిజ్జళ్". (చూ. ౧౫ II విష).

తెల్గులోని 'లు' ప్రత్యయమునకుఁ బూర్వమున 'అ' కారము గలదు. అది 'గళ్' ప్రత్యయ 'గ' కార లోపమున మిగిలినదై యుండును. ఉదా:—గుఱ్ఱ(ము)+అలు=గుఱ్ఱాలు. దీనిలోని 'ఆ' కారము 'గుఱ్ఱ' శబ్దముయొక్క తుది 'అ' కారమును బ్రత్యయాదినున్న 'అ' కారమును సంధించుటచే నేర్పడి యుండును. అఱవమునందును నీ గకారవ్యంజన లోపము గలదు. ఉదా:—అవర్+గళ్=అవాళ్=(వారు). పిరామణర్+గళ్=పిరామణాళ్ (బ్రాహ్మణులు-బ్రాహ్మణ శబ్దభవము). ఇట్టి 'క-గ' ల లోపము సిథియను భాషలలోను గలదు. తుళుభాషల దేశము తెల్గునకు సన్నిహితము గాకున్నను నా రెండిటికిని జాల సంబంధము గలదు. తుళుభాషలో 'ళు' ప్రత్యయ మరుదు. అందు 'ళు' అనెడి లుప్తగకారక రూపమె తఱచు. 'గలు' అనునది కొన్ని 'ను' వర్ణాంత శబ్దములందుఁ దెల్గునను గలదు. నన్నయసాధించెను. (చూ. కాల్డు. ౨౮౫ పు.) ఉదా:—కొలను=(సరస్సు) (తమి-కుళమ్) కొలంకులు. గోన్గులు=గోంగులు. ఈ 'కులు-గులు' ప్రత్యయములు తమిఱములోని "కళ్-గళ్" ప్రత్యయముల కభిన్నములు. మన దేశములోని యీశాన్య భాగమునమన్న కొన్ని భాషలలో నీ ద్రావిడ ప్రత్యయములకు సరిపడు ప్రత్యయములు కన్పట్టుచున్నవి. ఈ భాషలు ద్రావిడ భాషలకును 'టిబెటియన్' భాషలకును మధ్యస్థము లనఁదగును. ఉదా:—మిఁరి భాషలో "నో=(నీవు)-నోలు=(మీరు). ధిమాన్ భాషలో-నే=(నీవు)-న్యేల్=(మీరు). మికిర్ భాషలో 'లి' అనునది సర్వనామ బహువచన ప్రత్యయము. ఉదా:—నలి=(మీరు). ఈ భాషలో నామవాచకములకు బహువచన ప్రత్యయము లేదు. 'గలై' అను వేఱొకపదము వాని బహుత్వార్థమునఁ జేర్పఁబడును. పైని వ్రాసిన 'లి' ప్రత్యయము దీనిని సంబంధించినదె. ఈ 'గలై' శబ్దమునకును దమిఱ కన్నడములలోని 'గళ్' ప్రత్యయమునకును

నధిక సంబంధము కన్పట్టుచున్నది. 'నగ' భాషలో 'ఖల' అనునది బహువచన ప్రత్యయము.

తెలుఁగులో నాద్యక్షరము లోపించినట్లె కొన్ని ద్రావిడ భాషలలో దాని తుదివర్ణము లోపించుటగలదు. గోండుభాషలో 'క' కారము బహువచన ప్రత్యయము. ఉదా:—నై=(కుక్క)-నైక్=(కుక్కలు). (తమి-నాయ్‌కళ్= కుక్కలు). సియోనీ గోండుభాషలో 'స్క' అనునది బహువచన ప్రత్యయము. ఉదా:—నెలి=(పొలము) నెలిన్క=(పొలములు). 'కు' భాషలో 'ఙ్గా=స్కా' అనునవి బహువచన ప్రత్యయములు. పై ప్రత్యయము లన్నిటిలోను 'క-గ' లగపడుచున్నవి." (కాల్డు. ౨౪౪-౨౪౮ పుటలు).

విమర్శము:—డా. కాల్డువెల్లుగారు తమిళములోనిది 'కళ్' ప్రత్యయ మనియుఁ బటగన్నడములోనిది 'గళ్' ప్రత్యయమనియు భేదమును బాటింప కుండుటయేకాక తమిళములోని దీని మొదటి రూపము 'గళ్' ప్రత్యయమే యనియు సంధివశమున 'కళ్-క్కళ్' అను రూపములు గల్గుననియు వ్రాయుట పొరపాటు. తొల్కాప్పియము నాఁటికిని దమిళమున సరళోచ్చారణము లేమింజేసి (౧౭ XXIII విష. ౧౭ XXIV విష.) దీని మొదటి రూపము కకార ఘటితమే యనియు సరళోచ్చారణము ద్రావిడ భాషలలో నవతరించిన పిమ్మట నిది గకార ఘటితమయ్యెననియు రేఫ లకారాదులమీఁద సరళోచ్చారణ మప్రసిద్ధమగుటచేత నట్టియెడలఁ గన్నడమందును 'క' కార ఘటిత రూపము నిల్చుననియుఁ జెప్పుట యుక్తము. వైయాకరణ సమ్మతమును. (చూడు ౭౮ VI విష).

తెలుఁగు భాషలో నియ్యది 'అలు' ప్రత్యయ రూపమనియు నట్లగుటచేత 'గుఱ్ఱాలు' మున్నగు రూపములు వెలసెననియు దొరగారు వ్రాయుట సరికాదు. 'గుఱ్ఱములు' అను దానిలోని 'ము' వర్ణక లోపమున నట్టి పూర్వ స్వర దీర్ఘము గల్గెను. "వికృతౌ క్వచిచ్చ లోపో మో ర్దీర్ఘ శ్చాత ఆదిమస్య భవేత్" (ఆం. చిం. వ్యా. సం. ౧౪౯ విష). నన్నయ యిట్లు సూత్రించెనే కాని యింకను దనకాలమున సుప్రసిద్ధము కామింజేసి కావలయును దన భారత భాగమున నొక్కటనైనను బ్రయోగింపఁడయ్యె. మఱియు నిట్టి ములోప దీర్ఘములు 'అ' కారాంత శబ్దములందు మాత్రమె సంభవించును. తెల్గున నిది 'అలు' రూపముగలదె యైనచో "తల్లులు-తండ్రులు-చెఱువులు-గాములు-గీములు" మున్నగు రూపము లెట్లు సిద్ధించును? తల్లి మున్నగు 'ఇ' కారాంతముల ఇకారమునకు లుప్రత్యయ పరకత్వమున 'ఉ' కారము వచ్చుపద్ధతి యెట్లు

పొసంగును? 'సో ర్లు గిత ఉద్బహూత్వే' అని నన్నయ సూత్రించియు నున్నాఁడు (ఆం. చిం. వ్యా. సం. ౧౪౯ విష).

తెల్గు 'లు' ప్రత్యయము 'కళ్' ప్రత్యయమునుండి యేర్పడెననుట సరి కాదు. కళ్ ప్రత్యయమె యతోఽధిక ప్రాచీనమగు 'లు' ప్రత్యయమునుండి యేర్పడెననియుఁ గొన్ని యెడల 'లు' ప్రత్యయమును దత్పూర్వస్థిత ప్రకృతి సంబంధి కకారముతో ననుచితవిభాగము చేయుటచేత 'కళ్' ప్రత్యయమేర్పడి యుండుననియు సంస్కృత 'ల-న'లు కొన్ని ప్రాకృతములలో 'ళ-ణ'లుగా మాఱినట్లె ప్రాచీన ద్రావిడ భాషలోని 'ల-న'లును గాలక్రమమున మూర్ధన్య 'ళ-ణ'లుగాఁ దమిళ కన్నడాదులలో నేర్పడియుండుననుట విరుద్ధము కాదనియు గ్రహింపవలెను (చూ. ౧౭ VIII విష. ౨౧ XVII విష).

"నో ణః సర్వత్ర=(వృత్తి). సర్వత్ర నకారస్య ణకారాదేశోభవతి. ఉదా:—ణఈ=(నది). కణఅం=(కనకమ్). వఅణం=(వచనమ్). మాణుసో=(మానుషః)" (ప్రాకృత ప్రకాశము. ౨ పరి. ౪౨ సూ). లకారమునకు ళకారమువంటి యలఘూచ్చారణము సంస్కృతమందె చిరకాలము క్రిందటనే యారబ్ధమయ్యెను. "లడయో ర్లళయో రైవ। రలయో ర్వబయో ర్భిదా" (అహో ౧౩౭ పుట).

కాలక్రమమునఁ గర్ణాట దేశమున సంస్కృత శబ్దములందెల్ల నలఘు ళకారోచ్చారణము విస్తరిల్లుటచేతఁ గర్ణాట వ్యాకర్త లీ క్రింది రీతిని సూత్రించి కొనిరి.

"లో ళః (కర్ణాట శబ్దా. ౧౩౯ సూ). లకారాస్య ళకారాదేశో వా భవతి. ఉదా:—జల=జళ. తిల=తిళ. ఫల=ఫళ. కుల=కుళ. అలి=అళి. సలిల=సళిళ."

"సంస్కృతపదగత లకారస్య స్థానే య ఆదిష్టః స క్షుళ ఏవ." (మంజరీ మకరందవ్యాఖ్య—౧౪౦ సూత్రవ్యాఖ్య). అని యిట్లీ సంస్కృత శబ్దగత 'ళ' కారమును గర్ణాటులు క్షుళమని వ్యవహరింతురు. ప్రాకృతములందెల్ల సంస్కృత శబ్దగత లకారమును ళకారముగా నుచ్చరించుచుండుటచేతనే పైశాచీప్రాకృత మున ళకారమునకు లకారాదేశము చేసికొనవలసి వచ్చెను. ళో లః. (౩-౨-౪౭)=పైశాచ్యాం ళకారస్య స్థానే లకారః స్యాత్. ఉదా:—కలమో-కోమలో-ముకులో (షడ్భా. ౧౭౭ పుట). పయిరీతిని దమిళ కన్నడములలో 'కళ్' ప్రత్యయము స్థిరపడిన పిదప 'గోండు' మొదలగు భాషలలో నద్దాని సంక్షేప రూపములగు 'క-గ' మున్నగు భాగములు వెలసెనని గ్రహింప వలయును.

౭౮. II విమ:—"గోండుభాషలో 'క' కారము సామాన్యముగ బహువచన ప్రత్యయమై యుండఁగా మధ్యమోత్తమ పురుష బహువచనములలో 'త' కారము బహువచన ప్రత్యయమై యున్నది. ఉదా:—అమత్ =(మేము) ఇమత్ =(మీరు). బ్రహుయి భాషలో బహుత్వము ప్రత్యేక పదద్యోత్యమై యుండుటయుఁ గొన్నియెడల 'క' అనునది బహువచన ప్రత్యయమై యుండుటయు సామాన్యమై యుండఁగాఁ గొన్ని విభక్త్యంతరములలో 'క' కారస్థానమున 'త' కారము కన్పట్టుచున్నది.

ఫిన్నిషు కుటుంబములోని భాషలలో సైతము 'క' కారము బహువచన ప్రత్యయముగా నున్నది. మఱియు వానిలో 'క' కార 'త' కారములకు వినిమయ మగపడుచున్నది. మంగోలియా ప్రభృతులగు కొన్ని భాషలలో 'త' కారమె బహువచన ప్రత్యయమై యున్నది. పయివానినిబట్టి ద్రావిడ 'కళ్' ప్రత్యయము 'తళ్' ప్రత్యయ మూలక మనవలసి యున్నది. కాఁగా 'తళ' యను సమూహార్థక ద్రావిడ శబ్దము 'కళ్' ప్రత్యయమునకు మూల మనఁదగును. కాని 'తళ్' ప్రత్యయము ద్రావిడ భాషలలో బహువచన ప్రత్యయముగా నెచ్చటను వాడఁబడలేదు. సంస్కృత 'సకల' (తమి-సగల) శబ్దము 'గళ్' ప్రత్యయమునకు మూలమని స్టివెన్‌సన్ దొరగారు చెప్పిరి. ఫిన్నిషు కుటుంబములోని 'ఆస్టియకు' భాషలో 'త్లో' బహువచన ప్రత్యయమై యున్నది." (కాల్డు. ౨౮౬-౨౮౭ పుటలు).

విమర్శము:—తమిళ కన్నడాదులలోని 'కళ్' ప్రత్యయ కకారమువలెనె గోండుభాషలోను నితర ఫిన్నిషు కుటుంబభాషలలోను 'త' కారము శబ్దావయవమై యుండి యనుచిత విభాగమున 'తళ్' ప్రత్యయ భ్రాంతిని గల్గింపవచ్చును. ఈ ప్రత్యయపు పూర్వాక్షర మెద్దియైనను దొరగారు చూపిన భాషలలో నెల్ల 'లు' ప్రత్యయము నియతముగాఁ దుదివర్ణమై యున్నది. 'తళ' శబ్దజమగు 'తళ్' ప్రత్యయము ద్రావిడ భాషలలో నెందును నిల్వకుండఁగా మంగోలియాది భాషలలో దాని ఖండమగు తకారము బహువచన ప్రత్యయముగా నేర్పడెననుట "పృష్ఠ తాడనా ద్దన్త భఙ్గః" అను నానుడిని స్మరింపఁజేయుచున్నది. సంస్కృతమున 'క' కారముండుచోట గ్రీకులో 'త' కారముండును. అట్లె పయి భాషలలోను 'కళ్' ప్రత్యయ కకారముచోట 'త' కారము నిల్చెనేమో?

(II) ౭౯. I విమ:—"నపుంసకలింగ బహువచనాంతరమగు 'అ' ప్రత్యయము:—'అ' ప్రత్యయము, 'గళ్' ప్రత్యయమువలె మహద్వాచకములమీఁద నయితము నిల్వక కేవల ద్రావిడామహద్వాచకములమీఁద మాత్రమె నిల్చును. గ్రాంథికాఱవమున విశేష్య నిఘ్నములమీఁదను (లింగబోధక

ప్రత్యయ విశిష్టవిశేషణ ప్రాతిపదికములు) నిర్దేశక సర్వనామములమీఁదను సార్వనామిక విశేషణముల మీఁదను క్రియానామవాచకముల మీఁదను నియ్యది నిల్చును. ఉదా:—తమి-నీర-పిఱ = ('ఆగులనీర, పిఱ') = (మిగిలిన వన్నియు డంబములు). ('తిరువళ్ళువర్' అను నాతఁడు రచించిన 'కుఱళ్' అను గ్రంథములోనిది). పల=(పెక్కు) (తెల్గు-పలు). శి (చి) ల=(స్వల్ప) పిణి పల=(రోగము లనేకములు) పలవిన్‌పాల్=(అనేక శబ్దముల లింగము= నపుంసక బహువచనము). మలయాళమందు నీ శబ్దములవాడుక గలదు. అల్+అ=అల్ల = (అల్ వ్యతిరేకార్థకము). అల్ల=(కాదు) దీని యేకవచనము 'అల్దు'=(అన్దు-ఉచ్చారణ విశేషమున సంభవించిన రూపము). ('అన్దు'. అన వలెను.) నాగరకాలమున (High Tamil) గుణనామవాచకములును సంబంధార్థకములును విశేష్య నిఘ్నములగుచుండును. వాని బహువచనమున 'అ' ప్రత్యయము నిల్చును. ఉదా:—అరియ=(కష్టములు) నాగరకాలమున నామ వాచక సామాన్యముపై నీ 'అ' ప్రత్యయము నిల్చును. ఉదా:—పొరుళ్+అ= పొరుళ=(వస్తువులు). సర్వనామజములగు 'అన - అవై' అను బహువచన ప్రత్యయములును నీ 'పొరుళ్' శబ్దముపై నిల్చును. ఉదా:—పొరుళన= (వస్తువులు). పొరుళవై =(వస్తువులు)."

"అమహాక్ర్తృక ప్రథమ పురుష బహువచనమును 'అన' ప్రత్యయాంత మగును. ఉదా:—ఇరుక్కిన్దన (న్దన)=(ఉన్నవి). ఈ 'అన' అనునది 'అవ' అనుదానికిఁ బూర్వరూపము కానోపును. 'అ' అను నిర్దేశక సర్వనామము 'అ' అను బహువచన ప్రత్యయముతోఁ గూడునపు డుచ్చారణ సౌకర్యార్థముగ నొకట నకారమును నొకట వకారమును నిల్చుటచేత (అ+న్+అ=అన; అ+ వ్+అ=అవ) 'అన-అవ' అనునవి యేర్పడును. క్రియలపైని మీఁద వ్రాసిన రీతిని 'అన' అనునది చేరుటయేకాక 'అ' ప్రత్యయము చేరుటయుఁ గలదు. ఉదా:—మీణ్డ=(తిరిగి వచ్చినవి). 'మీణ్డన' అనెడి 'అన' ప్రత్యయాంతమును నుండవచ్చును."

"గ్రాంథికాలమములోని స్వస్వామిభావ సంబంధార్థకములగు "ఎన= (నాయొక్క) నమ=(మాయొక్క=our)" అనువానిలోని తుది 'అ' కారము సైత మీ బహువచన ప్రత్యయమె. ఇవి షష్ఠీ విభక్త్యంతములని వైయాకరణులు చెప్పిరి. నేనును 'అ' ప్రత్యయము షష్ఠీవిభక్తి యని ముందు చెప్పెదను. అచట వీని చరిత్ర విమర్శింపఁబడును. అటువ వైయాకరణులు 'ఎన-నమ' శబ్దములు షష్ఠ్యంతములని చెప్పినను వీనికిఁ బరమందు నపుంసక బహువచన

రూపములె యుండవలెనవియుఁ జెప్పుట 'ఎన-నమ'లు బహువచనాంతములనెడి నావాదమును స్థిరపఱుచును. ఉదా:—ఎనకెయ్‌గళ్ =నా చేతులు.

ఎల్లవిషయములందును నఱవము ననుసరించునట్టి మలయాళమున నపుంసక తదితర శబ్దార్థక బహువచన రూపములు 'అవ-ఇవ' అను నాకారముతో నున్నవి. మలయాళము ప్రాచీన తమిళ శబ్దములను సంగ్రహించునది. కానఁ దమిళ మలయాళములు రెంటను నిర్దేశార్థక నపుంసకైకవచన ప్రత్యయము 'ద' కార మనియు (దు-ది) బహువచన ప్రత్యయము 'అ' కార మనియు సంగీకరింపనగును. మలయాళమున 'అవత్తుగళ్-ఇవత్తుగళ్' ('త్తు' కాదు. 'ఱ్ఱు') అను రూపములును, 'అవ-ఇవ' అను వానికిఁ బర్యాయములై యున్నవి. వీని యందు 'అవగళ్-ఇవగళ్' అను తమిళ శబ్దములందు వలెనె బహువచన ప్రత్యయ ద్వయ మున్నదన నగును" (కాల్డు. ౨౭౭-౨౭౮-౨౭౯ పుటలు).

విమర్శము:—'ఇరుకిఱ్ఱన' మున్నగు వానిలో నిర్దేశక సర్వనామ శబ్ద ('అవ' అను దాని రూపాంతరమగు 'అన' శబ్దము) ముండవలసిన ప్రసక్తి లేదు. మఱియుఁ దమిళమునఁ బ్రాచీన కాలమున 'అవ' అను నమహత్ప్రథమ పురుష బహువచనమును దానికి మూలమగు 'అన' అనెడి సర్వనామ శబ్దమును నుండెడివనుట సత్యముకాదు. తొల్కాప్పియమున 'అన-అవ' అను సర్వనామ శబ్దములు పేర్కొనఁబడలేదు. 'అవ్-అవై' అను నమహత్ప్రథమ పురుష బహువచన శబ్దములు మాత్రమె కలవని పేర్కొనఁబడెను. అంతకన్నఁ బ్రాచీన ప్రమాణము తమిళమున నేమిగలదు?

"అదు ఇదు......" (తొల్కా. ౬౭౧ సూ.)="అదు-ఇదు-ఉదు-అఃదు-ఇఃదు-ఉఃదు; అవై-ఇవై-ఉవై-అవ్-ఇవ్-ఉవ్; యాదు-యా-యావై" అను పదునేను శబ్దములును నమహన్నామములు.

'నమ' శబ్దము కేవలాస్మదర్థకము కాదు. యుష్మదస్మదుభయార్థకము. కాన దీని కింగ్లీషులోని 'our' అనునది సరియగు పర్యాయము కాదు. తమిళమున 'అవగళ్-ఇవగళ్' అను రూపములు లేవు. తమిళమున "అవ్-అవై-ఇవ్-ఇవై" అని మాత్రమె నిర్దేశక సర్వనామామహద్రూపము లుండుటచేత వాని నుపేక్షించి మలయాళములోని 'అవ-ఇవ' అను వాని నపమార్గమున నాధారముగాఁ జేసికొని బహువచనమగు 'అ' ప్రత్యయపు చరిత్రమును గల్పింపఁదలఁచి యున్నారు గాన దొరగారు 'అవ-ఇవ' అను మలయాళ రూపములు తమిళమందును బ్రాచీనకాలమున నుండెడివని యొక యసత్య విషయమును నెలకొల్ప నారంభించిరి.

౭౯. II విష:—"ఎల్ల విషయములందును దమిళమునె యనుసరించు కన్నడ మీ 'అ' ప్రత్యయ విషయమున మాత్రము భేదిల్లుచున్నది. అట్టి బహువచన మగు 'అ' ప్రత్యయమును 'ఉ' కారముతో దాఁచుచున్నది. ఉదా:—తమి-పిఱ=(మిగిలినవి). కన్న-హెఅవు. ప్రాచీన కర్ణాట రూపము. మలయాళమందు 'అ' ప్రత్యయాంత తచ్ఛబ్ద నపుంసక బహువచన రూప (అవ) మున్నట్లును, దమిళమున నుంఃపవలసినయట్లును "తమిళమున 'అవ' ప్రాచీన రూపము. 'అవై' అర్వాచీన రూపము" అయియున్నట్లును జెప్పఁదలఁచి యున్నారు దొరగారు. 'అవ' అను రూపముండక 'అవు' అను నాకారము కన్నడమున నున్నది. అట్లు ప్రథమా బహువచనమున నున్నను ద్వితీయాది విభక్తుల బహువచనములలో 'ఉ' కారమగపడక 'అవ' అనునది యున్నట్లె కన్పట్టుచున్నది. ఉదా:—కన్న-అవఱ=(వాటియొక్క).

తెల్గున 'అది-ఇది' అను సర్వనామముల నపుంసక బహువచన రూపములు 'అవి-ఇవి' అనునవి. వీని ద్వితీయాది విభక్తి రూపములలో 'వా-వీ' అను రూపములు కన్పట్టుచున్నవి. "కన్న-అవరు; తెల్గు-వారు; కన్న-ఇవరు; తెల్గు-వీరు;" అను స్థలములందుఁ గల తెల్గులోని వింత సంప్రదాయము చొప్పుననే 'అవ-ఇవ' అను ప్రాచీన నపుంసక బహువచన రూపములనుండియును 'వా-వీ' అను రూపము (వాని-వాటి; వీని-వీటి) లేర్పడినవి. తెల్గున నపుంసకబహు కర్తృక క్రియ 'అవి' శబ్దాంతమై యుండును (వచ్చినవి).

ప్రాచీన తమిళ మలయాళములలో 'అవ' అనునదియు నవీనాఱవమున 'అవై' అనునదియుఁ దెల్గున 'అవి' అనునదియు నమహద్ బహువచన రూపములు. వీనిలోని యంత్యాచ్చుల మార్పులు సహజముగను సులభముగను నున్నవని డా. గుండర్టుగారు నాతోఁ జెప్పిరి. ఉదా:—ప్రాచీన తమి-ఇల్ల. నవీన తమి-ఇల్లై. ద్రావిడ భాషలలోని పదాంతమందలి 'అ' కారము తఱచుగా శిథిలమగుచుండును.

'గోండు' భాషలోఁ దదిదం శబ్దముల యేకవచన రూపములు-'అద్-ఇద్' అనునవి. బహువచన రూపములు-అవ్-ఇవ్. వీనినిబట్టియుఁ దెల్గుభాషలోని రూపములనుబట్టియు (అది-అవి-ఇది-ఇవి) పరిశీలించినపుడు ద్రావిడ సర్వనామ నపుంసక లింగైకవచన ప్రత్యయము 'ద' కారమనియు బహువచన ప్రత్యయము 'వ' కారమనియుఁ దోఁచును. అఱవ మలయాళ కన్నడరూపములను బట్టి పరిశీలించునపుడు 'అ' అనునదె బహువచన ప్రత్యయమనియు 'వ' కారము సంహితా వ్యవధాయక వర్ణమనియు స్పష్టపడును. తెల్గునందును మహద్రూపములలో 'అవరు=వారు. ఇవరు=వీరు' అని యేర్పడినట్లె

యమహద్రూపములందును 'అవ=వా. ఇవ=వీ.' అని యేర్పడెను (వాని=వాటి; వీని=వీటి) గానఁ దెల్గురూపములును 'అ' ప్రత్యయ సిద్ధాంతమును విరోధింపవు" (కాల్డు. ౨౪౯-౨౫౦ పుటలు).

విమర్శము:—తమిళమున 'అ' అనెడి యమహద్బహువచన ప్రత్యయము నామములందును గ్రియలయందును గలదని తొల్కాప్పియమె వచించుచున్నది.

"అ-ఆ-వ......" (తొల్కా. ౪౯౨ సూ.)=అమద్బహువచన నామములు 'అ-ఆ-వ' అనెడి ప్రత్యయములు తుదిని గలవై యుండును. ఉదా:—పొరుళ్+అ=పొరుళ=(వస్తువులు).

"అ-ఆ-వ......" (తొల్కా. ౭౦౦ సూ.)='అ-ఆ-వ' అనునవి తుదిని గల క్రియ లమహత్ప్రథమ పురుష బహువచనములు. ఉదా:—చెయ్‌తన=(అవి చేసెను) (చెయ్+త్+అన్+అ). 'చెయ్' ధాతువు. 'త' కారము భూతార్థకము. 'అన్' ఆగమము. 'అ' అమహద్బహువచన ప్రత్యయము. చెయ్యా=(అవి చేయవు) చెయ్‌కువ=(అవి చేయఁగలవు). దొరగా రీ విషయము నంతగాఁ బెంచి వ్రాయ నక్కఱలేదు. 'అవ' అనునది ప్రాచీన తమిళమందును మలయాళమందును బహువచన రూపమనియు 'అవై' అనునది నవీన తమిళ బహువచన రూపమనియు దొరగారు వ్రాయుట కేవలము నసత్య విషయము. 'అవై-అవ్' అనునవి మాత్రమె తమి ళామహద్బహువచన రూపములని తొల్కాప్పియరు చెప్పిన సూత్ర మీవఱకె (౭౯ I విష.) యుదాహరింపఁబడెను. అట్టి తొల్కాప్పియ సూత్రమునుబట్టి తెల్గునందు వలెనె తమిళమందును దదనుసారి మలయాళమందును నమహత్సర్వనామ ప్రథమ పురుషైకవచనము తకారమె యనియు నద్దాని బహువచనము వకారమె యనియు విశదపడుచున్నది. ఈ సర్వనామ రూపములలో 'అ' ప్రత్యయ గ్రంథమే లేదనియు స్పష్టపడుచున్నది. 'అవై' అనునది నవీనాఱవరూపమని దొరగారు వ్రాయుట కేవలము సాహసమనియుఁ బై తొల్కాప్పియ సూత్రము విశదీకరించుచున్నది. మలయాళములోని తచ్ఛబ్దామహద్బహువచన రూపమగు 'అవ' అనునది తమిళమందలి 'అవై' అనుదాని పరిణామమనియుఁ దమిళమందలి పదాంతములోని 'ఐ' కారము మలయాళమున 'అ' కార రూపమునందుట సుప్రసిద్ధమనియు (తమి-తలై; మల-తల) గ్రహింపవలెను (చూడు. ౭౯ I విష. ౧౫ II (ii) విష).

కన్నడమున 'అవ' అనునదె యమహత్తచ్ఛబ్ద బహువచన రూపమనియు దాని 'అ' ప్రత్యయమును గన్నడము 'ఉ' కారముతో దాఁచుచున్నదనియు దొరగారు వ్రాయుట యెంతయుఁ వింతయై యున్నది. కన్నడ ద్వితీయాది బహువచనములలో 'అవ' అనురూపమె కనఁబడుచున్నదను దొరగారి వ్రాఁత

కేవలము నపరిశీలనమూలకము. దొరగా రుదాహరించిన అవర శబ్దపు నిజ రూపము ఱకార ఘటితము. 'అవఱ' శబ్దమునకు 'అ+వ్+అఱ్+అ' అని ఛేదము. 'అ' అనునది సర్వనామరూపము-వకారము బహువచన ప్రత్యయము. 'అఱ్' అనునది యాదేశ విశేషము. 'అ' అనునది షష్ఠీవిభక్తి ప్రత్యయము. ఇందు 'అవ' అను 'అ' ప్రత్యయాంత రూపము గలదనుకొనుట కేవలము భ్రమ. "అ ఉకారస్య సంఖ్యాసర్వనామ గుణ వచనేషు". (కర్ణా. భూ. ౨౫ సూ). ఉకారాంతములగు సంఖ్యావాచక గుణ నామవాచక సర్వనామముల 'ఉ' కారమునకుఁ దృతీయాది విభక్తి పరకత్వమున 'అఱ్' అను నాదేశమగును. ఉదా:— ఎరడఱిం=(రెండిటిచేత) ఇనియదఱిం=(మధురమైన దానిచేత) అదఱిం=(దానిచేత) అవఱిం=(వారిచేత). అవఱ=(వారియొక్క). ఇవెల్ల 'అ' ప్రత్యయాంతములె యని చెప్పుటకు దొరగారు సాహసింతురా?

క॥ జనియిపు దుదంతకృత్స । ర్వనామ గుణవచన సంఖ్యాగళ్గె పవ ర్గాఱి ।
వినమఱ్కారం దిగ్వా । చినిలె తృతీయాది గళ్ప్రయోగి స పడెగుం॥

(శబ్దమణి దర్పణము. ౧౧౦ పద్యము).

(పవర్గె+అఱివినం; తృతీయాదిగె+అఱ్).

తెల్గునందు 'అదు-అవు' అనువానిచో 'అది-అవి' అని నిల్చినవి. "చేయదు—చేయవు. చేయఁగలదు-చేయఁగలవు." అను రీతిగల వానిచో 'దు వు' లే నిల్చియున్నవి. వీనిలో 'అవ' అను రూపమెక్కడ నున్నదో తెలియకున్నది. 'అదు-అది' అనునవె 'దా' అనియు, 'అవు-అవి' అనునవె 'వా' అనియు వర్ణవ్యత్యయ వికృతిచేఁ బరిణమించినవని గ్రహింపనగును. (చూడు వర్ణ ప్లుతి-౪౧ విష).

పయిసందర్భమునుబట్టి 'అదు-అవు' మున్నగువానిలోని 'అ' మున్నగునవి నిర్దేశ సర్వనామ రూపములనియు వానికిఁ బరమందున్న-'దు-ది-వు-వి' అనునవి 'న్-ళ్-ర్' అను మహద్వాచక ప్రత్యయములవలెనె (చూ. 23 II విష.) యజ్ఞేయ చరిత్రకములగు నిర్దేశక సర్వనామ ప్రథమా ప్రత్యయము లనియు గ్రహింపవలయును. 'అ' ప్రత్యయము 'పొరుళ్' (వస్తువులు) మున్నగు కొన్ని తమిళ శబ్దములలో మాత్రము వెలయుచున్నది గాని యాంధ్ర కర్ణాటములలో దీని ప్రసక్తిలేదు. గాన దీనిని దమిళ మలయాళ ప్రత్యయ మనఁదగును.

౭౭. III విష:—"తుళుభాషలో 'అవు' అనుదానికి 'అది' అని యర్థమని (చూ. ౭౫ III విష.) యీావఱకు వ్రాసియున్నాను. ఇట్టి పదములో వకారము వ్రాయఁబడలేదనియు 'అ-ఉ-ఉ' అని వ్రాయఁబడుననియు నందలి నడుమనున్న 'ఉ'కారము 'ద'కారమును దేల్చి పలుకుటచే నేర్పడినదే యనియు డా. గుండర్టు

గారి యభిప్రాయము. కాని తుళు వ్యాకరణము వ్రాసిన బ్రిగ్గెలు దొరగారు దానిని దమ తుళు వ్యాకరణమున 'అవు' అనియె వ్రాసిరి." (కాల్డు. ౨౫౧ పుట).

విమర్శను:—ఇట్టి వ్రాతలు నిరాధారములు. విమర్శ సహములు కావు.

౪౯. IV విష:—"జండు-లాటిను-గాతికు" భాషలలోను బ్రాచీన పెరిషి యను భాషలోను గల నపుంసక లింగ బహువచన హ్రస్వాకార (అ) ప్రత్యయము ద్రావిడ భాషలలోని యీ 'అ' ప్రత్యయమును సంబంధించుచున్నది. పై నుదాహరించిన రీతిని బ్రాపంచిక భాషలలోని కెల్ల లింగవచన వ్యక్తీకరణ విషయమున నీ క్రింద వివరించిన రీతిని నిరుపమానమగు నభివృద్ధిని బొందించి కొన్న (చూ. ౪౬ II విష.) ద్రావిడ భాషలు పయి యిండో యూరపియను భాషలనుండి యమహద్బహువచన ప్రత్యయము నెరవు తెచ్చికొన్నవనుట విశ్వసనీయము కాదు. ఇంకను ద్రావిడ భాషలనుండియే యిండో యూరపి యను భాష లెరవుకొన్నవనుట యర్హము. లేదా యీ రెండు కుటుంబముల 'అ' ప్రత్యయమునకు వేఱొక కుటుంబములోనిది మూల మనఁదగును.

లింగవచన భేద విషయమున ద్రావిడ భాషలలోఁగల వైశద్య మితర భాషలలో లేదు. సిథియను (టర్కి-షు-మంగోలియా) భాషలలో లింగ వ్యక్తీకరణసామగ్రియే లేదు. ఇండో యూరపియను భాషలలో సర్వనామము లందు మాత్రమె కలదుగాని క్రియలలో లేదు. సెమెటికు భాషలలోఁ (అరబికు-హిబ్రు) గ్రియలయం దేకవచనమునఁ గలదుగాని బహువచనమున లేదు. (చూడు ౪౬ II విష). ద్రావిడ భాషలయందన్ననో క్రియలందును బూర్తిగ నట్టి లింగ వ్యక్తీకరణ సామగ్రి గలదు. ద్రావిడ భాషలలో సమాపక క్రియను విన్నంత మాత్రముననె కర్తృవాచి సర్వనామ ప్రయోగము లేకున్నను దాని కర్తయొక్క లింగము విశదమగుచుండును" (కాల్డు. ౨౫౧ పుట).

విమర్శను:—అమహద్బహువచనమగు 'అ' ప్రత్యయము ద్రావిడ భాషలలో నాంధ్ర కర్ణాటాదులందు లేదు. ఇయ్యది తమిళ మలయాళ ప్రత్యయ మనఁదగును. ఇయ్యది పైని వ్రాసిన రీతి నిండో యూరపియను భాషలలోని 'అ' ప్రత్యయముతో సంబంధించుచున్న దగుటచేత దీని చరిత్రము సైత మత్యంత ప్రాచీనమును దుర్జ్ఞేయమును నని యెన్ననగును (చూ. ౪౯ II విష).

౫౦. విష:—(II సెక్షను-విభక్తి):—కాల్డు. ౨౫౨ మొ. ౨౫౪ పుటల వఱకుఁగల గ్రంథముతో విభక్తుల విషయమునఁ బీఠికగా వెనుకఁజెప్పిన విషయములనె పునరుక్తముగా దొరగా రుపన్యసించిరి. ప్రాచీనకాలమునఁ బ్రత్యయములు పదరూపములె యనుట ౫౫ III విషయమున నీ వఱకు వ్రాయఁబడినదె. "ద్రావిడ విభక్తి ప్రత్యయములలోఁ గొన్ని, నాగరక భాషలందుఁ బదరూపము

లును గొన్ని పదముల యాకారమును గోల్పోయి ప్రత్యయావస్థ నందినవియునై యున్నవి. బొత్తిగా ననాగరకమగు తుదభాషలో ప్రత్యయావస్థ నందిన విభక్తులు మిక్కిలి యరుదు. ఇందుఁ బ్రథమా ద్వితీయా షష్ఠులకు భేదమే లేదు." అను విషయములు మాత్రమె నూతనములు.

ఇండో యూరపియను భాషలయందువలెఁగాక ద్రావిడ భాషలలో నేక వచన బహువచన ప్రత్యయము లేకాకారముగనే యుండుననునది మొదలగు విషయములు ౭౬ IV విషయమున వివరింపఁబడినవె.

ఫిన్నిషుశాఖా భాషలలోను దుళు - తెల్గు భాషలలోను గొన్ని విభక్తి ప్రత్యయములందు స్వరశక్తికృతములగు మార్పులు గలవనియుఁ దుళుభాషలోని యేకవచనమునందలి 'అ' కారము బహువచనమున 'ఎ' కారమగుననియు నీ వఱకు ౩౮ విషయమునందును ౭౬ VII విషయమునందును వచింపఁబడినవె.

"కొందఱు హైందవ ద్రావిడభాషా పండితులును పాశ్చాత్య పండితులును గన్నడాంధ్ర, తుళుభాషలలో విభక్తిప్రదర్శన భేదములను జూపిరిగాని నే నందులకు సమ్మతింపఁజాలను. ఏ జాతి శబ్దములయందైనను విభక్తిప్రత్యయములు తుల్యముగనే యుండును. అవి ప్రకృతులతోఁ జేరునపుడు వచ్చు నాగమాదులలో మాత్రము భేదములుండును" (కాల్డు. ౨౫౪ పుట).

"విభక్తులను బేర్కొను వరుసలోను 'ప్రథమ-ద్వితీయ' మున్నగు విభక్తి సంజ్ఞలలోను నెనిమిదే విభక్తులనుటలోను ద్రావిడ వైయాకరణులు సంస్కృత వ్యాకరణ మార్గమునె యనుకరించిరి. స్పష్ట ప్రతిపత్తికయి నేనును నట్లె యిందు వ్యవహరించితిని గాని యిట్లనుసరించుట పొరపాటు. విభక్తులకు సార్థక నామములను బెట్టుకొనక 'ఒకటవ విభక్తి-రెండవ విభక్తి' అను రీతిని వానికి నామకరణము చేయుట సరికాదుగదా. పదద్వయ సంబంధబోధక శబ్దము లెన్నివిధముల నుండునో యన్ని విభక్తుల నంగీకరించు టుచితముకాదా? యొక్క-విభక్తి లోపించిన శేషషష్ఠీరూపమున కొకప్పుడు షష్ఠ్యర్థమును నొకప్పుడు సప్తమ్యర్థమును మఱొకప్పుడు విశేషణరూప సంబంధార్థమును వచ్చుచుండును గాన దానిని వేఱుగాఁ బరిగణించుట న్యాయ్యము. ఇట్లె సహార్థక తృతీయను వేఱుగ నెన్నుట యర్హము. ద్వితీయాది విభక్తుల కెక్కువ వాడుకయున్నను బ్రథమావిభక్తిని మొదటి దానినిగ సంస్కృత వైయాకరణులు నిల్పిరి" (కాల్డు. ౨౫౪ పుట).

విమర్శము:—ఐచ్ఛికములగు నిట్టి యేర్పాటుల విషయమున నుండెడి యభిప్రాయభేదములను విమర్శించుట యనావశ్యకము. ద్రావిడపండితులు సాధా

రణముగా సంస్కృతపండితులై యుండెడివారుగాన నట్టి పరిమార్జిత సంస్కృత వ్యాకరణ చ్ఛాయలు ద్రావిడవ్యాకరణములలో నుండుట వింతకాదు.

తమిఆ పండితులు విభక్తులకు సంస్కృతనామములను నిల్పలేదుగాని తదర్థక తమిఆ సంజ్ఞలను గల్పించికొనిరి. సంస్కృతపు వరుసను వీడలేదు. సంస్కృత-విభక్తి=విభాగ=తమి-వేఱు. సంస్కృ-విభక్తి=తమి-వేట్రు (ట్టు) మై. సంస్కృ-ప్రథమా విభక్తి=తమి-ముదల్ వేట్రు (ట్టు) మై=(మొదటి విభక్తి). సంస్కృ-ద్వితీయావిభక్తి=తమి-ఇరణ్డావదు వేట్రు (ట్టు) మై.=(రెండవది విభక్తి) (ఇరణ్డు+అ+అదు)=ఇరణ్డామ్‌వేట్రు(ట్టు)మై=(ఇరణ్డు+అమ్) (అమ్=అగుమ్)= (రెండగు విభక్తి). మున్ఱామ్ వేట్రు (ట్టు) మై=(మూఁడగు విభక్తి) నాన్కామ్ వేట్రు (ట్టు) మై=(నాల్గగు విభక్తి) ఐన్దామ్ వేట్రు (ట్టు) మై=(అయిదగు విభక్తి) ఆఱామ్ వేట్రు (ట్టు) మై=(ఆఱగు విభక్తి) ఏళామ్ వేట్రు (ట్టు) మై=(ఏడగు విభక్తి) ఎట్టామ్ వేట్రు (ట్టు) మై=(ఎన్మిదగు విభక్తి) = విళివేట్రు (ట్టు) మై= (సంబోధన విభక్తి).

౮ం. I విష:—"ప్రథమావిభక్తి:—ద్రావిడభాషలందు సిథియను-జపాను భాషలందువలెనె ప్రథమావిభక్తి ప్రత్యయము లేదు. వానిలో 'పెయర్' అనఁగా 'ప్రాతిపదికమె' (నామమె) ప్రథమాంతరూపము. అట్టి ప్రాతిపది కముపైని బహుత్వబోధక ప్రత్యయము నిల్చుటమాత్రమె ప్రథమా బహువచన రూపమందలి విశేషము. కాన బహుత్వబోధకములగు 'ర్-ల్-కళ్-గళ్-అ' అనునవి ప్రథమైకవచన ప్రత్యయములు కానేరవు. ఈ పద్ధతి కపవాదముల వంటివి మూఁడు స్థలములు ప్రథమావిభ క్త్యాభాసములు గలవు. అనఁగా నా మూఁడు స్థలములందును బ్రథమావిభక్తి ప్రత్యయ మున్నట్లు కనఁబడును గాని యచటిది నిజమగు విభక్తి ప్రత్యయము కాదు. అదియుఁ బ్రకృ క్తిత్యవయవమె. ఆ మూఁడు స్థలములును నీ క్రింద వివరింపఁబడును" (కాల్డు. ౨౫౫ పుట).

విమర్శము:—సంస్కృతమున 'రామ+సు' అని యిట్లు ప్రథమా ప్రత్యయము నిల్చినట్లు తమిఆమునఁ బ్రథమా ప్రత్యయమేదియు నిల్చుటలేదు గానఁ దమిఆ మలయాళములందుఁ బ్రాతిపదికమే ప్రథమైకవచనమని చెప్ప వలసెను. ముందీ విషయము విపులముగ విమర్శింపఁబడును.

"అవైతామ్ పెయర్......" (తొల్కా. ౫౪౮ సూ.)=ఆ విభక్తులు- "౧. ప్రాతిపదికము. ౨. ఐ. 3. ఒడు. ౪. కు. ౫. ఇన్. ౬. అదు. ౭. కణ్. ౮. సంబోధనము" అని యెనిమిది. సన్న్యాలున 'అ-ఆదు' అనునవియును షష్ఠీ ప్రత్యయములె. "అపదం న ప్రయుఞ్జీత" "న కేవలా ప్రకృతిః ప్రయో క్తవ్యా-నాపి ప్రత్యయః" అను వైయాకరణ సిద్ధాంతముల చొప్పున విభక్త్యం

తము కానట్టి ప్రాతిపదిక మాత్రము వాక్యప్రయోగార్హము గా (చూడు 'వ్యా. సం.' ౧౧౯ I విమ. ౪౪౬ పుట)దను సంస్కృత సంప్రదాయమును దొల్కాప్పియరు పాటింపలేదు. కర్ణాటాంధ్ర వైయాకరణలు ప్రథమైకవచన ప్రత్యయమును బ్రాతిపదికము పైనిల్పి దానికి లోపమును సూత్రించి యద్దానికి వాక్య ప్రయోగార్హతను సంపాదించి కొనిరి. తెలుఁగున "దధి-వారి-నది-దేవత-చేసి-చేయక" మున్నగు శబ్దములకు 'డు-ము-వు' అనువానిలో నేదియు సిద్ధింపమింజేసి వాని మీఁద సంస్కృత 'సు' ప్రత్యయమును నిల్పకతీరమింజేసి ప్రాతిపదికము లన్నిటి మీఁదను 'సు-జస్' మున్నగు సంస్కృత ప్రత్యయములనే నిల్పి వానికి లోపాదేశాది విధానమున విభక్త్యంత రూపములను సాధించికొనిరి. కర్ణాటులు కర్ణాట విభక్తి ప్రత్యయ యోగముననే పదముల సాధించికొనిరి.

"అనుతాం స్త్రియాం-సమానాం సర్వస్య స్త్రీ సమస్య చ సు లోపః" (ఆం. చిం. 'వ్యా. సం.' ౧౬౧ విమ.)=ఉకారాంతేతర స్త్రీలింగములయు స్త్రీ సమములయుఁ బ్రథమైకవచన 'సు' ప్రత్యయము లోపించును. ఉదా:—రమ-అమ్మ-అన్న-మొ.

తక్కిన శబ్దములలో అకారాంత మహత్పుంలింగములకుఁ బ్రథమైక వచనమున 'డుజ్' ప్రత్యయమగును. అకారాంతములగు నమహత్తులకును నపుంసకలింగములకును బ్రథమైకవచనమున 'ము' ప్రత్యయ మగును. ఉకారాంత ముల కంతటను బ్రథమైకవచనమున 'వు' ప్రత్యయ మగును. ఉదా:—రాముఁడు-వనము-తనువు మొ.

"మహతోఽత ఉ ద్విభక్తౌ। మహత స్సో ర్డు జనితో భవే త్పుంసి" (ఆం. చిం. వ్యా. సం. ౧౪౯-౧౩౦ విమ.) "స్యా దమహతాం విభక్తౌ సో శ్చ ము" (ఆం. చిం. వ్యా. సం. ౧౪౫ విమ). "సర్వ త్రో ర్దోతో ర్వ ర్భవతి మువత్" (ఆం. చిం. వ్యా. సం. ౧౫౨ విమ).

తెల్గునఁ బ్రథమా బహువచనమున 'లు' ప్రత్యయము నిల్చును. సర్వ నామములకును, గొన్ని నామవాచకములకును 'రు' ప్రత్యయము నిల్చును. ఉదా:—రాములు-వారు-ఎల్లరు-అల్లురు-బాలురు-మొ.

"లు జసో ల శసోఽలాన్తా। ల్లాన్తాత్తు రు రౌ తయోః క్రమేణ స్తః" (ఆం. చిం. వ్యా. సం. ౧౩౫ విమ.). "లు లయో స్తథా పుంసి 'రు-రౌ' స్మృతౌ" (వికృ. వ్యా. సం. ౯౨ విమ).

కర్ణాట వైయాకరణులు 'మ్' అనునది ప్రథమా విభక్తియనియు, 'అ' కారాంతేతరములపై నయ్యది లోపించుననియు 'అ' కారాంతముల మీఁది యట్టి మకారమున కనుస్వారాదేశ మగుననియు సూత్రించిరి.

"తాస్తు మ మిం కె అ ద వొళ్" (కర్ణా. భూ. ౩౯ సూ.)=ఆ విభక్తులు:- ప్రథమావిభక్తి-మ్. ద్వితీయ-అమ్. తృతీయ-ఇమ్. చతుర్థి-కె. పంచమి-(అత్)=అత్తణిం. షష్ఠి-(అద్)=అ. సప్తమి-ఒళ్.

"అతో నుస్వారః ప్రథమైకవచనస్య" (కర్ణా. భూ. ౪౫ సూ.)= అకారాంత ప్రాతిపదికముకంటెఁ బరమైనఁ బ్రథమైకవచన 'మ' కారమున కనుస్వా రాదేశ మగును. ఉదా:—నెల+మ్=నెలం.

"అన్యస్మా ల్లోపః (కర్ణా. భూ. ౪౬ సూ.)=అకారాంతేతర ప్రాతిపదిక మునకుఁ బరమైన ప్రథమావిభక్తి మకారము లోపించును. ఉదా:—హరి+మ్ =హరి. ఇదె ప్రథమైకవచన రూపము. అమహద్ బహువచనమున 'గళ్' ప్రత్యయమును మహద్ బహువచనమున 'అర్' మున్నగునవియు నిల్చునని యీవఱకు వచనవివరణ సందర్భమున విశదీకరింపఁబడెను (చూడు ౭౬ I విష).

తమిళమున నాంధ్ర కర్ణాటములందువలెఁ గాక ప్రాతిపదికమె ప్రథమైక వచనము. దాని మీఁదనే యితర విభక్తి వచనములు నిల్చును.

"కూఱియ ముఱైయిన్......" (తొల్కా. ౫౫౩ సూ.)=ప్రథమా రూపమున కేమార్పును గల్గకుండగనే యితర విభక్తు లట్టి ప్రథమా రూపము తుదిని నిల్చును. ఉదా:—చాత్తన్+ఐ=చాత్తనై='చాత్తన్' అను వానిని. చాత్తన్+ఒడు=చాత్తనొడు=చాత్తననువానితో. మొ.

కాల్డు వెల్డుగారు తలఁచుగాఁ దమిళ విషయములనే వ్రాయుదురు గాన నట్టి తమిళ మార్గమునె వివరించి ద్రావిడ భాషలందెల్లఁ బ్రథమైకవచన ప్రత్యయము లేదని వ్రాసిరి.

నేటి వ్యావహారి కాంధ్రమునందు సైతము ప్రథమైక వచనము మీఁదనే తదితర విభక్తి వచనములు నిల్చుట ప్రసిద్ధమైయున్నది. ఉదా:—వాఁడు-వాడిని=వాణ్ణి. వాడితో. రాముడులు=రాముళ్ళు. వాళ్ళు-వీళ్ళు—మొ. (చూడు ౭౬ VI విష.) (చూ. 'వ్యా. సం.' ౧౧౮ I విష).

౨౧. II విష:—తమిళమునఁ బ్రథమైకవచన ప్రత్యయము లున్నట్లు తోఁపించు మూఁడుస్థలముల నిటఁ గాల్డువెల్డుగారు చూపి యవి ప్రథమా ప్రత్యయములు కావని నిరూపించుచున్నారు.

(1) "నపుంసకలింగబోధక ప్రత్యయమగు 'అమ్' అనునది ప్రథమైక వచన ప్రత్యయమువలెఁ దోఁచును. సంస్కృతమున 'అమ్' అనునది నపుంసక ప్రథమైకవచన ప్రత్యయమై యున్నది. తమిళభాషలో సైతము 'అమ్' అను

నది తుదినిగల నామవాచకములు (తద్భవములును దేశ్యములును) నపుంసక లింగములుగా నున్నవి. ఆయిరమ్ = (సహస్రము) మరమ్ = (మ్రాను). సంస్కృత పారిభాషిక నపుంసక ద్వితీయావిభక్తి ప్రథమాతుల్యముగా నుండును. అఱవమున ద్వితీయాద్యేకవచనములలో 'అమ్' అనునది లేదు. అమహన్నపుంసక తమిళ బహువచనములలో నెల్లయెడలను 'అమ్' ప్రత్యయము చేరఁగా దానిపైని బహుత్వబోధక ప్రత్యయము నిల్చుటయు దానికిఁ బరముగ విభక్తి ప్రత్యయము నిల్చుటయు సంప్రదాయమై యున్నది. ఇట్లగుట చేత నీ 'అమ్' అనునది ప్రథమైకవచన ప్రత్యయమనుట కవకాశము లేదు. (నపుంసక చిహ్నము ప్రకృత్యవయవమె యని భావము) తెల్గునను 'అము' అనునది నపుంసకలింగ చిహ్నముగా—అంగావయవముగా—భావింపఁబడుచున్నది. ఎల్లవిభక్తులలోను నేకత్వమున 'అము' అనుదానిపైని విభక్తి ప్రత్యయములు నిల్చును. బహుత్వమున 'అము' అనుదానిపైని బహుత్వబోధక ప్రత్యయమును దానికిఁ బరముగా విభక్తి ప్రత్యయములును నిల్చుచుండును. (పైకారణములచే నఱవమందువలెనె తెల్గునందును 'అము' అనునది విభక్తి ప్రత్యయము కాదనియు నపుంసకలింగ చిహ్నమనియు విశదమగుచున్నదని భావము.)

పటగన్నడమునందును 'అ' కారాంతములకుఁ బ్రథమా ద్వితీయావిభక్తుల యేకవచనమున మాత్రము 'అమ్' అను ప్రత్యయము గలదు. బహువచనమున నది చూపట్టదు. ఉదా:—మరమ్ = (మ్రాను) బహు - మరగళ్ = (మ్రాఁకులు). 'మరంగళ్' అనురూప ముండదు. హళగన్నడమునఁ బ్రథమైకవచన మకారము వకారమగును. ఉదా:—మరవు=(మ్రాఁకు).

సంస్కృతమునుండి యఱవమునకు వచ్చిన నపుంసకలింగ నామవాచకముల ప్రథమైకవచనమున 'అమ్' అనునది నిల్చును. ఉదా:—అమలమ్=(నిర్మలము). కమలమ్=(పద్మము). మొ. ఈ 'అమ్' ప్రత్యయమె యెల్లవిభక్తుల బహువచనములలోను నిల్చుచున్నది. కావుననె సంస్కృత భవములం దంతటను 'అమ్' అనునది ప్రాతిపదికావయవముగఁ దలంపఁబడుచున్నది. అఱవమునందలి 'అమ్' ప్రత్యయము సంస్కృత నపుంసక ప్రథమైకవచనమగు 'అమ్' ప్రత్యయమునకు భిన్నము. అనేక శుద్ధద్రావిడ ధాతువులకు 'అమ్' ప్రత్యయమును జేర్చుటచేత నవి నామవాచకములగుచున్నవి. ఉదా:—నిల్=(నిలుచు). నిలమ్=(నేల). ఆట్=(లోఁతుగా నుండు). అటమ్=(లోఁతు). (చూడు ౭౫ II విభ) (చూ. ౧౩౭ I విభ). (కాల్డు. ౨౭౫ పుట).'' (కాల్డు. ౨౫౫-౨౫౬ పుటలు).

విమర్శము:—దొరగారు ద్రావిడ శబ్దముల తుది మకారమును 'అమ్' అని వాడుదురు. ఇది మకారమాత్రమె. దీనికి వ్యుత్పత్తి వ్రాయునపు డిది 'అమ్' అనెడి సర్వనామరూపమె యనియు 'అదు' శబ్దపర్యాయమె-యనియు నిరూపింప నున్నారు. (చూ. ౧౦ III విష). కాన నిప్పటినుండియు దానిని నిరాధారముగా, 'అమ్' అని వ్యవహరింప సాగిరి. ఇది 'నిల్+అమ్=నిలమ్' అనురీతిని గృదంతములతోను సంస్కృతాదంత నపుంసక ప్రథమైకవచన ప్రత్యయముతోను బోలిక గల్గియుండును.

ద్రావిడభాషలలోని 'మరమ్-కుళమ్-నిలమ్' మొదలగు శబ్దములందలి మకార మమహత్ప్రథమైకవచన ప్రత్యయమనుటయె యుక్తము. కర్ణాట వ్యాకర్తలెల్ల 'మ' కారము ప్రథమైకవచన ప్రత్యయమని సూత్రించిరి. (చూ. ౧౦ I విష). ఆంధ్ర వ్యాకర్తలును 'ము' అనునది ప్రథమైకవచన ప్రత్యయమనియు నయ్యది యమహ దకారాంతములపై నిల్చుననియు సూత్రించిరి. తెల్గు 'ము' ప్రత్యయము సంస్కృత విభక్తి మకారమున కభిన్నము కాదు. (చూడు ౫౩ విష.) (చూడు ౧౦ I విష). ఆంధ్ర కర్ణాటభాషలవారు సంస్కృత వాసనచేఁ బ్రాతిపదికమునుండి సుబ్విభక్త్యంతరూపములను సాధించిరి. కాని ద్రావిడభాషలను వ్యవహరించువారు సాధారణముగా నంతటను బ్రథమైక వచనరూపమును మూలశబ్దముగ నంగీకరించుచు దానిపై నితర విభక్తి వచనరూపములను నిల్పుచు సుబంతరూపములను వ్యవహరించుచు వచ్చిరి. కాన ద్రావిడభాషలం దెల్లఁ బ్రథమైకవచన సదృశ శబ్దమె తక్కిన విభక్తి వచనములు నిల్పు నంగ మనఁగా మూలశబ్ద మనుట సహజము. అట్లగుట చేతనే తొల్కాప్పియమునఁ బ్రథమైకవచనమె ప్రాతిపదికమని సూత్రింపఁ బడెను. (చూ. ౧౦ I విష). తమిళ కన్నడ మహన్మహతీ ప్రథమైకవచనముల తుదినుండు 'న్-ళ్' అనునవి బహుత్వబోధకమగు 'ర్' అనునది పరమగు నపుడు లోపించును. అట్లేర్పడిన ప్రథమా బహువచన రూపసదృశ శబ్దమె తక్కిన విభక్తుల బహువచనరూపము లవతరించుటకు మూలమగుచున్నది. ఉదా:—ప్రాచీన తమిళ మహత్ప్రథమ-రామన్-రామర్. ద్వితీ-రామనై-రామరై. తృ-రామనొడు-రామరొడు. మొ. ప్రాచీన కర్ణాట ప్రథమ-(దేవన్) =దేవం. (బహు) దేవర్. ద్వితీ-దేవనం-దేవరం, తృతీ-దేవనిం-దేవరిం-మొ. సర్వనామములందును నిట్లె ప్రథమైకవచన బహువచన సదృశ శబ్దములె తక్కిన విభక్తుల యేకవచన బహువచన ప్రత్యయములు నిల్చుటకు మూలరూపములు. ఉదా:—తమి-అవన్-అవర్. ద్వి-అవనై-అవరై. తృతీ-అవనొడు-అవరొడు. మొ. పలగన్నడ ప్రథ-అవం - అవర్. ద్వితీ - అవనం - అవరం.

తృతీ-అవనిం-అవరిం- మొ. గ్రాంథికాంధ్రమునఁ బ్రథమైకవచనము-(రామన్ +తు=రామన్తు)=రాముఁడు. (బహు) రాములు. ద్వి. రామన్+ఇ+నున్= రామునిన్. (బహు) రాములు+అ+నున్=రాములనున్. తృ-రామునిచేతన్- రాములచేతన్ మొ. వ్యావహారికాంధ్రమున మహత్ప్రథమ-అల్లుఁడు-(బహు) (అల్లుఁడులు = అల్లుడ్లు)=అల్లుళ్ళు. ద్వితీ-(అల్లుఁడు+ఇ+నున్)=అల్లుడిని= (అల్లుడ్ని)=అల్లుణ్ణి. (బహు) (అల్లుళ్ళు+అ+నున్)=అల్లుళ్ళను. తృతీ-అల్లుడి చేత-(బహు) అల్లుళ్ళచేత. ఇట్లె రాముడు-రాముళ్ళు. ద్వి-రాముడిని-(బహు) రాముళ్ళను-రాముడిచేత (బహు) రాముళ్ళచేత. మొ.

ద్రావిడామహాచ్ఛబ్దములలో 'అ' కారాంత ప్రథమైకవచనము మాత్రమె 'ము' కారము. కావుననే దీనిని దొరగారు 'అమ్' ప్రత్యయమని వ్యవహరింపసాగిరి. ఉదా:—తమి ప్ర-ఏ-(మర+మ్) మరమ్=(మ్రాను). (బహు)-(మరమ్ + కళ్) = మరఙ్గళ్ = (సరళాదేశ మర్వాచీనము) (ద్వితీ)- (మరమ్+అత్తు+ఐ)=మరత్తై. (బహు)-మరఙ్గళై (తృతీ)-మరత్తోడు. (బహు)-మరఙ్గళోడు. పటగన్నడము-(మర+మ్) మరం. (బహు)-మరంగళ్ =మరగళ్. ద్వితీ:—(మరమ్+అం)=మరనం = మరమం. (బహు)-మరంగ ళం=మరగళం. (తృతీ)-మరదిం (బహు)-మరంగళిం=మరగళిం మొ. తెల్గు నందును-ప్ర-ఏ-అల్లము. (బహు)-అల్లములు. ద్వితీ-అల్లమును. (బహు)-అల్లము లను. తృతీ-అల్లముచేత. (బహు)-అల్లములచేత మొ. ఇట్టి 'ము' అనుదాని కాంధ్ర వ్యాకర్తలు-'మ్ము-ంబు' అనువాని నాదేశించిరి. ఉదా:—అల్లము= అల్లమ్ము=అల్లంబు. అల్లములు అల్లమ్ములు-అల్లంబులు మొ.

ప్రాచీన తమిళ కర్ణాటములలో మకారమె ప్రథమైకవచన ప్రత్యయమై యున్నను దెల్గున నట్లుకాదు. "మ్వు=మ్బు=ంబు=బు=మ్ము=ము" అనురీతిని దెల్గున నమహత్ప్రథమైకవచన ప్రత్యయ పరిణామము నెన్నవలెను. ప్రాచీ నాంధ్రశాసనముల ప్రతిబింబములలో 'ము-మ్ము' అనునవి యచ్చునకేనిఁ గాన రావు. (చూడు ౫౩ విమ. ౧౭ VII విమ). ఉకారాంత మహన్మహత్య మహదేకవచనములందు 'వు' అనునది ప్రత్యయముగాను దక్కిన విభక్తులందు విభక్తి పూర్వాగమముగాను వెలసియున్నది. ఇది యుచ్చారణ స్వభావమున నేర్పడిన దనవచ్చును.

పయి సందర్భమునుబట్టి దొరగా రనుచున్నట్లు తెల్గు 'ము' ప్రత్యయము 'అమ్=అము' అను రీతినేర్పడినది కాదనుటకు సందేహము లేదు. 'అమ్- ము-మ్' అనునవి యార్వాచీన రూపములనియు వీని చరిత్రమున కింకను

వెనుకకుఁ బోవలసియున్నదనియు 'మ్బు-మ్బు' అనునవి కేవల ప్రాచీనతమ రూపములై యుండ నోపుననియు విశదమగుచున్నది. (చూడు ౫౩ విభ).

సంస్కృత వైయాకరణులు వ్యాకరణ కార్యాంతరోపయోగమునకై 'అమ్' అను దానినిఁ బ్రథమైకవచన 'సు' ప్రత్యయమున కాదేశించిరి. కాని యట్టి 'అమ్' ప్రత్యయపు 'అ' కారమెందును నిల్చునది కాదు. అందు నిల్చునది మకారమాత్రమె. అది 'అ' కారాంత నపుంసకములందె నిల్చును. అట్టి సంస్కృత మకారపు సంబంధముననో లేక దొరగారు కొన్ని స్థలములందుఁ జెప్పుచున్నట్లు సంస్కృత మకారమునకు మూలమగు భాషాంతరము మూలముననో ద్రావిడభాషలలో నమహ దకారాంత శబ్దముల ప్రథమైకవచనమున 'మ' కారము వెలసియున్నది. ధాతుజన్యములగు 'అమ్మం'తముల సుబ్విభక్తి రూపములు సయితము 'మరమ్' మున్నగు వాని రూపముల రీతినే యేర్పడుచున్నవి. ఉదా:—నిల్ =(నిలుచు). నిలమ్=(నేల). ప్ర. ఏ. నిలమ్=(బహు) నిలఙ్గళ్. ద్వి. నిలత్తై-(బహు) నిలఙ్గళై మొ.

ఇట్టి స్థితిలో డా. కాల్డు వెల్లుగారు తమిళమున ద్వితీయా ద్యేకవచనములలో 'అమ్' అనునది నిల్వ లేదనియు నట్లగుటంజేసి 'అమ్' అనునది నపుంసకలింగ చిహ్నమే కాని యేకవచన ప్రత్యయము కాదనియు నట్లేకవచన ప్రత్యయమెయై యున్నచో నది ద్వితీయాద్యేకవచన రూపములందుఁ గన్పట్టకుండుటయే కాక వాని బహువచన రూపములందు జూపట్టుచుండుట యెట్లు సంభవించుననియు వ్రాయుట సరికాదు.

తమిళ ద్వితీయా ద్యేకవచనములలో 'అమ్' అనఁగా మకారము 'అత్తు' అను సా(చా)రియై పరమగుటచే లోపించును. కావున నచట 'అమ్' చేర లేదనుట సరికాదు.

"మంకాన్......" (తొల్కా. ౧౮౬ సూ.)=మకారాంత శబ్దములకు విభక్తిపరమగునపుడు 'అత్తు' అనెడి సా(చా)రియై వచ్చును.

"అత్తేవత్తే......" (తొల్కా. ౧౩౨ సూ.)—అత్తు-వత్తు (ట్టు) అను నాగమములు పరమగునపుడు పూర్వపదాంతమందున్న వ్యంజనము లోపించును. దొరగారె 'అమ్' లోపించి యచట 'అత్తు' నిల్చునని ముందు వచింతురు. (చూడు ౮౨ VI విభ).

"అత్తిన్......" (తొల్కా. ౧౨౬ సూ.)='అత్తు' అను నాగమము లోని అకారము 'అ' కారాంత శబ్దములకుఁ బరమగునపుడు లోపించును. ఉదా:—మరమ్+ఐ=మరమ్+అత్తు+ఐ=మరత్తు+ఐ=మరత్తై=(మ్రానిని).

'పట గన్నడమునఁ బ్రథమా ద్వితీయావిభక్తుల యేకవచనము 'అమ్' అను దొర గారి వ్రాఁత తప్పు. ప్రథమైక వచనము 'మ్' అనునది యనియు ద్వితీయైకవచన ప్రత్యయము 'అమ్' అనునది యనియుఁ గన్నడ వ్యాకర్తలు చెప్పుచున్నారు. (చూ. ౮౧ I విష.). పట గన్నడమున 'మరంగళ్' అను రీతిని బహువచనమున 'గళ్' ప్రత్యయమునకుఁ బూర్వముగ ననుస్వారము నిల్వాదని దొరగారు వ్రాయుట బొత్తిగాఁ దప్పు.

"అదన్తా న్నాగమః పూర్వ స్మిన్ గళః" (కర్ణా. భూ. ౮౯ సూ.)= అకారాంత శబ్దమునకు 'గళ్' అనునది పరమగుచుండఁగా 'న' కారాగమము వచ్చును. ఉదా:—గజ+న్+గళ్=గజంగళ్=(గజములు). బహుళాధికారములోని దగుటచేత నీవిధి కొకప్పుడు వైకల్పికత్వము గల్గును. ఉదా:— మరంగళ్=మరగళ్. అకారాన్తా త్తనుటచేత మడిగళ్=(మళ్ళు) మడుగళ్= ప్రాదములు......మున్నగు చోటులందు 'న' కారాగమము లేదు.

"మనయోర్బిన్దుః (కర్ణా. భూ. ౧౧౨ సూ.)=మకార నకారములకు బిందుగును." అను నీ సూత్రముచేతఁ బయి నకారాగమము బిందువయ్యెనని యెఱుంగునది.

తెల్గునందును "అల్లంబు=అల్లమ్ము=అల్లము" మున్నగు ప్రథమైకవచన సదృశరూపముల మీఁదనే యితర విభక్తి వచనములు నిల్చుచున్నవి. ఉదా:— అల్లంబు అల్లమ్ము-అల్లము (బహు) అల్లంబులు-అల్లమ్ములు-అల్లంములు. ద్వితీ- అల్లంబును-అల్లమ్మును-అల్లమును. (బహు)-అల్లబులు+అ+ను=అల్లంబులను- అల్లమ్ములను-అల్లములను మొ.

ఆంధ్ర వైయాకరణులు ప్రాతిపదికములనుండి సుబంతరూపములను సాధించువారు గానఁ బ్రథమైకవచనేతర స్థలములందలి 'ంబు=మ్ము-ము' అనునవి యాగమ విశేషములని వచించిరి.

"స్యా దమహాతాం విభక్తౌ సో శ్చ ము, తదుపరి పున ర్మ బూ ప్రాచామ్" (ఆం. చిం.) (వ్యా. సం. ౧౮౫ విష). ఉదా:—వనము - వనమ్ము - వనంబు. (బహు) వనములు-వనంబులు-వనమ్ములు.

పయి రూపములలోని "వనమ్ములు-వనంబులు" అనునవె వాని ప్రథమైక వచన సంబంధిత్వమును విశదీకరించుచున్నవి. ఈ సందర్భమునుబట్టి దొరగారి 'అమ్' ప్రత్యయమె తెల్గున 'అము' అయ్యెనను నాశయము సరికాదని విశదమగుచున్నది. (చూడు. ౫౩ విష).

౮౧. III విష:—పయిని వివరించిన 'మరమ్' మున్నగు శబ్దములలోని 'మ' కారమును 'అమ్' అని వ్యవహరించి దొరగారి రిపు డయ్యాది 'అదు' శబ్ద

పర్యాయమగు 'అమ్' అను సర్వనామమె యని నిరూపించుచున్నారు. ఈ నిరూపణమునందును మకార మనుమహ దకారాంత ప్రథమైకవచన మనెడి సిద్ధాంతము విడువ దయ్యెను. 'అమ్' అను సర్వనామ రూపమునందలి 'అ' అను నిర్దేశ సర్వనామ శబ్దముపైని 'దు' అనునది ప్రథమైక వచనముగ నిల్చినట్లె 'మ' కారము నయితము నిల్చె ననఁదగును గదా.

" 'అమ్' అనునది వ్యవహార విదూరమగు తచ్ఛబ్దార్థక సర్వనామమని, డా. గుండర్టుగారు వచించిరి. సర్వనామ విశేషణములగు 'అంద=(ఆ)' ఇంద=(ఈ)' మున్నగు శబ్దములును 'అఙ్గు'=(అక్కడ) మున్నగు క్రియా విశేషణ సర్వనామములును 'అమ్' శబ్దమూలకములె యనుట సందిగ్ధమై యున్నది. 'ఆఙ్గు'=(ఆ స్థలము) 'ఈఙ్గు'=(ఈ స్థలము) మున్నగు దీర్ఘఘటిత రూపాంతరములు గలవు. వీనియందలి యనునాసికము సంధివలన వచ్చిన యాగమ మనఁదగును. తుళుభాషలోని 'ఇందు-ఉందు' అనునవి 'ఇది-అది' అను నిర్బిందురూపములకుఁ బర్యాయములై యున్నవి. అనేక ద్రావిడభాష లలోనున్న యీ 'అమ్' అనుదానిలోని 'అ' అనునది నిర్దేశ సర్వనామ శబ్దమగు నపు డీక దానిలోని 'మ' కారమేమి? యనుశంక కలుగక మానదు. కాన నీ వ్యుత్పత్తియుఁ దృప్తికరముగా లేదు. ఇట్లీ మకార మేమియో చెప్పఁజాల కున్నను 'అమ్' అనునది 'అదు' అను సర్వనామమునకు సమానార్థకమనియుఁ బ్రత్యయ రూపమునందిన ప్రాచీన శబ్దమనియు మాత్రము నిశ్చయింప వచ్చును. అఱవపద్య కావ్యములలో నపుంసక సర్వనామముల తుదిని 'అదు' అను సర్వనామమును జేర్చినరూపము లున్నట్లె యీ 'అమ్' ప్రత్యయ మును జేర్చిన రూపము లుండవచ్చును. ఉదా:—పొన్+అదు=పొన్నదు (బంగారము). కాని 'అదు' శబ్దము పృథక్ప్రయోగార్హము. 'అమ్' అనునది యట్టిది కాదు. అఱవపద్యకావ్యములలో నామవాచకముల ద్వితీయాది విభక్తి స్థానమందు 'తాన్-తామ్' అను సర్వనామములయొక్క ద్వితీయాది విభక్తుల రూపములను నిల్పి ప్రయోగింపఁబడుట గలదు. ఉదా:—మరత్తై=(వృక్ష మును) అనుటకు మాఱుగా 'మరన్దనై' అని వాడవచ్చును. ఇట నాత్మార్థక శబ్దము తచ్ఛబ్దార్థకముగా మాఱినట్లున్నది.

అఱవమున 'అదు' అను దానికి సరిగా 'ఎదు' అనునది యున్నట్లె, "తమి-'ఎన్-ఏన్' తెల్గు-'ఏమి' అను వానికి సరిగ 'అన్-అమ్' అనునవి యేల యుండ రాదని తలంపవలయును. 'అమ్' అనుదానికి సరిగ 'అన్' అనునది యుండుట సహజమె. ఉదా:—కడమ్=కడన్=(ఋణము) ఉరమ్=ఉరన్=(బలము). నపుంసకలింగముల తుదిని బ్రథమయందేకాక సొంపుగానున్నచో ద్వితీయాదుల

తుదిని సైతము 'అదు' శబ్దమును దానివలెనే 'అన్' శబ్దమును నిలుపవచ్చును. 'అమ్' శబ్దము నిల్వదు. అయ్యది లోపించుచుండును. ఉదా:—కడమ్=(ఋణము), కడత్తై=(ఋణమును).

“తమి-అత్తు. కన్న-అద్. తెల్గు-తి” అనునవి 'అదు' శబ్దరూపాంతరములై యున్నట్లె 'అమ్' అనునదియు రూపాంతరమై యున్నదనఁదగును. అట్లె కానిచో 'కడమ్=(ఋణము)' అను 'అమ్మ'ంతపు ద్వితీయలో 'అత్తు' అనెడి 'అదు' శబ్దరూపాంతర మెట్లు వచ్చును? తమి-అత్తు. కన్న-అద్. తెల్గు-తి అనునవి 'అదు' శబ్దరూపాంతరములు” (కాల్డు-౨౫౬ పుటలోని పేరా నడిమి భాగము మొదలుకొని ౨౫౭-౨౫౮ పుటలు).

విమర్శము:—'అమ్' అనునది 'అదు' శబ్దపర్యాయమె యనియుఁ గొన్ని తమిళ నపుంసక శబ్దముల తుదిని ప్రాచీన తమిళమున 'అదు' శబ్దము నిల్చునట్లె మఱి కొన్ని నపుంసకముల తుదిని (మరమ్-కుళమ్) 'అమ్' శబ్దమును దాని రూపాంతరమగు 'అన్' శబ్దమును నిల్చుట సహజమె యని దొరగారు తుదికి సిద్ధాంతముచేసిరి. ఇట్టి సిద్ధాంతమును జేయు తలంపుననే 'మరమ్' మున్నగు వానిలోని 'మ' కారమాత్రమును 'అమ్' అను దానినిగా మొదటినుండియు నిరూపించుచువచ్చిరి. 'అమ్' అను సర్వనామశబ్దములోని 'అ' శబ్దము నిర్దేశ సర్వనామమగునపుడు దానిలోని 'మ' కారము 'అదు' శబ్దములోని 'దు' ప్రత్యయమువలెనె ప్రథమైకవచన ప్రత్యయమని వచింపక యది యేమియో తెలియనట్లుపేక్షించుట వింత.

ఇట్లనావశ్యకముగా మకారమాత్ర ప్రథమైకవచన ప్రత్యయమును 'అమ్' అని వ్యవహరించి దానిని సయితము 'అదు' శబ్దరూపాంతరముగా సంగీకరించుటచేత నీ క్రింది విరోధ మొకటి దుర్వారముగ సంభవించెను. 'మరమ్' మున్నగువానిలోని 'అమ్' అనునదియు 'అదు' శబ్దరూపాంతరమని యంగీకరించుటచేత వాని ద్వితీయాది విభక్తులలో మరల 'అదు' శబ్దరూపాంతరములగు 'అత్తు' మున్నగు నాగమములు నిల్చుట పునరుక్తమై యసంభవ మగుచున్నది. ఇంక 'అమ్-అన్' శబ్దములు 'అదు' శబ్దమువంటి సర్వనామములనుట కిచట మరలఁ బునరుక్తముగా నెంతయో గ్రంథము వ్రాసిరి. ఈ వఱకే యీ విషయము సువిస్తరముగా వివరింపఁబడినది. (చూడు. ౨౮ V విష). తొల్కాప్పియమునందె “ఆన్=(అక్కడ) ఈన్=(ఇక్కడ)” అను సర్వనామ శబ్దములు (చూడు. తొల్కా. 33౮ సూ.) పేర్కొనఁబడి యున్నవి. 'ఆణ్డు' మున్నగు వానిలోని యను నాసికము సంధికార్యజన్యమనుట పొరపాటు. అది శబ్దావయవమె యని యీ వఱకు విశద పఱుపఁబడెను. (చూడు ౨౮ VII విష).

పయి సందర్భమును బట్టి 'మరమ్' మున్నగువానిలోని 'మ'కారము నపుంసక ప్రథమైకవచన ప్రత్యయాభాసమనియు నది ప్రకృత్యవయవమనియు వచించు దొరగారి వాదము సరికాదనియె విశదమగుచున్నది.

(౨) ఆం. IV విష:—"కన్నడభాషలోఁ బురుషబోధక సర్వనామముల ప్రాతిపదికమాత్ర మప్పుడప్పుడు ప్రథమావిభక్తిగ వాడఁబడుట కలదు. అనఁగా 'నాను - తాను' శబ్దములకు బదులుగా 'నా - తా' అనునవి వాడఁబడునని యర్థము. దీనిని బట్టి వాని తుది 'ను' శబ్దముగాని నకారముగాని ప్రథమైక వచన ప్రత్యయ మను భ్రాంతి కలుగవచ్చును. కాని యట్టి 'న'కారము ద్వితీయా ద్యేకవచనములం దెల్ల వెలయుచుండుటంజేసి యది ప్రకృత్యవయవమె కాని ప్రథమైకవచన ప్రత్యయముకాదు." (కాల్డు. ౨౫౮ పుట).

విమర్శము:—'నాను - తాను' అనునవి హాసగన్నడరూపములు. "(నాన్)-నాం. (తాన్) తాం" అనునవి ప్రాచీన కన్నడరూపములు. వీనిచో నెన్నఁడును 'నా-తా' అను వానిని వ్యవహరించు సంప్రదాయము లేదు. కన్నడమున 'మ'కారము ప్రథమైకవచన ప్రత్యయము (చూ. ఆం I విష). అట్లగుటచేత 'నాన్-తాన్' అను వానిలోని నకారము ప్రథమైకవచన ప్రత్యయ మను భ్రాంతి గల్గుట యసంభవము. "(నాన్)-నాం. (తాన్)-తాం" అనునవి ప్రథమైక వచనరూపములుకావని దొరగారును వచింపఁజాలరుగదా!

"నీ నాన్ తానః ప్రథమావిభక్త్యా ని నెన్ తనామ్" (కర్ణా. భూ. ౯౨ సూ.)="యుష్మ దస్మ దన్యార్థకములగు "నిన్-'ఎన్ (లేదా) నన్' తన్" అనువానికిఁ ప్రథమా విభక్తియందు "నీన్-'ఆన్ (లేదా) నాన్' తాన్" అను రూపము లాదేశము లగును" అను కర్ణాటభాషా భూషణసూత్రము చొప్పున 'నా-తా' అనునవి ప్రాతిపదికము (Crude) లెన్నఁడును గానేరవు. "నిన్-'ఎన్ (లేదా) నన్' తన్" అనునవి ప్రాతిపదికములు. 'నా-తా' అనునవి ప్రాతి పదికము లను దొరగారి వ్రాఁత భ్రాంతిమూలకము. 'నీ-యా-నా-తా' అను తమిలు రూపములను జూచి యట్లు భ్రమించియుందురు. ప్రాచీన తమిలుమున యుష్మదర్థక ప్రథమైక వచనము 'నీ' అని నకారవిరహితముగ నుండును. దానిని బట్టి పలు గన్నడమున 'నా-తా' అనునవి ప్రథమైక వచనములుగా నుండునని భ్రమించి దొరగా రట్లు వ్రాసియుందురు.

(3) ఆం. V విష:—"ద్రావిడభాషలలోని పురుషబోధక సర్వనామ ములలోఁ బ్రథమావిభక్తికిని నితరవిభక్తులకును స్వరవైశిష్ట్య విషయమున భేదముగలదు. ప్రథమావిభక్తి రూపములలో దీర్ఘమును దక్కిన విభక్తి రూప ములలో నట్టి దీర్ఘమునకు హ్రస్వమును జూపట్టును. ఈ పద్ధతి కన్నడ తమిలు

మలయాళములలోఁ బూర్తిగనున్నది. ఉదా:—కన్న-ప్రథ+నాను = (నేను). షష్ఠి-నన్న=(నా యొక్క). ప్రథ-నీను=(నీవు). షష్ఠి-నిన్న=(నీ యొక్క). ప్రథ-తాను=(తాను). షష్ఠి-తన్న=(తనయొక్క). తెలుఁగులో నీ హ్రస్వము ద్వితీయావిభక్తిలో మాత్రమగపడుచున్నది. వీనిలో హ్రస్వరూపములు ప్రకృతి సిద్ధములో, దీర్ఘరూపములు ప్రకృతి సిద్ధములో చెప్పఁజాలము. అటువమున నీ హ్రస్వరూపము విభక్తి ప్రత్యయ రహితముగ షష్ఠ్యర్థమున వాడఁబడును. ఉదా:—నిన్=(నీయొక్క). ఇట్లు విభక్తిచేరని యంగముమాత్రము షష్ఠ్యర్థము గను విశేషణముగను వాడుట ద్రావిడభాషా సంప్రదాయము. (చూడుు ధాతువుల నడిమి వర్ణము మార్పుల ఘట్టము)" (కాల్డు. ౨౫౮-౨౫౯ పుటలు).

విమర్శము:—"నాను-నీను-తాను" హలాసగన్నడరూపములు. 'నాం=ఆం. నీం-తాం' అనునవి పలుగన్నడరూపములు. తెల్గున 'తా' శబ్దమునకు ద్వితీయా విభక్తియందు మాత్రమె కాక తృతీయాదులందును హ్రస్వరూపములే యుండును. ఉదా:—ప్రథమ-తాను-తాము. ద్వితీ-తన్నున్-తమ్మున్. తృతీ-తనచేతన్-తమ చేతన్-షష్ఠి-తనకున్-తమకున్ మొ. తమిళ మధ్యమ పురుషరూపములలోఁ బ్రథమాదీర్ఘమునకు హ్రస్వముకల్గదు. వేఱొక హ్రస్వరూపము నిల్చును. ఉదా:—ప్రథ-నీ-నీయిర్. ద్వితీ-నిన్నై-నుమ్మై. తృతీ-నిన్నొడు-నుమ్మొడు మొ. తెల్గునందును షష్ఠీ స్థానమున ద్వితీయావిభక్తి తత్పురుష సమాసమున నిల్చును. ఉదా:—రాముని యొక్క శక్తి=రామునిన్+శక్తి=రాముని శక్తి. రామున్+శక్తి=రాము శక్తి. మొ.

"షష్ఠీ భవే ద్ద్వితీయాతుల్యా తత్పురుష సంస్థితా నామ్నామ్" (ఆం. చిం) (వ్యా. సం. ౨౦ విష). నీ-నా-తా శబ్దములందు మాత్ర మీ పద్ధతి వర్తిల్లదు. ఉదా:—నీ యొక్క+శక్తి=నీ శక్తి. 'నిన్ను శక్తి' అని కానేరదు. ఇట్లే-నా శక్తి. తన శక్తి, వీనిలో సామాసిక విభక్తిలోపము-(యొక్క లోపము)-మాత్రము గల్గును.

ప్రథమైకవచన భ్రాంతిని గల్గించు మూఁడవ స్థల మిది యని యారంభించి యా చర్చనిట దొరగారు స్మరింపలేదు. ఇచటఁ బురుషబోధక సర్వనామ రూపవివరణము చేయఁబడినది. తమిళమున మధ్యమపురుష సర్వనామైక వచనము 'నీ' అనునది. ఇందుఁ బ్రథమైకవచన ప్రత్యయ భ్రాంతి నొదవించు టకుఁ బ్రసక్తియే లేదు గదా. ఇంక 'యాన్-నాన్-తాన్' అను శబ్దములందలి నకారము ప్రథమైకవచనాభాస మనవలెను. వీనిలోని నకారము తెల్గునందు వలనె తమిళమందును బ్రథమైకవచన ప్రత్యయమె యనుటలో బాధ యేమో? తెలియకున్నది. ఆ నకారము పుంలింగ బోధక మగుటచేతఁ

ప్రథమైకవచన బోధకము కాదనుట సరికాదు. అవి త్రిలింగములు. మఱియు లింగవచన ద్వయము నొక్క ప్రత్యయమె బోధించుటలో విరోధమేమియు లేదు. (చూడు ౭౬ V విష). సంస్కృతమున లింగవిభక్తి వచనములు మూఁడిటియందును బ్రత్యయైక్యము సుప్రసిద్ధము.

౬౨. I విష:—విభక్తి పూర్వాగమములు:—విభక్తి ప్రత్యయములు నిల్చుట కర్హమగు శబ్దభాగము 'అంగము' అనఁబడును.

"యస్మాత్ ప్రత్యయ విధి స్తదాది ప్రత్యయేఽఙ్గమ్-(౧-౪-౧౩) యః ప్రత్యయః యస్మాత్ క్రియతే తదాది శబ్దస్వరూపం తస్మిన్ ప్రత్యయే పరే ఽఙ్గ సంజ్ఞం స్యాత్". (సి. కౌ. ౧౯౯ సూ). తమిళమున బ్రాతిపదికము ప్రథమైకవచన సదృశము (చూడు ౬౧ I విష). దానిపైని బహుత్వబోధక ప్రత్యయము నిల్వఁగాఁ బ్రథమా బహువచన రూప మేర్పడును. అట్టి ప్రథమైకవచన బహువచనములపైని ద్వితీయాద్యేకవచన బహువచన ప్రత్యయములు నిల్చును (చూడు. ౬౧ I విష).

పయి సందర్భమును బట్టి ద్వితీయాది విభక్తి ప్రత్యయములు నిల్చుటకుఁ దమిళ ప్రథమావిభక్తి రూప మంగమని తేలుచున్నది. ద్వితీయాది విభక్తులు నిల్చునపుడు వానికిని బ్రాతిపదికమునకును నడుమ వాని పరస్పర సంబంధమును దెల్పు శబ్ద మేదేని నిల్చుచుండుట ద్రావిడభాషల సంప్రదాయము. అట్లు నిల్చు శబ్దము తొల్కాప్పియమున సా (చా)రియై=(ఆగమము) అని వ్యవహరింపఁబడును. తమి-కన్న "సార్=(చార్)=సమీపమునకుఁ బోవు." అను శబ్దముగలదు. కొన్ని యెడల నరుదుగానట్టి యాగమము నిల్వకుండుటయుఁ గలదు. అచటి యంగమే షష్ఠ్యర్థకమగుచు వాని సంబంధమును దెల్పునని యెఱుంగనగును.

కాని ద్రావిడవ్యాకర్త లట్టి యంగము ప్రాతిపదికరూపమె యందురు. అది షష్ఠ్యంతమని వచింపరు. కాని యదిషష్ఠ్యంతరూపమున కభిన్నమై యుండును. మఱియు బ్రకృతిప్రత్యయముల నడుమ నిల్చు నాగమములు వాని పరస్పరసంబంధమును దెల్పుననియు వచింపరు. రూపప్రదర్శనము మాత్రమె వారి కర్తవ్యముగదా. "అవఱ్ఱు (ట్టు) వఴి......" (తొల్కా. ౧౧౯ సూ.)= నామముల పయిని విభక్తులు నిల్చునపుడు వాని నడుమ నొక సా (చా) రియై యనఁగా నాగమము నిల్చును.

"అవై తామ్......" (తొల్కా. ౧౨౦ సూ.)=ఆ యాగమములు:— "ఇన్-వఱ్ఱు (ట్టు)-అత్తు-అమ్-ఒన్-ఆన్-అకు-ఇక్కు-అన్-" మున్నగునవి.

"పెయరుమ్......" (తొల్కా. ౧౩౩ సూ.)=నామములకు విభక్తులు చేరునపుడు వానినడుమ విశేష విధి లేనపుడు సాధారణముగా నేదో యొక సా (చా) రియై నిల్చి తీరవలయును. 'ఒడు' ప్రత్యయము (తృతీయావిభక్తి) పరమగునపుడుమాత్రము సా (చా) రియై వచ్చుట వైకల్పికము.

ఈ యాగమములలో నేయే రీతిగల శబ్దములపై నేయే యాగమములు వచ్చునో? ఎచట నిల్వనక్కఱలేదో? మున్నగువిషయములు తొల్కాప్పియమున '౧౭౮ మొ. ౨౦౩ వ.' సూత్రములచే విశదీకరింపఁబడెను. అట్టి శబ్దములపయి నా యాగమములు నిల్చునపుడు గల్గు సంధికార్యములు మున్నగు మార్పులు తొల్కాప్పియమున '౧౨౧ మొ. ౧౩౮ వ.' సూత్రములచే స్పష్టపఱుపఁబడెను. కర్ణాటమందును నిట్టి యాగమములు కర్ణాటభాషా భూషణాదులలో వివరింపఁబడెను. (చూడు కర్ణా. భూ. ౫౦. మొ. ౬౮ వ. సూ).

తెలుఁగునందలి విభక్తి పూర్వాగమముల యందొక విధమగు విభాగము గలదు. 'అ-ఇ-న్' అనునవి రూపసాధన ప్రక్రియలో వివరింపఁబడెను. వాని విధులు శబ్దతత్వశాస్త్రపద్ధతిని నిరూపింపఁబడక వ్యాకరణపద్ధతిని నిరూపింపఁబడినవి. కాని యవి యీ క్రిందిరీతి కనుకూలముగనే యున్నవి. ఉదా:—రామ+న్+ఇ+చేతన్=రామునిచేతన్. రాములు+అ+చేతన్=రాముల చేతన్. అది-(అదన్)-దా+న్+ఇ+చేతన్=దాని చేతన్. అవి=వా+న్+ఇ+చేతన్=వాని చేతన్. వ్యావహారిక భాషలో 'టి' అనునది గలదు. ఉదా:—వాటిచేతన్-మొ.

ఇవిగాక తెలుఁగులో "టి-ఇంటి-తి-ఇ-ప-పజ్" మున్నగు నౌప విభక్తికములు గలవు. కాని యివి పై యాగమములవంటివి కావు. పయి యాగమములు ప్రాణివాచకములకును నప్రాణివాచకములకును నేకత్వమునందును బహుత్వమునందును వచ్చు స్వభావము గలవి. ఈ యౌప విభక్తికములన్నను యప్రాణివాచకముల ద్వితీయాద్యేక వచనములందుమాత్రము నిల్చు స్వభావము గలవి.

ఔపవిభక్తికసంజ్ఞా । వర్ణా ష్టింట్యాదయో భవ న్తీహ । రు ల్యాదే ర్నామ్నాం స్యు । న్తేహి విభక్తౌ సమాసేచ ॥ (ఆం. చిం.) ('వ్యా. సం.' ౨-౭౭ మొ. ౨౩౩ వ. విమ), " 'ఇ-టి-తి' వర్ణంబులు వక్ష్యమాణంబు లౌపవిభక్తికంబులు" (బాల ఆచ్చి ౨౮ సూ.) ఉదా:—ఊరిన్ - ఊరిచేత - ఊరివాఁడు - త్రాఁడు - త్రాటిన్ - అఱ్ఱు-అత్తితిన్-మొ.

పరిశీలింపఁగాఁ దమిళ కన్నడములందలి విభక్తి పూర్వాగమములను సైతమిట్లు విడఁదీయవచ్చునని తోఁచుచున్నది. సర్వనామ బహువచనరూపములందలి విభక్తి పూర్వాగమముల విధులను బురుషబోధక సర్వనామరూపములను

సంబంధించిన విధులను వేఱుచేసినచోఁ దక్కిన తొల్కాప్పియములోని విభక్తి పూర్వాగమ విధులెల్ల నమహద్ద్వితీయా ద్యేకవచనములందు వర్తిల్లునవె యగును. తెల్గులోవలెనె యప్రాణివాచక ద్వితీయా ద్యేకవచనములందె వర్తిల్లున వగును. అదంతమహద్వాచకములు నాంతములు. మహతీవాచకములు ళాంతములు. మహన్మహతీ వాచక బహువచన రూపములు రేఫాంతములై యుండును. అట్టి నాంత ళాంత రేఫాంతములపై విభక్తి పూర్వాగమములు వచ్చు విధులు లేవు. అమహ ద్బహుత్వ బోధకములును నేకవచన రూపముతో సాధారణముగా నుండును. కొన్నియెడల='కళ్' ప్రత్యయాంతము లుండును. అట్టి ళాంత ములపై విభక్తి పూర్వాగమము లెవ్వియు వచ్చు విధులు లేవు. ఇట్టి వివేచన ముచే విభక్తి పూర్వాగమ విధులెల్ల నమహద్వాచక ద్వితీయా ద్యేకవచనము లందు వర్తిల్లునవే యగును. ఇంక సర్వనామ బహువచనములందు వచ్చెడి విభక్తి పూర్వాగమవిధులను బురుషబోధక సర్వనామ శబ్దరూపసాధన విధులను విడఁదీసి తత్తద్రూపసాధన ప్రక్రియావిధాయకములనుగాఁ దెల్గునందువలెనె యెన్నవగును. 'నమ్బియినై' మున్నగుచోటులందలి 'ఇన్' అనునది తొల్కాప్పియ సూత్రవిధి సిద్ధముకాదు. తమిళమందుఁ బ్రచురమైయున్న 'ఇన్' అను నది సామ్యసిద్ధాంతమున నేర్పడెనని తోఁచుచున్నది 'నమ్బిమై' అనునదే సహజ రూపము.

"పుళ్ళియిఱుదియుమ్......" (తొల్కా. ౨౦౩ నూ.)=నే నీ ప్రకరణ మునఁ జెప్పిన శబ్దములు తప్పఁ దక్కిన శబ్దములకు విభక్తి పరమగునపుడు సారియై రావలసిన నిర్బంధము లేదు. "ఇట్లనుటచేఁ దక్కిన శబ్దములకు 'ఇన్' అనునది చేర్చినను జేర్పవచ్చునని వ్యాఖ్యాతలు వ్రాసిరి." ఉదా:—నమ్బి+ ఐ=నమ్బిమై=నమ్బియినై =(నంబి యను వానిని—మొ.

పయి విషయమునఁ గాల్డువెల్లుగారిచే నీ క్రిందిరీతిని వివరింపఁబడెను.

రా-౨. II. విష:—"ప్రథమా విభక్త్యంతముగా వాడఁబడెడి ప్రాతి పదికమె యనేక ద్రావిడభాషలలో ద్వితీయాది విభక్తులు నిల్చుట కంగమై యుండును. కొన్ని శబ్దములలో నే మార్పును లేకయే ద్వితీయాది విభక్తులు ప్రథమాంతము పై నిల్చుచుండును. అట్లు చేరునపుడు స్వరసంహితా వ్యవ ధాయక వర్ణములు 'య-వ' లు నిల్చుట తప్ప మఱేమార్పును నుండదు. కొన్ని యలంతి స్థలములలో మాత్ర మంగమునం దించుక మార్పు గల్గును.

పురుష బోధక సర్వనామములలో ద్వితీయాది విభక్తులు చేరునపుడు ప్రథమా విభక్త్యంత రూపములోని దీర్ఘము హ్రస్వమగును. ఇవి తప్పఁ దక్కిన శబ్దములలో నంగమునకును విభక్తికిని నడుమ నేదేని యాగమము

నిల్చుచుండును. హీబ్రు భాషయందువలె (సెమెటి కుటుంబములోనిది) ద్రావిడభాషలందును ద్వితీయాది విభక్తుల యంగము ప్రథమాంత రూపము కన్న భేదించునపు డయ్యది దాని విశేషణ రూపమై యుండును. అఱవ వైయాకరణులు దానిని విశేషణరూపమందురు గాని యది షష్ఠ్యంతమని (యొక్క విభక్తి లోపించిన) నా యభిప్రాయము. అది షష్ఠ్యంతమగునపుడె ప్రకృతి ప్రత్యయములకుఁ గల సంబంధము విశదపఱుప నర్హమై యుండును." (కాల్డు. ౨౫౫ పుట).

విమర్శము:—ప్రథమా విభక్త్యంతము ప్రాతిపదికమై యుండుట తమిళు మాత్రసంప్రదాయము. ఆంధ్రకర్ణాట వైయాకరణు లే విభక్తియుఁ జేరని ప్రకృతిని ప్రాతిపదికముగ నిల్పి రూపసాధన ప్రక్రియను నడపిరి. (చూడు ౮_౧ I విభ). అఱవవైయాకరణులు ద్వితీయాది విభక్తుల యంగము విశేషణమని చెప్పలేదు.

ఉత్తమ మధ్యమ పురుష సర్వనామములలో హ్రస్వ మాత్రమేకాక యింకను మఱికొన్ని మార్పులు గలవు. ఉదా:—ఉత్త:—యాన్=(నేను). యామ్=(మేము). నిన్నై=(నిన్నున్) నుమ్మై=(మిమ్మున్) నాన్=(నేను). ఇది తొల్కాప్పియము నాఁటికి లేదు. దీని బహువచన మనఁదగిన 'నామ్' అనుదానికి 'మనము' అని యర్థము. 'మేము' అని యర్థముకాదు. కావుననె దీని కేకవచనరూపము తొల్కాప్పియమున లేదయ్యెను.

౮_౨. III విభ:—" 'ఇన్' అనెడి విభక్తి పూర్వాగమము:—అఱవమున 'ఇన్' అనునది యేకవచన బహువచనములు రెంటను వచ్చును. 'కు' భాషలో 'ని' అనునది యెల్లజాతుల పదములలోను వచనద్వయమునందును వచ్చును.

'అదు-ఇదు' అను నఱవ సర్వనామశబ్దములకు 'అన్' అను నాగమము వచ్చును. 'అదన్-ఇదన్' అనువానికిఁ బ్రథమా విభక్తియందు వాడుక మిక్కిలి యరుదు. ఉదా:—అదన్నై=(దానిని). అదఱ్కు=(దానికి). 'అదనాల్-ఇదనాల్' అనునవి 'అదినాల్-ఇదినాల్' అనువానికంటె భిన్నములు. ఇందలి 'అన్' శబ్దము 'అమ్' శబ్దమువంటి వ్యుత్పత్తి కలదె.

విభక్తి పరమగునపుడు 'ఇన్' అనుదాని కర్థము లేదు. విభక్తి చేరనపు డిది శేషషష్ఠ్యర్థకమువలె నుండును. కావుననె యిది వైకల్పిక మయ్యెను. ఉదా:— కైయాల్-కైయినాల్=(చేతితోడ). కాలాల్ = కాలినాల్ = (కాలితోడ).

ఇది విభక్తి పూర్వాగమ మగుటయేకాక 'అత్తు-డ్-ఱ్' అను నాగమముల మీఁద సయితము నిల్చును. ఉదా:—మరత్తాల్=మరత్తినాల్=(చెట్టుచేత).

'ఇన్' అనుదాని కున్నట్లె 'అత్తిన్' అనుదానికిని శేషషష్ఠ్యర్థము గలదు. అఱవ మున 'అమ్-డు-ఋ' అనునవి తుదినిగల నామవాచకములు తప్పఁ దక్కినవానికి 'ఇన్' అనునది వచ్చుచుండును. కన్నడమున దీనికి వాడుక తక్కువ. ఉన్నచో నయితము కన్నడమున సంధికార్య మాత్రమె యగుచు వైకల్పికమగును. అఱవ మున 'గురువిల్-గురువినిల్=(గురువునందు)' అనునట్లె కన్నడమున 'గురువల్లి =గురువినల్లి' అని యనవచ్చును. మలయాళమున 'ఇన్' అనునది 'ఇల్' అను సప్తమికిఁ బూర్వమున వాడుట సహజముగ నుండదు. తక్కిన విభక్తు లలో సాధారణముగ నుండును.

తెల్గున దీనికి సరియైనవి 'ని-న' అనునవి. వీనికి షష్ఠ్యర్థమును గలదు. ఇవి విభక్తి పూర్వాగమములును నగును. ఉదా:—దీనికి-తమ్మునికి-గురువునకు. ఇవి తెల్గున నేకవచనమునందు మాత్రము వచ్చును. ఇవి నిరర్థకములు గాన వైకల్పికములు. ఇవి మొదట నర్థవంతములై యుండెడివి. ఇవి తఱచుగాఁ బుంలింగముల కగును, నపుంసకములకు రావసరాదు. ఉదా:—దానికి-దీనికి. ఇవి 'ఇన్' అనుదాని కభిన్నములు. ఇట్టి స్వరవిపర్యయము తెల్గున సహజము. ఉదా:—(తమి)-ఇల్=(తెల్గు)-లేదు. (అఱ)-ఉల్=(తెల్గు)-లోన్. (లాటిన్) ఇన్=(సంస్కృ)-ని-ఉపసర్గము.

'ఇన్' అనునది పంచమీ షష్ఠీ సప్తమ్యర్థములలో వాడఁబడుచున్నది. 'ఇన్' అనునది 'ఇల్' అనుదానికి రూపాంతరము. తమి-ఇల్=ఇక్కడ. ఇల్=ఇల్లు. కోవిల్=దేవుని యిల్లు=దేవాలయము. కాన నిది సప్తమ్యర్థకము. దీని వ్యుత్పత్తిని మఱచుటచే నిది విభక్తిపూర్వాగమమై యెల్ల విభక్తులలోను వచ్చుచున్నది. దీని ప్రాచీనరూపమగు 'ఇల్' అనుదానికిని నిది చేర్పఁబడు చున్నది" (కాల్డు. ౨౬౦ మొ. ౨౬౨ పుటలు).

విమర్శము:—'ఇన్' అనునది తమిళమున విస్తృత వ్యాప్తిగల యాగ మము. కావుననె యిది తొల్కాప్పియమునఁ జెప్పఁబడిన స్థలములయందేకాక స్థలాంతరములందును వచ్చుచున్నది. ఉదా:—నమ్బియినై = (నమ్బియను వానిని).

"అ-ఆ-ఉ-ఊ-ఏ-ఔ......" (తొల్కా. ౧౭౪ సూ.)='అ-ఆ-ఉ-ఊ-ఏ-ఔ' అను నచ్చులు తుదినిగల శబ్దములకుఁ బరముగ విభక్తులు నిల్చునపుడు 'ఇన్' అను సా (చా)రియై వాని నడుమ నిల్చును. ఉదా.—విళ+వ్+ఇన్+ఐ=విళవినై=(వెలగ చెట్టును). దీనిలోని వకారము స్వరసంహితా వ్యవ ధాయక వర్ణము. పలా+వ్+ఇన్+ఐ=పలావినై=(పనస చెట్టును.) కడు+వ్+ఇన్+ఐ=కడువినై (కరక చెట్టును).

"కుఱ్ఱియ లుకరత్తు......" (తొల్కా. ౧౬౬ సూ.)=అర్ధమాత్రిక మగు పొట్టి 'ఉ' కారము తుదినిగల శబ్దములకు (చూడు ౧౭ IV విష.) (౨౫ V విష). విభక్తి పరమగునపుడు 'ఇన్' అనెడి సా (చా)రియై వచ్చును. ఉదా:—వరకు+ఐ=వరకినై=(ఆరుక గింజలను).

పయిరెండు సూత్రములు తప్ప నజంతములపైని 'ఇన్' అను నాగమ మును విధించు సూత్రములు తొల్కాప్పియమున లేవు.

"ఞ-న-ఎన్ పుళ్ళికర్......" (తొల్కా. ౧౮౩ సూ.)=ఞ కారాంత నకారాంత శబ్దములకు విభక్తి పరమగునపుడు 'ఇన్' అనెడి సా (చా)రియై వచ్చును. ఉదా:—ఉరిఞ్+ఐ=ఉరిఞినై=(ఒరయికను). పొరున్+ఐ= పొరునినై=(అనుకారము చేయువానిని).

"ఇన్నిడై వరూ ఉమ్......" (తొల్కా. ౧౮౭ సూ.)=మకారాంత శబ్దములకు విభక్తిపరమగపుడు 'అత్తు' అనునాగమము వచ్చుట తెలుచు. (౧౮౬ సూ.) 'ఇన్' అనునాగమము వచ్చుటయుఁ గలదు. ఉదా:—ఉరుమ్+ ఐ=ఉరుమినై=(పిడుగును).

పయి రెండుసూత్రములును హలంతములకు 'ఇన్' అనుదానిని విధించు తొల్కాప్పియ సూత్రములు. ఇంక "తెవ్=(శత్రువు). (౧౮౫ సూ.) అలన్=(పీనుఁగు). పులన్ (౧౯౮ సూ.)" అనుశబ్దములకును నీ యాగమము వచ్చునని చెప్పు మఱి రెండు సూత్రములు గలవు.

ఇట్టి తొల్కాప్పియ సూత్రములకు సాధ్యముకాని "కైయినాల్=(చేతి చేత) కాలినాల్=(కాలిచేత). ఇల్లినాల్=(ఇంటి చేత) మరత్తినాల్ = (చెట్టు చేత)" అనువానిని 'ఇన్' ప్రత్యయము వచ్చుట కుదాహృతుల నిచ్చుట వింత. ఒకటైనఁ దొల్కాప్పియ సూత్రసాధ్యము కాదు. మఱియు 'ఇన్' అను నాగమ మేకవచన బహువచనములు రెంటను వచ్చునని కేవల మసంభవముగ వ్రాసిరి. అమహ ద్బహువచనరూపము 'కళ్' ప్రత్యయాంతమై యుండును. మహన్మహతీ బహువచనాంతరూపములు రేఫాంతములై యుండును. ఇట్టి బహువచనరూపములకుఁ బయి తొల్కాప్పియ సూత్రముల చొప్పున 'ఇ' నాగమము వచ్చుటెట్లు? సర్వనామములకు వేఱువిధములగు నాగమములు తొల్కాప్పియమున విధింపఁబడి యున్నవి.

ఇంక 'ఇ' నాగమము వచ్చుటకు మఱొక సూత్రము గతి కన్పట్టు చున్నది.

"పుళ్ళియిఱుదియుమ్......" (తొల్కా. ౨౦౩ సూ.)=నే నీ ప్రకర ణమునందుఁ జెప్పిన శబ్దములు తప్పఁ దక్కిన శబ్దములకు విభక్తులు పరమగు

నపుడు సారియై రావలసిన నిర్బంధము లేదు. "ఇట్లనుటచేతఁ దొల్కాప్పియరు చెప్పనిచోటులందు 'ఇన్' అనునాగమము వచ్చిన రావచ్చును" అని వ్యాఖ్య చేయఁబడెను. ఉదా:—నమ్బియై=నమ్బియినై=(నంబియనువానిని). ఎచ్చట నేని యనుక్తస్థలములందు 'ఇన్' ప్రత్యయమున్నపు డీ విధిని గతి కల్పించుట యుక్తము. కాని యిది యథేష్టముగ నుపయోగింపఁ దగినది కాదు. ఇట్టి స్థితిలో 'అమ్-ఉ-డు' అనునవి తుదినిగల శబ్దములు తప్పఁ దక్కినవానికెల్ల 'ఇ' నాగమము వచ్చునని యించుకేని పరిశీలింపక దొరగారు వ్రాయుట కేవలము సాహసము గదా!

"ఎణ్ణిన్ ఇఉది......" (తొల్కా. ౧౯౯ సూ.)=సంఖ్యావాచకముల కెల్ల విభక్తిపరకత్వమున 'అన్' సా (చా) యై వచ్చును. ఉదా:—ఒన్ఱు+ఐ= ఒన్ఱనై=ఒకటిని.

"సు (చు) ట్టు ముదల్ ఉకరమ్......" (తొలా. ౧౭౭ సూ.)='అదు-ఇదు-ఉదు' అనెడి నిర్దేశ సర్వనామములకు విభక్తి పరమగునపుడు 'అన్' అను నాగమము వచ్చును. అపు డుకారము లోపించును. ఉదా:—అదు+ఐ= అదనై=(దానిని). అదు+కు=అదఱ్కు=(దానికి) ము.

ఇట్లనేకవిధులు తొల్కాప్పియమునఁ గలవు. ఇట్టివానియం దెల్ల దొర గారి సూత్రము చొప్పున 'ఇ' నాగమము రావలసినదేనా? 'ఇన్' అనునది విభక్తి పూర్వాగమముగానే కాక పంచమీ షష్ఠీసప్తమ్యర్థకముగా సయితము వాడఁబడుచున్నదని దొరగారు వ్రాసిరి. (కాల్డు. ౨౬౨ పుట) తమిళమున 'ఇన్' అనునది పంచమీ విభక్తి ప్రత్యయమాత్రము గలదు. (చూడు ౮౧ I విభ). ఇయ్యది విభక్తి పూర్వాగమ మగునపుడు ప్రకృతి ప్రత్యయార్థములకుఁ గల సంబంధమును దెల్పును గాన నిది షష్ఠ్యర్థకము కానోపును. తద్భిన్న స్థలములలో దీనికి షష్ఠ్యర్థ మెట్లు ఘటిల్లును. "విళవినదు+కోడు=విళవిన్ కోడు" అనుచోటి షష్ఠ్యర్థము సామాసికము. 'ఇన్' ప్రత్యయార్థము కాదు. దొరగారు వ్రాసినట్లుగ నిది 'ఇల్' శబ్దసంబంధియన్నను దీని కట్టి సప్తమ్యర్థ మునఁ బృథక్ ప్రయోగార్హత యెట్లు?

ఆకారసామ్యమునుబట్టి యిది 'యిల్' శబ్దరూపాంతరమని దొరగారు వ్రాసిరేకాని ద్వితీయాదులందెల్ల నిల్చుచున్న దీనికి 'ఇల్' శబ్దమూలకత్వ మెట్లు సందర్భపడును? తమిళమున 'ఇన్' పంచమీ ప్రత్యయము. కన్నడ మున 'ఇమ్' తృతీయా ప్రత్యయము. కన్నడమునందలి 'అత్తణిం' అను పంచమీ విభక్తిని బరిశీలించునపు డందలి తుదిభాగమగు 'ఇం' అనునది వీని

కభిన్నమె యని తోఁచును. ఇట్టి విభక్తుల రూపమున నున్న 'ఇన్' అనునది 'ఇల్'=(ఇల్లు) శబ్దమున కభిన్నమనుట విశ్వసనీయము కావచ్చును (చూడు ౮౪ II విష). కాని యట్టి విభక్తులు నిల్చుట కంగము కావలసిన విభక్తి పూర్వాగమమగు 'ఇన్' అనునది తదభిన్నమనుట విశ్వసనీయము కానేరదు. ఘుణాక్షర న్యాయమున నాకారసామ్యము గల్గినంత మాత్రమున నవెల్ల నభిన్నములనుట యుక్తము కాదు. పరిశీలింపఁగా నీ విభక్తి పూర్వాగమమగు 'ఇన్' అనునది 'అన్' అను సర్వనామము (చూడు ౨౮ V విష.) వంటి 'ఇదు' శబ్దార్థకమని తోఁచుచున్నది. 'అమ్బర్-అఙ్గు' మున్నగువానివలెనె 'ఇమ్బర్-ఇఙ్గు' మున్నగునవియు వెలయుచున్నవి గదా. తెల్గులోని 'అందు' వంటిది 'ఇందు' శబ్దమును బ్రసిద్ధమె గదా. తుళుభాషయందు 'ఇందు' శబ్దము 'ఇదు' శబ్దపర్యాయమె గదా (చూడు కాల్డు. ౨౫౭ పుట—౮౧ III విష). ఇట్లగుటం జేసి 'అదు' శబ్దమువంటి 'అన్' అను సర్వనామ శబ్దమునువలెనే 'ఇదు' శబ్దము వంటి 'ఇన్' అను సర్వనామ శబ్దమును నంగీకరించి 'అదు' శబ్దరూపాంతరములగు 'అత్తు-అద్-అన్' అనువానిని విభక్తి పూర్వాగమములనుగా (౮_౨ IV, ౮_౨ VI. విష.) నిరూపించినట్లె 'ఇదు' శబ్దరూపాంతరమగు నీ 'ఇన్' అను సర్వనామమునకు 'ఇన్' అను తమిళకన్నడ ప్రసిద్ధమగు విభక్తి పూర్వాగమము భిన్నము కాదని నిరూపించుట సుసంగతమై యుండును.

మఱియు నిట్లే 'ఇన్' శబ్ద మనేకార్థములు గలదనియు విభక్తి పూర్వాగములెల్లఁ బ్రకృతి ప్రత్యయార్థ పరస్పర సంబంధమును ఘటించునవనియు (చూడు ౮_౨ II విష.) దీనికర్థము లేదనియుఁ గన్నడమున నిది సంధికార్యజన్యమనియు దొరగారు వ్రాయుట పూర్వోత్తర సందర్భ శూన్యమై యున్నది. తమిళమందువలెఁ గన్నడమున 'ఇ' నాగమమునకు విస్తృత వ్యాప్తి లేకున్నను 'ఉ' కారాంతములందుఁ బ్రచుర స్థితి గలదు. "ఉదన్తాత్తృతీయాది ష్వి నాగమో బహుళమ్" (కర్ణా. భూ. ౫౮ సూ.)=ఉకారాంత ప్రాతిపదికములకుఁ దృతీయాది విభక్తులు పరమగుచుండఁగా 'ఇ' నాగమము బహుళముగా నగును. ఉదా:—గురువినిం=(గురువుచేత.) గురువిన మతం=(గురువుయొక్క మతము). బహుళ గ్రహణముచేత నొకప్పుడు రాదు. ఉదా:—గురువ మతం. మనువ కులం=(మనువుయొక్క వంశము). ఒకప్పుడు నిత్యము. ఉదా:—గురువినొళ్=(గురువునందు) మనువినొళ్=(మనువునందు) మడువినొళ్ = (హ్రదమునందు) "తమి-గురువిల్ = గురువినిల్ = (గురువునందు)." (చూడు కాల్డు. ౨౬౧ పుట).

విభక్తి పూర్వాగమ విషయమునఁ దమిళ కన్నడములకు మిక్కిలి సామ్య మున్నను గొంత భేదమును గలదు. తమిళ విభక్తి పూర్వాగమములు ద్వితీయాది విభక్తి పరమగునపుడును వచ్చును. కర్ణాటమునఁ దృతీయాది విభక్తి పరకత్వమందు మాత్రమె వచ్చును. ఉదా:—(తమి) గురువినై=(గురువును). (కన్న)-గురువం=(గురువును). 'అదు-ఇదు' మున్నగు కొన్ని శబ్దములకు 'అన్' అను నాగమము తమిళమున వచ్చుచుండఁగాఁ గన్నడమునఁ దజ్జన్య మనఁదగు 'అఱ్' అను నాగమము వచ్చును. చతుర్థియందు మాత్రము తమిళ మందును 'అఱ్' అను రూపము సిద్ధించును. ఉదా:—(తమి)-అదనొడు= (దానిచే) అదఱ్కు=(దానికి). (కన్న)-అదఱిం=(దానిచేత). అదఱ్కె= అదర్కె=(దానికి). మఱియుఁ గన్నడమున 'అదు-ఇదు' మున్నగువానికి బహువచనమునందును 'అఱ్' ('అన్' అను తమిళ ప్రత్యయజన్యము) అనునది నిల్చుచుండఁగాఁ దమిళమున నేకవచనములందు మాత్రము 'అన్' అనునాగమ మును బహువచనములందు 'వఱ్ఱు=(ట్టు) అఱ్ఱు (ట్టు)' అనునాగమములును వచ్చును. ఉదా:—తమి-అదనొడు=(దానిచేత)-అవైయఱ్ఱొ (ట్టొ) డు= (వానిచేత). (కన్న) అదఱిం=(దానిచేత)-అవఱిం=(వాటిచేత). మొ.

"సు (చు)ట్టు ముదల్ ఉకరమ్......" (తొల్కా. ౧౭౭ సూ.)= 'అదు-ఇదు-ఉదు' అను నిర్దేశక సర్వనామములకు విభక్తి పరమగుచుండఁగా 'అన్' అను నాగమము వచ్చును-అపు డుకారము లోపించును. ఉదా:— అదు+ఐ=అదనై (దానిని) మొ.

"సు (చు)ట్టు ముదలాకియ......" (తొల్కా. ౧౭౮ సూ.)='అవై-ఇవై-ఉవై' అనెడి నిర్దేశ సర్వనామ ప్రథమా బహువచనమునకు విభక్తి పరకత్వమున 'వఱ్ఱు' అను సా(చా)రియై వచ్చును. (౧౨౩ సూత్రముచొప్పున వకార లోపము). ఉదా:—అవై+ఐ=అవైయఱ్ఱై (ట్టై)=(వానిని=వాటిని)

ఇట్టి భేదములు పెక్కుగలవు. విస్తరభీతిని జూపలేదు. కన్నడ తమిళముల దిగ్వాచకశబ్దముల ప్రక్రియలోఁ గొంతభేదము చూపట్టుచున్నది. తమిళ దిగ్వాచకములకు విభక్తి పూర్వాగమ విధానమె లేదు-అట్లు విధానము లేనివానికి 'ఇన్' అను దానిని జేర్చిన జేర్పవచ్చును. తమిళమున:—కిఴక్కు=తూర్పు -(కీఴ్=క్రిందు. దక్షిణ హిందూదేశమునఁ దూర్పుభాగము పల్లముగానఁ గ్రిందిదని తలంపఁబడెను) మేఱ్కు=పడమర. (మేల్=మీఁదిది. దక్షిణ హిందూ దేశమునఁ బడమర భాగ మెత్తైనది). తెఱ్కు=దక్షిణము. (తమి-తెన్=చల్లనిది. తిఙ్కళ్=చంద్రుఁడు. తెల్లు-తేమ-తెమ్మ-చెమ్మ. తమి-తణ్=నీరు.) పడక్కు=ఉత్తరము. (తెల్గు - వేఁడి - వాఁడు. వడచక్కి,

(మొ.) దక్షిణము చల్లనిది-ఉత్తరము వేఁడిది) ఈ దిగ్వాచకములకుఁ దమిళమున విభక్తి పూర్వాగమ విధానము లేదు.

"ఏలన్ ఉరుపిఱ్కు......" (తొల్కా. ౨౦౨ సూ.)=దిగ్వాచక శబ్దముల కాగమ మేదియు రాకపోవచ్చును. సప్తమీ విభక్తి పరకత్వమున వాని తుది యక్షరములోపించును. ఉదా:—వడక్కు+కణ్=వడక్కణ్=వడక్కిన్ కణ్=(ఉత్తరదిక్కునందు.) ఈ విధానమునుబట్టి చూడఁగా-'కిటక్కు-మేఱ్కు-తెఱ్కు-వడక్కు' అను నాల్గిటిలోని తుది కకారము 'కణ్'=(స్థలము=సప్తమీ ప్రత్యయము) శబ్దభాగమా యను నూహ పొడముచున్నది.

కర్ణాట ప్రాక్పశ్చిమ దిగ్వాచి శబ్దముల వ్యుత్పత్తియే భిన్నరీతి నున్నది. తెల్గు దిగ్వాచిశబ్దముల వ్యుత్పత్తికిఁ గొంత పోల్కి గలదు. మఱియుఁ గర్ణాట దిగ్వాచక శబ్దములకు విభక్తి పూర్వాగమ విధానమును గలదు. కర్ణాటము:— తమిళ దిగ్వాచి శబ్దముల తుదిని స్థలవాచకమగు 'కణ్' శబ్దభాగము నిల్చినట్లె కర్ణాట దిగ్వాచకశబ్దముల తుదిని 'అన్=అక్కడ' అను ద్రావిడశబ్ద సంబంధి యగు 'అల్' అను ప్రదేశవాచకము పాక్షికముగా నిల్చును (కర్ణా. భూ. ౫౭ సూ.) ఉదా:—మూడ=మూడల్—(తూర్పుదిక్కు. మూడు=ఉద్గమించు=మీఁదికిలేచు). (తెల్గు-తూఱు=ఉదయించు-తూర్పు) తెంక=తెంకల్=(దక్షిణ దిక్కు. తమిళ శబ్దసంబంధియే) పడువ-పడువల్=(పశ్చిమదిక్కు. సూర్యుఁడు పశ్చిమపువైపునఁ బడిపోవునట్లు కనఁబడును. తెల్గు-పడుమర) బడగ=బడగల్=(ఉత్తరపు దిక్కు. తమిళ శబ్దసంబంధియె). వీనికి 'అణ్' అనెడి విభక్తి పూర్వాగమము వచ్చును.

"దిగ్వాచిభ్యోఽణ్" (కర్ణా. భూ. ౫౬ సూ.)=తృతీయాది విభక్తి పరకత్వమున దిగ్వాచకముల యంత్యాక్షరమునకు 'అణా' దేశమగును. ఉదా:— మూడల్+అణ్+ఇమ్=మూడణిం=(తూర్పుచేత.) మూడ+అణ్+ఇం= మూడణిం=(తూర్పుచేత.) మొ. వీని తుదిని బైని వ్రాసినరీతిని స్థలవాచి 'అల్' శబ్దము నిల్చియుండుటచేతనె స్థలవాచి సప్తమీ ప్రత్యయమగు 'ఒళ్' అనునది నిల్వకుండుట సంభవించెను.

"ఒళశ్చాతో దిగర్థా చ్ఛల్చ" (కర్ణా. భూ. ౨౮౦ సూ.)=అవర్ణాన్తా ద్దిగ్వాచినః పరస్య 'ఒళః'......శలాదేశో భవతి-చకారాత్ శ్లుప్చ. ఉదా:— "మూడల్=మూడ=తూర్పు దిక్కునందు. మూడల్ సూర్య నుదయిసిదం= మూడసూర్య నుదయిసిదం=(తూర్పు దిక్కునందు సూర్యుఁ డుదయించెను). ఇచట మూడలొళ్ సూర్య నుదయిసిదం" అనరాదు.

తెల్గున 'ని-న' అనునవి విభక్తి పూర్వాగమములనియు నవి మహాదేక వచనములందే నిల్చుననియు 'దానికి' మున్నగు నమహత్తులందు నిల్చుటయుఁ గలదనియు నవి 'ఇన్' అను విభక్తి పూర్వాగమమున కభిన్నములనియు దొర గారు వ్రాసిన వ్రాఁత కేవలము నయథార్థము. తమిళ కన్నడములందువలె నాంధ్రమున విభక్తి పూర్వాగమములకు విస్తృతిలేదు. ప్రకృతులకును బ్రత్యయ రూపశబ్దములకును గల్గు సమాసమువంటి కూడిక వాని సంబంధాద్యర్థములను బోధించునని యాంధ్ర సంప్రదాయము. అట్టి శబ్దముల మధ్యమున లింగ వచనాది బోధకప్రత్యయము నిల్చునపుడుమాత్రము 'ము-వు' ప్రత్యయేతర స్థలముల నడుమ తత్సంబంధార్థబోధకములగు 'అ-ఇ' శబ్దములు యథోచితముగ నిలుచును. వీనిని విభక్తి పూర్వాగమము లనవచ్చును. 'ని-న' అనునవి యా రీతి నేర్పడినవేకాని 'ఇనా' గమముయొక్క వర్ణవ్యత్యయ వికృతి సిద్ధరూపములు కావు. ఉదా:—తండ్రి వలన—కొడుకుచేత-చెలువుకొలకు-మేడయందు-వదినె యొక్క. 'అ-ఇ' అనునవి నిల్చుట:—రాములు+అ+వలన=రాములవలన. అన్నలు + అ + చేత = అన్నలచేత. రామన్ + ఇ + చేత = రామునిచేత (రామన్+తు=రామన్తు=రాముఁడు. ఇట్టియెడల స్వరశక్తిచే వచ్చిన 'ఉ'కార మభ్యస్త మయ్యెను) (చూడు ౧౮ IX 23 V విష).

రామన్+అ+కు=రామునకు. అదు+అన్=అదన్=దాన్+ఇ+కు =దానికి. ప్రాచీనకాలమునఁ దదిదంశబ్ద నపుంసక ద్వితీయాది రూపములలో 'అదన్-ఇదన్' అను నాకారములు నిల్చెడివి. ఉదా:—తమి-అదనై=(దానిని) ఇదనై=(దీనిని) (చూడు ౮-౨ III విష.) కర్ణాటాంధ్రములలో బహుత్వ మందును నీ 'అన్' అను నాగమము విస్తరించినది. కర్ణాటమున నందలి నకారము దాని పరుషమగు ఱకారరూపము నందెను. ఉదా:—(కన్న)- అదఱిం=(దానిచేత) అవఱిం=(వాటిచేత). (తెల్గు) - (ఏక) - దానిచేత - బహు- వానిచేత=వాటిచేత. పఱ గన్నడ ఱకారమె తెల్గున 'ట'కార రూపము నందియుండుననియుఁ బ్రాచీనకాలమున ఱకారము 'ట-త' మధ్యస్థోచ్చారణము గలదనియు నెఱుఁగనగును (చూడు. ౧౭ XIII విష). 'ము'-వర్ణఘటితము:— నెయ్యము - నెయ్యముచేతన్ - 'వు' వర్ణ:—గురువుచేతన్ - మొ. ప్రథమైక వచన మందలి 'ము-వు' వర్ణకములె యంతటను నాగమములయ్యెను.

తెల్గులోని యూపవిభక్తికములు 'టి-ంటి-తి-ఇ' అనునవియు విభక్తి పూర్వాగమములె యనఁదగును గాని వాని స్వభావము వీని స్వభావమునకుఁ జాల భిన్నము. (చూడు ౮-౨ I విష). వీని వివరణము ముందు ఱాఁగలదు (చూడు ౯-౨ V విష).

౨౨. IV విష:—"(౨)-'అద్-అర్' అను నాగమములు:—'అద్-అర్' అనునవి కన్నడమున విభక్తులకు ముందు ధారాళముగ నిల్చుచున్నవి. 'గురు' మున్నగు 'ఉ' కారాంత నామవాచకములచోట 'ఇన్' అనునది నిల్చుచుండఁగా నపుంసకలింగ నామవాచకములకును 'అ-ఈ-ఏ' అను సర్వనామములకును 'అద్-అర్' అనునవి చేర్పఁబడుచున్నవి. డా. ష్టీవెన్‌సన్ గారు నవీన పెరిషియను భాషలోని 'రా' అను ప్రత్యయమునకుఁ గన్నడము లోని 'అదర'=(దాని యొక్క) మున్నగువాని యందలి 'అర (లేక) ర' అను షష్ఠీ ప్రత్యయము సరిపడుచున్నదని చెప్పుట సరికాదు. 'అద్-అర్' అనునవి కన్నడమున షష్ఠీ ప్రత్యయములు కావు. తృతీయాది విభక్తులకుఁ బూర్వాగమములు. 'అ' అనునది మాత్రమె కన్నడ షష్ఠీ ప్రత్యయము. తమిళాంధ్రములందలి 'ఇన్-ని' అను వానికిని గన్నడములోని 'అద్-అర్' అనువానికిని గొంత భేదమున్నది. 'అద్-అర్' అనునవి విభక్తి పూర్వాగమములు మాత్రమె. విభక్తి ప్రత్యయము లేనపుడవి షష్ఠ్యర్థము నియ్యఁజాలవు." (కాల్డు. ౨౬౨ పుట).

"నపుంసక శబ్దములందు మాత్రమువచ్చెడి యీ 'అద్-అర్' అనునవి పరస్పరము నభిన్నములా యని సందేహము కల్గుచున్నది. కన్నడములోని 'అర్' అనుదానిచోటఁ దుళుభాషయందు 'తు' కారము వచ్చుచుండును. దకార రేఫములకు మార్పుగల్గుటయుఁ గలదు. అఱవదేశపు దక్షిణ భాగమున 'అదు' అనునది 'అఱు' అని యుచ్చరింపఁబడుచున్నది. కన్నడములోని 'అద్-అర్' అనునవి యఱవములోని 'అదు (లేక) అద్' అను సర్వనామము కన్న భిన్నములు గావు, 'అర్' అనునది 'అరు' అనుదానికి సమానమగు 'అన్' అనుదానినుండి వచ్చినదే కాని 'అదు' అనుదానినుండి రాలేదను డా. గుండర్టుగారి యభిప్రాయము సరియని నాకుఁదోఁపలేదు. కాని తమిళము న 'క' కార పూర్వస్థ నకారము ఱకారమగుటకలదు. ఉదా:—(తమి)-అదన్+కు=అదఱ్కు=(దానికి). నకార ఱకారము లొకదానిచో నొకటి వచ్చును. ఉదా:—(తమి) పిన్=పిఱగు=(వెనుకనుండి)" (కాల్డు. ౨౬౩ పుట).

"అఱవమున 'అదు' అను సర్వనామము విభక్తి పూర్వాగమముగ నిల్చుట క్వాచిత్కముగఁ గలదు. ఇదియే కన్నడములోని 'అద్' అను దానికి మూలమైయుండును. తమిళమున నపుంసక నామవాచకములకు 'అదు' అను సర్వనామ మూరకయె స్వార్థమునఁ జేర్పఁబడునని యీవఱకుఁ జెప్పఁబడెను (చూడు ౨౧ III విష). ఉదా:—(తమి) పొన్=పొన్నదు=(బంగారము) పొన్నై=పొన్నదై=(బంగారమును)" (కాల్డు. ౨౬౩ పుట).

"తెల్గున 'సొగసురాలు' మున్నగుచోటులందు వచ్చెడి రేఫము కన్నడము లోని 'అద్-అర్' అనువానితోను 'అదు', అను సర్వనామముతోను, సంబంధించున దనుకొనెదను. తెల్గున స్త్రీవాచకముచోట నపుంసక సర్వనామైక వచనమును వాడెడి సంప్రదాయము దీనికి సాధకమగుచున్నది. ఈ రేఫము సంధికార్యమనుట నాకుఁ గేవలము సమ్మతము" (కాల్డు. ౨౬౭ పుట).

విమర్శము:—కన్నడములోని 'అద్-అర్' అను నాగమములలో 'అద్' అనునది 'అదు' శబ్దసంబంధి యనుట యుక్తమె. కాని కర్ణాట పండితులు దీనిని 'ద' కార మాత్రమనియు 'అ' కారాంతములకు వచ్చుననియు వచించిరి. 'అర్' అనుదానిలోనిది రేఫమని దొరగారు తలంచుట పొరపాటు. అది ఱకారము. 'అఱ్' అనునది డా. గుండర్టుగారు చెప్పినట్లు 'అన్' అను దానిని సంబంధించిన దనుట యుక్తము.

"నపుంసక లిఙ్గే దః" (కర్ణా. భూ. ౫౧ సూ.)=అకారాంత నపుంసక శబ్దములకుఁ దృతీయాదులలోని స్వరాది విభక్తి పరమగుచుండఁగా 'ద' కార మగును. ఉదా :—(కన్న) మనదిం=(మనస్సుచేత). వనదత్తణిం =(వనము వలన).

"ఉకారస్య సంఖ్యా సర్వనామ గుణవచనేషు" (కర్ణా. భూ. ౫౫ సూ.)=ఉకారాంతములగు సంఖ్యావాచక గుణవాచక సర్వనామ శబ్దముల 'ఉ' కారమునకుఁ దృతీయాది విభక్తులు పరమగుచుండఁగా 'అఱ్' అను నాదేశము వచ్చును. ఉదా:—ఒందఱిం=(ఒకటిచేత). ఒందఱ్కె=ఒందఱ్కె=(ఒకటికి). ఇనియవఱిం=మధురమగువారిచేత = ప్రియులచేత. అదఱ=(దానియొక్క). అవఱ=(వారియొక్క). ప్రాచీనకాలమున ఱకారము 'ట త' మధ్యస్థోచ్చారణము గలది. (చూడు ౧౭ XIII విష).

పై రీతిని గర్ణాటభాషా భూషణమున రూపసాధన ప్రక్రియ చూపఁబడెను. 'అదఱ' అను చోటిది 'ఱ' కారమె కాని రేఫము కాదు, ప్రాచీన కాలమున ఱకారము 'ట-త' మధ్యస్థోచ్చారణము గలది. దాని కలఘు రేఫోచ్చారణ మర్వాచీనము. 'సొగసురాలు, ధీరురాలు' మున్నగు చోటుల లోనిది రేఫమేకాని ఱకారము కాదు. (చూడు 'వ్యా. సం.' ౯౩ విష.) (చూడు ౫౧ విష). ఈ రెండును నభిన్నములనుట సరికాదు. మఱియు 'అదఱ' మున్నగువానిలోనిది 'అర్' అను నాగమమనియు నది 'అద్' అను దాని కభిన్నమనియు దొరగారు చెప్పుట సరికాదు. ఇచట గుండర్టుగారి యభిప్రాయమె యుక్తమనఁదగును. 'అన్-అమ్' అనునవి 'అదు' శబ్దమువంటి సర్వనామములని యీ వఱకు దొరగారే వ్రాసియున్నారు. (చూడు ౨౮ V విష. ౮౧ III విష). ఇచటి 'అద్' అను నాగమము 'అదు' శబ్దమున

కభిన్నమనియు 'అఱ్' అనునది 'అన్' అనుదాని కభిన్నమనియుఁ జెప్పుట యుక్తము. తమిళమం దీ సందర్భమున 'అన్' అనెడి యాగమమె విధింపఁ బడెను. అద్దాని నకారము 'కు' విభక్తి పరకత్వమందు మాత్రము 'అ' కార మగుననియు సూత్రింపఁబడెను.

"సు (చు) ట్టు ముదల్ ఉకరమ్......" (తొల్కా. ౧౭౭ సూ.)= 'అదు-ఇదు-ఉదు' అనెడి నిర్దేశక సర్వనామములకు విభక్తి పరమగునపుడు 'అన్' అను నాగమమువచ్చును. అపు డుకారము లోపించును. ఉదా:— అదు+ఐ=అదు+అన్=ఐ=అదనై=(దానిని).

"నంఙికాన్......" (తొల్కా. ౧౨౮ సూ.)=చతుర్థీ విభక్తి ప్రత్యయ మగు 'కు' అనునది పరమగునపుడు విభక్తి పూర్వాగమములందలి 'న' కారము 'అ' కార మగును. ఉదా:—అదు+అన్+కు=అదఱ్కు=(దానికి). ఈ మూర్ధన్య నకారము 'అ' అను పరుషముయొక్క యనునాసికముగానఁ దమిళమం దట్టి యనునాసిక ఘటిత రూపములు 'కు' ప్రత్యయేతర స్థలములందు నిల్చియున్నను నట్టి చోటి యానునాసిక్యము లోపించి కర్ణాటమునఁ బరుషమగు అకారము నిల్చుట వింతకాదు. కావునఁ గన్నడమందలి 'అఱ్' అనునది తమిళములోని 'అన్' అనుదాని కభిన్నమనుటలో సందేహము లేదు.

౧-౨. V విష:—(3) "'తి' అనెడి యాగమము:—తెల్గు భాషలో 'తి=టి' అను నాగమములు నపుంసకలింగ నామవాచకముల యేకవచనము నందు వచ్చును. అఱవమందలి 'అత్తు' అను నాగమమువలెనె యిదియు షష్ఠ్యర్థమును విశేషణార్థమును యథాసంభవముగా నిచ్చును. ఉదా:—వాకిలి-వాకిటి. నుదురు-నుదుటి. ఇచట 'టి' అనునది తుదివర్ణమున కాదేశమె మైనను నాగమమునుగానె భావింపనగును. 'టి-తి' అను వానిలో 'తి' అనునదే ప్రాచీనము. లాంత రాంత పదములలోని మూర్ధన్య సంబంధమున 'టి' అను నది యేర్పడును. తకారము హలంతర సంబంధమున 'ట' త్వ మందునుగాని 'ట' కారము తకారముగా మాఱుట కన్పట్టదు. తెల్గున ద్విరుక్త 'ట' కారక విభక్తి పూర్వాగమము లేదు. ఉదా:—తొల్లి=(పూర్వము)+తి=తొంటి. 'తొల్లింటి=ల్లింటి-తొల్టి' అను రూపము లుండనేరవు. ఇందలి టకారము ప్రకృతిలోని లకారమును ణకారముగ మార్చినది. అజ-తొల్ (ధాతువు)-తొన్ద్రు ('తొన్ద్రు' కాదు. తొన్టు)=(పూర్వకాలము). తమిళములోని 'ద్రు=దు' అనునది తెల్గులోని 'తి' అను దానికి సరిగానున్నది. అజంత శబ్దముల మీఁదను నచ్చు తర్వాతి 'యు' కారము మీఁదను 'తి' అనునది నిల్చుచుండును. ఉదా:—వాయు=(నోరు)-వాతి. చే=(కరము)-చేతి. పై రీతిని 'తి' అనునది

ప్రాచీనమని భావించిన పిదప నది, 'అదు' అను తెల్గు సర్వనామముతో సంబంధించునది కావచ్చునని యెన్న నగును. కన్నడములోని 'అద్' అను నదియుఁ దమిళములోని 'అత్తు' అనునదియు 'అదు' అను దానితో సంబంధించునవె. ఇట్లు విభక్తి పూర్వాగమములెల్లఁ దచ్ఛబ్ద నపుంసకైకవచన జన్యములని విశదమగుచున్నది." (కాల్డు. ౨౯౪ పుట).

విమర్శము:—వాకిటి-నుదుటి-తొంటి మున్నగునవి షష్ఠ్యర్థకములని దొర గారుదాహరించుట సరికాదు. అచటి 'టి' అనునది షష్ఠ్యర్థకముకాదు. 'టి-తి' అను వానికట్టి వ్యస్తప్రయోగములేదు. అది షష్ఠ్యర్థకమె యైనచో దానిపై నితర విభక్తులు నిల్చుటెట్లు పొసఁగును? వాకిటితలుపు మున్నగు స్థలములలోని శేష షష్ఠ్యర్థాదు లచటి సమాస శక్తిచేత లభించుచున్నవి. ఆ దేశాగమాదికము వైయాకరణ కల్పితము. 'టి' మున్నగునవి విభక్తి పూర్వాగమములె. అది పరమగునపుడు వాకిలి మున్నగువాని తుది వర్ణము లోపించె నన్నపుడు 'టి' అనుదాని యాగమత్వము శంకాస్పదము కానేరదుగదా. కొన్నియెడల 'తి' వర్ణము 'టి' అనునదిగాఁ బరిణమించెనన్నను ననవచ్చునుగాని, అన్నిటిని-పెక్కిటిని-క్రిందటిని-మీఁదటిని-రెండిటిని-మూఁడిటిని-పదిటిని-వేయిటిని మున్నగు ననంతములగు స్థలములలోని 'టి' అనునది 'తి' వర్ణపరిణామ మనరాదు గదా. అట్లె యజంతములకెల్ల 'తి' వచ్చుననుటయుఁ బొరపాటె-పైని వ్రాసిన 'టి' వర్ణకాంతములెల్ల నజంతములె కదా. తొల్లింటి-మున్నగు రూపము లుండరాదనుట యవిమర్శన మూలకము.

క॥ తొల్లిటి సచ్చారిత్రము। లెల్లను దిగవిడిచె......'(భార. శాంతి. ౪ ఆ. ౪౦౪ ప.) సీ......, తొల్లింటి యట్టులు పెల్లురేఁగి।......

(భార. ఆది. ౫ ఆ. ౨౬౧ ప.) ఇట్లు ప్రాచీన మహాకవులె ప్రయోగించిరి. 'వాయు=(నోరు)' అని యిట్లది 'ఉ' కారాంత శబ్దమనుట సరికాదు అది 'ఇ' కారాంత 'వాయి' శబ్దము.

౫ౌ. VI విష:—"(౪) అత్తు-(లేక) అత్త్ర=(అట్టు):—అఱవమున 'అమ్' తుదినిగల తద్భవ దేశ్యములందెల్ల ద్వితీయా ద్యేకవచన పరకత్వమున 'అమ్' లోపించి దానిచోట 'అత్తు' అనునది నిల్చును. ఉదా:—ఆటమ్=(లోఁతు)+అత్తు+ఇల్=ఆటత్తిల్=(లోఁతునందు); తమిళ గ్రాంధికభాషలో నీ యాగమ మొకప్పుడు రాకుండుటయుఁ గలదు. ఉదా:—కయమ్+కు=(కయ=లోఁతు)=కయక్కు=లోఁతునకు. ఈ ప్రయోగము చింతామణిలోఁ గలదు. ('కయక్కు' లేదు. దానికి 'అత్తు' రాని ప్రయోగము గలదు) విభక్తి ప్రత్యయము పరమందు లేనపుడు షష్ఠీసప్తమ్యర్థములును విశేషణపు వాడుకయు

దీనికిఁ గలవు. సప్తమ్యర్థమె తొల్లిటియర్థమనఁదగును. ఉదా:—కుళత్తు + మీన్=కుళత్తు మీన్=(కొలనిలోని చేఁప. కొలనియొక్క చేఁప=కొలని సంబంధమైన చేఁప). బహుత్వమున 'అమ్' ప్రత్యయముమీఁది గళ్ ప్రత్యయము మీఁదనే యెల్ల విభక్తులును నిల్చును. ఉదా:—మరఙ్గళిల్=(చెట్టులందు)." (కాల్డు. ౨౬౫ పుట).

"అమహద్బహువచనమున, దమిళ సర్వనామములకును సంబంధార్థక నామవాచకములకును ద్వితీయాది విభక్తులలో 'అట్టు' అనునాగమము వచ్చును. ఇది 'అత్త్రు' అని యుచ్చరింపఁబడును. ఉదా:—ఎల్లా+అమ్=ఎల్లా+వ్+అత్త్రు+ఇల్+ఉమ్=ఎల్లావత్త్రిలుమ్=(అన్నిటియందును). అవెయ్=(వై)=(అవి). అవెయ్=(వై)+అత్త్రు+ఐ=అవత్త్రై=(వాటిని). ఈ రెండవ యుదాహరణములోని నిత్యబహువచనమగు 'ఎయ్ (ఐ)' స్థానమున 'అత్త్రు' వచ్చినది" (కాల్డు. ౨౬౫-౨౬౬ పుటలు).

"'అత్తు=అత్త్రు' అను రెండును నభిన్నములు. వీనికుచ్చారణమున విశేషభేదము లేదు. అనాగరకుల యుచ్చారణమున 'అత్త్రు' అనునది 'అత్తు' అనుదానివలెనె వినఁబడును. ఈ క్రింది తెల్గురూపములనుబట్టి వీని యభిన్నత స్థిరపడుచున్నది. (తెల్గు)-అవి=(తమి)-అవెయ్=(వై). వాటి=అవటి. తెలుఁగులోని యీ యనుమితరూపము (అవటి) తమిళమందలి 'అవత్త్రు' అనుదానికి సరిపడును. ఇందలి 'టి' (వాటిలోనిది) అనునది యాపవిభక్తికములలో వచ్చు 'టి' అనుదానికి భిన్నము కాదు. ఈ రెండు విధములగు 'టి' వర్ణముల చోట వచ్చునట్టి తమిళమందలి 'అత్తు-అత్త్రు' అనునవియు నభిన్నములె యనుట నిశ్చయము" (కాల్డు. ౨౬౬ పుట).

"'అట్టు=అత్త్రు' అనువాని వ్యుత్పత్తి కన్నడమువలనఁ గొంత తెలియుచున్నది. అఱవమున నేయే సర్వనామముల తుదను 'అట్టు' అనునది యుండునో యట్టి యెడలఁ బ్రాచీన కన్నడమున 'ర్=అర్' అనునవి చూపట్టుచున్నవి. ఉదా:—కన్న-అవర=(వాటియొక్క). (తమి)-అవట్టు. (కన్న)-ఎల్లవర=(అన్నిటియొక్క). (తమి) ఎల్లావట్టు......యీ రేఫములు వెనుకఁ జెప్పినటులు (౫-౨ IV విష.) దకార తకార జన్యములు కావచ్చును. కావుననె తమిళమున ఱకారద్విత్వము 'త్త్ర' అని పల్కఁబడును. కానఁ దమిళ రూపములును సమహత్తచ్ఛబ్దైకవచన రూపజన్యములని చెప్పవచ్చును. 'అద్' అనుదాని ద్విత్వరూపము 'అత్తు' అనునది. 'అఱ్' అనుదాని ద్విత్వరూపము 'అట్టు'=(అత్త్రు) అనునది. తమిళమున 'దు' శబ్దాంత నామములు విశేషణములగునపుడు వాని చివరను 'దు' వర్ణము పైని 'ఇన్' అనునదిగాని 'త్తు' అనునది

గాని నిల్చును. ఉదా:—(తమి)-ఎరుదు (ఎద్దు) విశేషణము-ఎరుదిన్=ఎరుత్తు. ఇట్లె 'అద్' అనున దిపుడు సామాన్యముగా 'ఇన్' అను రూపమున నిల్చుచున్నను బ్రాచీనకాలమున 'అత్తు' అను రూపమున నిల్చెడిది. 'అదు' అను దాని ద్వితీయాది విభక్తులలో తమిళదేశమందలి యుత్తరము వారు 'అత్తు' అని యుచ్చరింతురు. చెన్నపురి నివాసులు 'అద్దై' అనుదానిని 'అత్తై' అని పల్కుదురు. ఇట్టి పల్కుబడి క్రియాపదములందును జూపట్టుచున్నది. ఉదా:—ఇరుకిఱ-అదు = (ఉన్నది-ఉండుట). దీని చతుర్థి-'ఇరుకిఱ-అదుకు' అనునది 'ఇరుకిఱ-అత్తుకు' అని పల్కఁబడుచున్నది. వ్రాయఁబడుచున్నదియు. మఱియు విశేషణముగ వాడఁదగిన నామవాచకములోని 'ది=అది' అను స్త్రీలింగ ప్రత్యయము 'తి'=(త్తి) అని యగుచున్నది."

"'ఆయిత్తు' మున్నగు సమాపక కర్తృక భూతకాలిక రూపములలోని 'త్తు' అనున దిట్లె యేర్పడినదని (ఆయిదదు=ఆయిద్దు=ఆయిత్తు=ఆయిత్తు) నాయభిప్రాయము" (కాల్డు. ౨౬౬-౨౬౭ పుటలు).

"(తమి)-అత్తు-(కన్న) అద్=(తెల్గు)-తి" అనునవి యభిన్నములనియు, 'అదు' అను సర్వనామశబ్దమున కభిన్నములనియు నిరూపించుట కిట రెండుదాహృతుల నిచ్చుచున్నాను. ఉదా:—(తమి) పూర్వత్తిల్=(పూర్వకాలమందు=పూర్వమ్ + అత్తు + ఇల్) = (కన్న)-పూర్వదల్లి = (పూర్వ + అదు + అల్లి). (తమి)-ఆయిరత్తొన్రు (న్టు) = (వేయు నొకటి)=(ఆయిరమ్ + అత్తు + ఒన్రు) = (కన్న)-సావిరదొందు=(సావిర్ + అదు + ఒందు)" (కాల్డు. ౨౬౭ పుట).

"డా. గుండర్టుగారు కన్నడములోని 'అర్' అనునది 'అన్' శబ్దమునుండి యేర్పడినదని వెనుకఁజెప్పినదాని కనుగుణముగాఁ (౮౨ IV విభ) దమిళము లోని 'అఱ్ఱు=అత్తు' అనునది సయితము 'అన్+త్తు' అనురీతి నేర్పడెనని వచించిరి. తెల్గులోని 'టి' అనునదియు దీని ననుసరించుచున్నదనిరి. తెల్గులోని టకారము ద్విరుక్త ఱకార జన్యమని వారి యాశయము. నా కిది రుచింపలేదు. 'అన్-అమ్-అద్' అనునవియు 'అత్తు-దు-అదు' అనునవియు సమాపకచ్ఛద్దైక వచనరూపములై యుండుటచేత 'అన్+త్తు+అఱ్ఱు' అను వ్యుత్పత్తిలో 'అదు' శబ్దము రెండుసార్లు నిల్చినట్లగును. ఇది యసంభవము. 'అత్తు+ఇన్' అను జంట యిట్టిది కాదు. 'అత్తు' అనునది సర్వనామము. 'ఇన్' అనునది సప్తమీ ప్రత్యయము, మఱియు "అన్+దు=అన్+త్తు=అఱ్ఱు=(అత్రు)" అను మార్పు ద్రావిడ భాషా వర్ణపరిణామ పద్ధతికి విరుద్ధము. 'అన్+దు=

అన్దు' అనియగును. తెల్గున 'అందు' ప్రత్యయమిట్లేర్పడినదే. (చూడు సప్తమీ విభక్తి)" (కాల్డు. ౨౬౭ పుట).

విమర్శము:—ద్విరుక్త ఱకారము ప్రాచీనకాలమందుఁ దమిళమున ద్విరుక్త టకార సదృశముగను పటగన్నడమున ద్విరుక్త తకారముగను బల్కఁబడెడిది. నేఁటి తమిళమున నయ్యది పటకన్నడమందువలెనె ద్విరుక్త తకారముగానే పల్కఁ బడుచున్నది. "దొరగారు నేఁటి తమిళ వ్యవహారమును మాత్రము బాగుగ నెఱింగినవారగుటచేత 'త్ర' అనునదే దాని యుచ్చా"రణ మనుచు నిట వ్రాసిరి. ఇందలి రేఫోచ్చారణము భ్రాంతికృతము. ఱకారమునకుఁగల నేఁటి యలఘు రేఫోచ్చారణము మూలమున నట్టి భ్రాంతి దొరగారికిఁ గల్గినది. ప్రాచీన తమిళ ఱకారము 'ట-త' మధ్యస్థోచ్చారణము గలది. అందు రేఫోచ్చారణ మునకుఁ బ్రసక్తిలేదు. (చూడు ౧౭ XIII విష.).

తమిళమునఁ బ్రథమైక వచన బహు వచన సదృశరూపములు ద్వితీయా ద్యేక వచన బహు వచన రూపసాధనమున నంగము లగును గాన నట్టి ప్రథమైక వచన సదృశాంగము మకారాంత మగునపుడు 'అత్తు' అను నాగమము వాని నడుమ నిల్చును. అట్టి యెడలఁ బూర్వస్థ మకారము లోపించును. ఇట్టి 'అత్తు' అనునది 'అఱితు' అనెడి తచ్ఛబ్దామహత్ప్రథమైక వచన రూపమున కభిన్నమనఁదగును. 'అదు' శబ్దమున కభిన్నమనరాదు. ఈ విషయము ముందు వివరింపఁబడును. (చూడు ౮_౨ VI విష.) "అఱితు+తు=అత్తు. అన్+తు=అత్తు. మరమ్+తు=మరత్తు" అని యిట్లు సంధివశము నేర్పడె ననుటకు మాఱుగాఁ బూర్వ 'తు' వర్ణ లోపాదికము సూత్రింపఁ బడెను.

"మఱికాన్ పుళ్ళి......" (తొల్కా. ౧౮౬ సూ.) = మకారాంత శబ్దములకు విభక్తి పరమగునపుడు 'అత్తు' అను నాగమము వచ్చును. ౧౩౭ సూ. చొప్పున మకారలోపము గల్గును. ౧౨౬ సూ. చొప్పున 'అత్తు' అను

అత్తు+కుత్తై=కలత్తు క్కుత్తై=(తొల్కా. ౧౬౯ అత్తిక్తై.) (కల మనఁగాఁ బండ్రెండు తూములు. కుత్తై=తకుృవ). అవ్+వట్టు (ట్టు)+కోడు=అవట్టు (ట్టు) క్కోడు=(వాటి కొమ్ములు).

'అత్తు' అనునాగమమునకు 'షష్ఠీ-సప్తమ్యర్థములు గల వనుట సరికాదు.' 'అత్తు' అనునాగమమునకు వ్యస్త ప్రయోగము లేదు. 'కుళత్తుమీన్' మున్నగు సమాసములలోని షష్ఠ్యర్థాదు లచట లోపించిన విభక్తుల సంబంధ మైనవి— సమాసశక్తిచే లభించును.

"వేట్రుమై పోరుళై......" (తొల్కా. ౫౬౭ సూ.)=సమాసపదము లలో, లోపించిన విభక్తుల యర్థమును జెప్పునపుడు సందర్భోచిత పదములను సయితము చేర్చవచ్చును. ఉదా:—కుదిరై త్తేర్=(గుఱ్ఱము తేరు)="గుఱ్ఱమును బూంచిన తేరు-గుఱ్ఱముచే నీడ్వఁబడు తేరు" మొ.

మీఁద వ్రాసిన రీతిని బ్రథమా బహువచన సదృశమగు నంగములోని 'మ' కారము 'మరఙ్గళిల్' మున్నగు వానిలో నిల్చుటలో వింతలేదు.

'అవై' అను దానిలోని 'ఐ' అను దాని స్థానమున 'అట్టు=అత్తు' అను నది నిల్చెనను దొరగారి వాక్యము ప్రమాద భూయిష్ఠమై యున్నది. ఆగమ మేమి? ఒక దాని స్థానమున నిల్చుటేమి? 'వర్ణ వృద్ధిరాగమః' అనుటను స్మరింపవలదా? 'అవై' అను దానివెనుక 'అట్టు' అను నాగమము నిల్చునపుడు 'అవై యత్తై=(ట్టై) (వానిని)' అనురీతి రూపములు సిద్ధించును. దొరగారి భ్రాంత రూపము సయితము 'అవై యత్తై' అనియుండును. "అవత్తై (ట్టై) (దొర గారి భ్రాంతలో 'అవత్తై')" అనునది 'అవ్' అనెడి 'అవై' శబ్దపర్యాయ రూపము నుండి యేర్పడును. 'అవై=అవ్' అనురీతిని దచ్చబ్ద బహువచన రూపములు రెండు గలవని దొరగారు స్మరింపకుండుటచేత నిట్టి యసంగతో దాహృతి దొరగారిచే నీయఁబడెనని యెఱుంగనగును.

"సు (చు)ట్టు ముదలాకియ......" (తొల్కా. ౧౭౭ సూ.)='అవై-ఇవై-ఉవై' అనెడి నిర్దేశక సర్వనామ ప్రథమా బహువచనములకు విభక్తి పర కత్వమున 'వట్టు' (ట్టు) అనెడి యాగమము నిల్చును. ఈ క్రింది ౧౩౩ సూత్రము చొప్పున వట్టులోని వకార వ్యంజనము లోపించును. ఉదా:— అవై+వట్టు+ఐ=అవై+అట్టు+ఐ=అవైయట్టై (ట్టై)=(వాటిని).

అన్దు' అనియగును. తెల్గున 'అందు' ప్రత్యయమిట్లేర్పడినదె. (చూడు సప్తమీ విభక్తి)" (కాల్డు. ౨౬౭ పుట).

విమర్శము:—ద్విరుక్త అకారము ప్రాచీనకాలమందుఁ దమిళమున ద్విరుక్త టకార సదృశముగను పలగన్నడమున ద్విరుక్త తకారముగను బల్కఁబడెడిది. నేఁటి తమిళమున నయ్యది పలకన్నడమందువలెనె ద్విరుక్త తకారముగానే పల్కఁబడుచున్నది. "దొరగారు నేఁటి తమిళ వ్యవహారమును మాత్రము బాగుగ నెఱింగినవా రగుటచేత 'త్త్రు' అనునదే దాని యుచ్చారణ మనుచు నిట్లు వ్రాసిరి. ఇందలి రేఫోచ్చారణము భ్రాంతికృతము. అకారమునకుఁగల నేఁటి యలఘు రేఫోచ్చారణము మూలమున నట్టి భ్రాంతి దొరగారికిఁ గల్గినది. ప్రాచీన తమిళ అకారము 'ట-త' మధ్యస్థోచ్చారణము గలది. అందు రేఫోచ్చారణమునకుఁ బ్రసక్తిలేదు. (చూడు ౧౭ XIII విష.).

తమిళమునఁ బ్రథమైక వచన బహు వచన సదృశరూపములు ద్వితీయాద్యేక వచన బహు వచన రూపసాధనమున నంగము లగును గాన నట్టి ప్రథమైక వచన సదృశాంగము మకారాంత మగునపుడు 'అత్తు' అను నాగమము వాని నడుమ నిల్చును. అట్టి యెడలఁ బూర్వస్థ మకారము లోపించును. ఇట్టి 'అత్తు' అనునది 'అఁతు' అనెడి తచ్ఛబ్దామహత్ప్రథమైక వచన రూపమున కభిన్నమనఁదగును. 'అదు' శబ్దమున కభిన్నమనరాదు. ఈ విషయము ముందు వివరింపఁబడును. (చూడు ౮౨ VI విష.) "అఁతు+తు=అత్తు. అన్+తు=అత్తు. మరమ్+తు=మరత్తు" అని యిట్లు సంధివశము నేర్పడెననుటకు మాఱుగాఁ బూర్వ 'తు' వర్ణ లోపాదికము సూత్రింపఁ బడెను.

"మఁకాన్ పుళ్ళి......" (తొల్కా. ౧౮౬ సూ.) = మకారాంత శబ్దములకు విభక్తి పరమగునపుడు 'అత్తు' అను నాగమము వచ్చును. ౧౩౭ సూ. చొప్పున మకారలోపము గల్గును. ౧౨౬ సూ. చొప్పున 'అత్తు' అను దానిలోని 'అ' కారము లోపించును. ఉదా:—మరమ్+అత్తు+ఐ=మరత్తై=(వృక్షమును).

"అత్తిన్......" (తొల్కా. ౧౨౬ సూ.) = 'అత్తు' అనెడి సారియై యందున్న 'అ' కారము 'అ' కారాంత శబ్దములకుఁ బరమగునపుడు లోపించును. ఉదా:—మగ+అత్తు+కై=మగత్తుక్కై=(శిశువుయొక్క చేయి).

"అత్తేవట్టే......" (తొల్కా. ౧౩౭ సూ.)='అత్తు-వట్టు' అనునాగమములు పరములగునపుడు పూర్వశబ్దాంతమందున్న హల్లు లోపించును. ఈ యాగమములకుఁ బరమగు పరుషములు ద్విరుక్తములగును. ఉదా:—కలమ్+

అత్తు+కుత్తై=కలత్తు క్కుత్తై=(తొల్కా. ౧౬౯ అత్తిక్తై.) (కల మనఁగాఁ బం డ్రెండు తూములు. కుత్తై=తక్కువ). అవ్+వఱ్ఱు (ట్టు)+కోడు=అవఱ్ఱు (ట్టు) క్కోడు=(వాటి కొమ్ములు).

'అత్తు' అనునాగమమునకు 'షష్ఠీ-సప్తమ్యర్థములు గల వనుట సరికాదు.' 'అత్తు' అనునాగమమునకు వ్యస్త ప్రయోగము లేదు. 'కుళత్తుమీన్' మున్నగు సమాసములలోని షష్ఠ్యర్థాదు లచట లోపించిన విభక్తుల సంబంధ మైనవి— సమాసశక్తిచే లభించును.

"వేఱ్ఱుమై ప్పొరుళై......" (తొల్కా. ౫౬౭ సూ.)=సమాసపదము లలో, లోపించిన విభక్తుల యర్థమును జెప్పునపుడు సందర్భోచిత పదములను సయితము చేర్పవచ్చును. ఉదా:—కుదిరై త్తేర్=(గుఱ్ఱము తేరు)="గుఱ్ఱమును బూంచిన తేరు-గుఱ్ఱముచే నీడ్వఁబడు తేరు" మొ.

మీఁద వ్రాసిన రీతిని ప్రథమా బహువచన సదృశమగు నంగములోని 'మ' కారము 'మరజ్గళిల్' మున్నగు వానిలో నిల్చుటలో వింతలేదు.

'అవై' అను దానిలోని 'ఐ' అను దాని స్థానమున 'అఱ్ఱు=అత్తు' అను నది నిల్చెనను దొరగారి వాక్యము ప్రమాద భూయిష్ఠమై యున్నది. ఆగమ మేమి? ఒక దాని స్థానమున నిల్చుటేమి? 'వర్ణ వృద్ధిరాగమః' అనుటను స్మరింపవలదా? 'అవై' అను దానివెనుక 'అఱ్ఱు' అను నాగమము నిల్చునపుడు 'అవై యఱ్ఱై=(ట్టై) (వానిని)' అనురీతి రూపములు సిద్ధించును. దొరగారి భ్రాంత రూపము సయితము 'అవై యత్తై' అనియుండును. "అవఱ్ఱై (ట్టై) (దొర గారి భ్రాంతలో 'అవత్తై')" అనునది 'అవ్' అనెడి 'అవై' శబ్దపర్యాయ రూపము నుండి యేర్పడును. 'అవై=అవ్' అనురీతిని దచ్చబ్ద బహువచన రూపములు రెండు గలవని దొరగారు స్మరింపకుండుటచేత నిట్టి యసంగతో దాహృతి దొరగారిచే నీయఁబడెనని యెఱుంగనగును.

"సు (చు)ట్టు ముదలాకియ......" (తొల్కా. ౧౭౭ సూ.)='అవై-ఇవై-ఉవై' అనెడి నిర్దేశక సర్వనామ ప్రథమా బహువచనములకు విభక్తి పర కత్వమున 'వఱ్ఱు' (ట్టు) అనెడి యాగమము నిల్చును. ఈ క్రింది ౧౭౩ సూత్రము చొప్పున వఱ్ఱులోని వకార వ్యంజనము లోపించును. ఉదా:— అవై+వఱ్ఱు+ఐ=అవై+అఱ్ఱు+ఐ=అవైయఱ్ఱై (ట్టై)=(వాటిని).

"సు (చు)ట్టు ముదల్ వకరమ్......" (తొల్కా. ౧౮౪ సూ.)= 'అవ్-ఇవ్-ఉవ్' అనువానికి విభక్తి పరమగునపుడు 'వట్టు (ట్టు)' అనెడి యాగమను వచ్చును. ౧౨౩ సూత్రము చొప్పున 'వట్టు' లోని వకారము లోపించును. ౧౩౪ సూత్రము చొప్పున 'అవ్' అనుదాని తుది వ్యంజనము లోపించును. పిదప సంహితా వ్యవధాయక 'వ' కారము చేరును. ఉదా:— అవ్+వట్టు+ఐ=అ+అట్టు+ఐ=అ+వ్+అట్టు=(ట్టు)+ఐ=అవట్టై (ట్టై)= (వాటిని). ౧౩౪ సూత్ర మీ విషయమునందె 'మరత్తై' అనుదాని వివరణము సందర్భమున నుదాహృతమయ్యెను.

"వఃకాన్......" (తొల్కా. ౧౨౩ సూ.)='వట్టు' (ట్టు) అను నాగమమందలి మొదటి వకార వ్యంజనము లోపించును. 'అ-ఇ-ఉ' అను సర్వనామరూప సాధనమందే యీ విధి వర్తిల్లును.

పయిరీతిని 'అవై' శబ్దమునుండి 'అవైయట్టై (ట్టై)' అనురీతి రూపములును 'అవ్' శబ్దమునుండి 'అవట్టై (ట్టై)' అనురీతి రూపములును నేర్పడును. దొరగారు పయి భేదమును గ్రహింపక వాని నుదాహరించుటలో 'కలగాయ పులగము' చేసినారు. 'అవై' యను చోటనెల్ల దొరగారు వెనుక వ్రాసిన రీతినె (చూడు ౧౮ II విష.) 'అవెయ్'=(Avei) అనియె వ్రాయుచువచ్చిరి.

తెల్గునందలి వాటిని మున్నగు వానిలోని 'టి' అనునదియు 'త్రాటిని' మున్నగు నౌపవిభక్తికాంతరూపములలోని 'టి' అనునదియు నభిన్నము లనెడి ప్రామాదికాభిప్రాయముతో "అత్తు-అట్టు=(ట్టు) (దొరగారి భ్రాంతరూపము 'అత్రు')" అనునవి యభిన్నములనెడి యొక యపసిద్ధాంతమును నెలకొల్పసాగిరి. పైనుదాహరించిన 'టి' వర్ణములు రెండును గేవలము విజాతీయములు. అవి యభిన్నము లెంతమాత్రమును గానేరవు. ఔపవిభక్తిక 'టి-తి' వర్ణములు ద్వితీయాద్యేకవచన పరకత్వమందు మాత్రమె వచ్చునవి. అయ్యవి 'అదు-అది' శబ్దమూలకములు. తెల్గులోని వాటిని మున్నగువానిలోని 'టి' అనునది బహువచనములందువచ్చు 'వట్టు=(ట్టు)=అట్టు=(ట్టు)' అను తమిళాగమ కభిన్నము. 'అట్టు' అనుదానికి నేఁటి తమిళోచ్చారణమునఁగల 'అత్రు' అను దాని యాకార సామ్యమున నది 'అత్తు' అనుదాని కభిన్నమనెడి భ్రమను దొరగారికిఁ గల్గించెను. అంతియకాని యీ రెండును - 'అత్తు-అత్రు' అనునవి యభిన్నములు కావు. కేవలము విజాతీయములు, 'అత్తు' అనునది తచ్ఛబ్దార్థకైకవచన సంబంధి. 'అట్టు-వట్టు' అనునవి తచ్ఛబ్దార్థక బహువచనరూప సంబంధులు. (చూడు ౪౭ III విష).

కన్నడమందలి "అదఱ = (దానియొక్క), అవఱ = (వానియొక్క)" మున్నగువానిలోనిది ఱకారమనియు రేఫము కాదనియుఁ బ్రాచీన ద్రావిడభాష లలోని 'ర-ఱ' లు కేవలము విజాతీయములనియుఁ బ్రాచీన ద్రావిడభాషల లోని ఱకారము 'ట-త' మధ్యస్థోచ్చారణము గలదనియుఁ గన్నడ విభక్తిపూర్వా గమములగు దకారమును (కన్న-వనదిం=వనముచేత) ఱకారమును (అదఱిం= దానిచేత) నభిన్నము లెంతమాత్రమును గానేరవనియు నీ విషయమున డా. గుండర్టుదొరగారి యాశయము యుక్తమనియు నీవఱకు విపులముగా వివరింపఁబడెను. (చూడు రా-౨ IV విష).

తమిళమున 'అఱ్ఱు' అను ద్విరుక్త ఱకారమున్న చోటులందుఁ గన్నడ మున రేఫము పల్కఁబడుచున్న దనిన కారణమున నైతమవి యభిన్నము లనియు రేఫ దకారములకుఁ బరస్పరమును మార్పు సహజమగుటచేత 'అఱ్ఱు' అనుదానికి 'అత్తు' అనుపల్కుబడి కల్గెననియు దొరగారు తడఁబాటుపడి వ్రాయుచున్నారు. 'అదఱ' = (దానియొక్క) మున్నగునవి ఱకార ఘటిత ములు. వానిలో రేఫము గలదనుట పొరపాటు. కన్నడములోని 'అవఱిం'= (వాటిచేత) అనునదియుఁ దమిళమందలి 'అవఱ్ఱిన్' అనునదియు నభిన్నములు కావు. తమిళమునఁ దచ్ఛబ్దాదుల యమహ ద్బహువచనములందు మాత్రమె 'వఱ్ఱు=అఱ్ఱు' అనునాగమము వచ్చును. ఏకవచనములందు 'అన్' అనునా గమము వచ్చును. ఇయ్యది కన్నడభాషలోని 'అఱు' అనుదానికి మూలమనఁ దగును. కావుననె యీ విషయమున డా. గుండర్టుగారి యాశయము యుక్త మగుచున్నది. తమిళులు నిర్దేశసర్వనామరూపముల విషయమున నేకత్వ బహుత్వములలో వేర్వేఱు విభక్తిపూర్వాగమములతో నున్న రూపములను వ్యవహరించుచుండఁగాఁ గర్ణాటు లట్టి యోపికలేక యేకత్వమున వచ్చు 'అఱు' అనునాగమమునే బహువచనరూపములందును జేర్చి వ్యవహరింప సాగిరి. ఉదా:—తమి - అదనిన్ = (దానివలన)-అవఱ్ఱి (ట్రి) న్=(వాటివలన). కన్న- అదఱిం=(దానిచేత). అవఱిం=(వాటిచేత).

కన్నడములోని 'అద్' అనుదాని ద్విరుక్త రూపమె 'అత్తు' అనఁదగు ననియు దాని కభిన్నమగు 'అఱ్' అనుదాని ద్విరుక్త రూపమె 'అఱ్ఱు' అనియు నిట్లీ రెండును నభిన్నములనియు దొరగారు పొరపడి వ్రాసిరి. ఊరకే వానికి ద్విత్వమెట్లు వచ్చునని తలంపరైరి. అట్లె యేక వచనరూపములు బహువచన రూపముల కభిన్నము లెట్లగుననియుఁ దలంపరైరి. 'అద్' అనునది 'అత్తు' అను దాని కభిన్నమని నిశ్చయించుకొని యూరకే తకారము ద్విరుక్త రూపము నందుట గలదని నిర్ణయించుటకై కొన్ని యుదాహృతుల నిచ్చి గ్రంథమును

బెంచి వ్రాసిరి. పరిశీలింపఁగా నచటి ద్విత్వరూపము లూరకయె వెలసినవి కావని తోఁచుచున్నది. తమిళ ప్రసిద్ధమగు 'అత్తు' అను నాగమము 'అంఃతు (దు)=(అది)' అను నమహత్తచ్ఛబ్దైక వచనరూపమున కభిన్నమనఁ దగును. దొరగారు 'అదు' శబ్దపర్యాయము 'అంఃదు' అనునది కలదనియైనఁ దలంచినట్లగపడదు.

"యాదెన్ ఇఉదియుమ్......" (తొల్కా. ౨౦౧ సూ.) = విభక్తి పరమగు నపుడు 'అంఃతు-ఇంఃతు-ఉంఃతు' అను నిర్దేశ సర్వనామములకును 'అన్' అనెడి యాగమము వచ్చును. అపుడు వానిలోని 'ః' అనెడి యాయ్దము లోపించును. ఉదా:—అంఃతు+ఐ=అత (ద) నై = (దానిని). 'అదు' మున్నగు వానికిని ద్వితీయాద్యేక వచనరూపము లిట్లే యుండునని యీ వఱకుఁ జూపఁబడెను. (చూడు ా౨ IV విష). ఆయ్దము పరవరుష స్థానికమని యీవఱకే వివరింపఁబడెను (చూడు ౧౭ IV విష.). ఇట్లగుటచేత 'అంఃతు' (దు) మున్నగునవి 'అత్తు' మున్నగు రీతిని పల్కఁబడుచుండునని విశదమగుచున్నది. కావున 'అత్తు' అనునాగమము 'అదు' శబ్దమున కభిన్నము కాదనియు 'అంఃతు' అను శబ్దమున కభిన్నమనియు నిశ్చయింపఁనగును.

వెనుకటి స్థలమందువలెనే (ా౨ IV విష.) 'అట్టు' (ట్టు) శబ్దవ్యుత్పత్తి విషయమున సయితము డా. గుండర్టుగారి యాశయమె యుక్తమని చెప్పనగును. 'అన్+త్తు=అట్టు' అని యేర్పడెననెడి గుండర్టుగారి యాశయము పయిని గాల్డువెల్లుగారు చూపిన యాక్షేపణములు రెండు. 'అన్+త్తు' అనుచోట 'అన్' అనునదియు, 'త్తు' అనునదియు అదు శబ్దపర్యాయములె (౨ా V. ా౨ VI విష. చూడు) యగుటచేత నీ వ్యుత్పత్తి పునరుక్తి దోషదూషిత మగుచున్నదనునది యొక యాక్షేపణము. పూర్వశబ్ద చరిత్రము విస్మృతమయి దాని పర్యాయమె మరల నిల్చునను పద్ధతి నవలంబించి కాల్డువెల్లుగారెన్నో చోటులలో నిట్టి పునరుక్తుల నంగీకరించి యున్నారు (చూడు ా౨ III విష. ా౭ VIII విష మొ).

పరిశీలింపఁగా నీ గుండర్టుగారి వ్యుత్పత్తియం దట్టి పునరుక్తియు లేదని తోఁచుచున్నది. (అన్+తు=అట్టు=(అట్టిది) శ్రీ. రెడ్డిగారు). 'అన్+తు=అట్టు=(ట్టు)' అనుచో, 'అన్' అనునది 'అదు' శబ్దపర్యాయమగు తచ్ఛబ్దామహత్ప్రథమైకవచనరూపము. (చూడు ౨ా V విష). 'తు' అనునది 'అదు' శబ్దములోని యేకవచనద్యోతకమగు ప్రత్యయము. (చూడు ౭౹ II విష). ఇట నేకవచనాంతముపై మఱొక యేకవచన ప్రత్యయము నిల్చుటచే బహుత్వ

బోధక మయ్యేనేమో? లేదా సంస్కృత త్యదాదుల సంపర్కముగల 'అదు' ప్రభృతులలోని దకారాభిన్నమగు తకార (౭౫ II. V. విష) మేకత్వ బహుత్వ సాధారణమై ప్రాచీనకాలమున నుండెడిదనియుఁ (చూడు కాల్డువెల్లు దొరగారి మతము. కాల్డు. ౫౧౧ పుట చూడు ౧౩౧ X విష) గాలక్రమమున నితర ప్రత్యయములు బయల్వెడలుటచేత 'తు' అనునది యమహ త్తదాదిశబ్దైక వచనమై నిల్చెననియు భావించునపుడు కేవల ప్రాచీనకాలమున నేర్పడిన 'అన్+తు=అణ్ఱు' అనుదానిలోని 'తు' అనునది బహుత్వబోధకము నయితము కానోపు ననఁదగును గదా.

ఇంకఁ గాల్డువెల్లుగారు చేసిన రెండవ యాక్షేపణము:—'అన్+తు' అనువాని సంధిలో ఱకారమేర్పడుట ద్రావిడవర్ణ పరిణామపద్ధతి విలక్షణ మనునది సరికాదు. అట్టి వైలక్షణ్యమును నిర్ణయించుటకుఁ దెల్గులోని అందు' శబ్దమును దృష్టాంతము చేయుటయుఁ యుక్తముకాదు.

తమిటమున 'న' కారముమీఁద నిల్చిన 'త' కారము ఱకారమగుట సుప్రసిద్ధము. స్వానునాసికపూర్వక పరుషము పరుషద్విత్వమగుట తమిటి మున సహజమె కదా. (చూడు ౨౫ I విష).

"లనఎన......" (తొల్కా. ౧౫౦ సూ.)=ద్వివిధసమాససంధులలోను 'ల-న' లకుఁ బరముగ 'త-న' లు నిల్చునపుడు తకారము 'ఱ' కారమగును. పరస్థిత దంత్య నకారము మూర్ధన్య నకారమగును. ఉదా:—పొన్+తీదు= పొన్ఱీదు=(బంగారము చెడ్డది). నకార సదృశమగు లకారము ఱకారపరకత్వ మున నాయ్దవ మగును. ఉదా:—కల్+తీదు=కఱ్ఱీదు=(కట్రీదు=కట్టీదు) (ఱాయిచెడ్డది) (చూడు తొల్కా. ౩౭౦ సూ).

రా౨. VII విష:—"(౫) తుదిహల్లు ద్విరుక్తి నొందుట యనెడి యంగ పరిణామము:—అఱవమున 'డు-ఱు' అను నక్షరములు తుదినిగల నామవాచక ములకు ద్వితీయాది విభక్తులు పరమగునపు డా 'ఱ-డ' లకు ద్విత్వమగును. ద్విత్వావస్థలోని డకారము టకార మగును. ఱకారద్వయము 'త్రు' అనునదిగాఁ బలుకఁబడును. ఉదా:—అఱ-కాడు = (అడవి)+కు = కాట్టుక్కు = (అడవికి). ఆఱు=(నది. 'యాఱు' రూపాంతరము)+ఇల్ =ఆట్రి (త్రి) ల్ =(నదిలో). ఈ మార్పు సప్తమ్యర్థమునఁ గల్గునని గుండర్టుగారు వచించిరి. కాని నాకది రుచింపలేదు. ఈ మార్పున కీ క్రింది రీతిని వ్యుత్పత్తి నెన్నునది." (కాల్డు. ౨౬౭ పుట).

"మొదటి నామముయొక్క యర్థమును బరస్థిత శబ్దార్థముతో సంబం ధింపఁ జేయుట యీ ద్విత్వము మూలముననే ఘటిల్లును. ఇట్లె యకర్మక

ములు సకర్మకములగునపుడును విశేష్యము విశేషణమగునపుడును సమాసము లందును నీ ద్విత్వము గల్గును. ఉదా:—ఓడు = (పరుగెత్తు)—ఓట్టు = (పరుగెత్తించు=త్రోలు). తేఱు=(స్వచ్ఛత నందు)-తేఱ్ఱు (త్రు)=(స్వచ్ఛత నందించు= ఓదార్చు)" (కాల్డు. ౨౬౮ పుట).

"తెల్గుభాషయందుఁ బైరీతిగల స్థలములలోఁ దుదిహల్లు ద్విరుక్తమగుటకు మాఱుగ నొక్క పరుషమె నిల్చును. ఉదా:—ఏఱు = (నది) - ఏటి = (నది యొక్క). ('ఏట్టి' అని కానేరదు). నాడు = (దేశము). నాటి = (దేశము యొక్క). కొన్ని అకారాంతములలో నఱవమునందలి ద్విత్వమున కనుగుణముగా 'ఱ' ద్విత్వము తెల్గున అకార తకారములలోనికి మాఱును. ఉదా:— అఱ్ఱు=అత్తి. తెల్గుపదములను మాత్రము ప్రత్యేకించి పరిశీలించునపుడు ఆ డల స్థలములయందును వెనుకటిరీతినె 'టి-తి' అనునవి నిల్చినట్లె యగపడును. 'ఱు-డు' లు తుదినిగల యకర్మకములు సకర్మకము లగునపుడును దమిళమందు వలె వాని తుది హల్లునకు ద్విత్వము కల్గక 'చు' వర్ణము చేరుట పై యూహ కనుగుణముగా నున్నది. అట్లయినను దమిళ ద్విత్వపద్ధతి తెల్గున మఱుఁగు పడియున్నదనక తీరదు. తమిళ ద్విత్వములచోట స్థలాంతరములందుఁ దెల్గున నట్టి పరుషము నిల్చుచుండును. ఉదా:—పాడు—ధా. అఱ—పాట్టు. తెల్గు—పాట. నాడు మున్నగుచోటులందు 'నాటి' అని 'ఇ' కారము నిల్చుట 'టి' అనుదాని యలవాటుచేతనే తెల్గునఁ గల్గుచున్నది." (కాల్డు. ౨౬౮ పుట).

విమర్శము:—ప్రాచీన ద్రావిడభాషలలో సరళములె లేవు. కాన 'డు' వర్ణాంతములనుట, వాని 'డు' వర్ణము ద్విత్వావస్థలో 'ట' కార మగు ననుట, సరికావు. అవి 'టు' వర్ణాంతములె యనఁదగును. 'ఱ్ఱు' అనుదానిని నేఁటి తమిళోచ్చారణము చొప్పున 'త్రు' అనుదానిగా నెన్నుట సరికాదు. ప్రాచీన ద్రావిడభాషలో నది 'ట్టు' అనుదానివలెఁ బల్కఁబడెడిది. తెల్గున నద్దాని పరిణామములందు 'త' కారము నిల్వక 'ట'కారము నిల్చుటయె ప్రాచీనకాలపు 'టు' కారోచ్చారణమునకుఁ బ్రబల నిదర్శన మనఁదగును. (చూడు. ౧౭ XIII విష).

తమిళమందు 'ఱు-డు' లకు ద్విరుక్తియున్న కారణమునఁ దెల్గునందును నట్టి ద్విత్వము మఱుఁగుపడి యున్నదని యంగీకరించుట సరికాదు. తెల్గు:— "ఏఱు=(నది)—ఏటిని. నాడు=(దేశము)—నాటిని." మున్నగు స్థలములం దాపవిభక్తిక 'టి' వర్ణమె నిల్చుచున్నదని యెఱుంగనగును. కాన 'నాటి' అను చోట 'నాటు' అని యుండవలసినదనియు నాపవిభక్తిక 'టి' వర్ణముయొక్క యలవాటుచేత 'ఇ' త్వము వచ్చినదనియుఁ దలంచుట యసంగతము. 'పాడు' ధాతువు ప్రాచీనకాలమున 'టా'ంతమె కాన దాని కృదంతము 'పాట' అని

యేర్పడుటలో వింతలేదు. మఱియు నిటదాని ప్రసంగ మప్రసక్తము. "అఱ్ఱు=(మెడ)—కొఱ్ఱు=(కొయ్య)." మున్నగు తెల్గు శబ్దములందలి 'ఱ్ఱు' అనునది 'ఱ్ఱి' అనునదిగా మాఱె ననుటయు నసంగతమె. అట్టియెడల నొవవిభక్తిక 'ఇ' ప్రత్యయము నిల్చెననియు నొక అకార మట్టియెడల లోపించెననియు నెన్న నగును. కన్నడమందువలెనె తెల్గునందును హలంతర సంయోగమున అకారము రేఫముగాఁ బరిణమించును. ఉదా:—అఱ్ఱు-అర్తిని-మొ.

ఱు-టు (డు)లు తుదినిగల శబ్దముల విషయమునఁ దొల్కాప్పియరును ద్విత్వమె వచ్చునను తలంపున నీ క్రింది రీతిని సూత్రించిరి.

"నెట్టెలుత్తిమ్బర్......" (తొల్కా. ౧౯౭ సూ.)=విభక్తి పరకత్వమున ద్విత్వము వచ్చెడి చోటులందుఁ బొట్టి 'ఉ' కారమునకుఁ బరముగా 'ఇన్' అను నాగమము రాదు. ఉదా:—యాఱు+ఐ=యాఱ్ఱై (ట్టై)=ఏటిని. యాడు+ఐ=యాట్టై=(మేకను). ఉకారాంతములగు 'ఱ-ట'ల కచ్చుపరమగునపుడు తమిళమునఁ దఱచుగా ద్విత్వము వచ్చును.

"అవైతాం ఇయత్తెఁ......" (తొల్కా. ౧౯౮ సూ.)=విభక్తి పరకత్వమున ద్విత్వమునందెడు చోటులందు విభక్తి పూర్వాగమ మేదియును రాదు. ఉదా:—యాఱు+ఐ=యాఱ్ఱై (ట్టై)=(ఏటిని).

రూపసాధన మాత్రప్రవణమగు శబ్దశాస్త్రమునఁ దొల్కాప్పియ రిట్లు ప్రక్రియను సూత్రించినను శబ్ద చరిత్రము నరసెడి శబ్దతత్త్వశాస్త్ర పద్ధతిలోఁ గాల్డు వెల్లుగారు పైరీతి నర్థవిశేషబోధక స్థలములం దూరకయె ద్విత్వము వచ్చు నని వచించుట యర్హము కాదు. ఇట్టి 'ఱు-డు' వర్ణాంత శబ్దములకు విభక్తి పరకత్వమున నమహత్తచ్ఛబ్ద సంశ్లేషమగు 'తు' అను విభక్తి పూర్వాగమమును విధించి వాని సంధిలో నట్టి ద్విత్వరూపము లభించునట్లు సూత్రించుట యావశ్యకము. అకర్మకములు సకర్మకములుగా మాఱెడి ప్రేరణ స్థలములు మున్నగు చోటు లందును నిట్లే ప్రేరణార్థక ప్రత్యయముల నంగీకరించుట యుక్తమని యీవఱకు విపులముగా వివరింపఁబడెను (చూడు ౨౮ III విష).

శబ్దాంత్య వర్ణ ద్విత్వ మచటి ప్రకృతి ప్రత్యయముల సంబంధమును బోధించుననెడి దొరగారి వ్రాఁత యసంగతముగ నుండుటచేతను నచట విభక్తి పూర్వాగమమును నిరూపించుటకు వీలుపడి యుండుటచేతను బయిరీతిని వ్రాసితినే కాని యెల్లయెడలను విభక్తి పూర్వాగమము లుండక తీరదను నిర్బంధము లేదు. 'హరిచేత-సీతచేత-వదినెకు' మున్నగు ననంతములయిన శబ్దముల

స్థలములందు విభక్తి పూర్వాగమ మేదియు లేదుగదా. అచటి ప్రకృతి ప్రత్యయరూప శబ్దముల సమాసమువంటి కూడికయె వాని సంబంధమును దెల్పునని యంగీకరింపక తీరదుగదా. 'అవనోడు' మున్నగు ననేక తమిళ పదములందు విభక్తి పూర్వాగమ మేదియు లేదుగదా. "ఇంత యేల! తొల్కాప్పి యరే యిట్లు నచించిరి. 'పుళ్ళి యిఱుదియుమ్......' (తొల్కా. ౨౦౩ సూ.)=నే నీ ప్రకరణమునందుఁ జెప్పిన శబ్దములు తప్పఁ దక్కిన శబ్దములకు విభక్తి పరమగునపు డాగమము రావలసిన నిర్బంధము లేదు.

రా-౨. VIII విమ:—"(౯) 'ఇ' అను విభక్తి పూర్వాగమము:— తెల్గునఁ బుం స్త్రీ సాధారణమగు త్రిక సర్వనామ బహువచన రూపములందు 'ఇ' అను విభక్తి పూర్వాగమము నిల్చును. ఉదా:—వారు—వారి=(వారియొక్క) వారు శబ్దములోని 'ఉ' కార ముచ్చారణార్థకము. 'వాని' అను పుంలింగైకవచన శబ్దములోని 'ఇ' కారము సైతము విభక్తి పూర్వాగమమె. 'వాని' శబ్దములోని 'ని' అనునది 'రామునిచేత' మున్నగు పుంలింగైకవచన నామవాచకములలోని 'ని' వర్ణమునకన్న భిన్నము. స్వల్ప సంఖ్యగల నామవాచకములలో సైత మీ 'ఇ' కారాగమ మేకవచనమునఁ గన్పట్టును. ఉదా:—కాలు—కాలి. తేరు—తేరి. మొ. తెలుఁగు భాషలోని సంబంధార్థకములగు 'వారిది' మున్నగు పదములను బట్టి యీ 'ఇ' అను నాగమ శబ్దముయొక్క వ్యుత్పత్తిని దెలిసికొనవచ్చును. 'వారిది' మున్నగు వానిలోని రేఫముమీఁది 'ఇ' కారము 'అది' శబ్దభవము కావచ్చును. "తెల్గు—వారిది. 'కు' భాష—ఏవారిది. తమి—అవరదు." మున్నగువాని చివర శబ్ద మమహ త్తచ్ఛబ్దైకవచన సంబంధి యనుట స్పష్టము"

(కాడ్వె. ౨౯౮-౨౯౯-పుటలు).

విమర్శము:—'ఇ' అను నాగమము 'అది' శబ్దభవమనుట విశ్వసనీయము కాదు. విభక్తి పూర్వాగమము లెల్ల నమహత్తచ్ఛబ్దైకవచనమునె సంబంధించి యుండవలెనను నిర్బంధమేల? 'అ' 'ఇ' అను తెల్గు విభక్తి రూపములలోని రెండును 'త దిదం' శబ్దముల మూల రూపములగు 'అ-ఇ' అను సర్వనామ శబ్దముల కభిన్నము లనఁదగును—(చూడు రా-౨ I విమ). 'వాఁడు' అను మహద్వాచక డు మంత శబ్దపు రూపము 'వాని' అనునది. రాముఁడు మున్నగు పుంలింగ మహద్వాచక డు మంత శబ్దపు రూపము 'రాముని' అనునది. ఈ రెండును విజాతీయము లనుటలో దొరగారి యాశయమేమో తెలియకున్నది.

"కాలు-తేరు-ఊరు-గోరు-చోటు-మేను" మున్నగు శబ్దముల మీఁద నిల్చు 'ఇ' కార మావవిభక్తికము, 'తి-టి' అనువానిలోని హల్లు లోపింపఁగా మిగిలిన స్వర మనఁదగును.

౮-౨. IX విష:—"(౭) 'అ' అనెడి తెల్గు భాషలోని బహువచనమున వచ్చు విభక్తి పూర్వాగమము:—తెల్గున నామవాచకములందును ననేక వ్యావహారిక సర్వనామములందును బహువచనమున వచ్చు విభక్తి పూర్వాగమము 'అ' అనునది యొకటి. తెల్గులోని బహువచన ప్రత్యయమగు 'లు=ల్' అను దాని మీఁద నియ్యది నిల్చి ద్వితీయాది బహువచన పరకత్వమున వచ్చు విభక్తి పూర్వాగమ మగుచున్నది. ఉదా:—కత్తులు—కత్తి+ల్+అ+చేత=కత్తులచేత. ఇయ్యది తమిళ కన్నడములలోని షష్ఠీ ప్రత్యయమగు 'అ' అను శబ్దమునకు భిన్నముకాదు. షష్ఠ్యర్థకమగు నీ 'అ' శబ్దము తెల్గున సైతము 'తన-తమ' అను సర్వనామములలో నేకవచన బహువచనములు రెంటియందును జూపట్టుచున్నది. కావున నీ 'అ' శబ్దము మొదట షష్ఠీ ప్రత్యయమే యని చెప్పవచ్చును. ఇట్లు ద్రావిడ భాషలలోని విభక్తి పూర్వాగమము లన్నియు విభక్తి ప్రత్యయజన్యములె యని తేలుచున్నది" (కాల్డు. ౨౬౫ పుట).

విమర్శము:—ఈ వఱకుఁ జెప్పిన విభక్తి పూర్వాగమము లెల్ల నమహత్తచ్ఛబ్ద ప్రథమైక వచనమును సంబంధించున వని దొరగారు వచించియున్నారు (చూడు ౮-౨ V విష. కాల్డు. ౨౬౭ పుట). ఇచట నవి విభక్తి ప్రత్యయజన్యము లనుచు నీ 'అ' ప్రత్యయము తమిళ కన్నడ షష్ఠీ ప్రత్యయమున కభిన్నమనుట యుక్తమా? తమిళ షష్ఠీ ప్రత్యయము 'అదు' అనునది. పఱగన్నడ షష్ఠీ ప్రత్యయము 'అ' అనునది. ఇవి వచనద్వయ సాధారణములు. బహువచనములందు మాత్రము వచ్చు (ఉదా:—రాముల చేయి) నీ 'అ' ప్రత్యయము త్రిక సర్వనామములలోని 'అ' శబ్దమున కభిన్నమనుట యుక్తము కాదా? (చూడు ౮-౨ I విష). 'తన్+అ+కైగళ్' అను నన్నూలు చెప్పిన 'అ' ప్రత్యయము వేఱు. అది బహువచనముతో నన్వయించును (చూడు ౮-౭ VII విష).

౮-౨. X విష:—"విభక్తులను సంబంధించిన సంధులు:—అఱవ చతుర్థీ ప్రత్యయమగు 'కు' అనుదానికిఁ బూర్వమున 'ఉ' అనునది యుచ్చారణ సౌకర్యార్థము చేరును. అట్టి యెడల 'కు' ప్రత్యయ కకారము ద్విరుక్తమగును. ఉదా:—అవన్=వాఁడు. అవనుక్కు=(వానికి). యుష్మ దస్మ చ్ఛబ్దములలోఁ బైస్థలమున నేకత్వ బహుత్వములు రెంటను 'అ' కారము వచ్చును. ఉదా:—నాన్=(నేను). ఎనక్కు=(నాకు). గ్రాంథి కాఱవమున నీ 'కు' ప్రత్యయము నామ వాచకములలో నంతస్థములు తుదిని గల వానికి 'ఉ' వర్ణ విరహితము గనే చేరును. ఉదా:—అవరుకు. ప్రాచీన కన్నడమందును నీ 'కు' ప్రత్యయ

మిట్లె చేరును. మలయాళమునందును యుష్మ దస్మ చ్ఛబ్దములను విభక్తులు చేరు నప్పుడు వాని నడుమ నేదేనొక యచ్చు నిల్చును. ఉదా:—మల-ఎనిక్కు= ఇనిక్కు=ఎనక్కు=(నాకు) నినక్కు=నిణక్కు=(నీకు) నముక్కు=నుమక్కు= (మనకు). ఇందుఁ గొన్నిటికి వాడుక యరుదు" (కాల్డు. ౨౯౯ పుట).

"విభక్తుల సంధులందును నుచ్చారణ సౌకర్యార్థముగఁ దమిల కన్నడము లందు స్వరసంహితా వ్యవధాయక వర్ణములు 'య వ'లు యథోచితముగ నిల్చును. తెల్గున యకారము మాత్రము నిలుచును. ఉదా:—తమి-నడు+ఇల్=నడు విల్=(మధ్య ప్రదేశమునందు) వటి+ఇల్ = వటియిల్ = (దారియందు) మగ్యార్ (సిథియను) భాషలో సయిత మిట్లు వకారము వచ్చుట గలదు. ఉదా:—లో=(గుఱ్ఱము)+అత్ = (ద్వితీయా ప్రత్యయము) = లోవత్=(గుఱ్ఱ మును)" (కాల్డు. ౩౨౦ పుట).

విమర్శము:—'అవనుక్కు' మున్నగు రూపములు తొల్కాప్పియ సమ్మత ములు కావు. అర్వాచీన రూపములు. చరిత్ర కందని చిరకాలపు ద్రావిడ భాషల సంబంధమును విమర్శించు నీ శాస్త్రమున నిట్టివి ప్రసంగింపఁదగినవి కావు. వ్యాఖ్యాత లుదాహరింతురు. (చూడు తొల్కా. ౫౧౨-౫౯3 సూ. వృత్తి). తమిల కన్నడములలో 'కు' ప్రత్యయ మేకవిధముననే చేరునను దొర గారి వ్రాఁత సరికాదు. తమిట చతుర్థీ ప్రత్యయము 'కు' అనునది. పలగన్నడ చతుర్థి 'కె' అనునది. కన్నడమున 'అవంగె-అదకె' మున్నగు విశేషరూపములును గలవు.

౮3. I విష:—"ద్వితీయా విభక్తి:—ఇండోయూరపియను భాషలలో నపుంసకములందలి ప్రథమా ద్వితీయా విభక్తు లేక రూపముననే యుండును. ప్రథమా విభక్తి చోట ద్వితీయా విభక్తిని వాడుటవలన నిట్టి యైకరూప్యము సంభవించెను. ద్వితీయ ధాత్వర్థ ఫలాశ్రయత్వమును బోధించును. అనఁగా లభించిన దానిని బొందుటయే—ఊరక యుండుట—చుఱుకుఁదనము (Activity) లేదని భావము. నపుంసక (లౌకిక)ములనఁగా జడములు. ఇట్టి స్వభావము గల వగుటచేత వాని ప్రథమార్థమునకు సయిత మిట్టి స్థితి సంభవించెను. (ప్రథమ ప్రాతిపదికార్థ మాత్రబోధకమని భావము)". (కాల్డు. ౨౭౦ పుట).

"ద్రావిడ భాషలలో నపుంసక గుణనామ వాచక నిష్పాదక ప్రత్యయ మగు 'అమ్' అనునది (చుఱుకుఁదనము లేమినీ దెల్పునది) ద్వితీయా ప్రత్య యముగా వాడఁబడిన ట్లగపడుచున్నది. ప్రాచీన కర్ణాట భాషలోని ద్వితీయా ప్రత్యయము 'అమ్' అనునదే కదా. ఇట్లీ రెండు ప్రత్యయములును (నపుంసక ప్రథమయు; ద్వితీయా ప్రత్యయమును) నభిన్నములని గ్రహింపవలెను. తమిట

మలయాళ భాషలలోఁ బ్రాతిపదికమే యనఁగాఁ బ్రథమా విభక్తియే ద్వితీయా విభక్తిగ వాడఁబడుచున్నది. సందేహ నిర్ణయావసరములందు మాత్రమె యుచ్చారణ సౌకర్యార్థగ ద్వితీయా ప్రత్యయము చేర్పఁబడును. వైదేశికులు సందేహ నిర్ణయావసరము లేనపుడును ద్వితీయా ప్రత్యయమును వాడుచుందురు. అఱవ మలయాళములలోఁ బుం స్త్రీ వాచకములకును సర్వనామములకును ద్వితీయా ప్రత్యయమును జేర్చుట సంప్రదాయమై యున్నది. మహత్తులకుఁ జుఱుకుఁదనపు లేమి యనఁగా నైష్కార్శ్యము గలదనరాదు గాన వానికిఁ గల చుఱుకుఁదనము నడఁగించుటకై వాని పైని నైష్కార్శ్య వాచకమగు ద్వితీయా ప్రత్యయమును నియతముగా నిల్పెడి సంప్రదాయ మేర్పడెనని యెఱుంగునది. నపుంసకములలోఁ బ్రథమా ద్వితీయులకు భేద ముండదు. వానికి విభక్తిద్వయము నందును నైష్కార్శ్యము సహజమె కదా. ఇండోయూరపియను భాషలలో ద్వితీయనే ప్రథమగా వాడుదురు. సిథియను భాషలలోఁ బ్రథమనే ద్వితీయగా వాడుదురు. ద్వివిధములందును ఫలభేదము లేదు. జడవాచకములందు మాత్రమె ప్రథమా విభక్తిని ద్వితీయార్థమున వాడెడి తెలుఁగు తద్విషయమున ద్రావిడ భాషా సంప్రదాయమునె యనుసరించుచున్నది. తుదభాషలో యుష్మదస్మ దర్థములందుఁ దప్పఁ దక్కిన యన్నిటను ద్వితీయా షష్ఠులకు బదులుగాఁ బ్రథమయె వాడఁబడును. నేఁటి యుత్తర హిందూస్థాన భాషలలో (హిందీ-గుజరాతి మొ.) సైతము నపుంసకముల ద్వితీయచోటఁ బ్రథమా విభక్తి వాడఁబడుట గలదు. ఈ విషయమున, నుదీచ్య భాషలు స్వీయ సంప్రదాయమును (అవి యిండోయూరపియను భాషా కుటుంబములోనివి) విడిచి ద్రావిడ భాషా సంప్రదాయమును ననుసరించుచున్నవి." (కాల్డు. ౨౭౦-౨౭౧ పుటలు).

విమర్శము:—ఇదొక బలహీనమగు నూహ. కర్శ మనఁగాఁ జుఱుకుఁదనపు లేమి యని యర్థమనియు నది జడవాచకములకు సహజముగాన జడ వాచక ద్వితీయకు ద్వితీయా ప్రత్యయ ము ద్రావిడభాషలలోఁ జేర్ప నక్కఱ లేదయ్యెననియు మహత్తులం దట్టి చుఱుకుఁదనపు లేమి యనఁగా నైష్కార్శ్యము గల దనరాదు గాన వాని యట్టి చుఱుకుఁదనము నడఁచుటకై వానిపైని నైష్కార్శ్య వాచక ద్వితీయావిభక్తి నియతముగాఁ జేర్పఁబడుననియుఁ గాల్డువెల్లు గారి వివరణమునకుఁ దాత్పర్యము. తెల్గున జడవాచకముల ద్వితీయచోటఁ బ్రథమ వాడఁబడుట గలదు. కాని యత్యంత ప్రాచీనమగు తొల్కాప్పియము జడవాచకములపై ద్వితీయా ప్రత్యయమును సమ్మతించుచున్నది. తమిళ వ్యాకరణములం దెచ్చటను జడవాచక ద్వితీయచోటఁ బ్రథమ నిల్చునను విధి లేదు.

"మంఇకాన్ పుళ్ళి......" (తొల్కా. ౧౮౬ సూ.)=మకారాంత శబ్దములకు విభక్తి పరమగునపుడు 'అత్తు' అనెడి సారియై వచ్చును. ఉదా:—మరమ్+అత్తు+ఐ=మరత్తై=(వృక్షమును).

"సు (చు) ట్టు ముదల్ ఉకరమ్......" (తొల్కా. ౧౭౭ సూ.)='అదు-ఇదు-ఉదు' అనెడి నిర్దేశవాచకములకు ద్వితీయాది విభక్తులు పరమగునపుడు 'అన్' అను నాగమము వచ్చును. అపు డుకారము లోపించును. ఉదా:—అదు+అన్+ఐ=అదనై =(దానిని). ఇదనై =(దీనిని). కవుల వాడుకలో 'అదై—ఇదై' అనునవి గలవు. వీనియందును ద్వితీయా విభక్తియే నిల్చియున్నది.

తొల్కాప్పియమునకుఁ దర్వాతి కవుల వాడుకలో జడ ద్వితీయచోటఁ బ్రథమ వాడుక విస్తరించినను బ్రాచీన స్థితి విషయమునఁ దొల్కాప్పియమె పరమ ప్రమాణము.

తొల్కాప్పియమున విభక్తి వ్యత్యాస ప్రకరణము ౫౬౭ సూత్రము మొదలుగ ౫౭౫ సూత్రవఱకును వివరింపఁబడెను. అందెచ్చటను జడవాచక ద్వితీయచోఁ బ్రథమ నిల్చుననుట మచ్చునకేని లేదు. సమాసమునందు ద్వితీయా విభక్తి లోపించునపుడు ప్రాతిపదికము నిల్చుట సంప్రదాయ మగుట చేతను నట్టి ప్రాతిపదికమె తమిళమునఁ బ్రథమైకవచన మగుటచేతను నట్టి యెడల ద్వితీయార్థమున మహా దమహత్తులు రెంటను బ్రథమనిల్చును. ఉదా:—సమాస స్థల విభక్తిలోపము — ద్వితీయా తత్పురుషము (ఇరణ్డామ్ వేఱ్ఱుమైత్తొగై):—నిలంకడన్దాన్ =(నేలను దాఁటెను) వ్యస్తతలో:—'నిలత్తై క్కడన్దాన్' అని యుండును. (చూడు. తొల్కా. ౭౧౭ సూ). క్రియాకారక సమాసము తమిళ కన్నడ మలయాళ ప్రసిద్ధము.

సమాసేతర స్థలమున వాక్యాంతమున ద్వితీయాలోపము గలదు. "ఐ యుమ్......" (తొల్కా. ౫౮౯ సూ.)="వాక్యావసానమందలి ద్వితీయ గాని సప్తమిగాని వైకల్పికముగా లోపించును. సమాసేతర స్థలమైనను నిచట మాత్రము విభక్తిలోపము గలదని భావము". ఉదా:—కడన్దా న్నిలమ్=కడన్దాన్ నిలత్తై. ఇది తప్ప వ్యస్తతలో ద్వితీయ లోపించి ప్రథమావిభక్త్యాభాసమగు ప్రాతిపదికము నిల్చుట తొల్కాప్పియమున మచ్చునకేని లేదు.

"విభాషయా మిమ్మా" (కర్ణా. భూ. ౫౨ సూ.)=అకారాంత నపుంసక లింగ శబ్దములకు ద్వితీయైకవచనము పరమగుచుండఁగా వైకల్పికముగ మకార

నకారాగమము లగును. సంస్కృత సమములకు మకారాగమము నియతము. ఉదా:—పొలమం = పొలనం = (పొలమును). నెలమం = నెలనం = (నేలను). కులమం = (కులమును) ఇట్లు లెక్కకు మీఱి జడవాచక ద్వితీయాంతములు కర్ణాటభాషా భూషణాదులలోఁ జేర్చఁబడియున్నవి. ఎచ్చటను ద్వితీయ సందేహ నిర్ణయ మాత్రార్థకమని చెప్పఁబడలేదు. తుదికిఁ దెలుఁగు వ్యాకరణము లందును జడవాచకముల ద్వితీయార్థమునం బ్రథమనిల్చుట నియతము కాదు-వైకల్పికము.

"తస్యాః ప్రథమాచ జడపదానాంస్యాత్" (ఆం. చి.) "జడవాచక శబ్ద సంబన్ధిన్యాః ద్వితీయాయాః స్థానే ప్రథమాపి స్యాత్-చాద్ద్వితీయాపి" (అహో. 3_౨౧ పుట).

కర్ణాటమునం దింత స్పష్టముగా ద్వితీయార్థమునఁ బ్రథమ వైకల్పికముగ నగునని చెప్పఁబడలేదుగాని యొక విభక్తికి మఱొక విభక్తి యగుట బహుళమని సర్వ విభక్తి సాధారణముగను సర్వలింగ సాధారణముగను సూత్రింపఁ బడి యున్నది. ఆ సందర్భమున ద్వితీయచోఁ బ్రథమయు నుదాహృత మయ్యెను. "వ్యత్యయో బహుళమ్" (కర్ణాట శబ్దా. ౨౩౧ సూ.) = "సుపాం బహుళం వ్యత్యయో భవతి." "సప్తమ్యాం ద్వితీయాయాంచ ప్రథమా దృశ్యతే...... ద్వితీయాయాం యథా:—ఘటం మాడిదం = (కుండను జేసెను). అత్ర మాడు ధాతో స్సకర్మకత్వాత్ 'ఘటమం' ఇతి ద్వితీయైవ న్యాయ్యా, తథాపి ఘట మితి ప్రథమా." (మంజరీ మకరందవ్యాఖ్య).

రా3. II విష:—"ద్వితీయావిభక్తి ప్రత్యయములు:—'ఐ-ఎ-అ'. అఱవ మున 'ఐ' కారము మాత్రమె యన్ని లింగములందును వచన ద్వయమునందును ద్వితీయా ప్రత్యయము. కాని నపుంసకములలో మాత్రము సామాన్యముగా ద్వితీయావిభక్తి ప్రథమతోఁగాని ప్రాతిపదికముతోఁగాని తుల్యముగా నుండును. ఉదా:—అవనెయ్ (నై) = (వానిని) అవళెయ్ (ళై) = (ఆమెను). అదెయ్ (దై) = (దానిని = ఆ వస్తువును). అఱవములోని 'ఎయ్' (ఐ) ప్రత్యయము చోట మలయాళమున 'ఎ' ప్రత్యయము వాడఁబడును. ప్రాచీనకాలమున 'అ' ప్రత్యయము తఱచుగా వాడఁబడెడిదని డా. గుంటర్టుగారు చెప్పుచున్నారు. (ముస్ముందు దొరగారు 'అ' అనుదానినుండి 'ఐ' అనుదానిని సాధింతురు. దానికి బలముగా నివు డీ వాక్యమును జూనిపిరి). కన్నడమున సాధారణముగా 'అ-అన్ను' ద్వితీయా ప్రత్యయములుగా వాడఁబడుచున్నవి. కొన్ని యెడల నీ 'అ' ప్రత్యయము 'న' అనునదిగా మాఱిన ట్లగపడుచున్నది. ఉదా:—

నన్న=(నన్ను) నిన్న=(నిన్ను). కన్నడములోని 'అ' ప్రత్యయము మలయాళములోని 'ఎ' ప్రత్యయమునకును దమిళములోని 'ఎయ్' (ఐ) ప్రత్యయమునకును, సరియై యున్నది. ఇట్టి స్వరముల తౌల్య మాభాషలకు సహజమై యున్నది." (కాల్డు. ౨౭౧-౨౭౨ పుటలు).

"అఱవ మలయాళములలోని 'ఎ-అ' అను ద్వితీయావిభక్తి ప్రత్యయములను బోలునవి పెక్కు భాషలలో నున్నవి.

ఇండో యూరోపియను:
హిందీ — హే-ఎ
గుజరాతి — ఎ
బెంగాలి, సింధి — ఎ
బ్రహుయి — నె-ఎ

మతె — ఎ
వోటియకు — ఆ
టర్కిషు — ఈ — యీ
మంగోలియా — ఈ — జీ
ఓరియంటల్ టర్కిషు — నీ
కాల్మకు — నీ

సిథియను భాషలలోను బ్రహుయి భాషలోను నకార ముండుట నరయఁగా నఱవ ప్రత్యయములందును ద్రుత ముండెడిదేమో యను సందేహము పొడము చున్నది. ద్రావిడ భాషలలోని తక్కిన ద్వితీయా ప్రత్యయములను బరిశీలించునపుడు పయి సందేహము మఱింత బలపడును". (కాల్డు. ౨౭౨ పుట).

విమర్శము:—దొరగారు ముస్ముందు 'అ' ప్రత్యయము నుండియె 'ఐ' అను తమిళ ప్రత్యయము సైతఁ మేర్పడినదని నిరూపింపఁ దలఁచియున్నారు. అట్లగుటంజేసి 'అ' ప్రత్యయము ద్వితీయలోఁ గలదని చెప్పుచున్నారు. కర్ణాటమున "నిన్న=(నిన్ను). నన్న=(నన్ను)" అను రూపములు హళె గన్నడ వ్యాకరణ శబ్దాదర్శమందును లేవు. కానఁ గన్నడమున 'అ' ప్రత్యయము ద్వితీయ కానేరదు. తమిళమందుఁ గలదనుట బొత్తిగా నసత్యము. మలయాళమునఁ బ్రథమా బహువచనము 'అ' ప్రత్యయము గలదని చెప్పిరేమో (చూడు ౧౫ II విష.) కాని ద్వితీయా ప్రత్యయమని చెప్పియుండరు. ఐకారము 'ఎ' కారముగా మాఱుట సహజము గాన (౧౮ II విష.) నఱవ ద్వితీయా ప్రత్యయము మలయాళమున 'ఎ' అను పరిణామ మందుట సహజము.

"పేర్-ఎ-ఓడ్-కు-నిన్ను-ఉడె-ఇల్-విళి-ఇత్యష్టకమ్" (లీలాతిలక మను మలయాళ వ్యాకరణము. ద్వితీయ శిల్పము. ౧౧ సూ.) " 'పేర్' అనఁగాఁ బ్రాతిపదికము. అదే ప్రథమ. విళి=సంబోధనము. తక్కిన యాఱును

ద్వితీయాది ప్రత్యయములు" అను చొప్పున మలయాళ ద్వితీయ 'ఎ' ప్రత్యయ మాత్రమె. అఱవ మందుఁగాని కన్నడమందుఁగాని 'అ' ప్రత్యయము ద్వితీయ యనుట కల్ల. కర్ణాట వ్యాకరణము లందెందును 'అ' ప్రత్యయము ద్వితీయ యని చెప్పఁబడలేదు. 'అమ్' అనునదే ప్రాచీన కర్ణాట ద్వితీయా ప్రత్యయము. 'అన్ను' అనునది హాలసగన్నడ ద్వితీయా ప్రత్యయము. హాలసగన్నడమందును 'అ' ప్రత్యయము ద్వితీయ యని హాలసగన్నడ వ్యాకరణమున లేదు. "ఉ-ఎ-ప్రథమ, సంబోధనము. అన్ను-ద్వితీయ. ఇంద-తృతీయ......" (శబ్దాదర్శ-హాలసగన్నడ వ్యాకరణము. ౪౦ సూ).

తమిళ నపుంసక ద్వితీయ ప్రథమా సదృశముగా నుండునను దొరగారి వ్రాఁత భ్రాంతి మూలకము. 'అవై' అను నపుంసక ప్రథమా బహువచనమును 'ఐ' అను ద్వితీయా ప్రత్యయమును నుండుట దొరగారి కిట్టి భ్రాంతిని గల్గించెనేమో? జడ ద్వితీయచోఁ బ్రథమ నిల్చునని తొల్కా-ప్పియమున నెచ్చటను లేదు. (చూడు ౧౩ I విష).

"అదు-ఇదు-ఉదు, అఃదు-ఇఃదు-ఉఃదు, అవై-ఇవై-ఉవై, అవ్-ఇవ్-ఉవ్, యాదు-యా-యావై" (తొల్కా. ౬౫౧ సూ.) ఈ పదునైదు శబ్దములును నమహన్నామములు. 'అదు' మున్నగు నేక వచనముల ద్వితీయ 'అదనై' అనురీతి నుండును. అవై మున్నగు బహు వచనముల ద్వితీయ 'అవైయత్తై' (ట్టై) అనురీతి నుండును. 'అవ్' మొదలగు బహువచనముల ద్వితీయ 'అవత్తై=(ట్టై)' అనురీతి నుండును. (వీని రూపసాధన సూత్రములు వెనుకఁ జూపఁబడెను. చూడు ౧౨ VI విష).

కన్నడమున 'అ' అను ద్వితీయా ప్రత్యయమే లేదు. అట్టిది ద్రుతముతోఁగూడి యున్నదనుటయు 'నిన్న=(నిన్ను) నన్న=(నన్ను)' అను ద్వితీయా రూపములు కన్నడమునఁగల వనుటయు సత్యవిదూరములు. పటగన్నడమున నట్టివి లేవు సరే కదా హాలసగన్నడమునందును లేవు. హాలసగన్నడ వ్యాకరణమగు శబ్దాదర్శమున "నిన్నన్ను (నిన్ను) నన్నన్ను=(నన్ను)" అనునవి మాత్రమె యుష్మ దస్మ ద్వితీయైక వచన రూపములు చూపఁబడినవి. (చూడు శబ్దాదర్శ. ౬౪ సూ).

౧౩. III విష:—"(౨) మఱికొన్ని ద్రావిడ ద్వితీయా ప్రత్యయములు. 'అమ్-అన్ను-అన్న-ను' మొదలగునవి.

'అమ్' అనునది ప్రాచీన కర్ణాట ద్వితీయా ప్రత్యయము. ఉదా:—అవళమ్=(ఆమెను). 'అన్ను' అనునది హాలసగన్నడ ద్వితీయా ప్రత్యయము.

ఉదా:—అవళన్ను=(ఆమెను). ఈ రెండును (అమ్=అన్ను) భిన్నములు కావు. 'అమ్' అనునది సాధారణముగా 'అన్' అనునదిగా మాఱును. ఉదా:— పలుగన్న-అనమ్=(వాఁడు). అఱ-అవన్=(వాఁడు) లాటిను సంస్కృతముల ద్వితీయలోని మకారము చోట గ్రీకుభాషలో నకారము నిల్చుచున్నది. ప్రాచీన కన్నడములోని, 'అమ్' అనునది 'అన్' అనునదిగా మాఱఁగా దానిపై నుచ్చారణార్థముగ 'ను' అనునది చేరుటచేత 'అన్ను' అనురూప మేర్పడి యుండును. అఱ-మణ్=తెల్గు-మన్ను. (ఇచట నుచ్చారణార్థముగ 'మన్+ను' అనురీతిని 'ను' అనునది చేరినది.) కన్నడమునఁ 'అన్న=న్న=న' అను మూఁడు రూపములు గల మఱొక ప్రత్యయము గలదు. ఉదా:—నన్న=(నన్ను). ఇది 'అన్ను' అను దానినుండి యేర్పడినదె యనఁదగును". (కాల్డు. ౨౨౨-౨౨౩ పుటలు).

"తుళు భాషలో 'ను-న్' అనునవి ద్వితీయా ప్రత్యయములు. ఇవి తెల్గు కన్నడ ప్రత్యయములకు సరిపడుచున్నవి. ఉదా:—పలుగన్న-ఇదమ్=(ఇదు+అమ్)=హొసగన్న—ఇదన్ను=తుళు-ఉన్దెన్=తెల్గు-దీని. ఇవెల్లఁ బ్రాచీన కర్ణాటములోని 'అమ్' ప్రత్యయ రూపాంతరములె. ఈ 'అమ్' ప్రత్యయము వెనుక వివరించిన తచ్ఛబ్ద నపుంసక రూపము కావచ్చును. 'ఊన్' అనునది 'గోందు' భాషలోని ద్వితీయా ప్రత్యయము." (కాల్డు. ౨౨౩ పుట).

"తెల్గు భాషలోఁ దక్కిన ద్రావిడ భాషలందువలె జడవాచక ద్వితీయా విభక్తిచోటఁ బ్రథమ నిల్చును. జడవాచకములందు సైతి మఱవమందువలెనె ద్వితీయా ప్రత్యయము వికల్పముగాఁ జేరవచ్చును. తెల్గున యొక్క విభక్తి లోపించిన షష్ఠీ రూపముపై ద్వితీయా విభక్తి నిల్చును. తెల్గున ద్వితీయా ప్రత్యయములు 'ను-ని' అనునవి. ఇవర్ణాంత రూపములపై 'ని' అనునదియుఁ దక్కిన వానిపై 'ను' అనునదియు నిల్చును. ఉదా:—ఇంటిని-బిడ్డను. మొ. తెల్గునందలి విభక్తి పూర్వాగమములగు 'ని-న' లును (రాముని చేన్-రామునకున్) వీని కభిన్నము లనఁదగును. 'ని-న' అను సప్తమీ ప్రత్యయములును (బండిని-వనమున) తెల్గు ద్వితీయా ప్రత్యయములగు, 'ని-ను' అను వానికంటె భిన్నములు. ఈ తెల్గు ద్వితీయా ప్రత్యయములును (ను-ని) తుళుభాషలోని 'ను-న్' అనెడి ద్వితీయా ప్రత్యయములును గన్నడమందలి 'అమ్-అన్ను' అను వానినుండి యేర్పడినవె యననగును. తెల్గులోని యుష్మ దస్మ చ్ఛబ్దములందును ద్వితీయా ప్రత్యయములు వాని విభక్తి పూర్వాగమములకన్న భిన్నములె. ఉదా:— నా శబ్దము (నేను)-ద్వి-నన్+న్ను=(లేదా) ను=నన్ను=నను. నీ శబ్దము-నీవు.

ద్వి-నిన్+న్ను-(లేదా)-ను=నిన్ను-నిను. ఇవి ద్వితీయైక వచనరూపములు. 'మమ్ము మము. మిమ్ము-మిము'. ఇవి ద్వితీయా బహువచన రూపములు." (కాల్డు. ౨౭౩-౨౭౪ పుటలు).

విమర్శము:—'అన్ను' అనుదాని రూపమును సాధించుటలో 'అమ్' అను కన్నడ ద్వితీయా ప్రత్యయ మకారము 'న'కారముగ మారుటకు దొరగారు 'కన్న-అవమ్=తమి-అవన్' అను జంటను దృష్టాంతీకరించుట సరికాదు. కన్నడమందలి 'అవం=(వాఁడు)' అనునది ప్రాచీనమగు 'అవన్' శబ్దమువలెనె నాన్తమనియె నిరూపింపవచ్చును. కన్నడమున 'మ-న' లు రెండును నిత్యముగా బిందువు లగును. అట్టి బిందువున కచ్చు పరమగు నపుడు మకార జన్యమగు బిందువుచో మకారమును, నకారజన్యమగు బిందువుచోట నకారమును నిల్చుట నియతముగాఁ గన్పట్టుచున్నది. ప్రక్రియా లాఘవాపేక్షులును రూపసాధన మాత్ర ప్రవణులును నగు కర్ణాట వైయాకరణులు మహద్వాచక ప్రథమాంతములు సైతము కన్నడ ప్రథమా 'మ' ప్రత్యయాంతములుగనే భావించినను బ్రాచీన తమిళమందువలెనె ప్రాచీన కర్ణాటమందును బుంలింగ వాచక ప్రథమాంతములు 'అవన్-దేవన్' మున్నగు రీతిని నకారాంతములె యై యుండెడివనియు నట్టి నకారమె యచట ననుస్వారమయ్యె ననియు నూహింపనగును. స్త్రీ వాచకములు తమిళమందువలెనె ళాంతములై (అవళ్=ఆమె) యుండుటయు నిందులకు నిదర్శము కావచ్చును. కావుననే యజాది ద్వితీయా ప్రత్యయ పరకత్వమున నచటి యనుస్వారమునకు నకార విధానము వైయాకరణులకుఁ దప్పదయ్యెను.

"స్వరాదౌ నాగమః పుంసి" (కర్ణా. భూ. ౫౦ సూ.) = అకారాంత పుంలింగముల కజాది విభక్తిపరమగుచుండఁగా 'న' కారాగమ మగును. ఉదా:— దేవ+అమ్=దేవ+న్+అమ్=దేవనం=(దేవుని) అవనం=(వానిని=వాడిని).

"మనయో ర్బిన్దుః" (కర్ణా. భూ. ౧౧౨ సూ.) = అవసానమున నకార మకారములకు బిందువగును. ఉదా:—దేవనమ్=దేవనం-మొ. దీనిచొప్పున నాంతములయినను మాంతములయినను గన్నడమున ననుస్వారాంతములె నియతముగ నగుననఁదగును.

పై సందర్భమునుబట్టి కేవల ప్రాచీనకాలమునఁ దమిళమందువలెనె కన్నడమందును పుంలింగ ప్రథమైకవచనాంతములు నాంతములయియే యుండెడివనియుఁ గాలక్రమమున నట్టి పదాంత నకారములచోట సయితము ప్రక్రియా లాఘవాపేక్షులగు కర్ణాట వైయాకరణులు ప్రథమైకవచనము మకారమనియె సూత్రించిరనియు నిశ్చయింపనగును. కన్నడమందు నపుంసక

శబ్దములందును ద్వితీయైకవచన స్వరపరకత్వమున ననేకస్థలములందు నకారస్థితి పాక్షికముగఁ జూపట్టుచున్నది.

«విభాషయా మిమ్నా» (కర్ణా. భూ. ౫౭౨ సూ.)=అకారాంత నపుంసక శబ్దములకు ద్వితీయైకవచన స్వర పరకత్వమున 'న' కార 'మ' కారములు వైకల్పికముగ నిల్చును. ఉదా:—పొలం+అం = పొలనం = పొలమం = (పొలమును). నెలం+అం = నెలనం = నెలమం = (నేలను). ప్రాచీనతమకాలములలోఁ బ్రథమైక వచనాంతములెల్ల నాంతములయి యుండెడివేమో? (చూడుము తొల్కా.. ౮-౨ సూ. ౨౧ XIV విష).

పయిసందర్భమునుబట్టి మకారము నకారముగాఁ బరిణమించుననుటకు «కన్న-అవం=తమి-అవన్» అని యుదాహరించుట సరికాదని విశదమగుచున్నది గదా. కాని పటగన్నడ ప్రాచీన ద్వితీయ యగు 'అమ్' ప్రత్యయము కాలక్రమమున 'అన్ను' అనునదిగా మాఱుననుటలో నాకభిప్రాయభేదము లేదు. 'న=మ' ల యట్టి పరిణామము సహజమె.

హొసగన్నడమున 'అన్న-న్న-న' అను ద్వితీయా ప్రత్యయములుగాని "నన్న=(నన్ను) నిన్న = (నిన్ను)" అనెడి యస్మ ద్యుష్మదర్థక ద్వితీయైకవచన రూపములుగాని కలవనుట విశ్వసనీయము కాదు. హొసగన్నడ వ్యాకరణములో నట్టిరూపము లెందును జూపఁబడలేదు (చూడుము ౮-3 II విష). "'ఉ' ప్రథమా ప్రత్యయము......'అన్ను' ద్వితీయా ప్రత్యయము......" (శబ్దాదర్శ. హొసగన్నడ వ్యాకరణము ౮౦ సూ). నీ శబ్దము:—«నీను (ప్ర. ఏ). నీవు (బహు). నిన్ననున్న (ద్వి. ఏ). నిమ్మన్ను (ద్వి. బహు). నా శబ్దము:—నాను-(ప్ర. ఏ). నావు (ప్ర. బ). నన్ను -(ద్వి. ఏ)-నమ్మన్ను (ద్వి. బ)» (శబ్దాదర్శ-హొసగన్నడ వ్యాకరణము ౬౮ సూ). ఒకవేళ దొరగా రెచ్చటనేని యే యపభ్రష్ట రూపమునేని వినియున్నను నట్టి యాధునిక గ్రామ్యరూపములు చరిత్ర కందని కాలమందలి భాషల సంబంధమును బరిశీలించు ప్రకృత శాస్త్రమునఁ బ్రదర్శింపఁ దగినవి కావు.

ఇట్లు తెలుగుభాషలోని ప్రాచీన ద్వితీయా ప్రత్యయము 'ను' అనునది యాధునికమగు హొసగన్నడపు ద్వితీయా ప్రత్యయమగు 'అన్ను' అనుదాని నుండి యేర్పడెననుట యసంభవము. పటగన్నడ ద్వితీయా ప్రత్యయమగు 'అమ్' అనునదియుఁ దెలుగులోని 'ని=ను' అనునవియు నభిన్నములనుటలోను, నయ్యవి సంస్కృత ద్వితీయైకవచన ప్రత్యయమగు 'అమ్' అనుదానినుండి కాని దానికి మూలమగు వేఱొక భాషలోని ద్వితీయా ప్రత్యయమునుండి కాని యేర్పడి యుండు ననుటలోను విప్రతిపత్తి లేదు. కర్ణాటభాషలోని

'అమ్' ప్రత్యయము ద్వితీయైకవచన బహువచన సాధారణము. సంస్కృతము లోని 'అమ్' ప్రత్యయము ద్వితీయైకవచన మాత్రము.

౮3. IV విష:—"ద్రావిడభాషలలోని 'అమ్-అన్-అన్ను-ను-న' అను ద్వితీయా ప్రత్యయములను భాషాంతర ప్రత్యయములతో సరిపోల్పవచ్చును.

| | | |
|---|---|---|
| ఇండో యూరపియనుభాషలు | గుజరాతి ద్వితీయ-చతుర్థియు ... | నె. |
| | పంజాబీ ... ... ... | ను-నుమ్. |
| | బ్రహుయి-(ద్రావిడభాష?) ... | నె-ఎ. |
| సిథియను భాషలు | టర్కిషు-మంగోలియన్ భాషలు... | నీ-ఈ. |
| | ఫిన్నిషు ... ... ... | ఎన్-అన్. |

(ఈ ఫిన్నిషు భాషలలోఁ బ్రథమా ద్వితీయలకు బహువచనమున భేదము లేదు) సిథియను భాషలలోని బెహిస్తను ఫలకములలో లభించిన శాసనములందలి సర్వనామరూపములు ద్రావిడభాషా రూపములకుఁ జాల సన్నిహితములుగా నున్నవి. ఉదా:—నీ=(నీవు) నిన్=(నిన్ను). ఇది తుళు భాషలోని 'నినన్' అనురూపమునకు మిక్కిలి సన్నిహితముగా నున్నది." (కాల్డు. ౨౭౮ పుట).

"ఇండో యూరపియను భాషలలో సయితము ద్వితీయావిభక్తి మకార నకార రూపములతో నున్నది. సంస్కృత-లాటిను-గాతికు భాషలలో మకారమును, గ్రీకుభాషలో 'న' కారమును ద్వితీయావిభక్తిలోఁ దఱచుగా నున్నవి. కాని సిథియను భాషలలో సయితము ద్వితీయలో నకార ముండుటచేత ద్రావిడ ద్వితీయా ప్రత్యయ మిండో యూరపియను భాషలనుండి వచ్చిన దనుటకు వీలు లేదు. ద్రావిడభాషలకును నిండో యూరపియను భాషలకును వేఱొకభాష నుండి వచ్చెననుట యుక్తము" (కాల్డు. ౨౭౮-౨౭౯ పుటలు).

వెనుక వ్రాసిన విషయములనే (౮3 I విష. చూడు) దొరగారు పునరుక్తిగా మరల ననువదించుచున్నారు.

"ద్రావిడ ద్వితీయా ప్రత్యయమగు 'అమ్' అనునదియు నపుంసక నామోత్పాదకమగు 'అమ్' ప్రత్యయమును నభిన్నము లగుటయు, నివి 'అ' (అమ్) అను త్రిక సర్వనామమునుండి యేర్పడుటయు నిశ్చయమైన యెడల నీ ద్రావిడ ద్వితీయా ప్రత్యయము భాషాంతర ద్వితీయా ప్రత్యయములను బోలియుండుటకును, నిండో యూరపియను భాషలలోని నపుంసక ప్రథమా ద్వితీయా ప్రత్యయైక్యమునకును గారణములు కుదురుపడును. నపుంసకలింగ

నామ వ్యుత్పాదక మగుటచేత నియ్యది యసామర్థ్య సూచకమగు కర్త్రార్థక ద్వితీయా ప్రత్యయముగ వ్యవహరింపఁబడుచున్నది." (కాల్డు. ౨౭౫ పుట).

"ఇంక నీ 'అమ్' అను ద్వితీయా ప్రత్యయమునకును, 'ఐ-ఎ-అ' అను తమిళ మలయాళ ద్వితీయా ప్రత్యయమునకును గల సంబంధము నాలోచింప వలసియున్నది. 'నిన్నమ్'=(నిన్ను) అను ప్రాచీన కన్నడ ద్వితీయా రూపము లోని 'మ' కారము లోపించుటచేత నవీన కన్నడమందలి 'నిన్న' అను రూప మేర్పడినది. నామవాచకములలో సైతము 'అమ్' ప్రత్యయ మకారము లోపించుట గలదు. పఱగన్నడ-మరమ్, నవీన కన్నడ-మర=(చెట్టు) హాౕన గన్నడ ప్రథమ. మరవు. పైరీతి నేర్పడిన 'నిన్న' అనుదానిలోని తుది 'అ' కారము మాత్రము (నిన్+అ) ద్వితీయా ప్రత్యయమని యంగీకరింపనగును. ఇట్లంగీకరించినపు డింక 'ఐ' ప్రత్యయ మిట్టి 'అ' ప్రత్యయము నుండి పుట్టినదని చూపుట మిక్కిలి సుకరము. 'అ' కారము తఱుచుగ 'ఐ' కార మగుచుండును. ప్రాచీన తమి-ఇల్ల=నవీన తమి-ఇల్లై=(లేదు)." (కాల్డు. ౨౭౫ పుట).

విమర్శము:—'నిన్న=(నిన్ను) నన్న=(నన్ను)' అను 'అ' ప్రత్యయాంత ద్వితీయా రూపములు హాౕనగన్నడ వ్యాకరణములందు సైతము గ్రహింపఁ బడలేదనియు నొకవేళ నెచ్చటనేని యట్టి యపభ్రష్ట శబ్దములున్నను నాధునిక ములగు నట్టి వానిలోని యపభ్రష్టమైన 'అ' ప్రత్యయము, చరిత్రకందని కాలమునాఁటి 'ఐ' ప్రత్యయమునకు మూలమనుట కేవలము నసంభవమనియు నీవఱకే వ్రాసియున్నాను (చూడు ౭-౩ III విష). విభక్తి వ్యత్యాస విధుల చొప్పున ద్వితీయార్థమున వచ్చు షష్ఠి 'అ' ప్రత్యయము ద్వితీయ కానేరదు. 'ఐ=అయ్' ప్రత్యయమునుండి 'అ' ప్రత్యయము పుట్టినదనుట యుక్తముగాని (చూడు ౧౫ II విష.) విపరీత వ్యుత్పత్తి కేవలము నసంభవము. 'ఇల్ల' అనునది ప్రాచీన తమిళ శబ్దమనియు 'ఇల్లై' అనునది నవీన తమిళ శబ్దమనియు వ్రాసి దాని నాధారముగాఁ జేసికొని పైరీతిగల యాకాశ సౌధమును నిర్మించుట కేవలము సాహసము. 'ఇల్లై' అనునది తొల్కాప్పియమునఁ జేర్కొనఁబడినది. అది నవ్యమనుట కేవలము నవిమర్శిత మూలకము.

"ఇల్లెన్ కిళవి......" (తొల్కా. 323 సూ.)=వ్యస్త సంధిలోఁ బరుష పరకత్వమున 'లేమి' అను నర్థమునందు 'ఇల్' శబ్దమునకు 'ఐ-ఆ' అను నాగమములు వచ్చుటయుఁ బరస్థ పరుషము వైకల్పికముగ ద్విరుక్తమగుటయుఁ గలదు. ఉదా:—ఇల్+కల్=ఇల్లై క్కల్=(లేదుఱాయి) నన్నూలు 'ఇల్లై' శబ్దమునే యుపదేశించెను. ఉదా:—ఇల్లై నాణ్=(దారము లేదు).

పయి సందర్భమునుబట్టి 'అమ్' అను కన్నడ ప్రత్యయమునుండి పుట్టిన యాధునిక మనఁదగు 'అ' ప్రత్యయమునుండి 'ఐ' అను ప్రాచీనతమ తమిఁటి ప్రత్యయము పుట్టినదను దొరగారి వ్రాఁత కేవలము నవిమర్శ మూలకమని విశదమగుచున్నది.

పయిరీతి నపమార్గమునఁ బోనేల? 'అమ్' ప్రత్యయమువలెనె (చూడు ౫౩ I విష.) 'ఐ' ప్రత్యయమును నపుంసకలింగ నామోత్పాదకమె యనియు నట్లగుట నయ్యదియు జడత్వము ననఁగాఁ జులుకుఁదనము లేమిని దెల్పునదె యనియు నట్టి నైష్కర్మ్య ద్యోతకమగు 'ఐ' ప్రత్యయము కర్మార్థకమగుట యర్థమై యనియు డా. కాల్డువెల్లుగారేల వ్రాయరైరో తెలియకున్నది. 'అమ్' ప్రత్యయ సందర్భమునందు వలెనె పుం స్త్రీ వాచకముల పయిని దద్వాచ్యములం దుండు చులుకుదనము నాపుటకయి (కర్మత్వసిద్ధికై) (Activity) 'ఐ' ప్రత్యయము నియత ముగాఁ జేర్పఁబడుచున్నదనఁదగును. ఉదా:—"తలై=(తల). మలై=(మల). నడై=(నడ). వలై=(వల)" అను రీతి ననేకములగు నైదంత జడవాచకములు తమిఁటమునఁ గలవు. ఆ జడవాచకములందలి చులుకుఁదనము నాపుటకు 'ఐ' ప్రత్యయమును నిల్పుటకు:—అవనై=(వానిని). అవళై=(ఆమెను) అవరై= (వారిని). ఇట్టి చోటులందలి యలవాటుచేత 'అదనై' మున్నగు చోటులందును 'ఐ' ప్రత్యయము నిల్చుచున్నదనియుఁ జెప్పవచ్చును. అట్టియెడల జడత్వ బోధకమె 'ఐ' ప్రత్యయమనుట లెస్స. 'ఐ' ప్రత్యయ వికృతియగు 'ఎ' ప్రత్య యము తమిఁటాపభ్రంశమగు మలయాళమునఁ గర్మార్థక ద్వితీయా ప్రత్యయ మగుటలో విరోధము లేదు.

౫౮. I విష:—"కరణార్థక తృతీయావిభక్తి:—తృతీయావిభక్తి ప్రత్యయ ములు ద్రావిడభాషలలోఁ బరస్పరమును విజాతీయములై యున్నవి. చేయి శబ్దపు తృతీయా రూపము 'చేత' అనునది. తెల్గునందలి తృతీయావిభక్తి సప్తమికి భిన్నము కాదు. ఉదా:—రాయి-రాతి-రాత=రాతియందు, రాతిచేత. ఇల్లు- ఇంటి-ఇంట=ఇంటియందు—ఇంటిచేత. తెల్గులోని తృతీయావిభక్తి 'యొక్క' లోపించిన షష్ఠీ రూపమునకుఁ బరముగఁ జేర్పఁబడును. ఉదా:—నిప్పుయొక్క- నిప్పుచేత. ఇట్టి యెడల 'యొక్క' విభక్తి లోపించిన షష్ఠీ రూపము మాత్రమె, ప్రత్యయాంతరమును జేర్పకయె కరణార్థమును నపాదానార్థమును నధికరణార్థ మును నిచ్చును. నపుంసకలింగములకు 'న' అనునది సైతముపై మూఁడర్థముల లోను జేర్పఁబడును" (కాల్డు. ౨౭౬ పుట).

విమర్శము:—దొరగారు "కరణార్థక తృతీయ 'చేత' అనునదియు సహార్థక తృతీయ 'తోడ' అనునదియు నని విభజింతురు గాని ద్రావిడభాషలలో నట్టి

విభాగము నిలువనేరదు. (ముస్ముం దీ విషయము విమర్శితము కాఁగలదు) (చూడు ౮౪ II విష.) తెల్గునఁ గరణార్థమునందును 'తోడ' వర్ణకము వాడఁబడుట గలదు. ఉదా:—"ఉ......ఈ। బాహుబలంబుతోఁ గడఁగి పార్థుని దాఁకెడుబుద్ధి......" (విరా. ౫ ఆ. ౨౧౮). ఇందలి 'తో' అనుదానికి సహార్థభాసము లేదుగదా (చూడు. వ్యా. సం. ౨౪౦ I విష). రాయి శబ్దము ఐకార ఘటితము. 'జాతన్=జాతిచేతన్' అను తృతీయ వాడుక గలదు గాని 'ఇంటన్' అనుదానికిఁ దృతీయార్థము కానరాదు. యొక్క విభక్తి లోపించిన షష్ఠీ రూపమునకు విభక్తులు చేర్చుట యను దొరగారి సూత్రము శాస్త్ర సంప్రదాయ విరుద్ధము. యొక్క విభక్తి లోపించిన షష్ఠీ రూపము కరణాపాదా నాధికరణార్థముల నిచ్చుననుట యాంధ్ర మర్యాదా విరుద్ధ విషయము. అట్టి రూపము శేష షష్ఠ్యర్థమునె (యొక్క) తెల్పును. ఉదా:—సీతయొక్క మగఁడు=సీత మగఁడు, మొ. ఇట్లే 'వనముయొక్క సొగసు' అనుచోటి యొక్క విభక్తి లోపించిన 'వనము' అను రూపము కరణాపాదా నాధికరణార్థముల నిచ్చుననుట కేవలము నసంభవము. 'వనము పుట్టెను' అనుదానికి 'వనమందుఁ బుట్టెను' అను నర్థము గల్గునా? 'గురువు మేలు కల్గెను' అనునది 'గురువుచేత మేలుగల్గెను' అను నర్థము నియ్యఁగల్గునా?

'న' వర్ణకమున కపాదానార్థము గలదనుట పొరపాటు. ఉదా:—'వనమునన్' అనుదానికి 'వనము చేతన్-వనము నందున్' అను కరణాధికరణార్థములు గలవు గాని 'వనము వలనన్' అను నపాదానార్థ మెంతమాత్రమును లేదు.

౮౪. II విష:—"ప్రాచీన కర్ణాట తృతీయా ప్రత్యయమగు 'ఇమ్' అనునది తమిళ పంచమీ విభక్తియగు 'ఇన్' ప్రత్యయమునకు భిన్నముకాదు. అఱవభాషలోని యీ 'ఇన్' ప్రత్యయము మొదట సప్తమీ ప్రత్యయముగా (ఇల్?) నుండెడిది. తృతీయా పంచములకుఁ గల సన్నిహిత సంబంధమునుబట్టి వానినొక దానిచో వేఱొకదానిని గవులు వాడుదురు. గ్రీకుభాషలో నిట్లె తృతీయ నశింపఁగా దానిచోటఁ బంచమి ప్రయుక్తమగుచున్నది. ఇంగ్లీషులో సైతము పూర్వము సప్తమ్యర్థమును దెల్పు 'by' శబ్ద మిపుడు తృతీయా పంచములచోట వాడఁబడుచున్నది." (కాల్డు. ౨౭౬ పుట).

విమర్శము:—డా. కాల్డువెల్లుగారు 'ఇల్' శబ్దము ప్రదేశ విశేష వాచి యనియు (చూడు ౮౨ III విష.) నకారణమున నది సప్తమీ ప్రత్యయ మనియుఁ దమిళ పంచమియగు 'ఇన్' ప్రత్యయమును గన్నడ తృతీయ యగు 'ఇమ్' ప్రత్యయమును దానిని సంబంధించినవే యనియుఁ జెప్పుట గొంత విశ్వాస

నీయముగనే కన్పట్టుచున్నను 'ఇల్' శబ్దము గృహపర్యాయము. కేవలస్థలవాచి కామింజేసి కావలయుఁ బ్రాచీన తమిళ సప్తమీ ప్రత్యయము కాదు. ఇది మలయాళ సప్తమీ ప్రత్యయము (చూడు ౮౭ VI విమ.) అర్వాచీనమగు నన్నూలులో నున్నను దొల్కాప్పియమున నిట్టివి సప్తమీ ప్రత్యయములుగాఁ జూపఁబడలేదు. (చూడు ౮౮ I విమ) (౪౮ II విమ). అద్దానినుండి యేర్పడినదని డా. కాల్డువెల్లుగారు తలంచుచున్న 'ఇన్' ప్రత్యయమునకు సప్తమ్యర్థమునఁ బ్రయోగమును లేదు. తెల్గునందును 'చేతన్' అనుచోటి, 'అన్' ప్రత్యయమునకుఁ దృతీయా సప్తమ్యర్థములును 'వలనన్' అనుచోటి 'అన్' ప్రత్యయమునకుఁ బంచమీ సప్తమ్యర్థములును వెలయుచున్నవి. కాని వీనిని బట్టి సప్తమ్యర్థకములెల్లఁ దృతీయా పంచమ్యర్థకములు కావలయునని తలంపరాదు.

'ఒడు' అను తమిళ తృతీయా ప్రత్యయము సహార్థక మాత్రమె యనియు దానికిఁ గర్తృకరణార్థములు లేవనియు దొరగారు తలంచుట (చూడు ౪౮ I విమ.) యుక్తము గాదు. దానికిఁ గర్తృ కరణార్థములును గలవు. అట్లగుటంజేసియే తొల్కాప్పియమున నయ్యది మాత్రమె తృతీయా ప్రత్యయముగఁ జేర్కొనఁబడెను. దీనికి సహార్థమునఁ బంచమీతో సాంకర్యము లేమింజేసి యిదియె తృతీయా ప్రత్యయముగఁ జేర్కొనఁబడెను.

"మూన్ఱాకువదే......" (తొల్కా. ౫౫౭ సూ.)=తృతీయా విభక్తి ప్రత్యయము 'ఒడు' అనునది. ఆ తృతీయ కీ క్రిందిరీతిని గర్తృ కరణాద్యర్థములు గలవు.

"మూన్ఱనుమ్......" (తొల్కా. ౫౭౬ సూ.) = 'ఆగు = వృద్ధి నొందుట' అను క్రియను వాడునపుడు హేత్వర్థమునఁ దృతీయయుఁ బంచమియు నగును. ఉదా:-తృతీ-వాణిగత్తోడు ఆయినాన్=వాణిజ్యముచేత వృద్ధినొందెను. పంచ-వాణిగత్తిన్ ఆయినాన్=వాణిజ్యమువలన వృద్ధినొందెను. (ఆగు=వృద్ధియగు. ఆక్కమ్=సంపద. చూడు తొల్కా. ౫౦౩-౫౦౪-౫౦౫ సూ.) పై యుదాహృతిలోని 'ఒడు' ప్రత్యయము హేత్వర్థకమె యనఁదగును గాని సహార్థక మనరాదుగదా. హేతువె ముఖ్యమగునపు డది కరణ మనవగును. "సాధకతమం కరణమ్. (౧-౪-౪౨)=క్రియాసిద్ధౌ ప్రకృష్టోపకారకం కరణసంజ్ఞం స్యాత్." (సి. కౌ. ౫౬౦ సూ).

"అదనొడు మయఙ్గల్=(దానితోఁ గూడుట). ఎళ్ళొడు విరవియ అరిసి=(తిలలతోఁగూడిన బియ్యము) పై వాక్యములోని 'ఒడు' అనునది సహార్థకము.

తారతమ్యము దెల్పు నర్థమున ‘ఇన్’ ప్రత్యయమునకుఁ దృతీయా సాంకర్యము లేమింజేసి యయ్యది పంచమీ ప్రత్యయముగఁ దొల్కాప్పియమునఁ జేర్కొనఁబడెను.

“ఇన్నాకువదె......” (తొల్కా. ౫౬౧ సూ.)=‘ఇన్’ అనునది పంచమీ విభక్తి. ‘దీనికంటె నిది యిట్టిది’ అని దీని యర్థము. ‘వణ్ణమ్...’ (తొల్కా. ౫౬౨ సూ.)=వన్నె-పరిమాణము రుచి మున్నగు నర్థములలోఁ దారతమ్యము దీనిచేతఁ దెల్పఁబడును. ఉదా:—కాక్కైయిన్ కరిదు కళమ్ పఴమ్=(‘కళమ్’ అను పండు కాకికంటె నల్లనిది).

దీనికి హేత్వాద్యర్థములును గలవు.

“ఇరణ్డన్ మరుఙ్గిన్......” (తొల్కా. ౫౭౭ సూ.)=‘నోక్కు’= (చూచు-మనసున నాలోచించు) అను ధాతువును వాడునపుడు హేత్వర్థమున ద్వితీయా తృతీయా పంచములగును. ఉదా:—ద్వి-వానై నోక్కి వాழுమ్ ఉలకు=(వానను జూచి లోకము జీవించును) (ఉలకు=లోకము). తృ. వానాల్ నోక్కి వాழுమ్ ఉలకు=(వానాల్ నోక్కి=వానచేతఁ గల్గు మేళ్ళను దలంచి) పం-వానిన్ నోక్కి వాழுమ్ ఉలకు=(వానిన్ నోక్కి=వానవలనఁ గల్గు మేళ్ళను దలంచి). ఇందు ‘వానాల్ వానిన్’ అనుచోటులందలి ‘ఆల్-ఇన్’ అనునవి హేత్వర్థకములు. ‘ఆల్’ నన్నూలునఁ గలదు. ‘ఆన్’ తొల్కాప్పియమున నున్నది. (౫౮౧ సూ).

‘ఆన్’ అను తృతీయా ప్రత్యయమునకుఁ గర్త్రర్థకత్వమును హేత్వర్థమును గలవు. కర్తృ-తమి-తేర్ తచ్చనాఱ్ చెయ్యప్పట్టదు=(౫౫౭ తొల్కా. సూ.) (రథము తక్షకునిచే ననఁగా వడ్రంగిచేతఁ జేయఁబడినది.) (ఇచట రథకర్త వడ్రంగి). నాయాఱ్ కడిక్కప్పట్టాన్=(తొల్కా. ౫౫౭ సూ.) (కుక్కచేతఁ గఱవఁబడెను). హేతు-వానాల్ నోక్కి వాழுం ఉలకు=(వానవలనఁ గల్గు మేళ్ళ నెంచి లోకము జీవించును). (తొల్కా. ౫౭౭ సూ).

‘ఆన్’=(అక్కడ) అనునది ప్రదేశ విశేషార్థకము గాన నది సప్తమీ ప్రత్యయము కావలసినది. కాని యిది హేత్వర్థక తృతీయగాఁ వాడఁబడు చున్నది. ప్రదేశ విశేషార్థకములు సప్తమ్యర్థమున వాడఁబడును. (చూడు తొల్కా. ౫౬౬ సూ).

“కణ్ -(సప్తమి)”. “కాల్=(స్థలము) పుఱమ్ (బహిః ప్రదేశ) అకమ్-ఉళ్ (లోపలి ప్రదేశము) ఉழై (ప్రక్క ప్రదేశము) కీழ் (క్రింది ప్రదేశము) మేల్=(మీఁది ప్రదేశము)......” (తొల్కా. ౫౬౬ సూ.)=ఇవెల్లఁ బ్రదేశ విశేష వాచకశబ్దములు.

'ఆన్=(అక్కడ)' అనుదాని హేత్వర్థకతోదాహరణము:—

"మూన్ఱాకువదె......" (తొల్కా. ౫౫౭)......౧౧-ఏతు (హేతు) —ముయఱ్చియాన్ పిఱత్తలిన్ ఒలి నిలైయాదు=(ప్రయత్నముచేతఁ బుట్టుట చేత శబ్దము నిలుకడ కాదు). 'సేనావరైయర్' అనునతని వ్యాఖ్యలో 'ఆన్-ఇన్' అనునవి తృతీయా ప్రత్యయములని చెప్పఁబడెను. (తొల్కా. ౫౫౧ సూ. చూడు). ౫౫౭ సూత్రములోని ౧౦-ఇన్నాన్=(ఇట్టివాఁడు):—తమి-కాలాన్ ముడవన్ = (కాలిచేతఁ గుంటివాఁడు) ("అక్ష్ణా కాణః = కంటిచేత గ్రుడ్డివాఁడు" అను రీతిగలది).

పయిరీతిని బ్రయోగానుసారముగా దృతీయా పంచమీ సప్తములు — అందును దృతీయా పంచములు — ఎక్కుడు సన్నిహితములుగ వాడఁబడు చుండుట ద్రావిడ భాషా సంప్రదాయము. తెల్గులోని 'పొంటెన్' మున్నగు వానివలెనె తమిళమున 'ఆన్-ఆల్' మున్నగునవి విభక్త్యర్థాభిధాయక శబ్దములు. అట్లగుటనే యవి తొల్కాప్పియమున విభక్తి ప్రత్యయములుగాఁ జెప్పఁబడలేదు.

౨౮. III విమ:—"ప్రాచీన కర్ణాటములోని 'ఇందం-ఇందె' అను తృతీయా ప్రత్యయములును, హళగన్నడములోని 'ఇంద' అనునదియు 'అన్' ప్రత్యయ జన్యములె. తుదభాషలోని 'ఎద్ద్' అను తృతీయా ప్రత్యయము 'ఉండు' అను నర్థముగల 'ఎర్' ధాతువుయొక్క భూతార్థక రూపమగు 'ఎద్ద్' అను దానిని సంబంధించినదని పోపు దొరగారు చెప్పిరి. ఈయన 'ఎంద్' అను మఱొక తృతీయా ప్రత్యయమును తుదభాషలోఁ గలదనిరి. భాషాంత రములలో 'ఒంద్'=(ఒకటి) అనునది 'ఒద్ద్' అను రూపము నందినట్లె యీ 'ఎంద్' అనునదియె 'ఎద్ద్' అనునదిగా మాఱి యుండవచ్చును. ఈ 'ఎంద్' అను ప్రత్యయమును గన్నడములోని 'ఇంద' ప్రత్యయమును నభిన్నములె యన నగును. తుళుభాషలోని 'ద్దు' అను తృతీయా ప్రత్యయము తమిళములోని 'ఎడె-ఎడై'=(చోటు) అను శబ్దమునకు 'దు' అనునాగమము (కన్నడ-'ద') చేరుటచే నేర్పడెనని డా. గుండర్టుగారు చెప్పిరి గాని యీ 'ద్దు' ప్రత్యయము సయితము తుదభాషలోని 'ఎద్ద్' ప్రత్యయమువలెనె కన్నడమందలి 'ఇంద' ప్రత్యయముతో సంబంధించినదె యై యుండవచ్చును" (కాల్డు. ౨౭౬ పుట).

విమర్శము:—ప్రాచీన కన్నడములోని 'ఇందమ్=ఇందె' అను తృతీయా ప్రత్యయములును హళగన్నడములోని 'ఇంద' ప్రత్యయమును 'అన్' ప్రత్యయ జన్యములె యనెడి కాల్డువెల్లుగారి వాక్యమును బట్టి కన్నడమునందలి 'ఇమ్' ప్రత్యయమును దెల్గునందలి 'చేతన్-వలనన్-నన్' ప్రత్యయములును దమిళము లోని 'ఆన్=ఆల్' ప్రత్యయములకు భిన్నములు కావనెడి దొరగారి యాశ యము వ్యక్తమగు చున్నది. క. సమనిసి తోఱినుగు మ్మి, మిం। ద మిందె

యెం బివు తృతీయెయొళ్ మత్తె మెకా। ర మ దొందె మేణ్ తృతీయెగె।
సముచిత మాదేశ మఱిదు కోళ్గీ క్రమదిం॥ (శబ్ద. మణి. ౧౦౭ ప).

ఈ కన్నడ పద్యార్థ మీ క్రింది శబ్దానుశాసనమువలనఁ దెలియనగు.

"ఎశ్చాతో నపి" (కర్ణాట శబ్దా. ౨౭౩ సూ.) = "అకారాన్తాత్ శబ్దాత్ పరస్య ఇమః 'ఎశ్' ఆదేశో వా భవతి. చకారాత్-దెక్-దమ్‌కౌచ భవతో నపుంసక లిఙ్గ విషయే. ఉదా:—మరదె=మరదిందె=మరదిందం=మరదిం= (వృక్షముచేత)". అను శబ్దాను శాసనము చొప్పున 'ఎ' అనునదియుఁ బఱ గన్నడ తృతీయా ప్రత్యయమె యని విశదమగు చున్నది. కాఁగా-'ఎ'=ఇం= ఇందం=ఇందె' అనునవెల్ల 'అన్' ప్రత్యయ జన్యములనుట విశ్వసనీయముగా నుండలేదు. వీనియందు 'అన్' ప్రత్యయ గంధమేని చూపట్టదు. ఇందలి 'ఇందం' అనునది 'ఇన్+తం' అను శబ్దముల మేళనమెకాని యఖండశబ్దము కాదు. కాన నదియైన 'అన్' ప్రత్యయాంత మనుట కవకాశము లేదు. డా. కాల్డువెల్లుగారు లోఁగడఁ (చూడు ౮౮ II విష.) (కాల్డు. ౨౭౬ పుట) గన్నడమందలి 'ఇమ్' ప్రత్యయము సప్తమియై యుండెడి దనియు నయ్యది తమిఱమునందలి 'ఇన్' అను పంచమీ ప్రత్యయమున కభిన్నమనియు వచించి యిచట నయ్యది 'అన్' ప్రత్యయ జన్యమనుట సుసందర్భముగా లేదు. 'ఆన్'= (అక్కడ) అను ద్రావిడ శబ్దమునుండి 'అన్' ప్రత్యయ మేర్పడినట్లె (చూడు ౮౮ IV విష). 'ఈన్' (ఇక్కడ) అను ద్రావిడ శబ్దమునుండి 'ఇన్=ఇమ్' ప్రత్యయము లేర్పడెననియు 'ఇమ్' అను కన్నడ తృతీయ మీఁద 'తం' అను నాత్మార్థక శబ్దము నిల్చుటచేత 'ఇందం' అను కన్నడ తృతీయా ప్రత్యయ మేర్పడి యుండు ననియు నూహించుట యుక్తము.

"మన్నుమ్-చిన్నుమ్......" (తొల్కా. ౩౩౮ సూ.)="మన్-చిన్-ఆన్=(అక్కడ) ఈన్=(ఇక్కడ) పిన్-మున్ శబ్దములకు......" అను సూత్రమును బట్టి ప్రాచీన ద్రావిడ భాషలో 'ఆన్-ఈన్' శబ్దము లుండెడివని విశదమగుచున్నది. 'ఇన్' ప్రత్యయమునకుఁ దమిఱమందువలెనె కన్నడ మందలి 'ఇమ్' ప్రత్యయమునకును దృతీయా పంచములందు వాడుక గలదు.

"మనదిం బేగం=(మనసు కంటెను వేగముగ)" (కర్ణా. భూ. ౫౧ సూ). 'మనువినిం మిగిల్'=(మనువుకంటె నతిశయించు) (కర్ణా. భూ. ౫౧ సూ).

"ఆసాం వ్యత్యయో బహుళమ్" (కర్ణా. భూ. ౮౮ సూ.) ఈ విభక్తులకు విపర్యాసమును గల్గును. ఉదా:—......పంచమ్యర్థక తృతీయ—ఒఱె యిందె ఉర్చిదం=ఒఱనుండి (కత్తిని) ఆకర్షించెను. సెఱెయిం బర్దుంకిదం=చెఱనుండి బ్రదికెను. మనెయిం పొఱమట్టం=గృహమునుండి పోయెను.

౮౮. IV విష:—“అఱవ మలయాళములలోని ‘ఆల్’ అనునది తృతీయా ప్రత్యయము, గ్రాంథికాఱవములో (హైటామిల్) ‘ఆన్’ అనురూపముతో నున్నది. ‘ఆల్’ అనునది గోందుభాషలోఁ దృతీయా పంచమీ ప్రత్యయమై యున్నది. అఱవదేశమునకును గోందుభాష వాడెడిదేశమునకును నడుమ నుండు తెల్గుదేశమున నవి భిన్నములుగ నగపడుచున్నవి. ఈ ‘ఆల్’ ప్రత్యయము తమిటమందలి ‘కాల్’=(తెల్గు-కాలువ. కన్న-కాలివె) అనుపదము నుండి యుత్పన్నమై యుండును. అఱవభాషలోని ‘కాల్’ శబ్దమునకు ‘కాలు-కాలువ’ అను రెండర్థములున్నను ‘ఆల్’ ప్రత్యయము ‘కాలువ’ అను నర్థము గల ‘కాల్’ శబ్దమునుండి యుత్పన్నమయ్యె ననఁదగును. ‘కళ్ =కల్=గల్’ ప్రత్యయమున ‘క’ కారలోపము గల్గి ‘లు’ అను తెల్గు తుళు ప్రత్యయ మేర్పడి నట్లును, ‘తమి-అవర్గళ్=అవాళ్’ అనునది యేర్పడినట్లును, “కన్న-కర్మకారను=కమ్మారను’ అనునది యేర్పడినట్లును ‘కాల్’ శబ్దమునుండి (కకారలోపమున) ‘ఆల్’ ప్రత్యయ మేర్పడియుండునని యూహింపఁదగును.”

“డా. గుండర్టుగారీ క్రిందిరీతిని వివరించిరి:—“ఆగుధాతు భావార్థకమగు ‘ఆగల్’=(అగుట) అనుదానినుండి ‘ఆల్=ఆన్’ ప్రత్యయ మేర్పడి యుండును. ఆగుధాతు ప్రాచీనరూపము ‘ఆ’ అనునదిగాన దాని భావార్థకము ‘ఆగల్ = ఆల్’ = (దానితోఁ గలిసియుండుట) అని యేర్పడును. తుళు భాషలోని ‘లా’ అను సముచ్చయార్థకము దీనికి భిన్నముకాదు. తమిటమలయాళములలోని స్థలవాచియగు ‘కాల్’ అనునది సప్తమీ ప్రత్యయమై యున్నది. మలయాళమున నిది ‘కల్’ అనురూపముతో సైతము వెలయు చున్నది. కాన ‘ఆల్’ ప్రత్యయమునకును ‘కాల్’ ప్రత్యయమునకును సంబంధము లేదు.” అను గుండర్టుగారి యాశయము సరికాదు. ‘ఆల్’ ప్రత్యయము ‘లా’ అను సముచ్చయార్థక శబ్దమున కభిన్నమగునపు డది మొదట ‘సహార్థకము’ కావలసి యుండును. కరణార్థకమగు ‘ఆల్’ ప్రత్యయమున కట్టి సహార్థకత్వము లేదుగదా. తమిటమలయాళములలోని చేదాద్యర్థకమగు ‘ఆల్’ శబ్దమునకు సహార్థకత్వముండిన నుండవచ్చును గాని కరణార్థకత్వ ముండనేరదు గదా. ఇంక గుండర్టుగారన్నట్లుగ ‘ఆగల్’ శబ్దపూర్వరూపమగు ‘ఆల్’ అనునది తృతీయా ప్రత్యయమగునపు డద్దానికి ‘ఆ కారణముచేత-దానినుండి’ అను నర్థము లుండుట సహజముకాని దానికిఁ గరణార్థకత్వము లభింపనేరదు.”

“‘ఇక్కడ’ అనునర్థముగల ‘ఇల్’ శబ్దము తమిట సప్తమీ ప్రత్యయమై నట్లె ‘అక్కడ’ అనునర్థముగల ‘అల్’ శబ్దములోని ‘అ’ కారము దీర్ఘమై తృతీయా ప్రత్యయముగ నేర్పడి యుండునన్నను ననవచ్చును. ప్రత్యయ

ములలోని హ్రస్వదీర్ఘ వ్యత్యాసము వింతకాదు. మలయాళమున సప్తమీ ప్రత్యయములు 'కాల్ = కల్' అని యుండలేదా?" (కాల్డు. ౨౭౬-౨౭౭ పుటలు).

విమర్శము:—'ఆల్ = ఆన్' అనునవి తొల్కాప్పియమునఁ దృతీయా ప్రత్యయములుగఁ జెప్పఁబడకున్నను నవి విభక్త్యర్థాభిధాయక శబ్దవిశేషములని గ్రహింపనగునని యీవఱకె వ్రాయఁబడెను. (చూడు ౬౮ II విష) 'ఆన్-ఆల్' అనునవి రెండును గ్రాంథికావయములోనివె. 'ఆల్ = ఆన్' అనునవి 'కాల్' శబ్దము నుండి యేర్పడెననుట సరికాదు. ఇవి రెండును 'ఆన్' (అక్కడ) అను తమిళ శబ్దమునుండి యేర్పడినవనుట యుక్తము. 'కాల్' శబ్దము ప్రదేశ విశేషవాచి యని తొల్కాప్పియమున స్పష్టముగాఁ జెప్పఁబడి యున్నది. (చూడు తొల్కా. ౫౬౬ సూ.) (చూడు ౬౮ II విష).

'కాలువ' అనునర్థము కరణార్థఘటకము కానేరదు. స్థలార్థముగల 'కాల్' శబ్దము సప్తమ్యర్థకముగాఁ నధికరణార్థకముగాఁ దొల్కాప్పియమునఁ జేర్కొనఁబడి యున్నది. (చూడు ౬౮ II విష. తొల్కా. ౫౬౬ సూ.) కావున 'ఆల్-ఆన్' అనునవి 'కాల్' ప్రత్యయ జన్యములు కావు. 'ఆగల్ = ఆల్" (అగుట) అనునది తృతీయా ప్రత్యయ మగునని గుండర్ట్గారెట్లు తలంచిరో? తెలియకున్నది. ఏదో యాకారమునఁ గొంత సరిపడినంత మాత్రమున జన్యజనక భావమును గల్పించుట యర్హము కాదు.

'అల్'=(అక్కడ). 'ఇల్' = (ఇక్కడ) అనునవి 'ఆన్-ఇన్' అనువానికి మూలరూపములనుట విశ్వసనీయముగ నుండునుగాని యట్టి యర్థముగల యీ శబ్దములు ప్రాచీన భాషలోఁ గలవనుటకు దొరగారు ప్రమాణము చూపవలసి యుండును. లేదు. కాన వెనుక నుదాహరించిన తొల్కాప్పియ సూత్రము (తొల్కా. ౩౩౮ సూ.) (౬౮ III విష. చూడు) చొప్పునఁ బ్రసిద్ధములయి యున్న 'ఆన్ - ఈన్' శబ్దములు వరుసగా 'ఆన్ - ఇన్' ప్రత్యయములకు మూల రూపములనుట యుక్తము. (చూడు ౬౮ III విష) 'ఆల్-ఆన్' ప్రత్యయములు కర్త్రర్థక తృతీయగా వాడఁబడును. అవి రెండును హేత్వర్థక తృతీయా స్థలములలోను బ్రయోగింపఁబడును (చూడు ౬౮ II విష).

తెలుఁగునందును 'అన్-న్' అనునవె తృతీయాసప్తమీ ప్రత్యయములు. వీనికపాదానాద్యర్థబోధయు నరుదుగఁ గలదు. స్పష్టప్రతిపత్తికై వినిగమకముగా నట్టి ప్రత్యయములలోని 'అన్' అనునది 'చేయి (హస్త)తోడ' (సహార్థ) శబ్దములమీఁద నిల్చి తృతీయా ప్రత్యయములగుచున్నది. 'వలను' (దెస) శబ్దము

మీఁద నిలిచి యపాదానార్థకమగుచుఁ బంచమీ ప్రత్యయ మగుచున్నది. 'అన్' అనుదానికిఁ బరముగా 'తు=దు' అనునది నిల్చుటచే సప్తమీ ప్రత్యయ మేర్పడుచున్నది. 'అన్' అనునది ప్రత్యయ వికృతిపద్ధతి చొప్పున 'నన్' అనునదిగాఁ బరిణమించి 'ఉ' దంత జడవాచకములపయి నిల్చుచు నేకవచన మునఁ బాక్షికముగాఁ గరణాధికరణార్థములను బోధించును. ఔపవిభక్తి కముల యేకవచనమున 'అన్' అనునదియే నిల్చి కరణాధికరణార్థములను బాక్షికముగా బోధించును. ఉదంత జడములయు నౌపవిభక్తికములయు నేకవచనముతప్పఁ దక్కిన స్థలములం దివి ద్వితీయాద్యంగము పై నిల్చి కరణాధి కరణార్థములను బాక్షికముగా బోధించును. అపాదానార్థము నరుదుగ బోధించును. ఉదా:—తృతీ-చేయి-చేతి-చేతన్. రామునిచేతన్ - రాముల చేతన్. రామునిచేన్-రాములచేన్ (చేతన్ విభక్తి సంక్షేపము 'చేన్' అనునది) రామునితోడన్-రాములతోడన్-రామునితోన్-రాములతోన్ (తోడన్ శబ్ద సంక్షేపము 'తోన్' అనునది) రామునివలనన్ (వలను=వలని+అన్) (దీనిపరి ణామమె 'వల్లన్' అనునది రామునివల్లన్.) రామునియందున్ - రాముల యందున్-రామునందున్-రాములందున్-వనమునన్ = (వనము చేతన్-వనము నందున్). తరువునన్-చిగురునన్ - త్రాడు-త్రాటి-త్రాటన్=(త్రాటిచేతన్- త్రాటియందున్)-గోడన్=(గోడచేతన్-గోడయందున్). గోడలన్=(గోడల చేతన్ - గోడలయందున్-) మొ. ఊరు-చోటు మేన్వాదుల విషయమున 'అన్' అనుదానికిఁ దృతీయార్థము వాడుకలో లేదు. ఉదా:—ఊరు - ఊరి - ఊరన్ - చోటు - చోటి - చోటన్ - మేను - మేని-మేనన్-మొ. మెయి-మై- పొంటె-మున్నగు విభక్త్యర్థాభిధాయక శబ్దములు తెల్గునందును గలవు. ఉదా:—బలము మెయిన్ = బలముమైన్ = (బలముచేత). బలముపొంటెన్ = (బలముకొఱకు) - బలముకోసము. ఇంటిమీఁదన్-ఇంటిలోపలన్-ఇంటిలోనన్- మొ. (చూడు వ్యా. సం. ౧౯౫ విష). 'కంటెన్-కన్నన్' మున్నగునవి పంచమీ విభక్తి సందర్భమున వివరింపఁబడును. చేసి - ఉండి - మున్నగు శబ్దముల యనుప్రయోగ విషయమును ముందు వివరింపఁబడును. (చూడు ౮౮ V విష).

౮౪. V విష:—"పయిని వివరించిన ద్రావిడ తృతీయా ప్రత్యయముల వంటివి యిండోయూరపియను భాషలలో లేవు. సిధియను భాషలలో వీనిని గొంతవఱకుఁ బోలునవి కొన్ని గలవు. ఉదా:—మాగ్యారు భాష. (తృతీయ- ఏక)-అల్-(బహు) ఎల్. ఫిన్నిషుభాష-(తృతీ-ఏక)-అల్ల. (బహు) ఎల్ల".

"ద్రావిడభాషలందును హిందీ బెంగాలీ మున్నగు నుత్తర హిందూస్థాన భాషలందును నీ తృతీయార్థము శబ్దాంతరముల కూడికచేతఁ దెల్పెడివాడుక గలదు. "తీయు-చేయు చూచు-పెట్టు-చెప్పు" మొదలగు ధాతువుల క్త్వార్థక రూపమును నామముల ద్వితీయాంతమునకుఁ జేర్చి దానిచేతఁ దృతీయార్థముఁ దెల్పు సంప్రదాయము గలదు. ఉదా:—తమి-కత్తియెక్కొణ్డు=(కత్తిని దీసి=కత్తి చేత). తెల్గు-వచ్చుటంజేసి=(వచ్చుటచేత). బెంగాలీ-చురిదియా=(కత్తిని దీసికొని=కత్తిచే). అఱవమున 'తీయు' ధాత్వర్థపు వాడుక యధికమై యున్నది. సిథియను భాషలందువలెనె ద్రావిడ భాషలందును నర్థము తెలియని ప్రాచీన ప్రత్యయములను వాడుటయం దిష్టములేక వ్యవహర్త లిట్లు వాడసాగిరి" (కాల్డు. ౨౭౭ పుట).

విమర్శము:—అర్థము తెలియని ప్రాచీన ప్రత్యయములను వాడక వ్యవహర్త లీ నూతన పద్ధతి నవలంబించిరను దొరగారి వ్రాఁత సరికాదు. ప్రాచీన భాష యందె యిట్టి వాడుక లత్యధికముగఁ గలవు. ఇందు వింతయేమియు లేదు. 'నీవు వచ్చుటంజేసి' మున్నగు చోటులందు 'వచ్చుటన్' మున్నగు తృతీయార్థక ప్రాచీన ప్రత్యయములె యచటి తృతీయాద్యర్థముల నీయఁ గల్గియుండును. కొన్ని యెడల 'ఉండి' మున్నగు క్త్వాప్రత్యయాంతాదులతో ద్వితీయాంతములె కాక సప్తమ్యాద్యంతములును నన్వయించుచు వాక్య న్యాయముననె నిల్చును. అట్టి వాక్యములలోని శబ్దముల జంటలచేతఁ గొన్ని విభక్త్యర్థములు సహజముగ స్ఫురించుచుండును.

> "పరే షూండ్యాది శబ్దేషు। సప్తమ్యాద్యా విభక్తయః। క్వచి న్నిత్యం క్వచి ద్వాస్యా। దహో తాసాం ప్రకారితా" (చూడు వ్యా. సం. ౨౭౭ విష).

అను నథర్వణ వచనము చొప్పునఁ దెల్గున "ఉండి-ఉంచి-చేసి తొట్టి-కొలెన్-కొలెన్-పోలెన్-బలెన్-వలెన్" మున్నగు ననేక శబ్దము లనుప్రయుక్తము లగును.

పయి విషయములు తెలియక కొందఱట్టివానిని విభక్తి ప్రత్యయములనుగా నెంచుటయుఁ గలదు. మఱికొంద ఱింకను నవిమర్శితముగాఁ బూర్వపదాంతిమ నకారమును జేర్చి 'నుండి-నుంచి' మున్నగునవి పంచమ్యాది ప్రత్యయము లనుటయుఁ గలదు.

"'నుండి-నుంచి' అను క్రియాజన్య రూపములు పంచమీవిభక్తిగ వాడఁబడుచున్నవి. ఇవి 'న-ని-ఇల్-ఇన్' అను ప్రత్యయముల సంబంధము లేకున్నను స్వతంత్రముగనె తెల్గునఁ బంచమీ విభక్తులుగా వాడఁబడుచున్నవి" (కాల్డు. ౨౭౫ పుట). (చూడు ౮-౬ VI విష).

" 'నుండి-నుంచి' అనునవి 'ఉండు' ధాతువుయొక్క 'ఉండి' అనెడి క్త్వార్థక రూపమునకు ముందు 'న-ని' అను సప్తమీ ప్రత్యయములలోని నకారము చేరుటవలన నేర్పడినవని 'క్లే' దొరగారు చెప్పినది సరిగనే యున్నది. ఉదా:—పరలోకమునుండి వచ్చెను = ('పరలోకము+న్+ఉండి'). " 'ఉంచి' అనునది గ్రాంథికభాషలో లేదు. ఉండు ధాతువుయొక్క ప్రేరణార్థక రూపమగుటచేత నిది పంచమ్యర్థమును సరిగా బోధింపలేదని చెప్పవచ్చును" (కాల్డు. ౨౯౫-౨౯౬ పుటలు).

విమర్శము:—'ఉంచి' అనునది పంచమ్యర్థమును సరిగా బోధింపఁ జాలదను మాట కల్ల. (చూడు 'వ్యా. సం.' ౨౪౭ విష). "తే. గీ. కాంచి యమ్మంత్రి యెచ్చోటి నుంచి వచ్చె" (కృష్ణరాయ విజయము IV ఆ. ౨౬ ప). (బాలకవి శరణ్యము. ౧౯౪ పుట). ఇట 'ఎచ్చోటి నుంచి'=అను దానికిఁ ఏ చోటిని విడిచి వచ్చెనని యన్వయము సుసంగతముగనె యున్నది.

"తెలుఁగునందలి 'ఉండి' యను పంచమీవిభక్తి రూపము 'ఉండు' ధాతువుయొక్క క్త్వార్థకరూపమే గదా. 'చేత-తోడ' అను తృతీయావిభక్తి రూపములు 'చేయి-తోడు' అను శబ్ద వికృతులని తేలుచున్నది గదా" (ద్రావిడ భాషలు-౯౪ పుట).

"నుంచి-నుండి మొదలగునవి పంచమీవిభక్తి ప్రత్యయములుగాఁ గొందఱు పేర్కొనిరి......కూర్చి-గుఱించి-చేత-తోడ-కొఱకు-వలన-కంటె-పట్టి-లోపల-నుంచి-నుండి-అనువాని చరిత్రము నూహించుట సులభము" (ఆం. భా. వి. ౩౯౨ పుట).

" 'ఉండి' ఉండు ధాతువుయొక్క క్త్వార్థకరూపము. పంచమ్యర్థమున వాడఁబడునది......'నుండి-నుంచి' యను వానిని విభక్తులుగా భావించుట యనుచిత విభాగముననే యనుట స్పష్టము." (ఆం. భా. వి. ౩౯౫ పుట).

విమర్శము:—ప్రాచీన ప్రామాణికాంధ్రవ్యాకర్తలె కాక నవ్యబాల వ్యాకరణకారాదులు సైతము 'నుండి-నుంచి' అనునవికాని 'ఉండి-ఉంచి' అనునవికాని పంచమీ ప్రత్యయములని వచింపలేదు. 'ఉండి' అనునది యను ప్రయుక్త శబ్దమని బాల వ్యాకర్త వచించెను. 'ఉండి' అనున దెక్కటిగాఁ బంచమ్యర్థము నీయఁజాలదు. 'వృక్షముననుండి యాకు పడుచున్నది' అనుదాని కావటికు వృక్షము నందుండి యపుడాకు పడుచున్నదని యర్థము. అట్టి వాక్యార్థముచే 'వృక్షా త్పర్ణం పతతి' అను సంస్కృత వాక్యము నర్థము బోధ్యమగును. అందలి 'వృక్షాత్' అను చోటి యపాదనమును 'వృక్షమునుండి' అనుపదముల జంట బోధించును. "ధ్రువ మపాయే உ పాదానమ్. (౧-౪-

౨౮)=అపాయో విశ్లేషః. తస్మిన్ సాధ్యే ధ్రువ మవధిభూతం కారక మపాదాన సంజ్ఞం స్యాత్-(సి. కౌ. ౫౦౬ సూ). "ద్వయో స్సంయుక్తయో రన్యత రస్య చలనా ద్విశ్లేష ఇతిస్థితిః" (బాల మనోరమావ్యాఖ్య).

ఆ వఱకుఁ గలిసియున్న రెండు వస్తువుల విశ్లేషమున నిలిచియున్నది యపాదాన సంజ్ఞ గలదగును. ఇట్లె 'నీవు వచ్చుటంజేసి' మున్నగు తెల్గు వాక్యములందును 'కత్తియై కొండు' మున్నగు తమిఱి వాక్యములందును బద ముల జంటలు విభక్త్యర్థస్ఫోరకము లగుచున్నవని యెఱుంగునది. (చూడు వ్యా. సం. ౨౮౭ విష). ఇట్లు 'ఉండి-చేసి' మున్నగునవి వాక్యగత పదములె యగుటం జేసి " 'పట్టి-ఉండి-చేసి' అనునవి క్త్వార్థక పదములు. ఇవి ప్రత్యయములు కావు. "విభక్తి ప్రతిరూపకావ్యయములు" అను నాంధ్రభాషా చరిత్ర ప్రయోగమే సరికాదన నగును. ఇట 'విభక్తి ప్రతిరూపక' మను శబ్ద ముద్దిష్టార్థ బోధకము కాదు. భాషా చరిత్ర కర్తగారు 'విభక్త్యర్థాభిధాయక' మనఁదగునుగాని విభక్తి ప్రతిరూపక మని ప్రయోగింపరాదు." (చూడు 'వ్యా. సం.' విస్తర. ౨౧౧ విష).

౦-౮. VI విష:—"(౨). సహార్థక తృతీయా విభక్తి:—సంస్కృత వ్యాకరణానుసరణమున ద్రావిడ భాషా స్వభావ విరుద్ధముగ నభిన్నములగు పంచమీ సప్తమీ విభక్తులను భిన్నభిన్న విభక్తులుగను విభిన్న విభక్తులుగ నుండఁదగిన సహార్థక తృతీయా కరణార్థక తృతీయల నేకవిభక్తిగను ద్రావిడ వ్యాకర్త లేర్పఱచిరి" (కాల్డు. ౨౭౭ పుట).

"ఇంగ్లీషులోఁ గరణార్థము 'by' అను శబ్దముచేతను సహార్థము 'with' అను శబ్దముచేతను సాధారణముగఁ దెల్పఁబడుచున్నను గరణార్థమును సయితము 'with' అను శబ్దము తెల్పును. ఉదా:—"I cut it with a knife"=(నేను దానిని గత్తితో నఱికితిని) "I went with him"=(నేను వానితోడ వెళ్ళితిని). కాని ద్రావిడ భాషలలో నిట్లు కాదు. ఉదా:—తమి-కత్తి యాల్=కత్తిచేత. అవనోడు=(వానితోడ). ఇట్లివి విభిన్నములై యున్నవి. సంస్కృతమున సహార్థక విభక్తి ప్రత్యేకముగ లేకున్నను లాటిన్ భాషలో 'కమ్' (cum) అను ప్రత్యేక రూప మరుదుగఁ గలదు. సిథియను భాషలో సహార్థక తృతీయకు ద్రావిడ భాషలందు వలెనె ప్రత్యేక ప్రత్యయములు గలవు. సిథియన్ కుటుంబములోని 'కాల్మకు' భాషయందు సహార్థకమగు 'డెన్' అను ప్రత్యయము గలదు. అది యఱవములోని 'ఉడన్' ప్రత్యయమును మిక్కిలిగఁ బోలియున్నది" (కాల్డు. ౨౭౮ పుట).

విమర్శము:—'ఒడు' అను నఱవ విభక్తి హ్రస్వ వక్ర ఘటితము. ఓడు కాదు. (చూడు ౦-౧ I విష.) 'ఓడు' అనునది మలయాళ తృతీయ. 'ఒడు'

ప్రత్యయమునకు గరణార్థ మనఁగా హేత్వర్థము లేదనుట కల్ల. పంచమీ సప్తము లభిన్నము లనుటయు సరికాదు (చూడు ౮౨ II విష). పంచమీ ప్రత్యయమగు 'కంటెన్' అనుదాని తారతమ్యార్థము కాని పంచమికిఁ గల హేత్వర్థముగాని సప్తమికి లేవు. సప్తమ్యర్థమగు నధికరణార్థము పంచమికి లేదు.

ఇంగ్లీషు భాషలోని (విత్) 'with' అను దానికి వలెనె తమిళ మందలి 'ఒడు' అనుదానికిని సహార్థకరణార్థములు రెండును గలవు (చూడు ౮౨ II విష).

"మూన్ఱనుమ్......" (తొల్కా. ౫౭౬ సూ.) = 'వృద్ధినందు' అను నర్థముగల 'అగు' ధాతురూపము వాడునపుడు హేత్వర్థమునఁ దృతీయయుఁ బంచమియు నగును. ఉదా:—తృతీ-వాణిగత్తోడు ఆయినాన్=(వాణిజ్యముచేత వృద్ధి నొందెను). పంచ-వాణిగత్తిన్ ఆయినాన్=(వాణిజ్యమువలన వృద్ధి నొందెను).

దొరగారు 'ద్రావిడభాషలలో' అని వ్రాసి యొక్క తమిళమునందలి 'ఒడు' అను సహార్థకమును మాత్ర ముదాహరించి దానికినిగల కరణార్థమును జూచికొనరైరి. వారుదాహరించిన "I cut it with a knife" = "నేను దానిని గత్తితో నఱికితిని" అనురీతిగల వాడుక తెల్గున ధారాళముగఁ గలఁదు.

"కరణసహార్థ తుల్యార్థ యోగంబులం దృతీయకుఁ దోడవర్ణకం బగు. ఉదా:—కరణార్థమునందు-కోలతోడఁ గూలనేసె" (బాల కార. ౫ సూ).

"ఉ......ఈ। బాహుబలఁబుతోఁ గడఁగి పార్థుని దాఁకెడుబుద్ధి...... (విరా. ౫ ఆ. ౨౧౮ ప.). ఇది హేతు తృతీయ" (చూడు 'వ్యా. సం.' ౨౮౦ I విష).

"తోఁబుట్టినవాఁడు. సోదరుఁడు. క. వినుబేల యెట్టి కష్టుఁడు । తన పురుషగుణంబు సెడఁగఁ దల్లినిఁ దోఁబు । ట్టినవారి విడిచి......(ఆది. ౬ ఆ. ౧౯౬ ప). శా. తోడంబుట్టినవాని భంగమునకై దుఃఖించి......(భాగ. ౧౦ స్కం. పూ. ౧౭౭౭ ప.)" (సూ. రా. ని.) తోఁబుట్టువు=తోడఁబుట్టువు మున్నగునవియు నిట్టివె. ఇట్టి ప్రయోగములనుబట్టి తొల్లి 'తోడన్=తోన్' అను శబ్దము 'వెంబడిన్ = వెంటన్' అనువాని యర్థము గలదనియు నట్టి యర్థముగలదె 'తోడ' ప్రత్యయముగాఁ దెల్గున నేర్పడెననియుఁ దోఁచుచున్నది. కాలక్రమమున నది హేత్వర్థకముగను సహార్థకముగను బరిణమించె ననఁదగును.

కర్ణాటభాషాభూషణ – శబ్దమణి దర్పణములలోఁ దృతీయా ప్రత్యయము 'ఇమ్' అనునదిమాత్రమె చెప్పఁబడెను. సహార్థము 'కూడి-బెరసి' మున్నగు శబ్దముల ప్రయోగముచే 'ఇమ్' ప్రత్యయమునుండి సంపాదించుకొన వలసినదె. ఉదా:—కన్న-మగనిం కూడి బందం తందె=(కొడుకుతోఁగూడి తండ్రి

వచ్చెను.) లక్ష్మియిం బెరసి హరి యొప్పిదం=(లక్ష్మితోఁగూడి హరి యొప్పెను). ఇట్టి స్థలములందు 'ఇమ్' ప్రత్యయము నెనిల్వవలెనని శబ్దానుశాసనకర్త సూత్రించెను. "సహార్థే నాప్రధానే. (కర్ణాట. శబ్దా. ౨౧౧ సూ.)=సహార్థే శ్శబ్దై ర్యోగే సాహిత్య ప్రతియోగిని అప్రధానే అర్థే వర్తమానాత్ లిఙ్గాత్ 'ఇమ్' భవతి. ప్రయోగః-మగనిం కూడి బందం తందె. లక్ష్మియిం బెరసి హరి యొప్పిదం." (భాషామంజరీ వృత్తి). (సాహిత్యము = కూడిక. సాహిత్య ప్రతియోగి-'మగన్-లక్ష్మి' అనునవి). కూడి-బెరసి మున్నగువాని ప్రయోగమున నప్రధానార్థక శబ్దముపైని 'ఇమ్' త్రత్యయము నిల్చును. (తండ్రి ప్రధానుఁడు. వాని వెంబడిని వచ్చిన కొడుకు 'అప్రధానుఁడు') ఒడనె. శబ్ద ప్రయోగమున సాధ్య సమాసముగాన విభక్తి ప్రత్యయ మేదియు నిల్వాదు.

'ఒడనె న' (కర్ణా. శబ్దా. ౨౧౨ సూ.)="ఒడనె శబ్దేన యోగే లిఙ్గాత్ 'ఇమ్' నభవతి. ప్రయోగః - మగనొడనె బందం = (కొడుకుతోడనె వచ్చెను.) గురువినొడనె పోదం=(గురువుతోడనె పోయెను)." (భాషామంజరీ వృత్తి).

"ఒడనె ఇతి అవిభక్తికం తృతీయా నిర్దేశం మన్వాన ఆహ 'ఒడనె శబ్దేన' ఇతి." (మంజరీ మకరంద వ్యాఖ్య). 'ఒడనె' అనునదియు 'వెంటను=వెంబడిని' అను నర్థముగలదె. సహార్థము పర్యవసితార్థ మనఁదగును.

౮౭. VII విష:—"అఱవ మలయాళములలో "ఒడు-ఓడు-(ఊనిపల్కునపుడు 'ఓడె') ఉడన్" అనునవి సహార్థక ప్రత్యయములు-ఇవి యభిన్నములు. 'ఓడు' అనునది 'ఒడు'=(అంటుకొను-ముట్టుకొను) అను ధాతువునుండి పుట్టిన నామవాచకము. ఈ ధాతువునుండి పుట్టిన 'ఒట్టు'=(ముట్టుట-అంటుట) శబ్దమున కీ యర్థము గలదు. ఇట్లు 'ఒడు-ఓడు' అనువానికిఁ గలసి యుండుట యర్థముగాన నవి సహార్థకము లయ్యెను. 'ఉడన్=ఒడనె' అను ప్రత్యయము 'ఒడన్' అని యుచ్చరింపఁబడుచున్నది. కన్నడమున 'ఒడనె' అని వ్రాయఁబడుచున్నది. అఱవపద్య గ్రంథములలో 'ఉడన్' అనునది సహార్థకముగ వాడఁబడెను. తమి-'ఉడన్ పంగాళి' = (ఉమ్మడిదారు). 'ఉడనె' అనుదానికి 'వెంటనె' అని క్రియా విశేషణార్థము గలదు. 'ముట్టుకొను' అనునర్థముగల 'తోడు' అను నఱవధాతువునకు (తొడర్ = వెంటవచ్చు) 'ఒడు' ధాతువుతో సంబంధ మున్నట్లు కన్పట్టుచున్నది." (కాల్డు. ౨౭౮ పుట).

"తెనుఁగులో 'తోడు' అనునది సహార్థక విభక్తి. 'తో' అనునది దాని సంక్షేపరూపము. ఈ 'తోడు' అను ప్రత్యయము తమిళములోని 'ఓడు' ప్రత్యయమునకును, తెనుఁగులోని 'తోడను=తోడనె=(వెంటనే)' అను క్రియా విశేషణమునకును, నఱవ కన్నడములలోని 'ఒడనె'=(వెంటనె) అను క్రియా

విశేషణమునకును సన్నిహితముగఁ గన్పట్టుచున్నది. కాని యభిన్నములని చెప్పుటకు వీలులేదు. తెనుఁగులోని 'తోడు' ప్రత్యయము (తోబుట్టు=స్నేహము) 'తోటు' అను తమిళ ప్రత్యయమున కభిన్నము. 'తోటు' శబ్దము 'తోయు'=(చేరియుండు) ధాతుజన్యము. (ఇట్టి ధాతువె తమిళమున లేదు. శ్రీ రెడ్డిగారు.) 'తొగుది'=(సమూహము) తొగు='(గోశాల)' అను శబ్దములలో 'తొగు' ధాతు వగపడుచున్నది. (తొగు=నమస్కరించు. వేఱర్థము లేదు. శ్రీ రెడ్డిగారు) 'తొగు=ఒడు' అనునవి యభిన్నములు కావనెడి గుండర్టు గారి మతమును నే నంగీకరింతును. కాని తోడు శబ్దము వాని మధ్యమావస్థలోని దని తలంచెదను. 'ఒడు' శబ్దపు దీర్ఘరూపమగు 'ఓడు' ప్రత్యయమును 'తోడు=తొగు' శబ్దముల దీర్ఘరూపమగు 'తోడు' ప్రత్యయమును నభిన్నములు కావు కాని వాని సామ్యము గుండర్టుగారు చెప్పినట్లు యాదృచ్ఛికము కాదు. ఇట్లు విభిన్నములయ్యు 'ఓడు-తోడు' ప్రత్యయము లేకార్థకములగుట (సహార్థకములగుట) ద్రావిడ భాషలలో వింతకాదు. ఉదా:—తమి-మల-'ఇల్'=సప్తమీ విభక్తి. తెల్గు-'లో' (తమి-ఉళ్) సప్తమీ విభక్తి". (కాల్డు. ౨౭౮-౨౭౯ పుటలు).

"తుళు వ్యాకరణకర్త యగు బ్రిగెల్ దొరగారు చతుర్థీ విభక్త్యర్థమును సహార్థమునుగల 'డ (లేదా) ట' అనునొక విభక్తి తుళుభాషలోఁ గలదనియు దానిని 'కమ్యూనికేటివ్' విభక్తి (Communicative) యనఁ దగుననియుఁ జెప్పిరి. దీనికిని దమిళములోని 'ఒడు' ప్రత్యయమునకును రూపమందును నర్థమందును సంబంధము కన్పట్టుచున్నది." (కాల్డు. ౨౭౯ పుట).

విమర్శము:—కాల్డు. ౧౮౭ పుటకును నీ ౨౭౮-౨౭౯ పుటలకును జాలభేదము గల్గినది. (చూడు ౪౩ విష). "తమిళ మందలి 'ఒడు' ప్రత్యయమునకు 'తోటు' అను తమిళ శబ్దముతోను 'తోడు' అను తెల్గు ప్రత్యయముతోను సంబంధము లేదనెడి గుండర్టుగారి మతమును నే నంగీకరింపననియు వానికి రూపమందును నర్థమునందును సామ్య ముండుటచేత నవి యభిన్నములనియే నా యభిప్రాయమనియు దొరగారు 'కాల్డు. ౧౮౭ పుటలో' (చూడు ౪౩ విష.) వ్రాసియున్నారు. ఇచట నవి యభిన్నములు కావు గాని వానికిఁగల సామ్యము యాదృచ్ఛికమని గుండర్టుగారివలెఁ జెప్ప సాహసింపనని వ్రాయుచున్నారు. అచట 'తోడ' శబ్దములోని 'త' కార లోపమున 'ఓడు' శబ్ద మేర్పడెననుచు వాని యభిన్నత స్థిరపడునట్లు వ్రాసిరి. అచట 'తోడ' ప్రత్యయమని వ్రాసి యిచట 'తోడు' ప్రత్యయమనుచు 'ఒడు-ఓడు' శబ్దముల సంబంధమును బలపఱుచుటకుఁ గాబోలు వ్రాయుచున్నారు.

'తోడు' అను దానికి 'సహాయము-సహాయుఁడు' మున్నగునవి యర్థములు, 'తోడన్' అనునది సహార్థకము. కాన నీ రెండును నభిన్నములనుట సరికాదు. 'తోడు' అనునది తృతీయా ప్రత్యయమనియు నది 'ఉ' కార ఘటితమనియు వ్రాయుట సరికాదు. తెల్గునఁ దృతీయ 'తోడన్' అనెడి ద్రుత ప్రకృతికము. 'ఒడు' ప్రత్యయముతో సంబంధమును బలపఱుచుట కయి 'తోడు' అని 'ఉ' కార ఘటితముగ నంగీకరించుట 'పాలకోసము ఱాలమోఁత' వలె నున్నది. 'ఇల్' శబ్దము ప్రాచీన తమిఁటు ప్రత్యయము కాదని యీ వఱకు విశదీకరింపఁబడెను. (చూడు ౬౫౪ II విష).

౬౫౧. I విష:—"చతుర్థీ విభక్తి:—ఉత్తర హిందూస్థాన భాషలలో ద్వితీయా చతుర్థీ విభక్తులకుఁ బ్రత్యయ భేదములేదు. గోండు భాష తప్పఁ దక్కిన యెల్ల ద్రావిడ భాషలందును జతుర్థీ ప్రత్యయ మేకరూపముననే యున్నది. ద్రావిడ భాషలలోని యితర ద్వితీయాది విభక్తి ప్రత్యయములకు వైవిధ్యము గలదు గాని చతుర్థీ ప్రత్యయము మాత్ర మన్నిటను (మలయాళ-'ఇన్ను-ను-ఉ' అనునవి ముందు వివరింపఁబడును) నేకరీతిదే" (కాల్డు. ౨౭౯ పుట).

"తమిఁటు చతుర్థీ విభక్తి ... 'కు' అనునది.
మలయాళ ... 'క్కు'.
తెల్గు ... 'కు' (ఇకారాంతములకు 'కి').
ప్రాచీన కర్ణాట ... 'కె-గె'.
నవీన కర్ణాట ... 'గె-క్కె' (ప్రకృతిపై నిల్చునపుడు-'ఇగె').
తుళు ... 'కు-గు-క్-గ్'.
తు ద ... 'క్-గ్' (గ్-తఱచు).

పయి వానిని బరిశీలింపఁగా ద్రావిడ భాషలలోని చతుర్థీ విభక్తికి ముఖ్యావయవములు 'క' కార 'గ' కారములె యనియు నుచ్చారణ సౌకర్యార్థముగ నొకొక్క భాషలో నొక్కొక్క విధమగు నచ్చు చేరెననియుఁ దోఁచుచున్నది" (కాల్డు. ౨౭౯-౨౮౦ పుటలు).

"ప్రాచీనములగు నిండో యూరపియను భాషలలో నీ 'కు' ప్రత్యయమునకు సరియగునది కానరాదు గాని యర్వాచీనములగు హిందీ ప్రభృతులలో నిట్టివి కన్పట్టుచున్నవి. హిందీ భాషలో ద్వితీయా చతుర్థీ ప్రత్యయము 'కో' అనునది. బెంగాలీ-కే. సింధీ-ఖే. కాని త్రంపు దొరగారును వేఱోకరును గౌడ భాషలలోని 'కో' ప్రత్యయము సంస్కృత జన్యమని చెప్పిరి. త్రంపు దొరగారు తమ సింధీ వ్యాకరణమున సింధీలోని 'ఖే' ప్రత్యయమును బెంగాలీలోని 'కే' ప్రత్యయమును 'కృతే'=(కొఱకు) అను సంస్కృత శబ్దమునుండి

పుట్టియుండవచ్చు ననిరి. "సంస్కృ-కృతే=ప్రాకృ=కితే=కిఏ=కే=ఖే" అని పరిణామ క్రమము చూపఁబడెను. హిందీ భాషలోని 'కో' ప్రత్యయము 'కృతమ్' అను సంస్కృత శబ్దమునుండి పుట్టె ననిరి. నవీన ప్రాకృతములలో లింగ విపర్యాసము ప్రసిద్ధము గాన-'కృతమ్=కృతః=కితో=కిఓ=కో' అని పరిణామ క్రమము నరయునగును. దీనిపై ననునాసికాగమము నిల్చినచో 'కోమ్-కామ్' అను చతుర్థీ విభక్తి ప్రత్యయము లేర్పడును. ప్రకృతిలో లేని యనునాసికాగమ మిట్లూరకయె కల్గుట ప్రాకృత భాషా సంప్రదాయము. ద్రావిడ దేశమునకు గౌడదేశములు విదూరస్థములగుటచేత నివి యొక దాని నుండి వేఱొక దానిలోఁ బ్రవేశించెనని చెప్పుట కవకాశము లేదు" కాల్డు. ౫౮౦ పుట).

"హిందీ భాషలోని ప్రాచీన గ్రంథములందు 'కో' అను చతుర్థీ విభక్తి 'కాన్' అనురూపముతో నున్నది. కాన నిది సంస్కృత 'కమ్'=(ఎవనిని) శబ్దమూలకమని బీమ్సు దొరగారు వ్రాసిరి. ఇప్పటికి లభించిన. (క్రీ. శ.) ౭౭౪ సంవత్సరపు సిరియన్ క్రిశ్చన్ శాసనములలో (తమిళశాసనములు) సయితము 'కు' ప్రత్యయముగలదు. ఉదా:—నగరత్తుక్కు=(నగరమునకు) ఇంతకన్నఁ బ్రాచీనమగు హిందీ వాఙ్మయములేదుగదా. మఱియు 'కో-కు' అనువాని సంబంధము భాషల కుటుంబైక్యమును నిర్ణయింపఁ జాలకున్నను నట్టి గాఢసంబంధము గలదని భ్రమింపఁ జేయఁగల్గును." (కాల్డు. ౫౮౦ పుట).

"డాక్టరు భండార్కారుగారు 'కహి-కుహిం' శబ్దములనుండి (కైః-కేషామ్) 'కే-కో' ప్రత్యయములు వచ్చియుండునని వ్రాసిరి."

"సింహళభాష చతుర్థి-ట్యై.

ఒరాఒన్ భాష......గై (ద్రావిడ భాషలలోనిది) (రాజ మహాలు కొండలలోనిది)

టిబెటిన్ భాష......గ్య

బోడజాతుల భాష-కో (బూటాన్ దేశము. ఇది హిందీ ప్రత్యయమున కత్యంత సన్నిహితము)

టర్కిష్ కుటుంబ భాషలు:
- ఓరియంటల్ టర్కిష్ భాష-కె-క-గె-గ
- ఓస్మన్‌లి టర్కిష్......ఘహ్-అ. యెహ్-ఎహ్.
- మంచుభాష......దె
- మంగోలియన్‌భాష...దా

(మంచు, మంగోలియన్) ఈ రెండును తార్తారు భాషలోని 'కె' ప్రత్యయమును సంబంధించి యున్నవి. ఈ శాఖ భాషలలో 'క' కారమున కును 'త' కార దకారములకును మార్పు సహజము.

ఫిన్నిషు కుటుంబములోని చతుర్థీ ప్రత్యయములు ద్రావిడ కు ప్రత్యయమును బోలియున్నవి. ఫిన్నిషు భాషలో మాత్రము 'లె' అను రూపమున్నది.

ఇర్టిషు-సుర్గుటిషు భాషల్కు... 'గ' (ఇవి ఓస్టియకు భాషాభేదములు).

ఓస్టియకు భాషలో ... 'అ' అనునదియుఁ గలదు.

మార్డ్వీన్ భాషలోని చతుర్థీ విభక్తి.....'వ=గ'

{చెరిమిస్ భాష......స్క-సెఠ.
{కొన్నియెడల...... కె-క

జపాను భాష......వె-హె-యె-ఎ."

(కాల్డు. ౨౮౧ పుట).

„క్రీస్తునకుఁ బూర్వము ౫ శతాబ్దపు (చూడు కాల్డు. ఇంట్రడక్షన్-౬౫-౬౮ పుటలు) (చూడు. ౮ విమ) బెహిస్తను ఫలకములలోని సిథియను శాసనములందలి 'ఇక్కి-ఇక్క' అను చతుర్థీ ప్రత్యయములు ద్రావిడ చతుర్థీ ప్రత్యయముల నెక్కుడుగఁ బోలియున్నవి. నోరిసు దొరగారీ ప్రత్యయములు ('ఇక్కి-ఇకఠ') తెల్గులోని 'యొక్క' ప్రత్యయమునకు సన్నిహితము లనిరి. 'కు=కుఠ' ప్రత్యయము ప్రకృతి పై నిల్చునపుడు తమిళమున 'అకుఠ-ఉకుఠ' అగును. మలయాళమున 'ఇక్క' అను రూపమును నందును. ఉదా:—బెహిస్తను శాసన—నీ ఇక్క (లేదా) నీ ఇక్కి=(నీకు) తమి-మల-నినకుఠ=తెల్గు-నీకు. తుళు-నిక్క" (కాల్డు. ౨౮౧ పుట).

"మలెభాషలోని చతుర్థీ 'క' ప్రత్యయము ప్రకృతికిఁ బూర్వమున నిల్చును. ఫిన్నిషు భాషలోని చతుర్థి 'లె' అనుదానికి 'టిబెటను'. పుష్టు-మరాటీ-భాషలలోని 'లా' అనుదానితోను, నవీన పెరిషియను భాషలోని 'రా' ప్రత్యయముతోను సంబంధమున్నట్లు తోఁచును. ఉదా:—మరాటీ చతుర్థి-తుల=(నీకు-నిన్ను). పెరిషియన్-తొర." (కాల్డు. ౨౮౨ పుట).

"ద్రావిడభాషలలోని మలయాళమున మాత్రము చతుర్థికి రెండు విధములగు ప్రత్యయములు గలవు. క్కు (తఱచు). 'ఇన్ను-ను-ఉ' అనునవి చతుర్థ్యేకవచనమున నరుదుగ నిల్చును. ఇందలి 'ఇన్ను' అనునది 'ఇన్కు' అనుదాని పరిణామము కావచ్చును. (౧౫ II విమ. చూడు) తమిళమలయాళములలో విభక్తి పూర్వాగమము 'ఇన్' అనునది కలదు. (ఇన్+కు=ఇన్కు=ఇన్ను). ద్విత్వ నకార కకారలోపములచేత 'ఇన్ను = ఇనుఠ' అనుదాని నుండియే 'ను-ఉ' అనునవి సంభవించి యుండును. ఉదా:—మల-అవన్ను=

(వానికి). టర్కి-షు-ఓస్టియాకు భాషలలో సైతమిట్లే 'క-గ' అను ప్రత్యయముల యాదిహల్లు లోపించుట గలదు. (ఇట్లె 'ఇన్ను' నుండి 'ను-అ' ఏర్పడనగునని భావము).

డా. గుండర్టుగారు 'ఇన్ను' ప్రత్యయము 'ఇనదు' అను షష్ఠీ ప్రత్యయమునుండి యేర్పడినదనిరి. మలయాళమున 'నిన్ద్రు=నిన్ను' = (నిల్చుచు) అని యేర్పడును. ఇట్లె "ఇన్ద్రు=ఇన్ను=(ఈ దినము)" అని యగును. మల-ఎన్ద్రె=(నాయొక్క)=ఎనదు. మరత్తు-మరత్తిన్ద్రె=మరత్తినదు=(చెట్టుయొక్క) 'మరత్తిన్ద్రె' అనుదానినుండి 'మరత్తిను' అని యేర్పడవచ్చును." (కాల్డు. ౨౬౨-౨౭౩ పుటలు).

విమర్శము:—ద్రావిడభాషలలోనేకాక యితరానేక దేశీయభాషలలోని చతుర్థీ ప్రత్యయము 'క' కార సంబంధిగనే యున్నదని కాల్డువెల్లుగారిందు విపులముగఁ బ్రదర్శించి "దీని వ్యుత్పత్తిని ప్రాజ్ఞులు పరిశీలింతురుగాక" (రూ౫ II విష) యని ముందు వచించుచున్నారు. హిందీ బెంగాలీ ప్రభృతులలోని 'కో-కే' ప్రత్యయములు 'కృతమ్-కృతే' ('కావ్యం యశసేర్థ కృతే వ్యవహారవిదే'-చతుర్థి) అనువానినుండి యేర్పడెననెడి త్రుంపుదొరగారి (సింధీ వ్యాకర్త) వివరణము నీవలకె యుదాహరించి యున్నారు (రూ౫ I విష). సునీత్ కుమారచాటర్జీగారు 'కు-కో' మున్నగునవి 'కక్ష' మున్నగు సంస్కృత శబ్దములనుండి యేర్పడెనని వ్రాసిన వ్రాఁతను విమర్శించుచు 'కే-కో' మున్నగు బెంగాలీ ప్రత్యయములకును ద్రావిడ 'కు' ప్రత్యయమునకునుగల పోలిక కాకతాళీయమని (కీ. శే.) డా. చిలుకూరి నారాయణరావుగారు లోఁగడ (ఆం. భా. చ. ౫౯ పుట) వ్రాసిరి. (చూడు ౧౨ IV విష). కాని ప్రకృత చతుర్థీ విభక్తి వివరణ సందర్భమునఁ బై త్రుంపు దొరగారి పద్ధతినే దాని వ్యుత్పత్తి నంగీకరించిరి.

హిందీ ప్రభృతి గౌడభాషలలోని 'కో-కే-కా' అనునవి సంస్కృత 'క' ప్రత్యయమును సంబంధించినవని యీవలకు ౧౨ IV విషయమున విపులముగాఁ బ్రదర్శింపఁబడి యుండుటచేత నిటఁ బునరుక్తిభీతిని మరల వివరింపలేదు. "ఈ 'కే-కు' మొదలగు ప్రత్యయములు సంబంధార్థక 'క' ప్రత్యయమునుండి కలిగి యుండవచ్చునని సునీత్ కుమార ఛాటర్జీగారి యభిప్రాయము" (ఆం. భా. చ. ౯౯౩ పుట). అని (కీ. శే.) డా. చిలుకూరి నారాయణరావుగారు వ్రాసి యున్నారు.

౮౫. II విమ:—" 'వడక్కు' = (ఉత్తరము) 'కిఴక్కు' = (తూర్పు) అను నామములలోని 'కు' అనునది చతుర్థ్యర్థమును సూచించుచున్నను నిది క్రియా నామవాచకములందును భవిష్యత్కాల రూపములందును గన్పట్టు 'కు' ప్రత్యయమున కభిన్నమై యున్నది. కానఁ బైని వ్రాసిన 'కు' ప్రత్యయము లన్నియు (వివిధ భాషలలోని) నభిన్నములె యనియు గత్యర్థకము లనియుఁ జెప్ప వచ్చునేమో? ప్రాజ్ఞు లీ విషయము నింకను బరిశీలింతురు గాక!" (కాల్డు. ౨౮౩ పుట).

విమర్శము:—'కు' ప్రత్యయ వ్యుత్పత్తి విషయమున డా. కాల్డువెల్లు గారికి నిశ్చితాభిప్రాయము లేమింజేసి యేమేమో సందేహించుచు వ్రాసిరి. అట్టివి క్షోదక్షమములు కానేరవు.

'ఈ కు' ప్రత్యయము సంప్రదానార్థమందె కాక యితర విభక్తుల యర్థము లందును దఱచుగా ద్రావిడ భాషలలో వచ్చుట గలదు.

తమిళ మందు

"ఇదనదు......" (తొల్కా. ౫౬౩ సూ.) = ఈ క్రింది యర్థములలో నితర విభక్తులచోట (చతుర్థీ) 'కు' ప్రత్యయము నిల్చును.

తృతీయ చోట

" { వాయాల్ తక్కదు = ('వాయ్‌చ్చి' అను పనిముట్టు నోటితోఁ దగినది).
{ వాయ్‌క్కు త్తక్కదు = (వాయ్‌చ్చి యను పనిముట్టు నోటికిఁ దగినది).

పంచమి చోట

{ మదురైయిన్ తెఱ్కు తిరునెల్వేలి = (మధురకంటెఁ దిరునెల్వేలి దక్షిణము).
{ మదురైక్కు త్తెఱ్కు తిరునెల్వేలి = (మధురకు దక్షిణము తిరునెల్వేలి).

{ అవనిన్ ఇవన్ పెరియన్ = (వాని కంటె వీఁడు పెద్దవాఁడు).
{ అవనుక్కు ఇవన్ పెరియన్ = (వానికి వీఁడు పెద్దవాఁడు).

{ ఊరిన్ పఱ్ఱు (ట్టు) విట్టాన్ = (ఊరి వలన నభిమానమును విడిచెను).
{ ఊర్కుపఱ్ఱు (ట్టు) విట్టాన్ = (ఊరికి నభిమానమును విడిచెను).

{ ఊరిన్ తీర్‌న్దాన్ = (ఊరివలన (ఆశను) విడిచెను).
{ ఊర్కు త్తీర్‌న్దాన్ = (ఊరికి (ఆశను) విడిచెను).

షష్ఠి చోట

{ యానైయదు కోడు కూరిదు = (ఏనుఁగు యొక్క కొమ్ము వాఁడిమి గలది).
{ యానైక్కు కోడు కూరిదు = ఏనుగునకుఁ గొమ్ము వాఁడి గలది).

సప్తమి చోట

{మారియుళ్ వన్దాన్=(వర్షకాలమందు వచ్చెను).
{మారిక్కు వన్దాన్=(వర్షకాలమునకు వచ్చెను).

తెలుంగున

"షష్ఠీస్థానికంబగు 'కు' వర్ణకం బొక్కచో ద్వితీయాది విభక్తులకు మాఱుగాఁ దత్తదర్థంబులం జూపట్టెడు" (ప్రౌఢ. కార. ౧౩ సూ.)

ద్వితీయా చోట
వేఁటకుఁ బోయిరి=(భార. ఆర. ౬ ఆ.)=వేఁటఁ బోయిరి.
బ్రహ్మకుం దపము చేసి (భార. ఆది. ౨ ఆ.)=బ్రహ్మనుగూర్చి (ఉద్దేశించి) తపము చేసి.

తృతీయా చోట
నీకు నారాధ్యను=(భార. ఆది. 3 ఆ.)=నీ చేత నారాధ్యను.
హరి కిభంబులు మార్కొనునయ్య=(భార. ఆర. ౪ ఆ.) సింగముతో నేనుంగులు మార్కొనునా?
చైత్రునకు మైత్రుండు తుల్యుండు (బాల-వ్యా.) = చైత్రునితో మైత్రుఁడు తుల్యుఁడు.

చతుర్థి చోట
నీ కొఱ కిచ్చు=నీకు నిచ్చు (బాల-వ్యా.)

పంచమి చోట
చోరునకు వెఱచెను
చోరునివలన వెఱచెను } (బాల-వ్యా.) (అపాదానార్థకము).
మనువున కిక్ష్వాకుండు పుట్టె=మనువువలన నిక్ష్వాకుఁడు పుట్టె (బాల-వ్యా.)
నీ కగ్గలము=(భార. ఆది. ౫ ఆ.)=నీకంటె నగ్గలము) (నిర్ధారణార్థకము).

శేషషష్ఠి చోట
పాండునకుఁ గుంతికిఁ బుత్త్రుఁడు (భార. ౬ ఆ. ౪౫)=పాండుని యొక్కయుఁ గుంతియొక్కయుఁ బుత్త్రుఁడు.

సప్తమి చోట
కోమలి నీ కనురక్త (భార. ఆర. ౨ ఆ.) కోమలి నీయం దనురక్త.

తమిఱు కన్నడములలో 'కు' ప్రత్యయము చతుర్థీ విభక్తిగానే పరిగణింపఁబడినను దెల్గున నది షష్ఠీ విభక్తిగా నంగీకరింపఁబడినది. తెల్గునందలి 'యొక్క' అను శేషషష్ఠికిఁ బ్రయోగమె లేకుండుటచేతను శేషషష్ఠ్యర్థమునందు సైతము 'కు' విభక్తికిఁ బ్రయోగము (వ్యా. సం. ౨౫౧ విష.) వెలయుచుండుట

చేతను దీనిని నన్నయాదులు షష్ఠీ విభక్తిగాఁ బరిగణించి యుందురు. ఈ 'కు' విభక్తికిఁ జతుర్థ్యర్థ మెట్లును గలదు. 'కొఱకు-కయి' అను చతుర్థీ విభక్తి ప్రత్యయములె 'కు' విభక్తి మూలకములు. సంస్కృతమందె చతుర్థీ విభక్తి చోట షష్ఠికిఁ బ్రయోగము దృష్టమగుచున్నది. (చూడు వ్యా. సం. విస్తర. II ౨౮౮ I విష.) "చతుర్థ్యా అపి షష్ఠీ స్యా" త్తను చొప్పునఁ (షడ్భా. ౮ పు.) బ్రాకృతమందును జతుర్థికి బదులుగా షష్ఠియే వాడఁబడును.

పరిశీలింపఁగా చతుర్థీ 'కు' ప్రత్యయమునకును షష్ఠీ 'కు' ప్రత్యయమునకును నించుక భేదము చూపట్టుచున్నది. "తదర్థస్య భావః తాదర్థ్యమ్" అను వ్యుత్పత్తిగల తాదర్థ్యమును బోధించు శక్తి 'కు' ప్రత్యయ మాత్రమునకు లేదనియు దానికి 'కొఱ' మున్నగు శబ్దముల యోగ మావశ్యకమనియు నాంధ్ర పండిత కవీంద్రులు తలంచిరని తోఁచుచున్నది. నన్నయభట్టారకుఁ డట్టి యెడల 'కొఱకు' (కొఱ=కార్యము-కొఱకు=కార్యమునకు) అనుదానిని వాడకున్నను నట్టి యర్థమే కల సంస్కృత వ్యాకరణ ప్రసిద్ధ 'తదర్థ' శబ్దమునె పలు చోట్లఁ బ్రయోగించి యున్నాఁడు. మత్తకో-నీ తదర్థమ కాఁగ దేవ వినిర్మితం బిది... (ఆది. ౨ ఆ. ౨౦౮). 'కయి=కునై=కుఁగాన్'-మున్నగు శబ్దములు సైత మీయర్థమున వాడఁబడెను. సీ. చైద్యునకై పూని......(సభా. ౧ ఆ. ౩౮). సీ. అడుగుము నీకుఁగా నని నేయు టొక్కటి దక్కంగ....(భీష్మ. ౧ ఆ. ౧౫౭). మధ్యాక్షరము......అఖిలలోక హితంబు పొంటె (ఆది. ౨ ఆ. ౧౮౫). ఈ 'పొంటె' శబ్దము తాదర్థ్యార్థకము. ఇది తమిళ 'పొరుట్టు' శబ్దమున కభిన్నము. 'పొరుట్టు ముత్తై......' (నన్నూలు) తమి-రామన్ పొరుట్టు వన్దేన్=(రాముని పొంటె వచ్చెను=రామునికై వచ్చెను). ఆధునిక తమి-రామనుక్కాగ వన్దేన్=(రామునికిఁగా వచ్చెను). హళొసగన్నడ-రామంగాగి బందం=(రామునికై వచ్చెను). అర్వాచీనాంధ్రము-రాముని కోసము వచ్చెను=రాముని కోసరము వచ్చెను=హళొసగన్నడ-రామం గోసుగం బందెం=(రామం=గె+ఓసుగం). 'ఓసుగ = ఓసుగర = ఓసక్కర' అనునవి పర్యాయములు. 'రామునకు+ఓసరము' అనియె తెల్గున ఛేదము చేయుట యుక్తము. 'కోసము' అనునదొక శబ్దమని యహోబలపతి వ్రాసెను. 'ఓసరము' అనునది 'అవసర' శబ్దభవ మని తలంపనగును.

కాల్డువెల్లుగారు "'కు' ప్రత్యయ చరిత్రమును బ్రాజ్ఞలూహింతురు గాక" అని వచించిరి (౮౫ II విష). గౌడభాషలలోని 'కో-కె-కా' మున్నగునవి సంస్కృత ప్రత్యయ సంబంధులు కావచ్చును (౧౨ IV విష. చూడు). 'కు' ప్రత్యయమునకు ద్రావిడ శబ్దముతోనే వ్యుత్పత్తి సరిపడుచున్నది. ప్రాచీన

కర్ణాట భాషలోను, 'కూర్గు' లోను 'గెయ్=కెయ్'=(చేయు) అను ధాతువు గలదు. 'తమిటు-చెయ్. తెల్గు-చేయు'. అనునవి దీని రూపాంతరములు. దీని నుండి కన్నడమున 'కెయ్=(పనిచేయునది=చేయి)' "గెయ్తం=గెయ్మె=కెయ్తం=కెయ్మె=(కార్యము=కొలు)" అను రూపములు వెలసియున్నవి. తమిటమందును 'చెయ్' ధాతువునుండి-"చెయ్దల్=(చేయుట) చెయ్ది=(కార్యము)" అనియుఁ దెల్గునఁ జేయు ధాతువునుండి-"చేయి=(హస్తము) చేఁత=చెయ్ది చెయ్దము=(కార్యము)" అనియు రూపములు వెలసియున్నవి. కాఁగా నట్టి కర్ణాటపు-'గెయ్=కెయ్' ధాతువునుండి-'గె-కె' అను కర్ణాట చతుర్థీ విభక్తు లేర్పడియుండ నోపును. వానినుండి యితర ద్రావిడభాషలలోను భాషాంతరములలోను నీ 'కు' ప్రత్యయము వెలసినదని తోఁచెడిని.

౮౬. I విష:—<u>అపాదానార్థక పంచమీ విభక్తి</u>:—"సంస్కృత వైయాకరణుల మీఁది గౌరవమున ద్రావిడ వ్యాకరణములలో నీ పంచమీ విభక్తి చేర్పఁబడినది. సంస్కృత ప్రసిద్ధ పంచమ్యర్థము ద్రావిడ వాక్యములచే బోధింపఁబడుచున్నను నపాదానార్థమును మాత్రము బోధించు ద్రావిడ ప్రత్యయము కలదను విషయము సందిగ్ధముగా నున్నది.

ద్రావిడ భాషలలోని యపాదానార్థక పంచమీ విభక్తి ప్రత్యయమును సప్తమీ విభక్తి ప్రత్యయమును సరిపోల్చి చూచినపుడు వానికి భేద మగపడదు. వానితో నన్వయించు క్రియారూపములందు మాత్రము భేదము గోచరించును. ఒక ప్రదేశమును బోధించు శబ్దముయొక్క- సప్తమ్యంతము పయిని గత్యర్థక క్రియారూపము నిల్చినచో నది ద్రావిడభాషలలో నపాదానార్థము నిచ్చును. అటువ వ్యాకరణములలోని పంచమీ విభక్తి ప్రత్యయమగు 'ఇల్' అనుదానికిని వ్యావహారిక భాషలోని సప్తమ్యర్థమును బోధంచు 'ఇల్' అనుదానికిని భేదము గలదని చెప్పెడి యభిప్రాయము సరికాదనియు ద్రావిడభాషలలోఁ బంచమీ విభక్తి లేదనియు సప్తమీ తృతీయలలో నొకదానికిఁగల సందర్భోచిత క్రియాయోగమునఁ బంచమ్యర్థము సిద్ధించుననియు నా యభిప్రాయము." (కాల్డు. ౨౮౩-౨౮౪ పుటలు).

విమర్శము:—ద్రావిడభాషలలోఁ బంచమీ విభక్తియే వేఱుగ లేదను దొరగారి వ్రాఁత కేవలము ప్రామాదికము. అపాదానార్థమే పంచమికిఁ గలదనుకొనుట యింకొక ప్రమాదము. 'పట్టి వలన కంటే ఇతి పంచమీ'. అను నన్నయసూక్తి చొప్పునఁ బంచమికి హేతు (కారణ-కరణ) తారతమ్య నిర్ధార ణాపాదానార్థములు మూఁడు గలవు. అందు హేత్వర్థమునఁ దృతీయయు వచ్చును. ఇవెల్ల నపాదానార్థములె యని కర్ణాట శబ్దానుశాసన భాషామంజరీ

వృత్తికారుఁడు సవిమర్శముగా వ్రాసి యిట్టివానికెల్ల నపాదానత్వమును సిద్ధింపఁ జేయుటకై యెన్నెన్నో చిక్కులు పడెను. "'ఆతనత్త్తణిం దీతం పటు' ఇత్యాదౌ సర్వత్ర వాసుదేవాద యోర్జునాదిభిః ఆధిక్యాదినా సంస్పృష్టాః-తేభ్యోఽతిశాయ నాదినా ధర్మేణ విభక్తాః ప్రతీయన్త ఇతి బొద్ధోఽపాయః" (కర్ణాట శబ్దా. ౨౨౧ సూత్రపు భాషామంజరీ వృత్తి) (అపాదాన శబ్దార్థము-చూడు ౬౪ V విష).

తమిళమునఁ గేవల హేత్వర్థక తృతీయా ప్రత్యయములు 'ఆల్-ఆన్' అనునవియును, హేతు తారతమ్య నిర్ధార ణాపాదానార్థద్యోతక ప్రత్యయము 'ఇన్' అనునదియు నున్నవి. (చూడు ౬౪ II విష.) 'ఇల్' అనునది మలయాళ సప్తమీ ప్రత్యయము. ప్రాచీనమగు తొల్కాప్పియమునఁ గానరాదు. 'ఇన్' అనునది తమిళ పంచమీ ప్రత్యయము. ఇది 'ఇల్' అను మలయాళ సప్తమికి భిన్నము. 'ఇన్' అనుదానికి సప్తమ్యర్థము ద్రావిడభాషలలో నెందును లేదు.

I. తమిళ హేత్వర్థక పంచమి:—"మూన్జనుమ్......" (తొల్కా. ౫౭౬ సూ.)=వృద్ధియగుట యను నర్థముగల క్రియను వాడునపుడు హేత్వర్థమునఁ దృతీయయుఁ బంచమియు నగును. ఉదా:—(తృ)-వాణిగత్తొడు ఆయినాన్=(వాణిజ్యముచేత వృద్ధినొందెను). (పంచ)-వాణిగత్తిన్ ఆయినాన్=(వాణిజ్యమువలన వృద్ధినొందెను). (ఆగు=వృద్ధినొందు. చూడు తొల్కా. ౫౦౩-౫౦౪-౫౦౫ సూ).

II. తారతమ్య నిర్ధారణ పంచమి:—"ఇన్నాకువదె......" (తొల్కా. ౫౭౧ సూ.)='ఇన్' అనునది పంచమీ విభక్తి. 'దీనికంటె నిది యిట్టిది' అను నర్థమున నిది వాడఁబడును.

"వణ్ణమ్-వడివు......" (తొల్కా. ౫౭౨ సూ.)="రంగు-ఆకారము-రుచి" మున్నవాని తారతమ్య నిర్ధారణమున 'ఇన్' ప్రత్యయము వచ్చును. ఉదా:—కాక్కైయి ఱ్కరిదు కళమ్ పటమ్=(కాక్కైయిన్+కరిదు=కాక్కైయిఱ్కరిదు.=కాకికంటె 'కళమ్' అను పండు నల్లనిది.) ఈ యర్థమున నర్వాచీన తమిళమున 'కాట్టిలుమ్' అనునది చేర్పఁబడుచున్నది. ఉదా:—అవనై కాట్టిలుమ్ ఇవన్ పెరియన్=వానిని (అవనై) జూపినను (కాట్టిలుమ్) వీఁడు పెద్దవాఁడు (ఇవన్ పెరియన్). ఇట్టి వాడుక తెల్గులోని 'కన్నన్-కంటెన్' అను వానిని సంబంధించి యున్నది. వానికన్న వీఁ డధికుఁడు. వానికంటె వీఁ డధికుఁడు. ఇచట వానిని 'కన్నన్' (చూడఁగా) అని యర్థము చేసినచో "వానిఁ గన్న వీఁ డధికుఁడు" అనవలసివచ్చును. కాన 'వానికిన్+అన్నన్' అను రీతిని వ్యుత్పత్తి చెప్పుటయె యుచితము. (చూడు ౭౭ II విష). కన్నడము

"కృష్ణ నత్తణిం బలభద్రం పిరియం=కృష్ణునికన్న బలభద్రుఁడు పెద్దవాఁడు" అనురీతిని ప్రాచీన కన్నడమున నుండును. అర్వాచీనముగ గన్నడమందును 'అంతలు-అంత' మున్నగు శబ్దము లీ యర్థమునఁ జేరును.

III. అపాదానార్థపంచమి:—తమి - మలైయిన్ విఴుమ్ అరువి=(కొండ నుండి పడు జలపాతము. చూడు ౨౬ IV విష). యాట్టిన్ (ట్టిన్) వన్దాన్=(ఏటినుండి వచ్చెను).

పయి యుదాహృతులలోని 'ఇన్' ప్రత్యయమునకుఁ దృతీయార్థముగాని సప్తమ్యర్థముగాని దుర్ఘటముగదా. తృతీయాసప్తమ్యర్థములకు గత్యర్థక క్రియల తోడఁ బయిచోట నన్వయమె యసంభవము. నదియందు వచ్చెననుట పొసఁగదు గదా. హేత్వర్థమునఁ దృతీయయు వచ్చుచున్న కారణమున విభక్త్యర్థాంతరములయొక్క సాంకర్యము లేని పంచమి తారతమ్య నిర్ధారణార్థక మాత్రమె యని పయి తొల్కాప్పియ సూత్రములకుఁ (౫౬౧-౫౬౨ సూ.) దాత్పర్యము.

తొల్కాప్పియమున 'మలైయిన్ విఴుమ్ అరువి'=(కొండనుండి పడు జలపాతము) అను రీతిగల యపాదాన ముదాహరింపఁబడకున్నను వేఱొక విధమగు నపాదాన ముదాహరింపఁబడెను.

"అచ్చక్కిళవి......" (తొల్కా. ౫౮౪ సూ.)=భయవాచక శబ్ద ప్రయోగమునఁ బంచమిగాని ద్వితీయగాని వచ్చును. ఉదా:—(పం.) పులియిన్ అఞ్జువాఁ=(పులివలన భయపడును). (ద్వి.)—పులియై అఞ్జువాన్=(పులిని గూర్చి భయపడును). "భీ త్రార్థానాం భయహేతుః (౧-౪-౨౫)=భయార్థానాం త్రాణార్థానాంచ ప్రయోగే భయహేతు రపాదానం స్యాత్." (సి. కౌ. ౫౮౮ సూ).

తెలుఁగున నపాదానార్థ ముండ్యాది శబ్దాన్వయ ఘటిత వాక్యమునుండి తఱచుగా ద్యోత్య మగును. "పరే ష్వుండ్యాది శబ్దేషు । సప్తమ్యాద్యా విభక్తయః । క్వచి న్నిత్యం క్వచి ద్వా స్యా । దహో తాసాం ప్రకారితా॥" (వికృ. 'వ్యా. సం.' ౨౪౭ విష). అను నాథర్వణకారిక చొప్పున నుండ్యాది శబ్దాన్వయ ఘటిత వాక్యమునుండి యపాదానార్థము ద్యోత్య మగుట (చూడు ౮౪ V విష) తఱచైనను వైకల్పికముగ నుండ్యాది శబ్దాన్వయ మక్కఱ లేకయే వలన వర్ణక మాత్రమె యపాదానార్థమును సంస్కృత పంచమీ ప్రత్యయము వలెనె బోధించుటయుఁ గలదు. (చూడు 'వ్యా. సం.' ౨౪౭ విష). ఉదా:—ఉండి శబ్దాన్వయము:—సీ. కావున దేవి యుద్దేవ

పథము । నందుండి వసుమతి కొందంగఁ జనుదేరవలయు (అర. 3 ఆ. ౮౦ ప). కం......సనత్కుమారుఁడు మహికిం । జనుదెంచె బ్రహ్మలోకం । బున నుండి .....(ఆది. 3 ఆ. ౯౧ ప). ఉండ్యాది శబ్దాన్వయ రహిత వలన వర్ణక ప్రయోగము:—ఆ.వె......మనునిభుండు ధర్మతనయుండు దాస్యంబు । వలనఁ బాయవలయు వసుమతీశ. (సభా. ౨ ఆ. ౨౪౯ ప) క. నెమ్మిని ధర్మజు నలువురు । తమ్ములు......పాయంగవలయు దాస్యము వలనన్--(సభా. ౨ ఆ. ౨౬౧ ప). (చూడు 'వ్యా. సం.' ౨౮౬ విష).

ఇట్టి యపాదానార్థకమగు 'వలన' వర్ణకమునకు మూలమగు 'వలను'= (దిక్కు) అను శబ్దమునుండి సప్తమ్యర్థమునందును 'వలనన్' అను పదమేర్పడు చుండుటంజేసి భ్రమించి కాల్డువెల్లు దొరగారు పంచమీ విభక్తియే లేదనియు నయ్యది సప్తమీ రూపమే యనియు వ్రాయవలసిన వారైరి. 'వలనన్' అను నది తృతీయా పంచమీ సప్తమ్యర్థకమయ్యుఁ బంచమీ విభక్తి మాత్రముగనె గణింపఁబడెను. అట్టి పంచమీ ప్రత్యయత్వావస్థయందు దాని తృతీయా సప్తమ్యర్థము లంతరించు ననవగును. (చూడు ౮౪ IV విష). అట్లు కానిచో "ద్యాసంబువలనఁ బాయంగవలయు" అను నన్నయ వాక్యము లనన్వితములై కావలసి వచ్చును. అచటఁ దృతీయా సప్తమ్యర్థములగు కరణాధికరణార్థములు సందర్భింప నేరవుగదా. 'వలనన్' అనుపదమునకు 'దిక్కునందు' అను సప్తమ్యర్థమున 'ఉండి' శబ్దాన్వయము లేకుండ నపాదానార్థము లభింపనేరదు గదా. కావునఁ బయి నన్నయ ప్రయోగములవంటి స్థలములందు 'వలనన్' అనుదానికపాదాన పంచమీ ప్రత్యయత్వ మాత్రము నంగీకరింపక తీరదు. 'చేతన్-తోడన్' అనువానికిని నిట్లుగనె తృతీయాత్వమును (కరణ సహార్థములందు) గ్రహింపవలయును. ('చేతన్' అనుదానికిఁ గరణార్థక ప్రత్యయత్వమున సప్తమ్యర్థమంతరించునని యెఱుంగనగును. 'బాణముచేతఁ గూలనేసెన్' అను కరణార్థక వాక్యమున 'చేయి' శబ్ద సప్తమ్యర్థము సందర్భింప నేరదుగదా. వలన వర్ణకమునకు హేత్వర్థమును గలదు.

తే॥ గీ॥ విద్య యొసఁగును వినయంబు వినయమునను ।
బడయుఁ బాత్రత; పాత్రత వలన ధనము ।
ధనము వలనను ధర్మంబు దానివలన ।
నైహి కాముష్మిక సుఖంబు లందు నరుఁడు ॥

తెల్గునఁ దారతమ్య నిర్ధారణార్థక ప్రత్యయము 'కంటెన్' అనునది. సీ.... ...ఇంత । కంటెను గష్టంబు గలదె యెందు (సభా. ౨ ఆ. ౨౬౯ ప).

తమిళమందలి 'ఇన్' ప్రత్యయమునకు వలెనె కర్ణాటభాషలోని 'అత్తణిం' ప్రత్యయమునకె హేత్వపాదాన తారతమ్య నిర్ధారణార్థములు మూఁడును వెలయుచున్నవి. 'అత్తణ+ఇమ్=అత్తణిం' అను భేదము చొప్పున నిది కన్నడ తృతీయా ప్రత్యయమును సంబంధించినదె. తృతీయనుండి వ్యావర్తకముగా నీ యపాదాన పంచమీత్వమున 'అత్తణ' శబ్దము చేర్పఁబడెను. కేవలమగు 'ఇమ్' ప్రత్యయమున కపాదానాద్యర్థములు లేవు. అత్తణ శబ్దయోగమునందె యట్టి జంట కపాదానాద్యర్థములు రూఢము లయ్యెను.

"అపాదానే పఞ్చమీ" (కర్ణా. భూ. ౮౮ సూ.)=అపాదానార్థమునఁ గన్నడమందుఁ బంచమి యగును. ఉదా:—ఊరత్తణిం బందం=(ఊరనుండి వచ్చెను.) పులియత్తణిం భయం=(పులివలన భయము).

"క॥ ఆదం పంచమి యప్ప ద।
పాదానస్థల దొళదెద లొదవుగు మాతం।
కాదానేష్టానిష్టా।
పాదిత హేతు వినొళుదయదొళ్ గారవదొళ్" ॥

(శబ్దమణి దర్పణము ౧౩౧ వ.)=(అపాదానార్థమునఁ బంచమి యగును. అయ్యది (ఆతం కాద్యర్థములందును నగును). "అపాదానకె—మరదత్తణిం పణ్ణు దిర్దుదు=(చెట్టునుండి పండు పడెను). కెరెయత్తణిం బందం=(చెఱువునుండి వచ్చెను. హేతువిగె:—ఉద్యోగదత్తణిం సిరి బందుదు=(ఉద్యోగమునుండి సిరి గల్గెను). పెర్మెగె (గౌరవ):—కృష్ణ నత్తణిం బలభద్రం పిరియం=(కృష్ణునికంటె బలభద్రుఁడు పెద్దవాఁడు) 'అంతలు' అనునది నవ్యము". చూడు ౮౮ II విష).

తృతీయా సప్తములలో నొకదానికి సందర్భోచిత క్రియాయోగమునఁ బంచమ్యర్థము సిద్ధించునందురే దొరగారు. పయి వాక్యములలోఁ బంచమ్యర్థ ములకుఁ దప్పఁ దృతీయా సప్తమ్యర్థములకు సందర్భము లేదుగదా, సందర్భోచిత క్రియాయోగ మెట్లు పొసంగును?

౮౬. II విష:—పయిరీతి నవిమర్శితముగా దొరగారు ద్రావిడభాషలలోఁ బంచమీ విభక్తియే లేదనియుఁ దృతీయా సప్తములలో నొకదానికి సందర్భోచిత క్రియాయోగమునఁ బంచమ్యర్థము లభించుననియు వ్రాసి యట్టి తమ వాదమును బలపఱుచుకొనుటకయి యీ క్రిందిరీతిని నిరాధారముగను బునరుక్తముగను వ్యావహారికభాషా ప్రధానముగను విస్తరించి ప్రసంగించిరి.

"అఱవ భాషయందు 'ఇల్-ఇన్' అనునవి యపాదాన పంచమీ ప్రత్యయము లందురు. 'ఇల్' అనుదానికి 'ఇలు' అని యరము. ఈ ప్రత్యయ

మునకు 'ఇక్కడ = ఈ స్థలమందు' అను నర్థములు ప్రాచీనములని తోఁచును. కాన నివి సప్తమీ ప్రత్యయములు కాఁదగినవి. వ్యావహారిక తమిళమున నిది (ఇల్) సప్తమిగ వాడఁబడుట ప్రచురమై యున్నది. తమిళమందలి 'ఇన్' అను నది 'ఇమ్' అను ప్రాచీన కన్నడ తృతీయకు భిన్నముకాదు. అభివమునను నిది తృతీయగ వాడఁబడుట గలదు. కాని యీ 'ఇన్ = ఇమ్' అనునవి రెండును సప్తమీ ప్రత్యయములై యుండవచ్చును. ప్రాచీన కర్ణాటపంచమి 'అత్తణిం' అనునది. 'అత్తణిందం-అత్తణిందె' అనునవి దీని రూపాంతరములు. "అత్తణ + ఇమ్ (ప్రాచీన కన్నడ తృతీయ) = అత్తణిం" అనిఛేదము. 'అత్తణ' అను క్రియావిశేషణము "అత్తలు-అత్త = (అక్కడ) = అత్తల్ (ఆ వైపు)" అనువానికి భిన్నముకాదు. 'ఇమ్' అను ప్రాచీన కన్నడ తృతీయకు 'ఇచ్చట' అను నర్థము ప్రాచీనము. 'ఇంద' అనునది గత్యర్థక్రియాయోగమునఁ బంచ మ్యర్థము నిచ్చును." (కాల్డు. ౨౮౪ పుట).

విమర్శము:—'ఇల్' శబ్దమునకు 'ఇక్కడ' అను నర్థము తొల్కాప్పియమున లేదు. ఇది మలయాళ సప్తమి. ప్రాచీనమగు తొల్కాప్పియమున నిట్టి—"ఇల్లు-వాకిలి-గది-గడప-తోట-దొడ్డి" మున్నగువానికి సప్తమీత్వ మంగీకరింపఁబడ లేదు. 'ఇల్-ఇన్' అనువానికి సప్తమ్యర్థము ప్రాచీన తమిళమున లేదు. వానికి సప్తమ్యర్థము తొల్కాప్పియోక్తము కాదు. (చూడు ౧౪ II విష). (రా౽ III విష. చూడు). 'ఇన్' అనుదానికిఁ బ్రాచీన తమిళమునఁ దృతీయా పంచమ్యర్థ ములు మాత్రమె గలవు. అట్లె కన్నడమున 'ఇమ్' అను దానికిఁ దృతీయార్థ మును 'అత్తణిం' అనుదానికిఁ బంచమ్యర్థమును మాత్రమె ప్రయుక్తములై యున్నవి. వానికి సప్తమ్యర్థ మెన్నఁడును లేదు. రా౽ I విషయపు విమర్శ మున నీ విషయములు విపులముఁ జూపఁబడియె యున్నవి.

రా౽. III విష:—" 'ఇల్-ఇన్-ఇమ్' అను మూఁడును బ్రాచీన సప్తమీ ప్రత్యయములని తలంచెదను. 'ఇల్' అనుదాని కభిన్నమగు 'ఇల్లు' అను తెల్గు శబ్దపు 'ఇంటి' అను రూపములో 'ఇన్' అనునది చూపట్టుచున్నది.

'ఇన్' అనుదానినే ప్రాచీన సప్తమీ విభక్తిగఁ దలంచినచో దీనికి భాషాంతర సామ్య మధికముగ నుండును. 'ఇన్' అనుదానికి 'ఇల్' అనునది మూలము కాదు. దీనికి వ్యుత్పత్తిని వేఱుగ నాలోచింపవలెను. ఫిన్నిషు మాగ్యారు భాషలలో 'అన్-ఎన్-ఇన్' అనునవి సప్తమీ ప్రత్యయములు. సంస్కృత సప్తమియగు 'తస్మిన్' శబ్దము తుదిని 'ఇన్' అనునది కన్పట్టుచున్నది. ఇది సంస్కృత సప్తమీ విభక్తి 'ఇ' అనుదాని రూపముతో నున్నను (జీ-ఓస్-సుప్-సంస్కృత సప్తమీ ప్రత్యయములు) లాటిను భాషలో సప్తమ్యర్థ కావ్య

యము 'ఇన్' అను రూపముతోను, గ్రీకు భాషలో 'ఎన్' అను రూపముతోను నుండుటచేతను, సంస్కృత 'ని' శబ్దపు (ఉపసర్గము) (ని=ఇన్) పోలికచేతను ద్రావిడభాషలలోని 'ఇన్' అనునది సప్తమీప్రత్యయ మనుట బహు భాషా సమ్మతమై యుండును" (కాల్డు. ౨౮౪-౨౮౫ పుటలు).

విమర్శము:—'ఇల్' స్థలవాచి యగుటచేత, సప్తమియనియు 'ఇన్-ఇమ్' అనునవి దాని కభిన్నములనియు నింతవఱకు వ్రాసి యా వాదమును విడిచికొని 'ఇల్' అనునది 'ఇన్' అనుదానికి మూలరూపము కాదనియు దీనికి వేఱుగ వ్యుత్పత్తి నాలోచింపవలయుననియు వ్రాయుచు నిపుడు 'ఇండో యూరపియను' భాషలలో 'ఇన్' సప్తమ్యర్థకము గాన ద్రావిడ 'ఇన్' ప్రత్యయమును సప్తమియే యనుట బహుభాషా సమ్మతమగు ననుచున్నారు దొరగారు. భాషాంతరములలో సప్తమిగా నున్నది, సప్తకిఁ గొంత సన్నిహిత సంబంధముగల తృతీయగాను బంచమిగాను ద్రావిడభాషలలో నుండుట విరుద్ధము కాదుగదా. ద్రావిడ భాషలలో నెందును 'ఇన్' అనుదానికి సప్తమీ ప్రయోగము లేకున్నను నిండోయూరపియను భాషలలో సప్తమ్యర్థకమగుట మాత్రమె యాధారముగాఁ జేసికొని దానికి సప్తమీవిభక్తిత్వము నంగీకరించుట కేవలము నసంగతము కాదా?

౨౯. IV విమ:—"అఱవ కన్నడములలోని 'ఇన్' అను షష్ఠీ ప్రత్యయ మునకును విభక్తిపూర్వాగమ మగు 'ఇన్' అనుదానికిని దమిళమందలి 'ఇన్' అను సప్తమీ ప్రత్యయము భిన్నముకాదని తలంచెదను. ఈ పక్షమున దీని కింకను భాషాంతర సామ్య మధిక మగునని షష్ఠీ విభక్తి సందర్భమున విశద మగును" (కాల్డు. ౨౮౫ పుట).

విమర్శము:—షష్ఠీ విభక్తి సందర్భమున దొరగారు బొత్తిగ తడఁబడి విభక్తి పూర్వాగమముమీఁది షష్ఠీ లోపించిన స్థలమును జూచి భ్రమించి యచటి విభక్తిపూర్వాగమ మగు 'ఇన్' మున్నగునవె షష్ఠీ ప్రత్యయములనుచు మున్ముందు విస్తరించి వ్రాయనున్నారు. ఆ రీతిని 'ఇన్' అనునది షష్ఠీ ప్రత్యయమును గలదని యిచట నవిమర్శితముగ వ్రాయుచున్నారు. అట్టి చోటులందలి షష్ఠి 'ఇ' నాగమార్థకము కానేరదు (౨౨ III విమ.) 'ఇన్-అత్తు' మున్నగు విభక్తి పూర్వాగమములు 'ఇదు-అదు' మున్నగు సర్వనామములను సంబంధించినవి. 'ఇన్' ప్రత్యయమన్ననో 'ఈన్=ఇక్కడ' అనుదానిని సంబంధించునది. ఈ రెండును నభిన్నములనుట కేవలము నసంగతము. (చూడు ౨౨ III విమ).

౨౯. V విమ:—"అఱవభాషలోని 'ఇల్ - ఇన్' ప్రత్యయములకు సామ్యముగలదు. అవి పంచమిగా వాడఁబడినపుడు వాని తుదను గత్యర్థక క్రియ యాకాంక్షిత మగుచుండును. వ్యావహారిక తమిళములో

'ఇన్' ప్రత్యయము తుదిని 'నిన్ద్రు (నిన్టు)=(నిల్చుచు), ఇరున్దు=(ఉండుచు)' అనునవి నిల్చును. ఇట్టి వీని యనుప్రయోగమె 'ఇల్-ఇన్' అనునవి సప్తమీ ప్రత్యయములని స్థిరపఱుచుచున్నది. 'నిన్ద్రు (నిన్టు)-ఇరున్దు' అనునవి నాగరకాలవమున విడువఁబడుచుండును. ఉదా:—మలైయిన్ విలుమ్ అరువి=(కొండనుండి వడు జలపాతము). ఇట్టియెడల 'ఉండి' శబ్దార్థము 'విలుమ్' అను ధాతుజ విశేషణ సంబంధమున సిద్ధించును. 'ఇన్' అనుదాని వ్యుత్పత్తి యెట్లున్నను నిది పంచమ్యర్థమును బోధించుచున్నది" (కాల్డు. ౨౮౫ పుట).

విమర్శము:—'నిన్టు-ఇరున్దు' అను తమిళశబ్దములు 'ఇన్' ప్రత్యయాంత ముల కనుప్రయుక్తమగుట తెల్గులోని 'ఉండి' శబ్దానుప్రయోగము సంపర్క మునఁ దమిళమందు సంభవించి యుండును. తెల్గు 'వలనన్' అనుదాని పోల్కిని హాలసగన్నడమున 'దెసయింద' బయలుదేఱలేదా? అట్టి చోటి యధునాతన నానాగరక తమిళమునందలి 'ఇన్' ప్రత్యయము సప్తమ్యర్థకమను టకు సందేహ మేమున్నది? ఇట్టి యధునాతన ప్రయోగములె కదా దొరగారిని భ్రమింపఁజేయుచున్నవి. ఇట్టి యనుప్రయోగము నాగరక తమిళమందు సైతము లేదను దొరగారి వ్రాతయే యది ప్రాచీన తమిళమున లేదను విషయమును విశదీకరించుచున్నది. ప్రాచీన తమిళమున నిట్టి యనుప్రయోగ మును లేదు. 'ఇన్' అనుదాని కెచ్చటను సప్తమ్యర్థమునఁ బ్రయోగమును లేదు. ప్రాచీన తమిళమునందు 'ఇన్' ప్రత్యయమునకును బలగన్నడమునందు 'అత్తణిం' ప్రత్యయమునకును హేతు నిర్ధార ణార్థములతోఁ పాటుగ నపాదానార్థ మును వెలయుచున్నది. కన్నడ:—హిమవదత్తణిం గంగె బర్పుదు = (హిమ వంతమునుండి గంగ వచ్చును) ఇందు శబ్దాంతరయోగ మక్కఱలేదు.

రా. VI విష:—"కన్నడమున 'అత్తణిం=దెసెయింద' అను పద ద్వయాత్మక ప్రత్యయములకంటె 'ఇంద' అను ప్రత్యయము పంచమ్యర్థమునఁ దఱచుగా వాడఁబడుచున్నది. 'ఇంద' అనునది తృతీయ యని చెప్పఁబడు చున్నను వ్యుత్పత్తిచేత సప్తమియే యనియు నయ్యది 'ఇన్-ఇమ్' అనువానికి భిన్నము కాదనియు నా యభిప్రాయము. 'దెసె' అనుదానికి 'దిక్కు' అని యర్థము. 'ఇంద' అనుదానినిఁ బ్రత్యేకముగాఁ బంచమిగానే కాక 'అల్లింద= ఇల్లింద' (from) అనియు వాడుట గలదు. ఇవి తమిళములోని 'ఇల్ నిన్ద్రు= (నిన్టు) ఇలిరున్దు' అనువానికి సరిపడును. తెల్గునందలి 'న' అనునది తమిళము లోని 'ఇన్' అనుదానితోను గన్నడములోని 'ఇమ్' అనుదానితోను సరి యగుచుఁ బంచమ్యర్థముకన్న స్పష్టముగా సప్తమ్యర్థము నిచ్చును. ఈ 'న'

అనునది తెల్గున 'ఇ' కారము తర్వాత నిల్చునపుడు 'ని' అనురూపమునందును. ఇది యఱవములోని 'ఇన్' అనుదానికి సరిపడును. తెల్గున 'నుండి-నుంచి' అను క్రియాజన్యరూపములు పంచమీ విభక్తిగ వాడఁబడుచున్నవి. ఇవి- 'న-ని-ఇల్-ఇన్' అనువాని యోగములేకుండనే పంచమిగా వాడఁబడుచున్నవి. ఇవి తమిళములోని 'నిన్ద్రు (నిన్రు) ఇరున్దు' అనువానికి సరియగు రూపములు. 'నుండి' అనునది 'ఉండు' ధాతుక్త్వార్థకరూపమునకు ముందు 'న-ని' అను సప్తమీ ప్రత్యయములలోని నకారము చేరుటచేత నేర్పడెనని 'క్లే' దొరగారు చెప్పినది సరిగనే యున్నది. ఉదా:—పరలోకమునుండి వచ్చెను. (పరలోకము+న్+ఉండి). 'ఉంచి' అనుదానికి గ్రాంథికభాషలోఁ బ్రయోగము లేదు. ఇది 'ఉండు' ధాతు ప్రేరణరూపముగానఁ బంచమ్యర్థమును సరిగాఁ దెల్పఁజాలదు" (కాల్డు. ౩౭౫-౩౭౬ పుటలు).

"తుళుభాషలో 'ఎడ్దు-డ్దు' అనునవి పంచమీ విభక్తి ప్రత్యయములు. ఇవి తృతీయావిభక్తిలో సైతము వాడఁబడును. తుదభాషలో 'ఎంద్=ఎద్ద్' అనునవి పై ప్రత్యయములకు సరియై యున్నవి .పయి ప్రత్యములు కన్నడము లోని 'ఇంద' అనుదాని కభిన్నములు" (కాల్డు. ౩౭౬ పుట).

విమర్శము:—'అత్తణిం' అనునది పటగన్నడ పంచమి. 'దెసెయింద' అనునది హాొసగన్నడ పంచమి. ఇవి పటగన్నడ తృతీయ యగు 'ఇమ్' ప్రత్యయమును సంబంధించినవె. పటగన్నడ తృతీయ యగు 'ఇమ్' ప్రత్యయము తమిళమందలి తృతీయా పంచమ్యర్థకమగు 'ఇన్' ప్రత్యయమున కభిన్నము. కన్నడ తృతీయ యగు 'ఇమ్' ప్రత్యయము భేదస్ఫూర్తికయి 'అత్తణ' (తత్ప్రదేశ సంబంధి) శబ్దపూర్వకమయి పంచమీ ప్రత్యయమయ్యెను. దీని యనుసరణ మునసో తెల్గులోని 'వలనన్' వర్ణక (వలను=(దిక్కు)+అన్=వలనన్) సంపర్కమునసో నవీన కన్నడమున 'దెసెయింద' (దెసె=దిక్కు) అను ప్రత్యయము రూఢమయ్యెను.

'అత్తణిం-దెసెయింద' అనువానికన్నఁ దఱచుగాఁ గన్నడమున 'ఇంద' ప్రత్యయము పంచమిగ వాడఁబడుచున్నదని కాల్డువెల్లుగారు వ్రాయుచున్నారు. హాొసగన్నడ వ్యాకరణమగు శబ్దాదర్శమునయందును నట్టివాడుక ప్రదర్శింపఁబడలేదు. 'ఇంద-తృతీయ; దెసెయింద-పంచమి' అని మాత్రమె శబ్దాదర్శ-౪౦ సూత్రమున నుపదేశింపఁబడెను. 'ఇల్లింద-అల్లింద' అనునవి నయిత మందుఁ జూపఁబడలేదు. ప్రాచీన భాషల సంబంధములను బరిశీలింపవలసిన యీ శాస్త్రమున నేటివాడుకలలోని యిట్టి యపభ్రంశముల నంతగాఁ బరిశీలింపవలసిన ప్రసక్తిలేదు. అధునాతన నానాగరక తమిళ వ్యవహారమున 'ఇల్‌నిన్ద్రు

(నిన్ను) ఇలిరున్దు' అనునవి తెల్గులోని 'ఉండి' శబ్దాను ప్రయోగచ్ఛాయ నేర్పడి యుండును. ఇట్టివి ప్రాచీన భాషలో లేవని యీావటకె వ్రాయఁబడెను. ప్రాచీన తమిటమున 'ఇన్' అనునదియుఁ బ్రాచీన కర్ణాటమున 'అత్తణిం' అను నదియు మాత్రమె హేతు, తారతమ్యనిర్ధార ణాపాదానార్థములను దెల్పు చున్నవి (చూడు రాూ I విమ).

తెల్గునందలి 'నన్' అనునది 'ఉ' దంతజడవాచకములపై నిల్చి తృతీయా సప్తమ్యర్థములను మాత్రము తెల్పును. ఇది పంచమ్యర్థము నెన్నఁడును దెల్పునది కాదు. కావున నిది తమిట కన్నడములలోని 'ఇన్-ఇమ్' అను వానికి సరియగునది యను దొరగారి వ్రాఁత పొరపాటు. 'ఇన్' ప్రత్యయ ముతో సరిపెట్టుటకయి దొరగారు 'ని' అనునది 'నన్' అనుదానికి రూపాంతర మనియు 'ఇ' కారము తర్వాత నిల్చు 'న' ప్రత్యయమనియు వ్రాయుట సత్య విదూరము. 'నన్-ని' అనువాని కెంతమాత్రమును సంబంధము లేదు. 'ని' అనునది తెల్గు ద్వితీయ యగు 'ను' అనుదాని రూపాంతరము. ఇకారము తర్వాత నిల్చునపుడు 'ను' అనునది 'ని' అనురూపమునందును. ఉదంత జడ వాచకైకవచనములపై నిల్చి 'నన్' అనునదియు నౌపవిభక్తికములపై నిల్చి 'అన్' అనునదియుఁ దద్భిన్నజడవాచకములపై నిల్చి 'ను-ని' అను ద్వితీయయుఁ దృతీయా సప్తమ్యర్థములను మాత్రము దెల్పును. అట్టి ద్వితీయ మాత్ర మరు దుగఁ బంచమ్యర్థమును సయితము తెల్పుట గలదు. (చూడు రాూ IV విమ).

తెల్గున 'నన్' ప్రత్యయము ఇకారాంతములపై నిల్చినపుడు 'ని' అను రూపమునందును" అనుట 'గగనారవిన్దం సురభి' అనుట వంటిది. 'నన్' ప్రత్యయ మికారము తర్వాత నెన్నఁడును నిల్వదు. 'నుండి-నుంచి' అనునవి పంచమీ ప్రత్యయములనుట కేవలము పొరపాటు. (చూడు రాూ V విమ). అవి స్వతంత్రముగాఁ బంచమ్యర్థము నిచ్చుననుట యపరిశీలన మూలకము. 'నుండి-నుంచి' అనువాని యాది నున్న నకారము 'నన్' ప్రత్యయ సంబంధి యను 'క్లే' దొరగారి యాశయము తప్పు. 'ఎందుండి యెందుఁబోవుచు' (మనుచరిత్రము). 'గంగయందుండి యొడ్డునకుఁ జేరెను' మున్నగు స్థలములందు నకారము లేకపోవచ్చును. ఉండ్యాదులు సప్తమ్యాదులపై నిల్చిన పదములు. అవి యపాదానార్థము నిచ్చును. 'మంచము నుండి' మున్నగునవి వ్యావహారి కాంధ్ర ప్రయోగములు. ఇట్టివి మహాకవుల వాడుకలలో నుండవు. 'ఉంచి' అనునది గ్రాంథికము కాదనియు నది పంచమ్యర్థమును సరిగఁ దెల్పఁజాల దనియు దొరగారు వ్రాయుట యపరిశీలన మూలకము. తే॥ గీ॥ కాంచి యమ్మంత్రి యెచ్చోటి నుంచి వచ్చె. (కృష్ణరాయ విజయము-ప్రాసప్రయోగము.

IV ఆశ్వా. ౨౯ ప.) (బాలకవి శరణ్యము ౧౯౪ పుట) (చూడు 'వ్యా. సం.' ౨౪౭ విమ).

౮౭. I విమ:—"షష్ఠీ విభక్తి:—ద్రావిడభాషలలో షష్ఠీ విభక్తి యనేక విధములగు ప్రత్యయములతో నేర్పడును. తుళుభాషలోని ప్రథమా విభక్తి ద్వితీయార్థమునువలె షష్ఠ్యర్థమును సైత మిచ్చును." (కాల్డు. ౨౮౯ పుట).

విమర్శము:—డా. కాల్డువెల్లుగారు వెనుక వివరించిన (౮౨ I మొ. ౮౩ X విమ.) విభక్తి పూర్వాగమములను సమాసాశ్రయ విధులనఁగాఁ గొన్ని సమాససంధి సూత్రములచే విధింపఁబడు సామాసికాగమములను శేషషష్ఠీ ప్రత్యయములనుగా భ్రమించి యీ షష్ఠీ విభక్తి సందర్భమును విపులీకరించుచున్నారు. అట్టి సమాసముల యెడల వెలయుచున్న శేష షష్ఠ్యర్థము సమాస శక్తి సిద్ధమనఁదగును. అట్టి సమాసపు పూర్వావయవము వ్యస్తమగు శేషషష్ఠ్యంతము కానేరదు.

౮౭. II విమ:—"సంక్షిప్తసార్వనామిక షష్ఠీవిభక్తి:—అఱవమునందు యుష్మ దస్మ చ్ఛబ్దముల ప్రాతిపదికమందలి దీర్ఘమునకు హ్రస్వమగుటచేత షష్ఠ్యర్థము వచ్చును. ఉదా:—నీ=(నీన్)=(నీవు). నిన్=(నీ యొక్క). 'నామ్'=(మేము). నమ్=(మా యొక్క). అఱవేతర ద్రావిడభాషలలో నట్లు హ్రస్వము వచ్చుటయేకాక దాని పయిని షష్ఠీ ప్రత్యయము సైతము నిల్చును. కన్నడమున నట్లె యున్నది. బెహిస్తను ఫలకములలోని శాసనములందలి (చూడు ౮ విమ). సిథియను భాషలందు సైతము యుష్మచ్ఛబ్ద (నీ) ప్రథమైక వచనము 'నీ' అను దీర్ఘముతోను షష్ఠ్యేక వచనము 'ని' అను హ్రస్వముతోను నఱవ కన్నడములందువలెనె యగపడుచున్నవి." (కాల్డు. ౨౮౯, ౨౮౭ పుటలు).

"ఇట్టి యుష్మ దస్మ చ్ఛబ్దముల షష్ఠీరూపములను సార్వనామిక విశేషణము లనఁదగును. విశేషణ సమాసములలోని పూర్వావయవ నామములం దిట్టి మార్పులె కొన్ని గల్గుచుండును. సంఖ్యా వాచకములందును నిట్లె గల్గును. ఉదా:—తమి–ఆఱు–అఱుబదు=(అఱువది). ఏఱు=(ఏడు)–(ఎఱుబదు=(డెబ్బది). ఇట్టి సంఖ్యావాచకరూపములలో హ్రస్వయుక్త రూపమె ప్రాచీన మనుట కవకాశము కలదు". (కాల్డు. ౨౮౭ పుట).

విమర్శము:—తమిళమందలి 'నామ్' అనునది యస్మచ్ఛబ్ద మాత్రము కాదు. అది యుష్మ దస్మ దుభయార్థకము. తమిళమున 'యాన్' అనునది యస్మదర్థకము. దీర్ఘమునకు వచ్చిన హ్రస్వాదేశమునకు షష్ఠ్యర్థము గల్గుననుట సరికాదు. అట్టి హ్రస్వము ద్వితీయాది విభక్తులెల్లం బరమగునపుడు గల్గు

మార్పులలో నొకటి. కొన్నిట 'అ' కారాగమమును గల్గును. ఉదా:—నిన్+అ+కు=నినక్కు (నీకు). మఱియుఁ దమిళమున షష్ఠీ ప్రత్యయము 'అదు' నిల్వ దనరాదు. అఱవమందును యుష్మ దస్మ దాత్మ (న్) శబ్దములకు షష్ఠి ప్రత్యయమగు 'అదు' అనునది నిల్చును. యుష్మ దస్మత్కార్యములు 'ఆత్మ (న్)' శబ్దమునకును గల్గును. యుష్మత్ప్రథమైక వచనము తమిళమున 'నీన్' కాదు. 'నీ' అనునదిమాత్రమె.

"తాన్ యాన్ ఎన్నుమ్......" (తొల్కా. ౧౯౩ సూ.) విభక్తి పరకత్వమున 'తాన్' అనునది 'తన్' అని యగును. 'యాన్' అనునది 'ఎన్' అని యగును. వీనికి విభక్తి పూర్వాగమములు రావు.

"నీ యెన్ ఒరు పెయర్......" (తొల్కా. ౨౫౪ సూ.)='నీ' శబ్దము 'క-చ-త-ప'లు పరమగునపుడు హ్రస్వమగును. నకారము చేరును. పరస్థ పరుషము ద్విత్వమునందదు. ఉదా:—నీకై=నిన్కై= (నీయొక్క చేయి). ఇట్టి సామాసిక రూపములె తమిళమున 'అదు' నిలువదను భ్రాంతిని దొరగారికిఁ గలిగించెను. విభక్తి పరకత్వమందును నీ కార్యము లుపలక్షణము లగును. ఉదా:—నీ+ఐ=నిన్నై=(నిన్ను) నీ+అదు=నినదు= (నీ యొక్క) నీ+కణ్=నిన్కణ్=(నీయందు). మొ.

"ఆఱన్ ఉరుపిన్......" (తొల్కా. ౧౧౬ సూ.)=ఆగమమగు 'అ' కారముగల శబ్దమునకుఁ బరమగు 'అదు' అను షష్ఠీ ప్రత్యయముయొక్క 'అ' కారము లోపించును.

"ఆఱన్ ఉరుపినుమ్......" (తొల్కా. ౧౬౨ సూ.)='అదు' అను షష్ఠీ ప్రత్యయమును 'కు' అను చతుర్థియుఁ (కకారాది సప్తమికిని నిది యుప లక్షణము) బరమగునపుడు 'అ' కారాగమ మగును. దానితోఁ గూడినట్టియు హ్రస్వీభూతస్వర పూర్వకమగునట్టియు హల్లు ద్విత్వము నందదు. ఉదా:—నిన్+అ+కు=నినక్కు. నిన్+అ+అదు=నిన్+అ+దు=నినదు. యాన్+అదు=ఎనదు. తాన్+అదు=తనదు. ఇట్లుగనె బహువచనరూపసాధన విషయమును 'తొల్కా. ౧౬౩-౧౮౯' సూత్రములను జూడనగును.

'అఱుబదు - ఎఱుబదు' అని యుదాహరించిన దొరగారి యుదాహరణములు తొల్కాప్పియ సమ్మతములుకావు. 'అఱుపంతు = (అఱువది) ఎఱుపంతు=(డెబ్బది)' అనునవి తొల్కాప్పియ సమ్మతములు.

"ఒన్బదుమూదల్ ఒన్పాన్......" (తొల్కా. ౪౩౭ సూ.)="ఏకాది నవపర్యంత తమిళ శబ్దములకు 'పత్తు' శబ్దము పరమగునపుడా 'పత్తు' శబ్దము

లోని మొదటి తకారము లోపించును. దాని చోట అయ్(త(ద)ము నిల్చును......".

"మూన్ఱు మాఱుమ్......" (తొల్కా. ౪౪౧ సూ.)=మూన్ఱు-ఆఱు శబ్దముల దీర్ఘము పత్తు శబ్దపరకత్వమున హ్రస్వ మగును. ఉదా:—ఆఱు+పత్తు=అఱుప్పఃతు=(అఱువది).

"అళవుమ్ నిఱైయుమ్......" (తొల్కా. ౩౯౦ సూ.)=ఏళ్ శబ్దము నకు సంఖ్యావాచకములు పరిమాణ వాచకములును బరమగునపుడు సమాస సంధిలో నయ్యది 'ఎఱు' అను రూపమునందును. ఉదా:—ఏళ్+పత్తు=ఎఱుపఃతు=(డెబ్బది).

౮౭. III విష:—"(౨) నపుంసక షష్ఠ్యాగమములు:—'అత్తు-అఱ్ఱు(త్రు) టి-తి' మున్నగు నపుంసకలింగ ప్రత్యయములు షష్ఠ్యర్థమున సఱవాంధ్ర భాష లలోఁ గన్పట్టుచున్నవి." (కాల్డు. ౨౮౭ పుట).

"షష్ఠీ ప్రత్యయము లన్నియు మొదట సప్తమీ ప్రత్యయములై యుండ వచ్చునని తలంచెదను. కాలక్రమమున నవి సంబంధ సామాన్యమును బోధించునవిగాను విశేషణార్థము నిచ్చునవిగాను మాఱినవి. పెక్కు చోట్ల నివి విభక్తి పూర్వాగమ స్థితిలోనికి మాఱినవి. డా. త్రుంపు దొరగా రుత్తర హిందూస్థాన భాషలయందును విభక్తి పూర్వాగమ షష్ఠీవిభక్తి సప్తమియే యై యుండెడిదని చెప్పిరి. 'అత్తు' అనునది నపుంసకముల యేకవచనమున వచ్చును. 'అఱ్ఱు(త్రు)' అనునది యరుదుగా నపుంసక సర్వనామ బహువచనమున వచ్చును. తెల్గులో 'టి' లేక 'తి' అనునది దీని రూపాంతరమె యని యీవఱకె నిరూపించితిని" (కాల్డు. ౨౮౭ పుట).

విమర్శము:—'అత్తు' మున్నగునవి విభక్తి పూర్వాగమములుగ నిల్చుననియు నపుడవి ప్రకృతికిని విభక్తి ప్రత్యయమునకును గల సంబంధమును మాత్రమె తెల్పుననియు నీవఱకు విపులముగా వివరింపఁబడెను. (చూడు ౮౨ I మొ. ౮౨ X విష). అట్టి స్థలములందలి 'అత్తు' మున్నగునవి షష్ఠీవిభక్తి ప్రత్యయములు కానేరవు గదా.

ఇంక షష్ఠీ తత్పురుషాది సమాసములలో సుబ్విభక్త్యాదులెల్ల లోపించి ప్రాతిపదికములు మాత్రము నిల్చుట వైయాకరణ సిద్ధాంతమై యున్నది. (చూడు 'వ్యా. సం.' ౨౬౮ I, ౨౭౦-౨౭౦ I విష). తొల్కాప్పియము నందును నీ సిద్ధాంతమె సూత్రింపఁబడెను.

"పిఱిదు పిఱిదు......" (తొల్కా. ౫౮౮ సూ.) = "సమాసవిభక్తి ప్రత్యయము ప్రయోగింపఁబడకుండుటయు సంప్రదాయమై యున్నది. ఉదా:—

నిలమ్ కడన్దాన్ =(క్రియా కారకసమాసము)=(నేలను దాఁటెను). (ఇట 'నిలత్తై క్కడన్దాన్=నిలనై క్కడన్దాన్' అనునవి సమాస విగ్రహములు.)..."

"అవత్తు (ట్టు) ళ్......" (తొల్కా. ౪౧౩ సూ.)=విభక్తిసమాసము విభక్తితో నున్నట్లె యర్థము నిచ్చును. ఉదా:—నిలమ్ కడన్దాన్=(నేలను దాఁటెను). ఇది క్రియాకారక సమాసము. తమిట కర్ణాట ప్రసిద్ధము. (తెల్గున నిట్టివి వ్యస్తము లందురు) ద్వితీయా తత్పురుషము. ఈ సమాసములో 'ఐ' అను ద్వితీయా ప్రత్యయమును దానితోపాటు దాని విభక్తి పూర్వాగమమును లోపించినవి. అనఁగా 'నిలత్తై' అనుదానిచోట 'నిలమ్' అను ప్రాతిపదికము మాత్రమె నిల్చినది. అచటి 'నిలత్తై' అను ద్వితీయ యర్థమును నచటి సమాసశక్తి బోధించును. ఇట్లు సమాసమున సుబ్విభక్తులేకాక మధ్యమ పదాదులును సంస్కృతాంధ్రాదులందువలెనె లోపించునని తొల్కాప్పియమున సూత్రింపఁబడెను.

"వేఱ్ఱు (ట్టు) మై ప్పొరుళై......" (తొల్కా. ౪౬౭ సూ.) = సమాస శక్తిచే విభక్తుల యర్థము బోధింపఁబడునట్లె సందర్భోచిత సమాస మధ్యపదముల యర్థమును బోధ్యమగును. ఉదా:—కుదిరై త్తేర్ = గుఱ్ఱమును బూంచిన రథము. ఈ సమాసములో ద్వితీయా విభక్తియేకాక 'పూంచిన' అను నుత్తర పదమును లోపించెను.

"లోపశ్చ విభక్త్యాదే । శ్శబ్దేషు స్యా త్సమాస కాఙ్గేషు". "ఉపమానోత్తరపదలోప రూపకాఖ్యాద్యాః" (వ్యా. సం. ౨౭౦ విష. చూడు) అని నన్నయయు సూత్రించెను.

పయి వైయాకరణ సిద్ధాంతము చొప్పున సమాస మధ్యమున షష్ఠీవిభక్తి ప్రత్యయముగాని దానివిభక్తి పూర్వాగమములగు 'అత్తు' ప్రభృతుల్గాని లోపింపక నిల్చియున్నవనుట పొసంగనేరదు. అట్టియెడల భాసించుచున్న షష్ఠ్యాది విభక్త్యర్థము లచటి షష్ఠీ సమాసశక్తిచే బోధింపఁబడుచున్న వనక తీరదు.

ఇంక సమాస మధ్యమున 'అత్తు' లున్నగునవి ప్రయోగములలోఁ గన్పట్టునపు డవి సమాసాశ్రయ విధి సిద్ధములని యంగీకరించుట వైయాకరణ హృదయము. అట్టియెడల సుబ్విభక్తులు లోపించినను వాని పూర్వాగమములు లోపింపవని చెప్పుట శబ్దచరిత్ర శాస్త్రపద్ధతికి సరిగ నుండును. నన్నయ పద్ధతి చాలవఱకీ రీతిదె యనవచ్చును. కాని తొల్కాప్పియరుగారు వానిని సమాసాశ్రయ విధి సిద్ధములనియె తలంచిరి.

"మగప్పెయర్ కిళ-శవి......" (తొల్కా. ౨౧౮ సూ.)=శిశువాచక మగ శబ్దమునకు 'క-చ-త-ప' లు పరమగునపుడు 'ఇన్' అనునాగమము వచ్చును. ఉదా:—మగవిన్ కై=(శిశువుయొక్క చేయి).

"అత్తవణ్ వరినుమ్......" (తొల్కా. ౨౨౦ సూ.)=వేఱ్ఱు (ట్టు) మై చ్చుందిలో ననఁగా విభక్తి సమాస సంధిలో మగశబ్దమునకు 'క-చ-త-ప' లు పరమగునపుడు 'అత్తు' అనునాగమము సైతము రావచ్చును. ఉదా:—మగ త్తుక్కై=(మగ+అత్తు+కై)=(శిశువుయొక్క చేయి).

'మగవినదు+కై=మగవిన్ కై' అను రీతిగల స్థలములందు 'అదు' అను షష్ఠీ విభక్తి ప్రత్యయము సామాసిక లోపమునందుటను గానక యచటి 'ఇన్' అనునది షష్ఠీ విభక్తి ప్రత్యయమనుకొనుట భ్రాంతిమూలకము. (చూడు రా౽ VI విష). ఇట్లీ ప్రకరణమున ననేకములగు సామాసికాగమములు గలవు గదా; వానినన్నిటిని షష్ఠీ ప్రత్యయములె యని దొరగారేల చెప్పలేదో. (చూడు రా౽ VI విష). దొరగారి కింకొక భ్రమ కలదు. 'అత్తు' అనునది నపుంసకముల యేకవచనమున వచ్చును. "'అఱ్ఱు=(త్తు)' అనునది నపుంసక ముల బహువచనమున వచ్చును" అని చెప్పియుఁ దెల్గులోని 'టి (లేక) తి' అను నది యీ 'అఱ్ఱు' అనుదానికి రూపాంతరమే యని వీరు చెప్పుట వీరి యీ విషయమునందలి తడఁబాటును విశదపఱుచుచున్నది. 'టి=తి' అనునదియు నేకవచనమునందు మాత్రమే వచ్చున దగుటచేత నిది 'అఱ్ఱు' (త్తు) అను దాని రూపాంతరమనుట కేవలము పొరపాటు. వీరు విభక్తి పూర్వాగమ వివరణ సందర్భమునను 'అత్తు=అఱ్ఱు' అనునవి యభిన్నములనుట నిశ్చయమని (రా౨ VI విష) వ్రాసిరి. విభక్తి పూర్వాగమ సందర్భమందే కాక సామాసికాగమ సందర్భమునందును, 'అత్తు=అఱ్ఱు=టి-తి' అనునవి యభిన్నములు కావు. 'అత్తు-టి-తి' అనునవి పరస్పర సంబంధము గలవి. 'అఱ్ఱు' అనునది 'అత్తు' అనుదానికిని 'టి-తి' అనువానికిని విజాతీయము. 'అత్తు-టి-తి' అనునవి యేకవచన స్థలములందు వచ్చును. 'అఱ్ఱు' అనునది బహువచన స్థలములందు మాత్రము వచ్చును. 'ఱ్ఱు' అనుదాని కాధునికమగు 'త్తు-త్రు' అను నుచ్చార ణమునందలి యాకార సామ్యము దొరగారి కిట్టి తడఁబాటును గల్గించుచున్నది. 'అఱ్ఱు' అనునది సామాసికాగమ స్థలములలోను బహువచన స్థలములందే విధింపఁబడుచుండును.

"చుట్టు ముదల్......" తొల్కా. ౨౮౨ సూ.)=ఐకారాంతము లగు నిర్దేశ సర్వనామరూపముల బహువచన రూపములకుఁ బరుష పరకత్వ మున 'అఱ్ఱు' ('ట్టు' వంటిది ప్రాచీనోచ్చారణము) ('త్తు' వ్యావహారికో

చ్చారణము) అను నాగమము వచ్చును. అవై+కోడు=అవైయట్టుక్కోడు=(వాటికొమ్ములు) ఇచటి 'యట్టు' అనునదియు షష్ఠీరూపమనియే దొరగారి భ్రాంతి. ఇది షష్ఠీ సమాసము. ఇందలి షష్ఠ్యర్థక తమిళ ప్రత్యయము లోపించినది.

పయి రీతిని 'అత్తు-ఇన్' మున్నగునవే కాక యనునాసికాగమ, పరపరుష ద్విత్వాదులును సామాసికాగమము లగుట తమిళ మలయాళములలో విస్తృతమై యున్నది.

"వేట్టు (ట్టు) మై క్కణ్ణుమ్......" (తొల్కా. ౨౧౭ సూ.)=తత్పురుష సమాస సంధియం దకారాంత శబ్దములకుఁ బరమగు 'క-చ-త-ప' లు ద్విరుక్తములగును. ఉదా:—ఇరువిళ + చాత్తన్ = ఇరువిళచ్చాత్తన్=(ఇరువిళ గ్రామముయొక్క నివాసియగు చాత్తనను వాఁడు). ('ఇరువిళవినదు+చాత్తన్' అని విగ్రహము).

"మరప్పెయర్ క్కిళవి......" (తొల్కా. ౨౧౮ సూ.)=అకారాంత వృక్షవాచక శబ్దములకు 'క-చ-త-ప' లు పరమగునపు డనునాసికాగమము (మకారాగమము) గల్గును.

"క చ త ప ముదలియ......" (తొల్కా. ౧౪౪ సూ.)=అచ్చునకుఁ గాని హల్లునకుఁగాని తర్వాతనున్న యనునాసికమునకు (మకారమునకు) 'క-చ-త-ప' పరకత్వమునఁ బరసవర్ణానునాసికాదేశ మగును. తత్తద్వర్గీయానునాసికముగా నిల్చునని యర్థము. ఉదా:—విళ+మ్+కోడు=('విళవినదు+కోడు' అని విగ్రహము)=విళఙ్కోడు=(వెలగచెట్టుయొక్క కొమ్మ).

ఇట్టి సమాసాశ్రయ విధులును వ్యస్తసంధి విధులును తొల్కాప్పియమున 'ఎళుత్తదికారము' నందలి VII, VIII, IX ప్రకరణములలో (౨౦౩ సూ. మొ. ౪౮౪ సూ. వ.) విరివిగా వివరింపఁబడెను. అందుఁ బరపరుష ద్విత్వవిధులు విపులముగాను ననునాసికాగమ విధు లంతకన్నఁ దక్కువగాను 'అత్తు' మున్నగు నాగమముల విధు లంతకన్నఁ దక్కువగాను వెలయుచున్నవి. అట్టి పరపరుష ద్విత్వములెల్ల ననునాసిక పరుష సంయోగాపరావతారములె యని గ్రహింపవలెను.

పయి సందర్భమునుబట్టి తమిళమందలి 'అత్తు' మున్నగునవి షష్ఠీ సప్తమీ విభక్తులు కావనియుఁ గొన్నియెడల సుబ్విభక్తి పూర్వాగమములనియు (చూడు ౦-౨ I మొ. ౦-౨ X విష) మఱికొన్నియెడల సమాసాశ్రయ విధి నిరూపిత సామాసికాగమము లనియుఁ (చూడు ౨౪ I మొ. ౨౪ VIII విష) దెలియ నగును.

నన్నయ భట్టారకుఁడు పై విషయమునఁ గొంత మార్పుగ సూత్రించెను. 'టి-తి' మున్నగునవి యౌపవిభక్తికము లనియుఁ గొన్ని జడవాచకములకు ద్వితీయాద్యేకవచన పరకత్వమున నయ్యవి వచ్చుననియు షష్ఠీ తత్పురుష సమాసమునందలి షష్ఠీవిభక్తి ద్వితీయావిభక్తిరూపమున నిల్చుచే తెలుచనియు సమాసములందలి ద్రుతము లోపించుననియు నిపుణముగా సూత్రించెను. సమాస విభక్తిలోపమును విధింపకుండుటచేతఁ దన్నిమిత్తక విభక్తి పూర్వాగమాది లోపమునకుఁ బ్రసక్తిలేదయ్యెను. "గంగయొక్క+ఒడ్డు=గంగన్+ఒడ్డు=గంగ+ఒడ్డు=గంగయొడ్డు" మున్నగు చోటులందు లోపించినది ద్వితీయా 'ను' ప్రత్యయమే యేమో యని తోఁచును గాని యది ద్వితీ యాభాసద్రుతము. ద్వితీయయే లోపించునన్నచో 'రాములయొద్ద' మున్నగుచోటులందలి 'లన్' అను ద్వితీయయు లోపింపవలసి వచ్చును గదా. నన్నయపద్ధతిలోని 'లన్' అనునది ద్వితీయా ప్రత్యయమే కాని సూరిమతమందువలె 'లట్టు' కాదు గదా.

"ఔపవిభక్తికసంజ్ఞా । వర్ణా ష్టింట్యాదయో భవ స్తీహ । రు ల్యాదేర్నామ్నాం స్యు । స్తే హి విభక్తౌ సమాసేచ" (చూడు 'వ్యా. సం.' ౨౨౭ మొ. ౨౩౩ విష).

"షష్ఠీ భవే ద్ద్వితీయా । తుల్యా తర్పురుష సంస్థితా నామ్నామ్" ('వ్యా. సం.' ౨౭౦ విష). "ద్రుతస్య సర్వత్ర లుక్ సమాసేషు" (ఆం. చిం. 'వ్యా. సం.' ౮౭-౯౦ విష).

పై సందర్భమునుబట్టి "ఏటియొక్క+నీరు=ఏటిన్+నీరు=ఏటినీరు" మున్నగు స్థలములందలి 'టి' మున్నగునవి విభక్తి పూర్వాగమ మాత్రములె కాని షష్ఠీ ప్రత్యయములు కావనుటకు సందేహము లేదు గదా.

బాలవ్యాకరణపక్షమున 'ఏటియొక్క+నీరు' అనుచో "సమాసవిభక్తికి లోపంబగు-లట్టునకుఁ గాదు" (బాల. సమా. ౨౫ సూ.) అను చొప్పున యొక్క-విభక్తికి మాత్రము లోపము రాఁగా సిద్ధించు 'ఏటినీరు' మున్నగుచోటులందలి 'టి' అనునది యౌపవిభక్తిక రూపమేకాని షష్ఠీ ప్రత్యయము కానేరదు గదా. అచట యొక్క- షష్ఠి లోపించినది. దాని యర్థ మచటి సమాసశక్తిచే లభించును గాన నచటి 'టి' వర్ణకము షష్ఠ్యర్థకము కానేరదు. 'ఏటియొక్క' అను నర్థముగల 'ఏటి' అనుదాని వ్యస్తప్రయోగము తెలుఁగున నేఁతమాత్రమును లేదు.

తెలుఁగులోని 'టి - తి' అనునవి తమిళమందలి 'అఱ్ఱు=(త్తు)' అను దాని రూపాంతరములనెడి దొరగారి వ్రాఁత కేవలము భ్రాంతిమూలకము. 'అన్నిటి' మున్నగువానిలోని 'టి - తి' అనునవి తమిళమందలి 'అత్తు' మున్నగు

వానిని సంబంధించునవి. తెలుఁగులోని వాటిని మున్నగునవి తమిళమందలి అవత్తై=(త్తై-ఇది ప్రాచీన తమిళోచ్చారణము) మున్నగువాని కభిన్నములు. 'అవత్తై' అనుదాని నేఁటి తమిళోచ్చారణము 'అవత్రై' అనునది. కాన 'అత్రు' అనుదాని రూపాంతరమె 'టి-తి' అనునది యనెడి వ్రాఁత పొసఁగనేరదు. ఈ రెండును గేవలము విజాతీయములు. 'అత్తు-టి-తి' అనునవి యేకవచన ప్రత్యయములు. 'అట్రు=(అత్రు)' అనునది బహువచన ప్రత్యయము. (చూడు ౮౨ VI విష). 'అట్రు' అనెడుదాని యుచ్చారణమున రేఫోచ్చారణము సాధువుకాదని యిూవఱకె విశదీకరించి యున్నాను (చూడు ౧౭ XIII విష).

౮౭. IV విష:—" 'అత్తు-అత్రు-టి-తి' మున్నగునవి పూర్వము సప్తమీ ప్రత్యయములుగా నుండెడివి. కాలక్రమమున షష్ఠ్యర్థకములై విశేషణార్థమును బోధించునవయ్యెను. షష్ఠీ-సప్తమీ-విశేషణార్థములు మూఁడింటికిని ద్రావిడ భాషలలోనే కాక పెక్కు భాషలలో భేదము లేదు. ఉదా:—కుళత్తుమీన్= (షష్ఠి=కొలనియొక్క చేఁప. విశేషణ—కొలని సంబంధించు చేఁప. సప్తమి—కొలని యందలిచేఁప). 'అత్తు' అనునది తమిళ మలయాళముల సప్తమ్యర్థమున సైతము వాఁడఁబడును. దీనికి సరియగు ప్రత్యయములును '(టి=తి.)' తెల్గున నిల్చి యున్నవి."

"ఇది క్రియతో నన్వయించునపుడె సప్తమ్యర్థకము. నామముతో నన్వయించునపుడు షష్ఠీ ప్రత్యయము". (కాల్డు. ౨౮౮ పుట).

"మాక్సు ముల్లరు దొరగారు విశేషణార్థమునుండి షష్ఠ్యర్థము వచ్చును గాని షష్ఠ్యర్థమునుండి విశేషణార్థము రానేరదని తలంచినట్లున్నది (చూడు వారి గ్రంథము ౧౧౦ పుట)." (కాల్డు. ౨౮౮ పుట).

"'అత్తు' అను ప్రత్యయమునకును 'అదు' అను నపుంసక సర్వనామమున కును సంబంధము గలదని యిూవఱకె చెప్పఁబడెను. (చూడు ౮౨ VI విష.) —(చూడు ౮౨ V విష.) 'అదు' అను తమిళ షష్ఠీ ప్రత్యయమును గలదు. ఉదా:—మరత్తు కొంప్పు=మరత్తినదు కొంప్పు=(చెట్టుయొక్క శాఖ). (మరత్తిన్+ అదు). 'అదు' అను షష్ఠీ ప్రత్యయము 'మరదు' అనురీతిని ప్రాతిపదికముపై నిల్చుటయుఁ (విభక్తి పూర్వాగమము లేకయే) గలదు. ఉదా:—వాళైయదు పఴమ్=వాళైయినదు పఴమ్=(అరటిపండు)." (కాల్డు. ౨౮౮ పుట).

'అదు=అత్తు' అనునవి యభిన్నములు. 'మరమ్' అను దానిలోని 'అమ్' అనునది ప్రత్యయము. 'మర' అనునది ప్రకృతి. కన్నడమున 'మర' అనియే యున్నది. కన్న-మరద=(చెట్టుయొక్క). 'మర' అను దానికి 'అదు'

అను తమిఌ షష్ఠీ ప్రత్యయము చేరఁగా 'మరదు' అగును. ఇందలి 'దు' అను దానికి ద్విత్వము రాఁగా 'మరత్తు' అగును. (ద్విత్వావస్థలో సరళము పరుషమగునని భావము). అఱవ వాడుకలలో 'అదు=అతు' అనుచోట 'అత్తు' అనునది తఱుచుగాఁ గన్పట్టుచున్నది. ఉదా:—నినదు=నినత్తు=(నీయొక్క).

"తెల్గున 'టి-తి' అనునవి షష్ఠ్యర్థకములుగాఁ దఱచుగఁ గన్పట్టుచున్నవి. దీనికి 'యొక్క' అనునది చేర్పఁబడును. దానిని జేర్పనక్కఱ లేదనవచ్చును. 'టి - తి' అను వానికిని 'అది' అను సర్వనామమునకును సంబంధము చూపట్టు చున్నది. తెల్గున నామవాచకములకును సర్వనామములకును షష్ఠ్యర్థమున 'అది' అనునది చేరును. ఉదా:—వారిది=(వారి+అది=ది) వీనికి సమానము లగు 'అద్-అర్' అను కన్నడ ప్రత్యయములకు విభక్తి పూర్వాగమములుగఁ బ్రయోగ మున్నను షష్ఠ్యర్థకత్వము కనఁబడదు. ఉదా:—మరద=(చెట్టు యొక్క) (మర+అద్+అ) గురువిన=(గురువుయొక్క) (గురు+వ్+ఇన్+అ). అవర=(వారియొక్క) (అవ+అర్+అ). పై వానిలోని తుది 'అ' ప్రత్యయము షష్ఠ్యర్థకము. 'అద్-అర్-ఇన్' అనునవి నిరర్థకములు" (కాల్డు. ౨౭౮-౨౭౯ పుటలు).

విమర్శము:—'అట్టు' అనుదాని ప్రాచీనోచ్చారణము 'అట్టు' అను దాని వంటిది. నేఁటి వ్యావహారికోచ్చారణము 'అత్తు' అనునది. 'అత్తు-అట్టు-టి-తి' అనునవి విభక్తి ప్రత్యయము లెన్నఁడును గానేరవు. అవి విభక్తి పూర్వాగమములు కావచ్చును. 'అట్టు-అత్తు' అనునవి తమిఌమున సామాసికాగమములును గావచ్చును. (చూడు ౨౭ III విమ.) ఇట్టి స్థితిలో నియ్యవి షష్ఠ్యర్థకములనియు సప్తమ్యర్థకములనియు దొరగారు వ్రాయుట కేవలము నసంభవము.

'అత్తు' అనునది 'అదు' శబ్ద మూలకమని సాధించుటకు దొరగారు చాల చిక్కుపడిరి. మరదు మున్నగు రీతిని విభక్తి పూర్వాగమము లేకయే 'అదు' అను షష్ఠీ ప్రత్యయము చేరుట తొల్కాప్పియ సమ్మతము కాదు. అట్టి యపమార్గమునఁ బోనేల? 'అంతు' అను సర్వనామమునుండి 'అత్తు' అనునది యేర్పడెననుట యుక్తము. (చూడు ౧౭ IV విమ. ఆయ్‌తోఁ (దో) చ్చారణము). (చూడు ౨౨ VI విమ.) తెలుఁగునందలి 'టి-తి' అనునవి షష్ఠ్యర్థకము లెన్నఁడును గానేరవు. అవి యాపవిభక్తికములనఁగా విభక్తి పూర్వాగమములు. ఏటి నీరు మున్నగు చోటులందలి షష్ఠ్యర్థ మచటి సమాసశక్తిచే సిద్ధించును. 'అదర-గురువిన-అవర' మున్నగు చోటులలోని విభక్తి పూర్వాంగమములగు 'అద్-అర్-ఇన్' అనునవి నిరర్థకములనుట సరికాదు. తక్కిన

విభక్తి పూర్వాగమముల వంటి సార్థక్యము వానికిని గలదు. ప్రకృతికిని విభక్తి ప్రత్యయమునకును గల సంబంధమును దెల్పుట విభక్తి పూర్వాగమముల ప్రయోజనము. (చూడు ౮-౨ I, II విష).

౮-౭. V విష:—"(3) నపుంసక తచ్ఛబ్ద రూప షష్ఠి:—అదు శబ్దమును దాని రూపాంతరమగు 'ఆదు' శబ్దమును నఱవ గ్రంథములలో షష్ఠ్యర్థమున వాడఁబడెను. అఱవ వ్యాకర్తలు దానిని షష్ఠీ ప్రత్యయ మనిరి. ఉదా:— అవన్=(వాడు)+అదు=అవనదు=(వానియొక్క)" (కాల్డు. ౨౮౯ పుట).

"నామమునకుఁగాని సర్వనామమునకుఁగాని తచ్ఛబ్దార్థమును జేర్చునపు డది సంబంధార్థక మగును. 'అదు' తోఁజేరిన నామవాచకము సైతము క్రియకుఁ గర్త కావచ్చును. ఉదా:—సంబంధార్థకత్వమునకు:—ఎనదు కై=(నా సంబంధ మగు చేయి=నాయొక్క చేయి) కర్తృత్వమునకు:—ఎనదు పోయిట్రు (ట్టు)= (నాది పోయినది). అదు శబ్దాంత మేకవచనముతోనె యన్వయించును. ఉదా:—ఎనదు కై=(నాయొక్క చేయి) 'ఎనదు కైగళ్'=(నాయొక్క చేతులు) అనరాదు. వ్యావహారిక భాషలో నిట్టి నియమము నిల్వనేరదు." (కాల్డు. ౨౯౦ పుట).

"నాగరక వ్యవహారమున 'ఎనదు కైగళ్' అనుటకు మాఱుగ 'ఎన్కైగళ్' అందురు. మలయాళమునఁ బ్రాచీన భాషలో మాత్రమె 'అదు' ప్రత్యయము షష్ఠిగా నగపడును. మల-"తన్ద్రై=(అఱ:—తనదు). (తన్ట్రె?) ఎన్ద్రై=(అఱ-ఎనదు) (ఎన్ట్రె?)" అను పదములలో మాత్రమె 'అదు' ప్రత్యయచ్ఛాయ చూపట్టుచున్నది. ప్రాచీన కన్నడమున 'ఎన్నదు'=(నాయొక్క), 'నిన్నదు'= (నీయొక్క) అను రూపములున్నవి. వీనికి 'నినతు-నినత్తు' అను రూపాంతర ములు గలవు" (కాల్డు. ౨౯౦-౨౯౧ పుటలు).

"తెల్గునందును నిట్లె తచ్ఛబ్ద నపుంసక రూపము శేషషష్ఠియై యున్నది. ఉదా:—నా+అది=నాది. ఈ రూపము తమిళమున 'ఎనదు' అనుదానికి సరిపడును. తెల్గున బహువచనమున సైత మిట్టి ప్రత్యయము గలదు. ఉదా:— నా+అవి=నావి=(నా సంబంధమైనవి). ఈ 'ది-వి' ప్రత్యయాంతముల కఱవ మందువలె విశేషణములవంటి స్థితి యనఁగా విశేష్యపూర్వ వృత్తిత్వము లేమిం జేసి శేషషష్ఠీత్వ వ్యవహారము లేదు. తమిళ కన్నడములలోఁ బుం స్త్రీ నపుం సక తచ్ఛబ్దాంతములు మూఁడును విశేషణములుగా విశేష్య పూర్వవృత్తులై వాడఁబడును. తుద భాషలో 'అద్' ప్రత్యయము చేర్చుటచేత నామవాచకము విశేషణ మగుచుండును. శేషషష్ఠీ ప్రత్యయము లోపించిన రూపముపైని దచ్ఛబ్దము నిల్చుట ద్రావిడభాషా సంప్రదాయము. (ఉదా:—తెల్గు-నా

యొక్క=నా+అది=నాది. నా వాఁడు-మొ.) 'అత్తు-ఇన్' అను విభక్తి పూర్వాగమముల మీఁద సయితము తచ్ఛబ్దము నిల్చుట తమిళమునఁ గలదు. ఉదా:—మరత్తినదు కొప్పు=(చెట్టు కొమ్మ.)" (కాల్డు. ౨౯౧ పుట).

విమర్శము:—తొల్కాప్పియమున 'అ-ఇ-ఉ' అనువానికి దీర్ఘరూపములును గలవని చెప్పఁబడెను గాని 'అదు' అనునది షష్ఠీ ప్రత్యయముగఁ జెప్పఁబడలేదు. (చూడు ౮౧ I విష.) నన్నూలునఁ గలదు. "నీడవరుదల్......" (తొల్కా. ౨౦౯ సూ.)—'అ' శబ్దము 'ఆ' శబ్దముగాను తమిళ పద్యకావ్యములందుఁ గలదు. ఉదా:—ఆ+ఇడై=ఆయిడై=(ఆ చోటను). ఈ దీర్ఘ రూపముల మీఁద సంహితా వ్యవధాయకముగ యకారమె నిల్చును. పరుష పరకత్వమున నిట్టి దీర్ఘరూపము లేదు. అపుడు పరుష ద్విత్వమె గల్గును. ఉదా:—'అ+చాత్తన్=అచ్చాత్తన్' అనియే యుండును. 'ఆచాత్తన్' అను రూప ముండదు. (చూడు 23 II విష).

ప్రాచీన కన్నడ షష్ఠ్యంతములు "ఎన్న=(నా యొక్క) నిన్న=(నీ యొక్క)" అనునవి. 'ఎన్నదు' అనునది 'ఎన్న+అదు' అను రీతిని 'నిన్నదు' అనునది 'నిన్న+అదు' అను రీతిని నేర్పడిన వగుటంజేసి 'ఎన్నదు' అనుదానికి 'నాయది' అనునదియు, 'నిన్నదు' అనుదానికి 'నీయది' అనునదియు నర్థములు. 'నినతు-నినత్తు' అనునవి 'నిన్నదు' అనుదానికి సమాన రూపములని తోఁచును. ఈ విషయమున శబ్దమణి దర్పణమునకును (చూడు ౧౬౭ లక్షణము) గర్ణాట భాషా భూషణమునకును (చూడు ౨౬౫ సూ.) నభిప్రాయ భేదము గలదు. విస్తర భీతి నాచర్చ యిటఁ జూపఁబడలేదు.

తెల్గున 'నాది=నాయది' అనురీతిగల రూపములు షష్ఠ్యంతములు కావు. అవి సంస్కృత 'మదీయ' అనుదాని యర్థముగలవి. కాన నవి తమిళమందలి 'ఎనదు' మున్నగు వానికిఁ గాని కన్నడమందలి 'ఎన్న' మున్నగువానికిఁ గాని సరియగు రూపములు గావు. ఇంకఁ దమిళ కన్నడములందలి 'ఎన్నదు' మున్నగు వానికి సరియగు రూపము లనఁదగును. తెల్గున 'నాయొక్క' అను నర్థముగల వ్యస్త రూపము 'నాదు' అనునది గలదు. ఇట్లె 'నీదు-తనదు' అనునవియును. సమాసమున 'నా పుస్తకము' అనురీతి నుండును. 'నీ-నా-తా' శబ్దములు తప్పఁ దక్కినవెల్ల 'ది-వి' ప్రత్యయాంతములై శేష షష్ఠ్యర్థము గలవై యున్నవి. తెల్గున నిట్టివి లేవను దొరగారి వ్రాఁత సరికాదు.

"దిః స్యాత్ సంబన్ధార్థే। సర్వస్మా ద్వ్యష్ట దస్య దాత్మభ్యః। ద్వితి వర్ణకః (దు+ఇతి)." (ఆం. చిం.) (చూడు 'వ్యా. సం.' ౨౫౧ I విష).

"ఏకత్వేచ బహుత్వేచ। సంబన్ధే 'ది-వి' వర్ణకౌ" (వికృతి) (చూడు 'వ్యా. సం.' ౨౫౧ I విష).

శేషషష్ఠీ రూపములు గాఁబట్టియు దానికి సన్నిహితములగు నట్టియు 'నాయది=నాది' 'వానియది=వానిది' మున్నగు రూపములు 'శబ్దాత్తచ్ఛబ్దాతః' (ఆం. చి. చూడు 'వ్యా. సం.' ౧౦౭-౨౭౧ విష). అను చింతామణి సూత్ర లక్ష్యములు.

'ది-వి' అను శేషషష్ఠీ ప్రత్యయాంతములకు విశేష్య పూర్వ వృత్తిత్వము లేదను దొరగారి వ్రాఁత యపరిశీలన మూలకము. రూపసామ్యము దొరగారి నిట్లు భ్రమింపఁజేసినది. ఉదా:—ఈ పుస్తకము దానిది. దానిది పుస్తకము=దానియొక్క పుస్తకము. నాదు పుస్తకము=నాయొక్క పుస్తకము.

చ......దా। నిది కలరూ పెఱింగి యవనీపతి (ఆది. ౪ ఆ. 30 ప). (దానిది=ఆ శకుంతలయొక్క).

సీ. వారివ ధమ్మిల్ల భారావకలితది, వ్యామోద నవపుష్ప దామములు......(ఆది. 3 ఆ. ౧౫౬ ప). (వారివ=వారియొక్క).

చ......నీ హృదయము నాదు చొచ్చుటకు నెంతయు రోసితి...... (శాంతి. ౬ ఆ. ౨౦౨).

మధ్యాక్కర......। నీదు మనోరథము......(ఆది. ౮ ఆ. ౧33).

తెల్గునందలి 'యొక్క' విభక్తికిఁ బ్రాచీన భాషలో లోపము గల్గును.

ఉ. ఇమ్ముగ సర్వలోక జను లెవ్వని యేని ముఖామృతాంశుబిం। బమ్మున......(ఆది. ౧ ఆ. 22 ప).

క॥ నెమ్మిని ధర్మజు నలువురు। తమ్ములు......(సభా. ౨ ఆ. ౨౬౧ ప).

'మరత్తు+కొప్పు' అను సమాసపు సంధిలో 'మరత్తినదుకొప్పు' అను దొరగా రుదాహరించిన రూపము తొల్కాప్పియ సాధ్యముకాదు. అట్టి యర్వాచీనము నరుదునగు రూపమును వ్యాఖ్యాత యంగీకరించెను. 'మరక్కొప్పు' అనునది తొల్కాప్పియ సమ్మత రూపము.

"మకర విఱుది......" (తొల్కా. 3౧౧ సూ.)=విభక్తి సమాస సంధిలో మకారాంతములకుఁ బరమగు పరుషము ద్విరుక్తమగును. ఉదా:— మరమ్+కోడు=మరక్కోడు=(చెట్టు యొక్క కొమ్మ).

"మఃంకాన్ పుళ్ళి......" (తొల్కా. ౧౮౬ సూ.)=మకారాంత శబ్దములకు విభక్తి పరమగునపుడు 'అత్తు' అను నాగమము వచ్చును. ౧౩౪ సూ. చొప్పున 'మ' కార లోపము. ౧౨౬ సూ. చొప్పున 'అత్తు' లోని 'అ' కారమునకు లోపము. ఉదా:—మరమ్+అదు=మరత్తదు=(వృక్షము యొక్క) 'అదు' అనునది పదమే కాని ప్రత్యయము కాదను దొరగారి యాశయము ముందు విమర్శింపఁబడును. (చూడు ౪౭ VI విష).

౪౭. VI విష:—"(౪) 'ఇన్' అనెడి శేష షష్ఠీ ప్రత్యయము:— అఱవ మండలి 'ఇన్' ప్రత్యయమును తెలుఁగులోని 'ని' ప్రత్యయమును వీనికి సరియగు భాషాంతర ప్రత్యయములును విభక్తి పూర్వాగమములై యుండుటేకాక, శేష షష్ఠీ ప్రత్యయములును, విశేషణతా ఘటకములును నై యున్నవి. ఈ రెండు ప్రత్యయములును మొదట సప్తమీ ప్రత్యయములై యుండెడివని నా యభిప్రాయము. అర్థవిశేషబోధక సప్తమి సంబంధ సామాన్యార్థక షష్ఠిగా మాఱును గాని విపరీతస్థితి గల్గనేరదని మాక్సు ముల్లరుగారు చెప్పిరి. అఱవ వ్యాకర్తలు 'ఇన్' అను దానిని షష్ఠీ ప్రత్యయముగ గణింపలేదు గాని దానిని విశేషణములకు వచ్చు నాగమమనుగా నెన్నిరి" (కాల్డు. ౨౯౧ పుట).

"అఱవ భాషలోని షష్ఠీ ప్రత్యయములలో 'ఇన్' అను దానికి వాడుక యధికమై యున్నది. ఇది లింగములు మూటియందును వచన ద్వయము నందును వచ్చును. మలయాళమందును దీని కిట్టి వాడుకయే కలదు. కన్నడమున 'ఇన్' అనునది విభక్తి పూర్వాగమముగ నున్నది గాని విభక్తి ప్రత్యయముగ లేదు. కొన్ని శబ్దములకు 'ఇన' అను షష్ఠీ ప్రత్యయము వచ్చునని కన్నడ వ్యాకర్తలు చెప్పిరి. కాని దాని చివర నున్న 'అ' అనునది కన్నడ షష్ఠీ ప్రత్యయము. కన్నడమున నీ 'అ' ప్రత్యయమునకుఁ బూర్వముగ 'ఇన్-అద్-అర్-(అఱ్)-వ్' అను నాగమములు వచ్చును. (షష్ఠికె యననేల? విభక్తుల కెల్ల నివియు మఱికొన్నియు విభక్తి పూర్వాగమములు. ఉదా:—గురువినిం=గురువుచేత. మూఱఱిం=మూటిచేత. (అర్ కాదు-అఱ్). దానదిం=దానముచేత. ఒర్వరిం=ఒకరిచేత). తెల్గున 'ని-న' షష్ఠ్యేక వచనమున వచ్చును. (షష్ఠియందే యన నేల? రామునిచేత-మొ). తెలుఁగును మిక్కిలిగఁ బోలెడి 'కు' భాషలో 'ని' అనునది తమిఱుమండలి 'ఇన్' ప్రత్యయము వలెనె వచన ద్వయమునను విభక్తి పూర్వాగమమై యున్నది. గోండు భాషలలో 'న-నా-ద-ఆ' అనునవి షష్ఠీ ప్రత్యయములు. ఇవి బ్రహూయి భాషలోని 'నా' అను దానితోను తెల్గులోని 'ని' అను దానితోను తమిఱుమండలి 'ఇన్' అను దానితోను సంబంధించును" (కాల్డు. ౨౯౨ పుట).

"తమిళ వ్యాకర్తలు 'ఇన్' అను దానిని షష్ఠిగాఁ జెప్పుచున్నను వారిచేఁ జెప్పఁబడిన షష్ఠీ ప్రత్యయములకు ముందు 'ఇన్' అనునది నిల్చును. ఉదా:— 'అదు+ఉడైయ=అదినుడైయ=(దాని యొక్క). తమ్బి+అదు = తమ్బియి నదు=(తమ్ముని యొక్క). ఈ యుదాహృతులలోనివి సంబంధార్థక మాత్ర పదములె యగుటచేత 'ఇన్' అనునదె ముఖ్యమైన షష్ఠీ ప్రత్యయ మని స్పష్ట పడుచున్నది. ఉదా:—కల్లినిడత్తిల్=(జాతియొక్క స్థానమందు=జాతిలో) ఇందలి 'ఇడత్తిల్' అను దానికి దాని పదత్వావస్థయందు స్థానమని యర్థము. కాన నచటి రెండు పదములకు సంబంధార్థకమగు 'ఇన్' ప్రత్యయ మపేక్షిత మగుచున్నది." (కాల్డు. ౨౯౨-౨౯3 పుటలు).

"'ఇన్' అను దానికి విశేషణ పదార్థము ప్రాచీనము కాకున్నను నటివ వ్యాకర్తలు దానికి విశేషణార్థము గలదని యుదాహరింతురు. ఉదా:—పొన్+ఇన్+కుడమ్=పొన్నిన్ కుడమ్=(బంగారు చెంబు). ఈ విశేషణార్థము షష్ఠ్యర్థమును బట్టి వచ్చినదె. 'ఇన్' ప్రత్యయమును బోలునట్టి 'అమ్' ప్రత్యయము మఱొకటి కలదు. దీని రూపాంతరము 'అన్' అనెడిది. ఉదా:—ఆలమ్ పూ=(మఱ్ఱిపూవు). ఆఱ్ఱు (త్ర) ఙ్కరై=(నదియొడ్డు). మలయాళమందును గలదు. ఉదా:—మలమ్ పులి=(కొండ పులి). పై యుదాహృతుల లోనిది 'అమ్' ప్రత్యయమె; 'అన్' ప్రత్యయము కాదు. ఉదా:—అదన్+కు=అదఱ్కు.

'అమ్-అన్' అనునవి రెండును నామవాచక నిష్పాదక ప్రత్యయములు. (చూడు ౮౧ II విష. ౮౩ I విష). అవి విభక్తి ప్రత్యయములు కావు. విభక్తి పూర్వాగమములును గావు. 'అమ్-అన్' అనునవి నామనిష్పాదక ప్రత్యయములె యైనను 'అమ్' అనునది మాత్రము షష్ఠీ ప్రత్యయముగాను విశేషణ ప్రత్యయముగాను వాడఁబడుచున్నది. ఈ రెండును వ్యుత్పత్తిలో భిన్నములు గావు. ఇట్లె తమిళమందలి 'ఇన్' ప్రత్యయమును గన్నడమందలి 'ఇమ్' ప్రత్యయమును భిన్నములు గావు. 'అమ్-అన్' అనునవి తచ్ఛబ్దార్థక సర్వనామములని తలంచెదను. 'ఇన్-ఇమ్' అనునవి 'ఇల్' శబ్ద భవములును నట్లగుటనే సప్తమీ ప్రత్యయములు నైయున్నవి" (కాల్డు. ౨౯3-౨౯౪ పుటలు).

కాల్డు. ౨౯౪ మొ. ౨౯౬ వ. పుటలలో నిండో యూరపియను భాష లందును సిథియను భాషలందును దార్తారు భాషలందును గల షష్ఠీ ప్రత్యయములలోను విశేషణ ప్రత్యయములలోను ద్రావిడ భాషలలో వలెనె 'న' కారము గలదని చూపఁబడెను. అనావశ్యకమగుటచే విస్తరభీతి నదియెల్ల వ్రాయ లేదు.

విమర్శము:—డా. కాల్డువెల్లుగారు వారి యెప్పటి సిద్ధాంతము చొప్పున 'అత్తు' మున్నగువాని సందర్భమునందువలెనె (చూడు ౮౭ III విష.) యీ

'ఇన్' ప్రత్యయ విషయమునందును, సామాసికాగమమగు 'ఇన్' ప్రత్యయమును విభక్తి ప్రత్యయముగా వ్రాయసాగిరి.

'ఇన్' ప్రత్యయమునకును షష్ఠ్యర్థము గలదని వీరు చూపిన యుదాహృతులెల్ల షష్ఠీ సమాస స్థలములె. సమాసమునందు విభక్తులును దన్నిమిత్తక విభక్తి పూర్వాగమములును లోపించుననెడి ప్రయోగముల చొప్పునను (నిల కూడన్దాన్=నిలత్తై క్కుడన్దాన్. మొ.) దన్మూలక వైయాకరణ సిద్ధాంతము చొప్పునను (చూడు రాజ III విష.) నట్టివి లోపింపఁగా నట్టి సమాసమధ్యమున 'ఇన్' (అత్తు) మున్నగునవి గన్పట్టు ప్రయోగములందెల్ల, నట్టివానిని సామాసికాగమములనుగా వైయాకరణులు విధించుచు వచ్చిరి. అట్టి సమాసములతో షష్ఠ్యాది ప్రత్యయములు లోపింపవని యెవ్వరును జెప్పసాహసింపలేరు గదా (చూడు రాజ III విష). అట్టి స్థితిలో నచటి సామాసికాగమమును షష్ఠీ ప్రత్యయమని యెట్లు చెప్పనగును? 'మగవినదు+కై' (శిశువుయొక్క-చేయి) అనురీతిగల స్థలములలో 'ఇన్' అనుదానికి లేని షష్ఠీ ప్రత్యయత్వము దాని లుప్తషష్ఠీక సమాసమున (మగవిన్కై=శిశువుచేయి) నెట్లు లభించును? అట్లె పయిరీతిగల సమాసపు విగ్రహావస్థలో (మగవినదు+కై) 'ఇన్' అనుదానికిఁ గల విభక్తి పూర్వాగమత్వము మాసిపోయి యెట్లు దానికి షష్ఠీ ప్రత్యయత్వము ఘటిల్లును? మఱియు 'మగవిన్కై' అనుదానికె 'మగత్తుక్కై' అను రూపాంతరము గలదు. 'మగత్తుక్కై' అనుదాని వ్యస్త విగ్రహము 'మగవినదు+కై' అని యుండును. 'మగవిన్కై=మగత్తుక్కై' అనునవి సామాసిక రూపములు. 'మగత్తు' అని కాని 'మగత్తదు' అనికాని 'శిశువుయొక్క' అను వ్యస్తరూపములు తమిళమున లేనేలేవు. సమాసమందు మాత్రమె 'ఇన్' అనుదానికి మాఱుగా 'అత్తు' అను సామాసికాగమము వైకల్పికముగ వచ్చును. అట్టి స్థితిలో 'అత్తు' అనుదానికి షష్ఠీ ప్రత్యయత్వ మెట్లు ఘటిల్లును? పయి విషయములను దెల్పు తొల్కాప్పియ సూత్రములు:—

"అ ఆ ఉ ఊ ఏ ఔ......" (తొల్కా. ౧౭౪ సూ.)="అ ఆ ఉ ఊ ఏ ఔ" అను నచ్చులు తుదినిగల శబ్దములకుఁ బరముగ విభక్తి పరకత్వమున 'ఇన్' అనునాగమము వచ్చును. ఉదా:—విళ+ఐ=విళవినై=(వెలగచెట్టును. మగ+అదు=మగవినదు=శిశువుయొక్క.

"మగప్పెయర్ కిళవి....." (తొల్కా. ౨౧౯ సూ.)=శిశువాచకమగు మగశబ్దమునకు విభక్తి సమాసమునఁ బరుషములు పరమగునపుడు 'ఇన్' అనునాగమము వచ్చును. ఉదా:—మగవినదు+కై=మగ+కై=మగ+ఇన్+కై=మగవిన్కై (శిశువుయొక్క చేయి) (సమాసమున విభక్తికిని

దత్వార్వాగమమునకును (చూడు ర౨ III విష) లోపము రాఁగా 'ఇన్' అను సామాసికాగమము దీనిచే విధింపఁబడెను.

"అత్తవణ్ వరినుమ్......" (తొల్కా. ౨౨౦ సూ.)=మగశబ్దమునకుఁ బరుష పరకత్వమున విభక్తి సమాస సంధిలో 'అత్తు' అనునాగమము నయితము రావచ్చును. ఉదా:—మగవినదు + కై = మగ+కై = మగ+అత్తు+కై = మగత్తుక్కై. తమిళమందువలెనె తెల్గు మున్నగువానిలో సైతము 'ని-న' మున్నగునవి షష్ఠీ ప్రత్యయములు కావనియు సమాసాశ్రయవిధిసిద్ధములె యనియు నీవఱకు నిరూపింపఁ బడెను (చూడు ర౨ III విష).

తమిళ సమాసములందు వచ్చు సామాసికాగమములలో విభక్తి ప్రత్యయ భ్రాంతిని గల్గించు 'అత్తు-అఱ్ఱు-ఇన్' మున్నగు వానిని మాత్రమె దొరగారు విభక్తి ప్రత్యయములని పై రీతిని వ్రాయుట వింతగా నున్నది. తొల్కాప్పియమున నెఴుత్తదికారమునందు VII, VIII, IX. ప్రకరణములలో ౨౦౪ సూత్రము మొదలు ౪౮౪ వఱకుఁగల సూత్రములలో లెక్కకు మిాఱిన సామాసికాగమములు వివరింపఁబడెనుగదా. వానినెల్ల షష్ఠీ ప్రత్యయము లనుగా దొరగారేల వచింపలేదో? తెలియకున్నది. ఆ మూఁడు ప్రకరణము లందును సామాసికములగు ననునాసికాగమములును వాని యపరావతారము లనఁదగు పరపరుష ద్విత్వాదులును ననంతముగా వివరింపఁబడెను. (చూడు ౨౫ I మొ. ౨౫ VII వ. విష). తద్భిన్నములగు 'అత్తు-అఱ్ఱు-ఇన్' అనువాని వంటివి పెక్కు సూత్రింపఁబడియున్నవి. దిఙ్మాత్రముగా VII ప్రకరణములోని విటఁ జూపఁబడుచున్నవి.

౨౨౭. సూ:—పలా + అదు + కోడు = పలాఅక్కోడు = (పనసచెట్టు యొక్క కొమ్మ).

౨౨౯. సూ:—ఆ+అదు+చెవి=ఆన్ చెవి=(ఆవుయొక్క చెవి).

౨౩౩. సూ:—ఆ+అదు+నెయ్=ఆననెయ్=(ఆవుయొక్క నేయి).

౨౩౫. సూ:—నిలా+అదు+కదిర్=నిలవుక్కదిర్=(వెన్నెలయొక్క కిరణములు).

౨౪౫. సూ:—పుళి + అదు + కోడు = పుళియఙ్కోడు = (చింతచెట్టు యొక్క కొమ్మ).

౨౬౧. సూ:—ఎరు + అదు + కుళి = ఎరువక్కుళి = (గెత్తముయొక్క గోయి).

౨౬౪. సూ:—ఇదు+అదు+కోడు=ఇదన్ కోడు=(దీనియొక్క కొమ్మ).

౨౯౫. సూ:—తూ + అదు + కుత్తై = తూఉక్కుత్తై = (బల్లియొక్క తక్కువ).

౨౯౬. సూ:—ఊ + అదు + కుత్తై = ఊనక్కుత్తై =(మాంసముయొక్క కొఱఁత).

౨౯౭. సూ:—ఏ + అదు + కొట్టిల్ = ఏఎక్కొట్టిల్ = (అస్త్రములయొక్క శాల).

౨౯౮. సూ:—పనై + అదు + అట్టు = పనా అట్టు =(తాటిపండు రసము యొక్క బెల్లము).

౨౯౯. సూ:—కో + అదు + కై = కోఒన్ కై =(రాజుయొక్క చేయి).

౩౦౦. సూ:—పొరున్ + అదు + కడుమై = పొరునక్కడుమై =(వీటి వాని యొక్క మోటుతనము).

౩౦౧. సూ:—ఎణ్ + అదు + చిఱుమై = ఎట్చిఱుమై = (తిలలయొక్క యల్పత్వము).

విస్తరభీతి నుదాహరింప విరమించితిని గాని యిట్లె ౨౮౭ సూత్రము వఱకును షష్ఠీ సమాసాశ్రయ విధులు పెక్కుగ నుపదేశింపఁబడెను. ఇతర సమాసాశ్రయ విధులును ననేకములు చెప్పఁబడి యున్నవి. షష్ఠీ ప్రత్యయమును దన్నిమిత్తక విభక్తి పూర్వాగమమును సమాసమున లోపించుచుండఁగా నచట సమాసాశ్రయ విధి సిద్ధములగు 'ఇన్' మున్నగు ప్రత్యయములను రూప సామ్య భ్రాంతిచే షష్ఠీ ప్రత్యయము లనుట సరియా? మఱియు నవెల్ల మొదట సప్తమీ ప్రత్యయములనియుఁ గాలక్రమమున షష్ఠీ విభక్తులయ్యెననియు నేవేవో నిరాధార సత్యవిదూర ప్రసంగములు చేయుట యుక్తము కాదు.

"ఇంక 'అదు' అనుదానికిఁ బదత్వావస్థ మాసి, ప్రత్యయత్వావస్థ గల్గ లేదని రూపసామ్య భ్రమచే వచించుట సరికాదు. 'మగ+అత్తు+అదు'= (శిశువుయొక్క) అనురీతిగల స్థలములలోని షష్ఠీ ప్రత్యయమగు 'అదు' అను సంబంధార్థకమునకు సర్వనామ నపుంసక ప్రథమైక వచనత్వము సందర్భపడమిం జేసి రూపమందుఁ గాకున్నను నర్థమందు వలసినంత మార్పు గల్గుటచేత దానికిఁ బ్రత్యయత్వావస్థ గల్గినదనుటకు సందియము లేదు. అదు ప్రత్యయము 'అదు' శబ్దమును సంబంధించు ననవచ్చునుగాని యవి పర్యాయము లనరాదు. (చూడుడు ౨౮ VII విష.). 'అదు' అను సర్వనామరూపమునకును 'అదు' అను షష్ఠీ ప్రత్యయమునకును గల యర్థవిషయకమగు మార్పును గ్రహింపక రూప సామ్యభ్రమచే 'అదు' శబ్దము తర్వాత వేఱొక విభక్తి పూర్వాగమ మాకాంక్షితమై యుండుననియు నకారణమున 'అదు' శబ్దమునకుఁ బదత్వా

వస్థ మాసిపోలేదనియు దొరగారు వ్రాయుట సరికాదు. "చుట్టుముదల్ ఉకరమ్......" (తొల్కా. ౧౭౭ సూ.)='అదు-ఇదు-ఉదు' అను సర్వనామములకు విభక్తి ప్రత్యయము పరమగునపుడు 'అన్' అనెడి యాగమము వచ్చును. అపుడు వాని 'ఉ' కారము లోపించును. ఉదా:—అదు+ఐ=అదనై=(దానిని) అదు+అదు=అదనదు=(దానియొక్క)." అను సూత్రము చొప్పున 'అదు' అను సర్వనామ శబ్దమునకు విభక్తి పూర్వాగమము 'అన్' అనునది వచ్చునేకాని 'అదు' అను షష్ఠీ ప్రత్యయమునకు రాలేదు. అట్లేర్పడిన పిమ్మట 'అదనదు+కోడు' అను షష్ఠీ సమాసమునందు దానిలోని 'అదు' ప్రత్యయమును దన్నిమిత్తక పూర్వాగమము 'అన్' అనునదియు లోపించుట చేత (చూడుడు ౘ౨ III విష). 'అదు+కోడు' అని నిల్చెను. అట్టి సమాసమున నీ క్రింది సూత్రము చొప్పున సామాసికాగమము 'అన్' అనునది వచ్చి 'అదన్ కోడు'=(దానికొమ్ము) అని సిద్ధించును. ఇట్టి స్థితిలో 'అదు' అను షష్ఠీ ప్రత్యయము తర్వాత విభక్తి పూర్వాగమ మాకాంక్షితమగు ననుట కేవలము నసంగతము; అసంభవమును. సమాసమున విభక్తియె లోపించును. దానికిఁ దర్వాత విభక్తి పూర్వాగమ మాకాంక్షితమగు టేమి?

"చుట్టుముదల్ ఇఉది......" (తొల్కా. ౨౯౮ సూ.)='అదు-ఇదు-ఉదు' శబ్దములకు విభక్తి సమాససంధిలోఁ బరుష పరకత్వమున 'అన్' అను నాగమమగును. ఉదా:—అదనదు+కోడు=అదు+కోడు=అదన్కోడు=(దాని కొమ్ము).

దొరగా రుదాహరించిన 'అదినుడైయ' = (దానియొక్క) అనునది తొల్కాప్పియ సమ్మతము కాదు. 'ఉడైయ' అనునది యర్వాచీన శేష షష్ఠీ ప్రతి పాదక ప్రత్యయమని ముందు వివరింపఁబడును. (చూడుడు ౘ౨ IX విష). పయిని వివరించిన తొల్కాప్పియము ౧౭౭ సూత్రము చొప్పున 'అదు' అను సర్వనామమునకు విభక్తి పరకత్వమున 'అన్' అను విభక్తి పూర్వాగమమె వచ్చును. కాన 'ఇన్' అను విభక్తి పూర్వాగమముతో నున్న 'అదినుడైయ' అనునది తొల్కాప్పియ సమ్మత రూపము కాదు. తొల్కాప్పియమున 'ఉడైయ' అనునది షష్ఠీ ప్రత్యయముగఁ జెప్పఁబడను లేదు.

"పుళ్ళి యిఋదియుమ్......" (తొల్కా. ౨౦౩ సూ.)="నే సీ ప్రకరణమునందుఁ జెప్పిన శబ్దములు తప్పఁ దక్కిన శబ్దములకు విభక్తి పూర్వాగమము రావలసిన నిర్బంధము లేదు" అను దానిలోని 'నిర్బంధము లేదు' అను శబ్దముచేత ననుక్తస్థలములందు 'ఇ' నాగమము వచ్చిన రావచ్చునని వ్యాఖ్యాతలు వ్రాసి యుదాహరించిరి. ఉదా:—నమ్బి+ఐ=నమ్బియినై=నమ్బియై=

(నమ్బియను వానిని). ఇట్లగుటచేత 'అదు' శబ్దమునకు 'అ' నాగమ ముక్తమై యున్నది గాన దానికి 'ఇ' నాగమ మెంత మాత్రమును రానేరదు. "అదినుడైయవన్ = దాని యొడయఁడు" అని యర్థము చేసినను దొల్కాప్పియము ౨౯౭ సూత్రము చొప్పున 'అన్' అను సాహూసి కాగమమె వచ్చును గాని 'ఇన్' అనునది రానేరదు. కాన 'అదినుడైయు' అనునది తొల్కాప్పియ సమ్మతము కాదు. 'అదనుడైయ' అనునది తొల్కాప్పియ సమ్మతమనఁదగును.

'ఇడత్తిల్' అనునది ప్రాచీన తమిళ సప్తమీ ప్రత్యయము కాదు. 'ఇడై-ఇడమ్' అనునవి సప్తమీ ప్రత్యయములు. (చూడు తొల్కా. ౫౯౯ సూ.) 'ఇడత్తిల్=స్థానమందు' అనుచోటి 'ఇల్' అనునది ప్రాచీన తమిళ సప్తమి కాదు; అర్వాచీనము. మలయాళ ప్రత్యయము. (చూడు ౮౮ I విష). (౮౭ II విష).

మలయాళమున నేటి సప్తమి—'ఇడత్తిల్' అనునది:—"పేర్-ఎ-ఓడ్ (ఓడు) కు-నిన్ఱు-ఉడె-ఇల్-విళి" ఇత్యష్టకమ్ (లీలాతిలకము-తృతీయ శిల్పము ౧౧ సూ.) ......పంచమి-'ఇల్ నిన్ఱు' అనునది ప్రాచీనము. మరత్తిల్ నిన్ఱు=(చెట్టునందుండి=చెట్టు వలన నుండి). ఇప్పుడు 'నిన్ఱు' అనుచో 'నిన్ను' అని వాడుదురు. షష్ఠి-అవనుడె=(వానియొక్క) (ప్రాచీనము). ఇప్పుడు-'అవన్టె' అందురు. సప్తమి అవనిల్=(వానియందు) (ప్రాచీనము). 'ఇడత్తిల్' 'గల్' అని నేఁడు వాడుదురు. 'తమిళ కణ్' ప్రత్యయ వికృతియె 'కల్' అనునది. అవనిడత్తిల్=(వానియందు). అవన్‌గల్=(వానియందు).

దొరగా రుదాహరించిన 'పొన్నిన్ కుడమ్' అనునది ప్రాచీనముకాదు. అటువ వ్యాకర్త లెవ్వరును 'ఇన్' అను దానిని విశేషణముగా నుదాహరింప లేదు.

"నకార విఱుది......" (తొల్కా. 333 సూ.)=నకారాంత శబ్దములకు (షష్ఠీ) విభక్తి సమాస సంధిలోఁ బరుషములు పరమగునపుడు నకారము చోట ఱకారాదేశమగును. ఉదా:—పొన్+కుడమ్=పొఱ్కుడమ్=(బంగారు యొక్క కుండ).

'ఆలమ్-ఆట్టమ్' అనునవి 'అమ్మంత' నపుంసక రూపములనెడి దొరగారి యాశయము సరికాదు. 'ఆలమ్పూ' అను దానిలోని 'అమ్' అనునది సమాసాశ్రయ ప్రత్యయము. 'అమ్' వచ్చు చోటులందు 'అన్' ప్రత్యయము రాదు గాన 'అన్' అనునది 'అమ్' ప్రత్యయమునకు రూపాంతర మనెడి దొరగారి వ్రాఁత సరికాదు. 'ఆల్-ఆఱు=యాఱు' అనునవి ప్రాతిపదికములు.

"పూల్ వేల్......" (తొల్కా. 32౬ సూ.)='పూల్-వేల్-ఆల్' శబ్దములకు విభక్తి సమాస సంధి యందుఁ బరుషపరకత్వమున 'అమ్' అను

నాగమము వచ్చును. ఆల్+అదు+పూ=ఆల్+అమ్+పూ=ఆలమ్ పూ=(మఱ్ఱిపూవు).

‘‘ఈ రెఱుత్తు మొఴియుమ్......’’ (తొల్కా. ౪౧౮ సూ.)=దీర్ఘ పూర్వ కార్ధమాత్రికోకారాంత శబ్దములకును బరుష పూర్వక పరుషస్థార్ధ మాత్రికోకారాంత శబ్దములకును విభక్తి సమాస సంధి యందుఁ బరుష పర కత్వమునఁ గొన్ని యెడల ‘అమ్’ అనునాగమము వచ్చును. ఉదా:—ఆఱు+అదు+కరై=ఆఱ్ఱఙ్కరై=(నదియొక్క యొడ్డు) (ఆఱు=యాఱు శబ్దములు దీర్ఘ పూర్వకమగు పొట్టి ‘ఉ’ కారము తుదినిగల శబ్దములు).

‘‘‘అమ్’ అనునది మాత్రమె’’ అని దొరగారేదో విశేషము గలదని వ్రాసిరి గాని ‘అన్’ ప్రత్యయము సయితము ‘అమ్’ ప్రత్యయము వంటిదె. ‘అన్’ ప్రత్యయము సైతము పెక్కు స్థలములందు ‘అమ్’ ప్రత్యయము వలెనె సమాసాశ్రయ ప్రత్యయ మగుచున్నది. విభక్తి సమాస సంధియందు నిర్దేశ సర్వనామ నపుంసక శబ్దములకు ‘అన్’ అను నాగమము వచ్చునని యుపదేశించు తొల్కాప్పియ (౨౬౪) సూత్రము పై నుదాహరింపఁబడెను. ఉదా:—అద నదు+కోడు=అదు+అన్+కోడు=అదన్ కోడు=(దాని కొమ్ము).

ఆధునిక వ్యవహారమునుబట్టి ‘ఇల్’ అనునది సప్తమీ ప్రత్యయ మనియు దానికి ‘ఇమ్’ అను కన్నడ తృతీయను ‘ఇన్’ అను నఱవ పంచమియు నభిన్నము లనియు దొరగా రెన్నెన్నో సారులు వ్రాయుచు వచ్చిరి. (చూడు ౮౨ III ౮౬ I విష.) ‘ఇల్లు-వాకిలి-పెరడు-మిద్దె-గోడ-మేడ’ మున్నగు రీతిగల స్థల వాచకములు ప్రాచీన తమిఴ సప్తమీ ప్రత్యయములు కానేరవు. (చూడు ౮౪ II, ౮౮ I). ‘ఇల్’ అనునది మలయాళాధునికతమిఴ సప్తమీ ప్రత్యయము.

౮౭. VII విష:—‘‘(౫) ‘అ’ అనెడి షష్ఠీ ప్రత్యయము:—ఇది మిక్కిలి ప్రాచీనమగు ద్రావిడ ప్రత్యయము. తమిఴ భాషలో దీనికిఁ బ్రయోగము మిక్కిలి యరుదు. అట్లయినను నఱవ వ్యాకర్తలు దీనిని శేష షష్ఠీ ప్రత్యయములలో మొదటఁ బేర్కొనిరి’’ (కాల్డు. ౩౧౬ పుట).

‘‘ఈ ‘అ’ ప్రత్యయము క్రియాజన్య విశేషణములలోని ‘అ’ ప్రత్యయ మున కభిన్నమనియు, నపుంసక బహువచన ప్రత్యయమునకు భిన్నమనియు నా యభిప్రాయము.’’

‘‘కన్నడమున ‘అ’ అనున దొక్కటే షష్ఠీ ప్రత్యయము. అఱవమున ‘అదు’ అను షష్ఠి ‘ఆదు’ అని యగునట్లె యీ కన్నడ ప్రత్యయ మొక్కొ

క్కప్పుడు దీర్ఘమగుచుండును. కన్నడమునఁ దక్షిన విభక్తులకువలెనె దీనికిని బూర్వమున విభక్తి పూర్వాగమములు 'ఇన్-అద్-అర్' మున్నగు నవి నిల్చును. ఉదా:—గురు+అ=గురువ=(గురువుయొక్క). కురి+అ=కురియ=(గొఱ్ఱె యొక్క). కూసు+ఇన్+అ=కూసిన=(పిల్లయొక్క) మర+ద్+అ=మరద=(చెట్టు యొక్క). అదు+అర్+అ=అదర=(దానియొక్క). కన్నడ సర్వ నామముల కీ 'అ' ప్రత్యయము చేరునపుడు వాని తుది హల్లు ద్విరుక్త మగును. ఉదా:—నాన్+అ=నన్న=(నా యొక్క). నామ్+అ=నమ్మ=(మాయొక్క). 'అ' ప్రత్యయము కన్నడ నామ సర్వనామములకు మహ దమహత్తులు రెంటను వచనద్వయమందును వచ్చును. ఉదా:—కన్న-అవర=(వారి యొక్క). అవుగళ=(వాటియొక్క). ఇది తమిళమందలి 'ఇన్' ప్రత్యయమువలె నెన్నఁడును విభక్తి పూర్వాగమము కాదు" (కాల్డు. ౨౯౭ పుట).

"కన్నడమందువలెనే తుళుభాషయందును 'అ' ప్రత్యయ మాత్రమె షష్ఠీ ప్రత్యయము. తుళులో బహువచనమున నిది 'ఎ' అనునదిగా మాఱును. దీనికి ముందు తుళులో 'త-ద' లు చూపట్టుచున్నవి. ఇవి కన్నడములోని 'అద్-ద్' అనువానిని సంబంధించుచున్నవి. యుష్మ దస్మ చ్ఛబ్దముల తుళు రూపములు:—ఉదా:—కన్న - నన్న=(తుళు) యన=(నాయొక్క). (కన్న) నిన్న= (తుళు) నిన = (నీయొక్క). నీలగిరి కొండలలోని కోటజాతుల భాషలో 'అ' ప్రత్యయమె శేషషష్ఠి." (కాల్డు. ౨౯౭ పుట).

"తెల్గులో నామవాచకముల బహువచన ప్రత్యయము 'లు' అనునది. దానిమీఁద 'అ' అను షష్ఠి నిల్వఁగా 'ల' అని యేర్పడును. దీనిమీఁదనె విభక్తులు నిల్చును. (ఉదా:—రాములచేతన్). షష్ఠీ బహువచనమునఁ బ్రత్యయాంతరాపేక్ష లేకయె దీనిచేతనె షష్ఠ్యర్థము బోధ్య మగును. యుష్మ దస్మ చ్ఛబ్దములందు విశేషణార్థకమగు ప్రాతిపదికముమీఁదనే యితర విభక్తులు నిల్చును. అదియే (ఆ ప్రాతిపదికమె) షష్ఠ్యర్థము నిచ్చును. తెల్గు ప్రథమ పురుష సర్వ నామములయందు వచనద్వయమునను 'ఇ' అనునది షష్ఠీ ప్రత్యయమై నిల్చును. వీనిలోఁ గొన్నిటియందు 'ని' అనునది నామవాచకములందు వలెనె షష్ఠిగా నిల్చును. ఒక్క 'తా' శబ్దముమాత్రము వచన ద్వయమందును షష్ఠిలో 'అ' ప్రత్యయముతోఁ గూడియుండును. ఉదా:—తన-తమ. కొన్ని విశేషణముల తుదినుండు 'అ' ప్రత్యయమునె షష్ఠి యనవచ్చును. ఉదా:— ఊర కవి" (కాల్డు. ౨౯౭-౨౯౮ పుటలు).

"అఱవమున దీని వాడుక యరుదు. యుష్మ దస్మ చ్ఛబ్దముల షష్ఠిలో మాత్రమె నిల్చును. ఉదా:—(అఱ) నమ=(మాయొక్క). ఈ 'అ' ప్రత్య

యము తమిళమున నపుంసక బహువచనముతోనె యన్వయించును. (చూడుడు ౭౭ II విష). ఉదా:—ఎన కైగళ్=(నాయొక్క చేతులు). ఇట దీని యర్థము 'నావైన' అని చెప్పఁదగును. కాన నిది సార్వనామిక విశేషణ మనఁదగును. ఉదా:—చిల=(కొన్ని). పల=(అనేకము)." (కాల్డు. ౨౯౮–౨౯౯ పుటలు).

""ఎన' అనుదానికి బహువచనార్థక మగు నేకవచనముతో సైత మన్వయ ముండునని తమిళ పండితు లందురు. 'నున చీఱడి'=(నీ చిఱు అడుగు)" ఈ చింతామణి ప్రయోగమున 'అడి' శబ్దము బహువచనార్థకమని చెప్పిరి. ఇట్టి నియమము కర్ణాటాంధ్రములలో లేదు. మఱియు నఱవ 'తన' శబ్దములోను దెలుఁగు 'తన' శబ్దములోను గల 'అ' ప్రత్యయము లభిన్నములె యగుటచేతను దమిళ 'నమ'=(మాయొక్క) శబ్దములోను గన్నడ 'నమ్మ'=(మాయొక్క) శబ్దములోను గల 'అ' ప్రత్యయము లభిన్నములె యగుటచేతను నాంధ్రకర్ణాటము లలో లేని పై నియమము తమిళమునం దర్వాచీనముగాఁ బ్రవేశించెననియు నఱవ మున నపుంసక ప్రథమా బహువచనమున 'అ' ప్రత్యయ ముండుటచేత నట్టి నియమ మర్వాచీనముగా వచ్చియుండుననియు నూహింపనగును. ఉదా:— నమ (లేక) నమ్మ ఊర్=(మనయొక్క యూరు) కోలేరియా భాషలలో నొకటగు 'హో' భాషలో 'అ' అనునది షష్ఠిగాను విశేషణముగాను దమిళమందు వలెనె యున్నది" (కాల్డు. ౨౯౯ పుట).

"సిథియను భాషలలో 'అ' ప్రత్యయము శేషషష్ఠి కాదు. ఇండో యూరపియను భాషలలోని 'నీ-నా' శబ్దముల షష్ఠిలో 'అ' ప్రత్యయము చూపట్టుచున్నది. (తవ. మమ). తెల్గు బహువచనములలో నెల్లెడల నీ 'అ' ప్రత్యయము (లు+అ=ల) వెలయుచున్నది. ఇయ్యది యిండో యూరపియను భాషలలోని 'అస్' అను షష్ఠీప్రత్యయమును సంబంధించుచున్నదో? లేక ప్రాచీన సిథియను భాషలోని 'న' అనుదానిని సంబంధించుచున్నదో? తెలియ కున్నది. గోందుభాషలో 'నా=ఆ' అనునవి రెండును షష్ఠిప్రత్యయములు గాన నిది సిథియను భాషలలోని 'న' అనుదాని సంబంధించున్నదని చెప్ప వచ్చును." (కాల్డు. ౨౯౯ పుట).

విమర్శము:—(కాల్డు. ౨౯౬ పుట మీఁదిది). దొరగారిప్పటి యట్లె విభక్తి పూర్వాగమములను విభక్తి ప్రత్యయము లనుచున్నారు. 'రాముల యొక్క' మున్నగు వానిలోని 'ల' అనుదానిమీఁది 'అ' అనెడి విభక్తి పూర్వా గమమును దెల్గు షష్ఠీ ప్రత్యయమనుచున్నారు. అఱవమునందలి 'అ' అనెడి శేషషష్ఠీ ప్రత్యయము తొల్కాప్పియమునాఁటికి లేదు. 'అదు' అనునది మాత్రమె తమిళ శేషషష్ఠీ ప్రత్యయమని తొల్కాప్పియమున సూత్రింపఁబడెను.

(చూడు ౨౧౧ I విష.) "ఆతాకువదె......" (తొల్కా- ౫౬౩ సూ.)='అదు' అనునది తమిళమున షష్ఠీ విభక్తి."

(౫౯౭ పుట కాల్డు. విమర్శము):—'అదు' అనునదియు షష్ఠీ ప్రత్యయముగఁ దొల్కాప్పియమునఁ జెప్పఁబడలేదు. కాని నన్నూలులో 'అ-అదు' అను రెండిటిని సయితము శేషషష్ఠీ ప్రత్యయము లనుచు 'అదు' అను దానితో పాటుగ సూత్రింపఁబడెను. "తన్+అ+అదు=తనాదు. ఎన్+అ+అదు=ఎనాదు" అను స్థలములలోని దీర్ఘమునుబట్టి 'ఆదు' అనుదానిని సామాన్యముగ నన్నూలు కర్త యవిమర్శితముగ నంగీకరించెను. 'రామనాదు' అని యంగీకరింపరాదు గదా. కర్ణాటమున శేషషష్ఠియగు 'అ' అను దానికి దీర్ఘాదేశము గలదు.

"దీర్ఘాదేశః షష్ఠ్యా యథేష్టమ్" (కర్ణా. భూ. ౬౭ సూ.)=షష్ఠ్యంత శబ్దము తుద యచ్చునకుఁ దలఁచుగా దీర్ఘాదేశమగుటయుఁ గలదు. ఉదా:—నరేంద్రనా పరిజనం=నరేంద్రన పరిజనం=(రాజుయొక్క పరిజనము). పెర్మె ధర్మదా=పెర్మె ధర్మద=(ధర్మము యొక్క మాహాత్మ్యము). కాంతెయా=కాంతెయ=(స్త్రీ యొక్క). కొన్నియెడల దీర్ఘాదేశము రాదు. మదనన=(మదనుని యొక్క). అనంగన=(అనంగునియొక్క). ద్వితీయాంతమునకును దీర్ఘాదేశ మిందుఁ గలదు.

"ద్వితీయాంతస్య వా స్వరే" (కర్ణా. భూ. ౬౮ సూ.)=ద్వితీయాంతమునకు స్వర పరకత్వమున దీర్ఘము వికల్పముగా నగును. ఉదా:—కల్లా నేఱిదం=కల్ల నేఱిదం=(కల్లం+ఏఱిదం) (ఱాతి నెక్కెను).

విభక్తి పూర్వాగమములలోనిది దొరగారు వ్రాసినట్లు 'అర్' అని కాదు. 'అఱ్' అని యుండవలెను. ఉదా:—అదఱ=(దానియొక్క). 'అ' ప్రత్యయము కన్నడమున విభక్తి పూర్వాగమము కాకున్నను దెల్గున నిది విభక్తి పూర్వాగమమె.

౫౯౭-౫౯౮ పుటలు కాల్డు. విమర్శము:—రాములచేతన్ - రాముల యొక్క మున్నగు వానిలోని 'ల' అనుదాని మీఁది 'అ' అనునది విభక్తి పూర్వాగమము. అది శేషషష్ఠీ ప్రత్యయము కాదు. ఇట్లె రాముని చేతన్-రాముని యొక్క-వానిచేతన్-వానియొక్క వారిచేతన్-వారియొక్క మున్నగు స్థలములందలి 'ఇ' అనునదియు విభక్తి పూర్వాగమమె. (చూడు ౨౨౨ I, ౨౨౨ III) అవి షష్ఠీ ప్రత్యయములె యైనచో, రాముని చేతన్, రాముల చేతన్ మున్నగు షష్ఠీతర ప్రత్యయములు వానిమీఁద నిల్చుట సంభవింపనేరదు. షష్ఠి మీఁద నితర విభక్తులు నిల్చుననుట కేవలము శాస్త్ర విరుద్ధము. సంప్రదాయ విరుద్ధమును. ఇంత యేల! రాముని యొక్క మున్నగు రీతిని వానిపైని షష్ఠీ ప్రత్య

యము సైతము నిలుచును. 'అ-ఇ' అనునవె శేష షష్ఠీ ప్రత్యయము లన్నచో 'గురు గుణములు, చెట్టు కొమ్మ' మున్నగు చోటులు విరోధించును.

సమాసమందు నిత్యముగాను వ్యస్తతయందు వైకల్పికముగాను శేష షష్ఠీ ప్రత్యయము (యొక్క) నిల్వకుండుట తెలుఁగు సంప్రదాయమనియు నట్లు లోపించు నపుడును దన్నిమిత్తక విభక్తి పూర్వాగమములు లోపింపకుండు టయు నాంధ్రసంప్రదాయమె యనియు గ్రహింపవలెను. ఉదా:—సీతయొక్క కొడుకు=సీతకొడుకు.

తెల్గున 'నా-నీ' అను సర్వనామ ప్రాతిపదికములకు విశేషణ త్వార్థ (సమాసమునను) మసంభవము. "నా మును పడ్డబన్నములు, నీ నలుగురు తమ్ములు" మున్నగు చోటులందు షష్ఠియే నిల్చుననియు నయ్యది యట్టి వ్యస్త స్థలములందును లోపించుట యాంధ్ర సంప్రదాయ మనియు నంగీకరింప వలయును. ప్రాచీనాంధ్రమున యొక్క విభక్తికిఁ బ్రయోగమే లేదు.

క॥ నెమ్మిని ధర్మజు నలువురు। తమ్ములు......(సభా. ౨ ఆ. ౨౬౧ ప).

ఉ॥ ఇమ్ముగ సర్వలోకజను లెవ్వని యేని ముఖామృతాంశు బిం। బమ్మున......(ఆది. ౧ ఆ. ౭౮ ప). 'నలుగురు' ప్రథమా బహువచనము.

'వాని గుణములు' మున్నగు చోటులలోని 'ని' అనునది యఖండము కాదు. 'అవన్ (వాఁడు)=వాన్+ఇ+గుణములు' మున్నగు రీతిగల విభాగముచే నచటిది 'ఇ' అను విభక్తి పూర్వాగమమె. (చూడు ౮౨ I విష.)

వైదేశికులగుటచేత దొరగారు 'ఊర కవి' అని యుదాహరించిరి గాని యిట్టి వాడుక తెల్గున నభూత పూర్వము. 'ఊర=ఊరియొక్క' అనురీతి నియ్యది విశేషణ మగునని దొరగారి భ్రమ. 'ఊరి కవి' అనవలెను. 'ఊరన్= ఊరియందు' అని తెల్గున నుండును.

౨౯౮-౨౯౯ పుటలు కాల్డు. విమర్శము:—'అ' అను తమిళ శేష షష్ఠీ ప్రత్యయ మర్వాచీనము. 'ఎన=నాయొక్క-నమ=(మాయొక్క)' అను రీతిగల రూపములు తొల్కాప్పియ సమ్మతములు కావు. 'ఎనదు=(నాయొక్క) నమదు = (మనయొక్క)' అనురీతిగల 'అదు' ప్రత్యయాంత రూపములు మాత్రమె తొల్కాప్పియమున నుపదేశింపఁబడెను. 'ఎన-నమ' అనునవి నన్నూలునఁ జెప్పఁబడెను.

"ఆతాకువదె......" (తొల్కా. ౫౬౩ సూ.)=" 'అదు' అనునది తమిళ షష్ఠీ విభక్తి......".

ఇట్లగుటం జేసి 'ఎన=(నాయొక్క) నమ=(మనయొక్క)' మున్నగు 'అ' ప్రత్యయాంత రూపములు తమిళమున నర్వాచీనములనుట నిశ్చయము.

ఇట్లిట్టివి నన్నూలు సమ్మతి నందినవని యంగీకరించినను 'నున=(నీయొక్క)' అను రూపము నన్నూలునందును లేదు. తొల్కాప్పియ విరుద్ధమని వేఱ చెప్పనేల? "నుమదు=(మీయొక్క)" అను రూపములోని 'ఉ' కారమును జూచి పదవ శతాబ్దపు చింతామణిలో నర్వాచీనముగా 'నున్నై-నునక్కు' అనునవి ప్రయుక్తములగుఁ గాక. చరిత్రకందని కాలమున వీడిన ప్రాచీన ద్రావిడ భాషల సంబంధమును బరిశీలించు నీ శాస్త్రమున నిట్టి యర్వాచీనరూపములనుబట్టి సంబంధ పరిశీలనము చేయుట సరికాదు.

తమిళభాషయందలి శేష షష్ఠీ ప్రత్యయంబగు 'అదు' అనునది తచ్ఛబ్ద నపుంసకైకవచన తమిళ సర్వనామ శబ్దమును—'అదు' అను పదమును - సంబంధించిన దగుటచేత నట్టి శేష షష్ఠి నపుంసకైకవచన శబ్దములతోనె యన్వయించుట సహజము. ఉదా:—ఆవినదు కణ్ణు = (ఆవుయొక్క దూడ): ఇంక నమహత్ సహత్యర్థక బహువచనములతోను, మహదర్థకములతోను వాని బహువచనములతోను నన్వయింపవలసి వచ్చునపుడు 'అదు' ప్రత్యయముచోట 'కు' ప్రత్యయమును వాడుట తొల్కాప్పియ సమ్మతము. తెల్గునందును నిట్టి వాడుక కలదు=నాయొక్క తమ్ముఁడు=నాకుఁ దమ్ముఁడు. (చూడు బాల వ్యా. కారక. ౧౫ సూ. 'వ్యా. సం.' ౨౫౦, ౨౫౧ I విభ).

"అదువెన్......" (తొల్కా. ౫౭౭ సూ.)=షష్ఠి వాడుకలో నుత్తర పదము మహదర్థకమగునపుడు 'అదు' అను షష్ఠిని వాడరాదు. దానిచోట 'కు' అను చతుర్థిని వాడవలెను. ఉదా:—నమ్బిక్కు మగన్=(నంబి యను వానికిఁ గొడుకు). 'నమ్బియదు మగన్' అనరాదు. ఏతత్సమాన న్యాయమునసే 'ఎనదు కైగళ్' అనరాదు. ఎనదుకై 'ఎన్ కైగళ్' అనవలెను. తమిళకవు లిట్టి నియమమును బాటింపలేదనియు మహదర్థకాదులతోడి యన్వయమందును 'అదు' ప్రత్యయమును వాడుదురనియు శ్రీ విద్వాన్ వే. వేంకటరాజులు రెడ్డిగారు వచించిరి. 'అదు' అనుదాని ప్రత్యయత్వావస్థ యిందులకు మూలము కానోపును. తెల్గునందును నిట్టి నియమమును దిక్కనాదు లుల్లంఘించిరి.

క. పాండవులవలనఁ గీడొ । క్కొండును లేదధిప నీదు కొడుకులు ధరణీ ......స్త్రీ ౧ ఆ. ౧౩ ప.) ఆ. వె.......... । కోరియిచ్చెఁ దనదు కూఁతుల ముప్వుర......(నిర్వ. ౨ ఆ. ౧౨) తే. గీ. తమదు పంచమములు తృతీయములు నగుచు । (అప్పక. ౩ ఆ. ౩౨౭ ప).

౧౭. VIII విభ:—"(౬) 'త్త-దె' అనెడి మలయాళ షష్ఠ్యేకవచన ప్రత్యయములు:—కన్నడమందలి 'ఇందె' అనుదానిలోని 'దె' అనునది 'అదు' శబ్ద సంబంధియైనట్లు యీ మలయాళ షష్ఠియగు 'దె' అనునది తమిళ షష్ఠియగు 'అదు' ప్రత్యయ సంబంధియె యనఁదగును. ఈ మలయాళ ప్రత్యయము

నకారాంతములనే చేరుచుండును. తమిటమున 'ఇన్' అను షష్ఠికి (చూడు రా౭ VI విష.) 'అదు' అనునది యనుబంధమైనట్లు మలయాళమునందలి 'దె=త్తె' అనునదియు 'ఇన్' అను షష్ఠి కనుబంధమనఁదగును. 'ఇన్దె' అనునది తమిటపద్ధతిని 'ఇన్టె' అనఁరూపమునఁదును. 'ఇన్టె' అనునది 'ఇన్ద్రె=ఇందె' అని పల్కఁబడుట ప్రసిద్ధమై యున్నది. అట్టి 'ఇన్ద్రె-ఇందె' అనువానిని సంబంధించినవె యీ మలయాళ ప్రత్యయములగు 'దె=త్తె' అనునవి. అటవమందలి 'అదు' ప్రత్యయమువలెనె దానిని సంబంధించు మలయాళ ప్రత్యయములగు 'దె=త్తె' అనునదియు షష్ఠ్యేకవచనమందు మాత్రమె ప్రయోగింపఁబడును. మలయాళ షష్ఠీ బహువచన ప్రత్యయము 'ఉడె' అనునది. ఇది తమిటమందలి 'ఉడైయ' అను (ఉడై) వ్యావహారిక ప్రత్యయమునకు సరిపడును. ఇట్లె మలయాళములోని 'ఎన్దె=ఎన్టె=ఎన్ద్రె=(నాయొక్క)' అనునవి తమిటములోని 'ఎనదు' అనుదానికి సరిపడును. (చూడు రా౭ V విష). మలయాళములోని సంబంధార్థక సర్వనామమగు 'ఎన్ద్రెదు' అనునది 'ఎన్ద్రె' అనుదానిపైని మరల 'అదు' శబ్దము నిల్చుటచేత నేర్పడినది. ఎన్ద్రె+అదు=ఎన్ద్రెదు. ఇందు షష్ఠ్యర్థకమున్న దనుటను మఱచిన వ్యవహర్తలచే మరల 'అదు' శబ్దము చేర్పఁబడెను. ఇట్లొక్క యర్థముననె రెండుసార్లు ప్రత్యయములు చేరుట వింత కాదు. తమి-మలై+య్+ఇన్+ఇన్=మలైయినిన్=(కొండనుండి). ఇల్లా+అదు+అదు=ఇల్లాదదు=(లేదు)." (కాల్డు. ౩౦౦, మొ. ౩౦౨ పుటల వఱకు).

"స్టివెన్సన్ దొరగా రాకారసామ్యమునుబట్టి మలయాళములోని 'త్తె' అనునదియుఁ గన్నడములోని 'ర' అనునదియు నభిన్నములనిరి. కన్నడములోని 'ర' అనునది యఖండముకాదు. అందలి 'అ' అనునది మాత్రమె షష్ఠీ ప్రత్యయము. తక్కిన రేఫము విభక్తి పూర్వాగముగ నిల్చు 'అద్' శబ్దమున కాదేశమగు 'అర్' అనుదాని సంబంధమైనది. ఈ 'ర' అనుదానికిని మలయాళములోని 'త్తె' అనుదానికిని 'అదు' అను తమిట షష్ఠితోఁ బరంపరా సంబంధము గలదనుటలో నాకు విప్రతిపత్తి లేదు. (చూడు రా౨ IV విష.)" (కాల్డు. ౩౦౧ పుట).

"మలయాళములోని యీ 'త్తె' ప్రత్యయమునకు హిందూస్థానీ భాషలోని 'రా-రీ' అను షష్ఠీ ప్రత్యయములతోను నవీన పెరిషియను భాషలోని 'రా' అను షష్ఠితోను గాతికు భాషలోని 'ర' అను షష్ఠీ ప్రత్యయముతోను సంబంధములేదు. సంస్కృత సంబంధార్థక విశేషణములలోని దకారమునకును

దమిటమందలి 'అదు' శబ్ద దకారమునకును నేదేని సంబంధమున్నదన్నచోఁ బై ప్రత్యయములకును సంబంధము నంగీకరింపవచ్చును" (కాల్డు. ౩౦౧ పుట).

(కాల్డు. ౩౦౦ మొ. ౩౦౨-వ.) విమర్శము:—మలయాళమందలి 'ఉడె' ప్రత్యయము షష్ఠీబహువచన బోధక మాత్రమె కాదు. షష్ఠ్యేక వచనమున కును నదె షష్ఠీ ప్రత్యయమని లీలాతిలకమను మలయాళ వ్యాకరణమున నీ క్రింది రీతిని సూత్రింపఁబడెను.

"పేర్-ఎ-ఓడ్ (డు) కు-నిన్ను-ఉడె-ఇల్-విళి-ఇత్యష్టకమ్" (లీలా. ౨ శిల్పము ౧౧ సూ.)=......షష్ఠి. 'ఉడె' ఉదా:—అవనుడె=(వాడియొక్క). ఇది ప్రాచీన మలయాళరూపము. ఇపుడు-'అవన్టె' అందురు. ఈ నవ్య మలయాళ షష్ఠి 'టె' అనుదాని వికృతి కావచ్చును. ప్రాచీన ద్రావిడ ఱకారము 'ట-త' మధ్య స్థోచ్చారణము కలదిగదా. 'డె-టె' అనునవి సైతము 'అదు' అను తమిటి షష్ఠీసంబంధులు షష్ఠ్యేకవచన బోధక ప్రత్యయములునై మలయాళమున నున్నవి.

కాల్డు. ౩౦౧ పుట విమర్శము:—స్టివెన్‌సన్ దొరగారి వ్రాఁత యెట్లును సరికాదు. కాని యీ విషయమందలి కాల్డు వెల్లుగారి యాశయములును సరికావు. కన్నడములోనిది 'ర' కారము కాదు; ఱకారము. ప్రాచీన ద్రావిడ భాషలలో ర ఱ ల కెంతమాత్రమును సామ్యము లేదు. దొరగారి 'అద్' శబ్ద రేఫాదేశము ఠా౨ IV విషయమున నిరాకరింపఁబడెను. ఇట్లె మలయాళపు 'టె' ప్రత్యయ ఱకారమును హిందుస్థాని మున్నగు వానిలోని 'ర' కారమును గేవలము విజాతీయములు. వానికి సంబంధము గలదేమో యని సందేహింప రాదు. ఱకారమునకు రేఫోచ్చారణము కేవల మర్వాచీనము. (చూడు ౧౭ XIII విష).

ఠా౭. IX విష:—"ఆంధ్రాభాషలలోని షష్ఠీప్రత్యయానుబంధములు (Auxiliary):—(౧) తెల్గున 'యొక్క' అనునది. ఉదా:—నా+యొక్క=నా యొక్క. ఈ ప్రత్యయము మిక్కిలి యరుదు. ఇతర శుద్ధ ద్రావిడ భాష లలో నెచ్చటను దీనిని బోలు ప్రత్యయము లేదు. 'రాజమహాల్' 'ఒరాఒన్' అను భాషలలో దీనిని బోలు ప్రత్యయము గలదు. ఇవి ద్రావిడ భాషలె యైనను వీనిలో 'కోలు' భాషా శబ్దములు విశేషముగాఁ జేరియుండుటచేత నివి శుద్ధ ద్రావిడభాషలు కానేరవు. ఉదా:—రాజమహాల్-షష్ఠి-'కి' ప్రత్యయము. ఒరాఒన్ భాష-షష్ఠి-'ఘి' దీనికి 'యొక్క' ప్రత్యయముతో సంబంధము గలదన్నచో నింక హిందూస్థానీలోని 'కీ' ప్రత్యయముతోను సంస్కృతములోని 'క' ప్రత్యయముతోను (తావక=నీ సంబంధమైన మామక=నా సంబంధమైన)

సంబంధముగల దనవచ్చును. మికిరు భాషలోని చతుర్థియగు 'యొక్-అయొక్' అనున దింతకన్నను నధికముగా 'యొక్క' అను తెల్గు షష్ఠిని బోలుచున్నది." (కాల్డు. ౩౦౨ పుట).

విమర్శము:—క్రమక్రమముగా దొరగారి యాశయములు మాఱుచొచ్చి నట్లున్నది. అట్టి మార్పు క్రిందటి 'తె=దె' ప్రత్యయ సందర్భమునందె కొంత యంకురించినది. తమిట మందలి షష్ఠ్యనుబంధము 'అదు' ప్రత్యయమని వచించిరి. విభక్తి పూర్వాగములె విభక్తులనియు నింక విభక్తి ప్రత్యయములు తదీయానుబంధములనియు వీరికి దోఁప సాగెను. కాఁగా 'రాముని-నీ-నా' మున్నగునవె షష్ఠ్యంతములనియు 'యొక్కా'దు లనుబంధములనియు నిందు స్పష్టముగా వ్రాసిరి. 'యొకట=యొక' అనుదానిలోని 'క' కారము నాశ్ర యించి హిందూస్థానీ ప్రభృతులలోని 'కీ' మున్నగువానితో (సంస్కృత 'క') దొరగారు సంబంధమును భావించిరి గదా యింకఁ తెల్గులోనే కాక యితరములగు ననేక భాషలలో వెలసియున్న (౧౫ I విభ) 'కు' ప్రత్యయముతో 'యొక్క' కుఁ బోలిక నేల భావింపరైరో తెలియకున్నది. మికిరు భాషలోని 'యొక్' అను దాని పోలికను జూపుటకై తెల్గున 'యొకట' అను దానికి 'యొక' అను పర్యాయము నంగీకరించిరి. వైదేశికు లగుటచేత నిట్లు వ్రాయఁగల్గిరి గాని తెల్గున నెచ్చటను 'యొక్క'కుఁ బర్యాయముగా 'యొక' అనుదాని వాడుక లేదు.

'యొకట చ శేషే షష్ఠీ' అను నాంధ్ర శబ్ద చింతామణి సూత్రము చెప్పున సంబంధార్థకమగు నీ 'యొకట' ప్రత్యయము ప్రాచీనమనఁదగి యున్నను దీనికిఁ బ్రాచీనాంధ్ర వాఙ్మయమునఁ బ్రయోగమె లేదు.

అగుధాతువే 'అక్కు' అనిదై 'ఒక్క' గా మాఱి 'యొకట' యైనదని యొకరు (శ్రీ కోరాడ రామకృష్ణయ్య పంతులుగారు) వ్రాసిరనియు సంఖ్యా వాచకమగు 'ఒక్క' శబ్దమే యిట్లు పరిణమించినదని యొకరు వ్రాసిరనియు నుదాహరించి విమర్శించుచు నాంధ్ర విశ్వకళా పరిషత్-శాశాలాంధ్రోపన్యాసకు లగు శ్రీ బద్రిరాజు కృష్ణమూర్తి బి.యే. (ఆనర్సు) గారు (క్రీ.శ.) ౧౯౫౨ సం॥ మార్చి ౧౦ తేది త్రిలింగ పత్రికలోఁ బ్రచురించిన వ్యాసములో నీ క్రింది రీతిని యొకట శబ్దపు వ్యుత్పత్తిని నిరూపించిరి. "ప్రాచీన ద్రావిడ భాషలో 'ఒ' అను ధాతువుగలదు......'సరిపడు-కూడు' అని దాని యర్థము...... వర్తమాన కాలిక రూపములలో వచ్చు కవర్ణము (కిఱేన్) ప్రయోగ బాహుళ్యముచే కాలాంతరమున ధాతుగతమైనది. మలయాళములో నీ ధాతువు 'ఒక్కు' అను రూపముతోఁ గన్పించుట ఈ ప్రమాణమునకుఁ బ్రబల

తార్కాణము (?).......భూతార్థక క్రియాజన్య విశేషములు (Past participles) అగుటకు 'అ' వర్ణము చేరును. అట్టిచో చివరి హల్లు ద్విరుక్తమగును............'ఒక్క' అనఁగా సంబంధించిన యని యర్థము......యడాగమము సంధి విరహిత స్థలములలో వచ్చి శబ్దముతో కలిసి కాలక్రమమున 'యొక్క' యనియే రూఢముగా వ్యవహరింపఁబడుచు వచ్చినది.'' ''ఒక్కల్' అను మాట 'బంధువులు' అను నర్థమున......౪-వ శతాబ్దపు 'తిరుక్కురళ్'లో......ప్రయోగింపఁ బడినది''. మద్రాసు విశ్వవిద్యాలయపు ప్రాచ్యభాషా వాఙ్మయ పరిశోధక శాఖలోఁ దమిళ భాషోపన్యాసకులయి యుండి విశ్రాంతిఁ గైకొన్న విద్వాన్. శ్రీ. వే. వేంకటరాజులు రెడ్డిగారీ విషయమున నాజాబున కిట్లు జవాబొసంగిరి. ''ఒక్కల్=బంధువు' అని తిరుక్కురళులో నున్నది. ఒక్కు ధాతువు లేదు. 'ఒ' అనునది ధాతువుగా తమిళ లెక్సికనులో వ్రాయఁబడెను. మలయాళమునను ధాతువని చెప్పుటకు లేదు. 'ఒక్' అని 'క' కారాంతముగా నిల్చుట లేదు'' (౨౭-ఏప్రెల్-౧౯౫౨ తేదీ జాబు).

తెల్గు భాషలోని తక్కిన విభక్తి ప్రత్యయములెల్లఁ దెలుఁగు శబ్దముల తోనె[1] యేర్పడియుండఁగా సంబంధార్థకమగు 'యొక్క' ప్రత్యయమును మాత్రము తెల్గువారు తమిళమునుండి యెరవు తెచ్చికొని యేర్పఱచికొనిరనుట విశ్వసనీయముగ లేదు. ఆ శబ్దపు పోలికయు నంత బలముగా లేదు. తమిళ భాషలోని శేష షష్ఠ్యర్థక ప్రత్యయమున 'ఒక్క' శబ్ద గంధమేని లేదు. ప్రాచీన తమిళ శేష షష్ఠి 'అదు' ప్రత్యయము. తెల్గులోని 'యొక్క' విభక్తి 'కేవలార్థక' 'ఒక్క' శబ్దరూపమనియె తోఁచుచున్నది. 'నా యొక్క పుస్తకము' అను దానికిఁ బుస్తకమం దితరుల స్వామ్యము లేదనియు 'ఒక్క నా యదియే' యనియు నర్థము దాని ప్రత్యయత్వావస్థవలనఁ గల్గియుండునని తోఁచెడిని.

''(౨)—అఱవమున సర్వసాధారణముగా 'ఉడైయ' అనునది షష్ఠ్యంతము నకు వెనుక నిల్చుచుండును. 'ఉడైయ' అనఁగా 'సంబంధించిన=ఆస్తియైన' అని యర్థము. 'ఆస్తి' అని యర్థమిచ్చు 'ఉడై' శబ్దమునకు సర్వనామ విశేషణ ప్రత్యయమగు 'అ' అనునది చేరుటవలన 'ఉడైయ' శబ్దము నిష్పన్నమైనది. 'అ' ప్రత్యయము చేరుటచేత నామములు విశేషణము లగుచుండును. 'ఎన్నుడైయ కై'=(నా సొత్తగు చేయి=నాదు చేయి=నా చేయి). 'ఎన్' అను దానికిని 'ఎన్నుడైయ' అనుదానికిని నర్థ భేదము లేదు. దీని చివర నున్న 'అ' అనునది లోపింపఁగా మలయాళమున 'ఉడె' ('ఐ' కారమును దొరగారు 'ఎయ్' అందురు) అనునది యీ యర్థమున వాడఁబడుచున్నది. నేఁటి మలయాళమున నిది 'డె' అను రూపమందినది. పుత్రీడె=(పుత్రియొక్క). ఇది క్రియాజన్య

విశేషణము. ఇది యింగ్లీషులోని 'belonging to' అనుదాని వంటిది. 'of' అనుదానికి సరియగునది కాదు." (కాల్డు. ౩౦౨ పుట).

విమర్శము:—'ఉడై మై=(కల్మి)' అనునది తొల్కాప్పియము ౫౬౨-౫౬౮ సూత్రములలో నుదాహరింపఁబడెను. 'అ' అను విశేషణ ప్రత్యయము దానిపై నిల్చునపుడు-'మై' అను భావార్థక ప్రత్యయము లోపించుటచేత 'ఉడైయ=(కలిగిన)' అని యేర్పడును. అయ్యది విభక్తి ప్రత్యయత్వావస్థలో శేష షష్ఠ్యర్థక మగుచున్నది. "అదు + అన్ + ఉడైయ = అదనుడైయ = (దానియొక్క) (చూడుడు రా2 VI విష). 'ఉడైయ' అను ప్రత్యయము తొల్కాప్పియము నాఁటికి లేదు. అర్వాచీన వ్యవహార సిద్ధము. అట్లయినను బయి యుదాహృతిలోఁ దమిళ (వ్యాకరణ) పద్ధతి చొప్పున 'అన్' అనునది విభక్తి పూర్వాగమమనియు (తొల్కా. 'చుట్టుముదల్ ఇఱుది......' ౨౬౮ సూ). 'ఉడైయ' అనునది షష్ఠీప్రత్యయమె యనియు విభాగము నంగీకరింపనగును. అట్లగుటచేత 'ఉడైయ' అనునది షష్ఠ్యంతమునకు వెనుక ననుబంధముగా నిల్చునను దొరగారి వ్రాత పొసఁగనేరదు. 'అన్' అనునదియు 'ఇన్' ప్రత్యయమువలెనె శేషషష్ఠీప్రత్యయమె యని వచింప దొరగారు సాహసింపరు గదా."

రా. I విష:—"సప్తమీ విభక్తి:—స్థలవాచక శబ్దములెల్ల సప్తమీ విభక్తులగుచుండునని ద్రావిడ వైయాకరణులు చెప్పినను నొక్కొక్క స్థలవాచక శబ్దమొక్కొకటి భాషలో సప్తమీప్రత్యయ మగుచుండును.

నేత్రమనియు స్థలమనియు నర్థముగల 'కణ్' అను నఱవ శబ్దము సప్తమి యని యఱవ వైయాకరణులు చెప్పిరి. తమి-కణ్=(కన్ను-చూడుము).=(అచ్చట=ఆ చోట). తమి-'కాల్'. (మల-కల్) అను మఱొక సప్తమీ ప్రత్యయము గలదు. ఈ రెండును దమిళమున నరుదుగ వాడఁబడును. 'తమి-ఇల్=(ఇల్లు-స్థలము)' అనునది సప్తమీప్రత్యయముగఁ దఱచుగ వాఁడఁబడుచున్నది. గ్రామ్యాఱవము 'ఇడత్తిల్=(ఇడమ్=(స్థలము)+అత్తు+ఇల్)' అనునది సప్తమిగఁ దఱచుగ వాడఁబడుచున్నది. ఈ మూఁడింటి మొత్తమునకు 'స్థలమునందు' అని యర్థము. ఈ సముదాయములో 'ఇల్' అనునది నిజమైన సప్తమీ ప్రత్యయము. కేవల గ్రామ్యాఱవమున 'కిట్ట=(దగ్గఱ)' అనునది సప్తమిగ వాడఁబడుచున్నది. అఱవ పండిత వ్యవహారమున 'ఉళ్=ఉటి=(లోపల)' అనునవి సప్తమిగ వాడఁబడుచున్నవి. (అఱవములోని 'ఇల్' ప్రత్యయపు వాడుకకును ల్యాటినులోని 'ఇన్' ప్రత్యయపు వాడుకకును నత్యధిక సామ్య

మున్నదని యిచట నొక టిప్పణము ప్రాఁత ప్రతిలో నున్నది)" (కాల్డు. 303-304 పుటలు).

"ప్రాచీన కన్నడ సప్తమీప్రత్యయము 'ఓళ్' అనునది. ఇది తమిళ మందలి 'ఉళ్' ప్రత్యయమును సంబంధించుచున్నది. 'అల్లి-ఇల్లి' అనునవి నవీన కన్నడ సప్తమీ ప్రత్యయములు. ఇవి యజువములోని 'ఇల్' ప్రత్యయ మును సంబంధించుచున్నవి. 'అల్లి' అనునది తచ్ఛబ్దార్థకమగు 'ఆ' శబ్దము నుండియు 'ఇల్లి' అనునది 'ఇదం' శబ్దార్థకమగు 'ఈ' శబ్దమునుండియు పుట్టినవి. వీనికి వరుసగా 'అచ్చట-ఇచ్చట' అని యర్థములు. ఇవి 'ఇల్-ఓళ్' అను ప్రత్యయముల కన్న నవ్యములుగాఁ గన్పట్టుచున్నవి.

తుద భాషలో 'ఉళ్ళ్=ఓర్జ్' అనునవి సప్తమీ ప్రత్యయములు. ఇవి తమిళమందలి 'ఉళ్' ప్రత్యయముయొక్క యుచ్చారణ భేదములె. తుదభాష లోని రేఫ లకారములు 'rzh' అను నాంగ్ల వర్ణోచ్చారణము రీతిని బల్కఁ బడును." (కాల్డు. 304 పుట).

విమర్శము:—'కణ్' అనునదె ముఖ్యమగు ప్రాచీన తమిళ సప్తమీ ప్రత్యయము. స్థలవాచకము లెల్ల సప్తమీ ప్రత్యయములెయని తొల్కాప్పియ మునఁ జెప్పఁబడలేదు.

"ఎఱాకువదె......" (తొల్కా. ౨౬౫ సూ.)='కణ్' అనునది సప్తమీ విభక్తి ప్రత్యయము.

"కణ్=(స్థలము). కాల్=(స్థలము). పుఱమ్=(బహిఃప్రదేశము). అకమ్=(లోపలి ప్రదేశము). ఉళ్=(లోపలి ప్రదేశము). ఉళై=(పార్శ్వము). కీళ్=(క్రింది ప్రదేశము). మేల్=(మీది ప్రదేశము). పిన్=(వెనుకటి ప్రదేశము). చార్=(స్థలము). అయల్=(ప్రక్క-చోటు). పుడై=(ప్రక్క-చోటు). తే=(చోటు). (ఇవెల్లఁ బ్రదేశ విశేష వాచకములు). మున్=(మునుపటి కాలము-మునుపటి చోటు). ఇడై=(నడిమికాలము-నడిమిచోటు). కడై=(తుదికాలము-తుదిచోటు). తలై=(మొదటి కాలము-మొదటిచోటు). వలమ్=(కుడి ప్రక్క). ఇడమ్=(ఎడమ ప్రక్క)." (తొల్కా. ౨౬౬ సూ.)= ఇవియును సప్తమిలో వాడఁబడును.

వీనిలో 'ఇల్' అనునది పేర్కొనఁబడలేదు. కాన ఇల్ అనునది తొల్కాప్పియము నాఁటికి సప్తమీ ప్రత్యయము కాదు. 'ఇల్లు-వాకిలి-పెరడు-మిద్దె-మేడ-గోడ' మున్నగునవి తమిళ సప్తమీ ప్రత్యయములనుట సరికాదని తొల్కాప్పియరు తలంచి యుండును. కావున 'ఇల్' అనునది యర్వాచీనముగఁ

దమిఱమున సప్తమియైన దనఁదగును. లీలాతిలక మను మలయాళ వ్యాకరణమున 'ఇల్' అనునది సప్తమీ ప్రత్యయముగ సూత్రింపఁబడెను. (చూడు రా౭ VIII విష). 'ఇడత్తిల్' అనునదియుఁ బ్రాచీన తమిఱ సప్తమి కాదు. (చూడు రా౭ VI విష).

ప్రాచీన కన్నడ సప్తమి 'ఓళ్' అనునది కాదు. 'ఒళ్' అను హ్రస్వ ఘటితరూపము సప్తమీ ప్రత్యయము. "అల్లి-ఇల్లి-ఎల్లి—ఆవల్లి ఇత్యాదయో హి అవ్యయ విశేషా ఇతి" (కర్ణాటశబ్దా ౨౭౭ సూ. మకరంద వ్యాఖ్య). అను చోప్పున 'ఇల్లి' అను నవ్యయము కలదుగాని యది సప్తమీ ప్రత్యయముగా వ్యవహృతము కాదు. దొరగారు తమిఱమందలి 'ఇల్' అను దానితో సంబంధము కల్పుట కదియు సప్తమీ ప్రత్యయమె యని వ్రాసిరని తోఁచెడిని. కావున 'ఇల్లి' అను కన్నడ సప్తమి 'ఇల్' అను తమిఱ సప్తమిని సంబంధించున దనరాదు. దొరగారు 'అల్లి' అనునది నవీన కన్నడ ప్రత్యయమని వ్రాయుటయు సరికాదు. పఱగన్నడ వ్యాకర్తలెల్ల దానిని పేర్కొనియున్నారు. 'సప్తమ్యా అల్లి వా' (కర్ణా. భూ. ౯౮ సూ.)=సప్తమీ విభక్తియగు 'ఒళ్' అనుదాని చోట 'అల్లి' అనునది వైకల్పికముగా నాదేశమగును.

రా. II విష:—" 'లో'-అందు' అనునవి తెలుఁగు సప్తమీ ప్రత్యయములు. 'లో' అనునది కన్నడములోని 'ఓళ్' అను దానితోను దమిఱమందలి 'ఉళ్' అను దానితోను సంబంధించుచున్నది. 'అందు' అనునది కన్నడమందలి 'అల్లి' అనుదానివలె స్థలవాచకము. 'అందు' అను పదమును 'అందు' అను ప్రత్యయమును భిన్నములు కావు. 'అందు' అనునది 'అ' అను సర్వనామము నకు 'ద్' అనుదానిని జేర్చుటచే నేర్పడినది. ఇట్లె 'ఈ' అను సర్వనామము నుండి 'ఇందు' శబ్దమేర్పడెను. కన్నడమున వీనిని సంబంధించినవి 'అంత-ఇంత-అంతలు-ఇంతలు' అను పదములు కలవుగాని యవి యింగ్లీషులోని 'than' అను దానివలెఁ దారతమ్యమును బోధించుటలో ముఖ్యముగా వాడఁబడును. తెల్గు సప్తమీ ప్రత్యయమగు 'అందు' అనునది సంస్కృతమందలి 'అన్తర్'=(మధ్య=లోపల) అను పదముతో నాకారసామ్యము గల్గియున్నది. కాని యది వాస్తవము కాదు. తెల్గు 'అందు' అనునది తమిఱమందలి 'అన్ద' అను సర్వనామ విశేషణమును సంబంధించును."

"తుళుభాషయందలి సప్తమీ ప్రత్యయములు. 'దు - డ్ - తు - ట్' అనునవి. ఇవి "(తమి) ఉళ్=ఉడు, (కన్న) ఓళ్=ఎడ్, (తమి) ఇడై=ఇడమ్" అను ద్రావిడశబ్దములను సంబంధించుచున్నవి. ఈ 'తుళు' ప్రత్యయముల మొదట 'అ-ఎ-ఒ' అను స్వరములు నిల్చుటయు నిలువకుండుటయుఁ గలదు.

ఉదా:—తుళు:—కైట్ =(చేతిలో). ఈ 'టు-డు' అను తుళు సప్తమీ ప్రత్యయములు కన్నడమందలి 'అల్లి' అను దానిని తెల్గులోని 'అందు' అను దానిని సంబంధించునట్లగపడును. తుళు భాషలోని 'అడె=(అచ్చట)' అనునది తెల్గులోని 'అందు' అను దానిని బోలుచున్నది. తుళులోని 'ఇడె'=(ఇక్కడ), 'ఒడె'=(ఎక్కడ) అనునవియు నిట్టివె." (కాల్డు. ౩౦౪ పుట).

విమర్శము:—'అందు = అల్లి' అనునవి సరిపోలుచున్నవనుటకు వానియందాకారసామ్యము కానరాదు. 'అందు-ఇందు' అను వానికి 'లు+అ=ల' అను దానిని జేర్చుటచేత నేర్పడిన 'అందుల-ఇందుల' అను వానిపైని సంబంధార్థకమగు 'ఇ' అనునది చేరుటచేత 'అందలి-ఇందలి' అనునవి సిద్ధించును. 'అల్లి-ఇల్లి' అను కన్నడ శబ్దములు వీనిని బోలుచున్నవనుట కొంత విశ్వసనీయముగనుండును.

'లోనికిన్-లోనన్' మున్నగు తెల్గు శబ్దములను బరిశీలించునపుడు 'లోను' అను నాంతశబ్దము సప్తమీ ప్రత్యయముగ నంగీకరింపనగునని తోఁచుచున్నది. అదె యననేల? "లన్ (లు+అ+న్) (ద్వితీ), తోడన్ (తోన్) చేతన్ (చేన్) (తృతీ), కున్ (షష్ఠి) వలనన్-కంటెన్-కన్నన్ (పంచమి), అందున్-లోన్-నన్ (సప్త)" అను తెల్గు ప్రత్యయములెల్ల నాంతశబ్దములె యనఁదగును. వీనిలో ననేకములు వెనుక వివరించిన 'అన్=న్' అను ప్రత్యయములతోఁ (౮౪ IV విమ. ౮౨ III విమ) గూడినవగుటచేత నాంతములనుట నిశ్చితము. "కున్+అంటి+ఏని=ఏన్=కంటెన్. కున్+అన్నన్=కన్నన్" అను రీతి నేర్పడిన 'కంటెన్-కన్నన్' అనునవి నాంతములగుచున్నవి. కన్నడమందలి 'అంతలు' అను తారతమ్య పంచమ్యర్థక శబ్దమునకును దెల్గులోని 'అందు' శబ్దమునకును నర్థసామ్యము లేనేలేదు సరియేకదా యాకారసామ్యమును జాలదు. 'అంతలు' అను కన్నడశబ్దము నర్థమునఁ దెల్గున 'కంటెన్' 'కన్నన్' అను ప్రత్యయములును దమిళమున 'ఇన్' ప్రత్యయమును వాడఁబడును.

౮౨. III విమ:—"తెల్గులో 'న' అను ప్రత్యయము 'ఇ' కారాంతముల వెనుక 'ని' అని మాఱును. ఇది యమహాదర్థక సప్తమీ ప్రత్యయము. 'ని' ('న' అనుదాని రూపాంతరము) అనునది సప్తమియని యూహింపఁబడిన తమిళ పంచమీ ప్రత్యయమగు 'ఇన్' అను దానిని సంబంధించుచున్నది. ఈ 'ఇన్' అనునదే తమిళ శేషషష్ఠియగు 'ఇన్' అనుదానికిని దెల్గులోని సంబంధార్థకములగు 'ని-న' అను వానికిని మూలము కానోపును. సప్తమి షష్ఠినుండి పుట్టినదనుటకంటె షష్ఠియె సప్తమినుండి పుట్టెననుట యుక్తము. ఈ తెలుఁగు సప్తమియగు 'న' ప్రత్యయముతో, 'ఓష్టియాకు' (సిథియన్) భాషలోని 'న-నె' అను

సప్తమీ ప్రత్యయములును, ఫిన్నిషు-మెగ్యారు-(సిథియన్) భాషలలోని 'అన్-ఎన్' అను సప్తమీ ప్రత్యయములును జపానుభాషలోని 'ని' అను సప్తమీ ప్రత్యయమును బోలుచున్నవి.

తెల్గునందును ప్రాచీన తమిళమందును ప్రథమేతర విభక్తులు నిల్చెడి సంబంధార్థకమగు నంగము సప్తమ్యర్థమును సైతమిచ్చుచుండును. క్రియతో నన్వయించు విభక్తులందే యీ పద్ధతి తమిళమం దుపయోగింపఁబడును. (శేష షష్ఠియగు 'ఇన్' అనునది సప్తమ్యర్థము నీయనేరదని భావము?) తమిళమున నీ సందర్భమున 'అత్తు' అనునది చేర్పఁబడును. ఉదా:—నిలత్తు=(నేలయందు). మలయాళమందును నిల్లె. తెల్గునఁ బ్రాచీనభాషలోని షష్ఠ్యర్థకమగు 'తి' అనునది 'త' అనునదిగ మాఱి సప్తమ్యర్థకమగుచున్నది. ఉదా:—తెల్గు-ఇంటి=(ఇంటియొక్క) ఇంట=(ఇంటియందు). ఈ సప్తమ్యర్థకమె తృతీయార్థకమును నగుచున్నది. ఉదా:—చేతి=(హస్తముయొక్క). చేత=(హస్తముచేత-హస్తమునందు). ఈ రూపము మొదట సప్తమీరూపమనియె తలంపవలయును. ఇట్లు షష్ఠీసప్తములు కలియుట 'ఇండో యూరపియను' భాషలందును, ఫిన్నిషు భాషలందును గలదు.

పయి సందర్భమునుబట్టి తమిళమందలి సంబంధార్థకమగు 'ఇన్' ప్రత్యయమును, ద్రావిడ భాషలన్నిటిలోను నొపవిభక్తికములయియున్న 'ని-ఇన్' అనునవియును దమిళమందలి యపాదానార్థకమగు-'ఇన్' అనునదియుఁ గన్నడమందలి తృతీయార్థకమగు 'ఇమ్' అనునదియు నెట్టి రూపభేదములతోనున్నను 'ఇక్కడ' అను నర్థముగల 'ఇల్' అను శబ్దమునుండి నిష్పన్నములైనవె యనియు సప్తమ్యర్థకములె యనియు నిశ్చయింపవచ్చును.

ద్రావిడ భాషలలోని సప్తమీ ప్రత్యయములె తారతమ్యార్థకములును నగుచున్నవి. ఒకప్పు డీ సప్తమికిఁ దారతమ్యార్థబోధలో సముచ్చయార్థక శబ్దము సైతము చేర్పఁబడును. ఉదా:—తమిళ—ఇలుమ్ (ఇల్+ఉమ్). తెల్గు—లోను (లో+ను)." (కాల్డు. ౩౦౫ పుట).

విమర్శము:—అమహదేకవచ నాంధ్రసప్తమీ ప్రత్యయమగు 'నన్' అనునది 'ఇ' కారము వెనుక నెన్నఁడునుఁ జేరదు. 'నన్' ప్రత్యయము 'ఉ' కారాంతములమీఁద మాత్రమె నిల్చును. ఉదా:—చిగురునన్-వనమునన్-మొ. దీనికి సరియగు నర్థముగల 'ని' అనునది ప్రాచీనాంధ్రమున లేదనవచ్చును. 'మతిన్-వడిన్' మున్నగు శబ్దములలోని నకారముచోట 'ని' అనురూపము నిల్చుట నన్నయ సమ్మతము కాదు. (చూడు 'వ్యా. సం.' ౮3 I, II, III విష. 'ఛం, పరి.' ౧-౨౫ విష.) తర్వాతి కవుల గ్రంథములందును 'ని' అనునది 'న్'

అనుదాని స్వత్వరూపమే కాని 'న' శబ్దము 'ని' అనునదిగా మాఱుట యెందును లేదు. 'మతిని=మతిన్ = మతిచేత-మతియందు' మున్నగు చోటులందు ద్వితీయా నకారముగాని ద్వితీయా 'ని' ప్రత్యయముగాని యున్నదేకాని 'అ' కార ఘటిత 'న' ప్రత్యయము నిల్వలేదు. 'న=నన్=న్' అనునవి వేఱు. 'ని=నిన్=న్' అనునవి వేఱు. ఉకారాంతములపై మాత్రము 'నన్' ప్రత్యయము నిల్చును. 'అన్-నన్-న్' అనునవి పర్యాయరూపములని గ్రహింపవలయును (చూడు ర-ర IV విష). వీనిలోని 'అన్' అనునది నిల్చుటచేతనే 'ఇంటి-ఇంటన్, చేతి-చేతన్' అనురీతిరూపము లేర్పడునని తలంపవలయును. ఇట్టియెడల 'టి' అనునది 'ట' అనునదిగాను 'తి' అనునది 'త' అనునదిగాను మాఱినవనరాదు. ఉదా:—త్రాడు-త్రాటి-త్రాటన్-త్రాటిచేతన్. త్రాటియందున్. చేయి-చేతి-చేతన్=చేతిచేతన్. చేతియందున్. (చూడు ర-ర IV విష).

తమిళమందలి 'అత్తు' అనునది విభక్తి పూర్వాగమము. ఇది సప్తమీ ప్రత్యయము కాదు. సప్తమీ ప్రత్యయము చేరకుండ దానికి సప్తమ్యర్థము గల్గు ననుట కేవలము పొరపాటు. 'అత్తు' అనునది తుదినిగల వ్యస్త ప్రయోగ ముండనేరదు. 'అత్తు' అనునది విభక్తి పూర్వాగముగఁగాని సమాసాశ్రయ ప్రత్యయముగఁగాని నిల్చును (చూడు ర-౨ VI విష. ర-౭ III విష).

'ఇల్' అను ద్రావిడశబ్దమునకు 'ఇక్కడ' అను నర్థము గలదనుటకుఁ బ్రాచీన ప్రామాణ్యము కానరాదు. తొల్కాప్పియమునను గోశములందును నిట్టి యర్థము లేదు. సప్తమీ ప్రత్యయములలో నియ్యది పేర్కొనఁబడ లేదు. ఇది మలయాళ సప్తమీ ప్రత్యయముగ లీలాతిలకమున సూత్రింపఁబడెను. ఇది యధునాతనమగు తమిళ వాడుకలో నున్నది. కావుననే నన్నూలున నిది సప్తమీ ప్రత్యయముగా సూత్రింపఁబడినది. ఇట్టి యాధునిక తమిళ సప్తమీ ప్రత్యయము ప్రాచీనములగు 'ఇన్' అను తమిళ పంచమికిని, తమిళ విభక్తి పూర్వాగమమునకును బ్రాచీన కన్నడ తృతీయా ప్రత్యయమునకును బ్రాచీనములగు తెల్గు 'ని-న' ప్రత్యయములకును మూలమనుట కేవలము నసంభవము. ఇట్టి 'ఇల్' శబ్దపు సప్తమీ ప్రత్యయత్వము నాధారముగఁ గొని సప్తమినుండి షష్ఠి పుట్టినదనియు సప్తమియే పంచమి యనియు నదియే తృతీయార్థము గలదనియు నిట్లు యథేష్టముగా దొరగారు వ్రాయుట సరికాదు. తమిళ లెక్సికన్‌లో సైత మధునాతనముగా వచ్చిన సప్తమీ పంచమీ విభక్త్యర్థమని వ్రాయఁబడినను 'ఇల్' శబ్దమునకు 'ఇక్కడ' అను నర్థము వ్రాయఁబడ లేదు.

నిర్ధారణములు రెండు విధములు. 'వానికంటె వీఁడధికుఁడు' అనురీతిది తారతమ్య నిర్ధారణము. ఈ యర్థమునఁ దెల్గునందు 'కంటెన్ కన్నన్' అను పంచమీ ప్రత్యయములును 'కున్' అను షష్ఠియు వచ్చును. తమిళమున 'ఇన్' ప్రత్యయము వచ్చును. కర్ణాటమున నీ యర్థమున 'అంతలు' అను శబ్ద ముపయోగింపఁబడును (చూడు ౮౬ I విష). తారతమ్య నిర్ధారణార్థమున సప్తమి వచ్చుట యే భాషయందును లేదు. "జాతి గుణ క్రియా సంజ్ఞలచే సముదాయమునుండి యేకదేశమునకుఁ బృథక్కరణము నిర్ధారణము" అనురీతిది వేఱు. ఇట్టి యర్థమునఁ దెల్గులో షష్ఠియు సప్తమియు వచ్చును. ఉదా:— మనుష్యులలోపల క్షత్రియుఁడు శూరుఁడు. మనుజులందు క్షత్రియుఁడు శూరుడు. (చూడు బాల వ్యా. కార. ౧౬ సూ). ఇట్టి యర్థమునఁ దమిళ భాషలో 'ఇన్' ప్రత్యయమును దెల్గున 'కంటె' వర్ణకమును రానేరవు.

౮౯. I విష:—"సంబోధన విభక్తి=అష్టమీ విభక్తి:—ద్రావిడ భాషలలో సంబోధన విభక్తి యనఁదగు ప్రత్యయ మేదియు లేదు. అవధారణార్థక శబ్దమును ముందుఁగాని వెనుకఁగాని చేర్చుటచేతను, పురుషబోధక సర్వనామ శబ్దమును జేర్చుటచేతను, సంబోధనరూప మేర్పడును.

తమిళ సంబోధన విధులు

I. ఒకప్పుడు నామవాచకమునకు ముందు 'ఏ' అను దానిని జేర్చుట చేత నేర్పడును.

II. ఒకప్పుడు లింగబోధక ప్రత్యయమునకు బదులుగా 'ఆ' అను దానిని జేర్చుటచేత సంబోధన రూపమేర్పడును. ఉదా:—(కర్తన్) సంబో. కర్తా.=(ప్రభువా).

III. ఒకప్పుడు తుది యచ్చును 'ఆయ్' అను దానినిగా మార్చుట చేత నేర్పడును. ఉదా:—'(తఙ్గై)' సంబో. తఙ్గాయ్=(చెల్లెలా).

IV. ఒకప్పుడు బహువచన ప్రత్యయములోని యచ్చును దీర్ఘము చేయుట చేత నేర్పడును. ఉదా:—(పావిగళ్) సంబో. పావిగాళ్=(పాపులారా).

V. గ్రాంథిక భాషలో, 'నీర్' అను దాని సంక్షేప రూపమగు 'ఈర్' అను దానిని జేర్చుటచేత మహదర్థక బహువచన సంబోధన మేర్పడును. ఉదా:—(ఎల్) సంబో. ఎల్లీర్=(మీరందఱు). ('ఇది మధ్యమ పురుష బహువచనము. సంబోధనమున రాదు' శ్రీ రెడ్డిగారు.)

VI. తమిళ మలయాళములలోఁ దుదియచ్చును దీర్ఘముగఁ జేయుట చేత సంబోధన మేర్పడును. ఉదా:—(తోటి). సంబో. తోటీ (టీ)=(చెలియా=సఖి). ఇట్లు దీర్ఘము చేయుట జపాను భాషలోను గలదు" (కాల్డు. ౩౦౫-౩౦౬ పుటలు).

"ఇండో యూరపియను భాషలలోఁ బ్రథమా విభక్తియే సంబోధన మందును వాడఁబడును. తుది యక్షరమును దేల్చివలుకుటచేత సంబోధన మేర్పడును. ద్రావిడ భాషలందును నట్లే ప్రాతిపదికమే ప్రత్యయ రహిత ముగా సంబోధనమున వాడఁబడును" (కాల్డు. ౩౦౬ పుట).

విమర్శనము.—డా. కాల్డువెల్లుగారు సంబోధన విషయమునఁ దమిళ ప్రధాన సంప్రదాయముల నైన వివరింపలేదు. తొల్కాప్పియమున 'విళి మరపు (సంబోధన సంప్రదాయము)' అను భాగము చొల్లధికారము నాల్గవ ప్రకరణముగ ౬౦౨ మొ. ౬౩౭ సూత్రములతో వివరింపఁబడెను. తమిళమున "సమీప సంబోధనము-దూర సంబోధనము" అని సంబోధనము ద్వివిధము. అజంత శబ్దములకు సమీప సంబోధనమున నే మార్పును గల్గకయే ప్రాతిపదికరూప ప్రథమాంతమె నిల్చును. దూర సంబోధనమునందు మాత్రమె యట్టి ప్రథమాంతముల తుదిని గొన్ని జాతుల యాగ మాదేశాదులు గల్గును.

"అణ్మైచ్చొల్లే......" (తొల్కా. ౬౧౧ సూ.)=సమీప సంబోధనమున నామముల తుదినున్న 'ఇ-ఉ-ఐ-ఓ' అనునవి యథాస్థితముగనే నిల్చును. ఉదా:—సంబో. నమ్బి=(నమ్బియను వాఁడా). వేన్దు=(రాజా). ఇట్టి వాని నుద్దే శించియే కావలయును దొరగారు 'ప్రాతిపదికము తుది వర్ణమును దేల్చి పల్కుట చేత మాత్రమె మార్పు లేక సంబోధన రూప మేర్పడునని వ్రాసిరి.

"అవై తామ్......" (తొల్కా. ౬౦౮ సూ.)=తమిళమున మహ ద్వాచకములలో 'ఇ-ఉ-ఐ-ఓ' అను నచ్చులు తుదిని గల ప్రాతిపదిక రూప ప్రథమాంతములకు మాత్రమె సంబోధన విభక్తి గలదు.

"అవట్టుళ్......" (తొల్కా. ౬౦౫ సూ.)=దూర సంబోధనమున మహద్వాచకము తుది నున్న 'ఇ' కారమునకు 'ఈ' కారమగును. 'ఐ' కారము నకు 'ఆయ్' అను నా దేశమగును. ఉదా:—(నమ్బి) సంబో. నమ్బీ=(పురుష శ్రేష్ఠుఁడా). (నఙ్గై) సంబో. నఙ్గాయ్=(స్త్రీ శ్రేష్ఠమా).

"ఓవుమ్......" (తొల్కా. ౬౦౬ సూ.)=ఓకారాంతములకు 'ఉ' కారాంతములకును సంబోధనమున 'ఏ' అనునది తుదిని నిల్చును. ఉదా:— (కో) సంబో. కో+వ్+ఏ=కోవే=(రాజా). (వేన్దు) వేన్దే=(రాజా).

"ముఱైప్పెయర్......" (తొల్కా. ౬౧౦ సూ.)=వావిని దెల్పు 'ఐ' కారాంతములకు సంబోధనమునఁ గొన్ని యెడల 'ఆ' అనునది తుదిని నిల్చును. ఉదా:—(అమ్మై)-అమ్మా=(తల్లీ).

"న ర ల ళ....." (తొల్కా. ఉ౧౨ సూ.) = హలంతములలో 'న ర ల ళ' అను హల్లులు తుదినిగల మహన్నామములకు మాత్రమె సంబోధనము గలదు.

గ్రంథ విస్తరభీతిచే నిటఁ గొన్ని సూత్రముల సంక్షేపార్థము మాత్రమే వివరింపఁ బడుచున్నది.

I. అన్నంత మహత్తుల తుదిని దూర సంబోధనమున 'ఆ' అనునది నిల్చును. (తొల్కా. ఉ౧౪ సూ.) అట్టి దాని తుదిని సమీప సంబోధనమున 'అ' అనునది నిల్చును. (తొల్కా. ఉ౧౫ సూ.) ఉదా:—(చేర్పన్) దూర సంబో. చేర్పా. సమీప సంబో. చేర్ప=(సముద్రతీరవాసీ).

II. కృదంతముల తుదినున్న 'ఆన్' అను దానికిని, (తొల్కా. ఉ౧౭ సూ.) గుణవాచక విశేషణముల తుదినున్న 'ఆన్' అను దానికిని (తొల్కా. ఉ౧౮ సూ.) సంబోధనమున 'ఆయ్' అను నాదేశమగును. ఉదా:—(వన్దాన్) సంబో. వన్దాయ్=(వచ్చినవాఁడా). (కరియన్) సంబో. కరియాయ్=(నల్లని వాఁడా).

III. వావిని దెల్పు శబ్దముల తుది 'న' కారమునకు సంబోధనమున 'ఏ' నిల్చును. ఉదా:—(మగన్) సంబో. మగనే=(పుత్త్రుఁడా).

IV. మహదర్థకముల తుదినున్న 'అర్-అర్' అనువానికి (తొల్కా. ఉ౨౨ సూ.) 'ఈర్' అను నాదేశమగును. ఉదా:—(కూత్తర్). సంబో. కూత్తీర్=(నటులారా) (పార్ప్పార్) సంబో. పార్ప్పీర్=(బ్రాహ్మణులారా).

V. కృదంతములయు గుణనామ వాచకములయుఁ దుదినున్న రేఫము మీఁద 'ఈరే' అనునది నిల్చును. (తొల్కా. ఉ౨౩-ఉ౨౪ సూ.) ఉదా:— (ఉణ్డార్) సంబో. ఉణ్డీరే=(భోక్తలారా). (కరియార్) సంబో. కరియారే (కృష్ణ వర్ణులారా).

VI. 'ళ ళ లు' తుదిని గల నామములకు సంబోధనమున నుపధాస్వర దీర్ఘమగును (తొల్కా. ఉ౨౮) (తుదివర్ణమునకు ముందటి వర్ణ ముపధా సంజ్ఞగలది). ఉదా:—(కురిసిల్) సంబో. కురిసీల్=(రాజా). (మక్కళ్) సంబో. మక్కాళ్= (పుత్త్రులారా-పుత్త్రికలారా).

VII. 'కృదంతములయు, గుణనామ వాచకములయుఁ దుదినున్న 'ఆళ్' అనుదానికి 'ఆయ్' అను నాదేశమగును (తొల్కా. ఉ౩౦ సూ). ఉదా:— (ఉణ్డాళ్) సంబో. ఉణ్డాయ్=(భుజించినదానా). (కరియాళ్) సంబో. కరియాయ్= (నల్లని వనితా).

VIII. వావిని దెల్పు నామముల తుది ళకారము మీఁద 'ఏ' అనునది నిల్చును (తొల్కా-. ౬౩౧ సూ). ఉదా:—(మగళ్) సంబో. మగళే=(కూఁతురా).

IX. "అవన్ (వాఁడు) ఇవన్ (వీఁడు) ఉవన్ (వీఁడు) తాన్ (తాను) యాన్ (నేను) యావన్ (ఎవఁడు)" (తొల్కా-. ౬౨౧ సూ.) అను నాంత శబ్దములకును, 'అవర్=(వారు) ఇవర్-ఉవర్=(వీరు) (౬౨౬ సూ.) నీయిర్ (మీరు) యావర్=(ఎవరు) (౬౨౭ సూ.)' అను రేఫాంతశబ్దములకును, "అవళ్=(ఆమె) ఇవళ్-ఉవళ్-యావళ్-(౬౩౨ సూ.)" అను ళాంతశబ్దములకును, "తమన్=(తమ వాఁడు) తమళ్=(తమ యామె) తమర్=(తమ వారు) నమన్=(మన వాఁడు) నమళ్-నమర్-నుమన్=(మీవాఁడు) నుమళ్-నుమర్-ఎమన్=(మా వాఁడు) ఎమళ్-ఎమర్" (౬౩౮ సూ.) మొదలగు వానికిని సంబోధనము లేదు.

"పుళ్ళియుమ్......" (తొల్కా-. ౬౩౫ సూ.) = అమహత్తులకెల్ల సమీప సంబోధనమునందును దూరసంబోధనమందును హలంతములకును నజంతములకును దుదిని 'ఏ' అనునది నిలుచును. ఉదా:—(మరమ్). సంబో. మరమే=(వృక్షమా). (ఆణిల్). సంబో. ఆణిలే=(ఉడుతా). (పులి) సంబో. పులియే=(వ్యాఘ్రమా).

సంబోధన మభిముఖీ కరణార్థకము. వ్యాపారాంతర లగ్నమనస్కులను దూరస్థులను దనవైపు తిరుగునట్లు చేసికొనుటకు గాఢముగఁ బిలువ వలయును. అట్టి పిలుపులో నామరూప ప్రథమాంతమున దీర్ఘస్వరమును నింకను బ్లుతస్వరమును నింకను బ్లుతమాత్రావృద్ధియు నుపయోగపడుట సహజము. నామము హలంతమగునపుడు దాని యుపధాస్వరము దీర్ఘమగుటయు సహజమె. 'ఐ' అనునది 'అయ్' అనుదానికిఁ దుల్యముగాన నుపధా దీర్ఘముతోఁ గూడిన 'ఆయ్' అనునది 'ఐ' కారమున కాదేశమగుటయు స్వభావ సిద్ధమె యనవగును. సమీప సంబోధనమున దీర్ఘాదికము లేకుండుటయు స్వాభావికమె యనఁదగును. 'ఎ-ఏ' అనునవి సంస్కృత 'హే' = (ఓయీ) శబ్దభవములగుటచేతనో లేక యట్టి ద్రావిడ శబ్దములకుఁ బ్రాచీనకాలమున సంబోధనార్థ ముండుటచేతనో యవి తమిళ మలయాళ కర్ణాటములలో సంబోధన ప్రత్యయములై వెలయుచున్నవని తోఁచెడిని. 'ఐ' కారాంతములకే కాక కొన్ని నాంత ళాంత శబ్దములకును దుదిని సంబోధనమున 'ఆయ్' వచ్చుట నర యగా వాని తుదిని 'హై'=(ఓయీ) అను సంస్కృత సంబోధనార్థక శబ్దభవమగు 'ఐ=అయ్=ఆయ్' అనునది తొలుత నిల్చెనా యని యాలోచింపవలసి యున్నది. అంతియకాని మధ్యమ పురుష ప్రత్యయమగు 'ఆయ్' అనుదానికి సంబోధన విషయమునఁ బ్రసక్తి యున్నట్లు తోఁచదు.

ర్గా. II విష:—“తెల్గునఁ బ్రథమాంతరూపము తుదినున్న యచ్చు దీర్ఘమగుటచేతను, శబ్దము తుదినున్న ‘ఉ’ కారము ‘అ-ఆ’ అని మాఱుట చేతను సంబోధ నైకవచనరూప మేర్పడును. అఱవమందలి ‘నీయిర్=నీర్’ అను దాని సంక్షేపరూపమగు ‘ఈర్’ అనుదానిని సంబంధించు ‘అర-అరా’ అను వానిని జేర్చుటచేతఁ దెల్గుసంబోధనములోని పుం స్త్రీ బహువచనరూపము లేర్ప డును. తెల్గున నామవాచకమునకు ముందుఁ గొన్ని యనావశ్యక సంబోధన ప్రత్యయములును నాశ్చర్యార్థక ప్రత్యయములును జేర్పఁబడును.

కర్ణాటమున ‘ఆ’ అనునది చేర్చుటచేతను, బ్రథమావిభక్తి తుదియచ్చును దీర్ఘముచేయుటచేతను, సంబోధన రూపము లేర్పడును. పుం స్త్రీ బహువచన రూపములు ‘ఎ-ఏ’ అనువానిని జేర్చుటచేతనే కాక ‘ఇర-ఇరా’ అనువానిని జేర్చుటచేత సయిత మేర్పడును. ఇందలి ‘ఇర’ అనునదియుఁ దెల్గులోని ‘అర’ అనునదియుఁ బ్రాచీన ద్రావిడశబ్దమగు ‘నీర్’=‘ఈర్’=(మీరు) అను శబ్దము నుండి నిష్పన్నములైనవె యనఁదగును.” (కాల్డు. ౩౦౬ పుట).

విమర్శము:—సంబోధనమున వాడుకలో నున్న ‘ఓ-ఓయి-ఓరి-ఓసి-రా-రో-కాన-అల’ అను తెల్గుశబ్దములను (‘ఎలె’ అను కన్నడ శబ్దమును) నుద్దేశించి కావలయును దొరగారు తెల్గు సంబోధనములలో ననావశ్యక శబ్ద ములు చేర్పఁబడునని వ్రాసిరి. అవి లోకవ్యవహారమందును మహాకవి ప్రయోగములందును బ్రసిద్ధములయి యుండఁగా ననావశ్యకము లెట్లగును?

తెల్గు సంబోధన విధులు బాల వ్యాకరణ తత్సమ పరిచ్ఛేదమున ౩౨ మొ. ౩౭ సూత్రములలో వివరింపఁబడినవి. తెల్గునందుఁ బ్రథమైకవచన సంబోధనమున ‘డుజ్’ ప్రత్యయము లోపించుట మున్నగు కార్యములగును. ఉదా:—(రాముఁడు) రామ-రామా=(రాముఁడ=రాముఁడా) గురూ-మొ. దొర గారిట్టి విషయములను వివరింపలేదు.

తెల్గు బహువచనమున ‘అర-అరా’ అనునవి చేరుసను దొరగారి వ్రాఁత కేవలము ప్రామాదికము. “ఆమన్త్రణ సు జసోః స్తః క్రమేణ చాదార దాగమౌ వన్తే” (ఆం. చిం.) (చూడు ‘వ్యా. సం.’ ౧౩౯ విష.) అను నన్నయసూత్రము చొప్పున ‘ఆర’ అను నాది దీర్ఘఘటితము తెలుఁగు సంబోధన ప్రత్యయమని గ్రహింపవలయును. కన్నడములోని ‘ఇర’ అను దానితో సమీకరించుటకుఁ గావలయు దొరగారు దీనిని హ్రస్వఘటితమని వ్రాసిరి. తెల్గు-‘ఆర’ ప్రత్యయ మును గన్నడములోని ‘ఇర’ ప్రత్యయమును బుం స్త్రీ వాచక సంబోధనమున మాత్రమె వచ్చునను కాల్డువెల్లుగారి వ్రాఁత కేవలము పొరపాటు. తెల్గున,

'మృగములారా' వృక్షములారా' అనియు వ్యవహారములు సుప్రసిద్ధములు.
సీ. ఓజనస్థాన 'మహీజములారా' యీ। విధ మెఱిఁగింపరే విభునితోడ। ...
(భాస్క. ఆరణ్యకాండ ౧౧౫ ప).

ఇక్లె కన్నడమందును బుం స్త్రీవాచక సంబోధనములందే 'ఇర' అనునది నిల్చునని కాల్డువెల్లుగా రవిమర్శితముగా వ్రాసిరి. 'ఆ' అనునది చేర్చుటచేత సంబోధన మేర్పడుననుటయు నిరర్థకమె. అకారదీర్ఘముచేతనే యది గతార్థమగును. లుప్త ప్రథమా ప్రత్యయ రూపములు సైతము కన్నడమునఁ గొన్ని యెడల సంబోధన రూపము లగునని దొరగారు గ్రహించినట్లగపడదు.

"ఆమన్త్రణే ప్రథమైకవచనస్య లోపః" (కర్ణా. భూష. ౭౦ సూ.)=సంబోధనమునఁ బ్రథమైకవచన మకారము లోపించును. ఉదా:—ఎలెదేవ.=(ఓ దేవా) ఎలెభూప (ఓ భూపా). 'ఎత్వం వా తదన్తస్య' (కర్ణా. భూష. ౭౧ సూ.)=సంబోధనమునఁ బ్రథమైకవచనము వైకల్పికముగ 'ఎ' కారమగును. ఉదా:—ఎలె మందానిలనె=(ఓ మందానిలమా) దీనికి దీర్ఘమును నగును. ఉదా:—ఎలె మందానిలనే. ఇవి రానిపక్షమున 'ఎలె మందానిల'.

"ఇరాశ్లేషో గళ స్సంబోధన విషయే" (కర్ణా. భూష. ౭౨ సూ.)= సంబోధనమున బహుత్వమందలి 'గళ్' ప్రత్యయమునకు 'ఇర' అనునది చేరును. ఉదా:—దేవగళిర=(దేవతలార) మా మరంగళిర=మామిడిచెట్టులార.

"దీర్ఘోక్తి ర్వాయనేనస్య" (కర్ణా. భూష. 23 సూ.) సంబోధనమున నంతటను దీర్ఘము వైకల్పికముగ నగును. ఉదా:—గిళిగళిరా=గిళిగళిర= (చిలుకలారా).

"ఎ చ్చామన్త్రణే" (కర్ణాటశబ్దా. ౨౫౨ సూ.)=సంబోధనమున 'మ్' అను ప్రథమైకవచనమునకు లోపమును 'ఎత్' అను నాదేశమును వైకల్పికముగ నగును. ఎలెవధు - ఎలెవధువె=(ఓ వధువా) గురుగళ్=గురుగళె= (గురువులార).

"వేరోఽనేకత్వేఽవుకళుపః" (కర్ణాటశబ్దా. ౨౫3 సూ.) కర్ణాటమున బహుత్వమందలి ప్రథమావిభక్తి మ ప్రత్యయమునకు 'ఇర' అను నాదేశము వైకల్పికముగ నగును. 'వు-కళు' ప్రత్యయములకుఁ బరముగ రాదు. ఉదా:— బుధర్=బుధరిర=(ఓ బుధులార) లతెగళ్=లతెగళిర=(ఓ లతలార). ఇనియవె- నాఱు-ళై. మొ.

కన్నడమందలి 'ఇర' అనునదియుఁ దెలుఁగులోని 'ఆర' అనునదియు 'నీయిర్=నీర్=(మీరు)' అను ద్రావిడశబ్ద మూలకములనియు, 'ఆయ్-ఈర్' అను మధ్యమ పురుష ప్రత్యయములు సంబోధనమున వచ్చుననియు, 'తమి-

తఙ్గై-తఙ్గాయ్=(చెల్లెలా)' అను రీతిని యుదాహృతులనియు డా. కాల్డువెల్లు గారి యాశయము. కాని మధ్యమ పురుష ప్రత్యయములకును నవధారణార్థక శబ్దములకును సంబోధన విషయమునఁ బ్రసక్తి కానరాదు. 'ఐ=అయ్=ఆయ్' అను పరిణామము వెనుక వ్రాయఁబడెను.

'(కన్న) - ఇర=(తెల్గు) - ఆర' అనునవి ద్రావిడ మహద్బహువచన 'ర' ప్రత్యయమూలకములని తోఁచుచున్నది. ద్రావిడ భాష లన్నిటియందును రేఫము మహత్ప్రథమా బహువచన ప్రత్యయము. అయ్యది-'ర్-అర్-ఆర్-ఇర్-దిర్-విర్' అను రూపములతో ద్రావిడభాషలందు విస్తరించియున్నది. ఆ మంత్రణ దార్ఢ్యమునకై కొన్నియెడల వ్యావర్తకముగాను గొన్నియెడలఁ బున రుక్తముగాను నట్టి బహువచన ప్రత్యయములె నిల్చి 'ఈర్-ఇర-ఆర' అను రూపములతోఁ (తమి-కరి యీరే=(కృష్ణవర్ణులారా) పార్ప్పీర్=(విప్రులారా) కూత్తర్ = కూత్తీర్ = (నటులారా)) దమిల కన్నడాంధ్రములలో వెలసినవని తోఁచుచున్నది. ఈ సందర్భమునుబట్టి యివి మహన్మహతీ బహువచన సంబోధన రూపములె యని చెప్పవలసియున్నను నాంధ్ర కన్నడములలో లోకవ్యవహార మందును మహాకవి ప్రయోగములందును జడవాచక బహువచన సంబోధనము లందును నీ 'ఆర-ఇర' అనునవి విస్తరించియుండుటచేత నవి జడవాచకములపై నిల్వనేరవని చెప్పరాదు. ఇంక నట్టి జడములందు మహత్త్వవివక్షలేనపుడు వానిని సంబోధించుటయె యసంభవమగుననియు నట్టి మహద్వివక్షచేతనే 'ఆర - ఇర' ప్రత్యయములు జడవాచక బహువచనములపై నిల్వఁగుననియు నాంధ్ర కన్నడములవారి (పండితుల) యాశయమును వర్ణింపనగును.

౯౦. I విష:—"విభక్తి సమ్మేళనములు:—హంగేరియన్-సిథియన్-భాషలలో వలెను, గొన్ని తూర్పు ద్వీపముల భాషలలో వలెను ద్రావిడ భాషలలో నయితము గొన్నియెడల నొక విభక్తి మాత్రమె యుండవలసిన చోట రెండు గాని యంతకన్న నెక్కుడుగాని విభక్తులు మేళితములగుటయుఁ గలదు. షష్ఠీ విభక్తి పైని బ్రథమేతర విభక్తులు నిచ్చుచుండు సంప్రదాయము నీ వఱకుఁ జూచియే యున్నాము. (చూడు ౮౭ VI విష. విభక్తి పూర్వాగమాదులను దొరగారు విభక్తులనుగాఁ దలంచుటచే నవియెల్ల నిందుల కుదాహృతులెయని వారి యాశయము). ఇట్లె పెక్కు వ్యావహారికపు వాడుకలు గలవు. ఉదా:—వీట్టుక్+ఉళ్=వీట్టుకుళ్=(ఇంటి లోపల). ఇట 'కు-ఉళ్' అను చతుర్థీ సప్తములు మేళితము లయ్యెను. ఉదా:—మనై+ఇల్+ఇంద=మనైయిల్లింద= (ఇంటియందుండి=ఇంటివలన నుండి=ఇంటినుండి). ఇందు 'ఇల్లి' అను సప్తమియు 'ఇంద' అను తృతీయా పంచమీ ప్రత్యయమును మేళితము లయ్యెను. ఉదా:—

తమి-ఇలుౘ=ఇద(డ) త్తిల్కు. మలయాళ-ఇనిక్కు-ళ్ళ = ఇన్ + ఇ + క్కు + ఉళ్ళ=(నాయొక్క). ఇందుఁ జతుర్థ్యంతమగు నుత్తమ పురుష సర్వనామమునకు 'ఉళ్ళ' (ఉళ్+అ=లోపలిదైన) అనునది చేర్పఁబడెను" (కాల్డు. ౩౦౬, ౩౦౭ పుటలు).

విమర్శము:—విభక్తి పూర్వాగమములను సమాసాశ్రయ ప్రత్యయములను విభక్తి ప్రత్యయములుగా భావించుట సరికాదనియు నచటి యా యాగమములకు విభక్త్యర్థ బోధకతాశక్తి లేదనియు నీ వఱకు షష్ఠీవిభక్తి సందర్భమునందె విమర్శింపఁబడెను. (౮౭ I మొ. VI-వ. విష. ముఖ్యముగా ౮౭ III, ౮౭ VI విష). ఇంక నిచట మఱికొన్ని యధునాతన వ్యావహారికోదాహృతులు మాత్రమె దొరగారిచేఁ జూపఁబడెను. అట్టి యాధునిక విషయములు విమర్శ సహములు కానేరవు.

౯౦. II విష:—"సంబంధార్థక శబ్ద సమ్మేళనము:—టర్కిష్-ఫిన్నిష్-సిథియన్ భాషలలోవలె ద్రావిడ భాషలందు సంబంధార్థమును దెల్పుటకయి నామవాచకములకు వెనుక సర్వనామ ప్రత్యయములను జేర్చెడి సంప్రదాయము లేదు. హంగేరియన్ భాషలో 'ఉర్'=(ఉపాధ్యాయ) అను శబ్దమునకు సర్వనామ ప్రత్యయములు చేర్చుటచేత నీ క్రింది రూపము లేర్పడుచున్నవి.

ఉర్+అమ్=ఉరమ్=నా గురువు...ఉర్+ఐమ్=నా గురువులు.
ఉర్+అద్=నీ గురువు..........ఉర్+ఐద్=నీ గురువులు.
ఉర్+అ=వాని గురువు..........ఉర్+ఐ=వాని గురువులు.
ఉర్+అన్+క్= మా గురువు.....ఉర్+ఐన్+క్=మా గురువులు.
ఉర్+అత్+ఒక్=మీ గురువు....ఉర్+ఐత్+ఒక్=మీ గురువులు.
ఉర్+ఒక్=వారి గురువు.......ఉర్+ఐ+క్=వారి గురువులు.

ప్రాతిపదికముల పైనివలెనె వీనిపైని విభక్తులు చేర్పఁబడును.

ఉర్+అమ్+నక్=ఉరమ్‌నక్=నా గురువునకు.
ఉర్+అన్+క్+నక్=ఉరన్క్‌నక్= మా గురువునకు.
ఉర్+ఐమ్+నక్=ఉరైమ్‌నక్=నా గురువులకు.
ఉర్+ఐన్+క్+నక్=ఉరైన్క్‌నక్= మా గురువులకు." (కాల్డు. ౩౦౭, ౩౦౮ పుటలు).

"ఈ విషయమున ద్రావిడ భాషలకు సిథియను భాషలతో సంబంధము లేకుండుట వింత. రూప నిష్పత్తి విషయక భేద మీయొక్క విషయమున మాత్రమె చూపట్టుచున్నది. ఇండో యూరపియన్ భాషలలోను ద్రావిడ

భాష లన్నిటిలోను సంబంధార్థక సర్వనామములు నామవాచకములకు ముందు నిల్చునే కాని సిథియను భాషలలోవలెఁ దుదను జేర్పఁబడవు. ద్రావిడ భాషలలో నామవాచకములకుఁ దర్వాత సర్వనామ ప్రత్యయములను జేర్చుటవలన నేర్పడు రూపములు కొన్ని గలవు. వానిని సార్వనామికక్రియ లనవచ్చును. ఆ జాతి పదములు పైని వ్రాసిన సిథియన్ భాషలలోని (హంగేరియన్) రూపములను బోలవు. ఈ సార్వనామిక క్రియలు (మనుష్యుడవు-మనుష్యుఁడను) సిథియన్ భాషలలోని సమ్మేళన సిద్ధ క్రియలను బోలుచున్నవి." (కాల్డు. ౩౦౮ పుట).

విమర్శము:—పయి హంగేరియన్ భాషలోని 'ఉర్ =(ఉపాధ్యాయ)' శబ్దమును సంబంధించిన యుదాహృతుల నరయఁగా 'నా పుస్తకము' అను రీతిగల ద్రావిడ ప్రయోగము లేకున్నను 'పుస్తకము నాది' అను రీతిగల ద్రావిడ భాషా ప్రయోగము వానియందు వెలసియున్నది. ఇట్టి విషయమునఁ గొంత భేదమున్నను నట్టి సంబంధార్థక సర్వనామ ఘటిత పద వ్యూహము ప్రాతిపదికమగుచు 'న+క్=నక్' అను రీతిగల విభక్తి పూర్వాగమముతోను 'కు' ప్రత్యయముతోను నడుకుచుండుట యను సంబంధము విలసిల్లుచున్నది. ఇట్లె యీవఱ కుదాహరింపఁబడిన (చూడు ౭౬ IV విష) హంగేరియను భాష లోని ప్రకృతి ప్రత్యయమేళన సంబంధమును రెండు జాతుల భాషలకు వెలయు చున్నది. కాన నిటఁ గేవల వైలక్షణ్యము లేదు.

## విశేషణములు

౯౧. I విష:—"విశేషణములు—విశేషణములుగా వాడఁబడిన నామ వాచకములు:—ఇండో యూరపియను భాషలలోని విశేషణములు విశేష్యముల లింగ విభక్తి వచనముల నందియుండును. సిథియను భాషలందువలె, ద్రావిడ భాషలందును, గుణవాచకములుగాని సంబంధార్థకములుగాని యగు నామ వాచకములె విశేష్య లింగ విభక్తి వచనముల నొందకయె విశేష్యములకు ముందునిల్చుట మాత్రముచేత విశేషణము లనిపించుకొనును. మఱియు సిథియన్ భాషలందువలెనె ద్రావిడభాషలందును గ్రియాజన్య విశేషణములును, గ్రియాజన్య విశేషణములతోఁ గూడిన నామవాచకములును (పెద్దలయినవారు?) విశేషణములుగా నెన్నఁబడును." (కాల్డు. ౩౦౮, ౩౦౯ పుటలు).

"(౧) ద్రావిడ భాషలలోని విశేషణములు విశేష్యమునకు ముందు నిల్చుట యనెడి స్థితి విశేష మహిమచేతనే విశేష్య లింగ విభక్తి వచనాదికములగు మార్పుల నందకయె విశేషణములగును. ఉదా:—తమి—పొన్ అరిదు=(బంగార

మరుదు). పొన్‌ముడి=(బంగారపు కిరీటము). ఇట 'పొన్' శబ్దము మొదటి వాక్యమున విశేష్యము. రెండవ వాక్యమున విశేషణము. ఈ పద్ధతి యింగ్లీషు మున్నగు నిండో యూరపియను భాషలందును గలదు. ఉదా:—Gold watch= (బంగారపు వాచి) Gold is more ductile than silver=బంగారు వెండికన్నఁ బలుచగా సాగును.

గుణవాచక విశేషణము విశేష్యముతో నదుకునపుడు సహజములగు సంధి కార్యములు మాత్రము జరుగును. ఉదా:—పొన్+శి (చి) లై=పొర్చి (ఱ్చి) లై=(బంగారపు ప్రతిమ) (Assimilation). ఇట్లే వాని సంధిలో సరళా దేశమును బరుషాదేశమును విశేష్యము మొదటి వర్ణమునకు ద్విత్వమును విశేషణము తుది స్వరమునకు దీర్ఘమును సంభవించును. ఉదా:—కరు—కార్. ఇట్టివి యుచ్చారణానుకూల్యమునకై వేర్వేఱు భాషలలో వేర్వేఱు విధములుగా సంభవించును.

విశేషణ ప్రత్యయములు వ్యావహారిక భాషల కంటె గ్రాంథిక భాషలోఁ దక్కువగా నుండును. గ్రాంథిక భాషలో గుణవాచకమగు నామవాచకము యొక్క మూలరూప మేవిధమగు మార్పును బొందకయె విశేషణముగా వాడఁబడును. ఉదా:—నల్+అ=నల్ల=(మంచి). పల్+అ=పల=(చాల—పెక్కు)" (కాల్డు. ౩౯౯, ౩౧౦ పుటలు).

విమర్శము:—'పొన్ ముడి' అను చోటియందు సైతము 'పొన్' శబ్దము విశేష్యమె; విశేషణము కాదు. 'పొన్ ముడి' అనునది షష్ఠీ సమాసము. కాన 'పొన్' శబ్దము మీఁదనుండి లోపించిన శేష షష్ఠిదగు సంబంధార్థమున నచట విశేషణత భాసించుచున్నది. "పొన్ ముడి=బంగారము యొక్క= బంగారము సంబంధమైన కిరీటము" అనుచో 'పొన్' శబ్దపు షష్ఠ్యర్థమున విశేషణత్వము వైవక్షిక మగుచున్నది. ఉదా:—'తటాకము నీరు=తటాకపు నీరు' ఈ రెండిటిలో సమాసమున లోపించిన శేష షష్ఠియర్థమున విశేషణత్వము వివక్షించునపుడు విశేషణత్వమున రాఁదగిన 'పు-ంపు'లు వచ్చును. విశేషణత్వ మును వివక్షింపనపుడు 'పు-ంపు' లు రాక 'ము' అనునదె నిల్చును. ఇట్టి ద్వివిధ ప్రయోగములును దెల్గునఁ బ్రసిద్ధములె. విశేషణతా వివక్షయందు—చ. కృప కృతవర్మలన్......కయ్యపు వెరవేపు ... (శల్య. ౧ ఆ. ౨౨౧). విశేషణతను వివక్షింపనపుడు—చ......సూతకృత్యమునకుఁ జొన్ప నేను బ్రమదంబున నప్పటి కియ్యకొంటి లోకము సమరంబు లట్లయని......(విరా, ౫ ఆ. ౩౩౭ ప.) (చూడు 'వ్యా. సం.' ౯౪ I విష).

ఇంగ్లీషునందే యననేల? సంస్కృతమందును నిట్టి వాడుకలు గలవు. ఉదా:—స్వర్ణ కిరీటము, స్వర్ణము లోహములలో నుత్తమము. 'కరు-కార్' అనుచోఁ గల్గిన యుపధా దీర్ఘము సహజ సంధి సంప్రదాయ సిద్ధము కాదు. అది విశేషణతా సంపాదక ప్రత్యయము వంటిదే.

'నల్-పల్' అను ప్రకృతులు నామవాచకములు కావు. అవి సహజముగా విశేషణములు. ఉదా:—నల్+నూల్ = నన్నూల్ = (మంచి గ్రంథము) నల్+అ=నల్ల=(మంచి). ఇందలి 'అ' ప్రత్యయము స్వార్థికము. పల్+అ=పల = (పెక్కు). అమహత్ ప్రథమా బహువచనార్థకమగు 'అ' ప్రత్యయము బహుత్వవాచి 'పల్' శబ్దముపై సహజముగ నిల్చెను. (చూడు ౭౯ I విమ).

౯౧. II విమ:—"(౨) గుణవాచకములు సమాహారద్వాచకములు నగు సంస్కృత భవములు తమిళమున 'అ' మంతములును దెల్గున 'అ' మ్వంతములును నగుచు నామవాచకములకు ముందునిల్చి తుది 'మ' కారము పోఁగా విశేషణము లగును. ఉదా:—తమి. సుబమ్+దినమ్=సుబదినమ్. ఇది సంస్కృత పద్ధతినే పోలియున్నది. సంస్కృతమందును సమాస విభక్తి లోపము ప్రసిద్ధమె. అచ్చ ద్రావిడ శబ్దములు 'అ' మంతములుగాని 'అ' మ్వంతములుగాని పయిరీతిని విశేషణత్వము నందవు. తెల్గునఁ బదాంతమందలి 'అము' అను దానిచో 'అంపు' అని నిల్చును. ఉదా:—అందము-అందపు-అందంపు.

అఱవమునఁ బైరీతిగల స్థలములందు 'అమ్' అనునది పోయి 'అత్తు' అను నొపవిభక్తికము నిల్చును. ఉదా:—పుఱమ్=(బాహ్యము)—పుఱత్తు. అఱవమున నొకానొకప్పుడు సంస్కృత భవములు సయితము 'అత్తు' అను దానితోఁ గూడి విశేషణము లగును.

కాని 'అ' మంతములును, 'అమ్వం' తములును నగు నామవాచకములు సామాన్యముగా 'అగు' ధాతుజన్య విశేషణములగు—"(తమి) అన-(తెల్గు) అయిన-(కన్న) ఆద"-అను వానితోఁ గూడియే విశేషణము లగుచుండును. ఇట్టి నామములలో స్వర సంధికార్యము లేవియు జరుగనేరవు" (కాల్డు. ౩౧౦ పుట).

విమర్శము:—తెలుఁగునందలి "అందము, చందము, వనము, ధనము" మున్నగు శబ్దముల తుదినుండు 'ము' అనునది ప్రకృత్యవయవము కాదనియు నయ్యది ప్రథమైకవచన ప్రత్యయమె యనఁదగుననియు దానిని 'అ' మ్వంత మనక 'ము' వర్ణ కాంతమనుట యుక్తమనియు నిట్లె తమిళమందలి 'మరమ్-కుళమ్' మున్నగు వాని తుది మకారమును భావింపవలయుననియు నీ పఱకు వివరింపఁబడెను. (చూడు ౮౧ II విమ.) తెల్గున సమాసమున విభక్త్యాది లోపమును విశే

షణ సమాసమున విశేషణము తుదినున్న 'ము' అనుదానికి 'పు-ంపు' లాదేశము లగుటయును బ్రసిద్ధములె. ఉదా:—అందము+అయిన+మోము=అందపు మోము-అందంపు మోము. ఇట్టియెడలఁ దమిళమున 'అత్తు' అనునది నిల్చు నని దొరగారు వ్రాసిరేకాని విశేషణ సమాసమున నట్టి సామాసికాగమము వచ్చుట తొల్కాప్పియ సమ్మతము కాదు. విభక్తి పరకత్వమందు మాత్రమె మకారాంతముల మకారముచోట 'అత్తు' అనునది నిల్చును. ఉదా:—మరమ్+ఐ=మరత్తై=(చెట్టును). సమాసమున—మరమ్+కోడు=మరక్కోడు=(చెట్టు కొమ్మ).

మఱియు ద్రావిడభాషలందు విశేష్య లింగ విభక్తి వచనములు విశేషణ ములకుఁ గల్గుట లేకపోలేదు. ఉదా:—అన్నింటికి గుఱ్ఱములకు. చక్కనివారికి మగలకు. బల్లిదులకుఁ బురుషులకు మొ.

'అయిన' మున్నగువానియోగమున విశేషణత్వము గల్గుననుటయు సరికాదు. 'బెట్టిదంపు పనులకు' మున్నగుచోటులందు 'బెట్టిదము' మున్నగు నవి స్వతస్సిద్ధముగనె విశేషణములు. 'అందమైన మోము' అనునపుడును 'అయిన' అనుదానియోగముచే విశేషణత్వము కల్గలేదు. అట్లైనచో 'అందంపు మోము' మున్నగు చోటులందు 'పు-ంపు' లు రాకపోవలసి వచ్చును. 'అందమయిన మోమునకు' మున్నగుచోట్ల 'అయిన' అనుదాని యోగమున 'అందము' శబ్దమునకు విశేషణత్వము గల్గలేదు. 'అందము' అను నది విశేష్యమె యైనను విశేషణత్వ వివక్ష చేయఁబడెనని యెఱుంగనగును. (చూడు ప్రౌఢ. శబ్ద ౯ మొ. ౧౨ వ. సూ). 'అయిన' మున్నగునవి విశేష్య విశేషణముల సామానాధికరణ్యమును బోధించును. 'అయిన' మున్నగువాని యోగము లేకున్నను విశేష్యము విశేషణముగా వివక్షింపఁబడవచ్చును. ఉదా:— తల్లి ద్రౌపదితోడన్-(జైమి-౧ ఆ. ప్రౌఢ. కారక-౨౨ సూ.) క. ఆచార్యుఁడు ద్రోణునకున్..........(ఆది. ౫ ఆ ౨౩౭). 'అయిన' మున్నగువానితోడి యోగము 'ము' వర్ణకాంతములకె యననేల? విశేషణములకెల్లఁ గల్గవచ్చును. ఉదా:—సీ. గుణవంతులగుచున్న కొడుకులుగలవాఁడు (ఆది. ౯ ఆ. ౨౫ ప). 'అయిన' మున్నగువానితోడి యన్వయముచేత విశేష్య విభక్తి విశేషణమునకుఁ గల్గదు. "భావ్యర్థవ్యవధానేతు। భేద్యస్య నిఖిలం భవేత్" (వికృ. 'వ్యా. సం.' ౨౬౩ విష) "భవత్యర్థ వ్యవహితంబులగు విశేషణంబులకుం బ్రథమయగు- (బాల. కార. ౨౯ సూ). విశేషణముల తుదినున్న 'ము' అను.దానికి 'పు-ంపు' లు వచ్చునపుడును విశేష్య విభక్తి వచనములు విశేషణములకుఁ గల్గనేరవు. ఉదా:— అందంపు మోములకు. శోకార్తపుటాడఁగులతో (స్త్రీ. ౨ ఆ. ౧౨౪ ప).

౯౧. III విష:—(3) విమర్శము:—అర్వాచీన తమిళ వ్యవహారమున వచ్చిన సరళములె ప్రకృతి సిద్ధములను నిశ్చయముతోఁ గాల్డువెల్లుగారు 'అకర్మక' ధాతువుల తుదినున్న సరళములు వాని సకర్మకత్వమునఁ బరుషములగుచు ద్విరుక్తి నందునని (చూడు ౨౮ III విష. ౬౦ I మొ. ౬౦ XIV వ. విష.) వివరించిరి. అట్టి మార్పులె విశేష్యము విశేషణ మగునపుడును జరుగునని యీ సందర్భ మునను వివరించిరి. ప్రకృతమునఁ దమిళమున గుణవాచక విశేషణములకును సంబంధార్థక విశేషణములకును బయిరీతినె తుదినున్న పరుషములు సరళములు కాఁగా ద్విరుక్తి గలుగు ననియుఁ దెల్గున విశేషణముల తుదిని 'టి' అనునదియుఁ గొన్ని యెడల 'ప' అనునదియు నిల్చుననియు విస్తరించి వ్రాసి యీ క్రిందిరీతి నుదాహరించిరి. గ్రంథ విస్తరభీతిచే నట్టి వివరణమును బునరుక్తము చేయక యచటి యుదాహృతులను మాత్ర మిటఁ జూపుచున్నాను.

"ఉదా:—(తమి)—నాడు=(దేశము)—నాట్టు వటక్కమ్=(దేశాచారము). నాట్టిల్=(దేశమందు). (తెల్గు)-నాటి=(దేశమందు). (తమి)-ఇరుమ్బు+కోల్= ఇరుప్పుకోల్ = (ఇనుపకోల). తెల్గున-ఇనుపపెట్టె. (ఇనుము + పెట్టె). (తమి)-మరున్దు+పెయ్=మరుత్తుప్పెయ్=(మందు సంచి). ఎరుదు+పాది= ఎరుత్తుప్పాది=(ఎద్దుపై వేసెడి గోనెల జంట) కురఙ్గు+పడై=కురక్కుప్పడై= (క్రోతి సేన)." (కాల్డు. 3౧౦ పుట).

విమర్శము:—పయి యుదాహృతులలో రెండు విధములగు ద్విత్వములు చూపట్టుచున్నవి. I-విశేష్యము తుదినున్న యనునాసిక పరుష సంయోగము దాని విశేషణత్వమున ద్విరుక్తపరుష మగుట. ఉదా:—కురఙ్కు + పడై = కురక్కుప్పడై. మరున్తు+పెయ్=మరుత్తుప్పెయ్ (ప్పై). ఇరుమ్పు+కోల్=ఇరుప్పు కోల్. ఈ యుదాహృతులలోని యనునాసిక పరుష సంయోగరూపమును బరుష ద్విత్వరూపమును బర్యాయములె యని డా. కాల్డువెల్లుగారే స్థలాంతర మున నంగీకరించి యున్నారు (చూడు ౬౦ IV విష). ఇట్టి వీని పర్యాయత్వము పెక్కుస్థలములం దీ వటికు సవిమర్శముగ నిశ్చయింపఁబడెను. (చూడు ౨౫ I, VII ౬౦ III, XI. విష). ఇట్టి పర్యాయరూపములలో నొకటి విశేషణ తాఘటకమగు ననుట సరియా? ఈ పర్యాయరూపములలో ననునాసిక పరుష సంయోగరూపము విశేష్యముగాను ద్విరుక్త పరుషరూపము విశేషణముగను వ్యావర్తకముగ వ్యవహారమున కెక్కెను. (చూడు ౬౦ III విష).

II-విశేష్యము తుదినున్న పరుష మాత్రము విశేషణత్వమున ద్విరుక్త మగుట. ఉదా:—ఎరుదు. (ఎద్దు). ఎరుత్తుప్పాది=(ఎద్దుపైవేయు గోనెల జంట). నాడు=(దేశము)-నాట్టు వటక్కమ్=(దేశాచారము), ఇట్లూరకయె విశేషణ

తాఘటకముగా నంత్య పరుషద్విత్వము గల్గుననుట సరికాదనియు నిట్టి ద్విత్వము సమూలకమై యుండవలెననియు నకారణమున నిట్టియెడల విశేష్యరూపము తుదిని 'అదు' శబ్ద సంబంధియైన 'తు' అనునాగమము నిల్చుటచేత వాని సంధి వశమున నచట ద్విత్వరూప మేర్పడెననియు గ్రహించుట యుక్తము. (చూడు ౬౦ III ౬౧. ౮౨ VII విష). ఈ 'తు' వర్ణకమును దక్కిన విభక్తి పూర్వాగమములవంటిదె యనియు వానివలెనె యిదియు 'అదు' శబ్ద సంబంధియే యనియు (చూడు ౮౨ విష. ౮౨ V విష) 'నాడు+అదు+వటక్కు్=నాట్టువటక్కు్' మున్నగు చోటులందలి షష్ఠీసమాసములోని షష్ఠితోపాటుగ నీ 'తు' అను విభక్తి పూర్వాగమమును దక్కిన విభక్తి పూర్వాగమములవలెనె లోపింపఁగాఁ (చూడు ౮౭ III విష) దక్కిన స్థలములందువలెనె యిచటను 'తు' అను సమాసాశ్రయ ప్రత్యయము వచ్చెననియు నట్లు లోపించిన శేష షష్ఠియె 'నాడు' మున్నగు వానికి విశేషణతను ఘటించుననియు గ్రహింపవలెను. తొలాక్పి యరు ద్విత్వమాత్రము నచ్చెనని శబ్దశాస్త్ర పద్ధతిని బ్రక్రియా సౌలభ్యాపేక్షచే సూత్రించినను శబ్ద తత్వశాస్త్ర పద్ధతి కనుకూలముగఁ బయిరీతిని ద్విత్వమునకు సమూలకత్వము ఘటిల్లునట్లు నిరూపించుట విరుద్ధము కాదు. తెల్గులోని 'టి' మున్నగు నాపవిభక్తికముల విషయమున నీవఱకు విపులముగా వ్రాయఁబడెను. (చూడు ౮౨ I విష).

౯౧. IV విష:—"(౮) శబ్దముల తుదిని విశేషణీకరణమునఁ గొన్ని విభక్తి పూర్వాగమములు నిల్చును. అట్టివమందలి 'ఇన్' అనునదియుఁ దెల్గులోని 'ని' అనునదియు నిట్లు పాక్షికముగా నిల్చును. ఉదా:—(తెల్గున)—తెల్ల-తెల్లని. (తమిళమున) - నిఱల్ =(నీడ) - నిఱలిన్ =(నీడతోనున్న) మరక్కొప్పు=మరత్తు క్కొప్పు=(మరమ్ + అత్తు + కొప్పు)=(చెట్టుకొమ్మ). పనన్దోప్పు=(పనై + అమ్+తోప్పు)=(తాటితోట). మలయాళము-మలమ్పామ్బు=(మల+అమ్+ పామ్బు=(కొండపాము). అవ్యయములకును నిట్లె చేర్పఁబడును. ఉదా:— తెలుఁగున-మొన్నటి తీర్పు=(మొన్న+టి+తీర్పు)=(మొన్న జరిగిన తీర్మానము). (తమిళమున)—వడక్కత్తియాన్ = (వడక్కు+అత్తు+ఇ+ఆన్) = (ఉత్తరదేశముననున్నవాఁడు). పై యవ్యయములు క్రియాజన్యవిశేషణములుగా వాడఁబడిన నామవాచకములె యనుట స్పష్టము." (కాల్డు. ౩౧౧ పుట).

విమర్శము:—"మరత్తుక్కొప్పు-పనన్దోప్పు" మున్నగువానిలోని 'అత్తు-అమ్' మున్నగునవి, 'మరమ్-పనై' మున్నగువానికి విశేషణతను ఘటింపఁజాలవు. 'మరమ్-పనై' మున్నగువానిమీఁదనుండి సమాసమున లోపించిన శేషషష్ఠి వానికి వైవక్షికమగు విశేషణత్వమును ఘటించుచున్నది. అత్తు మున్నగునవె

విశేషణతా ఘటకములయినచో నవి లేనిపక్షమందలి 'మరకొంప్పు' మున్నగు చోటులందట్టి విశేషణత లేకపోవలసియుండును. 'మరత్తుకొంప్పు=మరకొంప్పు' అను రెండు పక్షముల రూపములందును 'మరమ్' శబ్దమొక్క విధమగు నవస్థ లోనే యున్నది. 'ఇన్' అత్తు-అమ్ అనునవే కాక యనేక విధములగు నాగమాదులు సామాసికము లగుచుఁ దమిళమునఁ బ్రసిద్ధములై యున్నవి. (చూడు ౮౭ VI విమ). ఇవేవియు విశేషణీకరణ దక్షములుకావు. దొరగారు వాడుక చూపిరని పయిరీతిని విమర్శించితినిగాని 'మరత్తుకొంప్పు' అను రీతిని సమాసమున మకారాంతములకు 'అత్తు' నిల్చుట తొల్కాప్పియ సమ్మతముకాదు. 'నిఴల్=(నీడ)' శబ్దమునకు సమాసమున 'ఇన్' అను నాగమము వచ్చుటయు 'వడక్కు' (ఉత్తరము) శబ్దముమీఁద సమాసమున 'అత్తు' నిల్చుటయు దొరగారుదాహరించిన రీతిని వాని వ్యస్తప్రయోగమును దొల్కాప్పియ సిద్ధములుకావు.

తెల్గునందలి తెల్లశబ్దము స్వతస్సిద్ధముగనె విశేషణమైయున్నది. దానికి విశేషణీకరణ మేమి? కొన్ని కారణములచే నాంధ్ర వైయాకరణులు తెల్లాది శబ్దములకు స్వార్థమునఁ బాక్షిక 'ని' గాగమును సమాసమున విధించినను శబ్దరత్నాకరాదుల యాశయము (చూడు 'అలకన' శబ్దము, 'శ-ర') చొప్పున 'తెల్లన' మున్నగు విశేష్యములమీఁద నస్త్యర్థకమగు 'ఇ' ప్రత్యయము నిల్చుటచే 'తెల్లని' మున్నగునవి యేర్పడెనని వ్యుత్పత్తి చెప్పుట శబ్దతత్వశాస్త్ర పద్ధతికి సరియై యుండును. 'తెల్ల' (విశేషణము) తెల్లన (విశేష్యము. 'తెలుపు'-'తెల్లఁదనము' మున్నగువానివంటి తద్ధితాంతరూపము). 'తెల్లని' (విశేషణము. ఇప్రత్యయాంత తద్ధితరూపము).

౯౧. V విమ:—"(౫)-ఉత్తరపు ఏషియాలోని జపాను మున్నగు భాషలలోఁ గ్రియాజన్యరూపములను విశేషణములుగా వాడుకొనుట ప్రచురమైయున్నది. వానిలో సామాన్యముగా ధాతువే నామవాచకముగను క్రియావాచకముగను వాడుకొనఁబడును. ఇట్లె ద్రావిడభాషలలో విశేషణములను రెండు విధములుగా సాధింపవచ్చును. I. విశేష్యమునకుఁ బూర్వమున ధాతురూపమగు విశేషణమును నిల్పుట. II. క్రియాజన్య విశేషణములను జేర్చుట. తమిళ వ్యావహారికభాషలో నీ రెండవపద్ధతి ప్రచురమై యున్నది. ఉదా:—I. తమి-ఉయర్=(ఎత్తు-విశేష్యము). ఉయర్=(ఎత్తైన-విశేషణము) ఉయర్ మలై=(ఉన్నత పర్వతము). II. ఉయర్=(ఎత్తగు) (ధాతువు). ఉయర్న్ద మలై=(ఎత్తయిన కొండ)." (కాల్డు. ౩౧-౨ పుట).

విమర్శము:—౫౬ విషయమునఁ గొన్ని ధాతువులు నామవాచకములుగను వ్యాపారార్థకక్రియలుగను ద్రావిడ భాషలలోఁ గలవని చెప్పఁబడియున్నది.

అట్టి యర్థద్వయమునందును నామవాచకార్థముగల దానిని విశేషణముగా వివక్షించి ప్రయోగించినచో నది మొదటిదాని కుదాహృతి కాఁగలదు. వ్యాపారార్థకరూపమునకు ధాతుజ విశేషణ ప్రత్యయయోగము గల్గినచో నది రెండవ విధమున కుదాహృతి కాఁగలదు. ౯ం II విషయమున 'అగు' ధాతుజ విశేషణములగు-"(తమి) ఆన, (తెల్గు) అయిన, (కన్న) ఆద" అను వానిని నామవాచకమునకుఁ జేర్చుటచే విశేషణరూప మేర్పడునని చెప్పఁబడెను గానఁ బ్రకృత విషయము దానికన్న భిన్నమని గ్రహింపవలెను. ఇట్టి వాడుకను దెల్గునందును జూపవచ్చును. ఉదా:—తెల్గు:-I. పండు=పక్వమయినఫలము. (విశేష్యము). పండు కాయ (విశేషణము.) II. పండిన కాయ. పండెడుకాయ-పండు (నట్టి) కాయ. (ఇట్టివి ధాతుజ విశేషణములు).

౯ం. VI విష:—"(ఞ)-సంస్కృత నపుంసకలింగములగు 'అ' మంతరూపములు విశేషణములుగా వాడఁబడునపుడు భూతార్థకమగు 'అయిన' అను విశేషణము తెల్గునఁ జేర్పఁబడును. అద్దాని-చోట 'అయి' అనునదియు వాడఁబడును. కావున విశేషణముల తుదిని నిల్చు 'ఇ' కారమును భూతార్థకమగు 'ఇ' కారమును నభిన్నములెయని యూహింపవచ్చును. ఉదా:—కింద-కింది. నామవాచకములను విశేషణములుగా మార్చునపు డీ 'ఇ' కారమె చేరుచున్నదని తోఁచుచున్నది. ఉదా:—గూను - గూని. (చూడు - ఔపవిభక్తిక 7 i. క్రియలు విధేయ విశేషణ నామవాచకములు)" (కాల్డు. ౩౧౨ పుట).

విమర్శము:—క్లిష్టమగు స్థలములం దుదాహృతుల నియ్యకుండ దాఁటి పోవుచుండుట దొరగారికిఁ గ్రొత్తకాదు. తెల్గున 'అయిన' అను భూతార్థక విశేషణమునకు బదులుగా 'అయి' అను క్త్వార్థమును వాడుట యభూతచరము, నసంభవమును. 'సుందరమయిన మోము' అనుదానికి మాఱుగా 'సుందరమయి మోము' అని వాడవచ్చుననుట కేవలము పొరపాటు. 'సుందరమై యెసంగు మోము' అని వాడిన వాడవచ్చును. అట్టి వాడుక 'అయిన=అయి' అనునవి పర్యాయములని తెల్పఁజాలదు. 'అయిన' అనుదానికి 'అయి' అనునది పర్యాయము గావున 'క్రింది' అను చోటి 'ఇ' కారము దీని కభిన్నమనుట కేవలము నసంగతము. డా. కాల్డువెల్లుగారు వ్యావహారికపదములనే యుదాహరించుచుండుట యలవాటు. కావుననె 'క్రింది' అను ప్రాచీనరూపమున్నను దానిని విడిచి 'కింద-కింది' అను వాడుక రూపముల నుదాహరించిరి. 'క్రిందిచోటు' అను రీతిగల స్థలములయందలి 'ఇ' అనునదియు 'క్త్వార్థక' మగు 'ఇ' ప్రత్యయమును నభిన్నములనుట యింకను నసంగతము. 'క్రిందిచోటు' మున్నగు స్థలములందలి 'ఇ' అనునది యౌపవిభక్తికవర్ణము. దీని ప్రాతిపదికము 'క్రింద'

కాదు-'క్రిందు' అనునది. 'క్రింది వస్తువు' మున్నగు స్థలములందు "క్రింది యొక్క+వస్తువు=(క్రింది ప్రదేశ సంబంధి వస్తువు)" అను రీతిని 'ఇ' అనునది 'యొక్క' విభక్తికిఁ బూర్వాగమము. 'అగు+ఇ=అయి' అను రీతిగల క్త్వార్థక మగు 'ఇ' ప్రత్యయము వేఱొక క్రియతో నన్వయించును. ఇట్లీ రెండును బరస్పర విజాతీయములగు భాషాభాగములు. (చూడు ఔపవిభక్తికములు. ౮౭ I విమ). 'గూను' శబ్ద మౌపవిభక్తికము. నామవాచకమును విశేషణ ముగా నీ 'ఇ' ప్రత్యయము మార్చుచున్నదనుచు 'గూను-గూని' అని యుదా హరించుటను జూడఁగా దొరగారు 'గూని' అనునది యొక ప్రత్యేక విశేషణ రూపమని తలంచినట్లు తోఁచుచున్నది-'గూని యొక్క+వాఁడు=గూనివాఁడు' అను రీతి నచటి 'ఇ' ప్రత్యయ మౌపవిభక్తికమాత్రమెకాని యది ప్రత్యేక విశేషణతాద్యోతక ప్రత్యయముకాదు. విభక్తి పూర్వాగమముమాత్రమె. "గూను-వి-ఔప. (కన్న-తుళు-గూను. తమి-మల-కూన్) వీఁపుమీఁద వంపుగా నున్న భాగము'......" (సూ-రా-ని). 'గూని' అను ప్రత్యేక విశేషణ శబ్ద మెందును లేదు.

౯౦. VII విమ:—"విశేషణ ప్రత్యయములు:—(౭-I) కొన్ని ధాతువు లకు 'ఇయ' అను ప్రత్యయమును జేర్చుటచేత విశేషణ రూపము లేర్పడును. ఇందు 'ఇ' అనునది భూతార్థకము. 'అ' అనునది సంబంధార్థ కాసమాపక క్రియాజన్య విశేషణ నిష్పాదక ప్రత్యయము. యకారము సంహితా వ్యవ ధాయక వర్ణము. తెల్గున 'అ' ప్రత్యయముతోఁ గూడకయే 'ఇ' ప్రత్యయ మాత్రమె విశేషణతాద్యోతక మగుచున్నది. (కింద-కింది మొ). కాన నట్టి తెల్గుక్త్వా ప్రత్యయ లక్షణము దీనియందుఁ గలదనవచ్చును. ప్రాచీన తమిళ వాఙ్మయమున 'ఇన' అను దానికి బదులుగా 'ఇయ' అను రూపము వాడఁబడు చున్నది. ఉదా:—పణ్ణియ=(పన్నిన=చేసిన). ఇది 'పణ్ణిన' అను దానికిఁ బర్యాయము. అయినను దమిళ వ్యవహారమున 'ఇయ' ప్రత్యయమునకు భూతార్థక విశేషణత్వ ప్రసిద్ధి యంతరించినది. ఇపుడు భూతార్థక విశేషణ ప్రత్యయములు 'ఇద-ఇన' అనునవి మాత్రమె. ఉదా:—పెరుత్త=(పెరిగిన). శి (చి) ఱుత్త=(తఱిఁగిన=తగ్గిన) పెరియ-శి (చి) ఱియ మున్నగు 'ఇయ' ప్రత్య యాంతములందలి భూతార్థము మఱుఁగుపడినది. కాన నది గుణవాచక విశేషణమె యగుచున్నది. ఇట్టి వానిని సంబంధార్థక విశేషణము లనఁదగును. ఉదా:—పెరియ=(పెద్ద) కొడియ=(చెడ్డ) మొ. వీనిపైని లింగబోధక ప్రత్యయ ములను నిల్పినపు డవి విధేయ విశేషణము లనిపించుకొనును. ఉదా:—పెరియ వన్=పెరియన్=(పెద్దవాఁడు). కొడియన్=(క్రూరుఁడు). కోల్‌భాషలో

సైతము 'అ-ఇయ' అనునవి విశేషణముల తుదిని జేర్పఁబడుట గలదు. మఱియు సంబంధార్థమున నయితము 'అ' ప్రత్యయమె వాడఁబడును" (కాల్డు. ౩౧౩, ౩౧౪ పుటలు).

విమర్శము:—'అ' ప్రత్యయముతోఁ గూడకయె 'ఇ' ప్రత్యయ మాత్రమె (కింద-కింది) తెల్గున విశేషణతాద్యోతక మగుననుటలోని యసంగతి యీవఱకు ౯౧ VI విషయమున విమర్శితమయ్యెను. క్త్వార్థక 'ఇ' ప్రత్యయము క్రియాన్వయి; క్రియాంతర సమాన కర్తృకము. దానిపైని విశేషణతా ద్యోతకమగు 'అ' ప్రత్యయము నిల్చుటయె యసంభవము. ధాతుజ విశేషణతా ద్యోతక మగు 'అ' ప్రత్యయము వ్యాపారబోధక ధాతువు పైని మాత్రమె నిల్చుట సంప్రదాయముగాని వ్యాపారార్థకములు కానట్టి 'పెరు' మున్నగు నామ రూప ధాతువులపై నిల్చుట ద్రావిడ భాషా సంప్రదాయము కాదు. కాఁబట్టి "పెరు+పెర్+ఇయ=పెరియ=(పెద్ద), చిఱు+ఇయ=చిఱియ=(చిన్న), కొడు+ఇయ=కొడియ=(చెడ్డ)" మున్నగు చోటులందలి 'ఇయ' అనునది వేఱు విధమగు తద్ధిత ప్రత్యయ మననగును. లేదా యందలి 'ఇ' అస్త్యర్థకము. 'అ' విశేషణతా నిష్పాదక ప్రత్యయము. అంతే కాని భూతార్థ కాసమాపక క్రియాజన్య విశేషణము కానేరదు. దానియం దుండఁదగని భూతార్థ మున్న దననేల? అది మఱుఁగుపడె నననేల? 'పెరియవన్-పెరియన్' అనునవి విధేయ విశేషణములనుట యుక్తమె. 'ఇ-అ' అనునవి రెండును నస్త్యర్థకము లగుచు విశేషణతా నిష్పాదక ప్రత్యయములు కావచ్చును. 'ఇ' నిల్చిన పైని జరిత్ర విస్మృతిచే 'అ' చేరియుండ వచ్చును. పెర్+ఇ+అ=పెరియ=పెద్ద తనముగల.

౯౧. VIII విష:—"(౭-II) కొన్ని యెడల భూతార్థకమగు 'ఇ' ప్రత్యయమును జేర్పకుండఁగనే సంబంధార్థకమగు 'అ' ప్రత్యయమును జేర్చుటచేతనే విశేషణ రూపమేర్పడును. ఉదా:—"(తమి)నల్ల=(మంచి), (కన్న-దొడ్డ)=(తెల్గు) పెద్ద" అను రీతిగల రూపములు నిజముగా భూతార్థక క్రియాజన్య విశేషణములనుండి యేర్పడినవె. నల్లియ (ప్రాచీన తమిళము)=నల్ల. దొడ్డిద (ప్రాచీన కన్నడము)=దొడ్డ. అయినను మఱికొన్ని యుదాహరణములలోఁ బ్రాతిపదికములకే సంబంధార్థకమగు 'అ' ప్రత్యయము చేర్పఁబడుట ప్రయోగ దృష్టమగుచున్నది. ఉదా:—ఉడైయ=(సంబంధించిన). ఇది షష్ఠీ విభక్తి ప్రత్యయము. (ఉడై+అ=ఉడైయ) (ఉడై=సొత్తు). ఇట్టి 'అ' ప్రత్యయము ప్రాచీన తమిళ మలయాళము లందత్యధికముగాఁ గన్పట్టుచున్నది. ముఖ్యముగ 'ఐ-ఇ' అను నచ్చులు తుదిని గల ప్రాతిపదికముల మీఁద నివి చేరుచుండును. ఉదా:—మలైయ=(కొండ సంబంధమైన) శు (చు) నైయ=(ఊట

సంబంధమైన) తీయ=(చెడ్డదైన). వీనినిబట్టి సంబంధార్థమునకును. శేషషష్ఠ్యర్థక) విశేషణమునకును జాలసాన్నిధ్యము గలదని నిశ్చితమగు చున్నది. కాన గుణ వాచక విశేషణములు విధేయవిశేషణ రూపక్రియలయొక్క సంబంధార్థక విశేషణ రూపములనియె నామతము (చూడు క్రియలు - ౧౨౭ విష. చూడు).

పలవిన్పాల్=(అమహద్బహు వచనము) అను సంజ్ఞనుబట్టి 'పల' అను నది యమహద్బహువచనమె యనఁదగియున్నను 'పల అరసర్=(పలుగురు రాజులు) మున్నగు పదములలోని 'పల' శబ్దము తుదినున్న 'అ' కార మమహ ద్బహువచన ప్రత్యయ మనరాదనియు సంబంధార్థకమగు 'అ' అను విశేషణ తా ద్యోతక ప్రత్యయ విశేషమె యనియుఁ దలంపనగును". కాల్డు. ౩౧౪ పుట).

విమర్శము:—'నల్+అ' అనునది విశేషణ మనుటలో బాధయేమియుఁ జూపట్టదు. 'నల్గియ=ఇచ్చిన' అనునది నల్లశబ్ద పర్యాయము కాదు. తమి-'నల్ల'. కన్న-'దొడ్డ'. తెల్గు-'పెద్ద'. అను వానిలో భూతార్థద్యోతక చిహ్నలేశ మేనియు లేకయే యవి భూతార్థక క్రియాజన్య విశేషణములని యేల చెప్ప వలెనో? తెలియకున్నది. 'పల=(పెక్క), శి (చి) ల=(కొన్ని)' అను శబ్ద ములు విశేషణతా ద్యోతకమగు 'అ' ప్రత్యయముతోఁ గూడిన వనుట సరికాదు. డా. కాల్డువెల్లుగారు 'పలవిన్పాల్=(అమహద్బహు వచనము)' అను సంజ్ఞావిధానముచేత నట్టివి యమహద్బహు వచనమనుట కంగీకరించియు 'పల అరసర్=(పలుగురు రాజులు)' మున్నగు చోటులందలి 'పల' శబ్దమునకు నమహత్త్వము కుదురుపడమింజేసి యట్టి యెడల విశేషణతా ద్యోతకమగు 'అ' ప్రత్యయముతోఁ గూడినదే యచటి 'పల' శబ్దమనక తీరదని (దొరగారు) తలంచుచున్నారు. కాని తమిళమున "మూవేన్దర్=(మూఁడు=ముగ్గురు రాజులు)=మూవర్ వేన్దర్=(ముగ్గురాజులు) (చూడు తొల్కా. ౬౫౨ సూ. వివృతి)" మున్నగు ప్రయోగములు ప్రసిద్ధములై యుండుటచేత నట్టి యెడల నున్న నమహత్త్వము శంకాస్పదము కాదు. తొల్కాప్పియమున 'పల-చిల' శబ్దము లమహద్బహువచనాంత రూపములె యని స్పష్టముగాఁ జెప్పఁబడి యున్నది.

"పల్ల......" (తొల్కా. ౫౧౬ సూ.)=పల్ల=(పెక్కు), పల= (పెక్క) చిల=(కొన్ని) ఉళ్ళ=(ఉన్నవి) ఇల్ల=(లేనివి)" అను శబ్దములును... ...అమహన్నామములె. 'పల్+అ=పల్ల=పల' అనుచోటి 'అ' అనునది యమహద్బహు వచన ప్రత్యయ మాత్రమె. 'పలవిన్పాల్=(అమహద్బహు వచనము)' అను సంజ్ఞావిధానమె 'పల' శబ్ద మమహద్బహు వచన మనుటకుఁ బ్రమాణమని కాల్డువెల్లుగారును వ్రాసియున్నారు.

౯౧. IX విష:—"(—౭. III):—కొన్ని గుణవాచక ప్రాతిపదికములకు 'ఉమ్' అను భవిష్యదర్థక క్రియాజన్య విశేషణమును జేర్చుటవలన విశేషణ రూపము లేర్పడును. ఉదా:—అఱ:—పెరుమ్=(పెద్ద). కొంద ఱఱవ వైయాకరణులు గుణవాచకమగు 'పెరుమై=(పేర్మి=పెద్దతనము)' అనుదానిలోని తుదినున్న 'ఐ' అనునది లోపింపఁగా మిగిలిన రూపమె పై విశేషణ రూపమని తలంచిరి. గుణనామ వాచక ప్రత్యయము 'మై' అనునదే కాని 'ఐ' అనునది కామింజేసి యీ పద్ధతి సరికాదు. (చూడు ౬౬ II విష). 'ఉమ్' అనునది తద్ధర్మార్థక మనియు నది కాలవాచకము కాదనియు ముందు క్రియా పరిచ్ఛేదమునఁ జెప్పఁబడును. ఉదా:—(తమి)—విణ్ణిల్ మినజ్ఞుమ్ శు(చు)డర్=(నక్షత్రము లాకాశమునఁ బ్రకాశించును). ('జ్యోతిస్సు ఆకాశమునఁ బ్రకాశించును' శ్రీ రెడ్డిగారు) ఇందు సాతత్య (సదా ప్రకాశించునుగాన) మాత్రమే భాసించును గాన నిది భవిష్యదర్థకము కాదు. 'ఉమ్' అనునది కాలవాచకము కామింజేసి భూతార్థకమగు 'ఇయ' అనుదానికన్న నిదియే విశేషణత్వ విషయమున నుచితమై యున్నది. 'పశు(చు)మ్=పయుమ్=పైమ్' (పచ్చనయిన) అనురీతి నేర్పడిన 'పైమ్' అనునది స్వతంత్ర విశేషణము కాదని యీ వఱకె చెప్పఁబడెను. ఇదియు 'ఉమ్' ప్రత్యయాంతమెయని గ్రహింపవలెను." కాల్డు. ౩౧౫, ౩౧౬ పుటలు).

విమర్శము:—'పెరియ' మున్నగు చోటులందుఁ గ్రియావాచకములు కానట్టి 'పెర్' మున్నగువానిపైని భూతార్థకమగు 'ఇ' (క్త్వా) ప్రత్యయము నిల్చుననుట యెట్లసంభవమో? యట్లె క్రియావాచకముల పైని మాత్రమె నిల్చునట్టి తద్ధర్మార్థకమగు 'ఉమ్' ప్రత్యయము 'పశు(చు)మ్' (పచ్చని) అను దానిపయిని నిల్చుననుటయుఁ గేవలము నసంభవము. 'పశు(చు)మ్' అనునదియు నట్టిదేకాన నిందలిదియుఁ దద్ధర్మ విశేషణతా ద్యోతకమగు 'ఉమ్' ప్రత్యయము కానేరదని యెఱుంగనగును. ఈ విషయ మీ వఱకె విమర్శితమయ్యెను. (చూడు ౬౬ II విష). తెల్గున 'కమ్మందేనె-తళుకుంజెకుకులు' మున్నగు చోటులందువలెనె 'పశు(చు)మ్పూ'='(పచ్చని = వాడనిపూవు)' మున్నగు తమిఱ శబ్దములందును ననునాసికాగమము నిల్చెనని యెఱుంగనగును. (చూడు ౬౬ II విష).

౯౧. X విష:—"(ఠ) (తమిఱ)-ఆన-ఆగుమ్-ఉళ్ళ, (తెల్గు) అగు-అయిన, (కన్న) ఆద" అనువానిని నామవాచకములపైని నిల్పుటవలన ద్రావిడ భాషలలో విశేషణము లేర్పడును. ఉదా:—(తమి)—ఉయర్+వ్+ఆన=ఉయర్వాన=(ఎత్తైన). ఇట్టిరీతి సంస్కృత పదముల విషయముననె యధికమైయున్నది.

(తెల్లు)-'తెల్లనగు' మున్నగు నిట్టి విశేషణములు సమానపదములని తలంచు కొందఱు దొరల యభిప్రాయములు ప్రామాదికములు.

'నల్లవన్-నల్లవళ్ - నల్లదు' అనురీతి గల విశేషణములు విధేయ విశేషణ ములు. ఇవి విశేషణములకు లింగబోధక ప్రత్యయాంత తచ్ఛబ్ద మేళమున నేర్పడును. వీనిపైని-(తమి)-ఆన, (తెల్గు) అయిన, మున్నగువానిని జేర్చినను నర్థభేద మేమియు నుండదు. (తెల్గు—తెల్లదైన-తెల్లవాఁడైన-మొ॥)" కాల్డు. ౩౧౬ పుట).

విమర్శము:—౯౧. II విషయమున '(తమి)-ఆన' మున్నగువాని యోగ మున నామవాచకము విశేషణమగు ననెడి యీ విషయమును దొరగారు వ్రాసియున్నారు. అయ్యది విపులముగా విమర్శితమును నయ్యెను. కాన విస్తరభీతి నిటఁ బునరుక్తము చేయలేదు.

ద్రావిడ విశేషణములకు వ్యస్త ప్రయోగము లేదు. అవి విశేష్య పూర్వ వృత్తులయియే యుండును. వానికి వ్యస్తప్రయోగము వలసినపు డవి తచ్ఛబ్ద రూపములతో సమసించునని తెల్గునఁ జెప్పఁబడెను—అట్టియెడలఁ దచ్ఛబ్దా కారము లోపించుననియు సూత్రింపఁబడెను. అట్టియెడల విశేషణ విశేష్యభావ మాభాసరూపమనియుఁ జెప్పఁబడెను. ఉ:—చిన్నవాఁడు-చిన్నది-మొ. 'శబ్దాత్తచ్ఛబ్దాతః' (ఆం. చిం. 'వ్యా. సం.' ౨౭౧ విష. చూడు)-"స్యాత్క-ర్మ ధారయాభాసః।......" (వికృ. 'వ్యా. సం.' ౨౭౭ విష). "ధాతుజ విశేష ణంబులకు విభక్తి వివక్షించునపుడు తచ్ఛబ్దంబను ప్రయుక్తం బగు" వచ్చినవాఁడు-వచ్చినది..........(బాల. సమా. ౯ సూ.) (చూడు. 'వ్యా. సం.' ౨౭౧ I విష).

తమిళ కన్నడములందు విధేయతా వివక్షతోఁ బ్రసక్తి లేకయే విశే షణము లమహత్తచ్ఛబ్దాంత రూపములతోనె వెలయుచుండును. బహువచన రూప సాధనములందును సమాసములందును నట్టి 'అదు' శబ్దము లోపించునని ప్రత్యేకముగాఁ గర్ణాట వ్యాకర్తలు సూత్రించుకొనిరి.

"గుణోక్తే రవావు రుపాన్త్యావధేః" (కర్ణా. భూ. ౪౭ సూ.)=గుణవాచక విశేషణములకు బహువచనమగు 'అవు' పరమగుచుండఁగా నుపాంత్యవర్ణము మొదలొకొన్న యవయవము లోపించును. ఉదా:—కిఱిదు=(చిన్నది)+అవు=కిఱియవు=(చిన్నవి). పిరిదు-(పెద్దది)+అవు=పిరియవు=(పెద్దవి).

"విశేష్యోత్తరపద పూర్వపద స్యోపాన్త్యస్వరాదే ర్లోపః" (కర్ణా. భూ. ౧౩౫ సూ.)=విశేష్య ముత్తరపదముగాఁగల విశేషణముయొక్క యుపధా

స్వరాదియగు నవయవము లోపించును. ఉదా:—కరిదు + మకు = కర్మదు = (నల్లని మడుగు).

తమిళమందును విశేషణములు తచ్ఛబ్దాంతములుగనే వాడఁబడును:—

I. "పల్ల........" (తొల్కా. ౬౫౨ సూ.) = "I:—పల్ల = పల = (పెక్కు) చిల = (కొన్ని) ఉళ్ళ = (ఉన్నవి) ఇల్ల = (లేనివి)" అను శబ్దములును. II:—విన్ఐప్పెయర్ = క్రియలనుండి వచ్చు శబ్దములును. ఉదా:—వరువదు = (వచ్చునది).

II. పణ్బుకొళ్ పెయర్ = గుణమునుబట్టి వచ్చు నామములును. ఉదా:—కరియదు = (నల్లనిది).

III. ఎణ్ణుప్పెయర్ = (ఎన్నునట్టి) సంఖ్యావాచకములును. ఉదా:—ఒన్ఱు-ఇరణ్డు మొ. (ఇట్టి వాని తుదివర్ణము 'అదు' శబ్దాంతిమ 'తు' వర్ణమె-సంధి వశమున 'ఱు-డు' మున్నగు రూపముల నందె నని యెఱుంగునది.

IV. ఒప్పిన్ ఆగియ పెయర్ = సామ్యమును బట్టి వచ్చు నామములును. (ఒప్పు = సామ్యము) ఉదా:—పొన్నన్నదు = బంగారము వంటిది (పొన్ + అన్నదు)

ఈ తొమ్మిదియును నమహన్నామములె.

"ఒన్ఱఱికిళవి......" (తొల్కా. ౨౯౧ సూ.) = అమహదేకవచనాంత శబ్దములు 'తు-ఱు-టు' అనునవి తుదిని గల్గియుండును. ఉదా:—అతు = అదు = (అది) ఒన్ఱు = (ఒకటి) (ఎట్టు = ఎనిమిది) మొ.

"ఉయిరుమ్ పుళ్ళియుమ్......" (తొల్కా. ౪౮౩ సూ.) = అజంత ములుగాను హలంతములుగాను నుండెడి వర్ణలోపము నందిన ధ్వన్యనుకరణ శబ్దములును, గుణవాచకములును నగు శబ్దములకును గర్మధారయ సమాస శబ్దములకును దద్ధర్మార్థక విశేషణ పూర్వపద సమాస శబ్దములకును నామ్రేడిత సంఖ్యావాచకములు మున్నగువానికిని సంధి కార్య ప్రక్రియను జూపుట సుకరము కాదు. యథార్థమ్ముగాఁ గల్పించు కొనవలసినదె. ఉదా:—...... "కరుమ్ పార్ప్పాన్ = (నల్లని బ్రాహ్మణుఁడు)-కరుమ్‌పార్పని = (నల్లనిపాఱుతి)-కరుమ్ పార్ప్పార్ = (నల్లని విప్రులు) - కరు ఙ్కుదిరై = కరుఙ్కుదిరైకళ్ = (నల్లని గుఱ్ఱ ములు)" అను నిట్టి కర్మధారయములలో "కరియన్-కరియళ్-కరియర్-కరియదు-కరియవై (లేదా కరియన)" అని వరుసగాఁ బూర్వపదములను నిల్పి సమాస ప్రక్రియను జూపవలయును. ఇట్లొక్కొక్క శబ్దమున కొక్కొక్క విధమునఁ జెప్పుచుండుట సుకరము కాదని భావము.......

౯—౨. I విష:—"విశేషణముల తర-తమ భావము:—ఇండోయూరపియను భాషలలో వలె ద్రావిడ భాషలందు 'తర-తమ' మొదలగువాని వంటి ప్రత్యయములు లేవు. సెమెటికు భాషలలో వలెనె సిథియను భాషలందును ద్రావిడ భాషలందును నిట్టి ప్రత్యయముల వంటివి లేవు. కాని యంతకన్న సులభ మార్గమున వీనియందుఁ దారతమ్యము బోధింపఁబడు చున్నది.

(౧) ద్రావిడ భాషలలోఁ దారతమ్యబోధమునకై విశేషణము ప్రథమలోను విశేష్యము సప్తమిలోను నిల్పఁబడుచుండును. అందు విశేష్యము పూర్వస్థితి నందుచున్నది. అరవ వైయాకరణు లిట్టి చోట్ల నుపయోగించు 'ఇన్' అనునది పంచమీ ప్రత్యయమందురు. అట్టి 'ఇన్' ప్రత్యయము సప్తమియే కాక పంచమియు నయియున్నను నది 'ఉండి' అను పంచమ్యర్థము నీయక సప్తమ్యర్థమునే యిచ్చుచున్నదని నాయభిప్రాయము. ఉదా:—అవట్ట్రి (ట్రి)ల్ ('అవట్ఱుళ్' అనవలెను.) ఇదు నల్లదు=(వానిలో నిది మంచిది).

సముచ్చయార్థకమగు 'ఉమ్' అనునది యీ విషయమున వ్యావహారిక భాషలోఁ దఱచుగా వాడఁబడుచున్నది. ఉదా:—అవట్ట్రి (ట్రి) లుమ్ ఇదు నల్లదు=(వానిలో నయిత మిది మంచిది).

(౨) వేనితోఁ దారతమ్యము చెప్పవలయునో వానిని దెల్పుపదము సప్తమికన్నఁ దఱచుగాఁ జతుర్థిలో (౮౫ II విష.) నిల్పఁబడును. (దాని కిది మేలు ?).

(3) దేనితోఁ దారతమ్యము చెప్పనగునో దానిని ద్వితీయలో నిల్పి దాని వెనుకఁ బరిశీలనాద్యర్థక క్రియల భావ లక్షణార్థక క్రియలను బ్రయోగించుచుఁ దుదిని విశేషణ విశేష్యములను నిల్పుటయుఁ గలదు. ఉదా:—అదై ప్పారిౘ్ఱలమ్ (అదై ప్పారిౘ్ఱలు?) ఇదు నల్లదు=(దానిని జూడఁగా=పరిశీలింపఁగా నిది మంచిది). అదై విడ ఇదు నల్లదు=(దానిని విడఁజేయునంతగా నిది మంచిది). ఇట్టి వాడుకలు సుబోధములు కావు. యూరపియను లిట్టి వానిని వాడుదురు.

(౪) విశేషణములకు భృశాద్యర్థక శబ్దమేళనమున ద్రావిడ భాషలలోఁ దారతమ్య బోధము కల్గును. ఉదా:—(తమి) ఇదుతాన్ నల్లదు=ఇదే నల్లదు=(ఇది మాత్రమే మంచిది).

కన్నడమున, 'అంత-ఇంత-అంతలు-ఇంతలు' అనునవి తారతమ్య బోధకములుగా వాడఁబడును. 'అన్-ఇన్' అను సప్తమీ ప్రత్యయముల పైని నిర్దేశార్థక సర్వనామ రూపములు (అదు-ఇదు) నిల్చుటచేత నీ 'అంతలు' మున్నగునవి యేర్పడి యుండును.

(౫) విశేషణముల పునరుక్తిచేత సైతము ద్రావిడ భాషలలోఁ దార తమ్యార్థ బోధము గల్గును. ఉదా:—(తమి) - పెరియపెరియ = (మిక్కిలి పెద్దది). (తెల్గు-మొట్టమొదట. మొ).

ముఖ్యముగా నీ విషయమున—వేనితోఁ దారతమ్యము వివక్షింపఁ బడునో తద్వాచకము సప్తమీ బహువచనములో నిల్పఁబడును (ఇది ౧ విషయమె). ఉదా:—(తమి)-విలఙ్గుగళిల్ (ళు ళ్?) వేఙ్గై (ఙ్గై?) కొడిదు=(జంతువు లలోఁ బులి క్రూరమైనది).

ఇంకను దమ ప్రత్యయార్థాతిశయము వాచ్యమగు నపుడట్టి సప్తమీ బహువచనాంతమునకు ముందు 'ఎల్లా' శబ్దమును జేర్పనగును. ఉదా:—(తెల్గు)- ఎల్లమృగములందును బులి క్రూరమైనది." (కాల్డు. ౩౧౬, ౩౧౭, ౩౧౮ పుటలు).

విమర్శము:—ఇండో యూరపియను భాషలలోని దగు సంస్కృతమునఁ దర తమ ప్రత్యయాదులచేత నీ క్రింది రీతి నుత్కర్షాతిశయము బోధ్యమగు చుండును.

"తరతమౌ ద్వి బహూనా మేకోత్కర్షే"-(వృత్తి) "ద్వయో రేక స్యాతిశయే తరో బహూనాం తమః, స్యాత్-అయ మనయో రతిశయేన విద్వాన్ విద్వత్తరః = (వీరిద్దఱలో నితఁ డెక్కుడు విద్వాంసుఁడు). అయ మేషా మతిశయేన విద్వాన్ విద్వత్తమః=(ఇతఁడు వీరందఱిలో నధిక విద్వాంసుఁడు)." (ముగ్ధ. ౪౬౨ సూ).

"కాకాత్ కోకిలః కృష్ణః-" (కాకికంటెఁ గోయిల నల్లనిది). "ఛాత్రాణాం మైత్రః పటుః=(శిష్యులలో మైత్రుఁడు సమర్థుఁడు)" ఇత్యాది సంస్కృత ప్రామాణిక వైయాకరణోదాహృతులలో 'తర-తమ' ప్రత్యయప్రయోగము లేకుండుట నరయఁగా సంస్కృతమందును, గొన్నియెడల 'తర-తమ' ప్రత్యయ ప్రయోగము లేకుండుటయుఁ గలదనియు నట్టియెడల నాయావాక్యముల సందర్భమె యచటి యుత్కర్షాతిశయమును బోధించుననియు విశదమగుచున్నది. అట్టి పద్ధతియే ద్రావిడభాషలందుఁ గల్గుటను విస్తరించి దొరగారు వివరించిరి.

తారతమ్య నిర్ధారణము ద్వివిధము. (౧) భిన్న భిన్న వస్తువులలో నొక దాని మేలిమిని నిర్ధారణము చేయుట. ఉదా:—కాకికన్నఁ గోయిల నల్లనిది. కాకుల కన్నఁ గోయిలలు నల్లనివి.

(౨) ఒక్క ధర్మమే కల వస్తు సముదాయములో నొకదానిని బృథక్కరించి ధర్మాంతర పురస్కారమున దాని మేలిమిని నిర్ధారణము చేయుట. ఉదా:— మనుష్యులలో క్షత్రియుఁడు శూరుఁడు. ఈ రెండవ విధముగల నిర్ధారణమునఁ దారతమ్య వివక్షయే లేదు. క్షత్రియేతరులు శూరులు కారనియు సందర్భము తోఁచును. అంతియ కాని "ఎవ్వారి శౌర్య మెక్కువ యుత్కృష్టము" అను వివక్షయే యందు లేదు.

(౧) "పఞ్చమీ విభక్తే. (౨-౩-౪౨)=విభాగో విభక్తమ్. నిర్ధార్యమాణస్య యత్ర భేద ఏవ తత్ర పఞ్చమీ స్యాత్-మాథురాః పాటలీ పుత్రేభ్య ఆఢ్యతరాః" (సి. కౌ. ౬౩౯ సూ).

"కంటె వర్ణకంబు నిర్ధారణ పంచమి కగు. ౧౩. ఎచ్చట నిర్ధార్యమాణంబు జాత్యాదులచే భేదమే కలిగియుండు నచటం బంచమి యగు. ఆ పంచమికిం గంటె వర్ణకం బగునని యర్థము. జానపదులకంటె నాగరులు వివేకులు. మానహానికంటె మరణము మేలు" (బాల. కార. ౧౩ సూ).

(౨) "యతశ్చ నిర్ధారణమ్. (౨-౩-౪౧)=జాతి గుణ క్రియా సంజ్ఞాభిః సముదాయా దేకదేశస్య పృథక్కరణం నిర్ధారణం యత స్తతః షష్ఠీ సప్తమ్యౌ స్తః. నృణాం నృషు వా ద్విజః శ్రేష్ఠః......" (సి. కౌ. ౬౩౭ సూ.)

"నిర్ధారణ షష్ఠికి లోపల వర్ణకంబగు. ౧౬. జాతి గుణ క్రియా సంజ్ఞలచేత సముదాయమునుండి యేకదేశమునకుం బృథకరణంబు నిర్ధారణం బనంబడు. ఎద్దానివలన నిర్ధారణంబగు నచ్చటి షష్ఠకి 'లోపల' వర్ణకం బగునని యర్థము. మనుష్యులలోపల క్షత్రియుండు శూరుండు......ఇట సప్తమియుం గలదు. మనుష్యులయందు క్షత్రియుండు శూరుండు....." (బాల. కార. ౧౬ సూ).

డా. కాల్డువెల్లుగా రిట్టి నిర్ధారణములను గలగాయపులగము చేసి కలుషితముగా వివరించిరి. తమిటమందలి 'ఇన్' ప్రత్యయము వచ్చు నిర్ధారణము మొదటి భిన్న వస్తు నిర్ధారణ విషయకమగుటచేఁ బంచమియె యందు వచ్చును.

"ఏన్నాకువదె......" (తొల్కా. ౫౬౧ సూ.)—'ఇన్' అనునది పంచమీ విభక్తి, 'దీనికంటె నిది యిట్టిది' అని దీని యర్థము.

"వణ్ణమ్......"=(తొల్కా. ౫౬౨ సూ.)=వర్ణము=వన్నె. ఉదా:— కాక్కెయి ఱిరిదు కళమ్ పఴమ్=(కాకికన్నఁ గళమ్మను పండు నల్లనిది......" చూడు ౮౬ I విష).

ఇట్టి స్థితిలో దొరగారు తడఁబాటుతో 'ఇన్' ప్రత్యయము తమిళమున సప్తమియే కాక పంచమియున్నై యున్నను నది పంచమియొక్క యపాదానార్థమీయక సప్త మ్యర్థమునె యిచ్చుచున్నదని వ్రాసి యఱవ వైయాకరణులు పంచమి యనుచున్న 'ఇన్' ప్రత్యయమునకు "అవట్రి(ట్టి)ల్ ఇదు నల్లదు= (వానిలో నిది నల్లనిది)" అను సజాతీయ సముదాయైకదేశ పృథక్కరణ నిర్ధారణోదాహరణము నొసంగుట కేవలము పొరపాటు.

౯౨. II విష:—కాల్డు:—"ద్రావిడ విభక్తి ప్రత్యయములెల్ల బ్రత్యేక ప్రాతిపదికములె యని యీ వఱకుఁ జెప్పఁబడెను. వీనిని బ్రాతిపదికములపై నిల్పునపు డవి సప్తమ్యంతములని తలంపఁబడును. ప్రాతిపదికములకును బ్రత్యయ రూప శబ్దములకును నడుమ నుండఁదగు సప్తమ్యర్థక శబ్దము సామాన్యముగా లోపించుచునే యుండును. ఒకప్పుడు లోపింపక నిల్చినను నిల్వవచ్చును. అట్టివాని వివరణము నిచటఁ జేయుట యనావశ్యకము. పెక్కురు వైయాకరణులు వానిని జెప్పియుండుటచేతను నవి సంబంధ విశేషార్థక మాత్రములె యగుటచేతను వాని నిచట వివరించుట యనావశ్యకము" (కాల్డు. ౩౧౮ పుట).

విమర్శము:—దొరగా రుదాహరణ శూన్యముగనే యేమేమో వ్రాయుచుండుట యలవాటు. ఇచట వేనిని వివరించుట యనావశ్యక మనుచు వివరింపలేదో? తెలియకున్నది. విభక్తి ప్రత్యయములకును బ్రాతిపదికములకును నడుమ నిల్చునవి విభక్తి పూర్వాగమములు. వాని నీ వఱకు విపులముగా దొరగారును వివరించియే యున్నారు. (చూడు ౮౨ I మొ. ౮౨ X-వ. విష).

ప్రాతిపదికముల పయిని విభక్తి ప్రత్యయములు నిల్చిన పిదప వానిని సప్తమ్యంతములుగాఁ దలంపవలె ననుటచేతఁ బ్రథమేతర విభక్తులెల్ల దొరగారి మతమున సప్తమీ విభక్త్యంతర్భూతములేనా యని యాలోచింపవలసియున్నది. ఆలోచింప నేల? పంచమీ విభక్తి లేనేలేదనియు నది సప్తమీ రూపమే యనియు (చూడు ౮౬ I విష) సప్తమియె షష్ఠి యయ్యెననియుఁ (చూడు ౮౭ III విష). తృతీయా సప్తము లభిన్నములనియు (చూడు ౮౮ III విష) నీ వఱ కచ్చటచ్చట దొరగారు వచించుచు వచ్చిరి. ద్వితీయా చతుర్థులను సైతమిపుడందుఁ జేర్చిరి కాఁబోలును! ఇట్టి యసంభవాభిప్రాయములనెల్ల నాయా సందర్భములలో నిరసించి విమర్శించియే యుండుటచే నిటఁ బునరుక్తము చేయలేదు.

" ౯—౧. II విమ. కాల్డు:—మరమ్ శబ్ద సుబంత రూపోదాహరణము. ద్రావిడ శబ్ద మవ్యాంతము కామింజేసి తెల్గున సమ్వాంత గుఱ్ఱముశబ్ద ముదాహరింపబడెను.

**ఏకవచన రూపములు**

| ఆంధ్రేతర శబ్దమున కర్థములు | తమిళము | మలయాళ | తెలుఁగు | ప్రాచీన కర్ణాట | తుళు | కూర్గు |
|---|---|---|---|---|---|---|
| ప్రథమ. చెట్టు | మరమ్ | మరమ్ | గుర్రము, గుర్రమ్ | మరమ్ | మర | మర |
| ద్వితీ-చెట్టున్ | మరత్తై-మరత్తినై | మరత్తై, మరత్తినె | గుర్రమును, గుర్రాన్ని-, గుర్రమ్ | మరమమ్, మరవమ్, మరనమ్ | మరొను | మరత్‌న |
| తృతీ. చెట్టుచేతన్ | మరత్తాల్-మరత్తినాల్-మరత్తినాన్ | మరత్తాల్ | గుర్రమున, గుర్రాన | మరదిమ్, మరదిన్‌దమ్ | మరొడ్‌దు | మరత్తిఞ్జి (లేదు) |
| సహార్థక తృతీ } చెట్టుతోడన్ | మరమొడు-మరత్తొడు, మరత్తినొడు | మరత్తోడు | గుర్రముతోడన్ | లేదు | ,, | |
| చతు. చెట్టునకున్ | మరత్తిఱ్కు | మరత్తిన్ను | గుర్రమునకున్, గుర్రానకున్ | మరకె, మరక్కె | మరొకు | మరక్కు |
| మిశ్ర. (తో - కు) కమ్యూనికెటివ్ విభక్తి | లేదు | లేదు | లేదు | లేదు | మరట | లేదు |
| పంచ. చెట్టునుండి | మరత్తిన్ | మరత్తిల్నిన్ను | గుర్రమునుండి | మరదత్తణిమ్ | మరొడ్‌దు | లేదు |
| షష్ఠీ. చెట్టుయొక్క | మరత్తినదు-మరత్తినా(?) దు-(ఏకత్వాన్వయమున). మరత్తిన (బహుత్వాన్వయి) | మరత్తిన్రె, మరత్తినుడె | గుర్రముయొక్క, గుర్రము | మరద, మరదా | మరత | మరత్‌'ర |
| సప్త. చెట్టునందు | మరత్తిన్‌కణ్-మరత్తిల్. మరత్తినిల్ | మరత్తిల్ | గుర్రమన్దు, గుర్రమునన్దు | మరదొళ్, మరదోళ్ | మరొటు | మరల్‌'ల్ |
| సంబో } ఓ చెట్టా | మరమే | మరమే | గుర్రమా | మర-మరా-మరమె | మరా | లేదు |

౯_౨. II పట:—కాల్డు:—"తెల్లు-గుఱ్ఱము, తక్కిన ద్రావిడ-మరము" ఈ శబ్దముల సుబంత రూపావళులు.

బహువచన రూపములు

| ఆంధ్రేతర ద్రావిడ శబ్దార్థములు | తమిళ | మలయా | తెలుగు | ప్రాచీన కర్ణాట | తుళు | కూర్గు |
|---|---|---|---|---|---|---|
| ప్ర. చెట్టులు | మరజ్గళ్ | మరజ్జళ్ | గుర్రములు-గుర్రాలు | మరగళ్ - మరజ్గళ్ | మరొకుళు | ఈ భాషలో నమహత్తులకు బహువచనము లేదు |
| ద్వి. చెట్టులన్ | మరజ్గళై-మరజ్గళినై | మరజ్జళై | గుర్రములన్ / గుర్రాలన్ | మరగళమ్ | మరొకుళెన్ | |
| తృ. చెట్లచేతన్ | మరజ్గళాల్-మరజ్గళినాల్ (ఆన్) | మరజ్జళాల్ | గుర్రములన్దు | మరగళిమ్ | మరొకుళె ద్దాద్ | — |
| తృ. సహార్థ — చెట్లతోడన్ | మరజ్గళోడు / మరజ్గళినొడు | మరజ్జళోడు | గుర్రములతో / గుర్రాలతో | లేదు | ,, | — |
| చ. చెట్లకున్ | మరజ్గళిఱ్కు | మరజ్జళ్ క్కు | గుర్రములకున్ / గుర్రాలకున్ | మరగళ్ గె | మరొకుళెగ్ | — |
| మిశ్ర-(తో-కు) కమ్యూనికెటివ్ విభక్తి | లేదు | లేదు | లేదు | లేదు | మరొకుళెడ | |
| పం. చెట్టులనుండి | మరజ్గళిన్ | మరజ్జళిల్ నిన్ను | గుర్రములనుణ్డి | మరగళత్తణిమ్ | మరొకుళెడ్డే | — |
| ష. చెట్టుల యొక్క | మరజ్గళినదు (ఏకవచనాన్వయి) మరజ్గళిన (బహువచనాన్వయి) | మరజ్జళుడె | లేదు | మరగళ | మరొకుళె | — |
| స. చెట్టులందు | మరజ్గళిన్ కణ్ | మరజ్జళిల్ | గుర్రములన్దు | మరగళోళ్ / మరగళోళ్ | మరొకుళెడ్ | — |
| సంబో. ఓ చెట్టులారా | మరజ్గళే | మరజ్జళే | గుర్రములారా | మరగళిర్ / మరగళిరా | మరొకుళే | — ,, |

(కాల్డు. ౩౯౯, ౩౨౦ పుటలు).

